# నాట్యవేదము

ఆంధ్రప్రదేశ ప్రభుత్వ
సంగీతనాటక అకాదమి సంభావితము

## పూ శర్త్రి. రచనలు

- నవ రసగంగాధరము
- ఆంధ్రప్రతాపరుద్రీయము
- ధ్వనిసారము
- కావ్యప్రకాశము
- రసగంగాధరమణి
- అలంకారసూత్రము
- నాట్యవేదము ౧ భా
- రసభారతి – నాటకమీమాంస
- ఔచిత్యవిచారచర్చ
- లక్షణాలంకారము
- నాట్యవేదము ౨ భా
  - భావప్రకాశనము
  - వక్రోక్తిజీవితము
  - భామహాలంకారము
  - రుద్రటాలంకారము
  - వామనాలంకారము
  - మాధవాలంకారము

? ? ?

శ్రీ భరతముని నాట్యశాస్త్రము

# నాట్యవేదము

ద్వితీయ భాగము

అభినవభారతీ వివృతి

అభినవభాష్యము

దర్శనాచార్య మహోపాధ్యాయ సాహిత్యాచార్య
శాస్త్రవిశారద లాక్షణికశిరోమణి
**జమ్ములమడక. మాధవరామశర్మ**
ఏ. సి. కాలేజి : గుంటూరు

# స్వాయత్తాధికారము

శాలి : ౧౮౮౬

బాలాం నాలంకృతిమపి రసోద్ధ్వారికాం వీక్ష్య నిద్రా
కిం వాప్నైతి ప్రకృతిసులభా బోధకృద్ బాలదృష్టేః
ధన్యః కశ్చిత్సతు యువజనస్తత్సకలాకౌశలేందుం
యో దృష్ట్వైవోచ్ఛల దతిరసం చిత్తసింధుం విధత్తే.


శ్రీ లక్ష్మీ ముద్రాలయము

గుంటూరు

# సూచిక

# భూమిక

## శ్రీ పసల సూర్యచంద్రరావు

*అధ్యక్షులు: ఆంధ్రప్రదేశ సంగీతనాటక అకాడమి*

ప్రతిపాద్యవస్తువు నాట్యసర్వస్వము. తత్ప్రథమప్రవర్తకులు పితామహామహేశ్వరులు. శాస్త్రప్రణేత సర్వజ్ఞుడైన భరతుడు. బోద్ధవ్యులు అభిజ్ఞులైన మహర్షులు. ఇట్లావిర్భవించినదికావుననే నాట్యశాస్త్రము వేదమైనది. నాలుగువేదముల సారమిందు నిక్షిప్తమైనది కావుననే నాట్యశాస్త్రము పంచమవేదమైనది.

ఇంచుమించుగా వేయిసంవత్సరముల నాట్యాభిజ్ఞుల తపఃఫలముగా అభినవగుప్తపాదాచార్యు డవతరించి, సర్వశాస్త్రపరిజ్ఞాతయై ఈ పంచమవేదమునకు 'అభినవభారతీ' నామకమహాభాష్యమును రచించి, తదభిజ్ఞులకు నవరసోపేతమైన విందొనర్చినాడు.

ఇట్టి నాట్యవేదమును అభినవభారతీసహితముగా తెలుగుభాషలోనికి అవతరింపజేసినవారు శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు. శ్రీశర్మగారు- శ్రీ తాతారాయుడుశాస్త్రి, శ్రీకల్యాణానంద భారతీమాంతాచార్యమహాస్వామి ప్రభృతి సర్వవిద్యాగురువులను సేవించి, బహుశాస్త్రసాహిత్యవిద్యావ్యాసంగ మొనర్చినవారు. కావుననే నాట్యవేదమును ఈ విధముగా తెలుగులోనికి అవతరింపజేయుటకు శ్రీశర్మగారు సర్వవిధముల అర్హులు. తెలుగుదేశమునకు, సర్వ సంస్కృతపండితులకు వీరి ప్రతిభావిశేషములు, వీరి అమూల్యసాహిత్యసేవ సుపరిచితమే.

నాట్యవేదము బహుప్రాచీనమైనదైనను, నేటికిని అతినవ్యములును, సార్వజనీనములును, సార్వకాలికములును అయిన అంశములు

అందు బహుళముగా కలవు. అవి, నేడు, నాట్యకళోపాసకులందరకును అవశ్య మనుసరణీయములు. అందుచేతనే నాట్యవేదమును పలువురు పలువిధములుగా ఆవిష్కరించుట మాదృశులకు సంతోషదాయకము.

శ్రీ శర్మగారు నాట్యవేదప్రథమభాగము నిదివరకే ప్రకటించి యున్నారు. అందు పలువురు విద్వాంసులు నాట్యసంబంధివిషయములను కూలంకషముగా చర్చించియున్నారు. ఇది ద్వితీయభాగము. సంగీతాధ్యాయములతో కూడిన తృతీయ భాగము కూడ త్వరలో వెలుగుచూడగలదని ఆశించుచున్నాను.

శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులుగారు ప్రశంసించినట్లు, నాట్యవేదప్రవర్తకులలో పితామహమహేశ్వరులేయుండి మాధవుడు లేనికొరతను శ్రీ మాధవరామశర్మగారు ఈ అనువాదావిష్కరణముతో తీర్చినారనుట నిస్సంశయము.

శ్రీ శర్మగారి కృషి సర్వథా జయప్రదమగునుగాక!

క్రోధ - అధిక చైత్ర
శుద్ధత్రయోదశి - గురువారం

పసల సూర్యచంద్రరావు

# పరిషత్సంవాదము

ఆంధ్రనాటక కళాపరిషత్ సమావేశము అనంతపురములో జరిగినది. మానాన్న శ్రీ మాధవరామశర్మగారు రచించిన నాట్యవేదము ద్వితీయభాగము ముద్రితమై నాటి సమావేశములో నావిష్కృతమయినది. ఆనాటి పరిషత్సంవాదము విశిష్టశోభాసుందరము. నానావిధవిశేషవిశిష్టులగు శిష్టసదస్యులు పరిషత్సమావేశమునకు విచ్చేసినారు. నాట్యబుధులగు నటీనటులు విద్యాబుధులగు విద్యార్థులు ప్రత్యభిజ్ఞాపరమార్థులైన అభిజ్ఞశేఖరులు సముచితాసనములందు సముపవిష్టులైయున్నారు. ఆనంద కలకలస్వనములతో నందనమోదముదితులై యున్నారు. కన్యలు, వనితలు, ముగ్ధలు, అముగ్ధలు, విదగ్ధలు నాట్యవేదసుముఖులై యున్నారు. గ్రంథావిష్కరణలాలసలై యున్నారు. సమున్నతవేదికపై సుఖాసీనులయిన అధ్యక్షులు, కార్యదక్షులు, వ్యవహర్తలు, నాట్యభాషనాభావితులై యున్నారు. సభ సహస్రనేత్రములతో సుముఖమై అస్మజ్జనకముఖమైయున్నది. పూజావస్తుసంభారమంతయు పరిసరములో నేను నేనని తలయెత్తికొని చూచుచున్నది సమ్మానసామగ్రీకలాపము సమరసముగా సంక్లిప్తమై యున్నది. సభానిర్వహణచతురులు స్వకార్యపరులై యున్నారు. శ్రీ మాధవాచార్యారంభముగా ప్రాచీప్రస్తావము జరిగినది. "శ్రీ గణపతిని సేవింపరారే" అని శ్రీ జయలక్ష్మి గాయని ప్రార్థనాగీతిగానము చేసినది. కన్యామంగళగానము వలనములతో వర్తనములతో బహిరంతరాళములను గంభీరాపూరణమున నిండినది. వేదికె నిండి సందువుగా నున్నది. వేదికాఫలకమునందు నాట్యవేదగ్రంథముల ప్రస్తరము సహృదయముగా విస్తృతమై యున్నది పుష్పమాలాలంకృతమయిన నాట్యవేదము భరతముద్రతో అభినవాభినవభారతీభాషతో నాట్యభాషాభాష్యమై పరమదర్శనముగా నున్నది. దివ్యోల్కాకాంతిమేళనముతో సర్వము చిత్రీకృతమయినది.

శ్రీమాన్ యజ్ఞోజు మాధవాచార్య సూచనాసూక్తి వినపడినది. వారిట్లా భాషించిరి. "నాట్యవేదరచన మహాకార్యము. మాధవరామశర్మ సమర్థుడు. పరిషత్తు ఈ ఆవిష్కరణమునకై నోచుకొన్నది సహృదయులు కనివిని ఆనందింపుదురు. ఈ పరిషత్కార్యకలాపములలో కళావిజ్ఞాన విశిష్టకార్యక్రమములు కలవు. ప్రతివత్సరమిట్లే దీనిని నిర్వహించుచున్నారు. వర్ణనాచార్య లాక్షణికశిరోమణి శ్రీ మా శర్మ నాట్యవేదావిష్కరణమునకై మా కాంక్ష మన్నించి అంగీకరించిరి. మా శర్మ సంపాదించిన విశిష్టత అసాధారణమైనది. మాశర్మ సర్వదేశప్రసిద్ధుడైన బహుశ్రుతుడు. రాష్ట్రమున అన్యరాష్ట్రమున రాష్ట్రేతరమున మాశర్మ రససిద్ధుడైన ప్రసిద్ధుడు. దేశమున పండితులున్నారు. ప్రచారమొనరింపరు. కొందరందులకు చాలరును. కొందరు చారదక్షులు, ప్రచారసమర్థులు కలరు. వారందరు పండితులగుదురా? మాశర్మ పండితపండితుడు. ప్రచారసమర్థుడు. అధీతిబోధాచరణప్రచారములు మాశర్మ నిత్యకార్య

ములు దేశమంతట తిరిగి తిరిగి ప్రచారమొనరింపగల ప్రౌఢసుందరవ్యక్తి మాశర్మ యొకడే. మాశర్మ నాట్యసాహిత్యధర్మదర్శన ప్రచారకుడు. పాండిత్యమును శాస్త్రవాదమును ప్రచారమొనరించి జనులకు ఆస్థాశ్రద్ధలను కలుగచేయు మాశర్మ విశిష్ట పండితుడు. కావ్యభాషాభాషులకు కావ్యామృతములచే మ్రదిమ సంపాదించిన హృదయానుకూలవారలకు సాహిత్యశాస్త్రము తెలియవలయునను సముద్బోధించు మాశర్మ శాస్త్రవిజ్ఞానప్రకటన మొనరింపగల సామర్థ్యయోగి. తనసత్తాసై సర్వజనులకు ప్రతినిధిసై నేటికి పంద్రెండు సాహిత్యశాస్త్రగ్రంథములను మాశర్మ ప్రకటించెను. ఈ నాట్యవేదమును కళాభిలాషులకందించుట మాశర్మ విశిష్టకార్యము. అకాడమి సత్కారమిచ్చినది. వీరా ప్రోత్సాహమందుకొనినారు. ఈనాడిది యొకవిశిష్టకార్యక్రమము. తెలుగుదేశము వీరికి ఋణపడియున్నది. ఆ ఋణము ఎట్లేని దేశము తీర్చికొనవలెను. వీరుగో శ్రీమాన్ గాడ్పల్లి అనంతకృష్ణశర్మ ఆధ్యక్ష్యము వహించి ఆవిష్కరణ మొనరింతురు."

శ్రీ అనంతకృష్ణశర్మ "నమస్సదసే. ఈ ఉపక్రమము నాకు చాల ఆనందప్రదము విశేషించి నాకిది గౌరవప్రదము. మాశర్మ రామశర్మ యగునా రాయశర్మ యగునా? అటునిటు రెండునగును. పాతికసంవత్సరములుగా నాకు వీరితో విశిష్ట పరిచయమున్నది. నా సంతోషావిష్కరణమునకిది సమయము. గుంటూరులో మాశర్మ యున్న ఇంటికేగితిని. అది గ్రంథములతో నిద్ధమైన యిల్లు. అది పుస్తకముల యిల్లు. అంతట పుస్తకములే. బీరువాలు బీరువాలు అన్నియు నలంకారగ్రంథములు. ఎన్ని గ్రంథములున్నవి? ఇన్ని గ్రంథములున్నవా! అనుకొంటిని. ముద్రితములన్నియు కలవు. అముద్రితములు కలవు. పుస్తకసముద్రములో మాశర్మ గోష్పదీకృతవారాశి. శ్రీమాన్ శర్మ శ్రీరాయడుశాస్త్రి శిష్యుడు. విద్యావిదుడు తెలుగుదేశములో రాయడుశిష్యుడగుట అదియొక గొప్ప. మాశర్మ రాయడుశిష్యుడనుట కేవలము శిష్యుడనుట కాదు. రాయడుశాస్త్రి "శిష్యసంక్రాంతవైభవః" అని మాశర్మను చూచి తలచితిని. ఇట్టిశిష్యుడు ఆశాస్త్రికి మఱియొకడు కలడా! నాకు సందేహమేలని ఇట్టిశిష్యుడు వారికి మరొకడు లేడు. మాశర్మ ఇప్పటికే అనేక సాహిత్యశాస్త్ర గ్రంథములను వ్రాసి ప్రకటించిరి. అచ్చుకాని వింకను పది కలవు. అన్నియు గీటురాళ్ళవంటివి. మనకు తెలియని వింక నెన్నికలవో. మాశర్మ భగీరథయత్నుడు. ఇంతగా నీ నాట్యవేదమును నిరూపించెను. ఈ ఆవిష్కరణము పరిషదాదేశము. నాకిది గౌరవము. ఆవిష్కరింతును. భరతగ్రంథ ప్రామాణ్యమును అభినవగుప్తుని అభినవభారతియే చెప్పవలెను. ఆ భారతీవిశదీకరణము దీనిలో నున్నది. అభినవగౌరవమది యందరి గౌరవము. సంగీతసంపుటము మూడవది రావలసి యున్నది. విషయ ప్రతిపాదనము శర్మ రచనలోని విశిష్టత. అభినవభాష్యభాషాభూషిత మగు నీ నాట్యవేదము నావిష్కరింతును నాకిది గౌరవము. నాకిది ఆనందము. పరిషత్సంవాదములో ఇట్లు ఇట్టి గ్రంథమావిష్కరించుట యపూర్వము. అసాధారణము. ఈరీతి

యీనీతి పరిషద్రీతి. ఈ నాట్యవేదము మననముచేసి వ్యాసంగ మొనరింపతగిన యుత్తమగ్రంథము. సుపరిష్కృతమయిన ఈ గ్రంథమిట్లావిష్కృత మగుగావుత!" అని పూలదండలో నున్న నాట్యవేదము నావిష్కరించిరి. పూలదండను నాట్యవేద రచయిత కంఠసీమ ననుగ్రహించిరి. పరిషత్కార్యదర్శి శ్రీ పసల సూర్యచంద్రరావు మాధవాచార్యులందింపగా దండలువేసి చందనమిచ్చి తాంబూలమర్పించి శాలువకప్పి సమ్మాన మొనరించి సన్మానము చేసిరి. అంతయు చిత్రాయితమైనది. సభ్యామోదము సర్వసీమలకు వ్యాపించినది.

శ్రీ కల్లూరి సుబ్బారావు: "శ్రీ శర్మగారు రచించిన అలంకారసూత్రమను గ్రంథమును కృతిస్వీకార మొనరించి వారిని నామునగా చేసికొంటిని. శ్రీమాన్ అందరకు పరిచితులు. తిన వాక్యములో అందరికి ముంపులు కలుగచేయుదురు. ఇన్ని గ్రంథములు రచించుట అసామాన్య కార్యము. నిరంతర గ్రంథ తపస్సు మాశర్మ సారస్వత తేజస్సు. వారి యీనాట్యవేదమును పరిషత్తావిష్కరించుట అభినందనీయము. మాశర్మ ఆదరమున్నను లేకున్నను దేశమంతట సంచరించి ప్రచార మొనరింపగల విచారిదృక్కులు. మాశర్మ సభాప్రసంగములు సహస్రాధికములు. సభ్యులను మెచ్చి మెప్పింపగల వ్యక్తి. మెప్పుపొందగలవ్యక్తి. దివ్యశక్తిగల వ్యక్తి. వ్యక్తిధర్మము ననుసరించి రచనచేయగలదిట్ట. ఈ గ్రంథమంతయు పట్టి పట్టులో నున్నది. మాశర్మ సర్వహృదయవిదుడు. ధ్వనిశాస్త్రి. వారిపలుకులలో పలుపలు కలవు. వారి మాటలు విని వారిగ్రంథముచదివి అందరు సమర్థులు కావలెను. సర్వశాస్త్రవిదుడగు మాశర్మ వ్యవసాయమంతయు నందులకే. ఇట్టి వీరికి సన్మానమేమి యొనర్పగలము? "శీతాంశో రమృతార్పణం" బళ్ళారినుండి బరంపురము వరకుగల సారస్వతేయ ప్రతినిధులుకల యీ మహాపరిషత్సభలో శ్రీ శర్మగారికి వేయిపదారులు గౌరవ చిహ్నముగ సమర్పించుచున్నాను." ఇట్లావేశమున పలికి పలికి శ్రీ సుబ్బారావుగారు పూజా పురస్సరముగా మా నాన్నగారికి వేయిపదారులు సత్కారమిచ్చినారు. ఈ రీతిగా సభకొక్క నూతనశోభ సంపాదించినది.

శ్రీ గిడుగు సీతాపతి "మాశర్మ మిత్రుడు. అభిమానపాత్రుడు. ఈ శాస్త్రము నాది అని సాభిమానముగా పూనుకొనిన పూర్ణపండితుడు. సర్వసమర్థుడు. సభాదక్షుడు. ఈ ఆవిష్కరణ మవసర కార్యము. శ్రీరాయదుశాస్త్రి సర్వగురువు. సర్వతంత్రనిష్ణాతుడు. మా శర్మ ఆయన శిష్యుడు. ఒకప్పుడు శాస్త్రగ్రంథము లాంధ్రమున వ్రాయతగునా? యను చర్చవచ్చినపుడు ఔనని కాదని సంవాదము లేనివారు వాదులాడిరి. శ్రీరాయదు కనివిని హాసన్ముఖుడై కోరగాచూచి వ్రాయువారెవరు? సామర్థ్యముకలిగి వ్రాయవలెను. విశదముగ వ్రాయవలెను. స్పష్టముగ వ్రాయవలెను. వ్యాఖ్యాప్రాయముగ వ్రాయవలెను." అని నిర్ణయము పలికిరి. తెలుగులు వ్రాయువారు శాస్త్రులు కారు. శాస్త్రహృదయులు తెలుగువ్రాయుటకలవడ లేదు. ఇట్లనిన శ్రీ శాస్త్రి మాశర్మను తనభావప్రతినిధిగ నిర్మించెను: మాశర్మ

సర్వము రాయపథమనుసరించి రచనచేసినాడు. భరతనాట్యవేదపదము నాట్యశాస్త్ర పదము అంతటవ్యాపించినను అందరకు సరిగా సుబుద్ధము కాలేదు "నీభరతము పట్టించెదను." అను నుడిలోని సొగసు 'మనకు భరతమెంకెప్పుడు తెలియు' నని పించును. నాట్యవేదమవశ్యము తెలియవలసిన యుత్తమగ్రంథము. తెలిసి తెలిసి వ్రాసిన మాశర్మ నాకిష్టుడు అభీష్టుడు. లోకమునకు తెలియని పారిభాషికపదముల నేకములు నాట్యవేదములో కలవు. "సామాన్యప్రతిపత్తి పూర్వక"మ్మను కాళిదాసపదములోని సామాన్యపదార్థమును నాట్యవేదములోని సామాన్యాభినయ ప్రఘట్టముచూచి నిర్ణయింపవలెను. ఇట్టివాని నన్నిటిని సముద్ఘసగు మాశర్మయే వ్రాయుటకు సమర్థుడు. ఇందు పదములకూర్పులో విచిత్రమైనమార్పులో వైవిధ్యమున్నది. వైచిత్ర్యమున్నది. సహృదయులందరు చూడతగియున్నది. అభినవుని అర్థనిర్ణయము నందలి విశిష్టరీతులను మాశర్మ స్పష్టముచేయుట అభినవహృదయధర్మము. ఊహాపోహావిచక్షణత మాశర్మకు కలదు. లోకధర్మి నాట్యధర్మి నిరూపించుటలో కాలానుసరణమెట్లుండవలెనో మనన మొనరించి మాశర్మ నిరూపించినాడు. కట్టుదిట్టములుకల నాట్యభాషలో మాశర్మ దీని రచించినాడు. చేయవలసిన మంచిపని చేసినాడు. "అలంకారశాస్త్రములోనున్న సర్వగ్రంథములను మాశర్మయే వ్రాయవలెను." అని నేనై లోకకాంక్షను సూచించుచున్నాను.

అనంతరము మానాన్న మాధవరామశర్మగా రుపన్యసించిరి. జ్ఞాతృశ్రోతృసహృదయలోకమెదుటనున్నచో మానాన్న ప్రసాదక్రతి, వేగిత నావంటివానికి పట్ట శక్యము కాదు. అధికహస్తమును విహస్తులహస్తములు కావలసినదే. నాయోపి నంతగా నిట్లు గుర్తించితిని.

శ్రీ మాధవరామశర్మ "ఆంధ్రనాటకకళాపరిషత్తు"నకు నాకును ప్రప్రథమసమావేశమునాటినుండి సంబంధము కలదు. సర్వదా సర్వథా పరిచయముకలదు. బహుత్ర ప్రాశ్నికపీఠమధివసించి ప్రయోగులతో నిర్ణయమొనరించితిని. నటీనటుల పరిచయము నాకధికముగ కలదు. నటులైననటులు, నటులగుటకు నటన మొనరించునటులు నటులు కాలేకపోయిన నటులు తమకుతామై నటులమనుకొనునటులు నాకెందరో పరిచితులు కలరు. నాట్యవేదరచనాసక్తి కలిగినది. ఏనాడు కల్గినదో కల్గినది. పరిషత్తులలో, నుపన్యసించితిని. సమావేశములందు సూచించితిని. సాహితీవల్లభుల కార్యకాంక్షను గుర్తించి సంకల్పించితిని. తత్పుత్రాభిమానితను బహుమానించితిని. శ్రీకనకలింగేశ్వరాసక్తి నా అనురక్తికి శక్తినీయగా హైదరాబాద పరిషత్తులో నాట్యవేదప్రథమభాగమును ప్రకటింతునని ప్రకటించితిని. నాట్యవేదరచనమయినది. ప్రథమభాగమునకు కేంద్రసంగీతనాటక అకాడమి రెండువేలు ఇచ్చి, సంభావించినది. మరియంత నేనప్పు చేసి కలిపి ముద్రించి గుడివాడపరిషత్తులో ప్రకాశనమొనర్చితిని. కేంద్రములోని అకాడమి ఎంతయేని చేయగలదు. నాద్వితీయభాగమునకును రెండువేలిచ్చినదట. నాకెప్పుడేని అదియందుటకు ఎవరేని యత్నమొనరింపగలరు.

ఆంధ్ర ప్రభుత్వ సంగీత నాటక అకాదమి ద్వితీయభాగమునకై పదివేలను పందలిచ్చినది. విద్యామంత్రి స్వాత్మసంవాదముతో నన్నుభావించి సంభావించి అది ఇప్పుట సంతోషమిచ్చినది. మావంశమునందొక విశ్వాసము కలదు. "మిత్రస్య చక్షుషా పశ్యామః" నానేత్రము నానేత్రము. నాకు సూర్యనేత్రము నాకు చంద్ర నేత్రమును కలదని భావించి నేనుమాధవుడనుగా ముద్రణమొనరించితిని నేనధనుడనే యగుదును. భావదరిద్రుడను కాను. చేయదగుయత్నము చేసితిని నాయత్నము ప్రతిక్షణఫలమని నాకు విశ్వాసమున్నది. ఈద్వితీయభాగమిట్లు ప్రకటించితిని. తృతీయభాగమును వ్రాసితిని, వ్రాయుదును, ముద్రింతును, భావిపరిషత్తులో నావిష్క రింతును. అస్తు.

ఈద్వితీయభాగమున కవినటసహృదయాపేక్షితములయిన విషయము లన్నియు నున్నవి. ప్రయోగస్థిరత యున్నది. సిద్ధియున్నది. సహృదయసామర్థ్యయోగమున్నది. నాట్యావతరణమున్నది. నటులకభిశాపము లేకుండుటయు నున్నది. అభినవగుప్తుని అభినవభారతి నాకు వినయానందమిచ్చు ఆత్మభారతి యయినది. ఆ భాషావక్రత ఆ విచ్ఛిత్తివిశిష్టత నాకిష్టమభీష్టము. అట్టి వక్రతావైశిష్ట్యమునకై యత్నమొనరించితి ననుటయే కాని శ్రీమదభినవావేశమున సర్వమయత్నసులభమై అభినవభాష్యసంభాషా భాషితమైనది. నా యీ నాట్యవేదమిట్లే ప్రౌఢసుందరముగా నుండుటను సహృదయ మిత్రులు సంభావించిరి. ఈ నాట్యవేదానుసారమున "శతం గ్రంథాః" వెలువడు గావుత. ఇది "సహస్రశీర్షా" అవుగావుత అనియు ననవలసి యనిరి. అవునవునని నేనునంటిని. మాణిక్యాచల మఖండమది సుగ్రహము కాదు. ఖండశఃఖండశో గ్రహ ణము ఆయచలమునకు ఖండనము కాదు. గ్రహించువారలకు ఖండనముగు నేని యిట్టి దంతయు భాగభోజుల భోగము. సినీనటాభ్యుదయమునకు రంగనటసిద్ధికి ప్రతిష్టంభ శాంతికిని నానాట్యవేదము వేద్యవేదన మొనరించునది యగుగావుత. ఇట్టిదేయగు సాహిత్యాభ్యుదయమునకును ఇది గట్టిపట్టు కాగలదు. లోకానువర్తనమునకును శాస్త్రీయతానుసరణమును నాట్యవేదము చెప్పినది. చెప్పును. ఇట్లే గ్రంథమున్నది. నేనిట్లున్నాను. "అత్రమే ప్రతిష్ఠా" నా యుద్యమమిట్లు పరిష్కృతము ఆవిష్కృతము బహుకృతము. నేను నేనై చూచి సహస్రకరుడనై యొంటేని వ్రాయుదును."

ఇట్లు పలుకగా స్వానందము నిగ్రహించుకొనలేని సదస్యులు స్వాస్థ్యసుంద రముగా హర్షమావిష్కరించిరి.

శ్రీ పసల సూర్యచంద్రరావు "అటునిటు శర్మావరణమున్నది. ఇటు రామ శర్మ ఇటు కృష్ణశర్మ. వీరిద్దరి మధ్య నేనెట్లు కాగలనో! నిష్కరవేగమున మాశర్మ యుపన్యసింపగా నేనేమిపలుకుదును. ఈసభావిశిష్టత సర్వము సలిగింపగలదు. కాల గర్భము చాలచిత్రము. కొన్నివేలనాటి నాట్యవేదము ఇన్నినాళ్లే మాయెనో కాని ఇప్ప టికి నాటిదై నాట్యవేదము మన నాట్యవేదమైనది. ఈ రస్యరీతికి మాశర్మ కారణము. ఇన్నాళ్ళకిట్లు సన్నివేశ సౌలభ్యము కలిగినది. యుగయుగములనాటి నైసర్గ ఉపకారాకరి

ప్రతిభావైశిష్ట్యమువలన సర్వకాలసంగతము కాగలదు. దేవానందము భావించినవారు ప్రీతి వ్యుత్పత్తి కలుగచేయుటకై క్రీడనీయక మవతరింపచేసిరి. ఆక్రీడనీయక మీనాడును మానవానందమునకు ప్రీతివ్యుత్పత్తులను కావలెను. కావలసినది వచ్చినది. శ్రీ మాధవుని అభినయవ్యాఖ్యానము అభినవవ్యాఖ్యానమై వాసిగాంచినది. ఈనాటి యీ యావిష్కరణ కార్యలగ్నులు ప్రకృతిస్థిరమై కాలనిక్షిప్తమైన విషయముల నావిష్కరించుచున్నారు. ప్రకృతి యందించు సుహృదయము నందుకొని సర్వజనులు సుహృదులగుటకు మాశర్మ నాట్యవేదముపకారి. శాస్త్రజ్ఞానము లేని మానవుడు అనంతభావమూహింప గాలడు. అయినను ప్రయోగము చేయగలడు. పండితపుత్రపద గతమయిన వక్రోక్తిబాంధవ్యము భావనము చేయగా పితృలక్షణములు పుత్రులందు సంక్రమించుటను మనము గుర్తింపగలము. మనసంస్కృతి గోత్రలక్షణములు కలవు. పసుగునుండియు విద్యుల్లత యున్నది. మాశర్మ పితృమాన్. వాని పుత్రి. పితృపుత్రులలో ప్రశంసాస్పదమయిన ధర్మము వీరి కుటుంబమునందు కలదు. ఉచితజ్ఞతాముఖముగా శబ్దప్రయోగము వరించురీతి మాశర్మకు కలదు. పాషాణమునుండియు పీయూషము స్యందింపచేయు శక్తి పండితరాయలతండ్రికి కలదు. నల్లబండరాయి నుండి దేవీమూర్తినిర్మించు సామర్థ్యమమృతశిల్పికి కలదు. మా మాధవరాయలకన్నియు కలవు. కవివిమర్శకులు కలసి యమృతదోహ మొనరించుచు మాశర్మ సాలంకృతకృతి కన్యలుకలవాడు. సాహితీదేవీపదపద్మారాధకుడు. క్షేత్రజ్ఞుడు మాశర్మ కృతుల నందరు సాదరముగ స్వీకరింపగలరు. రసజ్ఞులనేకులు లోకమున కలరు. వారిని భావించి వీరిగ్రంథములన్నియు సుప్రకాశితములు కాగలవని విశ్వసించుచు రసజ్ఞశ్రీహస్తములతో నవి యావిష్కృతములు కాగలవని సంభావించుచును. ఈనాడింతటి విశిష్టకృతిబ్రహ్మ యయిన మాశర్మగారిని సర్వవిధముల సంభావించుచున్నాను."

అనంతరము ప్రభుత్వ మంత్రి మాన్యశ్రీ రంగయ్యాప్పారావుగారు ఆంధ్ర నాటకకళాపరిషదధ్యక్షులుగా మానాన్నగారు సర్వగ్రంథముల సంచాగ్రహణాదిములను సహయోగవ్రతులుగా సంభావించిరి. సభ సమాప్తమైనది కాని సమాప్తము కాలేదనియే సహృదయసదస్యులు భావించిరి.

భవభూతి

# స్వసంవాదము

నాట్యవేదమున కిది ప్రథమభాగము. ఇది ద్వితీయభాగము, తృతీయభాగము కావలసి యున్నది. ఈభాగమున భరతగ్రంథము నందలి ౨౪, ౨౫, ౨౬, ౨౭, ౮, ౯, ౧౧, ౧౩, ౧౪, ౧౫, ౧౬, ౧౭, ౧౮, ౧౯, ౩౪, ౩౫, ౩౬ యధ్యాయముల భావార్థములు క్రోడీకృతము లయినవి. పూర్వభాగము నందువలె నిందును ముఖ్య సంభావితములయిన కతిపయశ్లోకముల నుల్లేఖించితిని వదలినవాని యర్థమును వదలక వ్రాసితిని. నేనిట్లు సంగ్రహాత్మకముగ నిరూపించుటలోని భావము నివేదించుట నివేదితనివేదనము. ఆనాటి యాదిభరతుని పరిగ్రహమంతయు నట్లె యుండెనని నేను వినలేను. నేటి కిట్లున్నవానిలో నానుపూర్వీకృతాపూర్వసంపద యిట్లున్నదని చెప్పుట ప్రశంసాపరము కాగలదు. క్రమవ్యుత్క్రమములలో నన్నిట నర్థహాని యుండదు. అందొకభావబంధమున్నది ఇందు నొకటి కలదు అభినవగుప్తుని యవక్రమయిన పరాక్రమ మందరవుల్లాస ప్రదము నాట్యసంగ్రహాంతర్గతమయిన యే యంశనిరూపణ మయినను శివోపాసన యనకె యగునని యభినవబ్రహ్మ యగును. అది ప్రత్యభిజ్ఞాగము. తృతీయభాగమును పరిశిష్టభాగముగ వెలయింప జేయవలయునని తలంపుగలదు. అందు సంగీత వాద్య చారి ధ్రువారీతులు నిరూపింపనని యున్నది. తన్నిరూపణమున నాకు శ్రద్ధామాంద్యమేమియు లేదు. అభినవభారతీ ప్రకాశమున పరిశిష్టప్రకాశమును ప్రతీక్షించుచున్నాను. అంతః సంగీత విద్యానిముల సామర్థ్యాసామర్థ్యములను పరీక్షింప శయ నిరీక్షించుకొని సంగీతమున భరతి సంప్రదాయమును శతాత్ముడనై పరిశీలింతు ననుకొనుచున్నాను. నేనగాయకుడను విషయ మెట్లని సంగ్రహింతు ననుకొందును. గాయకులవిషయ మనలేను. అయినను తత్త్వాలోలుడనై కర్తవ్యము పాలింతును.

ఆంధ్రప్రదేశసంగీతనాటక అకాడమి దీనిని సంభావించినది. అముద్రితాప్రవర్త నమున నిట్టి సంభావనమున నామోదమతిశయిత మయినది. అకాడమి యిచ్చినది యపర్యాప్త మయినను తదాధారమున ముద్రణ మారంభించితిని సారస్వతేయ లనేకులు సుపరిచితులు కలరని వారునన్ను సంభావింతురని పూర్వభావన మొనరించి వారి సహాయోగమునకు నివేదనము పంపితిని. నాకపూర్వభావనము కలిగినది. ఇంకను కలుగునన్న భావమును కలిగినది. పూర్వరచితగ్రంథవిక్రయలబ్ధద్రవ్యమును తత్సహ యోగభావకృతమనియు భావించితిని. ఇందు కొందరినామోల్లేఖమున్నది. పరిశిష్ట మున శిష్టనామోల్లేఖ ముండును.

అభినవపదారాధనము నా వ్రతమయినది. కాగా నిది యిట్టి రచనారీతి కలదయి నది. నేను శాంకరపద్ధతుడ నయినను సాహితీతంత్రముల నేనభినవమార్గి. శాక్త దీక్షలో శాంభవీప్రక్రియలో ఆణవీరీతిలో నేను శ్రీకళ్యాణదేశికదేశనాదేశసంచారి నయ్యు శ్రీమదభినవుడు సర్వస్వమని భావింతును. అభినవభాష యది యభినవభాష. అది లోకమున ప్రసారము పొందవలెను. భారతభాషలన్నియు వైయంజనికభాషా

భాషలు. వైదేశికభాషాసంస్కారప్రభావమున లాక్షణికలక్షణభాష పరిమంచిత యయ్యు నచుంబితయై యయినది. నానావిధవ్యంజకతాసంపత్తికై యిట్టి భాషా బంధమున కలవడితిని. అభినవభారతీ హృదయసంవాదివిషయము లనేకములు కలవు. అట్టి విషయములందు సావధానత నలయువన్నది నా యాస్థ. సామాన్యాభినయమున చిత్రాభినయమున లక్షణాలంకారమున నింక నితరమున నభినవభావోల్లేఖమాత్ర ప్రతిమయినది. అభినవభారతీభావబోధనసామగ్ర్య మట్టి యలవడునది కాదు. సాహితీ తాపసులు దర్శనశాస్త్రదర్శనులు సంవిచ్ఛాస్త్రసంవేదనులు ప్రత్యభిజ్ఞాపరమార్థ స్వార్థులా మహామహేశ్వరాభినవబ్రహ్మ భావభావనసమర్థులగుదురా! అయినచో నే నెట్లు సమర్థుడను? నా పంచాశద్విగాదములు సామర్థ్యమిచ్చునవా? సహస్రాధిక సభారంగోపన్యాసములచే నట్లు కాగలితినా? నానాశాస్త్రాధ్యయనమున అధ్యాపనమున సమర్థుడనయితినా? కోశసంపాదనమిట్టి భావమిచ్చునా? శ్రీదేవీవరివస్యారతి యీయున్మేషమిచ్చినదా? సర్వతంత్రస్వతంత్ర శ్రీరాయడుశాస్త్రి చరణాంతేవాసిత్వ మీవాసనాసముద్బోధకమా? పల్లవగ్రాహితచే నిట్టిదలవడునా? ఇదియంతయు నాకస్మికప్రత్యవభాసమా? తద్భావసమావేశసంప్రాప్తసంస్కారమా? అభినవపద చింతన మిట్లనిపించును. నాకిందెట్టి ప్రత్యయమున్నదో యేమని చెప్పుదును. సర్వసంభారమున నిట్టిసంజ్ఞానము కలుగునవగలనా? అభినవభారతి నభినవభావ్యముగా నెట్లో నిరూపించితిని. ఏవంనిరూపణమునను ప్రమాదములుండునో? తద్విదులకు విన్నించి ప్రకటింపనెంచుకొంటిని. నా రెవరు? కవిసహృదయాభిజ్ఞశేఖరులున్నారు. వారి నెఱుగుదును. వారందర భిగమ్యులగుదురా? నే నభిగమ్యత నంతగా భావింపలేదు. కొంత 'సంకోచ్య' వ్రాసితిని. కొంత 'విపిచ్య' వ్రాసితిని. ఈ యాంధ్రవివృతికన్న సంస్కృతవివృతియె సుగమమని కొందరనదలచ యనగలుగుట "మము కటాక్షః" నేను దీని సంస్కృతీకరించి ప్రకటింతునేని యపుడును "మూలము సులభ"మను వచనము సులభము. తథామతి వచనము నందును "న్యాభిసంధిదుర్లభను కాదు. ఇందుదురవగాహతను కొందరాపాదింపగలరు. అధ్యాపకునకు దురవగాహమా? అధీతికి దురవగాహమా? శ్రోతకిది యట్టిదగునా? సభావావమాసునకిది యవగాహము కాదో? ఎవరికేనియిది యట్టిదగునేని సాంకేతికగ్రంథాధ్యయన మెట్లుండునో వారుద్బోధము పొందవలసియుందురు. ఈ గ్రంథమునందలి యొక్కొక విషయము నొక్కొకరధ్యయనము చేయవచ్చును. "ఖండశః ఖండశః" దీనివారు గుర్తింతురు. "మీనాట్యవేదావలంబనమున గ్రంథశతము వెలువడుగాపుత" అని యొక యభిజ్ఞసూక్తి. ఇందును వైయక్తికభావ వ్యాక్షేపమున నరుచిగలుగునేని యొవరేమనగిలరు? నాయందసాదరమతులకును నాయీ భాషాభినందనశ్రద్ధ యుండుట గుర్తించితిని. ఒక్కొకచో కొందరు కొందరేవం భాషాప్రయోగరసికులగుదురు కలరు. వారి నేమందును? వీరి నేమందును?

ఇందు పరాపతితములయిన దోషములన్నియు ముద్రానిమిత్తములని యని ప్రౌఢినవలంబింపను. ప్రథమభాగమునందున కొన్నిటిని నేనును గుర్తించితిని. నేనీ గుర్తించితిని. వ్యత్యయములు కొన్నియున్నవి. వర్ణదోషములు భాషాదోషములె కాదు. హంత! విషయదోషములునున్నవి. వాని నాసాదితాలోకులు నిస్సరింపగలరు. ప్రాతిశాఖ్యము చూచి నాట్యవేద మాస్వాదింపుడు.

శ్రీ మాధవరామశర్మ

# నాట్యవేదప్రాతిశాఖ్యము

౧. సామాన్యాభినయము
౨. సత్త్వప్రతిష్ఠ
౩. చేష్టాలంకారములు
౪. సత్త్వతత్త్వము
౫. శారీరాభినయము
౬. వాచికాభినయము
౭. కామోపచారము
౮. రాజోపచారము
౯. నాయికాభేదములు
౧౦. పురుషభేదములు—

౧. సామాన్యాభినయము: అభినయమునందు వక్తవ్యము కలదు. సామాన్యాభినయము వక్తవ్యము. ఇది వాగంగసత్త్వజన్యము. "నాట్యే సత్త్వం ప్రతిష్ఠితం". సమమయిన యుపరంజకాభినయము సామాన్యాభినయము. అభినయము లన్నిటిలో నొక రూపమున్నది. అదియె సామాన్యాభినయము. ఇది రసాభిముఖ్య మీయగలదు. సాత్త్విక మాంగికము వాచికము దీని సంబంధశోభతో నున్నవి. చిత్రాభినయము నందు వాగంగసత్త్వములు వ్యామిశ్రము లగును. ఇందట్లు కాదు. సర్వవిధ సామాన్యాభినయము సకల ప్రాణివర్గ సాధారణము. సర్వజీవసంతర్పకము. సర్వాభినయము లందు సర్వసాధారణమయిన యభినయమె సామాన్యాభినయము. ఇది యిట్టి దయినచో నితరాభినయము లేల? ఒక్కొక సాధ్యాంశోపస్కారమునకని కావలెనని కొందరందురు. నాటకాదులలో నుపస్కారము యుక్తము కాదు. అది దోషము, స్పష్టరీతి సర్వసాధకము, అందుపస్కార మక్కఱగాదు, కావ్యములు కూడ శాస్త్రముల వలె వ్యాఖ్యాగమ్యములగునేని "నమస్తేభ్యః".

శ్రీశంకుకాదు లిట్లు తలంచిరి. "లోకానుసారి నాట్యమున వక్త సుఖాద్యావేశ వివశుడగును. సుసంస్కృత శబ్దప్రయోగ మనుసరించును. తగిన యవధాన బంధము కలవాడగును. అప్పుడేక విధమయిన సత్త్వము నానారూపానుగతమై సామాన్యాకారమున భాసించును. అది యనంత ముఖమగును గావున నన్యము లవశ్యాపేక్షితములు." అని.

భావమును విభావింపజేయు నభినయ మభినయమగును. ఇది యనేక సంవలిత మయినను సమానీకరణమున సామాన్యాభినయ మగును. అంగోపాంగ కర్మలు స్వస్వరూపముతో నుండియు సర్వసమాహార రూపవిశిష్టాభినయమున సామాన్యాభినయమునకు రూపమీయగలవు. ఇది యలాతచక్రక్రమకల్పము. దీని ప్రయోగ మలాతచక్రప్రయోగ ప్రతిమము. దీనిలో నంగాభినయ విశేషము లుపలక్షితములై సంభూయాభినయములో విశేషమాధానింపగలవు. నిర్విఘ్న సాక్షాత్కారాధ్యవసాయ సంపత్తికై యన్నియు గావలెను,

అభినవ గురుచరణు లిట్లనిరి. రసభావ ప్రకాశనియతముగా వాగంగసత్త్వముల ప్రయోగము నిరూపించుటకు సామాన్యాభినయ మావశ్యకము. గాంధికుడు గంధద్రవ్యములను సమానీకరించి యోజనము చేయును. అట్లే యిందభినయములు సమానీకృతములై యోజనము పొందును. శృంగారమును ప్రధానముగ భావించి భాగయోగమున నభినయముల సమానీకరించుట యుక్తము. ఇది శృంగార ముఖ్యమయిన నితర ముపనేయము కాగలదు. ఈ సర్వము స్పష్టముగా దెలియుటకే—"సామాన్యాభినయో నామ జ్ఞేయః"-యనుట. కావున, "సామాన్యాభినయ మభినయ సమాహార రూపమె యగుచో వక్తవ్యమేమి కలదు." అను నాశంక కలుగదు. వాగంగసత్త్వముల వలన సామాన్యాభినయ ముదయించును. వాగంగసత్త్వములకన్న ఆహార్యము కొంత న్యూనము. అయినను సిద్ధస్వరూపము. అందునకె యిందుపాత్రము కాలేదు. ఆంగికాదులు పూర్వాపరీభూత రూపముతో నుండును. ఉత్తరక్రియ పూర్వపల్లవముగా నుండుటయు పూర్వక్రియ యుత్తరాధారముగా నుండుటయు నాంగిక వాచికములలో గలదు. ఆహార్యమట్లు కాదు. మార్పుపొందదు. పూర్వాపరీభూత స్వరూపము కాదు. స్థిరస్థితికము. అయినను అందును సామాన్యభినయచింత యున్నది.

కొందరిట్లందురు. "ఆహార్య మాంతర భావముల నపేక్షింపదు. కొన్నిట నట్లుండుట యౌచిత్యాపేక్షము. వాగంగాదు లాంతర నిశ్చయముతో నుండును. పరస్పర సహవాససద్భావముతో నుండును. ఆహార్యము నందదిలేదు. అందునకె సామాన్యాభినయ సంకేత పదములలో వాగంగాదులు కలవు కాని యాహార్యము లేదు." అని. ఇది భరతసమ్మతము కాదు. ఆహార్యమునందును స్వరూపసౌష్ఠవమున్నది.

౨. సత్త్వప్రతిష్ఠ : సామాన్యాభినయము వాగంగ సత్త్వసమాహార రూపమయినను విశిష్ట శోభాస్పదము. ఈ త్రితయ మిందున్నను "నాట్యం సత్త్వే ప్రతిష్ఠితం." నాట్యము రసమయము. రసమున సాత్త్విక మంతరంగము. అభ్యర్హితము. కేవల వాగంగముల వలన నాట్యసిద్ధి లేదు. నాట్యసిద్ధి వాగంగసత్త్వజము. సత్త్వమున నాట్యము ప్రతిష్ఠితము. సత్త్వమనునది మనస్సమాధాన జన్యము. సత్త్వప్రయత్నమె యుపయోగి. సత్త్వాతిశయముకల యభినయము జ్యేష్ఠము. సత్త్వమంతట అవ్యక్తముగా భావసంశ్రయముగా నుండును. సత్త్వమనుట సాత్త్వికాభినయమని భావము. వాగంగముల ప్రయోగమునందును మూలాధారముగా సత్త్వమున్నది. సమ్యగాభిముఖ్యము సంపాదించి సచేతఃప్రీతిని రసపర్యంతము ప్రసరింపజేయు సత్త్వము సర్వప్రధానము. సత్త్వము లేకున్న అభినయ క్రియోన్మీలనము లేదు. సాక్షాత్కారకల్పస్వాత్మాధ్యవసాయము సంపాదించు సత్త్వమునకె నాట్యప్రతిష్ఠ యున్నది.

శ్రీ శంకుక భావసారము. సత్త్వమవ్యక్త రూపమున నుండును. రామాద్యవస్థానుకారియగు నటుడనుకరింపగా సహృదయుడను కార్యభావ భావనాతిశయ

మున రోమాంచాదులు పొందును. అది వాని సత్త్వమువలన గలిగినది. ఆ సత్త్వ మవ్యక్తము. అది ప్రసంగసంగతమై ముఖ్య రససంశ్రయమగును. అప్పుడనుకార్య మందు సుఖదుఃఖాదిక మనుమితమగును. అప్పటి ప్రయోగమంతయు సత్త్వమయమగును. ఇట్టి ప్రయోగము ప్రకృష్టయత్నములేక కలుగదు. నటసత్త్వ మిందుపకారి. అంగహారాలంకారములందును సత్త్వ మావశ్యకము. వనితల కుచకచాదు లలంకార రూపములె కాని వానికొక యభినేయము లేదు. వనితల హేలాలీలాదుల ప్రయోగమున సత్త్వమత్యంత మావశ్యకము. మానినికి మనస్సమాధాన మావశ్యకము. దేహమున మనస్సమాధాన సంపాదనములో సత్త్వసంపత్తి యావశ్యకము. యౌవనకృతము లయిన శరీరవికారములందవి విశదము. వాగాద్యభినయములు వికాసముపొంది ప్రతీతములై యలంకారములగును. కొన్ని యప్రతీతము లగును. వీనిలో నంతట సత్త్వమవ్యక్తముగ నుండనేయున్నది. అంగజభావములలో వలె శీలకృత స్వాభావిక భావములలో గూడ సత్త్వబలమె బలము. స్త్రీగతములు పురుషగతములు వేరువేరుగ నుండును. వాని ప్రయోగించు నటుడుతత్స్వభావము లేనివాడయినను సత్త్వావష్టంభమున ప్రయోగింపగలడు. సర్వము సత్త్వబల ప్రయోజ్యము. ఇది యంతయు "అవ్యక్తరూపం సత్త్వం" వలన సమున్నేయము కాగలదు" అని.

ఈ రీతి నీతి బహుప్రదర్శన విలసితము. భరత గ్రంథవిధులకు రుచితము కాదు. అనుకార్య విశేషము కవిశిక్షార్థమా? నటశిక్షార్థమా? సత్త్వము ప్రయోక్తలో నెటు లుండును? అనుకార్యునిలో భావముండుట అనుకర్తలో సత్త్వముండుట సంగతమా? భావాదులనట్లు నిరూపించుట శ్రీ శంకుకుని చిత్రరమణీయ చిత్రణము. భావ హావాదులు ప్రయత్న నిర్వర్త్యములట. నాట్యసంసారమున నట్టిది కానిది యుండునా? ప్రయత్న నిర్వర్త్యత కేవలము సాత్త్వికాద్యైకాభరణమా? రసభోగ ప్రయత్నమొకటి కలదు. అది విభావాదులందు సంక్రాంతము. తదతిరిక్తయత్నమున్న దనుట భరతాభిమతము కాదు. సత్త్వనిర్వర్త్యమయిన నభినయస్వభావము లేదనుటయు యుక్తము కాదు. అభినయ స్వభావమె లేనన్నచో సామాన్యాభినయము" అను నపరామృష్టాభిధానము యుక్తము కాదు. మునిమతాను ప్రవేశము లేనివారు శ్రీశంకుకుని శ్రద్ధగా సంభావింతురు.

భరత ప్రక్రియాను సంధానమున నిరూపింపవలసినది యున్నది. నాట్యము సత్త్వప్రతిష్ఠితము కావున సాత్త్విక భావగతినిర్దేశ మావశ్యకము. అవ్యక్తముగా సత్త్వముండుననుట తన్నిరూపణ సూత్రము. స్వస్పందరమణీయమగు చిత్తవృత్తి సంవేదన భూమిలో సంక్రమించి దేహమునను వ్యాపించును. అప్పుడు స్వేదాదులు గలుగును. సత్త్వము యథాస్థాన రసోపేతము. నియమిత విధానాతిక్రమమున రస సంబద్ధమై యుండునదియె సత్త్వము. అది భావ ప్రఘట్టమున నవ్యక్తము. రోమాంచాదులచే నది భాసించునని సిద్ధాంతార్థము.

3. చేష్టాలంకారములు: సత్త్వము సంవేదనప్రసృతము దేహధర్మ వ్యాప్తము నగును. ద్వితీయ మిచట విచార్యము. ఉత్తమ స్త్రీ పురుషులందె సత్త్వము సాత్త్విక భావాత్మకముగ భాసించును. స్త్రీల యుత్తమత్వము శృంగార పర్యవసాయి. పురుషుల యుత్తమత్వము వీరవిక్రాంతము. స్త్రీ శృంగారమున పురుషవీరమున పుమర్థ చతుష్టయమభివ్యాప్తమై యున్నది. సత్త్వసంపద కల స్త్రీలయందే చేష్టాలంకారములు భాసించును. రూపలావణ్యాది సంపదయున్న నుత్తమ స్వభావము లేని వారలలో నివి భాసింపవు. వారిలోగూడ నివి యుండునేని సంప్రదృంశము పొందినవారిస్థితి సూచకము లగును.

భట్టతోతభావము. చేష్టాలంకారములు కొందరిలో నుండును. అవి కల వనిత యుత్తమ యగును. సామాన్యాత్మకమయిన శృంగారమున విభావాదుల స్పష్టత యుండదు. దశాంతరస్పర్శయు నుండదు. అవియు శరీరవికారములు కావున నను భావము లభినేయము లగును. పురుషగతశోభాదులు నిట్టివె. ఈ చేష్టాలంకారములలో వాగంగాహార్యయోగమున్నను సత్త్వప్రధానత యున్నందున సాత్త్విక వ్యవహారము కలిగినది.

సామాన్యాభినయము ప్రమదాపురుష ద్వారమున విశ్వమె వ్యాపించినది. చేష్టాలంకారములు దేహమాత్రగతములు చిత్తవృత్తి రూపములు కావు. అందుననె "భావరసాశ్రయాః". అయినను సర్వభావాశ్రయత లేదు. రతి భావమునె యివి యభినయింపగలవు. బాల్యమున ననుద్భిన్నములు. యౌవనమున నుద్రిక్తములు. వార్ధకమున తిరోభూతములు నగును. కామప్రదీపము వీనిని ప్రకటింపగలదని యొక రసికుడనెను. స్త్రీల దేహవికారముననె యివి యున్నవి. వక్త్రవక్షోనితంబాదులంతట నివి వ్యాపించును. కొన్ని పూర్వజన్మానుగతములు. కొన్ని ప్రకృత జన్మానుబద్ధములు. ఇవి స్వాభావికములు. భావహావహేలాదులు సత్త్వాధిక్యము కల యుత్తమ వనితలందె యవభాసించును. అట్లె శోభాదిసప్తక ముత్తమ పురుషులందె యుండును. ఇవియన్నియు భావోపబృంహితములు. సత్త్వమున్ననె జనించును. కాన పుస్తచిత్రాలేఖ్యములలో నివి సంగతములు కావు.

४. సత్త్వతత్త్వము: సత్త్వము దేహాత్మకము. తీవ్రతమ సత్త్వమున్నచో దేహము సర్వ ముపక్షేపింపగలదు. కాకున్నచో ప్రాక్తనరతియె సహకారి. ఇతర సహకారము నచట గావలయును. హేలాదులు పరస్పరసంభూతముల్గుట యిట్టిదె. భావహేలాహావములు ప్రకృతిస్థితము లయినచో నివి యితరముల నపేక్షింపవు. వాగంగముఖరాగ సత్త్వాభినయోప లక్షితమయిన భావము కవి భావభావకమై భావమగును. వాసనాత్మకాంతర్గత రసాఖ్యభావసూచకమై భావమగును. భావభావన మందరకుండదు. కవికిమాత్రమె యుండును. సూక్ష్మసూక్ష్మములను కవి విమర్శింపగలడు. కవియు సహృదయుడు. కాగా: సహృదయ హృదయాంతర్గత సంస్కా-

రాత్మకరసాఖ్య భావభావనాసమర్ధము భావమని పర్యవసితార్థము. హావాదుల కల కన్యలు రెండువిధములు నుందురు. ఒకతె యుత్తమ. వేరొకతె యధమ. ఒకతె రీతి చూచి సహృదయుడు సంభావితచేతస్కుడగును. అప్పుడాతని మతిగతి స్వభావ రమణీయము. ఆమె వాగాదుల వైశిష్ట్యము దేహవికారమై భావమగును. భావా వష్టంభమిచ్చు సత్త్వమామెలో నుండును. అధమలో నిట్లుండదు. హావమున అక్షిభ్రూ వికారములు గ్రీవారేచకములు నుండును. సహృదయ సర్వజన హృదయమునకు శృంగారాకారము గోచరించును. హావము కల కుమారి తనచిత్తము నితరమున హావిస్పుగా సమర్పించును. హావము స్థితసముత్థితము. ఉద్భిన్న సముద్భిన్నము. స్వాత్మవిశ్రాంతము. నిర్విషయము. హావము ప్రసరణము కలిగి హేల యగును. 'హేల-భావకారణే.' హావమె శృంగారసంభవమై వేగవాహియై హేల యగును. శృంగారానుకూలమగు సాధారణ్య మిందుదయించును. రసాస్వాదసదృశ సంభావన చమత్కారప్రాణమై హేలలో నుండును. హేల లలితాభినయాత్మకము ఈ భావాదు లలో రతిప్రబోధము మాత్రమె యుండును. అభిలాష శృంగారమున్నట్లు భావింప రాదు. ఉపనయనము సర్వపురుషార్థ సన్నిహితబంధమయినట్లు స్త్రీల కీ త్రయము పరమోత్సవ మానంద స్థానము పవిత్రము. ఇవి పురుషులకు నుండవచ్చును. కాని వనితలకె యలంకారము. సర్వభావములు పురుషునందు ధీరత్వమున సమాచ్ఛాదితము లగును. అందువలనె యాతడు ధీరపూర్వుడు. లలితప్రకృతియు ధీరలలితుడు.

ఈ మూడును స్త్రీల కంగజన్యములు. స్వాభావికములు పదియున్నవి. అవి లీలాదులు. రతిసముపబృంహణ సమర్థములు. ఈ పది ప్రాప్తభోగలకు సంభవించును. శోభాదిసప్తక మప్రాప్తభోగలందే శోభించును. లోకవాచావిలాసులగు కవులు లీలాదులను సాంకర్యమున ప్రయోగించుచున్నారు. వారలకు రూపావధానముచితము. భావభావన వశమున భామినుల చేష్టలొకేవిధమున నుండవు. సుఖమును దుఃఖోప చారమున ననుభవించుట, సుఖమును సుఖముగా ననుభవించుట యను రీతులలో రెండవది బహిరంగము. సంపద్గర్వాకృతము. సౌభాగ్య గర్వమున సంతోషగర్వము చూపువారుందురు. స్త్రీల రూపయౌవనాదులు పురుషుల భోగోపభోగయుతములై నవకాంతి కలవగును. ఆ కాంతి మందమధ్య తీవ్రరూపమునుండి శోభా కాంతి దీప్తి సంకేతము పొందును. స్త్రీలుపభోగ్యలు. పురుషులుపభోక్తలు. సుకుమార దేహ లుపభుక్తలై, పరిమ్లానకల్ప శరీరలగుదురు. వారిరూపాదులు మ్లానములయినను సుందర ములుగనె యుండును. ప్రయోగనిస్సాధ్వసత ప్రాగల్భ్యమను చేష్టాలంకారము. ప్రయోగము కామకలాస్వరూపము. ఆలింగనాది చతుష్షష్టి కళ లిందు గ్రాహ్యములు. సంగమరంగమున స్త్రీలకు ప్రాగల్భ్యము భూష.

శోభాదులు చిత్తవృత్తి స్వభావములయినను విభావజన్యత లేనందున భావ వర్గమున పతితములు కాలేదు. వానికన్న నివి భిన్నములు. అలంకార స్వరూపము లగుట, సామాన్యాభినయాత్మకములగుట, బాహ్యశరీరగతములగుట, ఆంతరధర్మత్వము

లేకుండుట, శృంగారైకవిషయములగుట, సర్వరసవిషయములు కాకుండుట వీనివేరు తనము నిరూపించును. శాక్యరాహులాదులు శోభాదులకు తోడుగా సౌగ్ధ్యమద్భాదు లను విక్షేపకేళివ్యాజాదులను చేష్టాలంకారములని పరిగణించుట భరతవిరుద్ధము. ఇవి సామాన్యాభినయ రూపములు. లలితసుకుమార ప్రయోగమున నివి యుండును. ఉప భోగవిప్రలంభములలో నివి యుండును. శృంగార భేదసాధారణాత్మకత యుండును. గావున నివి సామాన్యాభినయాత్మకము లగును.

శోభాదులెనిమిది పౌరుషాలంకారములు. పురుషులకు సత్త్వసంభూతి వలన దేహమున గలుగువికృతి శోభాదికారణము. సామాన్యముగా చేష్టలన్నియు బుద్ధి పూర్వకములు. రసమయ చేష్టలు చిత్తపురస్సరములు. శృంగారచేష్టలు చిత్త వ్యవసాయ పురస్కృతములె. కాని యబుద్ధిపూర్వక నిర్వికార స్వభావశృంగా కారచేష్ట లలితము.

౩. శారీరాభినయనము: వాగంగసత్త్వములలో సత్త్వము మూడవది యయినను విలోమప్రకారముననది మొదటిది. రెండవది యాంగికమను శారీరము. శారీర మారువిధములు. బహుప్రకారములనున్న యాంగిక మవాంతర జాతియోగ మున వ్యామిశ్రితమై సామాన్యాభినయముగా నగును. వాక్యసూచాంకురాదులు శారీరములు. వాక్యమనునది వాక్యసహచరితమయిన శారీరము. నిర్వృత్తకము నిందు పరిగణింపనక్కరలేదని ప్రాచీనులు తలంచిరి. ఈ విషయమున కావ్యకౌతుక గ్రంథములోని యంశమును భావింపవలెను. "వాక్యావగతికభినయముల సహకార మక్కరలేదు. అచట వృత్తభాషాగుణప్రతీతియె రసభావాను భావకము. భావాను భావకమగుటచే నిది వాక్యాభినయమగును." అని. కాని యిది విచారసహము కాదు. అభినేయకావ్యమునం దభినయశూన్య వాక్యముండదు. కావ్యకౌతుకమున నిది యుండుటయే కాని భట్టతోతభావము కాదు. అన్యభావమట్లు నిరూపితమయినది. వాక్యముతోనున్న శారీరాభినయము వాక్యము. అభినయసాపేక్షమయిన వాక్యమె సామాన్యాభినయ మగును. వాక్యోచ్చారణానంతరము ప్రయోగించు శారీరము వాక్యాభినయము. ఇది సంస్కృతప్రాకృత పద్యగద్యాత్మకము. కొందరిట్లందురు. "హృదయగతమయిన విశిష్టార్థము విమర్శానుబంధ మపేక్షింపదు. వెంటనే సతతము స్ఫురించును." అని. కాని యిందును సూచాభినయ సంబంధము మధ్యలో నుండును, సూచాభినయము సాత్త్వికాంగిక విశేషములచే భావివక్తవ్యము సూచించును. సూచ్యసూచకముల కంతరమున నుండునది సూచాభినయము. ఉత్తములభిసంధాన పూర్వకముగనె సూచ ప్రయోగింతురు. సూచ రెండువిధములు. అభిసంధాన క్రమాక్షిప్తమయిన వాక్యక్రమము, అభిసంధానక్రమముకన్న భిన్నమయిన వాక్య క్రమము. అని. రెండవదానిలో వేదేని క్రమమున్నదది సూక్ష్మపమీహానిర్ధార్యము. "క్రమోఽపి వాక్యమితి తద్విదో మన్యంతే."

స్వీయముగా భావించిన వాక్యార్థము గోచరించునని పరవచనమున వాక్యమె గోచరించునని యొకరనిరి. ఇది యుక్తము కాదు. పరివాక్యాపేక్ష యున్నచో నివృత్త్యంకురమగును. పరవచనమునగూడ వాక్యార్థమె గోచరించును.

అంకురాభినయము. మాటలులేని యంగాభినయములచే నిది సిద్ధమగును. హృదయగూఢభావము నిది సూచించును. నిపుణప్రయోజ్యము నిపుణసంభావ్యము. సాగరికాపుష్పాపచయమిట్టిది. ఇది నిర్వచనాంగాభినయము. శిరోముఖప్రముఖాదులారును క్రమమున నియతప్రయోగము నిర్వహించినచో శాఖాభినయ మగును. నాట్యాయితాభినయము రెండు విధములు. నాట్యరూపకనిష్ఠము మొదటిది. కార్యాంతరనిష్ఠము రెండవది. రంగమున నొక పాత్రయుండగా వేరొక పాత్ర ప్రవేశించి నప్పుడు తత్కాలసంకేతమయిన నాట్యముపచారము నాట్యాయిత మగును. ఇందు శ్రీశంకుకాదుల భావము యుక్తముగ లేదు. నాట్యాయితము లోకములోని స్వప్నాయితమువలె భావనీయము. ఏకఘనమయిన స్వప్నములోని యొక భాగమును జాగ్రద్రూపమున పరునకుపాదించి "నేను స్వప్నము కంటి"ననుట స్వప్నాయితము కాగలదు. స్వప్నము కాకున్నను స్వప్నమనుట స్వప్నాయితము. అట్లెనాట్యాయితము నాట్యమేకఘనముగానుండగా నపత్యనాట్యాను ప్రవేశమున నాట్యపాత్రలు సామాజికులవలె నగుదురు. వారి దృష్టిలో నది నాట్యముగనున్నను నాట్యము కాదు. కావున నాట్యాయితము స్వప్నములో స్వప్నమువలె నాట్యములో నాట్యముండును.

కార్యాంతరనిష్ఠ మిట్లుండును. ధ్రువాగాన విషయమందలి యభినయమును నాట్యాయితమె. ధ్రువాభినయమున చిత్తభావప్రదర్శనాభిసంధి ప్రయోక్తకుండును. ఇది మొదట అంకురముగనుండి యనుకూలమగును. భావరసావిష్టులయిన ప్రయోక్తలీనాట్యాయితము ప్రయోగింతురు. ఒకప్పుడు ధ్రువాప్రయోగము లేకున్నను కాకతాళీయమున ప్రయోగ సన్నిహితమగును.

నివృత్త్యంకురము. ఒకరు పలికిన వాక్యము తనకును సంబంధించి యున్నట్లు సూచచే గోచరమయినచో నప్పటి యభినయము నివృత్త్యంకురమగును. రాజవచనములను తన కనుకూలముగ భావించిన సాగరికా విశేషమునందిది సంగతము. ఈ యభినయములు సర్వాభినయ సంబంధముతో నుండునవి కావున సామాన్యాభినయము లయినవి. ఈ యభినయముల మార్గము భావరసాన్వితముగా నుండును. కొందరు శాఖాంకుర నాట్యాయితములు వాక్యవిరహితములని తలచి వాక్యసూచానివృత్త్యంకురములె రసభావ సమన్వితములని భావించుట తత్త్వజ్ఞతి కాదు. అభినయమేదియయినను వాక్యోపజీవనముతో నుండును.

౨. వాచికాభినయనము: ఆలాపప్రలాపాదులు పండ్రెండు వాచికాభినయ రూపములు. లోకమున నప్రసిద్ధములు కావ్యనాట్య ప్రసిద్ధములయిన వీని స్వరూప ధారణ మావశ్యకము. ఇందలి యుపదేశాతిదేశాదులను గొందఱు తర్కమీమాంసాది

విషయసంగతముగా విస్తరించిరి. అట్టిది మనోమోహనము వృథాభ్రమణి కామాత్రము. ఇట్టి యీ యభినయవిధానము లన్నియు మార్గములు. సర్వాభినయ యోజకములు. వీని కన్నింటికి సప్తవిధములయిన స్వరూపము లున్నవి. వాక్యాభినయమున నవాంతర భేదసంబంధమున ౧౮౮ భేదములు సిద్ధములగును. ఇవి యన్నియు సర్గాభినయ యోజితములు. వీనియందే వివిధాభినయ ముదయించును. శిరోహస్తాదికరణములందు సమానమగు కర్మవిభాగము సామాన్యాభినయము. రసభావసమన్వితము సమూహ రూపముగా నభినయములతో గూడుకొనినదై యేకీభావనిబంధనమై సామాన్యాభినయ మగును. అలాతచక్రమండల సన్నిభమై యభిన్నముగా భాసించును. ఈ సామాన్యాభి నయమునకు సముచితమయిన ప్రాధాన్యము కలదు. ఈ నాట్యమాభ్యంతరము బాహ్య మని రెండువిధములు. అభ్యంతర మనుద్ధతము. బాహ్యముద్ధతము. లక్షణాభ్యంతర మాభ్యంతరము. శాస్త్రబాహ్యము బాహ్యము. కర్మ ప్రయోగము రెండును నాట్య మున ప్రాణములు. నాట్యసంపత్తికివి యావశ్యకములు. ఆచార్యోపదేశ మపేక్షింపక తమ ప్రజ్ఞావిశ్వాసమున నటులభినయించుట బాహ్యనాట్యము. భట్ట పుత్రులకు వ్యుత్పత్తి యుండదు.

అభినయ సమవాయరూపమయిన సామాన్యాభినయమున సంభూయాభినయ మిట్లుండును. అభినయవిదుడు ఇంద్రియముల నింద్రియార్థముల నభినయింపవలెను. అందును శబ్దవిశేషాభినయమున విశేషమున్నది. ఇందు మనస్సుకూడ ప్రవణమగును. సమనస్కములయిన యింద్రియములె భావానుభావకములు. అమనస్కుడు విషయ ముల గుర్తింపలేడు. ఇష్టానిష్టమధ్యస్థభావము లిచట సంబంధించునవి యగును. వీనికి సంబంధించిన నియతాభినయమును నిపుణనిర్దేశ్యము. ఇందు సుఖాదులాత్మసమ వేతము లాత్మస్థములు. రూపాదు లన్యసమవేతములు పరస్థములు. ఆత్మస్థపరస్థము లందు ప్రత్యగాత్మ ననుభవింపజేయుట యున్నది.

౭. కామోపచారము : ఇదియు సామాన్యాభినయరూపము. సామాన్యముగా సర్వభావములు కామనిష్పన్నములు. కామమిచ్ఛాప్రభవము. ధర్మార్థమోక్ష కామ ములు కామభేదములె. ధర్మార్థములు స్వయంసుఖరూపములు కావు. మోక్షము సుఖాత్మకము, పరమానందవిశ్రాంతిరూపము. అది బహిస్సాధనాధీనము కాదు. స్త్రీ పురుషులయోగము కామము. సంయోగము సుఖసాధనము. "స్త్రీతి నామాపి సంహ్లాది" లోకోత్తరార్థముకూడ కామసంస్పృష్టమయినచో సర్వమనురంజితమగును. లోకమునకు హృదయసంవాదము కలుగును. కామప్రసంగము రహస్యార్థమయినను రహస్యార్థిములందరహస్యముగ రస్యముగ నిరూపితమయినది. ఇందులకె కైశికి నిరూపితము. కామము వ్యసనములందును సుఖకరము. సుఖసామాన్యము కామ సంపృక్తము. కామసుఖసమయమున నితరసుఖములు నిభృతములగును. ఇది బహు లక్ష్యవ్యాపకము. పరస్పర వ్యాపారములచే నిది పరిపూర్ణమగును. లోకము సర్వదా

సుఖాభిలాషి. దుఃఖనివృత్తికాంక్షించును. "యద్యేచ్ఛసి.....రమణీముఖభుంజీయాత్" అనుట విశృంఖలత బోధింపదు ఉపభోగము త్తమనియతి యందే యుండును. "సుఖస్య హి స్త్రియో మూలం" దుఃఖనివృత్తి మోక్షమనువారు ప్రేక్షావత్ప్రవృత్తి సంపాదింపజాలరు. రసరహస్య... వత్ప్రవృత్తి సంపాదింపగలరు.

కామోపచారవిజ్ఞానమునకు స్త్రీలయాశయపరిజ్ఞానమావశ్యకము. స్త్రీలు నానాశీలములతో నుందురు. ఇందు కొన్ని సంకేతితములు. ఇంకననేకములుండును. ఇచట ఐదు శీలములున్నవి. అన్నియు సావధానముగ పరిశీలనార్హములు. "అశేష విస్మరణం బుద్ధిః ప్రతిభా" యక్షసత్త్వమునకు కలదు. మానవసత్త్వములో కామ కాంక్ష యధికముగ నుండదు. ఆమె ధర్మకామార్థనియత. కావుననే కామము ధర్మార్థగర్భమున జేనది. ఖరసత్త్వ రతి రతి కాదు. అది యుద్ధము. గోసత్త్వ పితృదేవార్చనరత స్థిర పంక్లేశసహా. ఇట్లు శీలము లనంతములు. పురుష సంయోగమున సత్త్వము పరిణమించును. ఇది లోక దృష్టము. సత్త్వానుసారమున స్త్రీలను సేవించుట యుచితము. అది స్త్రీలకును హర్షప్రదము. అయథాసత్త్వసేవన మనిష్టఫలావహము. సత్త్వానుసారమున నుపచారము కామపురుషార్థమునకె యనిపించును. కాని గుణదుపపత్తి కలదు. "సుఖార్థం ధర్మః" సుఖములకు ప్రమదలు మూలము. నాట్యధర్మమున కామోపభోగము ద్వివిధము. నాకీపురుషసంశ్రయమునయిది బాహ్యమాభ్యంతరమునగును. అభ్యంతరము నాటికలో నాటకములో రాజులకు నిబంధింపదగును. ఇందు ద్వాదశకీకు లుపపాద్యములు. స్త్రీప్రకృతి త్రివిధము.. బాహ్యమాభ్యంతరము బాహ్యాభ్యంతరము. కులీన యాభ్యంతరప్రకృతి. వేశ్య బాహ్యప్రకృతి. కాంత కాంతావాద్ధయయ్యె భోగవనిత యగుట బాహ్యాభ్యంతర. అంతఃపురోపచారమున కులకన్య కన్యయనదగిన వేశ్యాకన్య నిరూపితకావచ్చును. బాహ్య స్త్రీ భోగోపనిబంధన సముచితకాదు. రాజుల కెక్కువుడు దివ్యాంగనాసంగమము దివ్యవేశ్యాసంబంధము నిరూపింపవచ్చును. కులజాశృంగారము కులటాశృంగారమని వేదనము లేదు. విభావాదులు వేరుగా నున్నను కామిత మేకవిధము. కామోత్పత్తి నానాభావసముద్భవను. స్త్రీపురుషులలో నుత్తమాధమమధ్యమభేదము లుండుటచే కామితమున నట్టి భేదములుండును. కామమువిధుముల గలుగును. శ్రవణాదులాదిధములు. ఇంకను కామహేతువులుండును. స్త్రీపురుషుల కామభావేంగితము లనేకవిధములు. వేశ్యాభావేంగితములు కులజాభావేంగితములు సావధానముగా సంభావనీయములు. సంభోగసంతుష్టలు కామవికారముల ప్రదర్శింపరు. అప్రాప్తభోగలు భోగాసంతుష్టలిట్టివానిని ప్రదర్శింతురు. ప్రాప్తమునితులును పురాకరతమునకై వికారము ప్రదర్శింతురు. "కుసుమసదృశ..." వస్థలు పది కలవు. అఖిలాపాత్మక కామమొక్కటియె ... నామము పొందును. అందు దశదశలు స్త్రీలకు పురుషులకును గలుగును. ఒకదశలోనిన్న మరి

ముకదశలో కామపరిపాకమున్నది. కామోన్మాదము వేరు. లోకోన్మాదము వేరు. ఉన్మాదావస్థయని లోకములోని పిచ్చివారి పిచ్చిచేష్టలు కూర్పరాదు. కామ తంత్రము పరిశీలించి వీనినిబంధింపవలెను. పురుషుడు సులభోపాయుడు. కావున నారంభమునుండి యన్నియు నిరూపింపనక్కఱలేదు. స్త్రీలు సులభోపాయలు కారు. స్త్రీవిషయమున కామావస్థలు నియతములు. స్త్రీలకు నిర్దిష్టములు. పురుషుల కతిదిష్టములు.

రాజోపచారము. కామసిద్ధికై సుఖకాములయిన ప్రభువులు దూతీప్రేషణాదిక మొనరింతురు. యథా రాజా తథా ప్రజా. ఇతరులు నట్లే చేయుదురు. రాజాజ్ఞాబలమున సాధించుట రమ్యము కాదు. కామోపాయములందు రాజాత్మబల ముపయోగింపడు. బలజన్యమయిన కామము కామము. అది యరతికరము. మాననీయదేవీభయమున వల్లభాభయమున రాజు ప్రచ్ఛన్నప్రవృత్తికలవాడగును. రాజ కామిత మనేకవిధము. వివాహితవిషయకామతంత్రము వేరు. అవరుద్ధావిషయ తంత్రము వేరు. ప్రచ్ఛన్నకామితము రతికరము రమణీయము. అప్రతిరోధకామము రమ్యము కాదు. వనిత లప్రతిరోధానుభవ మొల్లరు. వారి వామాభినివేశిత రమ్యము. "సులభావమానో హి మదనః" నరునకు నారి దుర్లభగ నుండుట రతిపారమ్యసూచకము. అప్పుడు పురుషుడు పరాక్రమప్రౌఢవామల ప్రదర్శించుట యసంగతము. ప్రచ్ఛన్నకామితము నిరూపించినవిధమున స్పష్టకామితమును నిరూపణీయము. స్పష్ట కామితమున నంతిపురమువారె యుందురు. వారియందు దివాసంభోగము యుక్తము. దివాసంభోగమనునది లోకానాదిపర్యాప్తము. కామోపచారము రాత్రులందే యుక్తము. షడ్విధవాసకశీలులను భావించి రాజు కామోపచారప్రవృత్తుడగును.

వాసకరీతి. వాసోపచారము రమ్యము. నియమానుసరణము పరిపాటి. ఋతు కాలఫలానుసరణము ఫలార్థము. పుత్రఫలము ముఖ్యము. "ప్రజార్థై గృహమేధినాం". అస్మద్దేశ లవైద్యులకు "వృద్ధపశువుల" వచనము లనుసరణీయములు కావు. నవవధువు నిత్యోపచారలాలనీయ. ప్రసూతపుత్ర నవప్రసూత లాలనీయ. ఇట్టి సుఖసమయము ప్రమోదసమయము గ్రాహ్యము.

౯. నాయికలు : వాసకాభావభావిత నాయిక ఎనిమిది విధముల నున్నారు. స్వయము పురుషుని భోగము కోరునది స్వాభిలాష. స్వయము పురుషుడే భోగము కోరునేని వనిత స్వాభిలాష. స్వాధీనపతిక స్వాభిలాష యగును. మదక్లిష్ట మదనక్లిష్ట యగుటలలో మదనక్లిష్టత యభిసారికా విషయమున ప్రధానము. కుప్యంతీ నాయిక ప్రశాంతనాయిక యీ పరిగణనమునకు రాదు. అష్టనాయికల కనేకవిధము లయిన కామతంత్రములు కలవు. వీరి విప్రలంభ జీవితము భావ్యమానసుందరము. మదనోపచారములు సకలసహృదయ హృదయము సంవాదము పొంది సామాన్యాత్మకములు కాగా నీ యభినయమును సామాన్యాభినయమగును. శిక్షాయుతులజాగ్రదేహ్యాభి

సరణగులలో ప్రతినియత విశేషములుం కలవు. వేశ్య పితభయ. కులజ భయభీత. ప్రేష్య సోల్లాస. వీరి ప్రియప్రబోధ విధానములునూ ప్రయోగ తంత్రానుసారమైన భిన్నభిన్నములు. ప్రకటసురగతమ మంగీకరింపని నవకామ ప్రవృత్తయైన వేశ్యను కాని, ప్రణయకలహోపశాంతయైన ప్రవర్యాప్తవనితను గాని, అత్యుత్కంఠితయైన కన్యను గాని సాపదేశోపాయములతో రాబట్టుటయు సముచిత వ్యాజప్రక్రియ నాయికలకన్న నాయకుడే ముందుగా ధైర్యపడ వాడగుట లోకమున గలదు. అట్టివానికి వ్యాజోపాయము లావశ్యకములు. కొందరు వ్యాజమున పాసక మంగీకరింతురు. నాయికా హృదయగ్రహణ సముచితవిదగ్ధత్వ నాయకుని యుపచారములును గలవు. ఉపచార విధానమున యత్న మావశ్యకము. ప్రియాభుక్తముక్త భూషాదిస్వీకారము ప్రియానురాగరంజనము. సమాగమమున కామము ద్విగుణీకృతమగును. ఉపచార సంజాత కామ యగు కామిని నాసవిధ నసుసరించి నాయకోపచార మొనరింపవలెను. ప్రయోగ ప్రసక్తి కలిగినపని రంగమున సంబరగ్రహణాదు లొనరింపరాదు రంగ నిషిద్ధము లనేకములు కలవు. ఉత్తమ మధ్యమ వనితలిట్లాచరింపరు. అధమ వనితల కుండ వచ్చును గాని వారలకు నసభ్య కార్యము ప్రయోక్తలు నిబంధింపరాదు. నాయికా నాయకుల యుగ్మమైనను రంగిసంభోగ పర్యంతము రారాదు. నాయికలకు ప్రియుని యాగమన ప్రతీక్షయు సావధాన సంభావ్యము. ఈ పర్యాలోచనమున తగిన యనుభావవర్గ మావశ్యకము. నాయిక ఖండితయైనచో నుపాలంభ మొనరింపవచ్చును గాని యనాభాష్య భాషణమును సముచితము. ప్రియ ప్రియునిపై కోపము వహించి మాట లాడరాదని నిశ్చయించుకొనినను ప్రియుని పలుకరింపవలెను. అనాభాష్యమును సంభాష్యమగుటలో కొన్ని నిమిత్తములు కలవు. సంభాషణావసరము లిందుకు నిరూపితములయినవి. ఇతర నిట్టివి యుండును. అన్నిటి యనుసరణ మావశ్యకము. అనుసరణము, నిస్నేహతా హేతువు. స్నేహమారి లగుట యుక్తము కాదు. స్నేహమున్నచో మదనసంభవమగు నీర్ష్యయు నుండును. ఈర్ష్యాయోగములు నాలుగు. వైమనస్యము, వ్యలీకము, విప్రియము, మన్యువు. ఇందలి వాచికాభినయానుభావము లాదర యోగ్యములు. సశంకిత సాపరాధ ప్రియతమాగమమున నుపాలంభములతో ఖేదపెట్టుట చాలును. నిష్ఠుర వచనములు పలుకరాదు. అంత్యంతము నిరపేక్ష కారాదు. దరకేగినప్పు డాతడు పట్టునేని పట్టువిడుపునకు సాగి సాగి, చరణపతితు డయినచో రతిభోగాసక్తయై శయనముఖి కావలెను. ఇది యంతయు వనితలకు లలితోపదేశము. ఇట్టి విధానమును గత విధానమున యోజన మొనరింపవలెను. అన్నిటిని రంగమున ప్రయోగింపరాదు. ప్రయోగానర్హములను గీతములచే సూచింపవలెను. రంగమున శయనము కూర్పరాదు. అందు నాయికను చేర్చరాదు. వారలకు గుహ్యకర్మలు కూర్పరాదు. నాటకమును పితలులు పుత్రులు కోడళ్ళు అత్తలు అందరు చూచెదరు. నాటకము సర్వదృశ్యము. అందు నిషిద్ధములను వర్జింపవలెను. కావున్న "రసౌచిత్యత."

ఇందే వాచికాభినయము కలదు. పలుకదగిన వచనము లనేకవిధముల నున్నవి. ప్రియకాంతనాథాదినామసంకేతములు తల్లక్షణములు రతిప్రీతికరములు. కొన్ని యప్రీతివాక్యములును గలవు. దుశ్శీలదురాచారాది నామసంకేతములు లక్షణములు భావనీయములు. ఇవియె కాక అన్యములును గలవు. దివ్యవేశ్యలతో రాజులకు భోగవిధానముండును. దేవతలకంతయు లలితాశ్రయము. దేవతల కీర్ష్యాదులు లేకున్నను మానవసంబంధమున మానవభావములనె వారలకు వర్ణింపవలెను. దివ్యలు సంతానకాంక్షచే మానవసంయోగము పొందినట్లు వర్ణింపవచ్చును. ఇట్టి యీ సామాన్యాభినయ ప్రఘట్టమంతయు భావించుటకు నిబంధించుట కుపకరించును.

వైశికము. ఇదియు సామాన్యాభినయవిశేషము. వేశోపచారము వేశ్యోపచారము కల వైశికుని నిర్వచన మెనిమిది విధములు. వైశికగుణములు త్రయస్త్రింశత్, వైశికవయస్యునకును వైశికగుణము లుండును. నాయికాసంధానచతురదూతియు నుండును. ౧౨ విధముల దూతికలున్నారు. దూతీదూతనిర్ణయమున విశేషములును గలవు. రూపసౌందర్యము కలవారు దౌత్యనియుక్తులయినచో వారు వీని చేయుదు. స్వాభీష్టము సంపాదింతురు. ఇట్టి కాదగనివారి నూహింపవలెను. దూతి దౌత్యచాతుర్యము కలదై సర్వము సాధింపగలదు. అనురక్తాచిహ్నములు విరక్తాచిహ్నములు గుర్తించి విరక్తావశీకారమునకు ప్రయత్నింపవలెను. మగవారి కొన్ని విశేషములు రక్తునకు విరక్తికారణము లగును. ఈ విరాగహేతువులు పది యున్నవి. విరాగహేతువు లెన్ని యున్నను రాగరక్షణము సముచితప్రక్రియ. తొమ్మిదివిధముల తొమ్మిదివిధముల నున్న వనితలను వశీకరించుకొనవచ్చును. వేశ్య లుత్తమమధ్యమ నీచ ప్రకృతికలై యుందురు. స్త్రీల కవస్థాయౌవనభేదములు నాలుగున్నవి. నవయౌవన యధికక్లేశము సహింపలేదు. ద్వితీయ యౌవనము కామపారము. కామపారము. తృతీయము సర్వశ్రీయుక్తము. చతుర్థము శృంగారశత్రుభూతము. ఇట్లు నాయికల స్వరూపవిశేషములున్నవి.

పురుషభేదములు— కామతంత్రానుసారి స్త్రీసంప్రయోగవిషయమున పురుషు లయిదువిధముల నున్నారు. విరాగజనకవిధానము లవలంబింపకుండుట, మదనవశుడు కాకుండుట, స్త్రీదోషము గోపించినచో విరక్తుడగుట, తన నాయిక నితరుల కందించుట స్త్రీల కాటవస్తువుగా నుండుట వీరి విశిష్టవిశేషములు. "నానాశీలాః స్త్రియః" సత్త్వానుసారమున వారిని సేవింపవలెను. వారి బంధనము స్వీకారము సాభిప్రాయముగ నుండవలెను. ఇందు సామాదు లయిదుపాయములు కలవు. తన ప్రమోదసమయములందు ద్రవ్యమిచ్చుట, ఆమె వ్యసనసమయములందు ద్రవ్యమిచ్చుట, సోపాయదోషదర్శనము, సముచిత బంధనతాడనములు, సామాదులవలన చక్కబడక పోయినచో నుపేక్షించుట యిందలి విశేషములు యథాసంభవముగా గుర్తింపవలెను. ఉపేక్షయు నుపాయమగుటచే నత్యంత ముపేక్షింపరాదు. "వేశ్యాచిత్తం తు దుర్లక్షం" ద్రవ్యమునకై వేశ్య యెవనినేని గమ్యునిగా భావించును. వారు పణ్యాంగనలు. దివ్య

వేశ్య యిట్టిది కాదు. రాజవేశ్యలు కలాహృదయలు వేశ్యల భావాభావములు వక్రతావిశిష్టములు. భావాభావముల గుర్తించి వారిని సేవింపవచ్చును. కామతంత్రానుసారమున వారిని స్వీకరించవచ్చును. ఉపచారబలమున విప్రలంభమున వారియందును కామ ముదయించును. అపు డది యనివార్యము. వైశికమయిన వనితోపచారమును దివ్యవేశ్యాసద్భావములతో నాటకమున గూర్పవచ్చును. కామోపచారమునకు సంబంధించిన స్త్రీపురుషుల విచిత్రస్వభావములు ప్రతిపద మాకలనము చేయుట శక్యము కాదు.

## ప్ర కృ తి ని రూ ప ణ ము

౧. ప్రకృతిత్రయము ౨. నాయకభేదము

౩. అంతఃపురవనితలు ౪. రాజపరివారము

ప్రకృతి స్త్రీ పురుష విచిత్రస్వభావము నిరూపించును. ఉత్తమాధమ మధ్యమాత్మికముగా ప్రకృతి మూడువిధములు. కవి నటులు రాజపరివారము తెలిసి నిరూపింపవలెను ఇచటి యుక్తయుత సర్వవ్యవహారవిషయము. భావబంధసంబంధము. నపుంసకుడు సంకీర్ణప్రకృతి, విటశకారాదులు సంకీర్ణప్రకృతులు. విటు డొకప్పుడుత్తముడై విధవశాశమున మధ్యము డయినందున సంకీర్ణప్రకృతి. ఇట్టి ప్రకృతి ననుసరించి నాయకులు నాలుగు విధముల నుందురు. "దేవా ధీరోదత్తాః" వీరలకు నలుగురు విదూషకు లుందురు. "విస్మారయంతి మానయంతి" "విప్రలంభ సుహృదో ఉ మీ సంకథాలాపపేశలాః". కావ్యవస్తు వేకపురుషసంభవ మనేక సంభవమని యందురు. అనేక సంభవములలో వ్యసనోదయములు మలల మలల గలుగుచేని యట్టి వారు నాయకులు కాజాలరు. అంతఃపురనాయికలు దివ్య, కులపత్ని, రాజపత్ని, గణిక యనువారుందురు. రాజుల యంతఃపురాశ్రిత వనితావిభాగము ౧౭ విధముల నున్నది. దేవీ ప్రయోజనములందు కామనోపచారహేతులయిన బ్రాహ్మణులు నియుక్తు లగుదురు. బాహ్యపరివారమునందు దేడుగురు ముఖ్యులున్నారు. వారు యువరాజాదులు. బృహస్పతి మతానుసారమున వీ లక్షణాదులను గుర్తింపవలెను. ప్రభువుల యుపచారవిధులను పరిశీలించి నాటకములగు కవులు నిరూపించుట యుక్తము.

## చి త్రా భి న య ము

౧. అభినయార్థము ౪. వాచికప్రశస్తి

౨. శరదాద్యభినయము ౫. సర్వానుగ్రాహకరీతి

౩. భావానుభావనము ౬. నాట్యప్రమాణము

సామాన్యాభినయమునకు చిత్రాభినయము శేషరూపము. పరస్పరసంలీనత్వము ఖండముగా గుర్తించువారును స్పష్టతకై వేరుగా గుర్తింపవలెను. సామాన్యాభినయమునందు రసాత్మకత సమానీకరణమున భాసించును. చిత్రాభినయము అభిజ్ఞాదిప్రదర్శనముండును. ఇది సామాన్యాభినయసంపూర్ణతాప్రోల్లాసమునకు సహకారి. పూర్వనిరూపితాభినయమేదియైనను కార్యాంతరసహకారమున విరుద్ధాద్యుద్బోధింపగలదు. అట్టి విరుద్ధాదులుండగా సామాన్యాభినయమే చిత్రాభినయమగును. కరణాంగహారవిభావాద్యభినయములందలి విశేషమునకు చిత్రాభినయమని వ్యవహారము కలదు "అభినీయతే అనేనేత్యభినయః - అభినీయతే ఇత్యభినయః" - యని యభినయపదవ్యుత్పత్తి. సాధన మభినయమని ప్రథమపక్షము. సాధ్య మభినయమని రెండవపక్షము. ఉక్తానుక్త విశేషములకన్న నధికముగు విశేషవివరణ చిత్రాభినయమున నుండును. ప్రసాదాదులు సర్వసాధారణములైనను తదభినయము చిత్రాభినయమగును. శ్రవ్యదృశ్యాభినయములయందు నితరములందువలె విశేషమున్నది. సంఖ్యాభినయమున విశేషము చిత్రితమగుచున్నది. సంయుతాసంయుతహస్తములందు నిందు విశేషములు నిరూపితములైనవి. యోగానుసంధానసమయమున ననుసరింపదగిన విశిష్టదృష్టియు చిత్రితానిరూపకము. సర్వేంద్రియస్వస్థతాసంపాదకమైన శరత్తు నభినయించుటయు విశిష్టము. ఇతరఋతువుల యభినయమును శోభావహము. దేశనియతములైన విభావముల యభినయము చిత్రతాసంపాదకము. ఆత్మానుభవము భావము. విభావము పరదర్శనము. ఆత్మనిష్ఠాంతమైన సుఖదుఃఖసంవిద్రూపము అనుభవమాత్మానుభవమని భావము. ఆత్మననుభవింపజేయునవి భావములని కొందఱు దర్శనమున్నది. ఆత్మవ్యతిరిక్త వస్తుజ్ఞానము సుఖాదిజనకము కావున నది విభావమనుట యుక్తము. సుఖదుఃఖాత్మకము లయిన సంవిద్రూపచిత్తవృత్తులు బాహ్యపదార్థసందర్శనాదులవలన నుత్పన్నము లగును. అందువలనె యవి భావములైనవి. ఇవి యీ చిత్తవృత్తికి నియతముగా విభావమగుననుట శక్యము కాదు. కాని ప్రయోజనాంతరసంబంధమున్నచో నదియే యన్యస్థలమున విభావమగును. అట్లె యనుభావాదులును. కేవలప్రత్యక్షగోచరమే చిత్తవృత్తినుత్పాదించునన్న నియమము లేదు. శబ్దానుమానాంతరప్రతిపన్నముకూడ అవిదితమైనను చిత్తవృత్తి నుత్పాదింపగలదు. ఇది యనుమానమునకు నుపలక్షకము. స్త్రీసంచారములు లలితములు. పురుషవ్యవహారములు ధీరములు. ఈ యంశము గుర్తించియె నటులు వ్యవహరింపవలె నాట్యసౌందర్యహేతువు. రసభావనియతముగా భావప్రదర్శనముండును గావున స్త్రీల భావము పురుషులకు పురుషుల భావము స్త్రీలకు నిరూపించుట హాస్యమునకగును కాని రసభావపోషణమునకు గాదు.

భావానుభావనము. ఇందు స్త్రీచేష్టలు వేరుగను పురుషచేష్టలు వేరుగను నుండును తద్విశేషానుసారముగనే తదభినయముండుట యుక్తము. అట్టిదియె మనోరంజకము. అభినయోద్దేశమున స్త్రీకృతభావములు కాని పురుషకృతభావములు

కాని శాస్త్రవిధిమర్యాదలతో నుండుట నాట్యశోభ. ప్రయోగవిదులు అప్రత్యక్షముగ నున్నవాని నభినయించుటలో గూడ సావధానులగుదురు. ఇంక ననేకముల నభినయింపవలసియున్నపుడు నాట్యబుధులు "అంగాద్యైఃసద్భిః" అభినయించుట యిందు ముఖ్యసూచనము.

వాచికప్రసక్తి. చిత్రాభినయనములో వాచికప్రవేశమును కలదు. ఆకాశవచనాదు లశరీరనివేదనములు వాచికగతములయిన చిత్రవిశేషములకు సూచకములు. రమ్యముగ కావ్యభావనమున వెలువడునవి చిత్రతాపాదకములై కావ్యామణీయకము గూర్పగలవు. స్వప్నాయితోత్స్వప్నాయితవాక్యార్థాభినయమున హస్తసంచారము లుండవు. సుప్తాభిహితము పూర్వస్మరణాకృతముగా నుండును వర్తమానాంశముల నాయతిలోని విషయముల నవి నిరూపించునవి కారాదు. అట్లై యున్న నది కపట విధాన మనిపించును. రసభంగముకలుగును. అట్టి భావమె కావ్యార్థమయినచో సావధానత కావలయును. స్వప్నాభిహితములు వ్యక్తావ్యక్తస్వరూపసుందరములై యుండును. సుప్తాభిహితవచనప్రయోగ వ్యవహారమున లలితగంభీరమయిన భావభావనమున్నది. అట్లు భావించువాని సంచారరంగము వేరు. సుప్తాభిహిత మొనరించువాని చిత్తరంగము వేరు. ఈ రెండురంగములను సచేతోధర్మమున సహృదయుడు భావింపవలసియున్నది. ఇందు మందస్వరసంచారము మందాయితవచనవ్యవహార మావశ్యకము. మరణాభినయవాగ్వ్యాపారమున కాకుస్వరప్రయోగాదికము సావధానసంభావ్యము. ఇట్టి వన్నియు చిత్రవిశేషములు. మదమత్త మానవవచనవ్యవహారమును చిత్రమె. వచనగతములయిన చిత్రాభినయవిశేషము లనేకం కలవు. మరణవిధానము లనేకములు కలవు. "విషంపీతమనేనేతివిషపీతః" విషపీత మరణాభినయవచనాది వ్యవహారము సవిరాక్షాన్వము. విషవేగ మెనిమిదివిధముల నున్నది. నాట్యధర్మానుసారమున మరణప్రయోగభావన మావశ్యము. ఇట్టియభినయ విశేషము లన్నియు భావసత్త్వసంయుక్తములుగా నుండుటయె శోభ. కొన్ని లౌకికము లుండును. అవి "సర్వేలోకతః కార్యాః". ప్రత్యంగహీనము వికృత కావ్యము. వికృతము ప్రహసనప్రధానమగును గావున నంగభినయ మలాక్షణికముగ నుండవచ్చును. విరూపాభినయము హాస ముత్పాదించును. వికృతత్వకృతమయిన విశేషమె యప్పుడు సహృదయుల కవభాసించును. అభినయకృత మవభాసింపదు.

సర్వానుగ్రాహకరీతి. సత్త్వభావసంయుక్తమయిన యభినయవిశేషములలో ప్రకృత్యనుసారి ప్రయోగమావశ్యకము. ఇందు సర్వానుగ్రాహకమగు లక్షణరీతి యున్నది. ఉత్తమాదుల భావనిబంధనమున సాంకర్యము తగదు. ప్రకృతిసహజము లయిన పృథక్పృథగ్భావరసములున్ననే నాట్యరాగముకలుగును. అభినయములన్నియు సత్త్వభావసంయుక్తము లగుట యుక్తము. విశిష్టములన్నియు "లోకవత్కార్యాః". లోకసహజములు నాట్యసహజములు చిత్రతకలవి యగుటయె ముఖ్యము. కొందరు నాట్యప్రయోక్తలు క్రమ మనుసరింతురు. ఒక క్రమ మొకని నాట్యోపాదయ మిచ్చును.

ఇది యుక్తమే కాని అంతగా స్వీకార్యము కాదు. లలితరమ్యమయిన నాట్యమున నిరంతరశ్రమవలనగలుగు నాట్యాతిశయము సహృదయప్రశంసాస్పదము కాదు. జన్మసహజ నటునకు శ్రమాభ్యాస మావశ్యకము కాదు. వానికి నటనము లీల. వాని లీలాత్మకనటనము కూడ సత్త్వసంబంధమునను యుండవలెను మిక్కిలి సత్త్వావష్టంభము తగదు. అది కృతకము, "అవిముక్తసత్త్వః" అగుటయే ముఖ్యము. నటుడగుట, రంగసంచారము, సత్త్వయుక్తత, అవిముక్తసత్త్వత, లీలాప్రకృతియగుట, లోకమున దుర్లభము. క్రమశ్రమరీతి కొందరి కావశ్యకము. అందరికి గాదు.

నాట్యప్రమాణము. ఇందు నిరూపితములు కాని యభినయములు నుండును. వానిని లోకమునుండి గ్రహింపవచ్చును. ఇచటి లోకము సామాన్యలోకము కాదు. లోకమనగా లోకప్రసిద్ధములయిన ప్రత్యక్షానుమానాగమప్రమాణములు. వేదమధ్యాత్మమును నాట్యప్రమాణము వీని యందు నాట్యము ప్రతిష్ఠితమై యున్నది. వేదచతుష్టయమిచటి వేదపదార్థము. ఆగమములును వేదార్థము ధనుర్వేద గాంధర్వవేదములును వేదార్థము. స్వాత్మసంస్థమయిన వేదన మధ్యాత్మము. ఇందు లోకము ప్రమాణమనుట పరిశీలనార్హము. లోకసిద్ధము సిద్ధమే. అది యసిద్ధము కాదు. కాదనుట కాష్ఠపాషాణతాపత్తి. లోకులు సమాలోచనమక్కరలేకుండగనె స్వాస్పందసంవాదమున సామూహికముగ నాట్య మాస్వాదింతురు. లోకస్వీకృతమునె యాగమము నిరూపించును. సర్వము తెలిసి ప్రయోగించినవాడె ప్రయోక్త యగును. సంప్రదాయప్రవాహావిచ్ఛేదము లేకుండవలయునని సర్వానూహావివృద్ధికే యనుట యుక్తము. నాట్యసిద్ధియున్నచో సర్వసిద్ధి యున్నది. ఈ తత్త్వనిరూపణమున "అపి వాచస్పతేర్వాణీ కుంఠితాకిము తాదృశాం"

## ప్రకృతి వికల్పము

అభినయమునకువలె నభినేయమునకు సమానీకరణ మావశ్యకము. అభినయమభినేయద్వారమున నభినేతతో సమానీకృతమగును. ఈ సూచనకై ప్రయోగము ప్రయోక్త ప్రయోగ్యత సూచితములు. ప్రయోజ్య ప్రయోజక స్వరూపవిదుడె సర్వవిదుడు కాగలడు. ఇందు సాదృశ్య వైసాదృశ్యములను గుర్తింపవలసియున్నది. పాత్రప్రకృతి యనురూప యని విరూప యని రూపానురూప యని త్రిప్రకారముగ నుండును. అది స్వభావకరణాత్మకమయిన నాట్యమున సద్ద్యోతము. మొదట నీ బుద్ధి తిరోధాన మావశ్యకము. ప్రకృతి తదుపయోగి. "ప్రకర్షేణ క్రియతే, సాక్షాత్కారకల్పానువ్యవసాయ గోచరత్వీక్రియతే ఇతి ప్రకృతిః". అంతట అనురూప ప్రకృతియె కాదు నానారూప ప్రకృతి యుక్తము. నటు డాత్మరూపమును రామాదుల రూపముచే నాచ్ఛాదించుకొనవలెను. అప్పుడాతని కనుకరణీయ తాదాత్మ్యము కలుగును. అపుడు భావుకుల కాస్వాదము కలుగును. నాట్యవిన్నటుడు-సోహమస్మి,

సోఽస్మి- సోఽహం" మానసభావనమున పరంభావము నాశ్రయింపవలెను. అపరిత్యక్త స్వాత్మావష్టంభమున నటుడు పరభావ మనుకరించును. అది వాని యాత్మధర్మము. నియమానుసారమున భూమికాధారణ ముచితము. స్త్రీల కంఠస్వరములు స్వభావ మధురములు. గీతలగ్నములు. పురుషులు గీతభావనము చేయగలరు. గీతప్రయోగము సుకరము కాదు. గేయము స్త్రీప్రకృతికము. స్త్రీప్రయోగమునందు నటబుధులు స్వయముగ భూమికాధారణ మొనర్పరాదు. స్వభావోపగతమయిన విలాసము స్త్రీలకు గలదు. పురుషుల కుండదు. పురుషసంబంధి లలితము హృద్యము సౌష్ఠవ సంభృతము నయినచో నది యలంకారమగును గాని ప్రయోగప్రవేశార్హము కాదు. ఇం దొక ప్రయోగరహస్యము కలదు. సుకుమారావిద్ధప్రయోగములందు ప్రకృత్యనుసార మున నర్హులై ప్రవేశింపదగును. నాట్యవిదు డప్రమత్తుడై యనుకూలయోగ్యయత్న మాచరింపవలెను. నాట్యవిదుని గుణానికాభ్యాస మావశ్యకము. నాట్యాచార్యగుణ సంపద విశిష్టముగనున్నది. ఆ సంపద కూహాపోహము లుండునేని నాట్యవిదుడు శిష్యుల నుత్పాదింపగలడు. గురుశిష్యసంప్రదాయము సముత్పన్నము కాకుండునట్టి యత్న మావశ్యకము.

శిష్యస్వరూపము. శిష్యున కారుగుణము లావశ్యకములు. అవి కలిగి కలా పండితుడగును. శిష్యనటున కిన్యాభిసంధితో సంఘర్ష ముచితము కాదు. అనుకార ములో ననుసరణములో సంఘర్షము యుక్తమె. అట్టిది నాట్యమున సమధిక ప్రతిపత్తి. ఇట్టిదంతయు శిష్యశిక్ష. దీనిని నాట్యకోవిదులు గుర్తింపవలెను.

ప్రయోగసిద్ధి. నాటకాశ్రయములయిన సిద్ధులు కొన్ని కలవు. ప్రయోగ మంతయు సిద్ధ్యర్థమె. అభినయము లన్నియు సిద్ధికాంక్షాకృతములు. నాట్యవిదుడు సిద్ధికాముడై ప్రయోగింపవలెను. "సిద్ధిర్నామాసాధ్యప్రయోజనసంపత్తిః" నట సామాజికులకు సిద్ధి యావశ్యకము. నాటకాశ్రయసిద్ధిలో సర్వము కలదు. ఇట నాటకపదము నటపదము. నటప్రయోగమున సామాజికసిద్ధి యున్నది. నటాశ్రయ సిద్ధి ముఖ్యము. సామాజికసిద్ధి యున్ననె ప్రయోగము సుప్రయోగమగును. సామా జికసిద్ధి మానుషసిద్ధి. సామాజికాస్వాదములో నటబుద్ధియుండదు. నాట్యాస్వాదమున దేశకాలనిర్యంత్రణముండదు. సర్వము శమసిద్ధిలో పర్యవసానము పొందును. రెండ వది దైవసిద్ధి. పురుషార్థవ్యుత్పత్తి యుందుండును. ప్రయోగనిష్పత్తివలన సిద్ధి కలుగును. పరు లొనరించు ప్రోత్సాహనము సిద్ధి దోహదము. దానివలన అప్రబోధ ప్రబోధనము కలుగును. సిద్ధిసూచకములయిన వచోవ్యాపారము లేడు విధములుగ నున్నవి. అభిసంధిపూర్వకముగ కొన్ని శరీరవ్యాపారములు నుండును. అనభిసంధి పూర్వకముగ గూడ నుండును. మానుషీసిద్ధి దశవిధముల నున్నది. నటులప్రతిభాన తారతమ్యానుసారమున ప్రయోగసిద్ధి యుండును. సిద్ధివిఘాతకములయిన విఘ్నము లాధ్యాత్మికములు దైవికములు కలవు. వాఙ్మనపథ్యశరీరజన్యమయిన సిద్ధి పరిశీలన

మావశ్యకము. ఘాతదోషములను దూరీకరించుకొనిన నటునకె సిద్ధి యున్నది. దైవ కృతము లాత్మకృతములు పరకృతములు ఔత్పాతికములు నయిన దోషములు భావసిద్ధి భంగ మాపాదింపగలవు. స్వరదోషములు రంగదోషములు వాద్యాదిదోషములు కలుగకుండునట్లు యత్నింపవలెను.

కావ్యదోషములు. కావ్యమునకు సంబంధించిన స్థూలదోషములు ౧౦ కలవు. వాని దూరీకారమె సిద్ధిసాధకము. ఇట్లె యస్థానభూషణాదులు ఘాతములు. అనభిజ్ఞత మహాఘాతము. సంప్రదాయము తెలియక చేయుట వైరస్యము పరిహాసము కలుగజేయును. రంగప్రయోగము స్తబ్ధము కారాదు. ఘాతమునందును సిద్ధికూడి యుండును. నాట్యకుశలుడు సిద్ధిఘాతములను గుర్తింపవలసియున్నది. నటుల సిద్ధ్య సిద్ధ్యులకు సామాజికులే హేతువు. నైన్యాభినయమున్నదీనులగుట తుష్టినభినయించిన సంతుష్టులగుట సామాజికలక్షణము. సహృదయభావకులు ప్రేక్షకులు. అందు కొందరు ప్రాశ్నికులు. నాట్యము పరీక్షింతురు. సిద్ధినుపలక్షింతురు. ప్రాశ్నికులున్న నే ప్రయోగము సఫలము. పక్షపాతప్రవృత్తిలేని నిర్ణయము యశమిచ్చును. ధర్మము రక్షించును. ప్రాశ్నికుల లక్షణము విశిష్టముగ నున్నది. వారి వ్యుత్పత్తి ప్రతిభా ద్వైతము రస్యరసముల నాస్వాదింపచేయును. పరినిష్ఠితార్థముల భావింపచేయును. వారందరు కవిభావకదృష్టిద్వయము కలవారు. సహృదయలక్షణము నాట్యసుంద రము. ప్రేక్షకులు పరస్పరసంవాదమున సమరసీకృతమయిన అంశము భావింపగలరు. ప్రేక్షకునకు వ్యగ్రత తగదు. నాట్యరాగియై పరిశీలింపవలెను. లోకప్రకృతుల నేక విధముల నుండును. భిన్నభిన్నశీలములతో నుందురు. "శీలే నాట్యం ప్రతిష్ఠితం". నానాశీలకీలితమయిన నాట్యము మహాశీలప్రతిష్ఠమై ఆత్మసంవాదమిచ్చును. బుధ సహృదయులు తత్త్వసహితములయిన సర్వభావమున గుర్తించి యానందింతురు. భావానుకరణసమర్థులు శ్రేష్ఠప్రేక్షకులు. భావభావనమున భావితహృదయుడే భావక ప్రేక్షకుడు కాగలడు. ఇందునటుల సిద్ధియు నున్నది. నటులు యశఃప్రార్థులై వివ దించువారయినపుడు ప్రేక్షకులు ప్రాశ్నికులై నిర్ణయమొనరింపవలెను. స్వయముగ ప్రాశ్నికుడు నర్తకుడు కావలయును. అనర్తకుడు నర్తకులధర్మమర్మములు గుర్తింప లేడు. ప్రాశ్నికుడు ఛందోవిదుడు శబ్దవిదుడు కావలసియున్నది. యజ్ఞవిదుడును కావలెను. గాంధర్వవిదుడు కావలెను. వివాదములందశాస్త్రజ్ఞులు నియుక్తులు కారాదు. ఒకప్పుడు నాట్యాచార్యులకును శాస్త్రసంశయసంఘర్షము రావచ్చును. అట్టి సంఘర్షము నాట్యవిద్యాభివృద్ధిహేతువు. ప్రభునియోగమున ఆచార్యుల యన్యోన్యకలహమున కీర్తిప్రతిష్ఠానిమిత్తముగా యశోలిప్సాహేతువుగా సంఘర్షము కలుగవచ్చును. అపుడు ప్రయోగవిజయమెవనికి తగునో నిశ్చయింపవలెను, పతాక మిప్పింపవలెను. రంగసభలో నభినందింపవలెను. నటుల ఘాతదోషములను చూచి స్వస్థచిత్తమున పరిశీలించుట యుక్తము. సిద్ధిస్థానములను గుర్తించి ప్రకాశింపచేయుట యుక్తము. నాట్యవారములు కొన్ని కలవు. వాని ననుసరించిన ప్రయోగముచితము.

పూర్వాహ్ణాపరాహ్ణ ప్రదోష ప్రభాతములందును నియమానుసారమున ప్రయోగ ముచితము. అర్ధరాత్రమున మధ్యాహ్నసమయమున సంధ్యాభోజనకాలమున నాట్య ప్రయోగ మొనరింపరాదు. ప్రభు నియమానుసారమున దేశకాల పరీక్షయు నపేక్షితము కాదు. అవసరాపేక్షితమయిన రాజనియోగము అవశ్యమనుపాలనీయము. పాత్రము ప్రయోగము సమృద్ధి అనునవి నాటకాశ్రయగుణములు. ఇవి యన్నియు సముదితములయి యున్నచో ప్రయోగము సుప్రయోగమగును. మహార్ఘమగు ప్రయోగ సిద్ధిలో నివి యన్నియు సంగతములగుట పరమావశ్యకము.

**అంగికాభినయము :** అనుభావ విశేషములచే రసభావముల నభినయింపవలెను. అభినయమెట్లొనరింపవలెను? అభినయమున కభినయమునకు సంబంధమేమి? ఆక్రమ మెన్ని విధములు? ఈ సర్వము తెలియుట యావశ్యకము. నాట్యసిద్ధి నభిలషించు వానికి సిద్ధిప్రదమగు తత్త్వానుసంధాన మావశ్యకము. స్వసంవాద సంవిద్రూపమయిన రసమార్గములో **లలితరీతి** యపేక్షితము. ఆభిముఖ్యరూపమయిన అర్థనిర్ణయమున ధాతుప్రవృత్తియున్నది. అభినయము సర్వార్థభావములను సహృదయు సమాస్వాదమున కందించును. రసాత్మకసంవేదన ముల్లసింపచేయును. శాఖాంగోపాంగ సంయుక్తమయిన అభినయము నానార్థములను విభావింపచేయునది యయినను మహార్ఘమును నిరూపించును. మహర్ద్ధప్రవణమయినను నానార్థములను నిరూపింపగలదు. నాట్యాభినయము నాల్గు విధములు. నాట్యము సముదాయాత్మకమయిన స్వరూప సంపత్తిత్వము. ఆగంతుకములయి వచ్చువానికి స్వసంవిన్మయ రూపమిచ్చి స్వాత్మీకరించును. అభినయ మఖండమై ఏకవిధమె. అయినను విభాగదృష్టిననుసరించి నాలుగనుటయు యుక్తము. ఆంగికాభినయము శారీరము, ముఖజన్యము, చేష్టాకృతము అని మూడు విధములు. శిరోహస్తకటీవక్షః పార్శ్వపాదములు అను షడంగములతో నాట్యసంగ్రహమున్నది. ఇందంగములకు ప్రత్యంగములు కలవు. ప్రధాన భేదము లంగములు. అంగముల యంగములుపాంగములు. అభినయమునకు సంబంధించి మూడు నాట్యవస్తువులున్నవి. శాఖ, నృత్తము, అంకురము అని వాని పేర్లు. ఆంగికము శాఖ. సూచన మంకురము. కరణాంగహారసిద్ధము నృత్తము. శిరఃకర్మలు పదమూడు కలవు. ఈ భేదములే కాక అన్యములను లోకాభినయమున గుర్తింపవచ్చును. లోకస్వభావము ననుసరించి ప్రయోక్తలు ప్రయోగింపవలెను. దృష్టి భేదములు రసదృష్టులని స్థాయిదృష్టులని సంచారిదృష్టులని ముప్పదియారు దృష్టులుగలవు. "తాసు నాట్యం ప్రతిష్ఠితం". దృష్టులకు లక్షణ వినియోగములు భావనీయములు. తారా కర్మలు తొమ్మిదికలవు. దర్శనప్రకారము లెనిమిది యున్నవి. పుటకర్మలు తొమ్మిది. భ్రూకర్మ లేడు. నాసాకర్మ లారు. గండకర్మ లారు. అధరకర్మ లారు. చిబుకకర్మ లారు. ముఖకర్మ లన్ని యున్నవి. గ్రీవాకర్మలు నవవిధములు ఇవి యన్నియు నంగాభినయ భేదములు. భావరసాశ్రయమయిన ముఖరాగము భావ రసోపేతముగా నభినయింపవలెను. ముఖరాగమే అభినయశోభ. అది లేకున్న

రమ్యాభినయమును శోభింపదు. స్వాభావికము ప్రసన్నము రక్తము శ్యామము నని ముఖరాగము నాల్గు విధములు. ముఖరాగ మాహార్యమునం దొక రీతి. ఆహార్యము నాట్యమున బహిరంగము కాదు. అదియు నంతరంగము. ముఖరాగ మట్టిది. ప్రేక్షకు లాకస్మికముగ చక్షుఃప్రీతి పొందగలరు. ముఖలగ్నదృష్టులు కాగలరు. శారీరాభినయ మల్పమైనను ముఖరాగమున్నచో ద్విగుణశోభ పొందును. నిశలో నిశాకరుడు శోభాధికుడు. ముఖరాగమున శారీరాభినయములు శోభించుటయే కాదు. ముఖాభినయములకును శోభ యున్నది. ముఖమున నయన మయనము. నయనమున నాట్యప్రతిష్ఠ యున్నది. నయనాభినయమును ముఖరాగాంచితమయిననే సమర్ధ మగును. ముఖమున వ్యాపించిన దృష్టి కన్ను నన్వేషించి యచట విశ్రాంత మగును. కన్నులలో కన్ను కలిపిననే కమనీయత యున్నది.

ఉపాంగాభినయము: హస్తోరఃపార్శ్వ జఠరకటీ జంఘోరుపాదము లని మిదియు నాట్యస్వరూప నిరూపకములు. అభినయమునకు సంబంధించిన ఇతికర్తవ్యత లోకధర్మి నాట్యధర్మి యని రెండు విధములు. చిత్తవృత్తిసూచకముగా కేవల బాహ్యావ యవరూపముగా లోకధర్మి యున్నది. నాట్యధర్మియు రెండు విధములు. అలౌకిక శోభాహేతునాట్యధర్మి యొకటి. ఏకాంశమున లౌకికశోభాహేతువగునది రెండవది. నాట్యధర్మి నటసమయమాత్రరూపముగ నుండును. సమయమునందు భావము కలదు. ప్రయోజనమును కలదు. పతాకాదిహస్తము లిరువదినాలుగు. అంజలిప్రభృతి సంయుతహస్తములు పదమూడు. సంయుతాసంయుత రూపోపజీవనమున నృత్త హస్తము లనేకవిధములున్నవి. చతురశ్రాదు లిరువదియొనిమిది, ఇట్లీ హస్తాభి నయము అరువదినాలుగువిధముల నున్నది. ఈ హస్తాభినయవిశేషములన్నియు పరి గణింప శక్యములగునవి కావు. కరణపరిగణన మశక్యమనిఅంగహారముల పరిగణనము శక్యము కాదని కొన్నిటినే చెప్పితిమి. ఇందును కొన్నిటినే చెప్పితిమి. చెప్పని వానిలో కూడ చమత్కారులు కలవు. నాట్యవిదులు స్వయంసముత్ప్రేక్షణమున నితరముల నూహింపవలెను. అనుక్తాభినయసంగ్రహమును ఆవశ్యకము. నాట్యా చార్యేచ్ఛాప్రవాహానుసారముగ అన్నిటి నూహింపవచ్చును. స్త్రీలకు పురుషులకు నీ హస్తములను కూర్పవచ్చును. స్త్రీల విషయమున విశేషసమీక్ష యపేక్షితము. ఉత్తములకు హస్తాభినయ మతిస్వల్పము. సత్త్వావష్టంభమున వారు సర్వము ప్రయో గింపగలరు. యథోక్తగ్రహణసామగ్ర్యముకల స్త్రీల విషయమున సావధానత యుక్తము. ఈ హస్తకర్మలకన్నిటికి రసభావకృతములయిన కర్మలు కలవు. ఇట్టి కర్మ లిరువది యున్నవి.

సర్వవిధహస్తప్రచారములను ప్రయోగములలో నేత్రభ్రూముఖరాగాదులచే వ్యంజితముల చేయవలెను. లోకోపచారమున హస్తాభినయములో సావధానత యావశ్యకము. కరణపరిశీలన మావశ్యకము. ఉత్తములకరములు లలాటమున మధ్య ముల కరములు వక్షోదేశమున అధముల హస్తము లధోదేశమున సంచరించును. దేవ నృపాదులు లలాటసంచారిహస్తములతో నుందురు. మధ్యములు వక్షఃక్షేత్రచరము

లయిన చతురాదిహస్తములతో నుందురు. అధములు శుకతుండాదిహస్తములచే నిరూపింపబడుదురు. ఇట్లే ఇతరవిశేషములు కలవు. ప్రయోగక్షేత్రములయిన నాటకాదులలో ప్రత్యక్షతాప్రాధాన్యముండును గావున హస్తాభినయము స్వల్పముగ నుండును. భావాదులు రంజనాఫలములయినందున హస్తప్రచారములు మధ్యమముగా నుండవలెను. షిద్గకము మొదలయిన నృత్తకావ్యములలో కాలతాలలయప్రాధాన్యముండును కావున అధముల హస్తప్రచారములను ప్రకీర్ణములగునట్లు ప్రయోక్తలు ప్రయోగింతురు. ఈవిధముగా కొందరు తలంచుచున్నారు. కాని ఈ భావమవ్యవస్థితము. నాటకమునను హస్తసంచారమధికముగనె యున్నది. ఉత్తములందు హస్తవర్తనముస్వల్పము కాదు. వారును స్ఫుటముగ అర్థమవగమింప చేయుదురు. అధములు యథావచనమనుసరింతురు. ఇందింకనభిప్రాయభేదములు కలవు. ఉత్తమమధ్యములు లక్షణవ్యంజితములయిన హస్తములుప్రయోగింతురు. అట్లు లక్షణలక్షితములే వారికి యుక్తము. అధములు సౌష్ఠవహీనము ననుసరింతురు. ఎవరికే లక్షణము నిరూపితమో వారన్యాశ్రయవిశేషమనుసరింపరాదు. హస్తవైకల్యాధాన మయుక్తము. హస్తాభినయవర్జనావసరములు కొన్నియున్నవి. వాని యందును సర్వవిధహస్తాభినయము నిషిద్ధము కాదు. సత్త్వసమాశ్రితములు వారలకుండవచ్చును. అనంతరచిత్తవృత్తిని సూచించుహస్తములు వారలకుండును. కొందరిట్టిహస్తములు ప్రయోగింపరాదు. వారికి వాచికమె యుక్తము.

నృత్తహస్తములు : చతురశ్రము మొదలుగాగల ఇరువదియెనిమిది హస్తములు నృత్తహస్తములగును. అర్థవశమున వీని ప్రయోగమునందు సంక్రమమును సంభవించును. ఇట్లే కరణసంశ్రయహస్తములును కలవు. కరణమభినయవిశేషమును సంపాదించును. హస్తకరణము నాల్గువిధములు. అంగుళిక్రియ బాహుభగ్నము. పది బాహుప్రకారములు నిర్దిష్టములయినవి. ఇవికరణగతములయి నలుబది కావచ్చును గాని ద్రుతమధ్యవిలంబితాదివిశేషమున ఇంకను విశేషములు కలుగును. ఉరఃకర్మలు పార్శ్వకర్మలు కటీకర్మలు ఊరుజంఘాపాదకర్మలు ననునివి యన్నియు ముప్పదికి పైగా కలవు. ఇట్లీ యంగాభినయ మున్నది. వీని వినియోగప్రయోగములను గుర్తించవచ్చును. ఇవి యన్నియు సముదితస్వరూపమున ప్రయుక్తములయినచో చారీగతులు మండలగతులు కలుగును. చారీమండలవిధానములన్నియు వీని వైచిత్ర్యోదాహరణప్రదర్శనపరములు.

గతిప్రచారము : ఆంగికముల పరస్పరమిశ్రణమున నొక ప్రత్యేకత యున్నది. చారీమండలప్రసంగము అంతగా చిత్తవృత్తిస్వభావము కాదు. నిరూపితాభినయములకు గతివినియోగప్రదర్శనము యుక్తము. గతి ప్రకృతి ననుసరించి యుండును. అవస్థానుసారమున నుండును. దేశకాలాపేక్షమున నుండును. ప్రకృతిస్థితములయిన గతిప్రకారముల నిరూపణమావశ్యకము. రంగమున ప్రవేశించిన వ్యక్తి సమస్థితిలో

నుండి, నియతమయిన పాదముల యంతరముతో గతిననుసరించుట సముచితము. తమతమ ప్రమాణానుసారమున పాదోత్క్షేపమొనరించుట యుక్తము. దేవతకు చతుస్తాలము ప్రమాణము. పార్థివులకు నట్లే. మధ్యములకు ద్వితాలము. స్త్రీనీచలింగిజనులకు ఏకతాలవిధి సంగతము. ప్రకృత్యనుసారమున ప్రయోగముండుటయే యుక్తము. ఉత్తములగతి ధైర్యోపేతము మధ్యమునకు మధ్యగతి అధమునకు ద్రుతగతి యుక్తము. లోకప్రసిద్ధమయిన సత్త్వసిద్ధి యిందును పరిగ్రాహ్యము. గతిప్రచార మనునది గతులందలి ప్రచారము వైచిత్ర్యము. వికృష్టరంగమున త్రికోణరంగమున చతురశ్రరంగమున గతిప్రచారమునందలి విశేషములను సావధానముగ గుర్తింపవలెను. నాట్యవృత్త్యాశ్రయముగా మూడు ప్రకృతులు కలవు. సర్వప్రకృతులకు అవస్థాంతరసంశ్రయముగా ఇతరగతి నిరూపితము కావచ్చును. ఈరీతి ననుసరించి సర్వము గుర్తింపవచ్చును. కవినటవ్యుత్పాదనమునకై యీ ప్రపంచన మావశ్యకము. ఉత్తమగతి మధ్యములకు మధ్యములది నీచులకు నిరూపింపదగదు. రసవిషమునగూడ గతినిరూపణ మావశ్యకము. శృంగారములోని స్వస్థకామితము ప్రచ్ఛన్నకామితము గతిభేదముతో నుండును. నానారసములందును గతివిశేషములు కలవు. ఇట్లే దేశానుసారమున గతిప్రచార మున్నది. విమానగతి స్యందనగతి ఆకాశగతి భావనీయములు. ఇట్టిదే అవస్థాగతియు పరిశీలింపదగియున్నది. అవస్థ లనేకవిధములు. గతియు ననేకవిధములు. విదూషకగతి హాస్యత్రయముతో నుండును. అంగహాస్యము కావ్యహాస్యము నేపథ్యహాస్యము. త్రిప్రకారహాస్యానుసారమున విదూషకగతియున్నది. శకారగతియు భావనీయము. ఆ హీనాశయునకు అపశబ్దఘటన మిష్టము. ధర్మవిఘాతి యాతని ధర్మము. పగస్త్రీతగతి శకారగతి, గమనములలో స్త్రీలస్థానము నియతము. రంగపీఠపరిక్రమమున పురుషవిధియే స్త్రీలకును విధి. దిక్కాలపరిమాణము లేకపోయినచో శోభోదాత్తరీతి ననుసరించి విశేషముండును. తృతీయప్రకృతి యనదగిన నపుంసకునకు నారీగతి యుండును. స్త్రీపురుషనపుంసకలు విపర్యయముగా కూడ ప్రయోగించుట యున్నది. విపర్యయపరిగ్రహకారణములయిన వ్యాజక్రీడావంచనములు గతివిశేష మాపాదింపగలవు. గతిప్రచారమువలె ఆసనవిధానమును నియతము. దేవనృపతులకు సింహాసనము. పురోహితాదులకు వేత్రాసనము, ఇట్లే యితరులకు నియతాసనవిధి యున్నది. స్త్రీల యాసన విధానమునందును, సింహాసన వస్త్రాసన కుథాపనములు వేత్రాసనములు కలవు. మునుల యాసనవిధియు నియతము. ముండాసనము డింభకాసనము మొదలగునవి ఆసనసత్కారవిధిలో నిర్దిష్టములు. సమునకు సమాసనము మధ్యమునకు మధ్యాసనము అతిరిక్తున కతిరిక్తము హీనునకు భూమ్యాసనము. ఉపాధ్యాయ నృపతి గురువుల యగ్రభాగమున భూమ్యాసనమో కాష్ఠాసనమో నాట్యవిదుల నిర్ణయమున నుండును. నౌ నాగరథ యానములందు గురూపాధ్యాయపార్థివులకును భూమి కాష్ఠాసనములందు సహాసనము యోగ్యము కాదు. శయనకర్మలో నొక విశేషమున్నది. వినియోగవిశేషము ననుసరించి గతిప్రచార

మిట్లు నిరూపితము. ఇది ఇతరముల కుపలక్షణము. అనిరూపిత మర్థవశమున గుర్తింప వచ్చును. ఏతదనుసారమున పరిష్కృతము లగు నితరములను నాట్యవిదులు గుర్తింప వలెను.

కక్ష్యావిభాగము : కావ్యార్థమున దేశము సంభవించును. ప్రయోగస్థానమున సంభవింప నేరదు. ఈ అసంభవ పరిహారమునకు కక్ష్యానిరూపణ మావశ్యకము. నాట్యమంటపానుసారమున కక్ష్యావిభాగ మొనరింపవలెను. రంగదేశ మొకటియె యయినను స్థానభేదమున ప్రాసాదపర్వతాదిరూప మిందే కల్గును. నగరోద్యానాదులు నదీవిభాగములు ఆశ్రమము లటవులు గుర్తింపవచ్చును. ఇట్లు కల్పింపదగువానిని కవి జనస్మరణానుసక్తి యుపలక్షణముగ నిరూపించుటయు నావశ్యకము. కక్ష్యావిభాగమునందు సర్వసర్వంసహాసన్నివేశమును సర్వవర్షములను సప్తద్వీపములను గుర్తింపవచ్చును. సచరాచర త్రైలోక్యము నిరూపింపవచ్చును. ఇట్టి వర్ణనోద్దేశమంతయు కవిలోకస్మరణార్థ మగును. ప్రయోగమునందు స్థానభేదకల్పనమున సంభవించునది యేమి? యను నాశంకానివారణ మావశ్యకము. వననగరవర్షపర్వతాదులలో భావనీయమగు దేశవిభాగమునే ప్రదర్శింపవలెను. ద్వారాదిభేదమును కల్పింపవలెను, రంగమే ద్వారమున ప్రవేశించెనో యా ద్వారముననె నిష్క్రమింపవలెను. ప్రధానపురుషు డెటు నిష్క్రమించునో యా మార్గముననె యితరులు నిష్క్రమింపవలెను. కార్యవశమున నెటుగా నిష్క్రమించునో మఱల ప్రవేశించునపు డటుగనె ప్రవేశింపవలెను. ఎటువచ్చి నివేదించునో యటుగనె పోవలయును. ప్రధానుడగువ్యక్తి సమానులతో సహితుడై పరిక్రమించుటయు నీచులతో పరివారితుడై పరిక్రమించుటయు సముచితము. దివ్యాదివ్యపరిక్రమమున సంక్రమించిన వైచిత్ర్య మీ కక్ష్యావిభాగమున గోచరించును. పిశాచాదిదివ్యాంతముగా నుండువారందరు దివ్యులు. వారాకాశగమనమున పరిక్రమింతురు. ప్రయోగరమ్యతానుసారముగా వారి రాక యుండును. బలాదాహరణము మొదలగునవి వారి వివిధప్రయోజనసంపాదకములయిన క్రియలు. వారందులకై యట్లు వచ్చుట నిరూపింపవలెను. ఛన్నవేషులయిన దివ్యవ్యక్తులకు భూమిసంచార ముండును. నిమిత్తానుసారమున మానవులకు దివ్యరూపముండును. కక్ష్యావిభాగమున దివ్యగతియు భావింపదగియున్నది. వారి వారి సంచారస్థలములు నియతముగ నున్నవి. వానిని సంకేతించుట కవిశిక్షాదీక్ష కగును. కవులు తమతమనాటకనిబంధనములందు స్థలసంకేతముల గుర్తించి నిరూపించుట యుక్తము. నాట్యప్రయోక్తలును ప్రయోగములందు రంగకల్పన మొనరించునప్పుడును కక్ష్యావిభాగము సంకేతించునప్పుడును సావధానముగా దీని గుర్తించుట యావశ్యకము. జంబూద్వీపమున కక్ష్యావిభాగ మొనరించిన విధముననె యితరద్వీపములందు నొనర్పదగును. దేవతలసర్వభావములను మానుషసంశ్రయముగ నిరూపించుట యుక్తము. వారి యనిమిషత్వము మానవులకు కూర్పజనదు. అటు కూర్చుట యుక్తము కాదు.

## ప్రవృత్తిలక్షణము

నాట్యమున ప్రవృత్తి నాలుగు విధములు. ఆవంతి, దాక్షిణాత్య, పాంచాలి, ఆంధ్రమాగధి యని. భువిలో నానాదేశాచారవిశేషములు కలవు. ప్రవృత్తులు నాలుగే యగుట యేమి? ప్రవృత్తి దేశకృతముగ గలుగునదియయినచో ప్రవృత్తులు నాలుగనుట సదురునా? సమానలక్షణసంపదకలవానిలో నాలుగు వేరు వేరు ప్రవృత్తులు కలవు. ఈ ప్రవృత్తిచతుష్టయమున సర్వము సంగతమగును. ఇంతకన్న నతిరిక్తముగా నే వ్యవహారము నెవరు భావింపరు. వృత్తులను సమానలక్షణప్రయోగముండుట తథ్యము. వృత్తిసంశ్రితమయిన నాట్యము భారతి- ఆరభటి- సాత్వతి- కైశికి యని చతుర్విధము. అభ్యుపగమదేశాదిశబ్దమున ప్రవృత్త్యభిధానము యుక్తసంగతము. నాట్యము వృత్తిసంశ్రితము. ప్రవృత్తి లోకిగుణానుసారమున నున్నది. లోకము దక్షిణాపథమని పూర్వదేశమని పశ్చిమదేశమని యుత్తరభూమి యని చతుర్విధముగ విభక్తమయినది. ఇది నిర్నిబంధనము కాదు. వృత్తిసంశ్రితములయిన నాట్యప్రయోగము లున్నందున నా యా దేశము లభిహితములయినవి. ఆ యా దేశములనుండి ప్రవృత్తిచతుష్టయము ప్రయోగము నిష్పన్నమయినది. దాక్షిణాత్యులు కైశికీప్రాయులు, శృంగారప్రచురముగా నుందురు. పశ్చిమదేశముల వా రావంతీపదసంగృహీతులు. వారి ప్రవృత్తి ధర్మప్రధానము. వారిలో సాత్వతి సంగతము. ప్రాచ్యదేశీయులలో వాక్యాడంబర ప్రాధాన్య మున్నది. భారతి యారభటి సంగతము. ఉత్తరభూమి భారత్యారభటి కలదయినను కైశికీసంబంధముండుటచే ప్రవృత్తి సహిష్ణు వయినది. ఇట్టిది చతుర్విధము.

ఈ చిత్రవిచిత్రలోకము ప్రతిపదము నిరూపింప శక్యముకాదు. నాట్యము చిత్తవృత్తిప్రధానము. చిత్తవృత్తి నిరూపణమే న్యాయము. ఈ యంశమునే ప్రవృత్తి స్పష్ట మొనరించును. వాగంగచేష్టావిధానము లిం దున్నవి. వాని యనుసారమున భారత్యాదులు బ్రహ్మప్రయోగములో నున్నవి. ఆ యా దేశముల నామసంకేతములు పరిగ్రాహ్యములు. పురాణము లం దింకను కొన్నిదేశములు ప్రకీర్తితము లయినవి. రంగపీఠపరిక్రమములో వారికి వీరికి వేరు వేరు విశేషములు కలవు. ఈ ప్రవృత్తిధర్మము లిట్లు వేరువేరుగానున్నను సమ్మిశ్రముగా నిరూపించుటయు సముచితము. ప్రయోగవైచిత్ర్యము భావించు ప్రయోక్తలు కార్యవశమున వీని నేక మొనర్చి ప్రయోగింపవచ్చును. ప్రవృత్తిమిశ్రణము అంగాంగిభావసంబంధమున నుండవలెను. కైశికి ప్రధానమయినచో ఇతరము లంగములు. ఇట్లే యితరము లందును గ్రాహ్యము. ప్రయోజనకృతప్రాధాన్యము ననుసరించి వీని నేకీభూతముగా నిరూపింపవచ్చును. ఆ ఏకీభావములో ఒకటి ప్రధానమగుటయు ఇతరములు తదనుయాయులై శోభాసంపాదకములగుటయు ప్రసిద్ధము. ఏ దేశమున నే ప్రవృత్తి యుక్తమో దాని నచట నిరూపింపవలెను. ఆ ప్రయోగము నే ప్రయోగవిదులు పరికీర్తన మొనరింతురు. సహజ

విధానములకు వ్యావర్తనమున్నచో ప్రతీతివిఘాతము కల్గును. రసమయత్వము సిద్ధము కాదు. అసత్యోక్తిశంక నాట్యమును సమూలఘాతము హాత మొనరించును. వృత్తి స్వభావము సమీక్షించి నిరూపించుట యుక్తము. వృత్తు లనేకము లున్నపుడు ఒక వృత్తిని బాహుళ్యమున నిరూపించుట యుక్తము. వృత్తులు నిరూపించుట కవి సంధాన-చాతుర్యమునకు నిదర్శనము. నాట్యప్రయోగము రెండువిధములు. సుకుమార మని, ఆవిద్ధమని. ఈ రెండును నాట్యయుక్తిసమాశ్రయములు. సకలప్రయోగనిర్వాహకుడగు ప్రభువు ప్రయోజన ముద్దేశించి బాహ్యప్రయోగ మాదేశింపవచ్చును. ఇందు ప్రేక్షాగృహ ముండదు. ఇందలి నియమములు ముఖ్యముగా పరిగ్రాహ్యములు. వయోనురూపమయిన వేషము, వేషానురూపమయిన గతిప్రచారము, తదనుగతమయిన పాఠ్యము, తదనురూపమయిన యభినయ మావశ్యకము. ఇది నాట్యశిష్టవచనము.

ధర్మి నిరూపణ మావశ్యకము. అది రెండు విధములు. లోకధర్మి, నాట్యధర్మి. లోకాతిరిక్తముగా నాట్యమున వేరొకధర్మము లేదు. అయినను నాట్యధర్మి యనుట యుక్తము. ఈ నాట్యధర్మి కవినటవ్యాపారమునందు వైచిత్ర్యము సంపాదించును. ఇది లోకానుసారి యయినను రంజనాధిక్యముతో నుండును. లౌకికధర్మమే ధర్మిద్వయమునకు మూలము. నాట్యధర్మము నందలి వైచిత్ర్యోల్లేఖ్యాలేఖ్యమునకు లోకధర్మము భిత్తిస్థానము. లోకవిషయము లోకధర్మి. నటవిషయము నాట్యధర్మి. లోకధర్మి నాట్యములో అంగలీలావిశేషములు వలన వస్త్రనాదికము లుండవు. సర్వము స్వభావాదికముతో నుండును. నానాస్త్రీపురుషోపేతిమై యనేకవిధముల నుండును. లోకధర్మవ్యపదేశమున ఇది లోకధర్మి యయినది. కవి యథావృత్తవస్తువును వర్ణింపగా నటుడు ప్రయోగించుటలో తన బుద్ధిసంపాదితమయిన రంజనావిచిత్రత యుండదు. ఇట్టి కావ్యభాగము ప్రయోగభాగము లోకధర్మాశ్రయమే యగును.

నాట్యధర్మి నటశాస్త్రమునందు ముఖ్యము. నాట్యధర్మిస్వరూపమునందు పదునారు విషయములు ప్రధానముగ కలవు. అతివాక్యక్రియోపేతరీతి ప్రసిద్ధకథాతిక్రమమున రంజకమయిన ఇతివృత్తకల్పనము స్వభావసహజమయిన చిత్తవృత్తి నతిక్రమించి కవికల్పితచిత్తవృత్త్యంతరము కూర్చుట. శోభాప్రధానములయిన లీలావిశేషములు మనోహరములయిన యంగహారములు కరణాదులు నుండుట. నృత్తనృత్యముల ప్రక్రియావిశేషములగు నటవిద్యల సంబంధముండుట, స్వరాలంకారములతో నాట్యము శోభావహముగా నుండుట, పురుషుడు స్వరూపమున నుండి స్త్రీబలము నాశ్రయించి యుండుట. స్త్రీప్రయోజ్యాదగుట సహృదయసంభావ్యమానమగుచు రంజనోపయోగి యగుటయు వస్తూపయోగి యగుటయు నాట్యధర్మి యగును. సన్నిహితుడయిన వాని వచనము వినకుండుట ఇతరులు వినజాలని వచనములు వినుట లోకమున నుండదు. నాట్యకావ్యతంత్రమునందే యుండును. అరూపములు రూపసహితములై నాట్యధర్మిలో నుండును. బ్రహ్మశాపము ప్రవేశించుట యిట్టిది. శైలయానవిమానములు చర్మవర్మ ఆయుధములు మూర్తిమంతములై ఇందుండును. అగమ్య గమ్య యగుట

గమ్య యగమ్య యగుటయు నాట్యధర్మి. లలితాంగవిన్యాసములతో నృత్యనిరూపణము నాట్యధర్మి. లోకసంబంధి సుఖదుఃఖాదిక్రియలు అంగాభినయసంయుక్తములయి ఆతోద్యాదులతో నభినయములతో కూడుకొనినవై నాట్యధర్మి యగును. సర్వాభినయ ప్రకారసారము నాట్యధర్మి. నాట్యవేదనిరూపితార్థము సర్వము నాట్యధర్మి. రంగపీఠనిరూపిత కక్ష్యావిభాగమంతయు నాట్యధర్మి. నాట్యరాగము సామాజికప్రీతి సంపాదించు సర్వము నాట్యధర్మి యగును. నాట్యధర్మియే అంతట వ్యాపకమయినచో లోకధర్మి ప్రయోజనమేమియున్నది? అనిపించును. లోకధర్మలక్షణమయిన సహజభావము సర్వప్రాణిసంబంధియై యుండును కావున యది భిత్తిస్థానీయము. అది సర్వాధారము. నాట్యధర్మి కది యాధారభిత్తి. ఒక డొక భూమిక ధరించి అన్యభూమికాధర్మమును కౌశలమున నిర్వహించినచో నదియు నాట్యధర్మి. నాట్యతత్త్వజ్ఞులు నాట్యధర్మీస్వరూపము తెలిసి ప్రయోగింపవలెను. ఇట్లు సర్వాభినయసంహారమిచట సమాకృష్టమయినది. వాక్యాభినయనిరూపణము ప్రసంగసంగతము. వాక్యమే యభినయము. తత్త్వతః అదియే నాట్యధర్మి.

వాచికాభినయము: వాచికాభినయసంబంధి విశేషములు నాట్యానుప్రాణకములు. వాచికమాంగికమునకు విషయసమర్పకము. కావున ప్రాణకల్పము. వాగభినయమనుట వాగేవ అభినయః. వాగభినయము స్వరవ్యంజనసంభవము, వాచియత్రస్తు కర్తవ్యః నాట్యమున కిది తనువు. అంగనైపథ్యసత్త్వములు వాక్యార్థవ్యంజన మొనరింపగలవు. కవి కావ్యనిర్మాణకాలమున వాగ్యోగ మవలంబించును. నటుడు ప్రయోగకాలమున వాచికయత్న మొనరించును. సకలాతోద్యగీతాభినయములకు వాక్కు అనుగ్రాహకము.

రసము; శబ్దవాచ్యత: చిత్తవృత్తివిషయమున శబ్ద మంతరంగము కాదని అది బహిరంగమని కొందరనుట యుక్తము కాదు. శబ్దము చిత్తవృత్తి కంతరంగము; చిత్తవృత్తి ప్రతిపాదకము నగును. చిత్తవృత్తిరూపములయన రసాదులు శబ్దవాచ్యములు కావని కొందరి నిరుక్తి యున్నది. ఇందన్వయవ్యతిరేకములను వారు సూచించిరి. లక్ష్యపరిశీలనమున స్వశబ్దవాచ్యతయు కలదని స్పష్టమగును. శృంగారశబ్దము వలన శృంగారప్రతీతి కలుగకపోదు. స్వవిషయోద్దేశమున ప్రవర్తించు దేశము స్వనియతసంకేతానుసారమున ప్రతిపాద్యము ప్రతిపాదించును. "శృంగారయతే హసతి కరుణాయతే" మొదలగు శబ్దములు స్వవిషయమున శబ్దనధర్మముకలవై యున్నవి. ఆ యా శబ్దముల కా యా రూపస్పర్శ లేకపోయినచో తదనుభావ సమాకర్షణ మయుక్త మగును. సహృదయహృదయ సాగరసముచ్చలద్రాకామృగాంక ప్రతిబింబప్రతిమములయిన కావ్యములలో స్వశబ్దములు జీవితభూతములై గోచరించుచునే యున్నవి. బహూదాహరణము లట్లు కలవు. శబ్దాస్పర్శమే సంభావించినచో వానికి నిస్సారత చెప్పినట్లగును. కవిత్వాకృతికల కావ్యమున శబ్దస్పర్శ యుండక

పోవుటేమి ? కేవల విభావాదులవలన రసాదులు కలుగవు. పూర్ణకావ్యప్రక్రియా పరిగతియున్ననే రసభావాదుల ప్రతీతి యున్నది. పూర్ణకావ్యప్రక్రియయుండగా స్వశబ్దము రసాది ప్రత్యయము కలుగచేయగలదు. భరతుని రససూత్రమునందు స్వశబ్దము లేకపోవుట దోషము కాదు. వాక్కు తాను ఒక్కటియె వ్యంజన మొనరింపగలదు. ఆంగికాహార్యసాత్వికములు వాచాభూషితములయినచో వాక్యార్థవ్యంజనసమర్థములు కాగలవు. అందుననే వాక్కు నాట్యతనువు. కావున వాచి యత్నస్తుకర్తవ్యః శాస్త్రములన్నియు వాఙ్మయములు. అన్నియు వాఙ్మిష్ఠములు. వాక్కు సర్వకారణము. మహాసరస్వతీరసమయసామ్రాజ్యమునందు, సర్వము సంగతమైయున్నది. వాక్కు విశ్వకారణము. వాగ్దేవీసాక్షాత్కారమే సాధక సంవేదనము. వాక్కు విశ్వకారణము. అది పరమపురుషార్థస్వరూపకము. ఆగమనామాఖ్యాతములు పది వాచికాభినయము నిర్వర్తింపచేయకలవు. పాఠ్యము సంస్కృత పాఠ్యము ప్రాకృతపాఠ్యమని ద్వివిధము. స్వరవ్యంజనాదులు పాఠ్యధర్మమును స్పష్టము చేయగలవు. వాచికాభినయసంక్రాంతమయిన సంస్కృతపాఠ్యము నానా విశేషములతో నున్నది. ఇందనుగతముగా చూర్ణపదము నిబద్ధపదము గుర్తింపతగి యున్నది.

ఛందోవిచితి : ఛందోహీనముగా శబ్దము లేదు. శబ్దవర్జితముగా ఛందము లేదు. ఈ రెండిటి సంయోగము నాట్యమునకు ద్యోతకము. ఛందను లిరువదియారు కలవు. ఆ యా ఛందము లందు కల్పదగు వృత్తముల పరిగణనము నిర్దిష్టమై యున్నది. మూడు మూడక్షరములతో వృత్తనిర్దేశము కలదు. అక్షరత్రయమునకు త్రికమని గణమని వ్యవహారము. త్రికము లెనిమిది యున్నవి. ఛందములకు సంబంధించిన సంపదాదులను దైవతములను గుర్తించుట యావశ్యకము. వృత్తములన్నియు శ్రోత్రరసాయనములు. ఛందోవృత్తము పరశివుని వాఙ్మయరూపము. వృత్తముల నన్నిట శ్రవ్యతాకృతమయిన విచ్ఛిత్తి యున్నది. పదమూడుకోట్లకుపైగానున్న వృత్తములకు నామసంకేతనిర్ణయము శక్యము కాదు. గురులఘునియమవిశేషమున శ్రవ్యత యున్నది. శ్రవ్యత యున్నందున నివి వృత్తము లయినవి. గాయత్రీసమారంభముగా ఛందములకు ప్రయోగార్హత యున్నదని, నిరూపితమయినది. నిర్దిష్టములయిన వృత్తనామములు శ్లాఘనీయములు. వాని నామసంకేతసౌందర్యము గుర్తించుటయుక్తము. వీని గమనము శ్రుతిరమ్యము. నాట్యప్రయోగ సముచితము. ఇంకను శ్రవణసుభగములయిన వృత్తములు కలవు. అవి శ్రవ్యకావ్యసముచితములు కావచ్చును. స్వరశ్రుతుల ఆరోహావరోహరీతి ఛందోవృత్తములలో ననుగతమయియున్నచో నాట్యకావ్యప్రయోగము రమ్యముగ నుండును. స్వభావరమ్యములయిన కతిపయ వృత్తములకే శ్రవ్యములందును ప్రయోగ యోగ్యత యున్నది. మహాకవులు కవు లట్టివానినే నిరూపించిరి. సమవృత్తములు కాక విషమవృత్తములును కలవు. వాని సంఖ్యాన మశక్యము. నాటకాది కావ్యములలో ఛందస్సూరులు, వృత్తశూరులు సమవిషమములను ప్రయోగింపవలెను.

ప్రయోగరమ్యతానుకూలముగా వృత్తిప్రయోగ ముచితము. హాతిశోభనములయిన వృత్తులను నాటకాదులలో ప్రయోగింపరాదు. అట్టివానిని గీతకావ్యములందు ప్రయోగింపవచ్చునా? గీతము పాఠ్యమానము కాదు. గీతము గేయమానము. వృత్తిప్రవృత్తి గీతములలో నుండదు. తాలయోజనానుకూలమయిన మాత్రాసామ్యము వర్ణసామ్యము గీతములలో నుండును. గీతములలో రక్తిప్రాధాన్య మున్నది. అచట కాకుస్వర సంయోజనము సహకారి. పరిపక్వప్రజ్ఞుడయిన కవి రూపకరచనా కాలమున క్రమప్రతిభానముతో నుండడు. అయినను క్రమప్రతిభానము కల్పితమని కొందరందురు. ఉపాధ్యాయు లిట్లందురు. ప్రబంధరచనమునకు యుక్తాభ్యాస మావశ్యకము. దానికై ప్రబంధాభ్యాస మవసరము. ఇదియే క్రమము. క్రమప్రతిభానమును. మహాకవుల కవితా పదవి వారి పదస్పర్శ లేకున్నచో కలుగదు. ప్రమాదములు రాకుండుటకై క్రమానుసంధాను మావశ్యకము. అందరు వాల్మీకులు వ్యాసులు కాళీదాసులు భట్టేందురాజులు శ్రీమదభినవగుప్తులు కారు. ప్రాగ్జన్మసముపార్జితక్రమాభ్యాసమువలన వారట్టివారయినారు. ఈ పరిజ్ఞానము కవినటసహృదయుల కందర కావశ్యకము.

లక్షణాలంకారము: కావ్యలక్షణముల నివేచనము దీనిలో కలదు. కావ్యలక్షణములు ముప్పదియారు. గుణాలంకారములు రీతివృత్తులు మొదలగునవి ప్రసిద్ధములు కాని కావ్యలక్షణములు ప్రసిద్ధికలవి కావు. లోకమున మానవులను లక్షణగుణాలంకార వ్యవహారములు సంగతము కావచ్చును. కావ్యమున సంగతము కాదు. లోకమున వానికి విభాగవ్యవస్థ యున్నది. కావ్యమున నట్టి విభాగము లేదు. కావ్యరచనా కాలమున భేదభావము లేదు. కావ్యప్రతిపత్తి కాలమునకూడ అట్టిది లేదు. కావ్యసర్గములు నిరూపించునపుడును, భేదముల పరిగణించుట లేదు. ఇక లక్షణములని గుణములని అలంకారములని విభాగ మొనర్చుట యెట్లు? గుణాలంకారములు శోభాసంపాదకములు అని దండి యనెను. వానికి భేదమేమి కలదు? లక్షణములు భిన్నములా? ఇట్టి యాశంక కలుగవచ్చును. సత్యమేత[illegible]. కవులు కావ్యముల రచింతురు. వివేచకులు కావ్యవివేచన మొనరింతురు. కావ్యరచనా సమర్థులయిన కవుల సామర్థ్యములు వివేచన వివేకులయిన వివేచకుల వివేచనసామర్థ్యమును సమర్థింపవలసియున్నది. అందులకై కాల్పనికవిభాగ మంగీకరింపవలెను. అప్పుడొక విధముగ వీనికి వివేకము గోచరించును. కల్పనలో కొన్ని విప్రతిపత్తులను కొందరు విమర్శకులు పలుకుదురు. అని ఇట్లున్నవి.

గుణము లాత్మధర్మములు. చిన్మయరసమున గుణములుండును. రసగుణములకు నియతసంబంధమున్నది. అలంకారముల కట్లు లేదు. అలంకారము శరీరనిష్ఠము. లక్షణము శరీరనిష్ఠము కాదు గాని అపృథక్సిద్ధముగా నుండును. శరీరసౌందర్య సంపాదకమగును. శరీరసౌందర్యము సిద్ధము సాధ్యమని రెండువిధములు. లక్షణము లేకున్న అలంకారము సమర్థము కాదు. అపృథక్సిద్ధమయిన లక్షణము సిద్ధసౌందర్యమిచ్చును. పృథక్సిద్ధమగు నలంకారము సాధ్యసౌందర్యము కూర్చును.

మరికొంద రిట్లు భావింతురు. ఇతివృత్తఖండలకములకు సంధ్యంగములని లక్షణములని వ్యపదేశమున్నది. సంధ్యంగములు పరస్పరసంబంధసంధాయకములు కావున కథావస్తువు సక్రమవిస్తరము పొందును. ఆ సంధ్యంగములే రసవిశేషోపయోగులయి వచోవృత్త్యంగము లగును. అవియే కావ్యగతప్రఖ్యాతికి ఉపయోగించునేని లక్షణములగును. మహాపురుషగతపాశధ్వజాది పాదరేఖలవలె కావ్యలక్షణములు కావ్యాతిశయము ప్రతిపాదింపగలవు. ముఖసంధిలోని బీజాంశమునకు నిర్వహణసంధిలోని అర్థమునకు పరస్పరసంబంధము కూర్పగల లక్షణములు విశిష్టములు.

ఈ రెండుపక్షములలో కావ్యమున వర్ణింపతగిన గుణాదివిభాగమే లక్షణార్థమని ప్రథమపక్షార్థము. కావ్యవర్ణ్యసర్వార్థము లక్షణార్థమని ద్వితీయపక్షము. ఒక పక్షమున ధీరోదాత్తాది గుణాధానము వేరొకపక్షమున వస్తువర్ణనాభంగి సారముగ భాసించును.

మరికొంద రిట్లందురు. కవి ప్రథమపరిస్పందమయిన ప్రతిభ వ్యాపారబలమున గుణములు కలుగును. అట్టి కవి రసాభివ్యంజనసమర్థుడు, గుణసముపనిబంధనసమర్థుడు. కవికి వర్ణన యనతగిన రెండవ వ్యాపారమున్నది. దానిచే నాత డలంకారముల కూర్పగలడు. కవికి తృతీయపరిస్పందము కలదు. తదధీనముగా కావ్యశరీర మేర్పడును. ఆ కావ్యాశ్రయముగా లక్షణములు వెలువడును. కావ్యదేహము ననుసరించి కావ్యలక్షణము లుండును.

మరి కొందరి భావమిట్లున్నది. అభినేయకావ్యనైపుణ్యసంపాదనసమాసక్తుడగు కవి సామర్థ్యలాభమునకయి సముచితాభ్యాస మొనరించును. ఆ యభ్యాసమే లక్షణము. సంపూర్ణరూపము పొందని కావ్యము లక్షణసంగతమై సంపూర్ణత పొందును. లక్షణములవలన లోకోత్తరహృద్యత కల్గును. కావున లక్షణము ప్రబంధధర్మము.

కొంద రిట్లందురు. కవి యభిప్రాయవిశేషణమే లక్షణము. అశబ్ద గోచరమయిన కవి భావము లక్షణము గోచరింపచేయకలదు. కావ్యసామగ్రిలో కవిభావ మణగిపోగా సామగ్రియే గోచరించును కాని భావముభాసింపదు. కాని లక్షణములు కవిభావ మాస్వాద్యము చేయగలవు. లక్షణమే కవిభావమును పరిష్కరించును. కావ్యలక్షణమున కీ స్ఫురత్త యున్నది.

కొంద రిట్లందురు. గుణాలంకారములను స్థానసముచితముగా కూర్చుటయే లక్షణము. దేని నెచట కూర్పవలెనో అట్లు కూర్చుటయె లక్షణము. తగిన గుణాలంకారములు కల వనితను చూచి సలక్షణముగానున్న దందురు. కావ్యము నట్లే యనవలెను.

మరి కొందరి భావము. అలంకారనిరపేక్షముగ స్వభావసుందరముగ కావ్యమున నున్న యభినయధర్మము లక్షణమనతగియున్నది. సర్గబంధాత్మకమయిన కావ్యములలో పరస్పరసంబంధసముల్లసితమయిన సౌందర్యమునకు హేతువగునది

కావ్యలక్షణ మగును. మరికొంద రిట్లనిరి. లక్షణములవలననే అలంకారములకు భేదము కలుగును. వైచిత్ర్యము కల్గును. మరికొంద రిట్లనిరి. శాస్త్రములలోని పారిభాషికసంకేతములు వాని విశేషము సూచింపగలవు. అట్లే కావ్యలక్షణములు కావ్యశాస్త్రవైలక్షణ్యము నిరూపింపగలవు. మరి యొక పక్ష మిట్లున్నది. శబ్దార్థముల వలన కలుగు చిత్రత కావ్యలక్షణాధీనము. ఇట్టీపదిపక్షములలో నిగూఢమయిన వస్తుపరీక్ష చేయుట యావశ్యకము.

**అభినవపక్షము :** రసములు కావ్యార్థములు. కావ్యపదమునకుకల వ్యుత్పత్తిత్రయము భావనీయము. రసాభివ్యక్తినొనరించుశబ్దము స్వసౌభాగ్యమున శ్రోతృశ్రోత్రసంక్రాంతమై రసదర్శనయోగ్యత కలుగచేయకలదు. అదియే గుణము. ఆవర్తమానమగు వర్ణము పదము ప్రాక్తనముతో సంబంధించి శోభాహేతువయినచో అలంకార మగును. అర్థవిషయమున కూడ నిట్లే గుర్తించునది. ఈ సంపదయంతయు కావ్యలక్షణముల వలన కలుగును. లక్షణము గుణాలంకారముల కనుగ్రాహకము. కావ్యలక్షణమే కావ్యమున ప్రధానము. గుణాలంకారములు తత్ప్రసంగసమాయాతములు.

భరతగ్రంథమునందు లక్షణపాఠము రెండువిధముల నున్నది. సాంప్రదాయికమయిన యొకపాఠమును అభినవుడు స్వీకరించి వ్యాఖ్యానించెను. భిన్నపాఠమును కొందరు స్వీకరించిరి. లక్షణవిదులు కావ్యములందు రసభావార్థానుకూలముగా లక్షణములను కూర్పవలెను. రసనియతములయిన విభావాదిస్వభావముపొంది లక్షణములు శోభాసంపాదకములగును. భట్టనాయకుడు భామహుడు లక్షణవిషయమున తలచినది, కొంత భావింపతగియున్నది. లక్షణములు ముప్పదియారు. ఇది యితరనిషేధపరము కాదు. ఇంక ననేకములు కలవు. ఈ నిరూపితములు లక్ష్యములందు వ్యాప్తములై గోచరించుచున్నవి. వీనిలో కవి యవధానము మేలు.

లక్షణవిషయమై అభినవగుప్తాభిప్రాయముసు ఇట్లు భావసారముగా గుర్తింపవచ్చును. అర్థాలంకారములకు బీజభూతములయిన చమత్కారములు వక్రోక్తిరూపములయి లక్షణశబ్దమున వ్యవహార్యము లగును. లక్షణములు స్వసౌభాగ్యమున శోభింపగలవు. అలంకారము రత్నాభరణము. లక్షణము పాశధ్వజాదిరేఖ. లక్షణరహితుడు సుందరుడు కాడు. లక్షణరహితకథాశరీరము గుణాలంకారసముజ్జ్వలమయినను నీరసమై ప్రౌఢకావ్య మనతగదు. కథాశరీరసంపన్నములయిన కావ్యములందే ఈ లక్షణములు సంగతము లగును. లక్షణము లసంఖ్యేయములయినను చమత్కృతివిశేషగరిష్ఠములు ముప్పదియారు మాత్రమే. గుణాలంకారములు కావ్యములో నభిధేయములను విమర్శించుటకు సమర్థము లగును. అట్లే రసవిశేషవిషయమయిన విభావాదిభావమును కూడ వివరించుటకు సమర్థములే. వానికిట్లు సామర్థ్యము సంపాదించునది లక్షణము. విభావాదిలక్షణములు కవివ్యాపారద్వారమున శబ్దవ్యాపారార్థవ్యాగములనుగూడ

స్పృశింపగలవు. ధ్వన్యాత్మభూతశృంగారమున నలంకారములు కూర్పుపరీక్ష నిర్దేశించిన యానందవర్ధనుడును. గ్రంథసందర్భమువిస్తరించి కావ్యలక్షణాంశమునే నిరూపించెను. సూత్రవృత్తినిరచించిన వామనుడు లక్షణబలముననే బలము కలవాడయ్యెను. సర్వత్ర కావ్యములందు గోచరించు వైచిత్ర్యము లక్షణకృతమే. శిక్షితులయిన దండి ప్రభృతులు లక్షణకృత శోభాస్పదములయిన అలంకారభేదములను నిర్దేశించిరి. ఉపమారూపకదీపకములకు షట్త్రింశల్లక్షణసంబంధము నిశ్చయించినచో ననేక భేదములు లభించును. లక్షణములలో పరస్పరసంబంధమున గలుగు ఆనంత్యము గణింప శక్యము కాదు. వందలువేలు విచిత్రమార్గములు సహృదయు లూహింపవచ్చును. అభినవోపాధ్యాయ సంప్రదాయ సమాగత ప్రసిద్ధ కావ్యలక్షణనిర్ణయములుకన్న వేరుగా పాఠ మొకటి యున్నది. పాఠపరపాఠతాలిక చూచి వివేకము సంపాదింపతగును.

కావ్యాలంకారము : కవి వ్యాపారబలమున కలుగు అర్థజాతము లోకస్వభావ విలక్షణమయినందున కావ్యలక్షణ వ్యవహారము పొందినది. కావ్యమున కావ్య లక్షణము శరీరము. కావ్యశరీరార్ధ భాగమునందు ఉపమాదీపక రూపకములుమూడును అలంకారములు. కావ్యాలంకారములకు కావ్యలక్షణముల బలముననే వైచిత్ర్య ముదయించునని భట్టతోతు డనెను. అలంకారము లన్నియు ఉపమా ప్రపంచమనుట విద్వద్వరేణ్యులకు విదితము. ఉపమయే యనుట యంతర్లీనము. "గుణ శూన్యంతు కావ్యం నకించిదపి." అని సూక్తి యున్నది. కావ్య మహేయమని అవశ్యస్వీకార మని ఆ సూక్తి పరమార్థము. గుణములు లేకున్నచో కావ్యరూపమే నిష్పన్నము కాదని తద్భావము. లక్షణకృతశోభాపరిష్కార మందును పరిగ్రాహ్యము. అలంకార శూన్యముగ కావ్య ముండును. గుణశూన్యముగ కావ్య ముండకపోదు. లక్షణ శూన్యముగ కావ్య ముండనే యుండదు. శరీరము లక్షణరహితము కాదు. కావ్య మలక్షణము కాదు.

శబ్దాలంకారము : యమకము శబ్దాలంకారము. సమజాతములగు రెండింటికి యమమను సంకేత మున్నది. యమ ప్రకృతికము యమక మయినది. ముక్తాఫలకమునకు సముచిత ముక్తాఫలయోజనము శోభావహము. పద్మరాగాది సంబంధవ్యవధాన మున్నను అది శోభాజనకము. సత్పురుషునకు సముచిత సహాసీన సత్పురుష సంబంధము శోభ నాపాదించును. ఇట్లే యమకము శోభావహము. ఇది పది విధములు. ఈ దశధాపరిగణనమెకాక ఔచిత్యానుసారమున నితర భేదములనుకూడ నభ్యూహింప వచ్చును. కావ్యములందు కావ్యలక్షణములకే ప్రాధాన్యము. లక్షణము లర్థక్రియాయుక్తములు. అర్థము ప్రయోజనము. అర్థక్రియ రస చర్వణము. ఇట్టిరస చర్వణములో లక్షణములకు యుక్తయోగమున్నది. వర్ణ్యమానము లన్నియు విభావాది రూపములయి రస చర్వణాయోగము కలవగును. గుణాలంకారము లన్నియు కావ్య లక్షణములకు స్వరూపాఖ్యానములు.

కావ్యదోషములు : దోష నిరూపణానంతరము గుణనిరూపణ మాత్మగ్రాహి యగును. కాన దోషనిరూపణము ప్రసక్తము. గుణములు దోషవిపర్యాయ రూపములు. గుణప్రతిపక్షములు దోషము లగునా? గుణములకు స్వరూపస్థితి యున్నదా? పరిశీలించుట యుక్తము. కావ్యదోషములు పది. కావ్యలక్షణములు రసచర్వణాయోగము కలవి. దోషము లా యోగభంజకములు. దోషములు పదగతములు వాక్యగతములు నర్థగతములు నగును. శాస్త్రమువలె కావ్య ముపదేశ్యము కాదు. ఎవడేని యేమేని తెలిసికొను గావుత యని కావ్యము ప్రవర్తించును. శాస్త్రము నుపదేశించినవిధమున కావ్యము నుపదేశింపనక్కరి లేదు. అట్లుపదేశింపరాదును. ఒక డొకదాని గుర్తించు నని మరియొకడు మరియొకదాని గుర్తించునని కావ్యము ప్రవర్తింపదు. అభీష్టోపదేశమున శాస్త్ర మట్లుపదేశించును. కావ్యదోషములు కొన్ని నిత్యములు. కొన్ని యనిత్యములు. సామాన్యముగా దోషములన్నియు నాపాతవిషయములు. ఎట్లేని వీనివలన యర్థప్రతీతియున్నది. కాన వీని నంతగా దోషము లన నక్కఱలేదు. అపశబ్దమెల్లప్పుడు దోషమే. దానివలన నెట్టి యర్థప్రతీతియు కలుగదు. అపశబ్దమునకు శబ్దన క్రియాసామర్థ్యము లేదు. అది యర్థక్రియాకారి కాదు. దాని కెందును సంకేత ముండదు.

కావ్యగుణములు : ఇవి పది యున్నవి. దోషవిపర్యయమున గుణములుండు ననుట మొదట గుర్తింపవలెను. గుణములం దేమేని విశేషముకలదా? అన్నియు దోషాభావరూపములేనా? ఈ వివేక మావశ్యకము. అన్నియు దోషాభావరూపములు కావు. సంపత్సాహిత్యమున గుణములకు స్వరూపనిష్ఠ యున్నది. మాధుర్యౌదార్యాంకములయిన గుణములు కావ్యగుణములు. ఈ మాధుర్యౌదార్యము లెట్టివి? ఇవి గుణములోనివే యగునా? ధ్వనికారాదులు గుణములు రసధర్మము లనిరి. అభినవభారతీబ్రహ్మ మాధుర్యౌజఃప్రసాదములనే గుణదృష్టిపక్షమున నభిమానించెను. ఈ మూడు నాట్యవేద సమ్మితములు. భరత సమ్మతములు. మాధుర్యౌజఃప్రసాదసంపత్తి కావ్యలక్షణసంపత్తిసుందరము. ఈ గుణములె కాక గుణములు కలవు. ఆ గుణములు పది. ఇవి పదగతములు వాక్యగతములు తదుభయగతార్థగతములు నగును. గుణస్వరూపవివేచనమున అభినవుడు వామనభావము నవామనభావముగా గ్రహించెను. కావ్యమునందున్న గుణము లలంకారము లన్యోన్యసదృశములై యన్యోన్యభూషణములై సముచితసంబంధవిశేషముకలవై యుండుట యుక్తము. ప్రతిభాతిశయముకల సహృదయులు అభియుక్తియుక్తులై కావ్యమున నవభాసించు నర్థమున కపూర్వవిశేషమునకు సోల్లిఖితముగ సంభావింతురు. అది యుపపత్తి యుక్తము నగును. సహృదయునివలె కవియు సమాహితమనస్కుడై అర్థోల్లేఖము కావించును. అవహితచిత్తమర్థదర్శన మొనరింపగలదు. కవికవితలోని యర్థము రెండువిధములు. ఒకటి యయోని. మరియొకటి ఛాయాయోని. కవిత్వబీజమయిన ప్రతిభోన్మేషము నుద్యోతింపచేయు నవధానము ముఖ్యము. సారస్వతవ్రతుడగువానికి తదేకజ్ఞానమే విషయము.

ఇతర మందు విషయము కాదు. అభియుక్తియుక్తునకు సర్వ మనిమిత్తముగ భాసించును. కవిహృదయగతప్రతిభాతిశయతారతమ్యమువలన భేదప్రపంచ మెంతయో కల్గును. ప్రతిభాగతవిశేషమున నిందును విశేష ముదయించును. భావకుల భావనాగమ్యము భావ్యము. సహృదయుల సద్వ్యవహారసముల్లసితసంస్కారసంపన్నమయిన యవధానాతిశయమున నాస్వాదయోగ్యము కల్గును. ఇట్టి యర్థములు సమాధిగుణసంధానములచే నున్నవి. ఆరోహావరోహాక్షేప ననుసరించిన స్వరసంభారప్రభావము గుణసౌందర్యము సంపాదించును. ఇట్టి నిరూపణవలన పాఠసౌకర్యముకల్గును కాని శ్రోత కేమి విశేషము కల్గునని కొందరు దేవానాంప్రియులు తలంతురు. వైమల్యాపరప్రాయమయిన సుకుమారితకల సహృదయుని హృదయమునకు కవిహృదయతాదాత్మ్యప్రాప్తి యోగ్యత కలుగుచో నుత్కర్షసిద్ధమగును. అట్టివానికే కవిమార్గ మిష్టమగును. విశిష్టసహృదయవేద్యమగునది సర్వసామాన్య సుజ్ఞేయము కాదు. నిఘంటుపాఠపరాయణులకు కావ్యతత్త్వావబోధము కలుగదు. పరుషకఠినపదసన్నివేశజనితఖేద ముచ్చారణ మొనరించు వానికి కల్గునట్లు శ్రోతకును కలుగును. కొన్ని వర్ణములు రసభంజకములు. మరికొన్ని స్వభావసముచితముగ ఆప్యాయన మొనరించునవిగ నిర్వాపణ మొనరించునవిగ పరమాహ్లాదమాపాదించునవిగ నుండును. సముచితగుణసంబంధము లేకున్నచో కవికావ్యము పురాణచిత్రస్థానీయ మగును. సర్వగుణగుంభితమయిన వాక్కు ప్రాజ్ఞులకు మనోహరమై విశిష్టముగ నుండును.

దోషగుణాలంకారములతోడ రససంశ్రయప్రయోగ మావశ్యకము. అట్లే ఛందోయోజన మావశ్యకము. గుణసాకల్యమున హర్షజనితార్థనిరూపకశబ్దములను ఉదారమధురములగువానిని నాట్యాశ్రయకృతులలో నిరూపింపవలెను. ఇట్టి శబ్దప్రయోగ మావశ్యకము కావున తన్నియతవర్ణవివేకము నావశ్యకము. లలితభరతప్రయోగములందు వ్యాకరణశాస్త్రనియతప్రయోగములు యుక్తములు కావు. దండకమండలు మృగచర్మధారులయిన బ్రాహ్మణులు సంచరించుచుండగా యజ్ఞక్రియలు శోభించును గాని వేశ్యలు శోభింపరు. శ్రోత్రియబ్రాహ్మణులు వేశ్యాపరిగ్రహ మొనరింతురేని యజ్ఞక్రియ శోభింపదు. వేశ్య శ్రోత్రియులచే శోభింపదు. యజ్ఞక్రియ శోభించును. యజ్ఞమునకు సంబంధించిన క్రియలు కల యజమానపత్ని యజ్ఞక్రియ కావున కృష్ణాజినదండకమండలుఘృతాభ్యంగాదులు కల పతి యగు శ్రోత్రియు డభీష్టుడగును. అతడు వేశ్య కిష్టుడు కాడు. ప్రేక్షకసహృదయులకు హితోపదేశనమయిన వచన మిం దీ విధముగా నున్నది. మృదులలితపదార్థసంబంధము గూఢశబ్దార్థహీనత జనపదసుఖయోగ్యత యుక్తిమన్నృత్తయోగము బహుకృతరసమార్గత సంధిసంధానయుక్తత యున్నచో నాటకము ప్రేక్షకయోగ్యమగును.

**కాకుస్వరవికల్పనము:** వాచికాభినయోపక్రమములో పాఠ్యము ప్రాకృతసంస్కృతాత్మకమని నిరూపితము. సంస్కృతపాఠ్యము శాస్త్రప్రసిద్ధము. ప్రాకృతమట్టిది కాదు. పాఠ్యపదార్థమీవిధముగ నున్నది. ఉన్నదున్నట్లుపలుకుట కాక

కాకుస్వరమునపల్కుట. సామాన్యముగపల్కుటకాక యత్నవిశేషమునపల్కుట సామాన్యజనులుపల్కునట్లుగాక విశిష్టరూపమునపల్కుట, కంఠతాల్వాదులచేపల్కుట కాక అంతరచిత్తవృత్తివశమునపల్కుట, ఎల్లెట్లోపల్కుటకాక నాట్యాచార్యుడు నేర్పినవిధమునపల్కుట. ఇట్లుపలికిననే పాఠ్యము అను వ్యవహారము కలుగును. ఇది పండితపరిష్కృతమయిన పాఠ్యపదార్థము. ప్రాకృతపాఠ్య మిట్లుండదు. సంస్కారరహితమగుచున సంస్కృతమే ప్రాకృతము. అసంస్కారస్వరూపమున ప్రాకృతముండును. నానావస్థాంతరాత్మకముగానుండుట ప్రాకృతపాఠ్యస్వరూపము. దేశవిదేశవ్యవస్థితమయిన అన్యత్వము ప్రాకృతమునందున్నది. నాట్యయోగమున ప్రాకృతము మూడువిధములు. సమానశబ్దరూపముననుండుట. విభ్రష్టరూపముననుండుట. దేశీగతరూపముననుండుట. దశరూపప్రయోగానుసారమున భాష నాల్గువిధములు. అతిభాష ఆర్యభాష జాతిభాష యోన్యంతరభాష. దేవతలకతిభాష. రాజులకార్యభాష. నాట్యప్రయోగమునపశుపక్షిధ్వనియు భాషగా సంకేతితము. నాట్యధర్మిగా ప్రసిద్ధము. పాఠ్యానర్హులను సమర్హులను పరిగణించుట యుక్తము. మానవులు త్రిమగ్రహావిష్టులయినచో సంస్కృతపాఠ్యము. పిశాచావేశమున్నచో ప్రాకృతపాఠ్యము యుక్తము. స్త్రీల పాఠ్యప్రయోగమునందును విశేషములు కలవు. ఆయాదేశములందు భాషాసంస్కారము సముచితముగానుండునేని దేశభాషనుపయోగింపవచ్చును. సంస్కృతాపభ్రంశమునకు భాష యని వ్యవహారము. భాషాపభ్రంశమునకు విభాష యని సంకేతము. దేశభేదమున భాషాభేదము కలుగుటచే ఏడు భాషలు ప్రధానముగా సంకేతితములయినవి. ఇంకను శకారాభీరచండాలశబరాదులభాషలు వనేచరులభాషలు విభాషాసంకేతమున వ్యవహార్యములు. ఆయా పరిసరవిశేషములననుసరించి ఏనచాదులు బహుళముగా ప్రవేశించినవి. నాట్యవిదుడీవిశేషమును గుర్తించి వీని మార్పులను భావించి నాటకాశ్రయముగా భాషావిధానము కూర్పవలెను. ఇంక నిందు నిరూపింపవలసినవి కలవు. అన్నిటి నిరూపణము శక్యము కాదు. భాషావిదులు లోకానుసారమున వానిని గుర్తింపవలెను.

**వాక్యవిధానము:** నాటకనియమానుసారమున నాభాషింపదగు విధానము గుర్తింపదగును. నాటకభాషాపారిభాషికపదములు కొన్నికలవు. యథాయోగ్యముగ వాని ననుసరించి వ్యవహార మొనర్పవలెను. ఇందు పంచాశత్ పదములు నిరూపితములయినవి. ఇట్టివింకను నుండవచ్చును. ఎవరెవరి నెట్లెట్లు వ్యవహరింపతగునో గుర్తించుట యుక్తము. గంభీరార్థములయిన నామములను నుత్తములకు కూర్పతగును. నామసదృశమయిన కర్మవ్యవహారము ముఖ్యము. కవులంతట నామవిధానమిట్లు గుర్తింపవలెను. తదనుసారముగ కూర్పవలెను. కవిత్వయుక్తుడగు నటుడు భాషావిధానము తెలిసి కావ్యము రచించి ప్రయోగమున వినియోగింపవలెను. కవియే నటుడయినచో విధి యిట్లున్నది. నటేతరుడు కవియయినచో ప్రయోగసామర్థ్యసంపాదన మావశ్యకము.

**పాఠ్యగుణములు:** పాఠ్యగుణములు పాఠ్యమున కుపకారకములు. పాఠ్య గుణము లారు కలవు. సప్తస్వరములు, మూడు స్థానములు, నాలుగు వర్ణములు, ద్వివిధ కాకువు, షడలంకారములు, షడంగములు ఉపకారకగుణములు. షడ్జర్షభ గాంధారాది సప్తస్వరములు రసములందుపపాదింపదగి యున్నవి. కాకువులందు స్వరములె యుపకారకములు. స్థానాదులు పరికరప్రాయములు. స్వరములందె కాకు రూపము కలుగును. స్థానము కేవలమాశ్రయము. స్వరములే శక్తిప్రధానత కలవి. స్వరశక్తిని పాఠ్యమున ప్రధానముగా నవలంబించినచో గానక్రియయగును. కాని పాఠ్యము కానేరదు. స్వరములిట్లు ప్రధానములయినను ఉదాత్తానుదాత్తాది వర్ణములు కాకూపకారములగును. ధ్రువాగానములందు స్వరనిరూపణ మావశ్యకము.

**కాకుప్రధానత:** కాకునిరూపణ మంతయు ననుయాయి యతిశాయియు నగును. కాకువే సర్వముఖ్యము. అలంకారములు కాకువునకె ఉపకార సంపాదకములు. కాకువే అయిదు రూపాంతరములతో పూర్ణమగును. కాకుభిన్నములుగా కన్పడునవి. కాకువునకే రూపాంతరములయి కాకువును పూరించునవి యగును. కాకువే యభినయ సార్థక్యసంపాదకము. అభినవుడిట్లనును. ప్రథమసంపత్స్పందమున ప్రాణోల్లాసనము కలుగగా విశేషరహితమయిన వాక్యము ... అది నాదముగా నుండి హార్దాదులను గోచరింపచేయును. విధినిషేధాదుల బోధించును. పాఠ్యోపకారకములలో కాకువే ప్రధానము. స్థాయిస్వరూపానుసారమున కాకు ప్రయోగముండును. కాకు ప్రవృత్తి భేదము వినియోగము గుర్తించుట యుక్తము. ఉరఃస్థానమున నిరువదిరెండు స్థానములు కలవు. అచటనే శ్రుతులు స్వరములు జనించుచున్నవి. ఇట్లే కంఠమున మూర్ధప్రదేశమున ద్వావింశతి స్థానములున్నవి. మొత్తమున్నియు నరువదియారు స్థానములు. స్వరములకు సర్వస్థానస్పర్శ యున్నచో స్ఫుటమగు గానమే యగును. పాఠ్యము కానేరదు. శారీరవీణయందు ఉరఃశిరఃకంఠము లనెడు మూడుస్థానముల నుండి స్వరకాకువు ప్రవర్తించును. కాకువు రెండు విధములు. అర్థకాకువు; స్వరకాకువు — కక ధాతువునకు లౌల్యమర్థము. ఇది స్వరవిచిత్రతను సూచించును. కావున కాకువయినది. కాకు వనుట జిహ్వ. జిహ్వా వ్యాపార సంపాద్యమయినందున కాకువ్యవహారము వచ్చినది. ఇట్లు కాకుగతమయిన స్వరూపధర్మములను సావధానముగా గుర్తించుట యావశ్యకము.

**వర్ణస్వరూపము:** పాఠ్యమునకు స్వరూపము సంపాదించును. స్వరమునకు సంబంధించిన శక్తిభాగము విడనాడి వర్ణభాగ మనుసరింపవలెను. సాకాంక్షము నిరాకాంక్షమై కాకువున్నది. షడలంకారములును కాకుస్వరూపమును సంపన్నమొనర్పగలవు. శిర మురము కంఠము అను మూడుస్థానములందు రూపద్వయమున వెలువడు స్వర మలంకారమై యుపకరించును. ఈ ఉచ్చదీప్తాది వినియోగము వివేకపురస్సరముగా గుర్తింపతగి యున్నది. భావరసోపేతముగా కాకువుండవలెను. ఇట్టి షడంగ

ములను ఉపకారకము. విసంగతిమయిన విచ్ఛేదాదుల ప్రయోగము పాత్రానుకూలముగా నొనర్పవలెను. వినియోగవచనములకన్నిటికి ఏకవాక్యతా ప్రదర్శనమావశ్యకము. పాఠ్యప్రయోగములో కొన్ని లయవిరామరీతులు కలవు. నిత్యము వీనియందు ప్రయత్న మొనరింపవలెను. అప్పుడే ప్రయోక్త ప్రయోగము రమ్యము కాగలదు.

కృష్యాక్షరములు, భావరసగతులయిన కృష్యాక్షరములు తెలియును. కవిభావకప్రయోక్తల కవశ్యకము. రాగా ప్రయోగ సంపూండు పాఠ్యస్వరూపలక్షణము సంపూర్ణముగా భావించును. దోషరహితము లక్షణయుక్తము గుణసహితము స్వరాలంకారసంయుక్తము పాఠ్యమగును.

ప్రకృతివిచారము: ప్రకృతి మూడువిధములు. ఉత్తమాధమమధ్యమ ప్రకృతి స్త్రీలకు పురుషులకు నున్నది. అధమప్రకృతియున్నను నాట్యముతో నేమి సంబంధము? అనుకొననక్కరలేదు. "త్రైలోక్యభావానుకీర్తనం నాట్యం" ఏప్రకృతియేని అత్యంతము దోషరహితముగా నుండునా? అత్యంతిక దోషాభావము దుర్లభము. దోషసాహిత్యము దోషరాహిత్యము నిరూపించుటయే యిచటి తాత్పర్యము కాదు. నాట్యశిక్షితధీవృత్తులయిన నాట్యవిన్నాణులు నాట్యమున నట్టివారి నభినయింపవలసి యున్నది. ఉత్తమప్రకృతిప్రదర్శనమున దోషగంధము కలుపరాదు. అధమపురుషప్రకృతియే అధమస్త్రీప్రకృతియు నగును. అధమస్థానగమున స్త్రీకృత మస్త్రీకృతమని విశేషముండదు. స్త్రీపురుషాతిరిక్తముగా నపుంసకప్రకృతియు నున్నది. నపుంసకాధముడింక నధముడు. విదూషకుడు శకారుడు మొదలగువారు నాటకములందుకలరు. వారివంటివారింక నున్నారు. వారు సంకీర్ణులుగ నుందురు. ఈ ప్రకృతి విచారము నందు సామాన్యాభినయప్రభుత్వము నిరాఘపచారములందలి విశేషములే యావారతరమున స్వీకృతములయినవి. నాటకీయవనితలు స్వరతాలలయపరిజ్ఞానమున నుందురు. నాట్యగాంధర్వచతురలగుదురు. వీరు చతుష్షష్టికళాన్వితలై యుందురు. ఆయా కళల స్వరూపవిశేషములు గుర్తింపతగినవి. ప్రభువులకు పరిచారకులనేకవిధముల నుందురు. కొందరు ప్రభురక్షణాసక్తులు. శిక్షాదక్షులు. అంతఃపురమున సంచరించువారును నానావిధములున్నారు. వీరందరు భోగవారితలు. శయ్యాభోగములకు దూరముగనుందురు. రాజభోగములందువీరికి భాగములేదు. భోగసామగ్రి సంభారములను కూర్తురు. కాని భోగవారితలే. గౌరవగేయులయిన మహత్తరికలు కూడ అంతఃపురమున నుందురు. అంతఃపురమునందలి కక్ష్యావిభాగములలో నాట్యాగారము నుండును. అందు సర్వవృత్తాంతములు తెలిసిన నాట్యయోగప్రయోగవిదుని నియమింపవలెను. అంతఃపురదేవీప్రయోజనముకై విశిష్టగుణసంపన్నులయిన బ్రాహ్మణుల నియమన మావశ్యకము. ఇది యాభ్యంతరోపచారము. బాహ్యోపచారము బాహ్యభూమిక సంచారము సవిశేషముగ సంభావనీయము. నరపాలక భూమికా పరిగ్రహ

మున అభినయించు నటులు ఇట్టి విశేషము నాత్మగతముగ సంభావించి నటించుట యుక్తము. అప్పుడే సహృదయ ప్రేక్షకలోకమున ప్రాశస్త్యప్రఖ్యాతులు ప్రసరించును. కవి నిరూపింప నటుడభినయింప సహృదయు డభినందింప సమున్నతభావ సందోహము సరసలోకమున ప్రసరింపగలదు.

భూమికాపాత్రవికల్పము: అందరన్ని భూమికల ధరింపరాదు. కొందరే కొన్నిటి కర్హులు. గతివాగంగ చేష్టానుసారమున సత్త్వశీల సంపదనుసారమున నాపరిశీలన మొనర్పవలెను. మానవాంగములలో రాజాంగములు సచివాంగములు దాసాంగములని ప్రతినియతములయిన రూపవిశేషములుండవు. కాని కొన్ని అవయవ సంస్థానవిశేషములు కొన్ని శోభావిశేషములను వ్యాఖ్యానింపగలవు. పాశధ్వజాది రేఖాసముచిత శరీరస్వభావలక్షణము వేరు. సమవిభక్తావయవుడయిన వాని విశేషము వేరు. అట్లుండనివారి విశేషములు వేరు. ఇట్టి విశేషములను గతి వాగంగచేష్టా సత్త్వ శీలాదులచే నిరూపింపవలెను. నాట్యప్రయోగమునందు నాట్యాచార్యప్రయోక్తకు సర్వాధికారము కలదు. గురువగు నాట్యాచార్యుడు సర్వనటుల కారాధ్యుడు. అతని యానతి అందరకు శిరోధార్యము. ఇట్టి యాచార్యదేవుడు తన ప్రాతిస్వికభావములకు ప్రాధాన్యమీయడు. వారివారి భావచేష్టాస్వభావములను పరిశీలించి భూమికాధారణమును సూచించును. లోకవ్యక్తి ప్రయోగవ్యక్తి భూమికాధారణమునకు తగియుండునా! అను పరిశీలనమును నాట్యాచార్యున కావశ్యకము. లోకవ్యక్తిలో భూమికాసాదృశ్యముపరిశీలించి భూమికానుయోగము భావించి సంభావింపవలెను. ఇట్లు భావభావుకప్రవృత్తి యుక్తము. ఇట్లాచార్యబుద్ధ్యా నియమనము నాట్యధర్మి. నాట్యధర్మిసంయోజనము రమ్యత నాధానించును. నాట్యాచార్యబుద్ధ్యనుసారమున భూమికానిర్దేశము సముచితమగును. నటుడు రంగము ప్రవేశించునపుడు స్వస్వరూపమాచ్ఛాదించుకొనవలెను. రంగప్రవిష్టనటుడు లౌకికమానవుడన్న భావము కలుగరాదు. అట్టిభావముకలుగునేని రసభావప్రత్యయముకలుగదు. వీతవిఘ్నమయిన రసప్రతీతియుండదు. స్వరూపావచ్ఛాదనమున రంగమండలము ప్రవేశించిననటుడే సముచితవాగంగసత్త్వములను ప్రదర్శింపగలడు. ఆహార్యవిశేషాదులచే అనుకార్యరూపానుకారమున నటుడు సమర్థుడు కావలెను. ఒకప్పుడొకదేహముతోనున్న ప్రాణి జన్మాంతరమున దేశాంతరమునందు దేహాంతరముపొంది ఆ దేహానుకూలముగనే సంచరించును. కాని పూర్వదేహానుకూలరీతి ప్రదర్శింపదు. పూర్వదేహస్వభావమును విడనాడి ప్రాప్తదేహానుసారముగనే ప్రవర్తించును. పరభావమునే ప్రకటించును. అట్లే నటుడును పరభావమును పొంది "సోఽస్మి" అనుభావమున నటింపవలెను. అప్పుడు సముచితమయిన నటసిద్ధికల్గును. సహృదయాస్వాదముకలుగును.

మానవప్రకృతి అనురూపమని విరూపమని రూపానురూపమని మూడువిధములు. వీనిలో పరస్పర సాంకర్యముకూర్చుట యుక్తము కాదు. స్త్రీలనుసరించు భూమికా

నిర్వహణము సుకుమారము. దివ్యమానుషప్రయోగము స్పృహణీయము. అప్సరః ప్రయోగ మాకర్షకము. నిర్వ్యాజచమత్కారసంపాదకము. నాకమున నాకౌకసులకది యత్లైనది. ఈలోకమున రాజుల యంతఃపురములందు వనితాప్రతిష్ఠితమై వనితాయత్తమై సహృదయసంతర్పకమయినది. నాట్యము భావుకభవ్యమయినది. అంగనాలోకమున భవ్యభావులు నాట్యముపదేశించుట సముచితము. ఈ సుకుమారప్రయోగము రాజుల కామోదప్రదము. ప్రయోగరహస్యవిదులు ఇట్టిదాని నభినందింపగలరు. అట్టివారి యామోద మామోదము. నాట్యబుధుడు భూమికాన్యాస మొనరించి నాట్యప్రయోగ మొనరింపవలెను. అపుడే యది సహృదయావర్జకమగును. పురుషపాత్రయుప్రయోగ మును స్త్రీలయందాయోజన మొనర్చి ప్రదర్శించుట యుక్తము. నాట్యవిలాససంపదలచే ప్రమదలకు విచిత్రలావణ్యసంపత్తికల్గును. యోగ్యస్త్రీలయందు నాట్యభూమికా విన్యాస మొనరించుట యుక్తము. యోగ్యవనితలేకపోయినచో భావరసపుష్టి యుండదు. భావరససిద్ధి నాట్యహృదయము. తదుపాయము యోగ్యవనిత.

నాట్యసమన్వితప్రయోగము రెండువిధములు. సుకుమారము ఆవిద్ధము అని భూమికాధారణమందలి వికల్పవిశేషములు గుర్తించుచు ఈనాట్యప్రయోగ మొనరింప వలెను. "యథానాట్యమాహార్యగుణసంభవః" నాట్యానుసారమున నాహార్యగుణ ముండును. నాట్యధర్మీప్రవృత్తిపరముభావమే యిట్టిది. స్వతస్సంభవియగునదియు కల్పనాసంగతమై సహృదయసంభావనభాజనమగుట కవిభావుకలోకప్రసిద్ధము. ఇట్లు నాట్యము సర్వసంపన్నమగును. నాట్యాచార్యబుద్ధ్యనుసారమున నటుడు సౌష్ఠవాంగ సంభృతుడై సర్వసౌష్ఠవము కలవాడు కాగా రాజావలె నగును. రాజు నటునివలె నగును. నటుడు రాజు. రాజు నటుడు. ప్రయోక్తృగుణములు కొన్ని యున్నవి. ఇరువదిగుణవిశేషములు సూత్రధారునకు కలవు. కొన్ని పూర్వజన్మసంగతములు. కొన్ని వంశప్రాప్తములు. కొన్ని విద్యాసంగతములు. కొన్ని అనుభవికములు. ఇట్టివేకాక ఇంకను నుండవచ్చును. నాట్యప్రయోగమున వెలయు సర్వావస్థలు కలవాడై ప్రయోక్తయుండునేని ప్రయోగనైపుణ్యము భాసించును. అది సర్వనటుల కాచార్యకమై శోభింపగలదు. అందరు గౌరవింపగలరు. శాస్త్రకారులవచనములు సావధానముగ భావించి శ్రద్ధగా నవధారించి చక్కగా ప్రవచన మొనరించి నాట్య ప్రదర్శన మొనర్చుటలో శక్తుడు కావలెను. తానొకడే సర్వజ్ఞుడు కాడు. తనవంటి వారు శాస్త్రానుభవవిజ్ఞానములను గుర్తించి ప్రయోగింపసమర్థుడయిననే ప్రయోగము సుప్రయోగమగును. కళాప్రయోగమునందు ప్రయోక్త నాట్యనిత్యహృదయములను సమ్మోదము సంధానించువాడు కావలెను. భావుకాచార్యసంతోష మావశ్యకము. సంతుష్టులయిన భావుకులు నాట్యవిదు నభినందింతురు. అట్టి యభినందనభాజనుడయి ననే యాతనిసిద్ధి విశదమగును..... ఇట్టిది యంతయు నటశిక్షార్థమయిన యుపదేశము.

**భరతవికల్పనము:** భరతవిద్యానుకూలప్రవృత్తికలవారందరు భరతులు. నాట్యశాలలో సర్వనిర్వాహకకార్యకర్తలందరు భరతులు. భరతులనేకవిధములున్నారు.

విదూషకాదులందఱట్టివారు. నటింపచేయువాడు నటుడు. నటించువాడును నటుడు. లోకానుగతి మలౌకికగతిగ్రైయై యాలోకపరిగతము కావలెను. లోకవృత్తాంతమురసభావసత్త్వసంయుక్తమొనరించునాతడు నటుడు. నాట్య మాతోద్యశాస్త్రార్థహేతువిహితము కావున అట్టినాట్యము చక్కగ ప్రయోగింపగలవాడయినవే నటుడగును. నాట్యకారసంజ్ఞితు డగును. ఇట్టివానికి సహకారమొనరించు వారున్నారు. నాటకవిధానమున నటజాతి యిట్లున్నది ఇట్లుగా నుండవలయుటను నాట్యబుధులు గుర్తింపవలయును. ప్రథమమున నీవిధానము నిట్లు గుర్తించినచో వలయువివేకవర్తనులై అపేక్షితాన్యాంశములను ఊహింపగలరు.

నాట్యావతారము : భరతుడు సర్వజ్ఞుడు. నాట్యసంబంధసర్వవిషయములను సావధానముగ నిరూపించినాడు ప్రతిపాద్యగౌరవము. ప్రతిపాదకవిశిష్టత. ప్రతిపాదనవైశిష్ట్యము సర్వము సంగతమైనది. మునులందరు సంప్రీతులయి సర్వజ్ఞభరతుని సంవేష్టించి సర్వము సంగ్రహించిరి. భరతప్రతిపాదనము మునులకు కుతూహలమాపాదించినది. ఆత్రేయాదిమునులు శ్రద్ధగా గుర్తించుట, భరతవిద్యాప్రయోగప్రశస్తి, వారందరేకచిత్తులై గ్రహించిధరించిరి. అయిన నొక్క సంశయము కలిగినది. వారు తత్త్వవేద్యముకయి యడిగిరి. భరతు డుపపాదించుసమయము కొన్నియాశంకలు వారలనుదయించినవి. కాని ధారావాహిక ప్రతిపాదనమునకు విచ్ఛేదముకలుగరాదని వారాసమయములో వారి సంశయములను నిరూపింపలేదు. మునులు ప్రశ్నించిరి. “స్వర్గమున సంక్రమించిన నాట్యము భూమికెట్లు ప్రసరించినది? మీవంశము నటవంశముకదా! ఆసంజ్ఞ యెట్లు కలిగినది?” సుప్రశులయిన మునుల ప్రశ్నరీతి సంభావించి భరతుడు సమాధానము చెప్పెను. పూర్వరంగప్రయోగమున విశిష్టమగు నాట్యవిద్యావైభవమున్నది. శ్రోతలు ప్రయోక్తలు పూర్వరంగప్రసంగసంగతములయిన స్తుతిగీతాదులను స్వసంవాదసౌభాగ్యమున నాస్వాదించి తుష్టహృష్టులగుదురు. అంతర్ముఖులగుదురు. నిర్వికల్పసమాధిమగ్నులగుదురు. ఆత్మతుష్టివహింతురు. విధిసమాపన్నము నేమాత్రము వినిగూహన మొనరింపరాదు.

భరతపుత్రులొకప్పుడు హాస్యప్రయోగములతో కొందరినధిక్షేపించిరి. సత్త్వసంపదకల ఋషులసమావేశమునందు హాస్యాశ్రయ మాయోజనము చేసిరి. సంప్రదాయవిరుద్ధముప్రయోగించిరి. అది చూచి ఋషులు భీమరోషులయి భరతపుత్రుల శపించిరి. భరతపుత్రులకిట్లు శాపము కల్గినదని దేవతలుదుఃఖపడి దుఃఖవిముక్తిని ప్రార్థించిరి. శాపవిమోచన మభిలషించిరి. భరతపుత్రులకు శాపప్రాప్తి నాట్యవిద్యాక్షేమము కాదు. నాట్యవిజ్ఞానము శాపహేతులలో నశింపవచ్చును. అది నశింపరాదని దేవతలు ప్రార్థించిరి. “ఈ విజ్ఞానమునశింపదు. మా శాప మవశ్యంభావి” అని మునులనిరి. భ్రష్టాచారులయిన భరతపుత్రులను భరతుడు చూచి సాంత్వనమొనరించి దుఃఖపడవలదని హెచ్చరించి సర్వము దైవవిహితమని ప్రబోధించెను. “బ్రహ్మప్రవర్తితమయిన నాట్యమును

రక్షింపవలెను. శిష్యులకిన్యుల కందరకు నాట్యమర్పింపుడు. మహాశ్రేయమయిన నాట్య మభిప్రణాశము పొందరాదు. గిరీనాట్యమర్పించి ప్రాయశ్చిత్తమాచరింపుడు.

కొంతకాలము గడచినది. నహుషుడు దేవరాజ్యము పొందినాడు. రమ్యముగ పాలించినాడు. దేవనాట్యము చూచినాడు. మానవులకా వైభవములేదు అని చింతించి నాట్యప్రయోగమునకు దేవతలనర్థించినాడు. ఈనాట్యము భువిలో ప్రతిష్ఠితము కావలెను. నాభవనమున నాట్యప్రయోగము ప్రసారితమవుగావుత. ఇట్లు నహుషు డర్థింపగా భరతుడు "తథాస్తు" అనెను. నహుషుని కోరిక ననుసరించి ప్రయోగమున కనుజ్ఞనిచ్చినాడు. నాట్యము భువికవతరించినది. భువిలో నాట్యవిద్య నందరారాధించిరి. భరతపుత్రులు వసుధాతలమున మానవస్త్రీలయందు తనయులనుకనిరి. వారందరు నటులైనారు. అది నటవంశమయినది. భరతవంశ మీవిధముగా నాట్యావతారహేతువయినది. భరతవిద్యాభ్యుదయ మిట్లునిరూపితమయినది. ఇదియంతయు నాట్యవిద్యాతంత్రము.

నాట్యప్రయోగము పుణ్యప్రదము ఇష్టప్రదము. నాట్యప్రయోగవిదులు స్తుతి మంగళవిధానములతో దేవతలను పూజించి సంతోషము కలుగచేయగలరు. సర్వదేవతాసంతర్పకమయిన నాట్యప్రయోగము సర్వసంభావనార్హము. గాంధర్వము నాట్యము సమ్యగనుసంధాన మొనరించు సచేతనుడు సద్గతినిపొందును. ఇది నాట్యఫలశ్రుతి. ఇది నాట్యప్రశస్తి. ఇది నాట్యవేదము. ఇది అభినవభాష్యము.

# స హ యో గ ము

| | | |
|---|---|---|
| ౧ | శ్రీ సత్యనారాయణస్వామి దేవసన్నిధి | అన్నవరం |
| ౨ | విస్సా అప్పారావు | కాకినాడ |
| ౩ | దంటు భాస్కరరావు | కాకినాడ |
| ౪ | ఆచార్య ఆత్రేయ | మదరాసు |
| ౫ | పిసుపాటి జానకిరామయ్య | ఇంకొల్లు |
| ౬ | కాశీభట్ల మల్లికార్జునశాస్త్రి | గిద్దలూరు |
| ౭ | కల్లూరి సుబ్బారావు | హిందూపురం |
| ౮ | స్ఫూర్తిశ్రీ భాస్కరరావు | గుంటూరు |
| ౯ | జాస్తి వెంకట నరసయ్య | చిలకలూరిపేట |
| ౧౦ | చతుర్వేదుల విశ్వనాథం | గుంటూరు |
| ౧౧ | లంకా కృష్ణమూర్తి | బెంగుళూరు |
| ౧౨ | శ్రీరంగరాయ మెమోరియల్ రిక్రియేషన్ క్లబ్ | తణుకు |
| ౧౩ | టెక్స్‌టైల్ యూనిట్ వెంకట్రాయపురం | తణుకు |
| ౧౪ | అయ్యంకి వెంకటరమణయ్య | విజయవాడ |
| ౧౫ | విశ్వనాథ సత్యనారాయణ | విజయవాడ |
| ౧౬ | రాయప్రోలు సుబ్బారావు | సికిందరాబాదు |
| ౧౭ | కరుణశ్రీ జంధ్యాలపాపయ్యశాస్త్రి | గుంటూరు |
| ౧౮ | చేబ్రోలు హనుమయ్య చైర్మను | గుంటూరు |

౧౯ జె. బి. విలియమ్స్ ప్రిన్సిపాల్, ఏ.సి.కాలేజి గుంటూరు

౨౦ పసల సూర్యచంద్రరావు తాడేపల్లిగూడెం

౨౧ నర్రా గోపాలకృష్ణయ్య విజయవాడ

౨౨ కారుమంచి వెంకటసుబ్బయ్య మంగళగిరి

౨౩ ముళ్ళపూడి తిమ్మరాజు చౌదరి తణుకు

౨౪ జూపూడి యజ్ఞనారాయణ గుంటూరు

౨౫ కళా సుబ్బారావు దక్షారామము

౨౬ కాజ వెంకట్రామయ్య గుడివాడ

౨౭ పాండ్యేశ్వర జనార్దనరావు గుంటూరు

౨౮ మేకా రామచంద్ర అప్పారావు మదరాసు

౨౯ పిసుపాటి పిచ్చయ్య ఇంకొల్లు

౩౦ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి మదరాసు

౩౧ ముదిగొండ లింగమూర్తి మదరాసు

౩౨ సి. వి. సుబ్బన్న శతావధాని ప్రొద్దుటూరు

౩౩ సుంకర కనకారావు విజయవాడ

౩౪ పిసుపాటి జనార్దనశాస్త్రి ఇంకొల్లు

౩౫ పైడిపాటి సుబ్బరామశాస్త్రి విజయవాడ

౩౬ శ్రీమతి: భామతి అభినవభారతి

౩౭ భవభూతి అభినవభారతి

౩౮ శ్రీ శ్రీనివాసస్వామిదేవసన్నిధి తిరుపతి

# నాట్యవేద ద్వితీయభాగ

## విషయసంగ్రహము

శ్రీః

# నా ట్య వే ద ము

## ద్వితీయ భా గ ము

"భేదేనాత్మాభిముఖతాం నయన్తం భేదకారణం
సామాన్యాభినయాకారగర్వమూర్తిం శివం నుమః"

### సా మా న్యా భి న య ము

అభినయమునందు వక్తవ్యశేష మున్న దంటిమి. సామాన్యాభినయ మిక వక్తవ్యము. అది వాగంగ సత్త్వజన్య మని తెలియుట సముచితము. సామాన్యాభినయమున ప్రయత్న మొనరింప వలెను. అదియె సత్త్వప్రయత్నము. నాట్య మంతయు సత్త్వమున ప్రతిష్ఠితమై యున్నది. గూఢార్థక మయిన యీ సూత్రార్థమును నిరూపించు శ్లోక మిట్లున్నది.

౧. సామాన్యాభినయో నామ జ్ఞేయో వాగంగ సత్త్వజః
తత్ర కార్యః ప్రయత్నస్తు నాట్యం సత్త్వే ప్రతిష్ఠితం.

"సా మా న్యా భి న య ము" అను పదార్థము నీ క్రింది విధమున భావింప వచ్చును. ఈ పదము నందు "సమ+అన్య+అభినయ" అను విభాగములు కలవు. అన్య పద మిం దుపరంజకార్థకము. ఉపరంజకము శోభాసంపాదక మయిన యభినయ మన్యాభినయము. సమ మయిన యుపరంజకాభినయము "సమాన్యాభినయము" అగును. అందిది యుదయించినది కావున సామాన్యాభినయ మయిన దని పరమార్థము.

"ఇహాన్య దిత్యుపరంజకం చ అభినయంచాన్యాభినయం
సమంచ తదితి తత్ర భవః సామాన్యాభినయ ఇతి పరమార్థః"

అని యభినవగుప్త లావిష్కరించినారు. కోహలమత మనుసరించు వృద్ధులు సామాన్యాభినయము నారు విధములుగా నిరూపించు చున్నారు. కోహలు డిట్లనినాడు.

"శిష్టం కామం మిశ్రం వక్రం సంభూత మేకయుక్తత్వం
సామాన్యాభినయే యత్ షోఢా విదురేత దేవ బుధాః.

దీని భావ మనంతరము విశదము చేయుదుము, సామాన్యాభినయములో సామాన్య మని యనుట "సాధారణము" అని తదర్థము. కాగా నిది వ్యక్తమగును. నానావిధము లయిన సర్వాభినయము లందును రూప మొకటి యవశిష్ట మయి యున్నది. అది పూర్వము నిరూపితము కాలేదు. అది కవి నట శిక్షార్థమై యవశ్యవక్తవ్యము నగును. అట్లు సర్వాభినయసంగత మయిన రూపము సామాన్యాభినయ స్వరూపము. దాని జెప్పు విభాగ మంతయు సామాన్యాభినయ మగును. అభినయము లం దది సామాన్యముగా సాధారణభూతముగా నుండును. అది యభినయ విషయ మగుట సామాన్యాభినయ మయినది. ఆభిముఖ్యనయన ముండుటచే గూడ సామాన్యాభినయ మయినది. సాత్వికాభినయమునందు హావ భావ హేలాది విశేషము పూర్వము నిరూపితము కాలేదు. ఇం దభిహిత నిరూపిత మగును. ఆంగికాభినయమునందు "షడాత్మకము శారీర" మను విశేషము కూడ నిట్టిదే. అట్లే వాచికము నందలి యాలాప ప్రలాపాది విశేషములు నిందే నిరూపితము లగును.

పూర్వాభిహితములు కాని యంగాద్యభినయము లందలి యచ్చటచ్చట నున్న యొకానొకవిశేషము చిత్రాభినయ మగునని ముస్ముందు నిరూపితము కాగలదు. అట్టి చిత్రాభినయము కన్నను ప్రకృతసామాన్యాభినయము నందు విశేష మున్నది. చిత్రాభినయములో వాగంగ సత్వములన్నియు వ్యామిశ్రము లగును గావున చిత్రత యున్నది. ఇం దట్లు కాదు. ఈ సామాన్యాభినయములో ప్రత్యేకనియతముగా పూర్వానుక్త మయిన విశేషాంతర మున్నది. అదియె యిచట నిరూపిత మగును. సామాన్యాభినయము కామోపచారము ఇచ్ఛాధీనమున నొనరింప దగినది. సకల ప్రాణివర్గ సాధారణమై సకల జంతువర్గమున కాభిముఖ్య మాపాదింప గలదు. వాగంగ సత్వ స్వరూప మయిన సర్వవిధ సామాన్యాభినయ మభినయమున సర్వజీవముల నావర్జింప గలదు. కామోపచారముగా స్త్రీపురుషస్వభావ మయిన సామాన్యాభినయము స్త్రీపురుషుల యవస్థాభేదమున నభినీయమాన మగును. ఈ పిమ్మట నిరూపిత మగు వైశికోపచార మంతయు దీని శేషాంశము-

కామోపచార ప్రతిపాదకము. "సమానానాం కర్మ సామాన్యం" సమానములుగా నుండు వాని కర్మ కృతి సామాన్య మగును. అట్టి యభినయ మగుట సామాన్యాభినయము. బహుభేదభిన్నము లయిన యభినయము లందును సర్వసాధారణ మయిన యభినయక్రియ యొకటి యుండుటచే నది యథాసంభవముగా నొకే యభినయము నవగమింప జేయును. సమానము లగు వాని కన్నిటికి నా యభినయక్రియారూప మయిన కర్మయె యనుగతధర్మము.

సర్వసామాన్య మయిన యొక యభినయ ముండగా నానా విధము లయిన యభినయము లేల? యని శంక కలుగ వచ్చును. కొంద రిట్లందురు. "ఒక్కొక యభినయములో నొక్కొక్కొటి సాధ్య ముగా నున్నది. ఆ సాధ్యాంశముల యుపస్కారమునకై తగిన వ్యాపా రము ఆ యా యభినయములం దుండును గావున నన్నియు నావశ్య కములు," అని, ఇది యంత బాగుగా లేదు. సూత్రములలో వలె నాటకాదులలో నుపస్కారము యుక్తము కాదు. అట్టి యుపస్కార మిందు దోషమున కగును. కావ్యములు కూడ శాస్త్రముల వలె వ్యాఖ్యాగమ్యములే యగునేని వానికొక నమస్కారము. స్పష్టార్థ వాక్యమాత్రమున సర్వము సిద్ధ మగును. అం దుపస్కార మపేక్షి తము కాదు.

ఈ విషయమున శ్రీశంకుకాదులభావము:- నాట్యము లోకాను సారి కాగా సుఖదుఃఖాద్యావేశములచే వక్త వివశు డగును. అప్పు డాతనికి స్తంభస్వేదాదు లుదయించును. వానిచే నాతని విధానము లన్నియు బృంహితము లగును. గుణక్రియాదుల స్వరూపసాహచర్యా భ్యాసముచే సుసంస్కృత మయిన శబ్దప్రయోగమును వక్త యను సరించును. అప్పటి యాతని యవధానబంధ మంతయు తదాసక్త మగును. సముచితము లయిన శబ్దప్రయోగములచే నుపచితము లయిన యంగోపాంగ వికారసంకీర్ణములనే యాత డవలంబించును. కాన ఏకవిధ మయిన సత్త్వము నానారూపములం దనుగతమై సామా న్యాకారమున భాసించుట యున్నది. అది యనేకముఖ విద్యోతిత మగుటచే నన్యము లవశ్యాపేక్షితములు కాగలవు.' అని.

## సమానీకరణము

నానార్థ ప్రయోజనక మయిన ప్రయోగానుసారమున నానాంగ సంయుక్త మయిన భావమును విభావింప జేయుటచే నభినయ మభినయ మగుచున్నది. ఈ యభినయ మనేకసంవలిత మగుటచే సమానీకృతమై సామాన్యాభినయ మయినది. సకలాంగోపాంగకర్మలు సమానీకృతము లగుటను భావింప నక్కఱ లేదు. అంగోపాంగకర్మలు స్వస్వరూపముతో నుండుట కలదు. అన్నిటి సమాహారకృతముగా నుదయించు విశిష్టాభినయమె సామాన్యాభినయము. అది యలాతచక్రక్రమ కల్పమై ప్రత్యేకశోభాస్పదమై రాణించును. తత్ప్రయోగ మలాతచక్ర ప్రయోగ ప్రతిమమై మనోహరి యగును. సామాన్యాభినయ ప్రయోగ మెట్టిదను ప్రశ్నకు సమాధిగా వక్ష్యమాణాంశమును సామాన్యాభినయస్వరూపమును వ్యాఖ్యానించుచునే యున్నది. శిరోహస్త కటీ జంఘోరు కరణము లందలి సమ కర్మవిభాగము సామాన్యాభినయ మగునని చెప్పెదము.

సామాన్య మనుటచే నాంగికాదిగతము లయిన యశేషాభినయ విశేషము లుపలక్షితములగును. తదభినయము సామాన్యాభినయము. చూడుడు.! సాచీకృత దృష్టి నవలంబించి శిరమును పార్శ్వానతము చేసి కర్ణదేశమున తర్జని నుంచి శబ్ద మొనరించుటను నిర్దేశించుటలో దృష్టివిశేష మున్నది. శిరోవిశేష మున్నది. హస్తవిశేషమున్నది. ఇవి యన్నియు కలిసి యొక ప్రత్యేకాభినయ మగుట యున్నది కదా!. వీనిలో నొక్కొక్క దాని వలన శబ్దాభినయ మందలి యొక మాత్రాంశము మాత్రము నిష్పన్నము కావచ్చును. ఒక్కొక్కదాని నభినయించుట కాక సంభూతముగ నభినయించుటలో నొక విశిష్ట మగు సామర్థ్యమును గలదు. ఒక యంశమునె సముద్బోధింప వలసి యున్న నన్నిటి ప్రయోగించుటయు ప్రయోగమున సప్రయోజనము. విఘ్న సంభావనా విహీనము సకలసాధారణము స్పష్టభావము సాక్షాత్కారకల్ప మయిన యధ్యవసాయ సంపత్తికై యన్నియు నపేక్షితము లగును. అభినయమన్న సంకేతమున నే విశేషము నిరుక్త మయినను అచట సాధారణరూప మయిన

సామాన్యాభినయమును గుర్తింపవచ్చును. ప్రకట దృష్టి వీక్షణాదిక మయిన కుశలయత్నమును ప్రయోగయోక్త స్వీకరించినచో తదుచిత మయిన శిరఃకర్మాంత మది సంపాదితము కావలయును. ఈ సామాన్యాభినయమునం దీ శోభాకల్ప మేవంవిధమున సంగతము కాగలదని యభినవగురుపాదగురువులు నిర్దేశించిరి. ఈ యంశమున నభినవ గురుపాదు లిట్లు సంభావింతురు. రస భావ ప్రకాశచక్రము లందు వాగంగసత్వజము లయిన విశేషము లా యా రసభావము లందు స్పష్టనిదర్శితము లయినవి కదా! వానినెట్లు ప్రయోగింపవలయునో యుద్బోధించుట కీ సామాన్యాభినయప్రఘట్టము సమర్థ మగుచున్నది. సుగంధ పరిమళ ద్రవ్యములను నిర్మాణించు గాంధికుడు కిరాట(వణిక్)గృహమునుండి గంధద్రవ్యములను దెచ్చి సమానీకరించును. అన్నిటిని కలియ గలుపును. "దీని భాగ మింత యుండుట యావశ్యకము. దీని మొదట చేర్పవలెను." అని గాంధికుడు భావించి పరస్పరము యోజనము చేయును. అట్లె యీ సామాన్యాభినయమున నభినయము లన్నియు పరస్పర యోజనము పొందును. రసములలో శృంగారమునకు ప్రాధాన్యము సంభావించి యం దభినయముల భాగయోగమున పౌర్వాపర్యయుక్తి ననుసరించి సమీకరించుట యుక్తము. ఈ విధాన మిట్లు సత్వాతిశయితమై భాసించును, కాగా "సామాన్యానాం కర్మ సమానీకరణం" ఈ సమానీకరణము సామాన్యకర్మమై భావన ప్రాయముగా నభినయములను విషయము చేసికొనును. స్వయమభినయరూపమై సామాన్యాభినయ మగును. ఇది శృంగారముఖముగా నున్నను సర్వ మన్య ముపనేయము కాగలదు. ఈ సర్వము హృదయమున భావించియె "సామాన్యాభినయమును చక్కగా తెలియవలయు" ననినాడు. సామాన్యాభినయ మను నామమె యన్వర్థమగుట సర్వ మవగతము చేయును. దాని గూఢ భావమె యీ విశదీకరణము.

సామాన్యాభినయ మి ట్లభినయ సమాహారరూపమె యగునేని యందు వక్తవ్య మేమియు నుండ బోదని కొంద రాశంకింతు రనియె "సామాన్యాభినయో నామ జ్ఞేయః" యని భరతుడు సాభిప్రాయముగ ననినాడు. నామశబ్దము ప్రసిద్ధిద్యోతకము. ఈ యర్థ మిక సారము.

సామాన్యాభినయ మట్లు ప్రసిద్ధ మయినను వాక్యార్థబలము, ననుసరించి దానిని తద్విషయమున స్పష్టముగా దెలియవలయును. సామాన్యాభినయమున విషయముగా గూడియుండునది వాగంగసత్త్వముల వలన గలుగు నని స్పష్టవ్యాఖ్యాతమె. అయినను తద్విషయమున తన్నిరూపణమున మా కొక యత్న మవశ్యస్వీకార్యమె యగుచున్నది. అభినయాంతరముల కన్న నాహార్యము కొంతన్యూనమే. అయిన నాహార్యము సిద్ధస్వరూప మగుటచే నీ వాగంగసత్త్వములందు దుపాత్తము కాలేదు. ఆంగిక వాచిక క్రియ లట్లు కాదు. అవి పూర్వాపరీభూత రూపస్వరూపములతో నుండును. ఆంగికములోని యవయవవిక్షేపము పూర్వభంగిమకు పల్లవముగా నుండి యుత్తరభంగిమ కాధార మగుచున్నది. ఇట్లె వాచికమును. వాచికాంగికముల విభావన మిట్లె సంభావనీయ మగుచున్నది. వాని విశేష మిట్లు భావ్యమానసుందరము. పూర్వాపరీభూతావయవ సముదాయస్వరూపమున నాంగికాదు లుండుటచే సామాన్యాభినయ మేకీకారాత్మకముగా నుండును. అట్టిది యత్నసంపాద్యము. కావుననె మా కీ యత్నము. ఆహార్య మట్లుకాదు. అది వాని మధ్యమున స్థిరమై యుండును. మార్పు పొందదు. పూర్వాపరీభూతస్వరూపము కాదు. అయినను స్థిరస్థితికము కావున యత్నసంపాద్యమె. దాని నీ సామాన్యాభినయమున సర్వథా త్యజింప వీలుకాదు. అందును సామాన్యాభినయ చింత యున్నది. లీలా విచ్ఛిత్తి విభ్రమము లనెడు వానిలోనిది స్పష్టము కాగలదు. వానిలో మాల్యాచ్ఛాదన విలేపన భూషణముల విన్యాసభేద మున్నది.

ఈ విషయమున గొంద రిట్లనిరి! – ఆహార్య మాంతర భావముల నపేక్షింపదు. దండము కమండలు వక్షసూత్రము మొదలగునవి వ్రతవిశేషమాత్రమునే సూచింపగలవు గాని యొక భావము నే మాత్రము సూచింపవు. ఉజ్జ్వలవేషము రతిని సూచింపదు. మలినవేషము దుఃఖమును సూచింపదు. రతిశోకములు లేకున్న నుజ్జ్వల మలిన వేషము లుండ వచ్చును. అయినను రతిలో సముజ్జ్వలవేష ముండవలయు ననుట, శోకమున మలినవేష ముండవలయు ననుటలు కేవల

మాచిత్యాపేక్షము లయిన మాటలు. కొన్ని బాహ్యాభినయములు సుఖదుఃఖాద్యాంతర భావనిశ్చయముతో నుండవు. కేవలము గుణద్రవ్యముల నభినయించునవి యగుటచే బాహ్యాభినయము లయినవి. చిత్తవృత్తులకుబాహ్యార్థములకును కార్యకారణభావనియమ మున్నది. చిత్తవృత్తుల నియతవ్యక్తి యిట్లు సంబంధనియతము. కావున బాహ్యాభినయములు కూడ భావాపేక్షములుగనె యుండుటను నిశ్చయింపవచ్చును. వాగంగసత్త్వాభినయము లన్యోన్యము సహసద్భావముతో నుండును. పరస్పర సహకారము వానిలో గోచర మగుచునె యుండును. ఆహార్యమునం దీ రీతి గోచరము కాదు. అందుననె సామాన్యాభినయ సంకేతప్రదము లయిన వాగంగసత్త్వములందు ఆహార్యము చేరలేదు." అని. ఇది మునిమతము కాదు. ఉపాంగాభినయము నందును ఆహార్యాభినయము నందును ఈ యంశము నిరూపితప్రాయమె.

## సత్త్వప్రతిష్ఠ

ఈ చెప్పిన విధమున సామాన్యాభినయము త్రితయనిష్ఠముగా నున్నది. వాగంగసత్త్వముల సమాహారస్వరూప మయినను విశిష్టశోభాస్పదమై యున్నది. వాగంగసత్త్వములు దీని రూపాపాదకము లయిన నిందు శబ్దాభిధేయముగా నొకటి యవశ్యము చెప్పవలసి యున్నది. అదియె "నాట్యం సత్త్వే ప్రతిష్ఠితం" పై కారికలో "తత్ర కార్యః ప్రయత్నస్తు" అనుచోట నున్న "తు" శబ్దమును సత్త్వశబ్దానంతరము యోజనము చేయగా "నాట్యం సత్త్వే తు ప్రతిష్ఠితం" అగును. సాత్త్వికాభినయము నందే నాట్యము ప్రతిష్ఠితమై యున్నదని దాని భావము. నాట్యము రసమయము. రసమున సాత్త్విక మంతరంగము. కాన సాత్త్వికమే యభ్యర్హితము, సాత్త్వికగత మయిన విశేష మె ప్రథమ వక్తవ్యము. దీని నొకవిధముగా ప్రశ్నసమాధానరూపముగా మలచుకొని పరిశీలింపవచ్చును. "ఈ నాట్యము సముద్దిష్టము లయిన వాగంగసత్త్వములందె ప్రతిష్ఠితమై యుండగా వాగంగసత్త్వత్రిక భావమె విశదముగా నిరూపితము కావలె ననుట యిందలి యాక్షేపప్రశ్న శంక. దీనికిది ప్రతిసమాధానము. నాట్యము వాగంగజమె యయినచో ప్రయత్నమే మాత్ర మక్కర లేకయే నాట్యసిద్ధి కలుగ వలయును. అట్లు లేదు.

నాట్యసిద్ధి వాగంగసత్త్వజము, కావున నీ సత్త్వమున నాట్యము ప్రతిష్ఠిత మయిన దనుట. సత్త్వ మనునది మనస్సమాధానజన్యము. సమాహిత మనస్సులో నది యావిర్భవించును. అది ప్రయత్నాతిశయము లేక సిద్ధింపదు. సత్త్వమందలి ప్రయత్నాధిక్యమే యుపయోగించును. సత్త్వమున కట్టి బల మున్నది. అప్పుడు వాగంగముల యుపాదానమేల ?— ఇక నీ వాద మేల ? చాలును.

౨ సత్త్వాతిరిక్తోఽభినయో జ్యేష్ఠ ఇత్యభిధీయతే
సమసత్త్వో భవేన్మధ్యః సత్త్వహీనోఽధమః స్మృతః
3 అవ్యక్తరూపం సత్త్వం హి విజ్ఞేయం భావసంశ్రయం
యథాస్థానరసోపేతం రోమాంచాస్రాదిభిర్గుణైః

సత్త్వమున నాట్యము ప్రతిష్ఠిత మయిన దనుటలో హేతుకథన మిందున్నది. అభినయము జ్యేష్ఠము మధ్య మధమ మని మూడు విధములు. అందు సత్త్వాతిరిక్త మయిన యభినయము జ్యేష్ఠ మందురు. సమసత్త్వముతో నున్నచో నది మధ్య మయిన యభినయము, సత్త్వహీనాభినయ మధమము. సత్త్వ మవ్యక్తరూపముగా భావసంశ్రయమై యుండునని గుర్తింపవలెను. రోమాంచాదు లిందు గుణరూపములుగా నుండును. సత్త్వము యథాస్థానముగా యథారసముగా సముచితముగ సంశ్లిష్టమై యుండును. ఇందంతట సత్త్వము సత్త్వమని యనుట సాత్త్వికాభినయ పరము. వాచికాభినయము ఆంగికాభినయమును కూడి యొకచో నభినయమున క్రమముగ గాని యుగపత్తుగా గాని ప్రయుక్తము లయినప్పుడు వాగంగముల కన్న సాత్త్వికమె సమధికముగ భాసించును. వాచికసాత్త్వికముల నభినయించినను, ఆంగిక సాత్త్వికముల నభినయించినను వాచికాంగికముల కన్న సాత్త్వికమె యాధిక్యముతో శోభించును. వాగంగముల ప్రయోగమునందును మూలాధారముగా సత్త్వ ముండు ననుట పృథక్ప్రతిపాద్యము కాదు. సత్త్వప్రధాన మయిన యభినయమె ప్రశస్యతమాభినయ క్రియగా నున్నపుడు జ్యేష్ఠాభినయ మందుము. సత్త్వాతిరిక్తాభినయము జ్యేష్ఠ మనుట సుసంగత మయిన వచనము. సమ్యగభిముఖీభావ మిచ్చి సౌష్ఠవము

పొందినదై సహృదయ సామాజిక ప్రీతిని రసపర్యంతము ప్రసరింప జేయునది సత్త్వమె యని గుర్తింప వచ్చును.

సాత్త్వికాభినయము కూడ వాచికాంగికాభినయ తుల్యమె. అయినను నాట్యము సత్త్వప్రతిష్ఠిత మనుట వలన సత్త్వము ప్రశస్యముగా సంపన్నమగునను భావము కొందరు సూచింతురు. సాత్త్విక మితరముల కన్న తక్కువే యగునేని యభినయక్రియ స్వస్వ రూపమున సంపూర్ణము కానేరదు. సాత్త్వికము లేకపోయినచో నభినయ క్రియానామ మేని యున్మీలనము పొందదు. అభినయన మనునది చిత్త వృత్తులకు సాధారణ్యము సంపాదించుట యను సమాపత్తియె ప్రాణముగాగల యధ్యవసాయసంపాదనము. ఇది సర్వము సాక్షాత్కారకల్పముగ నుండును. ఇట్టి సాక్షాత్కారకల్ప స్వాత్మాధ్యవసాయము సంపాదింప గలుగునది సాత్త్వికమె. అందునవె "సత్త్వే నాట్యం ప్రతిష్ఠితం"

"అవ్యక్తరూపం సత్త్వం హి" మొదలగు ప్రబంధమును శ్రీ శంకుకాదు లీ విధముగా తమభావానుకూల మొనర్చుకొనిరి. వారి భావసార మిట్లున్నది. సత్త్వ మేల ప్రయత్నాతిశయ మపేక్షించును? ఇదిగో! చెప్పుదుము! రామాదు లనుకార్యులు. వారి యవస్థానుకారమున నటు లనుకర్త లయినారు. రామాద్యనుకార్యులం దొక భావ సంశ్రయ మున్నది. దానిని భావించి భావించి తద్భావనాప్రకర్షమున భావక సహృదయుడు రోమాంచాదులను పొందుచున్నాడు. అది సహృదయున కాంతర మయిన సత్త్వసంభూతము. నాట్యమునకు సంబంధించిన యీ సత్త్వము కేవల మవ్యక్త మస్ఫుటముగా నుండును. రోమాంచాదులు మాత్రమె తద్గమకములు. గమకము లయిన రోమాంచాదులు గుణభూతములుగనె యుండును గదా! వీనిచే నభిగమ్య మగు సత్త్వ మవ్యక్తము. అస్ఫుటముగా నయిన నాంతరసత్త్వము లేకపోయినచో (సత్త్వాత్మకము లయిన సుఖదుఃఖాదులు లేకపోయినచో) రోమాంచాదు లుదయింప నేరవు. వాని సముదయ మహేతుక మగును. అవ్యక్తరూపము భావసంశ్రయ మయిన నాట్యము యథాస్థానరసోపేతము. భావస్థానమున ప్రసంగసంగతమై ముఖ్య

మయిన రసము సత్త్వమున కూడుకొనును. అనుకార్యునం దప్పుడు రసప్రకృష్ట ప్రయత్నాధీన మయిన సుఖదుఃఖాదికము రోమాంచాది కార్యములచే విజ్ఞేయ మగును. అట్లది సాధ్యభావమును పొంది యుండు టలో సత్త్వసముదయమె హేతువు. అప్పుడు ప్రయోగ మంతయు సత్త్వమయ మగును. అట్టిది ప్రకృష్టయత్నము లేక కలుగు టెట్లు? కావున సత్త్వము ప్రయత్నాతిశయాపేక్ష మనుట యుక్తము. ప్రకృత రోమాంచాదుల యభినయము సంపాద్యము కావలసి యున్నప్పుడు నటుని సత్త్వ ముపకరించు నంటిమి. సత్త్వోపకారము కేవల రోమాంచాదు లందే కాదు. అంగనల యలంకారము లందును సత్త్వ ముపయుక్త మగును. స్త్రీలకు యౌవనాలంకారములలో సత్త్వోపకార మపరిహార్యము. వక్ష్యమాణాంగనాలంకారములు స్త్రీలకు కటకకేయూరాదుల కన్నను భావవికార విశేషసూచనమున నుపకారులుగా నున్నవి. వనితల యీ యలంకారములు రూపలావణ్యాదుల వలె కుచకచముల వలె వనితాత్వము విద్యోతిత మొనర్ప గలవు. రూపలావణ్యములు కుచకచములును వనితాభావమునకు సూచకములు కదా! కుచకచాదులును కేవల మలంకారములు. వాని కొక యభినేయ మనునది యే మాత్రము లేదు. యువతి యయినను ప్రయోగాభినివేశము కలదయినను ప్రయోజ్యము లగు హేలా లీలా విలాసాదుల ప్రయోగమున సత్త్వము లేకున్న సామర్థ్యము కలది కానేరదు. మనస్సమాధాన మా మానినికి నపేక్షితము. మనస్సు దేహవృత్తి. సత్త్వమె సమాధానము. అదియు నుపచారమున దేహాత్మకము. దేహమున మనస్సమాధానము సంపాదింపవలయును. అప్పుడీషద్వికారముగా భావ ముదయించును. భావమె ప్రౌఢావస్థలో హావ మగును. అతిశయావస్థలో హేల యగును. భావ మనునది సర్వాలంకారములం దంతస్సంచారి. కటకాదులన్నిటిలో హేమమున్నట్లు హావాదులందు భావ మంతర్గతము. అందు భావము మదనానపేక్ష మయిన యాద్యవికారము. ఈ భావోదయమున తరుణి కామయమాన కాకున్నను కామయమాన వలె కన్పించును. ఆ భావమె మదనాపేక్ష మగుట ప్రౌఢతలో హేలా

త్వము పొందుచున్నది. కామినీ యౌవనము క్రమముగా సుప్రదీతము కాగా, స్వాత్మేంద్రియ మనఃస్వాస్థ్యము కుదురు కొనగా, దేహమందలి ధాత్వాదుల వైషమ్యమున దేహవికారముగా హావము హేల కలుగును. ధాతువైషమ్యము పోయినప్పుడు ప్రవిలయము కలుగును గావున హేలయు హావమె భావమె యగును. యౌవనకృతము లయిన శరీర వికారములును హేత్వంతరము నపేక్షించునవి కావు కావున వక్త్రగాత్ర గతము లయిన గుణములుగా భావములుగా నుండును. అంతియె కాని వాని నభినయము లన నక్కర లేదు. కాని యొక విశేష మున్నది. వాగాద్యభినయములు కొంతగా వికసనము పొంది ముఖరాగసంబంధ సంపాదిత సౌష్ఠవములై ప్రతీతములు కాగా నలంకారము లని వ్యవహారము కలుగు చున్నది. ఒకప్పుడు కొన్ని యప్రతీతము లయిన నలంకారము లనదగి యుండును. ఈ యంశసర్వస్వమె యవ్యక్త రూపపదమున నిర్దిష్ట మగుచున్నది. లలితాభినయాత్మక హేలాస్వరూపమున గూడ నిది గూఢమై యున్నది. శరీరవికారములుగా పరిగణితము లయిన యీ భావాదులు మాత్రమె సత్త్వబలమున ప్రయోజ్యము లని కాదు. ఈ యంగజభావాదుల కన్న వేరుగా శీలకృతములగు స్వాభావికము లయిన లీలాదులు పదియును సత్త్వబలముననె ప్రయోజ్యములు కాగలవు. ఇంకను మరికొన్ని నిసర్గజన్యము లగుటచే నీయత్నజములన దగిన శోభాదు లేడును సత్త్వబలముననె ప్రయోక్తవ్యములు. ఈ శోభాదులు స్త్రీగతములు వేరుగను పురుషగతములు వేరుగనునున్నవి. వీనినన్నిటిని నటుడు తత్స్వభావము లేనివా డయినను సత్త్వావష్టంభముననె ప్రయోగించును. సర్వము సత్త్వబల ప్రయోజ్యమె యగుచున్నది. ఇది యంతయు నవ్యక్తరూపాది పదప్రబంధమున శ్రీశంకుకాదుల తాత్పర్యోన్నయన నీతి.

ఈ నీతి ననుసరించిన యీ వ్యాఖ్యాన మంతయు బహుప్రదర్శన విలసితము. భరత గంధవిదుల కిది రుచిరము కాదు. తథాహి; అనుకార్యగత మయిన యీ విశేష మంతయు కవి శిక్షార్థమె యుపదిష్టమా? నటశిక్షణమున కుపదిష్టమా? కవిశిక్షార్థమె యనుకొందము. సత్త్వ మవ్యక్తరూపము కదా! సత్త్వముననె భావసముత్థాన మనియు

నిరూపితము. ఇట్టి సత్త్వము ప్రయోక్తలో నెట్టి స్థితితో నుండును?. నటునిలో సత్త్వ ముండుట, యనుకార్యునిలో భావ ముండుట యనునది యేమి? ఇది యెట్లు సంగత మగును? ఈ సామాన్యాభినయప్రస్తావములో ననుకరణ మభినయ సంపత్తి ప్రస్తుతము. ఈ సందర్భమున స్వేతరముగా పాత్రల యందు ప్రాగల్భ్యము మాధుర్యము నిరుక్త మగుటలో నేమి విశేష మున్నది. భావము హావము హేల యను మూడును ప్రతిలయ విలయ స్వభావమున పరస్పర కార్యకరము లగు టను శంకుకుడు చిత్రరమణీయముగా చిత్రించి వ్యాఖ్యానించెను గాని యది యుక్తముగ లేదు. ప్రతిసంహారములో కార్య మెన్నడు కారణ మని వ్యపదేశము పొందదు. ప్రవిలయ క్రమమున పరిశీలింపగా పంచ భూతము లనదగిన పృథివీ జలాగ్ని వాయు గగనములు తన్మాత్ర లయిన గంధ రస రూప స్పర్శ శబ్దములకు కారణములు కాజాలవు. పంచతన్మాత్ర లహంకారమునకు కారణము కావు. అహంకారము బుద్ధికి కారకము కాదు. బుద్ధి ప్రకృతికి కారణము కాదు. ప్రకృతి బుద్ధి యహంకారము తన్మాత్రలు పంచభూతము లను క్రమము ననుస రించి యిది పర్యాలోచితము. ప్రతిసంహారములో ప్రకృతి యుండును. అట్లె కార్యదశలో గూడ సంభవించును. తత్ప్రాదుర్భావ మపూర్వము కానందున నది యహంకారాది కార్య మనదగదు. క్రమక్రమమున కార్యకారణభావ మనునది సంగతము కావచ్చును. భావమె హావ మయినచో భావత్వమె పోయినది. హావము హేల కాగా హావత్వమును పోయినది. ఇక హేలయు హేలగా నుండక విలయమె పొందవచ్చును. ఈ యువ్యవస్థ తగదు. హావము హేలాత్మకముగ నున్నదనుట యేల? హావము హావముగనె యున్నదనవచ్చును. హేలాదుల స్థితి కార్య కారణభావ వ్యవహార సమాశ్రయమున నుండునని యంగీకరించుట తగును. మరియొకటి గమనార్హము. భావహావాదులు దేహవికారము లని యవి ప్రయత్ననిర్వర్త్యములని యనుటనే పరిశీలింపవలెను. ఈ ప్రయత్న నిర్వర్త్యత యెట్టిది? ఈ నాట్యసంసారములో ప్రయత్న నిర్వర్త్యము కానిది యుండునా?. ప్రయత్నసంపాద్యత కేవ లము సాత్త్వికాద్వైతాభరణమా? రసభోగములో నొక యత్న

మున్నది. అది విభావానుభావవ్యభిచారులందు సంక్రాంతము. విభా వాదివ్యతిరిక్త మయిన యత్న మేదేని యుపయోగించుననసి సంక్ర మించిన దని సంభవించు నని భరతభావ మయినచో "విభావాదుల సంయోగమున రసనిష్పత్తి" యని భరతు డనుట వృధాప్రతిజ్ఞాత మనవలసి వచ్చును. భరతుని ప్రతిజ్ఞాత మనర్థమని యందుమా? గీతా తోద్యాదుల బలమున రంగబలమున సామాన్యాభినయము వ్యవస్థిత మగునప్పుడు సత్వ నిర్వర్త్య మయినను అభినయస్వభావము లేనపుడు నాట్యమున నుపయోగ మేమున్నది? నాట్యోపయోగమే లేనపుడు "సామాన్యాభినయము" అని యపరామృష్టాభిధానము యుక్త మెట్లగును? గీతాతోద్య రంగభంగిమలకు దూరముగా గూడ సత్వసంపత్తి సద్భావ ముండును. అట్టిది కూడ స్వీకార్యము. అభినయావతారము లేదని శ్రీశంకుకునకు స్వీకార్యము కాదు. ఇట్టి శ్రీశంకుకభావమును కూడ మునిమతానుప్రవేశము లేనివారు శ్రద్ధగా సంభావించిన సంభావింతురు. పోనిండు! వారి శ్రద్ధ వారిది,

భరత ప్రక్రియానుసంధానమున జెప్పవలయునది మిగిలియే యున్నది. ఇట నిది ప్రకృతవ్యాఖ్యానము. "సత్వే నాట్యం ప్రతిష్ఠితం" కాన సాత్వికభావ గతిక్రమము నిర్దేశింప వలెను. అదియె "అవ్యక్త రూపం సత్వం హి విజ్ఞేయం" అని కొంత నిరూపిత మయినది. స్వస్పంద రమణీయ మయిన చిత్తవృత్తియె సంవేదనభూమిలో సంక్రమించినదై దేహమును గూడ వ్యాపించును. అట్లు సంక్రాంతచిత్తవృత్తియె సత్వము. అవ్యక్తమగు సత్వము భావసంశ్రయ మని తెలియదగును. అది సంవిద్భూమి యందును ప్రాణభూమి యందును సంపాతమున నుండును. ఆ సత్వగుణవిశేషములు కొన్ని దేహపర్యంతము ప్రసరింప గలవు. అప్పుడు స్వేదము రోమాంచము మొదలగునవి కలుగును. ఈ యంశము భావప్రకరణమునందు గుప్తమై యున్నది. ఇది యథాస్థాన రసోపేతమనుటచే నీ యర్థము నిశ్చేయము. రసమరిన కొకస్థానము నియతము. శృంగారమున నుత్తమ స్త్రీపుంసు లుండవలయును. రౌద్రమున రక్షోదానవాపేక్ష యున్నది. భయానకమున నధమప్రకృతి యావశ్యకము. ఈ విధానానతిక్రమమున రససంబద్ధముగా నుండునదియె సత్వము.

కాగా, నాట్యప్రతిష్ఠిత మయిన సత్త్వము భావాధ్యాయప్రఘట్టములో నవ్యక్తరూపమున నున్నది. అది సముచితరససంబద్ధము. రోమాంచాది విశేషములచే సత్త్వము భాసించును. అని పండితార్థము. చిత్తవృత్తిరూప మగు సత్త్వము కాయసంక్రాంత ప్రాణదేహధర్మతా వశమున గలుగున దని భావరసనిరూపణ ప్రఘట్టమున నిరూపితచరమె. మఱల మఱల తన్నిరూపణ పునరుక్తి రుచిరము కాదు.

## చేష్టాలంకారములు

౪ అలంకారాస్తు నాట్యజ్ఞైర్జ్ఞేయా భావరసాశ్రయాః
యౌవనేభ్యధికాః స్త్రీణాం వికారాఃవక్త్ర గాత్రజాః.
౫ ఆదౌ త్రయోఽంగజాస్తేషాం ద స్వాభావికాః పరే
అయత్నజాః పున స్సప్త రసభావోపబృంహితాః

ఈ చెప్పిన సత్త్వరూపనిరూపణమున కొక ప్రక్రియ యున్నది. సంవేదన రూప ప్రస్మృతి మయిన సత్త్వము కొంత విచారితమైనది. వేరొక సత్త్వము కలదు. అది దేహధర్మముగా నున్న సాత్త్వికము. అది సాత్త్వికు లయిన యుదాత్తులందు గోచరించును. ఉదాత్తవనిత లందును, ఉదాత్తపురుషు లందు నుండును. స్త్రీల యుత్తమత్త్వము శృంగారరసపర్యవసానము కలిగి యుండును. పురుషుల యుత్తమత్త్వము వీరరసవిశ్రాంతి మగును. శాంతము సర్వప్రధాన మగుట ప్రయోగార్హ్యముకాదనుట నిరుక్తప్రాయము. స్త్రీగత శృంగారమున పురుషనిష్ఠ మయిన వీరమున సర్వలోకానుగతి మయిన పుమర్థ మంతయు వ్యాప్త మయి యున్నది. సత్త్వమయమయిన యుత్తమస్త్రీరూపమును విడిచి యితరమున ని చేష్టాలంకారములు సముచితవినివేశము పొందనేరవు. రాజస తామస స్వభావక శరీరములం దీ సాత్త్విక చేష్టాలంకారములు సంభవింపవు. చండాలీ వనితలకు రూపలావణ్యసంపద లుండ వచ్చును. వారు సాత్త్వికలు కారు. రాజసలు తామసలు. అయినను రూపముండును. లావణ్య ముండును. ఈ చేష్టాలంకారములు వారలకు నుండవచ్చును. వారలకు నివి యుండునేని యుత్తమత్త్వము నె సూచింపగలవు. ఉత్తమవర్ణము వారి సంపద్భ్రంశము సూచించునవై యవి యుచవ భాసించును.

మా భట్టతోత భావ మిట్లున్నది. ఇందు మహదాశ్రయ మనునది చేష్టాలంకృతుల లక్షణము కాదు. అవి కొందరి యువతులలో గోచరించును. అట్లవి కల వనిత యుత్తమయని శృంగార సముచిత యని తలంప నవకాశముండును. విశేషవిరహితము సామాన్యరూపము నయిన శృంగారము నాచేష్టాలంకారముల భాసింపజేయునే గాని విశేషధర్మమును గోచరింపజేయ లేవు. ఆ సామాన్యాత్మక శృంగారములో విభావాదుల సువివేక ముండదు. వ్యభిచారిభావాత్మక మయిన దశాంతర సంస్పర్శ ముండదు. ఈ సామాన్యాభినయములు లావణ్యాదుల వలె నభినయింప వలనుపడనివి కావు. ఇవియు శరీరవికారములు. అనుభావములు. కావుననె "విభావానుభావ వ్యభిచారి సంయోగాత్" అనియె భారతవాణి. ఇట్లె పురుషగతము లయిన శోభాదులు కూడ సామాన్యాభినయము లయినవి. అవి కూడ "నీతడుత్సాహప్రకృతి" యని యింత మాత్రమునె గమింపజేయును. అంగనా శృంగారోచిత మయిన యత్కించిచ్చేష్టిత మభినయించి నప్పు డట్టిపట్ల చేష్టాలంకారము లవశ్య మభినయింప వలసి యుండును. సర్వసామాన్యముగా సర్వావస్థానుగతముగా వాని యభినయ ముండును గావున సామాన్యాభినయము లగును. ప్రధానపురుషుని శోభాదులు నట్లె భావింపదగి యున్నవి. స్వ స్వ భేదములతో గూడిన వాగంగసత్వాహార్యములు యథాసంభవముగా గుమికూడి కిలికించితమున విచ్ఛిత్తిలో విభ్రమములో నంతఃప్రవిష్టము లగుచున్నవి. సామాన్యాభినయము లగుచున్నవి. వాగంగాహార్యయోగ మున్నను వీనిలో సత్వప్రధానత యుండుటచే సాత్వికము లని వ్యవహారము కలిగినది:

ఇట్టి సామాన్యాభినయములు ప్రధాన ప్రమదా పురుషద్వారమున విశ్వమే వ్యాపించినవి. వాని నీ ప్రఘట్టమున జెప్పవలసియున్నది. ఇవి యలంకారములు. ఇతరములు భావనిరూపణమున నిరూపితములు. ఈ యలంకారము లిచట వక్తవ్యములు. వీని నచట చెప్పలేదు. ఇవి కేవలము శోభాసంపాదకము లయిన యలంకారములు. దేహమాత్రనిష్ఠములు. చిత్తవృత్తి రూపములు కావు. అందుననే భావాశ్రయము లని భరతు డనుట. భావసంశ్రయము లని యనినంతన సర్వభావసమా

శ్రయ మున్నట్లూహింపరాదు. రతిభావమును మాత్ర మివి యభిన యించు నవి యగును. ఇవి యౌవనమున నుద్రిక్తములై యుండును. బాల్యమున నుద్భిన్నములు కావు. వార్ధకమున తిరోభూతము లగును. "తరుణీమణుల యీ భావములు కుట్టమితాదులును రాత్రిసమయమున, గోచరములు కానట్లున్నఘటపటాదుల వలె కామప్రదీపము ప్రకటీక రించు నని యొక యభిజ్ఞు డనినాడు.

స్త్రీలకు యౌవనమున నభ్యధికముగ గోచరించు నీ వికారములు వక్త్రిగాత్రజములు. దేహవికారమాత్రమున నె యివి యుండును. అంతఃప్రాణభువిలో నుండు బాష్పాదులు కంఠరోధాదులను గలుగ జేసిన ట్లివి కంఠరోధాదుల నీయవు. ఈ చేష్టాలంకారాదులు వక్త్రిగతము లనుట ప్రధాన మగుట వక్త్రి మువార్త మని సూచించును. వక్త్రోనితం బాదు లిచటి గాత్రములు. దేహవికారము లగు వీనిలో గొన్ని క్రియాత్మకములుగా నున్నవి. అయినను పూర్వజన్మాంతరితములై సత్వోద్బుద్ధ మయిన భావసంస్కారమాత్రమున సముచిత దేహ మున్న నె యవభాసించును. అట్టివె "యంగజములు" కాగలిగినవి. భావము హావము హేల యనునవి యంగజభావములు. కొన్ని భావము లిప్పటి జన్మసముచితము లయిన విశిష్టవిభావానుప్రవేశముచే రతి భావము పరిస్ఫుటము కాగా తదనువిద్ధ మయిన దేహమున పరిస్ఫు రింప గలవు. ఇట్టి వివి స్వాభావికములు. సహృదయ హృదయ గోచర మగు స్వకీయ రతిభావమున నావిర్భవించును. స్వభావబలము ననుస రించి యొక తె కొకటియె కలుగును. మరి యొక ర్తుకకు మరియొకటి కలు గును. ఒకభామకు రెండు మరొక లేమకు మూడు కలుగును. కాన నివి స్వాభావికము లనుట యుక్తమె.

భావ హావ హేల లన్నియు సత్వాధిక లయిన యుత్తమాంగన లందరి యందును సంభూతములగును. అట్లె శోభాదిస ప్తక ముత్తమ సత్వాధిక పూరుషు లం దుదయించును. ఇట్లంగజభావములు స్వాభా వికము లనదగి యున్నవి. అవి క్రియాజన్మములు. అయత్నజములయిన భావము లయిన శోభాదులు గుణస్వభావములు. యత్నసంజాతములు క్రియాత్మకము లందురు కాని యందలి యత్న మిచ్ఛ. అది దేహక్రియ.

ఇట్లి పదార్థవిదు లభిమానించిరి. వీనికి వేరుగానుండునవి యయత్న జాతములు. ఈ చేష్టాలంకారములందు మొదటి మూడు భావ హావ హేల లయత్నజన్యములు. వీని నాద్యభావము లనవచ్చును. ప్రాచ్యవాసనానువిద్ధ దేహమాత్రమున మొదటగనె యివి ప్రభవించును. ఇతరములు పది స్వాభావికములు. ఇవి యన్నియు భావోప బృంహితములె యగును. స్వాభావికము లని యనుటచే నయత్నజము లని భావము. స్వస్వ రతిభావమునను యివి ప్రాణితము లగును. శోభాదిసప్తకమును రసభావోపబృంహితమయి యయత్నసంజాత మని భావింప వలెను. ఇవి యన్నియు సత్వ మున్నపుడె సంజాతము లగును. పుస్తచిత్రాలేఖ్యాలిఖితముల కివి సంగతములు కావు.

## సత్వతత్వము

౬ దేహాత్మకం భవేత్సత్వం సత్వాద్భావః సముద్గితః
భావాత్సముత్థితోహావో హావాద్ధేలా సముత్థితా
౭ హేలా హావశ్చ భావశ్చ పరస్పరసముత్థితాః
సత్వభేదె భవంత్యేతే శరీరే ప్రకృతిస్థితాః-

సత్వము దేహాత్మకముగా నుండును. ఉత్తమ శరీరసిద్ధి కలుగగనె సత్వము శరీరస్వభావముగా సంభావిత మగును. భావ హావ హేలల కుపక్షేపక మయిన పీఠబంధ మిందున్నది. సత్వమున భావము కలుగును. భావమున హావము సంభావితము. హావమున హేలయు సంభావితము కాగలదు. తీవ్రతర సత్వ మున్నచో దేహమె సర్వోపక్షేపకము. సత్వము దేహాత్మకముగా ననువిద్ధము కాకపోయినచో నప్పుడు ప్రాక్తన రతివాసనా జన్యమయిన్నదిగనె యుండు సత్వము సహకారి. వేరొకదాని నపేక్షించును. అట్లు సహకార్యంతర మపేక్షిత మగుట యిట్లు సూచిత మగుచున్నది. హేలా హావ భావములు పరస్పరసముత్థితము లగుట యిట్టిదె యగును. శరీరమున సత్వభేదమున్నప్పుడు హేలాదులు పరస్పరజన్యము లగును. “హేలా హావశ్చ భావశ్చ” అనుచోట హావ పదానంతర మున్న “చ” కారము “అపి” యను నర్థమిచ్చును. భావపదానంతర చ కారము సముచ్చయార్థకము. రెండు “చ” కారములు సముచ్చయార్థకము లనదగదు.

అట్లై యయిన మూడవ "చ" కారము నావశ్యకమగును. ఇచటి భావ మి ట్లభ్యూహ్యాము. ఈ భావాదులు ప్రకృతిస్థితములై దేహ స్వభావమును మాత్ర మపేక్షించునవైనను పరస్పర సముత్థితము లగుచున్నవి. కుమారీశరీరము నందు ప్రౌఢతమ కుమారిక లందున్న హేలా విలోకనమున హావ ముద్భవింప గలదు. భావము పూర్వ ముల్లాసము పొంది యున్ననె హావ ముదయించును. భావ ముల్లాసిత పూర్వము కాదేని మొదట భావమె యుద్భవించును. హావమె ప్రౌఢకుమారికలో గన్పడిన భావము కలుగవచ్చును. హేల కలుగ వచ్చును. మొదట హావావస్థయె సముద్భిన్న మయినచో ప్రౌఢకుమారికలో హేల దర్శించిన హేల వలన హేలయు గలుగును. ఇట్లై హావమున హావము భావమున భావము కలుగవచ్చును. ఇట్లే పరకీయభావాదులను వినినప్పుడు తద్భావ నిరూపణార్థము కల రమణీయ కావ్య మాకర్ణించి నప్పుడును హేలాదులకు ప్రబోధము కలుగుటయు భావింప దగియున్నది. ఇదియె భావముల యన్యోన్యసముత్థానము.

భావము హావము హేల

౮ వాగంగ ముఖ రాగైశ్చ సత్వే నాభినయేనచ
కవేరంతస్గతం భావం భావయన్భావ ఉచ్యతే
౯ తత్రా క్షిభ్రూ వికారాఢ్యః శృంగారాకార సూచకః
సగ్రీవారేచకో జ్ఞేయో హావః స్థిత సముద్భవః
౧౦ యో వై హావః స ఏవైషా శృంగార రస సంభవా
సమాఖ్యాతా బుధై ర్హేలా లలితాభినయాత్మికా

భావ హావ హేలల లక్షణము లిందున్నవి! భావాదులు ప్రకృతిస్థితములె యయినచో నంగజములగు నివి వేని నపేక్షింపవనియె భావింపవలసి యుండును. కాని యీ యంశము సంబంధార్హ్వము. అదియె "వాగంగముఖరాగైశ్చ శ్లోకమున నున్నది. భావముల నిరూపణమునందీ భావగంధముకలది కలదు కాని దీని యర్థము విశిష్టము. దేహధర్మము చిత్తవృత్తిస్వభావ మనుట సర్వసమ్మతము.

౧ భావము

వాగంగ ముఖరాగములచే సత్వముచే నుపలక్షిత మయిన భావము వాగంగసత్వవిశేష మగును. అదియే బాలికలో జనించు

భావము. అంతకన్న నేమియు విశేషము లేదు. కాని కవి యంతర్గత భావమును భావింప జేయునదై భావ మగుచున్నది. వాసనాత్మక ముగా నంతర్వర్తమాన మగు రసాఖ్య మయిన భావము నిది సూచించును గావున భావ మగును. ఈ భావభావన మందరకు గలుగదు. కవికె యట్టి భావభావన మున్నది. సూక్ష్మసూక్ష్మార్థములను గూడ కవి దర్శింప గలడు. అట్టి యాతడు సహృదయుడు. సహృదయ హృదయాంతర్గత మయిన సంస్కారాత్మక రసాఖ్య భావమును భావింప జేయు గలుగునది భావ మని పర్యవసితార్థము. ఇది నిరూపిత సారము. కుమారికలు రెండువిధముల నుందురు. ఉత్తమరూప యధమ రూప యని. ఒకానొకకుమారి వాక్పరిస్పందము చూచి, చక్షురాది వ్యాపారము పరిశీలించి క్రీడసక వ్యవహారాదు లందలి ఖేదజనిత మయిన ముఖవైవర్ణ్య ముపలక్షించి, బాష్పాదికము భావించి సహృదయుడు సంభావిత చేతస్కు డగును. ఆతని హృదయమున విశేషోల్లాస ముదయించును. అది యభినయజనిత మైనదిగా ననుమాతృరూపమున నుండును. కాని విశేషాధ్యవసాయ మాపాదింప గలదు. అప్పటి యాతని మతి సుగతియె స్వభావరమణీయము. "ఈ నాయిక యొక మహనీయ కాగలదని యాతడు సంభావించును. ఆంతర రతివాసనా సద్భావమున సముపనత మయిన యట్టి యా వాగాదుల యా విశిష్ట స్వరూపసంపత్తి దేహవికారవిశేషమై భావ మగుచున్నది. వాగాది సముపలక్షిత మయిన యిది యభినయతుల్యముగ నవభాసించుట యిందలి స్వరూపవివేకము. భావమున కవష్టంభ మిచ్చు సత్త్వము ఆ యా ప్రకృతులలో నన్యాన్యస్వరూపమున నుండును. తత్కృతముగా భావము కూడ నానావస్థాంతరకృతముగనె యవభాసించును. ఈ విధ ముగా భావమును నిర్దేశించుట సముచితము.

## ౨ హావము

హావమక్షివికారములు భ్రూవికారములు బహులముగా గలిగి యుండును. శృంగారాకారము సూచించును. గ్రీవారేచకములు కూడి యుండును. స్థితసముత్థితముగా నుండును. ఉత్తమాంగగత పాత్రస్వభావమునకె భ్రూ తారక చిబుక గ్రీవాదుల సాతిశయ మయిన వికార

రూపధర్మము సహృదయాసహృదయ సర్వజనహృదయమునకు శృంగార సముచిత మయిన యాకారమును సూచించును. అట్టిదది హావము. ఈ హావము తన చిత్తవృత్తి నితరమున హావిస్సుగా నర్పించు కుమారికను హావయుతనొనరించును. ఈహావము స్థితసముత్థితము. స్థితమైయుండియె స్వయముగా సముత్థిత మగును. హావము స్వయముగా నుద్భిన్నసముద్భిన్నమై విశ్రమించునది యగును. స్వాత్మ విశ్రాంతమగుట దీని స్వధర్మము. ఇదియె ప్రసరణైకధర్మమగుచో హేల యగును. కావుననె యిది సుకుమార పరికర సబ్రహ్మచారి యగుట నిరూపిత మయినది. హావావస్థలో స్వయముగా రతిప్రబోధనము భావితము కాదు. కేవల మా రతిసంస్కార బలమున నట్టి వికారముల కలిగి యుండుట సంభావిత మగును. ఈ వికారములను జూడగా రతి స్థితి యభ్యూహితము కల్పితము నగును. రతివాసన బాగుగా ప్రబుద్ధ మయినప్పుడు వికారాదుల జూచి ప్రబుద్ధరతియుండుట నూహింప వచ్చును గాని యది యంతగా స్ఫుటీభావము పొందదు. సముచిత విభావోపగ్రహ మం దుండదు. అది నిర్విషయముగా నుండును.

### 3. హేల

అప్పు డుదయించు దేహవికారవిశేష మె హేల. "హిల=భావ కారణే" యని ధాతుపాఠము. హావమె శృంగార రస సంభవమై హేల యగును. భావసంబంధమున ప్రసరత పొంది వేగవాహియై హావము హేల యగును. వేగమున నెడలు వానిని హేలగా నెడలుచున్నా డనుట లోకమున ప్రసిద్ధముగ నున్నది. హేల శృంగారరస సంభవము. శృంగారరస మనుట యిచట రతిని సంకేతింప వలెను. రతి హృదయ గతము కాగా హేల సంభవించునని భావము. శృంగార రస సంభవము=శృంగారరసప్రతిభానము నందున్న సాధారణ్యా రూప సంపత్తి కిందు సంభావనము కలుగును. సామాజికుల శృంగారరసాస్వాదముతో సదృశరూప మగు సంభావన చమత్కారమాత్రప్రాణముగా నిందుం డును. ఇది హేలా రమ్యత. ఇది లలితాభినయాత్మకము. కొంతగా నయినను విషయార్జన మవభాసించినచో విభావవిశేష పరిస్ఫురణ ముండదు. వర సుందర రూప సముత్కీర్ణము కల గ్రావముతో సమ

ముగ శైశవ దశోత్తీర్ణ మయిన తారుణ్యా మున్మీలిత మగును. కావుననె యిది లలిత చేష్టాభినయముతో నుండును. వికారావేశాతి శయ వశమున నిందభినయరూప ధర్మమంతగా ప్రతిలంభము పొందదు.

భావభంగి యిట్లుండును. వనితలకు శైశవము వ్లానమగు నపుడు కేళీక్రమ మొకటి యనుపద మపూర్వముగా నుండును. అలక లుద్వేత్తుగా నెగిరిపడుట, శిక్షారసము కూడిన కబరీభారము, దంత ముల పరిష్క్రియాకర్మ, నీవీహననము, భ్రూలాస్యమునకు తగిన పట్టు దల, తిర్యగ్లోచనముల వల్గితములు, వాక్కుల ఛేకోక్తిసంక్రాంతులు నన్నియు భావోదయ భావనా భంగిమములై భావ్యమానములు కాగ లుగు చున్నవి.

హావరీతి యిట్లుండును. "ఈ మృగనయన తారుణ్యము తాకి నది. ఇక నీమె దేది రమ్యము కాదు? స్మితము కించిన్ముగ్ధము. దృష్టి విభవము తరలమధురము. వాచాపరిస్పంద మభినయ విలాసోక్తి సర సము. గతారంభము కిసలయిత మయిన లీలాపరికరము కలిగి యపూర్వరామణీయకముతో నున్నది.

హేలాలీలాస్వరూప మిట్లు సాక్షాత్కరించు చున్నది. "ఈ వనితా హృదయమున నొక ప్రేమలతిక యున్నది. మదనుడా లతికాసేచన మొనర్ప ప్రయత్నపడినాడు. గీతధ్వనులు వినరాగా కురంగివలె నంగ ముల నీమె స్తిమిత మొనర్చినది. కాంతోదంతము వినియు వినుటకు చెలియ నట్లె ప్రశ్నించు చున్నది. అనిద్రముగా నీమె లోపల నిద్రించు చున్నది. ఓహో! యొక యభినవప్రేమలతిక మొలకలెత్తె నిట్లయిన దని భావింతును.

ఇప్పటికి వీనిలో భావాంతర్గత మయిన రతిప్రబోధము మాత్రమె నిరూపితము. అభిలాషశృంగార మిందున్నట్టు భావింపరాదు. బ్రాహ్మ ణున కుపనయనము కలుగబోవు సమస్తపురుషార్థముల సద్మపీఠబంధ ముగా నుండునట్లు ప్రకృత మిది యంతయు స్త్రీలకు పరమోత్సవమై లోకోత్తరాలంకారమై సాతిశయముగా నానందస్థానమై పరమపవిత్ర మగుననుట విశ్రుతము. ఈభావాదులు పురుషునకును సంభవింప వచ్చును. కాని యివి వనితలకె యలంకారముగా నుండును. అందునసె

వనితాగతములుగా వర్ణితము లయినవి. పురుషున కుత్సాహావృత్త్యనుసారమున పరమాలంకారము లగును. కావుననె సర్వనాయకభేదములందును ధీరత్వము విశేషణముగా నిరూపిత మగుచున్నది. వారియందు శృంగారాదు లన్నియు ధీరత్వమున నాచ్ఛాదితము లగును. "ధీరోదాత్తుడు ధీరలలితుడు" అనుట యిట్టిదె.

ఇప్పటికీ మూడును స్త్రీల కంగజన్యము లయిన విశేషములు. స్వాభావికములు పది యున్నవి. వాని యుద్దేశ మవసరప్రాప్తము. వాని పేర్లిట్లున్నవి.

౧ లీల, ౨ విలాసము, ౩ విచ్ఛిత్తి
౪ విభ్రమము, ౫ కిలికించితము, ౬ మోట్టాయితము,
౭ కుట్టమితము, ౮ బిబ్బోకము, ౯ లలితము,
౧౦ విహృతము.

వీని స్వరూపములను క్రమముగా నిర్దేశింతుము. విశిష్టవిభావములు తగినట్లుగా లభించినచో రతిభావము సవిశేషముగా స్ఫుటమగును. దేహవికారము లయిన యీ లీలాదులన్నియు రతిసముపబృంహణమున కగును. శాక్యాచార్యు లయిన రాహులకాదులు కొందరు భావాదులలో లీలాదులలో సూక్ష్మముగా నున్న భేదమును సరిగా గుర్తింపక హేలాహావాదులను లీలాదులందె పఠించి పరిగణించిరి. చేష్టయె యలంకార మగునని యనిరి. తావన్మాత్రముననె సామాన్యముగా నవి విశ్రాంతము లగునని చేష్ట లలంకారము లనుట సామాన్యోక్తి యని వారభిప్రాయపడిరి. ఇది యుక్తము కాదు. వీని స్వరూపవివేకము కొంత నిరూపిత మయినది. మరికొంత విశదము కాగలదు. ఈ లీలాదిదశకము యొక్క లక్షణము లిట్లున్నవి.

౧౧ వాగంగాలంకారైః శ్లిష్టైః ప్రీతిప్రయోజితైర్మధురైః
ఇష్టజనస్యానుకృతిర్లీలా జ్ఞేయా ప్రయోగజ్ఞైః

౧౨ స్థానాసనగమనానాం హస్తభ్రూనేత్రకర్మణాం చైవ
ఉత్పద్యతే విశేషో యః శ్లిష్ట స్స తు విలాసః స్యాత్

౧౩ మాల్యాచ్ఛాదన భూషణ విలేపనానామనాదరన్యాసః
స్వల్పోపి పరాం శోభాం జనయతి యస్మాత్తు విచ్ఛిత్తిః

౧౪ వివిధానామర్థానాం వాగంగాహార్యసత్వయోగానాం
మదరాగహర్షజనితో వ్యత్యాసో విభ్రమో జ్ఞేయః
౧౫ స్మిత రుదిత హసిత భయ హర్ష గర్వ దుఃఖ శ్రమాభిలాషాణాం
సంకరకరణం హర్షాదసకృత్ కిలికించితం జ్ఞేయం
౧౬ ఇష్టజనస్య కథాయాం లీలాహేలాదిదర్శనే వాపి
తద్భావభావనాకృతముక్తం మోట్టాయితం నామ
౧౭ కేశస్తనాధరాది గ్రహణాదతిహర్ష సంభ్రమోత్పన్నం
కుట్టమితం విజ్ఞేయ సుఖమపి దుఃఖోపచారేణ
౧౮ ఇష్టానాం భావానాం ప్రాప్తావభిమాన గర్వసంభూతః
స్త్రీణామనాదరకృతో బిబ్బోకో నామ విజ్ఞేయః
౧౯ హస్తపాదాంగ విన్యాసో భ్రూనేత్రోష్ఠ ప్రయోజితః
సౌకుమార్యాద్భ వేద్యస్తు లలితం తత్ప్రకీర్తితం
౨౦ వాక్యానాం ప్రీతియుక్తానాం ప్రాప్తానాం యదభాషణం
వ్యాజాత్స్వభావతో వాపి విహృతం నామ తద్భవేత్

౧. లీల: ఇష్టజనానుకరణము లీల యగునని ప్రయోగవిదులు గుర్తింతురు. ప్రియతమగతము లయిన విశిష్టములగు వాగంగాలంకారములను ప్రేయసి తనయం దాపాదించుకొనును. అట్లాపాదించుకొనుటలో తన కాతనియందున్న బహుమానాతిశయరూపమగు ప్రీతి నిమిత్తము. స్వాత్మసంయోజితము లయిన యీ వాగంగాలంకారములు సుకుమారములుగా మధురములుగా నుండవలెను. ప్రియుని యుద్ధతము లయిన వాగంగాలంకారములను పట్టరాదు. మధురము లయిననివి విశిష్టముగా నుండవలెను. కేవలము కృత్రిమములై కల్పితరూపముగా నుత్పత్త యభిమానమున నాపాదితము లయిన వను భావముత్పాదించునవి కారాదు. అప్పుడె యిది యిష్టజనానుకృతి యగును. ఈ యనుకృతి పూర్వము కరణములం దుల్లేఖించిన యుద్ఘట్టకరూపముగ నుండి యవికృతముగ భాసింపవలెను. స్వాత్మలో నది స్వాత్మీకరణమున గోచరింపవలెను. ఈ పది భావము లప్రాప్తభోగలకు ప్రాప్తసంభోగలకును సంభవించును. వారు వీరు వీని సంభావింతురు. ప్రతిపాదింపనున్న శోభాదిసప్తక మప్రాప్తసంభోగావస్థయందే శోభించును. లోకవాచావిలాసు లయిన కవులు ఈ లీలాదులను పరస్పర సాంకర్యమున ప్రయోగించుచున్నారు. "గతేషు లీలాంచితవిభ్రమేషు"

అని కుమారసంభవమునందున్నది. లీలావిభ్రమము లందు నిరూపితము లగుటలో నౌచిత్య మెట్టిది? అట్టి పట్టులందు వాని నుపచరితస్వభావమునని గుర్తింప వలసి యుండునో? లోకప్రసిద్ధినె ప్రమాణీకరింపవలసి యుండునో? "గతేషు లీలాంచితసుందరేషు" అని తంత్రజ్ఞులు పాఠాంతరము పఠింపవలెనందురు. శ్రీభట్టేందురాజశిష్యు లిది యంగీకరింపరు. వనితలలో స్వాభావికముగా గలుగు నీ లీలావిభ్రమాదులు తదుచితములుగనె యుండును. ఆ యా సమయములందు వారల కవి శిక్షాచాతుర్యమాపాదించును. కుమారసంభవ మందలి ప్రసక్తి యిట్లున్నది.

సా రాజహంసైరివసన్నతాంగీ గతేషు లీలాంచితవిభ్రమేషు
వ్యనీయత ప్రత్యుపదేశలుబ్ధైః అదిత్సుభిర్నూపురశింజితాని

పార్వతీ నూపురశింజితములను గ్రహింపదలచిన రాజహంసలు ప్రత్యుపదేశాసక్తి కలిగి లీలాంచితవిభ్రమగతులలోపార్వతీదేవికి శిక్షణ మిచ్చినవా? యని యూహింపదగి యున్నదని పద్యభావము. పార్వతికి లీలావిభ్రమప్రభృతులు కలుగనున్నవి. ప్రస్తుతము పార్వతికవి సముచితములు. ఇపుడు రాజహంస లా శిక్షణ మిచ్చుచున్నవి. లీలాదుల యభినయప్రయోగకాలమును వ్యాహరించి శిక్షణమిచ్చు రాజహంసలకు కర్తృత్వ మిందుత్ప్రేక్షితమయినది.

౨. విలాసము. స్థానాసనగమనము లందును హస్తభ్రూనేత్రకర్మలందును సుశ్లిష్టమయిన విశేష ముదయించుటను విలాస మందురు. వనితలకు స్థానకాదులన్నియు నయత్నశిక్షితములె. అయినను తత్కాలమున శృంగారబలసముపనీతములై రూపశోభ కలిగి యనుల్బణస్వభావమున విలాసాత్మకము లగును.

3. విచ్ఛిత్తి. మాల్యమాచ్ఛాదనము భూషణము విలేపనముల ననాదరముగా న్యసించుట విచ్ఛిత్తి. ఆ విన్యాస మనాదరమున స్వల్పముగా నున్నను సమతిశయితశోభ సంపాదించును. అల్పముగ నునికిచే గూడ పరాశోభాసంపాదన ముండుట సౌభాగ్యగర్వమహిమ యనవచ్చును. సమాదరమున విన్యస్తము లయిన మాల్యాదులె శోభాహేతువు లగుట లోకప్రసిద్ధము. సహజసౌభాగ్యాతిరేక ముండగా

ననాదరవిన్యాసము కూడ రమణీయతను సంపాదించును. అది విచ్ఛిత్తి. శాకుంతలములో శకుంతలను చూచిన దుష్యంతుడు "సరసిజమను విద్ధం శైవలేనాపి రమ్యం" మొదలుగా శకుంతలను భావించినాడు. అందలి రీతి యీ విచ్ఛిత్తి కుదాహరణము కాజాలదు. శైవలమున్నను పద్మము రమ్యము. చంద్రకళంకము మలిన మయినను చంద్రునకు శోభనె కూర్చినది. వల్కలముచే గూడ నీ శకుంతల మనోజ్ఞముగనె యున్నది. మధురాకృతుల కేది మండనము కాదు ? " అను నీ భావనలో సౌభాగ్యగర్వకృత మయిన యనాదరన్యాసము లేదు. అంతయు శకుంతల కప్పట తపస్వినీసముచిత వేషపరిగ్రహణ ప్రాయముగనె యున్నది. కాగా సౌభాగ్యగర్వకృత మయిన యనాదర విన్యాసమె విచ్ఛిత్తి యగునని తాత్పర్యము.

౮. విభ్రమము. వాగంగాహార్యసత్త్వయోగముకల వివిధార్థముల మదరాగహర్ష జన్య మయిన వ్యత్యాసమును విభ్రమ మందురు. ఇందు యోగమనునది భేదము. వాగాదిభేదమున బహుభేదములు పొందిన బహ్వర్థముల యన్యథాసన్నివేశము కూడ విచ్ఛిత్తిలోవలె సౌభాగ్యగర్వకృతమె యగును. వాక్యము నొకవిధముగా పలుకవలసి యుండగా వేరొకవిధమున పలుకుట యొకవిధమగు విభ్రమ మగును. ఇది వాగ్యోగమున నర్థమందలి వ్యత్యాసము. హస్తమున నాదాన మొనర్పవలసి యుండగా పాదమున నాదాన మొనర్చుట యంగయోగమున నర్థమునగల వ్యత్యాసము. రశనాసూత్రము కటిధార్యము. దానిని కంఠమున న్యసించుట యాహార్యయోగమున నర్థవ్యత్యాసము. మదరాగహర్షజన్యమని యనుట ; ప్రియతము నుద్దేశించియే మద్యమున సిద్ధమయిన యనురాగమని తత్కృతమయిన హర్షమని గుర్తింపవచ్చును. ఇట్టి వివి యన్నియు సౌభాగ్యగర్వహేతుకములుగా ప్రసిద్ధములై యున్నవి.

౯. కిలికించితము. దీనిలో హర్షనిమిత్తముగా ననేకభావములు సంకీర్ణములయి యుండుట యసకృత్తుగా నుండును. స్మితము, రుదితము, హసితము, భయము, హర్షము, గర్వము, దుఃఖము, శ్రమము, అభిలాష మను నివి సంకీర్ణములై యొకచో నుండును. ఈ సంకరణములో గూడ సౌభాగ్యగర్వము హేతువుగా నుండును.

౬. మోట్టాయితము. ఇష్టజనుని కథాకథనమున గాని వాని లీలా హేలాదిదర్శనమున గాని తద్భావభావనాకృతముగా వనిత కుద యించు లీలాదులు మోట్టాయిత మగును. భావభావనవశమున భామి నుల చేష్ట లొకే విధమున నుండవు. ఒకప్పుడు మదనాంగమర్దపర్యంత మా చేష్ట యుండునట. ఇట్లంగమోడన ముండుటచే నిది మోట్టాయిత మయినది,

౭. కుట్టమితము. ప్రియుడుపభోగమున కుపక్రమించి కేశగ్రహణ స్తనగ్రహణాధరగ్రహణాదు లొనరింపగా వనిత కతిహర్ష మె యుద యించును. సంభ్రమము కలుగును. ఈ హర్షసంభ్రమోత్పన్న మయిన సుఖమును గూడ వనిత దుఃఖోపచారమున నె యనుభవించును. అప్పుడది కుట్టమితము. సుఖమును సుఖముగా ననుభవించుటలు బహి రంగములు. అవి సంపద్గర్వాకృతములుగా నుండును. దుఃఖోపచారమున సుఖ మనుభవించుట లంతరంగములు. ప్రియతము డొనరించిన కుచా ధరగ్రహణముల వలని సుఖము వనిత కంతరంగరంగమున నుపక్షి ప్త మగుట నిది కుట్టమితము.

౮. బిబ్బోకము. ఇష్టభావప్రాప్తిలో స్త్రీల కభిమానగర్వ సంభూత మయిన యనాదరకృతభావము బిబ్బోకమగును. స్త్రీలకు వస్త్రాలంకారము లభీష్టములు. అభీష్టము లగునవి లభించినను వాని ననాదరముగ గ్రహించుట బిబ్బోకము. సౌభాగ్యగర్వమున అభీష్టలాభ సంతోషగర్వమున ననాదరము బహులముగ నున్నచో బిబ్బోకమగును.

౯. లలితము. సౌకుమార్యహేతుకముగా గలిగిన హస్త పాదాంగవిన్యాసము భ్రూనేత్రోష్ఠప్రక్రియయు లలితమని ప్రకీర్తితమయి నది. హస్తాదుల కర్మ కర్తృవ్యవశమున సిద్ధమయిన దయినను వైచిత్ర్య ముతో నుండుట యది యొక విలాసము. ఇట్టిది విలాసముగా నింతకు పూర్వము నిరూపిత మయినది. లలితమున బాహ్యవ్యాపారయోగ మేమియు నుండదు. ఆదాతవ్యబుద్ధియు నుండదు. "ఈ పని నిట్లు చేయవలయును. దీని నిట్లు గ్రహింపవలెను." అను నభిసంధి యేమాత్ర ముండదు. సుకుమారముగా కరవ్యాపారణము పాదవిక్షేపము నుండును. అట్లె భ్రూకర్మ తారాకర్మ యధరక్రియ సర్వము సుకుమారవిన్యాస

ముననె యుండును. అట్టిదిది లలితము "లడ = విలాసే" యను ధాతువు కలదు. లడధాతువునకు విలాస మని యర్థము. ఈ ధాతువును కొందరు ప్రమాణీకరించుకొని సాతిశయ మయిన విలాసము లలితసంజ్ఞక మగునందురు. సుకుమారవిధానమున స్త్రీలు భ్రూనేత్రోష్ఠ క్రియాసహితముగా కరచరణాంగన్యాసముల నుండుట లలిత మనియె యనుట సంగతము.

౧౦. విహృతము. వ్యాజమున గాని స్వభావమున గాని ప్రాప్తావసరము లయిన ప్రీతియుక్తవాక్యములగూడ పలుక కుండుట విహృత మగును. అవసరలాభమున కథనయోగ్యము లగుటయె ప్రీతియుక్తత. మౌగ్ధ్యము బొల్యము అన్యాచిత్తమున నుండుట యనునవి స్వభావమున జేరదగియున్నవి. ఏదేని వ్యాజమున పలుకకుండుటయు కొందరి వనితల స్వభావమె. ఆ యా మాట లుదీర్ణరాగ లయిన వనితలు వ్యాజమున స్వభావమున నవసరసమయమునగూడ పలుకకుండుటయు హృద్గత భావము నతిశయితముగనె ప్రఖ్యాపన మొనర్చు ననుట లోకప్రసిద్ధమె.

శోభ కాంతి దీప్తి మాధుర్యము
ధైర్యము ప్రాగల్భ్యము ఔదార్యము

అను నీ యేడును అయత్నజన్యము లయిన విశేషములు. యథాక్రమముగా వీని లక్షణములిట్లున్నవి.

౨౧ రూపయౌవన లావణ్యై రుపభోగోప బృంహితైః
అలంకరణ మంగానాం శోభేతి పరికీర్తితా
౨౨ విజ్ఞేయా చ తథా కాంతిః శోభైవాపూర్ణ మన్మథా
కాంతిరేవాతి విస్తీర్ణా దీప్తి రిత్యభిధీయతే
౨౩ సర్వావస్థా విశేషేషు దీప్తేషు లలితేషు చ
అనుల్బణత్వం చేష్టాయా మాధుర్యమితి సంజ్ఞితం
౨౪ చాపలేనానుపహతా సర్వార్థే ష్వవికత్థనా
స్వాభావికీ చిత్తవృత్తిః ధైర్య మిత్యభిధీయతే
౨౫ ప్రయోగనిస్సాధ్వసతా ప్రాగల్భ్యం సముదాహృతం
ఔదార్యం ప్రశ్రయః ప్రోక్తః సర్వావస్థానుగో బుధైః

౧. శోభ. ఉపభోగోపబృంహితము లయిన రూపయౌవన లావణ్యములచే గలుగు అంగాలంకరణము శోభ యగును. ఉపభోగ విశేషమున రూపమునం దొక విశిష్టరమణీయత కలుగును. అది యంగ

ముల కలంకారముగా నుండును. అది శోభ. ఇట్లై యౌవనము లావణ్యమును. స్త్రీలకు రూపయౌవనలావణ్యము లున్నవి యున్నట్లై యుండవు. అవి పురుషుల భోగోపభోగముల గూడినవై నవనవచ్ఛాయకల వగును. ఆ ఛాయ మందమని మధ్యమని తీవ్రమని మూడు విధములు. ఈ విధములు వరుసగా శోభ, కాంతి, దీప్తి స్వరూపత్రయమున నుండును. ప్రాప్తసంయోగ లయిన వనితలలో నీ శోభ గోచరించును. కాగా నిది నిశ్చితార్థము. స్త్రీలుపభోగ్యలు. ఉపభోక్తలు పురుషులు. సుకుమారకోమలదేహ లయిన స్త్రీలుపభోగదక్షు లయిన పురుషుల యుపభోగవిశేషమున పరిమ్లానకల్పశరీర లగుదురు. వారి రూపయౌవన లావణ్యము లట్లు మ్లానములు క్లాంతము లయినను వారి యంగముల కలంకారములుగనె యుండును. పురుషోపభుజ్యమానరూపాదులు ఛాయాంతరమాశ్రయించుటలో నొకవిధముగా గోచరించు మందచ్ఛాయ శోభ యనెడి వ్యవహారము పొందును. అంగాలంకారముగా ఛాయాంతర ముండుట సంభోగపరిశీలనమున గోచరించును.

౨. కాంతి. ఆపూర్ణమన్మథ మయిన శోభయె కాంతి యగును. "ఆ సమంతాత్ పూర్ణో మన్మథః" అంతట పూర్ణమయిన కామోపభోగము హేతువుగా నున్న శోభయె కాంతి. ఒక రపూర్ణమన్మథముగా వ్యాఖ్యానించి కాంతి దీప్తి శోభలలో క్రమముగా సాతిశయత్వము చెప్పిరి. కాంతిలో మన్మథభోగ మధికముగా నుండదని వారి సంకల్పము. ఇట్టి భావప్రకటన ముపక్రమవిరుద్ధ మని యుపాధ్యాయు లనిరి. స్త్రీల రూపయౌవనలావణ్యములు పురుషోపభుజ్యమానము లగునపుడు కలుగు మధ్యక్రమమయిన ఛాయాంతరము కామోపభోగబహులతాసూచకమై కాంతి యగునని భావము.

3. దీప్తి. అతివిస్తీర్ణ మయిన కాంతియె దీప్తి యగును. ప్రియోపభుక్తవనితల రూపాదులు ఛాయాంతరము పొందగా శోభ యయినది. ఆ శోభ కామోపభోగబహుళమై మధ్యక్రమ మనుసరించిన ఛాయ కలదికాగా కాంతి యయినది. ఆ కాంతి సర్వాంగసమభివ్యాప్తమై తీవ్రక్రమోపభోగసూచకమై దీప్తి యగునని భావము. శోభాకాంతిదీప్తు లిట్లుత్తరోత్తరము లయినవి.

౪. మాధుర్యము దీప్తావస్థలో గాని లలితావస్థలలో గాని సర్వావస్థావిశేషము లందు చేష్టల యనుల్బణత్వమును మాధుర్య మందురు. క్రోధాదులు దీప్తములు. రతిక్రీడాదులు లలితములు. "లలితేషు చ" యను కారికాఖండము నందలి 'చ' కారము "ఇవ" అర్థమున ప్రయుక్తము. కాగా లలితరతిక్రీడాదులలో చేష్ట మసృణముగా నున్నట్లు దీప్తక్రోధాదులలో గూడ మసృణముగా నుండుట సూచితమగుచున్నది.

౫. ధైర్యము. చాపలహతము కాని చిత్తవృత్తి సర్వార్థములం దవికత్థనముగా నుండు చిత్తవృత్తి స్వాభావికమయిన చిత్తవృత్తి ధైర్యమగును. ఈ ధైర్య మున్నప్పు డాత్మశ్లాఘ యుండదు. చిత్తమున చాపల ముండదు. సర్వార్థములం దాత్మశ్లాఘ యుండ నట్లు రూపయౌవనాదులందు నాత్మశ్లాఘ యుండదు.

౬. ప్రాగల్భ్యము. ప్రయోగనిస్సాధ్వసత్వమునకు ప్రాగల్భ్య మని పేరు, ప్రయోగ మనునది కామకలాస్వరూపము. అది చాతుష్షష్టికస్వభావమున నున్నది. కామసూత్రమునందు వాత్స్యాయనుడు సాంప్రయోగికాధికరణమునందు బాభ్రవీయుడు చెప్పిన యాలింగనాది చతుష్షష్టికలలను నిరూపించినాడు. ఆలింగనాది రూపముగానున్న కామకలాప్రయోగమునందు నిబ్బరపాటుతో ననుభవప్రక్రియ లందుకొనుట యనుభవవిశేషములను సముచు సంగమానుకూలముగా నందించుట ప్రాగల్భ్య మగును. "పురుషున కన్యసమయములందు శమము భూషణము. స్త్రీలకు లజ్జ భూషణము. పరిభవప్రసక్తిలో పురుషుడు పరాక్రమించుట శోభ. సురతములందు వనిత ప్రాగల్భ్యము ప్రదర్శించుట యలంకారము." అని క్రాంతిదర్శు లనిరి. ఇది యనుకర్త్రు విషయ మని కొందరనుట యుక్తము. కాదని దూషితమె యయినది.

౭. ఔదార్యము. సర్వావస్థానుగత మయిన ప్రశ్రయమున కౌదార్య మని పేరు. సర్వావస్థ లనుట యమర్షేర్ష్యాక్రోధాద్యవస్థలు కూడ పరిగ్రాహ్యములు. ఆ యవస్థలందును పరుషవచనాదులను పలుకకుండుట యౌదార్యమగును.

ఈ నిరూపితము లయిన శోభాదులు చిత్తవృత్తిస్వభావములె యయినను విభావజన్యత్వము లేనందున భావవర్గమునందు పఠితములు

కాలేదు. రసవిషయమున నివి భావత్వమును గూడ పొందజాలవు. అని కొందరనిరి. ఇట్లనుట యుక్తముగ లేదు. సప్తకములో శోభా కాంతిదీప్తులు బాహ్యములయిన రూపలావణ్యగతము లయిన విశేష మాత్రములె కాని తద్భిన్నములు కావు. కాగా వీని విషయమున భావత్వాశంకావకాశ మే మాత్రము లేదు. ఆనేగచాపల్యతాసామర్థ్య ములు భావములు. అవి బాహ్యలావణ్యాదివిశేషములు కావు. మాధు ర్యాదులు చిత్తవృత్తిస్వభావములె కావు. ఇంక భావమన్న శంక కవ కాశమేది? అభావము కూడ భావాంతరమందురా? భావమున అభా వము విశేషణముగా నున్నదని యట్లు ప్రతిభాసగోచర మగుచున్నదని భావరూపత్వమె చెప్పవలెనని చెప్పుదు. అయిన నివి వ్యభిచారిభావ వర్గమున కన్న వేరుగనె పరిగణితము లగును. అట్లు వీని పృథగ్రూప మున జెప్పుటయే సముచితము. ఇట్లనుటలో నీ హేతువులు సంభావ నీయములు.

౧. ఇవి యలంకారస్వరూపముగా నున్నవి. వీనిని చేష్టాలంకా రములని యనుట సర్వప్రసిద్ధము.

౨. ఇవి సామాన్యాభినయరూపముగా నున్నవి. సామాన్యాభి నయాత్మకములు భావవర్గమున జేరవు.

౩. ఇవి యాంతరచిత్తవృత్తిధర్మములు కావు. బాహ్యశరీర నిష్ఠతాపర్యవసానముననె యుండును.

౪. ఇవి శృంగారైకమాత్రవిషయములు. భావములు సర్వరస విషయముగ నుండుట ప్రసిద్ధమె. వ్యభిచారి భావవర్గ మశేషరస విషయ మనియె యందురు.

ఈ శోభాదు లేడె యన్న నియమము వివక్షితము కాదని మౌగ్ధ్యము మదము భావము వికృతము పరితపనము మొదలగు వానిని గూడ పరిగణించుట సముచితమని శాక్యాచార్య రాహులాదు లనుట విరుద్ధముగా నున్నది. రాహులునకు పద్మశ్రీ సాగరనంది మాతృ గుప్తాదు లనుయాయులు వారు మౌగ్ధ్యమదాములకు తోడుగా విక్షేప కేలి వ్యాజ ప్రతిభేదనామలను గూడ జెప్పిన జెప్పుదురు. వారు

మాధ్గ్యాదుల నిల్లు లక్షింతురు. బాల్యము పోగా వనితలకు ప్రియుల సన్నిధిలో మనోహరవాక్యముల గూడిన రీతి మాధ్గ్యము. తారుణ్యాతిశయమున గలుగునది సురాపానమున విశేషిత మగునది వికారబహుళము నగు విధానము మదము. కాంతుని దృష్టిపథమునుండి తిరోధానము పొందదలచి, లజ్జచే నధోముఖియై సుందరలోచనముల తిర్యగ్వీక్షిప్త మొనర్చి, ప్రియుని చూచుచు రోమాంచము కలదై మదనాచార్యశిక్షోపదేశమున ప్రవర్తించు వనిత చేష్ట భావ మగునని శాక్యసమ్మతిము. తగిన సమయమున మాట పలుకక చేష్టతో ననుష్ఠించుట విశృత మనదగి యున్నది. ప్రియుడు క్షణకాలము కన్పడ కున్నను విరహసముత్థ మయిన సంతాపసంతతి పరితాప మగును. ఇట్టివి శాక్యసమ్మతము లయిన చేష్టాలంకారములు. ఇది భరతవిరుద్ధము.

ఈ నిరూపితములైన భావాదిలీలాదిశోభాదులకు సామాన్యాభినయత్వ ముపపాదించుట సముచితము.

౨౬ సుకుమారే భవంత్యేతే ప్రయోగే లలితాత్మకే
విలాసలలితే హిత్వా దీప్తేఽప్యేతే భవంతి హి

లలితాత్మక మయిన సుకుమారప్రయోగమునం దివి సంభవించును. విలాసము లలితములు కాక మిగులునని దీప్తప్రయోగమునందును సంభవించును. లలితప్రయోగములో శృంగారము ప్రయుజ్యమాన మగునపుడు సుకుమారము లయిన యనోన్యము సంక్రాంతిము లయిన యుపభోగసంభోగవిప్రలంభ భేదములలో నివి ప్రయుజ్యమాన రమణీయములగును. ఈ భేదప్రభేదములం దన్నిట నన్నివిధములు సంభవింపక పోవచ్చును. ఈ భావలీలాశోభావిరహితముగానంగ చేష్టితములు ప్రయోగార్హములు కాజాలవు. లలితాత్మక మయిన శృంగారమున గూడ ఈర్ష్యామద్గాదులు దీప్తములుగా నుండును. అందు విలాసము లలితము నుండదు. మిగులునవి యుండును. అన్యము లన్నియు క్రమమునగానియొగపద్యమునగాని సంభవింపవచ్చును. శృంగారభేదములలో సాధారణాత్మక మయిన యభినయము వీని యందుండును. అందువలన వీనికి సామాన్యాభినయత్వము యుక్తము కాగలదని ప్రఘట్టతాత్పర్యము.

| | | |
|---|---|---|
| శోభ | విలాసము | మాధుర్యము |
| స్థైర్యము | గాంభీర్యము | లలితము |
| ఔదార్యము | తేజస్సు | |

అను నీ యష్టకము పురుషగతిముగ నుండును. పౌరుషాలంకారము లగు నివి యన్నియు సత్త్వభేదానుసారమున సంగతములై యుండును. యథాసంగతి వీని లక్షణము లిట్లున్నవి

౨౭ దాక్ష్యం శౌర్యమథోత్సాహో నీచార్థేషు జుగుప్సనం
ఉత్తమైశ్చ గుణైః స్పర్థా యతః శోభేతి సా స్మృతా
౨౮ ధీరసంచారిణీ దృష్టిః గతిర్గోవృషభాంచితా
స్మితపూర్వ మథాలాపో విలాస ఇతి కీర్తితః
౨౯ అభ్యాసాత్కరణానాం తు శ్లిష్టత్వం యత్రజాయతే
మహత్స్వపి వికారేషు తన్మాధుర్యమితి స్మృతం
౩౦ ధర్మార్థకామ సంయుక్తాత్ శుభాశుభ సముత్థితాత్
వ్యవసాయా దచలనం స్థైర్య మిత్యభిసంజ్ఞితం
౩౧ యస్య ప్రభావాదాకారా హర్షక్రోధ భయాదిషు
భావేషు నోపలక్ష్యంతే తద్గాంభీర్యమితి స్మృతం
౩౨ అబుద్ధిపూర్వకం యత్తు నిర్వికార స్వభావజం
శృంగారాకార చేష్టత్వం లలితం తదుదాహృతం
33 దాన మభ్యుపపత్తిశ్చ తథా చ ప్రియభాషణం
స్వజనే చ పరే వాపి తదౌదార్యం ప్రకీర్తితం
3౪ అధిక్షేపాపమానాదేః ప్రయుక్తస్య పరేణ యత్
ప్రాణాత్యయేప్య సహనం తత్తేజః సముదాహృతం

౧. శోభ. పురుషులందున్న సత్త్వభేదవిశేషమున శోభాదులు కలుగును. సత్త్వసంభూతి వలన దేహమున నొక వికృతి కలుగును. ఆ శరీరవికారమున గొన్ని కొన్ని విశేషము లుదయించును. అవి శోభాకృతి వహింపగలవు. దక్షత్వము, శౌర్యము, ఉత్సాహము, నీచార్థముల జూచి యసహ్యపడుట, గుణసంపత్తి సమార్జనమునకై యుత్తములగువారితో స్పర్థపడుట శోభ యన్న వ్యవహారము పొందును.

౨. విలాసము. ధీరముగా ప్రసరించు దృష్టి, ఉత్తమగోగమనాంచిత మయిన గతి (గో వృషభము = ఉత్తమగోవు) స్మితపూర్వక మయిన సంలాపము విలాస మనదగి యున్నది.

3. మాధుర్యము. అధికములగు వికారము లందును కరచరణా ద్యవయవముల సుశ్లిష్టత మాధుర్య మగును. యుద్ధనియుద్ధవ్యాయామాదులందు నిరంతరాభ్యాసము వలన కరచరణాదుల క్రియావిశేషములు శ్లిష్టములై యుండును. శ్లిష్టతయనుల్బణత్వము. ఇదియు నొకానొక సత్వసంపన్న మయిన శరీరవికారమె. కరచరణాదికరణముల యనుల్బణత నటగతముగా నుండునని వ్యాఖ్యానించుట తప్పు. ఇది ప్రక్రమవిరోధము. ఇప్పుడు నటగతగుణప్రసక్తి లేదు. ప్రయోక్తృ గుణములను ప్రకృతి నిరూపణములో భూమికావికల్ప నిరూపణములో భరతు డుల్లేఖింప నున్నాడు.

౪. స్థైర్యము. ధర్మార్థకామసంయుక్తము శుభాశుభసముత్థిత మయిన వ్యవసాయమునుండి చలింపకుండుట స్థైర్య మగును. ధర్మార్థకామసంయుక్తము = ధర్మార్థకామములు ఫలముగా నున్న సంఘటనములతో కూడినది. బుద్ధ్యధ్యవసాయమున నిశ్చితములగు యత్నవిశేషము లయిన వ్యవసాయములు శుభసంకల్పజము లశుభసంకల్పజములు నగును. అశుభ మస్థిరముగా నున్న సంకల్పము నివర్తిత మగును. అర్థఫలాశయముతో నున్న చతుర్వర్ణములు వారి సర్వస్వాపహారణరూప మయిన యశుభసంకల్పజ వ్యవసాయ మస్థిర మని భావించి కొందరు సంకల్పమును మరలించుకొనుట చరితము లందు గోచర మగుచునే యున్నది. శుభసముత్థితము అశుభసముత్థితము అని శుభాశుభసముత్థితపదమున కర్థము చెప్పుటను కొందరు వీరమున కుచితముగా నుండ లేదని భావించి యన్యథా వ్యాఖ్యానించిరి. "శుభాశుభయోః సముత్థితః శుభాశుభసముత్థితః" శుభమునం దశుభమునం దుదయించిన వ్యవసాయమున చలింపకుండుట యని యర్థము. కాగా శాస్త్రోక్త ముచిత మారంభించుట యుండును. శాస్త్రోక్త మొనరించునపుడు సులభముగా నర్థము లభించుట శుభమని క్షయవ్యయాదికము కలుగుట యశుభమని యీ వ్యాఖ్యాతల భావము. ఇందు కూడ శుభాశుభవిషయ మయిన యధ్యవసాయము నుండి చలింపకుండుట స్థైర్య మనదగి యున్నది. అట్టి స్థైర్యమును సత్వసంభూత మయిన దేహావికారమె.

౫. గాంభీర్యము. గాంభీర్యప్రభావమున హర్షక్రోధభయాది భావములలో నాకారము లుపలక్షితములు కావు. అట్టిదిది గాంభీర్యము. "ఆక్రియతే చిత్తవృత్తిరేభిరిత్యాకారః. ముఖరాగదృష్టివికారాదయః" వీనిచే చిత్తవృత్తిక్రియాసౌష్ఠవము కలదగును. అట్లు చిత్తాకృతి నిచ్చునది యాకారము. ముఖరాగము దృష్టిరాగము మొదలగువాని కాకారములని పేరు. ముఖరాగాదులు లేకున్నను కారణసామగ్రీఫల మవ్యభిచరితముగనె యుండును. హర్షాదు లున్నను తత్కృతముగా గలుగవలసిన ముఖరాగాదులు లేకుండుటలో నేదేని హేతు వుండవలెను. అదియె నిస్తిమితదేహస్వభావ మయిన గాంభీర్యము.

౬. లలితము, నిర్వికారస్వభావజన్య మబుద్ధిపూర్వక మయిన శృంగారాకారచేష్ట లుండుట లలిత మగును. సామాన్యముగా సర్వచేష్టలు బుద్ధిపూర్వకములు. రసమయచేష్టలు చిత్తపురస్సరములు. అందును శృంగారాకారచేష్టలు చిత్తవ్యవసాయపురస్కృతములగును. కాని యబుద్ధిపూర్వకముగనె నిర్వికారస్వభావమున శృంగారాకారచేష్ట లుండునేని యది లలితము కాగలదు.

౭. ఔదార్యము. స్వజనమునందు కాని పరజనమునందు గాని విశేషము లేని విధమున సమానభావమున దాన మభ్యుపపత్తి ప్రియభాషణ మాదార్య మగును. పరజనవిషయక మయిన దానాదిక మొకచేష్టావికారరూపము. చేష్టావికార మనుట చేష్టావిశేష మనియె భావము. స్వజనవిషయక మయిన దానాదికము కూడ నిందున్నది. కేవలము స్వజనవిషయ దానాదిక మాదార్య మనదగదు. అది లోకవాద మిచ్చును. అనాదరరూపరూప మగును. అభ్యుపపత్తి యనునది పరిత్రాణము కోరినవాని నంగీకరించుట.

౮. తేజస్సు. శత్రు వధిక్షేపించిన నవమానించిన ప్రాణాత్యయమున గూడ సహింపకుండుట తేజస్సందురు. గురుమిత్రు లొనరించిన యధిక్షేపావమానాదు లిందు చేర్పదగవు. ప్రాణాత్యయమున గూడ సహింపకుండుటయె యిందు వివక్షితము. నీత్యనువర్తనమున సహింపకుండుట తేజస్స్వరూపము కాదు. ఏదోవిధమున దేశకాలాద్యనువర్తనమున సహించుట యున్నదని నిర్ణ్యాతనము కలదియె కావలయును.

సాత్త్వికాభినయ మిదివరలో నిరూపిత మయినది. ఇక శారీరాభినయము నానుపూర్వ్యకముగా నిరూపింప వలసి యున్నది. ఇచట సాత్త్విక ప్రసంగమున రోమాంచాదుల నేల ప్రతిపాదింపలే దను శంకాసమాధానముగ వానిని భావనిరూపణముననె నిరూపించితి మను నది సముచిత మగునని తలచ నక్కర లేదు. ఇట్టి తలంపార్షము కాదు. "సత్త్వమున నాట్యము ప్రతిష్ఠితము" అని సామాన్యాభినయారంభము నందు ప్రతిజ్ఞాతము. వాగంగసత్త్వ మనుచోట సాత్త్వికము మూడవ దిగా పశ్చాన్నిర్దిష్ట మయినను సామాన్యాభినయారంభములో మొద టనె నిరుక్త మయినది. విలోమప్రకారమున నదియె మొదట నిరూపితము. కాగా తదానుపూర్వ్యకముగా క్రమప్రాప్త మగునది శారీరాభినయమె. అందుననె శారీర మయిన సామాన్యాభినయ ముపక్రమింప వలసి యున్నదని ముని భావించినాడు. వాగంగసత్త్వములలో సత్త్వానంతరము విపరీతవృత్తి ననుసరించి యాంగికమునకె యానంతర్య మున్నది.

> ౩౫ షడాత్మకస్తు శారీరో వాక్యం సూచాంకురస్తథా
> శాఖా నాట్యాయితం చైవ నివృత్త్యంకుర ఏవ చ

శారీరసామాన్యాభినయమున నిది యుద్దేశవిధా సూచకము. శారీర మారు విధములు.

| | | |
|---|---|---|
| వాక్యము | సూచ | అంకురము |
| శాఖ | నాట్యాయితము | నివృత్త్యంకురము |

పూర్వము శారీరాభినయము బహుప్రకారవైచిత్ర్యమున నిరూపితమె యయినది. అందవాంతర సామాన్యాభినయరూపము లారు గలవు. అవి యివి. ఆ శారీరాభినయమె షడాత్మక మయినందున నవాంతర జాతియోగమున వ్యామిశ్రితమై సామాన్యాభినయముగా నగును. అట్లె సాత్త్వికాభినయములతో గూడి వాచికాభినయములతో గూడి వ్యామిశ్రణము పొంది సామాన్యాభినయరూపముగా సంపన్న మగును. షట్స్వభావక మయిన యీ శారీరమునందు వాక్యసూచాదు లున్నవి కదా! వీనిలో వాక్య మనునది వాక్యసహచరిత మయిన శారీ

రాభినయము. శరీరాభినయమధ్యములో నిర్వర్తకములు పరిగణితములు కావని కొందరు చిరంతనులు తలచిరి.

ఈ యంశమున కావ్యకౌతుకగ్రంథములో నొక విషయ మున్నది. గేయస్వరములకు శారీరస్వరములని వ్యవహారము కలదు. భావము శారీరమని ప్రసిద్ధము. కాగా వాక్య మభినయాంతరనిరపేక్ష మగును. వాక్యావగతి కభినయముల సహకార మక్కఱ లేదు. సద్వృత్తభాషాగుణము స్ఫుటముగా నర్థప్రతీతిని కలుగజేయునపుడా ప్రతీతియె రసభావముల కనుభావక మగును. వాక్య మిట్లు రస భావానుభావకముగా నుండుటచే నదియె వాక్యాభినయము కాగలదు. ఈ యంశము కావ్యకౌతుకగ్రంథగతము. ఇందిది చింత్యము. పాఠ్య రూపము సామాన్యాభినయ మెట్లగును? పాఠ్యముకూడ శరీరాను ప్రవేశమున సామాన్యాభినయ మగునన్నచో నిదియు నితరానపేక్షమె యగును. అభినేయకావ్యమునం దభినయశూన్య మయిన వాక్య ముండదు. అభినేయమునందు వాక్యాభినయవ్యవహార మేమియు లేదు. మా భట్టతోతుల కావ్యకౌతుకగ్రంథమునం దీ విషయముండుటయె కాని యిది మా యుపాధ్యాయుల స్వపక్షము కాదు. అన్యదీయాభి ప్రాయము నుపాధ్యాయులు దర్శించిరి. అంతియె కాని యది వారిభావ మని భ్రమింప రాదు.

ఈ భావభంగి యిట్లున్నది. వాక్యముతో నున్న శారీరాభినయ మును వాక్యమని నిర్దేశించుట ముఖ్యపక్షము. వాక్య మభినయాంతర మపేక్షింపదు. అర్థప్రతీతి నొదవించు భాషాగుణమె రసభావముల ననుభవింప జేయగలదని కౌతుక గ్రంథగత భావము. గేయపాఠ్యము లకు రూప మిచ్చిన వాక్య మభినయనిరపేక్షము కాదు. అభినేయ కావ్య మందలి కావ్యవాక్య మభినయశూన్యము కాదు. అభినయ సాపేక్ష మయిన వాక్యమె సామాన్యాభినయ మగుచున్నదని ముఖ్య పక్షసమర్థక మయిన భావము. వాక్యాదుల స్వరూపలక్షణము లిక ప్రతిపాదింపవలసి యున్నది.

### వాక్యము

౩౬ నానారసార్థయుక్తైః వృత్తనిబంధైః కృతః నచూర్ణపదైః
ప్రాకృతసంస్కృతపాఠో వాక్యాభినయో బుధైర్జ్ఞేయః

ఇది వాక్యాభినయలక్షణము. వాక్యార్థము నానారసవిశేషములు కలిగియుండును. అట్టి వాక్యార్థములో కూడిన నానావాక్యములు వృత్తరచితములు కావచ్చును. చూర్ణపదాత్మకము లయిన కావచ్చును. అవియె సంస్కృతభాషాత్మకములు కావచ్చును. ప్రాకృతభాషాత్మకములు కావచ్చును. అట్టి వాక్యసహచరిత మయిన శారీర మిచట వివక్షితము. వాక్యోచ్చారణము వెన్వెంటనె ప్రయుజ్యమానమగు శారీరము వాక్యాభినయ మగును. ప్రాకృతసంస్కృతపాఠః = ప్రాకృతము సంస్కృత మయిన పాఠ మెందుకలదో యది ప్రాకృతసంస్కృత పాఠమని బహువ్రీహి. ఇట్టి యీ వాక్యాభినయము నాల్గు విధములు.

౧ సంస్కృత గద్యాత్మక వాక్యాభినయము
౨ సంస్కృత పద్యాత్మక ,,
౩ ప్రాకృత గద్యాత్మక ,,
౪ ప్రాకృత పద్యాత్మక ,,

ఈ వాక్యాభినయవిషయమున కతిపయభావ మిట్లున్నది. విశిష్టార్థ మొకటి నిత్యము హృదయమున నుండును. అది విమర్శానుబంధనాదినిరపేక్షము. కావుననే సతతము స్ఫురించును. వేణిలో భీమసేనునకు కురుకులవిషయ మయిన క్రోధాతిశయ మున్నది. "చంచద్భుజాభ్రమితచండగదాభిఘాతే" త్యాదివాక్యము తద్విషయముగా నచట కలదు. ఈ వాక్యపాఠ సమకాలముననే భ్రుకుటీరచనామయముగా శారీరాభినయముండును." అని. ఈభావము తగదు. ఈ వాక్యానంతరము సూచాభినయ మున్నది. సూచ విమర్శపూర్వక మయిన వస్తువిషయముగా నుండును. సూచాప్రవర్తనమున వాక్యప్రయోగ ముండును. ఆ వాక్యసహచరితముగా గూడ శారీర ముండును. ఈ కతిపయభావుల భావమును బట్టి చూడగా నిట్టి దిదియు వాక్యాభినయమె కావలసి యుండును. చతుర్విధవాక్యాభినయ సంబంధమున సూచాదులు బహుభేదములు కలవగుటను నిరూపించెదము.

సూచాభినయము

౩౪ వాక్యార్థే వాక్యం వా సత్వాంగైః సూచ్యతే యదా పూర్వం
పశ్చాద్వాక్యాభినయః సూచేత్యభిసంజ్ఞితా సా తు

సాత్త్వికాంగికాభినయములచే భావివక్తృవ్యము సూచిత మగు నేని తదంతర మయిన యభినయము సూచాభినయ మగును. మొదటగా సాత్త్వికాంగికములచే వాక్యము సూచితము కావచ్చును. వాక్యార్థమేని సూచితము కావచ్చును. ఈ సూచ్యసూచకముల కంతరముగా నుండు సూచాభినయము సామాన్యాభినయసంజ్ఞ కలదగును. ఇందుత్తములగు వారల కభిసంధానవిచారపూర్వకముగనె యీ సూచాభినయ ముండును. వారంతయు మనసులో ముందుగా భావించియె యాచరింతురు. ఆత్మబుద్ధి సమర్థార్యు లని యుత్తముల నందురు. ఈ యభిసంధానకాలము చిరతరముగానుండి యందభిసంధాన మాలోచనము కలుగగనె యుపకరించును. తాదృశవస్తువిశేషావేశమున గలుగు శరీరవికార మొకటి సూచాభినయవిశేష మగుచున్నది. ఇందు రెండు విధానము లున్నవి.

౧. అభిసంధానము కూడుకొని యుండగా నందలి క్రమాక్షిప్తముగా నట్టి క్రమముననె శబ్దోచ్చారణ ముండును. రత్నావలిలో "రాజ్యం నిర్జితశత్రు యోగ్యసచివే న్యస్తః సమస్తోభరః" "రాజ్యమున శత్రువులు లేరు. యోగ్యసచివునందు సర్వభార మున్నది." అను స్థలమున నిది సంగతమగును. ఇందుత్తరోత్తరావాంతర వాక్యార్థము పూర్వపూర్వావాంతరవాక్యాంశముల యభిధేయ భాగములచే ప్రభావితమై యున్నది. ముందభిసంధానక్రమ మెట్లున్నదో యట్టి క్రమమె యున్నది. అభిసంధాన మొకవిధముగా నుండగా నొకచో క్రమము వేరొకవిధముగా నుండును. అచట సంధానీయవాక్యార్థసంధానము నిర్విభాగభేదకముగ నుండును. క్రమము ననుసరించి నిరూపింప వలసిన వాని నక్రమముగ నిరూపించునప్పుడు అనుసంధాన మొనర్ప వలసిన వాక్యార్థము విశకలితముగ ననుసంధానములో గోచరింపదు. అంతయు సంకీర్ణముగ నుండును. విభాగభేద మేమియు భాసింపదు. మాయాపుష్పక మను నాటకమున సుగ్రీవోక్తిలో నిది సంలగ్నమై గోచరించును. అందిట్లున్నది. "దుర్గము భూమి యమాత్యభృత్యసుహృదులు భార్య శరీరము ధనము మానము వైరివిశుద్ధసౌఖ్యము సర్వము దైవకల్పుని సఖ్యమున పొందితిని. ప్రియావిరహి యయిన రామున కీ

సర్వము సంగత మొనర్పవలెను. స్వేచ్ఛాసులభము లయిన శైలాత్మ ఖండములచే గూడ మూర్గఘటన మొనరింపజాలమె!" ఇందిట్లు సూచాభినయము సంగతము చేసికొనవచ్చును. దీనిలో శరీరము భార్య భూమి ధనము భృత్యులు దుర్గము వైరివిమర్దసుఖము అనెడు అభిసంధానక్రమ ముచితము. పదపరామర్శక్రమమున నిది గోచరించును. ప్రకరణార్థవశమున నిది భాసించును. సూక్ష్మముగా సమీక్షింపగా "ఇది మొదట, ఇది యనంతరము, ఇది తరువాత" అను న్యాయభావనమున ననుసంధేయము లంతఃప్రవేశము పొందును. మాయాపుష్పకములో నిల్లనుసంధానము వేరుగా క్రియము వేరుగా నున్నది. వాక్యార్థానుసంధానము నిది యంతయు ననుసంధేయ మగుటచే నిందు వాక్యార్థము సూచిత మయిన దని భావింపవలెను. రత్నావలీఘటనములో వాక్యము సూచిత మయినది. "క్రమో హి వాక్యమితి తద్విదో మన్యంతే "క్రమమును వాక్యమందురు కదా!

ఒకరిట్లనినారు. స్వయముగా విమర్శించు కొనునపుడు వాక్యార్థము సూచిత మగును. పరవచనము వినినపుడు తద్వచనార్థము సూచిత మగుటయు పిమ్మట వచనాభినయమును కలుగును. ఇందలి సూచాభినయములో వాక్యార్థము సూచితము కాదు. వాక్యమె సూచిత మగును. రత్నావలిలో "వయస్య! చూడుము! చూడుము!" అని విదూషకు డుద్యానవర్ణనము పూరించినాడు. అనంతరము రాజు "వయస్య! చక్కగా గుర్తించితివి" అని యనును. ఇందలి సూచాభినయములో వాక్యము సూచిత మగుచున్నది. ఇట్లనుట బాగుగా లేదు. పరవాక్యాపేక్ష యున్నపుడు నివృత్త్యంకురాభినయ ముండనేయున్నది. భావివాక్యాపేక్షమున నుండు సూచాభినయము నివృత్త్యంకురాభినయ మొకటి కాదు. దాని కన్న నిది వేరు. అభినేయముననె యభినయలక్ష్యపరిచయము లేకుండుటయె యిందుపరార్థము. "అభినేయ ఏవాభినయనలక్ష్యం ప్రత్యపరిచయోఽయమపరాధ్యతి" సూచ నంకురముగా బలుకుట పలికినవాని యపరాధము కాదు. ఇట్టి దీనిని వాక్యమే యని యననేల? వాక్యార్థమని యనరాదా? ఈ యర్థమును వాక్యార్థమని స్వీకరింప శక్యము కాకపోదు కదా! పరోదీరితవాక్యా

ర్థమె యిందు సూచిత మగుచున్నది కాని వాక్యము సూచితమగుట లేదు. ఈ మత మిట్లుండు గావుత.

వాక్యాభినయము చతుర్విధమని యిదివరలో నంటిమి. తదర్థ సూచనమున నవి యష్టమూర్తు లగును. ఈ సూచాభినయము నను సరించి యవి పదునారగుచున్నవి. పరవాక్యము భిన్నాంగతాసూచకము కాదు.

అంకురాభినయము

3౮ హృదయస్థో నిర్వచనైరంగాభినయః కృతో నిపుణసాధ్యః
సూచైవోత్పత్తికృతో విజ్ఞేయ స్త్వంకురాభినయః

వాక్య మన్యపరముగానున్నను హృదయస్థము గర్భీభూత మయిన వస్తునిష్ఠముగా నుండు నభినయము వచనశూన్యాంగవికారములచే సంపాదితమై సూచాతుల్యముగా "అంకురము" అను పేరు కల శారీరాభినయ మగును. మాటలు లేని యంగాభినయములచే నిది సిద్ధ మగును. హృదయగూఢముగా నున్న భావము నిది సూచించును. ఈ యంకురాభినయము నిపుణసాధ్యము. నిపుణులగు ప్రయోక్తలె దీని ప్రయోగింప గలరు. నిపుణులైన సామాజికులె దీనిని చేతసా ధ్యానింప గలరు. సచేతో నిశ్చలచేతో నిధ్యేయ మగు నిది నిపుణసాధ్య మనుట సముచితము. ఆ సచేతసులు దీని స్వబుద్ధికల్పనముచ పుణికి పుణికి పుచ్చుకొనగలరు. రత్నావళిలో సాగరికావచనమున నిది సంగత మగును. అంగిట్లు న్నది. సాగరిక:— "నేనును పుష్పాపచయ మొనర్చి కామదేవుని పూజింతును." అని పలికినది. ఈ వాక్యమున గర్భీభూత మయిన కుసుమాపచయమును అంగాభినయవిశేషములచే సాగరిక సూచించినది. ఈ యంకురమును నిపుణులె గ్రహింప వలెను. సాగరిక కుసుమాపచయ మొనరించునపుడెట్టి వచనములు లేవు. ఇది నిర్వచ నాంగవికృతి. దీనిలో కవి పలుకులె యుపజీవ్యములుగా నుండును. "కుసుమాపచయ మొనరించును" అని కవి యనును కదా! కవివచనములె యాధారముగా నున్నను ఈ యంకురమునం దొక విశేష మున్నది. సాగరికాకుసుమాపచయకర్మ తాపసుని కుసుమాపచయము వంటిది కాదు. సాగరిక పువ్వుల నేరుటలో సౌభాగ్యము సౌందర్యము

ప్రేమ సాధ్వసము మొదలగు భావములు గర్భీకృతములై యున్నవి. పుష్పావచయసమయములోని శారీరాభినయములు సౌందర్యాదులను సూచించునవిగానే యుండును. ఇదియంతయు వచట నవచనలభ్యమగుట విస్పష్టము. కాగా నిది యంతయు పర్యాలోచనాతిశయగమ్యముగా నుండును. కావుననే నిపుణసాధ్య మని యనవలసి వచ్చినది. ఈ యంకురాభినయము సూచాభినయము లోని వచనశూన్య మయిన యుత్పత్తిభాగముతో సమానముగా నుండునని వేరుగా నిరూపింప నక్కరలేదు. ఈ యర్థమంతయు నిర్వచనాంగాభినయ మనుట వలననే విస్పష్ట మగుచున్నది.

### శాఖాభినయము.

౩౯ యత్తు శిరోముఖజంఘోరుపాణిపాదైః యథాక్రమం క్రియతే
శాఖాదర్శనమార్గః        శాఖాభినయః   స   విజ్ఞేయః॥

శిరస్సు, ముఖము, జంఘ, ఊరువు, హస్తము, పాదము అను నీయారును క్రమానుసారము సర్వవిధశాఖావ్యాపారములు కలవై తమ తమ నియతప్రయోగమును నిర్వహించినచో నది శాఖాభినయమగును. శాఖాభినయములో నంతట వర్తనము ప్రధానముగ నుండును. శిరఃప్రభృత్యంగముల వలనములు పరావర్తనములు ముఖ్యము లగుట వలననే నానావిధము లయిన శాఖామార్గములన్నియు నిందుండును.

### నాట్యాయితాభినయము.

౪౦ నాట్యాయితముపచారైర్యః క్రియతేఽభినయసూచయా నాట్యే
కాలప్రకర్షహేతోః        ప్రవేశకైః        సంగమో        యావత్
౪౧ స్థానే ధ్రువాస్వభినయో యః క్రియతే హర్షశోకరోషాద్యైః
భావరససంప్రయుక్తైః        జ్ఞేయం        నాట్యాయితం        తదపి.

ఈ నాట్యాయితాభినయము రెండు విధములు. నాట్యరూపకనిష్ఠ మయిన నాట్యాయితము మొదటిది. కార్యాంతరనిష్ఠ మయిన నాట్యాయితము రెండవది. యథాక్రమ మిందు లక్షణము లున్నవి. పూర్వ మొక పాత్ర ప్రవేశింపగా వేరొక పాత్ర ప్రవేశించినప్పుడు అప్పటి ధ్రువాగాన మప్పటి సూచాపరిక్రమణములో తత్సమయ తత్కాలసంకేతముగా నొకింత నాట్య ముండును. ఆ సమయములో

మొదట ప్రవేశించిన పాత్ర సముచితము లయిన కొన్ని యుపచారము లొనరించును. ఇది యంతయు నాట్యాయిత మగును. ఇచట శ్రీశంకు కాదు లిట్లు సంభావించిరి. మొదట ప్రవేశించిన పాత్రతో సంబంధ మేర్పఱచి కొని యనంతరము ప్రవేశించిన పాత్ర పూర్వప్రవిష్ట పాత్ర పరిక్రమణాదుల సమయములో స్థానకమునవె యాసీనుడై యుండి నిల బడిన సమయమున నభినయింపవలెను. అదియు నాట్యాయితమగును." అని. ఇది యుక్తముగ లేదు. ఒకరొకరు కలియువరకు పాత్ర చేష్టిత ముండుట రెండువిధముల సంగత మగును.

౧. ఒకడు చేష్టిత మొనర్చు నప్పుడు తదితరుడు పలికిన వాక్య మున నర్థము సూచితము కాగా తత్సూచనోచితముగా చేష్టిత మొన రించుట.

౨. మాట పలుకే మాత్రము లేక పోయినను తదౌచిత్య మాత్రముననె సిద్ధ మగుట.

ఈ రెండు పక్షములందు మొదటి పక్షమె శ్రీశంకుకాదుల కభీష్ట మయినచో నది నివృత్త్యంకురభేద మగును గాని నాట్యాయితము కానేరదు. రెండవపక్షమె సమ్మత మయినచో నది యంకుర మగును కాని నాట్యాయితము కానేరదు.

నాట్యమునం దభినయసూచానుసారముగా కాలప్రకర్ష రీతిని బట్టి నాట్యాంతరమం దున్నట్లుగా పాత్రలతో సంబంధ మేర్పడగా, సముచితము లయిన యుపచారవిధానములతో గూడిన చేష్టితము నాట్యాయిత మగునని మూలానుసరణముగ గలుగు సామాన్యార్థము. ప్రయోగకుశలురగు వారిట్టి విషయమున ధర్మివిధానము గుర్తించియె నిరూపించినారు. "వ్రాయుచున్నాడని, నిరీక్షించుచున్నాడని, పుష్పావ చయు మొనరించు చున్నదని" నాట్యమున సంధానరూపముగా నుండు వాక్యము సంభవించును. ఒకనాట్యము వేరొక నాట్యమును సంధింప జేయుననుట రమ్యముకాదు. సూచాదులకు సంబంధించు వాక్యమే నాట్యానుసంధానమున నుపకరించును. నాట్యాయితమన్న వాచో యుక్తియు నన్యవిధమున స్పష్టసంగతము కాదు. కాన నాట్యాయిత స్వరూపము నిట్లు వ్యాఖ్యానించుట యుక్తము. లోకమున స్వప్నా

యితమని వ్యవహారమున్నది. అట్లి యీ నాట్యాయితవ్యవహారము సంగతము కాగలదు. స్వప్న మొకప్పు డేకఘనముగా గోచరించును. దానిలోని కొంత భాగమును పరునకు జాగ్రద్రూపమున నుపపాదించి "స్వప్నము నేను కంటిని" అని వర్ణించుట కలదు, అప్పు డది స్వప్నము కాదు. అయినను స్వప్న మని వ్యవహార మున్నది. అప్పటి జాగ్రద్భావము ననుసరించి దాని స్వప్న మని యనుటయె కాని పరమార్థముగా నప్పు డది స్వప్నము కాదు. అస్వప్నమున స్వప్నవ్యవహార మౌపచారికము, జాగ్రద్దృష్టితో నస్వప్నము స్వప్నమని యుపచరితముగా నుండుటచే "స్వప్నాయిత"మని లోకమున వ్యవహారము కలిగినది. ఇట్లి ప్రకృతమునగూడ "నాట్యాయిత" వ్యవహారమును సంగతము చేయు వలెను.

నాట్య మేకఘనస్వభావముగా నుండగా నం దసత్యనాట్యాను ప్రవేశమున నాట్యపాత్రలు సామాజికుల వలె నగుదురు. వారిదృష్టిలో నచట నున్న నాట్యము నాట్యరూపముగ గోచరించినను అనాట్య స్వభావమె కాని పరమార్థముగ నాట్యస్వరూపము కాదు. ఇట్టిదది "నాట్యాయితము" అని వ్యవహారయోగ్య మగును. ఈ నాట్యాయితము రెండు విధములు. నాట్యరూపకనిష్ఠము కార్యాంతరనిష్ఠము నని. ఈరెండిటి లక్షణమె యీయార్యాద్వితయమున నిరూపితమయినది.

నాట్యమునందు నాట్యాంతరమం దున్నవిధముగా ప్రవేశకవిధమున నుండు పాత్రలు వచ్చి సంగమము సంపాదించినచో నది నాట్యాయిత మగును. ప్రవేశకము లని యనుట—"అంతట ప్రవేశించుచున్నాడు"—మొదలగు వాక్యములచే నిర్దిష్టులనిభావము. వీరు నాట్యమున సంగతులగుట నాట్యాయిత మయినది. ఒక విశిష్టాభినయద్వారమున తత్సూచన ముండును. కొన్ని యుపచారవిధులచే తత్సూచన ముండును. ఆ యుపచారములు పరమార్థసత్యము లనునట్లుగా నుపచరితములుగా నుండును. ఇందు మొదటినుండియు నియతముగా నున్న నాట్య మొకటియు సంగతపాత్రగతముగా నున్న నాట్యము వేరొకటియు కలదు కదా ? ఇం దుభయము నాట్యము కాజాలదు. కాలప్రకర్ష ము కారణముగా నన్యోన్య మివి భిన్నకాలములుగా నుండుటచే

వీనిలో నేకఘనత్వము రాదు. ఉన్నదంతయు యుక్తము కాదు. ఈ నాట్యాయిత మనునది యంతటనుండును. భూయస్తరముగా ప్రబంధ మంతయు వ్యాపించును. పరిమితప్రబంధము నేని సర్వము వ్యాపించును. ఇట్టిదిది యంతయు నాట్యాయిత మగును. స్వప్నమున స్వాప్నము కలుగును. అట్టి స్వాప్నాంతరము లెన్ని యేని కలుగును. స్వాప్నాంతరములో స్వాప్నాంతరములు నుండవచ్చును. ఇట్టి స్వప్నపరంపర ననుసరించి యేకఘనస్వాప్నాయిత వ్యవహారమును చెప్పుకొందుము. అట్లే నాట్యములో నాట్యము, అందును వేరొక నాట్యము. ఇట్లు నాట్యాంతరము లెన్నియున్నను సర్వములవి సర్వథా నాట్యాయితము లను వ్యవహారమునకు తగియే యుండును. మహాకవి సుబంధువు "వాసవదత్తానాట్యధార" యను ప్రయోగము కూర్చినాడు. అది యంతయు బహుతర వ్యాపియు బహుగర్భస్వాప్నాయితతుల్య మయిన నాట్యాయితమున కుదాహరణము కాగలదు. అం దుదయనచరితము ప్రధానముగా ప్రయోజ్యవస్తువు. బిందుసారు డందు సామాజికుడుగా నిరూపితు డయినాడు. ఉదయనుడును వాసవదత్తాచేష్టితమున సామాజికీకృతు డయినాడు. స్వకీయసూత్రరూపకమును సంభావించినచో నిదియంతయు సుజ్ఞానము కాగలదు. వైతత్యభయమున నంతయు ప్రదర్శింపలేము. ఈ నాట్యాయితము హృదయరూఢ మగుటకు కొంత ప్రదర్శించుట సముచితము.

ఉదయనుడు సామాజికీకృతు డయినాడు. అప్పటి సూత్రధారప్రయోగ మిట్లున్నది.

"తవ సుచరితైరేష జయతి" నీ సుచరితములచే నీతడు "జయతి"

ఉదయనుడు:— నాకు సుచరితము లెక్కడివి ?

(కన్నీరు నించి విలపించును)

"అమ్మా! రమ్మా! సోదరులయిన కటకపింగలకపాలకు లందరు భక్తులు. వారితో బాటుగా నన్నుదయనుని లాలింపుము. యౌగంధరాయణ! మా యా రాజపుత్రిని తెమ్ము! హా! హార్షరక్షిత ? నీ వపప్రభావుడ వయితివి కదా ?"

ఇట్టి యీ ప్రఘట్టమున బిందుసారుఁడు సామాజికుడై యంతయు పరమార్థముగ భావించి;

"ఇట్టి భక్తుల ప్రలాపము లిట్లుండుటచే నామె ధన్యురాలు" అని విశ్వసించును.

ప్రతీహారి:- (స్వగతముగా) పరమార్థ మెరుగని వారినుద్దేశించి ప్రభువు ప్రశ్నించుచున్నారు.

ఇత్యాదిక మయినసన్నివేశము భూయస్తరముగా ప్రబంధవ్యాపి. పరిమితవ్యాపి యయిన నిర్గర్భనాట్యాయితము బాలరామాయణము లోని గర్భాంకములో సీతాస్వయంవరము నందున్నది. దాని నుదాహరణముగ భావింపవచ్చును. ఇప్పటి కిది యంతయు నాట్యరూపక నిష్ఠ మయిన నాట్యాయితము. ఇక కార్యాంతరనిష్ఠ మయిన నాట్యాయితమును వ్యాఖ్యానింప వలసియున్నది.

నానారస సంప్రయుక్తము లయిన హర్షశోకరోషాదులతో ధ్రువావిషయము లం దొనర్చెడి యభినయము కూడ నాట్యాయిత మగునని సామాన్యమైన యర్థము. ఆభ్యంతరరసావేశ మున్నపుడు ధ్రువాయోగాభినయ ముండును. పరస్పరము సంగతము లయిన వాని సామ్యమున నది రమణీయ మగును. పరస్పరసమ్మేలనమును కాకతాలీయముగనె సంప్రాప్త మగునని సంభావింప వలెను. ధ్రువాభినయమున చిత్తభావము చూపింతునని ప్రయోక్త కభిసంధి యుండును. ప్రాసాదిక్యధ్రువాగాన మొనరించినప్పుడు ధ్రువార్థమై యాఘాతము సముచితము వాక్యముచే నిరూపితము కాని విశేషమును గీతప్రయోగమున సాధించుట యుక్తము. ఏతదనుకూలముగ కవుల ప్రయోగము లున్నవి. "బహువిధాం మదనావస్థాం నాటయతి" మదనావస్థను బహువిధముగా నభినయించుచున్న దని రూపకములందు కవిసంకేతము కన్పడును. ఇట్టిదిది యంకుర స్వాభావముగ నుండి పౌర్వాపర్య పర్యాలోచనవశమున తదనుకూల మగును. ఒకప్పుడు ధ్రువాప్రయోగము లేకున్నను కాకతాలీయమున ప్రయోగసన్నిహిత మయినదిగనె భాసించును. అప్పుడు ధ్రువాసహచరితముగానున్న నాట్యము నాట్యమువలెనై నాట్యాయితస్వరూపమును సంపాదించి నాట్యాయిత మన్న

శారీరాభినయ మగును. ఈ యంశమె ధ్రువాగీతములం దొనర్చెడి యభినయము నాట్యాయితమగుటగా సూచిత మయినది. భావరససంప్రయుక్తము లని యనుటచే నీ యర్థము పరిగ్రాహ్యము. భావములు = వ్యభిచారిభావములు. రసములు = రసనియతము లయిన స్థాయిభావములు. ఈ భావరసముల నావిష్టు లయినవారు భావరససంప్రయుక్తులు. ప్రయోక్తలు తత్సంపాదనైకమనస్కులై యుండుట యపేక్షితము. అట్టి ప్రయోక్తలు ధ్రువార్థవిషయముగా నభినయ మొనరింతురు. ఈ యభినయము ప్రసంగము రాగా కాకతాలీయవశమున కూడుకొనును. ధ్రువాపదములం దభినయమున్నను ప్రతిపదము నందది యుండదు. హర్షాదుల సూచించు నంగోపాంగసత్వములతో నభినయ ముండు ననుటచే వాని ప్రసక్తి యున్నపుడె యభినయ ముండునని భావము. మొదట చెప్పినదియె నాట్యాయిత మగుట కాదు. ఇదియు నాట్యాయిత మగునని భావము.

నివృత్త్యంకురాభినయము

౪౨ యత్రాన్యోక్తంవాక్యం సూచాభినయేన యోజయేదన్యః
తత్సంబద్ధార్థకథం భవేన్నివృత్త్యంకురః సోఽథ

ఒకరు పలికిన వాక్యము తనకును సంబంధించినట్లున్నదని మరియొకరు సూచాభినయమున యోజన మొనర్చినచో నది నివృత్త్యంకురాభినయ మగును. అన్యోక్తవాక్య మన్యసూచాభినయములో చిత్తవృత్తిసూచక మయిన యంగోపాంగసత్వక్రమమున ప్రదర్శించుట యసంగతము కాదు. తదర్థము తత్కథసంబంధించి యుండుట సర్వ నిమిత్త మయినది. అంకురము బీజాదుల నివృత్తిని సూచించును. అంకురము రాగనె బీజము గతించుట స్పష్టము. అట్లె వాక్యము నివృత్తముకాగా తదంకురముగా నీ నివృత్త్యంకుర మున్నది. దీని యుదాహరణము. విదూషకుడు వత్సరాజుతో నిట్లనును.

"నీకిది లోచనముల సుఖపెట్టునా?" అని రాజు నడుగగా,

సాగరిక :— "జీవితమరణముల యంతరమున నున్నాననుట సత్యమె"

రాజు :— "సుఖపెట్టుటయేనా? ప్రయాసపడి నా లోచనము లూరుయుగము దాటి నితంబస్థలమున విశ్రమించి"—

ఇత్యాదిగా రాజు పలుకగా సాగరిక సర్వము సాదరముగా వినును. అప్పుడామెలో సంశయోత్కంఠారాగముల సముదయమున జనించిన సత్త్వాంగోపాంగముల పరిస్పంద మంతయు వ్యభిచారిసత్త్వసంయోజిత మయి నివృత్త్యంకురాభినయ మయినది. వత్సరాజు పలికిన వాక్యార్థ మంతయు తన కథార్థమై యున్నందున సాగరికలో రాగోదయ మిచ్చినది. అప్పుడామెలో గలిగిన యభినయ మంతయు నంకురము వలె నున్నందున నివృత్త్యంకుర మయినది. నాట్యాయితము వాసవదత్తా నాట్యధారలో నంతట ప్రతిపద మవభాసించును.

ఈ యభినయము లన్నియు సర్వాభినయములతో సంగతములై యుండును. అభినేయమం దంతట సామాన్యముగా సంబంధించి యుండును. కావుననె యివి సామాన్యాభినయము లయినవి. అందు వలననె వీనిని వితతముగా నింతగా నిరూపింప వలసి వచ్చినది. ఇట్లు నిరూపించితిమి. ఇంతవర కాంగిక మయిన సామాన్యాభినయస్వరూప ముపపాదించుట కాగా వాచిక మయినది క్రమప్రాప్తము.

ఏతేషాం తు భవేన్మార్గో యథాభావరసాన్వితః

ఈ నిరూపించిన సామాన్యాభినయములకు విషయము నియతముగా నున్నది. అది యథాభావరసాన్విత మగును. ఈ యభినయములు భావాన్వితములై రససంగతములై యుండుటయే యుక్తము. అభావ మరసముగా నుండునది యమార్గము. భావరస సాంగత్యమునకై యంతట వాక్యత్వసిద్ధి యావశ్యకము కాదు. వాక్య భావమున నున్న శారీరము కూడ నొకప్పుడు నిర్విషయమె యగును. శాఖాభినయ మంకురాభినయము నాట్యాయితాభినయములు మూడును వాక్యవిరహితములని యనుకొని కొందరు వాక్యాభినయ సూచాభినయ నివృత్త్యంకురాభినయములకు మాత్రమె భావరసాన్విత మయిన మార్గ ముండుటను జెప్పిరి. భరతభావము నట్లు సంకుచితముగ సమన్వయించిరి. వారు తత్త్వజ్ఞులు కారు. అభినయ మేది యయినను వాక్యోపజీవనము తోడనె యుండును. వాక్యోపజీవనము లేకున్న నియమహేతు వుండదు. సర్వ మసమంజస మగును. కేవలము తత్కాలికవాక్యమని యతత్కాలికవాక్యమని వాక్యము భేదము కలది యయినను అంత

మాత్రమున నేమియు లోటు రానేరదు. సర్వవిధము లయిన యీ యభినయములు భావరససంబంధము కలవై స్వవిషయనియతములై సచేతోమోదమును సంపాదింపగలవు.

## వాచికాభినయము

దశరూపకములలో వాచికాభినయస్థితి పంద్రెండు విధములుగా నుండుట ప్రసిద్ధము. కావ్యవస్తువు లందిది స్పష్టముగా నిర్దిష్టమై గోచర మగుచున్నది. వానినామము లీ విధముగా నున్నవి.

| | | |
|---|---|---|
| ఆలాపము | ప్రలాపము | విలాపము |
| అనులాపము | సంలాపము | అపలాపము |
| సందేశము | అతిదేశము | నిర్దేశము |
| ఉపదేశము | అపదేశము | వ్యపదేశము. |

వీని లక్షణవాక్యము లీ విధముగా నున్నవి.

౪౩ అభాషణం తు యద్వాక్యం అలాపో నామ సస్మృతః
అనర్థకం వచో యత్తు ప్రలాపః స తు కీర్తితః
౪౪ కరుణప్రభవో యస్తు విలాపః స తు కీర్తితః
బహుశోభిహితం వాక్యం అనులాప ఇతి స్మృతః
౪౫ ఉక్తిప్రత్యుక్తిసంయుక్తః సంలాప ఇతి కీర్తితః
పూర్వోక్తస్యాన్యథావాదో హ్యపలాప ఇతి స్మృతః
౪౬ తదిదం వచనం బ్రూహీత్యేష సందేశ ఉచ్యతే
యత్త్వయోక్తం మయోక్తం తత్సోఽతిదేశ ఇతి స్మృతః
౪౭ స ఏషోహం బ్రవీమీతి నిర్దేశ ఇతి కీర్తితః
వ్యాజాంతరేణ కథనం వ్యపదేశ ఇహోచ్యతే
౪౮ ఇదం కురు! గృహాణేతి హ్యుపదేశః ప్రకీర్తితః
అన్యార్థకథనం యత్స్యాత్ సోఽపదేశః ప్రకీర్తితః

౧. ఆలాపము : సంభాషణవిషయకముగా నున్న వాక్యమాలాపము. ఇందుపదేశాదిక ముండదు. ఇది యెదుట నున్న వానిని సంబంధించి యుండును. యుష్మదర్థవిషయముగా నుండును. రాజు రత్నావళితో నిట్లనును "విభ్రాజసే మకరకేతనమర్చయంతీ" కామపూజచేయుచు నీ వెంతగనో బాగున్నావు", ఇట్టి దాలాపము. ఇట్లె రాజు నుద్దేశించి "జయతు! భవాన్!" అనుటయు నాలాపము.

"యుష్మదర్థవిషయముపదేశాదిశూన్యం యద్వచనం తదాలాపః"

౨. ప్రలాపము : అనర్థకవచనమునకు ప్రలాప మని పేరు. మౌర్ఖ్యాదివశమున పరస్పర మసంబద్ధముగా పలుకుట. దరిద్రచారుదత్తములో (మృచ్ఛకటికము) శకారుని వచనములు. "పుష్పమాల పరిమళం వింటాను. చీకటిచే ముడుచుకొన్న ముక్కుతో చూస్తాను." ఈ వాక్యములందు కర్మకరణ సంబంధము లేదు. పరస్పరమిది విరుద్ధముగా నుండుట ప్రసిద్ధము.

౩. విలాపము : కరుణజన్య మయిన వచనము విలాపము. కరుణగ్రహణము దుఃఖమున కుపలక్షణము. విప్రలంభము కూడనిందు పరిగ్రాహ్యము. దుఃఖమున కరుణరససంబంధ మయిన వచన మిట్లుండును. "క్వాసి? ప్రయచ్ఛ మే ప్రతివచనం" ప్రేయసీ! నీవెక్కడనున్నావు? నాకు మాటచెప్పవే?" ఇట్లే విప్రలంభప్రలాపమును రత్నావలినుండి గుర్తించునది. విప్రలంభప్రధాన మయినందుననె ప్రలాప మారవ కామావస్థావిశేష మయినది.

౪. అనులాపము : మాటిమాటికి పలికిన వాక్య మనులాపము. పలికినమాటనె మఱల మఱల ననువాదార్థము పలుకవలసి వచ్చును. రత్నావలిలో సూత్రధారుడు "ద్వీపాదన్యస్మాదపి" మొదలగునది పలుకగా ననంతరము యౌగంధరాయణుడు ప్రవేశించి "ఏవమేతత్; "ద్వీపాదన్యస్మాదపి" మొదలగునది యనువదించును.

౫. సంలాపము : ఉక్తిప్రత్యుక్తిసంయుక్తమును సంలాపమని యందురు. అభినేయములం దంతట నిది సుప్రసిద్ధము. చిన్నచిన్న వాక్యములతో కథాగమనమున కనుకూలముగను చమత్క్రియాస్ఫోరకముగను భావనిరూపకముగను ఉక్తిప్రత్యుక్తు లుండుటను ప్రయోక్తలు రమ్యముగ భావించిరి.

౬. అపలాపము : పూర్వోక్తమున కన్యథావాదమును పలుకుట యపలాప మగును. తాను పలికిన వచనమును తానె కాదనుట యపలపించుట యగును. కృత్యారావణ నాటకమున నిది సంగత మగును. గౌతమీరూపమున ప్రచ్ఛన్నముగా నున్న శూర్పణఖ రాముని యాక్రందితమును లక్ష్మణునకు విన్పింపదలచినదై మొదట ఇట్లనును.

శూర్పణఖ :— నీవు వింటివా ?

సీత :— (సంభ్రమముగా) అమ్మో ! ఏమని ?

శూ :— (ఆత్మగతము) అం వంచితా ! సరే ! నన్నీ సీత గౌతమియనియె తెలిసి కొననీ ! ఇట్లందును – (ప్రకాశముగా) ఆం నేను విన లేదు. నీవు వింటివేమో యని !

౭. సందేశము : నా యీ మాటగా నీ విట్లను మని యనుట సందేశ మగును. ఇతరునకు పరముఖమున స్వవచోఽర్పణము సందేశ మగును.

౮. అతిదేశము : నీవు యుక్తముగ జెప్పిన దాసినె నేనును జెప్పితి ననుట యతిదేశము. "సిద్ధేనాసిద్ధస్య తుల్యతాపాదనమతిదేశః" అసిద్ధమునకు సిద్ధముతో సామ్యము నిరూపించుట యతిదేశ మని యందురు. ఇందుపదేశాతిదేశములకు నుపమానమునకును సాహిత్య విషయమునందును తార్కికమీమాంసకవిషయములందును టీకా కారులు విశేషప్రతిపాదనము కావించిరి. అది యంతయు సుకుమార మనోమోహనము వృథాభ్రమణికామాత్రము ప్రకృతోపయోగియు కాదు. ఉపేక్షణీయము.

౯. నిర్దేశము : "ఆయీ నేనిపుడు చెప్పెద" ననుట నిర్దేశ మగును. పూర్వ మా విధమున ప్రసిద్ధుడ నయిన నేనిప్పుడు పలుకు చున్నా ననుటలో నొక భాగగరిమయు గోచరించును.

౧౦. వ్యపదేశము : వ్యాజాంతరమున జెప్పుట వ్యపదేశము. వ్యాజవిశేషమున బలుకుట యని భావము. ముద్రారాక్షసమునందు క్షపణకుని చాణక్యుడు నగరమునుండి నిర్వాసింపజేయును. అది యంతయు రాక్షసుడను మంత్రిని దూషించుటకు పన్నిన తంత్రము. అప్పుడు వ్యాజముగా చాణుక్యు డిట్లుపల్కును. "ఈ పాపాత్ముడు రాక్షసప్రయుక్తవిషకన్యచే పర్వతేశ్వరుని చంపినాడు. అందుననే సాగనంపుచుంటిని." అని

౧౧. ఉపదేశము : ఇది చేయుము ! ఇది గ్రహింపుమని యనుట యుపదేశ మగుచున్నది. ఉపదేశ మొకవిధముగా నాజ్ఞ వంటిది. ఇది నియోగము.

౧౨. అపదేశము : అన్యార్థకథన మపదేశ మయినది. తాను చెప్పదలచిన దానిని అన్యుడే యిట్లు పలుకు చున్నాడని యనుట యపదేశ మగును. వేణిలో సహదేవుడు భీము నుద్దేశించి "ఇట్లు గురువులన్నగారు సందేశించినారు" అని యని కొంతచెప్పుట యపదేశము.

ఈ చెప్పిన వన్నియు మార్గములు. సర్వశారీరాభినయముల కివి యోజకములు. సర్వాభినయయోజకములు. నాటకాదికావ్యవిశేషము లన్నియు నభినీయమానము లగుటచే నభినయము లగును. "అభినీయంతే ఇత్యభినయాః" సామాన్యముగా నివి వాని యందన్నిట సంభవించును గావున సామాన్యాభినయము లగునని తాత్పర్యము గ్రహింపవలెను. వీనికన్నిటికిని సప్తవిధము లయిన స్వరూపము లున్నవి. వాని లక్షణము చెప్పెదము.

౧ ప్రత్యక్షము ౨ పరోక్షము 3 వర్తమానము
౪ భూతము ౫ భవిష్యత్తు ౬ ఆత్మస్థము
౭ పరస్థము— అని సప్తప్రకారము లున్నవి.

"ఈ నేను పలుకుచున్నాను."
"ఇదిగో! నేను పలుకను"

అను నీ పలుకు ప్రత్యక్షము పరోక్షము వర్తమానము నగును. "నేను చేయుదును. వెళ్లెదను. పల్కుదును." అను వచనము ఆత్మస్థము వర్తమానము ప్రత్యక్షము నగును. "కరిష్యామి, గమిష్యామి" "వదిష్యామి" చేసెదను, వెళ్ళెదను పల్కెదను" అనునవి ఆత్మస్థములు పరోక్షములు భవిష్యత్కాలములు నగును. "నా సర్వశత్రువులు నాచే హతులయినారు, జితులయినారు. భగ్నులయినారు" అనుట యాత్మస్థము పరోక్షము భూతకాలము నగును. నాట్యకర్మలో "నీచే వారు హతజితులు" అనినచో నది పరోక్షము పరస్థము భూతకాలము నగును. "ఆత డొనర్చుచున్నాడు వెళ్ళుచున్నాడని నేనందును" అనుట పరస్థము వర్తమానము ప్రత్యక్షము నగును. "ఆతడు వెళ్ళుచున్నాడు చేయుచున్నా" డనుట పరస్థము వర్తమానము పరోక్షము నగును. "చేయుదురు వెళ్లుదురు. పల్కుదురు" అనుట భవిష్యత్కాలము పరోక్షము నగును. ఆత్మస్థమయిన పారోక్ష్యము విషయ భేదకృతముగా గూడ నున్నది.

౪౯. హస్తమంతరతః కృత్వా యద్వదేన్నాట్యకర్మణి
అత్మస్థం హృదయస్థం చ పరోక్షం చైవ తన్మతం

నాట్యకర్మలో స్వగత, జనాంతికాపవారితకములందు హస్తమంతరముగా నుంచి పలుకుట యాత్మస్థము హృదయస్థము పరోక్షము నగును. స్వగతాదులలో వక్త కది యాత్మస్థమయి పాత్రాంతరముల కప్రత్యక్ష మగును గావున నాట్యధర్మివశమున నాత్మస్థ మయినను పరోక్ష మగును. లోకధర్మి యగునది కూడ ఆత్మస్థము పరోక్షము నగును.

"సుప్తో మత్తోఽహం కిల విలలాప"

"నేను నిదురించి మత్తుడనై విలపించితినట ?" యనునది యాత్మస్థము పరోక్షము నగుచున్నది. చిత్తవ్యాక్షేపాదుల వలన సుత్తము లందును మత్తవిలాపము లుండును. ఇంక నితర భేదము లెన్నియో యిందు సంపన్నములగును. ఆత్మపర కాలవిశేషణమున సప్తప్రకారములుగా నున్నవియు ననేకధా భేదములు కలవగును. ఈ ప్రయోగములన్నియు మార్గాభినయయోజితము లగును. వీని యందనుగతమై వివిధాభినయ మున్నది.

వాక్యాభినయము పంద్రెండువిధముల భేదము కలదగుచున్నది. ఆత్మస్థపరస్థములు ప్రత్యక్షత్వపరోక్షత్వములచే నాల్గువిధములై కాలత్రయమున గుణితములై ద్వాదశభేదములు కలవగును. యోగిప్రత్యక్షాది విశేషము ననుసరించి భూతభవిష్యత్తులు ప్రత్యక్షములగుట యిందు సంఖ్యాతము కాదు. ఈ పంద్రెండుభేదములను పంద్రెండు విధముల గుణించి గణించినచో చతుశ్చత్వారింశదధికశతభేదములు, ౧౪౪, సిద్ధము లగును.

ఇవియన్నియు మార్గాభినయయోజితము లయిన ప్రయోగము లని తెలియవలయును. వీనియందే వివిధాభినయము నిష్పన్నమగును.

౫౦ శిరోహస్తకటీ వక్షో జంఘోరుకరణేషు తు
నమః కర్మవిభాగో యః సామాన్యాభినయస్తు నః

౫౧ లలితైస్తస్త సంచారైః తథామృద్వంగచేష్టితైః
అభినేయస్తు నాట్యజ్ఞైః రసభావసమన్వితైః

శిరోహస్తకటీవక్షో జంఘోరుకరణములందు సమానమగు కర్మవిభాగము సామాన్యాభినయ మగును. నాట్యవిదులగు వారు సామాన్యాభినయము సావధానముగా ప్రయోగింప వలెను. వారు రసభావ సమన్వితులై లలితహస్తసంచారములచే మృదువుగా నుండు నంగ విచేష్టితములచే నభినయింప వలెను. సర్వాభినయము లందిది సామాన్యముగా నుండు సామాన్యాభినయము కదా ? విశిష్టమగు నిది సామాన్యముగా నభినీయమాన మయ్యు సమూహరూపముగా నభినయములతో కూడుకొని యేకీభావనిబంధన మగుచున్నది. అలాత చక్రమండలముతో సన్నిభమై యొకటిగా నసంభిన్నముగా నవభాసించును. ఇట్టి యీ సామాన్యాభినయక్రియకు సముచితమయిన ప్రాధాన్యమున్నది. ఆ ప్రాధాన్యము నిట్లు ప్రదర్శింప వచ్చును.

౫౨ అనుద్ధతమసంభ్రాంత మనావిద్ధాంగచేష్టితం
లయ తాల కలా పాత ప్రమాణ నియతాత్మకం
౫౩ సువిభక్త పదాలాప మనిష్ఠుర మకాహలం
యదీదృశం భవేన్నాట్యం జ్ఞేయమాభ్యంతరం తు తత్

ఈ నాట్యము రెండు విధములు. ఆభ్యంతరము బాహ్యమని మొదటి మూడుపాదము లందాభ్యంతరనాట్యస్వరూప మున్నది. ఆభ్యంతరనాట్య ముద్ధతము గా నుండదు. సంభ్రాంత చేష్టితములతో నుండదు. అంగచేష్టితము లన్నియు ననావిద్ధము లప్రహతములై యుండును. తెగతెంపు లందుండక సమీకృతరూప ముండును. ఈ యనావిద్ధత యాంగికవిషయ మయిన సామాన్యధర్మము. లయ- తాలము- కల- పాతము- వీని ప్రమాణములతో నియతరూపము కల దగును. పదము లాలాపములు చక్కగా విభక్తములై యుండుట నిష్ఠురత్వము లేకుండుట, అనాకులముగా నుండుట యాభ్యంతరనాట్య స్వరూపము. ఇట్లుండుట నాట్యమున యోగ్యత. లేకుండుట దోషము. ఇట్టివాని యభావమున దుష్టత్వమును వ్యతిరేకక్రమమున సూచించి నను సామాన్యాభినయ మనశ్యోపాదేయ మని స్పష్టము కాగలదు.

౫౪ ఏతదేవ విపర్యస్తం స్వచ్ఛంద గతి చేష్టితం
అనిబద్ధగీతవాద్యం నాట్యం బాహ్యమితిస్మృతం
౫౫ లక్షణాభ్యంతరత్వాద్ధి తదాభ్యంతర మిష్యతే
శాస్త్రబాహ్యం భవేద్యత్తు తద్బాహ్యమితి భణ్యతే

పైననిరూపించిన యాభ్యంతరలక్షణసంపత్తి విపర్యస్త మగు నేని, స్వచ్ఛందగతిచేష్టితములతో నుండు నేని వారివారి యభీష్టమున వారొనరింతు రేని గీతముగాని వాద్యముకాని యబద్ధస్వభావమై బాహ్యానాట్య మగునని నిర్ణీతమగుచున్నది. లక్షణాభ్యంతరము లక్షణసముపేత మయినచో నాభ్యంతరనాట్య మందురు. శాస్త్ర బాహ్యమయినచో బాహ్యానాట్యమందురు. బాహ్యానాట్యమునకు నియతి యుండదు. తలకొకరీతి నుండు తలంపులతో నిండి యనుగత ధర్మరహిత మగును. అట్టిది సహృదయాస్వాదమీయజాలదు.

౫౬. అనేన లక్ష్యతే యస్మాత్ ప్రయోగః కర్మ చైవ హి
తస్మాల్లక్షణమేతద్ధి నాట్యేఽస్మిన్ సంప్రయోజితం
౫౭. అనాచార్యోషితా యే చ యే చ శాస్త్రబహిష్కృతాః
బాహ్యం ప్రయుంజతే తే తు అజ్ఞాత్వాచార్యకీం క్రియాం

వాగంగాభినయోపేత మయిన లక్షణము బాహ్యానాట్యమున గూడ నుండునని తలంపవలదు. లక్షణ మనునది ప్రయోగమును కర్మను చక్కగా లక్షితముచేయును. లక్షితము చేయునదె లక్షణము. అట్టి లక్షణమె యీ నాట్యమున సంప్రయోజిత మయినది. లక్షణ మనునది సామాన్యాభినయరూపమె యని తాత్పర్యము. నాట్యవిష యము లయిన క్రియ లన్నియు ప్రత్యేకముగా నేకీభావము పొందునవి కావలయును. ఏకీభావము పొందని క్రియాసమూహము కూడ ఏకీ భావము పొందింపదగి యున్నది. కర్మప్రయోగములు రెండును నాట్య మున ప్రాణప్రాయములు. నాట్యమునం దివి యవశ్య ముండితీర వల యును. అట్లవి లేకున్న స్ఫుటమగు నాట్యరూపత్వమె సిద్ధము కాదు. సాక్షాత్కారాధ్యవసాయరూపమగు రసప్రాణిత మయిన నాట్య సంపత్తి కివి పరమావశ్యకములు. నాట్యాచార్యుని సమీపమున నివ సింపనివారు గురుకులక్లేశము తెలియనివారు శాస్త్రబహిష్కృతు లగువారు నాట్యాచార్యు లుద్బోధించు క్రియాసంపదను తెలియజాలరు. అట్టివారు స్వయముగ తామె యేదో యభ్యూహించి ప్రయోగ మారంభింతురు. అది బాహ్యానాట్యమగును. నాట్య మభ్యసిన మొన రింపనివారలకు వ్యుత్పత్తి దూరదూర మగును. ఉత్తుత్త భట్టపుత్రులకు వ్యుత్పత్తి యుండదు. వారాచార్యాంతేవాసులు కారు.

సామాన్యాభినయ మభినయముల సమవాయస్వరూపముతో నుండును. సంభూయాభినయ మీరీతి నుండును.

౩౮. శబ్దం స్పర్శంచ రూపం చ రసం గంధం తథైవ చ
ఇంద్రియాణీంద్రియార్థాంశ్చ భావైరభినయే ద్బుధః

అభినయబుధుడు శబ్ద స్పర్శ రూపరసగంధములను భావానుసారమున నభినయింప వలసి యున్నది. శబ్దాదుల నెట్లభినయింపవలయునో చెప్పెదము. ఇంద్రియము అని యనదగిన త్వక్-చక్షుః-శ్రోత్ర-జిహ్వా-ఘ్రాణేంద్రియములను భావానుసారమున నభినయింపవలెను. ఇంద్రియమునకు శబ్దస్పర్శాదివిశేషరూప మయిన యింద్రియార్థముతో సంబంధమున్నది. శబ్దాదులె యింద్రియార్థములు. సామాన్యముగా శబ్దము నభినయించుట కన్న శబ్దవిశేషము నభినయించుటలో విశేషము కలదు. అట్టి విశేషము లన్నియు విశదము లగునట్లు విశిష్టాభినయము భావాధారమున నొనర్పవలయును. ఈ ప్రసంగమున నీ భావపదము క్రియావిశేషపరము. ఆ క్రియావిశేషము లన్నియు స్పష్టము కాగలవు. ఇంద్రియము లన్నియు స్వవిషయగ్రహణావేశముతో నుండుటయు, సర్వవిషయములు స్వకరణ (ఇంద్రియ) గ్రాహ్యతావేశముతో నుండుటయు ప్రదర్శితము కావలెను. కాగలదు. కావుననె సామాన్యాభినయోన్నేయము లయిన యీ రెండంశములలో నభినయమున సాధారణ్య ముండును. శబ్దాదులకు సంబంధించిన క్రియావిశేషముల రీతులీవిధముగా నుండును.

౩౯ కృత్వా సాచీకృతాం దృష్టిం శిరః పార్శ్వనతం తథా
తర్జనీం కర్ణదేశే చ బుధః శబ్దం వినిర్దిశేత్
౪౦ కించిదాకుంచితే నేత్రే కృత్వా భ్రూక్షేపమేవచ
తథాంసగండయోః స్పర్శాత్ స్పర్శమేవం వినిర్దిశేత్
౪౧ కృత్వా పతాకామూర్ధస్థా కించిత్ప్రచలితాననః
నిర్వర్ణయంత్యా దృష్ట్యా చ రూపం త్వభినయేద్బుధః
౪౨ కించిదాకుంచితే నేత్రే కృత్వోత్ఫుల్లాం చ నాసికాం
ఏకోచ్ఛ్వాసేన చేష్టా తు రసగంధౌ వినిర్దిశేత్

౧. శబ్దాభినయము : నాట్యవిబుధుడు శబ్దాభినయము నిర్దేశించునప్పుడు దృష్టి నడ్డముగా నుంచవలెను. శిరస్సును పార్శ్వమునకు వంచ

వలెను. తర్జనిఁవేలును చెవిదగ్గర చేర్చవలెను. సాచీకృతదృష్టి ననుస రించుటచే సమాదరమున సమస్తభరము శ్రోత్రదేశ మనుగమించును. రఘువంశములో కాళిదాసిట్లనినాడు, "శేషేంద్రియవృత్తిరాసాం సర్వాత్మనా చక్షురివ ప్రవిష్టా" ఆ కాంతల సర్వేంద్రియముల వ్యాపార మంతయు సర్వవిధముల నేత్రము జేరి నట్లున్నది" అని కర్ణదేశమున తర్జని నుండుటచే "శ్రోత్రముకూడ శబ్దగ్రహణాసక్త మయినవిధమున నభినీత మగును. ఇట్లే యంతట గుర్తించునది.

౨. స్పర్శాభినయము : స్పర్శనిర్దేశములో నేత్రములు కొంచె మాకుంచితములు కావలెను. భ్రూక్షేప మొనర్ప వలెను. తనభుజమును తనకపోలమును తానె స్పృశింప వలెను. కన్నుల యరమూతలు బొమలెగురవేయుట లంసగండముల స్పర్శములు క్రమభావులు సమ భావులు ముహుర్భావులు కాగా స్పర్శ మభినయించి నట్లగును.

3. రూపాభినయము : రూపాభినయమునందు పతాకాహస్త ములను శిరముననుంచి కొంచెముగా నాననము చలింపజేసి దృష్టిని నిర్వర్ణన మొనరించు విధమున నుంచవలెను. అది రూపాభినయము.

ర. ౫. రసగంధాభినయము : నేత్రముల యాకుంచనము నాసిక యుత్ఫుల్ల మగునట్లొనర్చుట ఒకటే యుచ్ఛ్వాసమున నుండుట యిష్ట రసాభినయమున నిష్టగంధాభినయమున నిర్దేశింపవలసి యున్నది. అయి దింద్రియముల కీ యయిదు విషయము లిట్లభినీతము లయినపు డవి తగిన క్రియావిశేష ముండుటచే చక్కగా ననుభావన మందింపగల వనుట నాట్యవిదులకు సమ్మతము.

౬3. ఇంద్రియార్థాః సమనసో భవంతి హ్యనుభావినః
న వేత్తి హ్యమనోః కించిత్ విషయం పంచధా గతం

శబ్దాదిగ్రహణక్రియలచే శబ్దము శ్రోత్రమున ప్రతీత మగును. ఆ యింద్రియాధిష్ఠానముగానున్న మనసు కూడ క్రమముగా తత్ప్రవణ మగును. అందుచే నిది సామాన్యాభినయము కాగలదు. ఏకేంద్రియ ద్వారమున గూడ మానసహ్లాదము కలుగుట యిందు సంభావనీయమై యున్నది. "యుగపత్ జ్ఞానానుత్పత్తిః మనసో లింగం" ఏకసమయ మున నన్ని జ్ఞానములు కలుగవని న్యాయసూత్ర మనినది. క్రమమున

మనసింద్రియార్థముల సంబంధించును. సమనస్కములయిన యింద్రియార్థములె భావానుభవ మీయగలవు. అమనస్కుడు విషయము గుర్తింపలేడు. అది యయిదు విధముల నగుననియు నాతడు గుర్తింప జాలడు. అభినయానుగతముగా మనస్సునకు మూడు విధములయిన భావము లున్నవి. మనస్సంయోగజన్యము లయిన యాత్మకు సంబంధించిన యిచ్ఛ-ద్వేషము-మాధ్యస్థ్యము ననుభావము మనసుదే యగునని వైశేషికు లనిరి. మనసనగా బుద్ధి యని కాపిలమతానుసారమున గ్రహించునది. ఇష్టభావము మొదటిది. అనిష్టభావము రెండవది. మధ్యస్థభావము మూడవది. అభినయమునం దీ మూడుభావము లుండుటను నాట్యజ్ఞు లంగీకరించిరి.

౬౪. ప్రహ్లాదనేన గాత్రస్య తథా పులకితేన చ
వదనస్య వికాసేన కుర్యాదిష్టనిదర్శనం

౬౫. ఇష్టే శబ్దే తథా రూపే స్పర్శే గంధే తథా రసే
ఇంద్రియైర్మనసా ప్రాప్తైః సౌముఖ్యం సంప్రదర్శయేత్

౬౬. పరావృత్తేన శిరసా నేత్రనాసావికర్షణైః
చక్షుషశ్చాప్రదానేన హ్యనిష్టమభినిర్దిశేత్

౬౭. నాతిహృష్టేన మనసా న చాత్యర్థజుగుప్సయా
మధ్యస్థేనైవ భావేన మధ్యస్థమభినిర్దిశేత్ ॥

ఇం దిష్టానిష్టమధ్యస్థ భావ స్వరూపవివేచన మున్నది.

౧. ఇష్టభావమును నిదర్శింప వలసి యున్నప్పుడు శరీరప్రహ్లాదన మభినయింపవలెను. పులకితములు ప్రదర్శింపవలయును. వదనవికాసము చూపవలెను. తన కభీష్ట మయిన శబ్దరూపరసస్పర్శగంధములందు మనఃసంప్రయోగము కల యింద్రియముల సౌముఖ్యమును ప్రదర్శింపవలెను. ఇట్లభినయమున నిష్టభావము సుప్రకటము కాగలదు. సౌముఖ్యము ప్రదర్శించుట యనగా ప్రసన్న మయిన వదనము కూడి యుండుటయని భావము.

౨. అనిష్టభావము నిట్లభినిర్దేశింప వచ్చును. శిరస్సు పరావృత్త మగుట, అభిముఖముగా నుండక ప్రక్కకుపోవుట, నేత్రకూణనము, నాసావికర్షణము సంకోచము లుండుట. మాటిమాటికి నేత్రనాసారీతు

లట్లగుట, చూపిచ్చి చూడకుండుట, కన్నటు త్రిప్పనే త్రిప్పకయుండుట యిట్టివన్నియు సనిష్టనిర్దేశకములు.

3. మధ్యస్థభావము నిట్లభినిర్దేశింప వలెను. మనసతిహృష్టము కారాదు. అత్యంత మసహ్యాపడరాదు. అటునిటుకాని మధ్యస్థభావమునసె మధ్యస్థభావమును నిర్దేశించుట సముచిత మగును.

"ఆతడిది యొనర్చినాడు. ఇది యొనర్పవలెను. అతడిట్లు చక్కగా చేసినాడు." అనువిధమున పరోక్షాభినయ మొనర్చుట మధ్యస్థవిధాన మని సంకేత మున్నది. తన కనుభవ మాపాదించు నర్థ మాత్మస్థమని, పరార్థవర్ణనమున్నపుడు పరస్థమని సంజ్ఞ యున్నది.

సుఖాద్యర్థము లన్నియు నాత్మయందు సమవేతములై యుండును కావున సర్వార్థము లాత్మస్థములె యగును. రూపాదు లాత్మసమవేతములు కావు. అవి యన్యసమవేతములు. అట్టివవి నిత్యము పరస్థములె కావలసి యున్నవి. అందులకె యాత్మానుభావి యర్థమని యనుట. ఆత్మశబ్ద మిచట పరశబ్దము కూడనున్నందున అహంభావాస్పదమయిన ప్రత్యగాత్మ యందు ప్రవర్తించును. లోకార్థము లా ప్రత్యగాత్మ ననుభవనయుక్తముగ జేయుచో నపు డాత్మస్థ మనుట సముచితమని భావము. రూపాదులు పరసమవేతము లయినను ప్రత్యగాత్మానుభావకము లగును. గాన నాత్మస్థములు కాకపోవు. పరసమవేతములై యుండు సుఖదుఃఖాదులు ప్రత్యగాత్మానుభావకములు కాజాలనందున నాత్మస్థములు కానేకావు.

### కామోపచారము

కామోపచారము సామాన్యాభినయ మగుట యుపపాదింప వలసియున్నది.

౬౮ ప్రాయేణ సర్వభావానాం కామాన్నిష్పత్తిరిష్యతే
స చేచ్ఛాగుణసంపన్నో బహుధా పరికల్పితః
౬౯ ధర్మకామోఽర్థకామశ్చ మోక్షకామస్తథైవ చ
స్త్రీపుంసయోస్తు యోగో యః స తు కామ ఇతి స్మృతః
౭౦ సర్వస్యైవ హి లోకస్య సుఖదుఃఖనిబర్హణః
భూయిష్ఠం దృశ్యతే కామః స సుఖం వ్యసనేష్వపి

౭౧ యః స్త్రీపురుషసంయోగో రతిసంభోగకారకః
స శృంగార ఇతి జ్ఞేయ ఉపచారకృతః శుభః
౭౨ భూయిష్ఠమేవ లోకోయం సుఖమిచ్ఛతి సర్వదా
సుఖస్య హి స్త్రియో మూలం నానాశీలాశ్చ తాః పునః

సామాన్యముగా సర్వభావములు కామముననె సముత్పన్నములగును. కామ మిచ్ఛాగుణసంపన్నము. అది యనేకవిధముల గోచరించుచున్నది. స్త్రీపురుషులు పరస్పర మిష్టము కలవారు కాగా కామము కలుగుట లోకమున నున్నది. ఒక్కొకచో నిష్టపడని వ్యక్తియు కామము కలిగి యుండుట గోచర మగుచున్నది. అట్టిపట్టుల ప్రాక్తనకర్మాధిపత్యము హేతు వగును. సర్వము కర్మగతిపూర్వకముగ నుండుననియె "ప్రాయ" పదము మూలమున నున్నది. సర్వభావములు కామముననె నిష్పన్నము లగునని యర్థము. కామ మన నేమి? అది యొక యిచ్ఛ. కేవల మిచ్ఛామాత్రముననె కార్యనిష్పత్తి యుండదు. గుణముకూడ నందు సహకృతము కావలెను. కర్మవ్యాపారముతో గూడిన కార్యప్రయత్నాదికము గుణము. ఇట్టి గుణసహకృత మయినచో నిచ్ఛ సర్వకార్యకారి యగును. ఇచ్ఛ యొకటియే యయినచో ననేకకార్యప్రసూతి యుండదు. కామము బహుధా పరికల్పితము. ఇచ్ఛ లనేకము లున్నవి. తత్సంపన్నకామము గూడ బహురూపమున నుండును. ధర్మకామ మర్థకామము మోక్షకామ మివి యన్నియును కామభేదములె. మోక్షమున గూడ కామమనుట క్రొత్తకాదు. కామ మనునది యిచ్ఛ. అది సుఖవిషయమున నుండును. తత్సాధనవిషయమున నుండును. ఈ చెప్పిన ధర్మాదులలో ధర్మార్థములకు స్వయంసుఖరూపత్వము లేదు. అంతగా సుఖసాధనతయు లేదు. ధర్మ మప్సరోభోగాదిగత మయిన సాధన ముపార్జింపగలదు. అర్థము నిట్టిద. మోక్షము సుఖాత్మకమె. అది పరమానందవిశ్రాంతిలక్షణము. అది బహిస్సాధనాధీనముకాదు. అయిన నట్టి మోక్షము దుర్లభము. లోకహృదయ మందు సమ్మోహితము కాదు. "స్త్రీపుంసయోస్తు యోగో యః స తు కామః, స్త్రీపురుషుల యోగము కామ మనిరి. స్త్రీపురుష సంయోగము సాక్షాత్సుఖసాధనము. అది యందరకు సర్వవిధముల నిచ్ఛావిషయ మగును. దానిని "కామ" శబ్దముననె చెప్ప

వచ్చును. వేరొక యుపపద మపేక్షితము కాదు. కామముచే సర్వార్థ మనురంజిత మగును. "స్త్రీతి నామాపి సంహ్లాది" స్త్రీ యనునామము కూడ హ్లాదకారి" యనిరి. లోకోత్తరార్థము కూడ కామసంస్పృష్ట మయినచో సర్వార్థ మనురంజితము కాగాలోకమునకు హృదయసం వాదము కలుగును. అయత్నముననె యది హృదయంగమ మగును. భగవదనుషక్తచిత్తు డొకడు;

మోహ దుష్టన నిశాభిసారికా మానినీ నమదనా మథోద్ధతా
ధీరియం ప్రణయతస్త్వదున్ముఖీ ఖండితాం రమణ! మాస్మ తాం కృథాః

"దేవా! నా ధీవృత్తి మోహము మానము కామము మద ములు కూడినది, ప్రణయమున నీ కున్ముఖ మయినది. కోపింపకుము అనుగ్రహింపుము." అనునదియే వివక్షిత మయినను ప్రియాసక్తప్రియా ధర్మముల నాపాదించి చెప్పినాడు. అభిసారిక, కలహాంతరిత స్వాధీన పతిక ఖండిత లయిన వనితల ధర్మము లుల్లిఖితము లయినవి. ఈ కామ ప్రసంగము రహస్యార్థ మయినను రహస్యార్థములం దరహాస్యముగనె నిరూపిత మయినది. ఇందులకే కైశికీనివేశ మాదరమున ప్రతిపాదిత మయినది.

సర్వలోకమునకు సుఖదుఃఖనిబర్హణముగా కామ మున్నది. అది యందరకు బాగుగనె యుండును. కామము వ్యసనము లందును సుఖ కరము. సుఖసామాన్యము కామసంపృక్తమె యయినను విశేషరూప ముగా నిది స్త్రీపుంసయోగము. కామసుఖసమయమున నితరసుఖము లన్నియు నిబర్హితము లగును. సర్వదుఃఖములు నిబర్హితము లగును. కావుననె సర్వవ్యసనము లందిది యుండుననుట. ఈ కామోపచారము బహుతరలక్ష్యవ్యాపకము. అందునను సామాన్యాభినయ మయినది. స్త్రీపురుషసంయోగము రతిసంభోగకారకము. ఉపచారపరిపూర్ణమై శుభమై శృంగార మగునని ప్రకృతమున తెలియదగి యున్నది. కామ మిచ్ఛామాత్రముగనున్నను సముచితోపచారకృత మగుచో నిచ్ఛా స్వరూప మయిన సంభోగ మాపాదింపగలదు. అన్యోన్యహృదయ గ్రహణోచితము లయిన వ్యాపారములచే నది పూర్ణరూప మగును. ఇట్టి యీ కామ మిదివరలో నిరూపించిన విధమున నుత్తమప్రకృతిక మయినచో శృంగార మగును. ఈ యంశము రసవివేచనమున స్పష్టీకృతి

మయినది. ఈ సర్వలోకము సర్వసమయములందు సుఖమును కాంక్షించును. సుఖకాంక్షలో నియత్త యుండదు. ప్రాప్తసుఖము కన్న నధిక సుఖమును కాంక్షించును. అంతకన్న నధికసుఖ మింకను కాంక్షించును. పరమానందలాభము కలుగనంతవరకు లోక మెచ్చటను సంతుష్టి పొందదు. కావునని సర్వదా సుఖ మభిలషించు ననుట యుక్తము. ఒక్కొకడు దుఃఖముపోవుట నభిలషించును. అందును సుఖకాంక్ష యున్నది. దుఃఖాభావమె యాతని కపుడు సుఖముగ నుండవచ్చును గాని యా దుఃఖాభావమును గూడ నాతడు సుఖార్థమె కాంక్షించు ననుట సంగత మగును. సర్వదుఃఖనివృత్తిని కాంక్షించును. దుఃఖలేశ మేని యుండగూడదని భావించును. అంతగా నాతడు సుఖము కామించును. "సుఖేన యథేచ్ఛమశ్నీయాత్. యథాభీష్టం చ రమణీముప భుంజీయాత్" సుఖముగా యథేష్టముగా యథారుచిరముగా వస్తూపభోగము పొందునది. అభీష్టానుసారమున రమణి నుప భోగించునది. ఇట్లనుటలో విశృంఖలతాప్రబోధ మేమియు లేదు. సముచిత మయిన భోగ ముపభోగ ముత్తమనియతియందే యుండును. సుఖమునకు స్త్రీలు మూలము. "సుఖస్య హి స్త్రియో మూలం" స్త్రీలలో నానాశీలము లున్నవి. ఒకతె హార మంగసంగము చేసికొని వక్షోఽలంకారముగ కూర్చుకొని సంతసించునదె యయినను ఒకప్పు డా హారమును గూడ మృదుశీతలసమీరస్పర్శజనితసుఖసిద్ధికై త్యజించును. దుఃఖధ్వంసము మోక్షమనువారు శూన్యము మోక్షమనువారు ప్రేక్షావత్ప్రవృత్తి నాపాదింపజాలరు. రసరహస్యవిదులు ప్రేక్షావత్ప్రవృత్తి సంపాదింప గలరనుట యిదివరలో సముచితముగ స్పష్టముగ నిరూపిత మయినది. ఆయంశ మిచట సంగతము చేసికొని యిచటి తత్త్వమున్మీలితము చేసికొనుట సహృదయసమ్మత మయిన రీతి.

కామముపచారకృతమై శుభ మగుట నిరూపితము. ఆ యుప చారవిధి తెలియవలసి యున్నది. ఉపచారవిజ్ఞానమునకు స్త్రీల యాశయ పరిజ్ఞాన మావశ్యకము. సముచితోపచార మంతయు నాశయ గ్రహణపూర్వకముగనె యుండును. నానాశీలమున స్త్రీలుందురమట సూత్రవచనము. శీలము, సత్త్వము, చైతన్యము, బుద్ధిపూర్వశము,

స్వభావము, హేవాకము, అనునవి పర్యాయములు. ఈ శీలములనేక విధములు. ఇందు కొన్నిమాత్రము సంకేతితము లగును. ఇవి కాక శీలము లెన్నియో కలవు. ఉండవచ్చును. వీని పరిశీలనమున నితరముల నిర్ణయించుటలో సహృదయు లధికారులు కాగలరు.

స్త్రీ శీలములు.

| | | |
|---|---|---|
| దేవశీలము | దానవశీలము | గంధర్వశీలము |
| రాక్షస ,, | నాగ ,, | పక్షి ,, |
| పిశాచ ,, | యక్ష ,, | సర్ప ,, |
| మానవ ,, | వానర ,, | హస్తి ,, |
| మృగ ,, | మీన ,, | ఉష్ట్రి ,, |
| మకర ,, | ఖర ,, | సూకర ,, |
| అశ్వ ,, | మహిష ,, | అజ ,, |
| శునక ,, | గో ,, | |

ఇందిరువదిమూడు శీలము లున్నవి. స్త్రీలీ చెప్పిన దేవాదుల శీలతుల్యశీలలుగా నుందురు. ఇక శీలస్వరూపవివేకము నీవిధముగా గుర్తింపవచ్చును.

౧. దేవశీల : అంగము లుపాంగములు స్నిగ్ధములుగా నుండును. చిత్తము స్థిరముగా నుండును. మందనిమేషము లుండును. రోగము వ్యాధు లుండవు. దీప్తి యుండును. దానము సత్వ మార్జవము కలిగి యుండును. స్వేద మల్పము. సమరత. భోజన మధికముండదు. సురత ప్రియ. రతమునం దతిమృదువుగా నుండదు. అతితీవ్రముగను నుండదు. దేవశీలాసమరతి ప్రమాణానుశీలనమున గూడ సమున్నేయము. దేవశీల గంధపుష్పరత హృద్య.

౨. దానవశీల : అసురశీల దానవశీల, అధర్మరత శాఠ్యాభిరత స్థిరక్రోధ, అతినిష్ఠుర, మద్యమాంసప్రియ. నిత్యము కోపన అతిమానిని చపల అతిలుబ్ధ పరుషకలహప్రియ ఈర్ష్యాశీల చలస్నేహ, వాచాల.

3. గంధర్వశీల : క్రీడాపర. ఈమె నేత్రములందముగనుండును. నఖములు దంతములు పుష్పమనోహరములుగా నుండు అంగములు సుఖసన్నివేశమున నుండును. స్థిరభాష మందాపత్యరతిప్రియ. గీత

వాద్యనృత్త్యములందాసక్త. హర్షమార్జవము కలది. గంధర్వ సత్వ భోగాసక్త సుందరి. త్వక్కేశలోచనములు స్నిగ్ధములు.

౪. రాక్షసశీల : ఈమె యవయవము లన్నియు బృహద్వ్యాయతములు. అన్నియు పెద్దవిగా పొడవుగా నుండును. లోచనములు రక్త విస్తీర్ణములు. ఖరరోమ. గాడిదకువలె రోమములుండును. పగలు నిద్రించును. బిగ్గరగా మాటలాడును. నఖదంతక్షతము లధిక మొనర్చును. క్రోధమీర్ష్య కలది. కలహప్రియ. రాత్రిళ్ళు విహరించుట యీమె శీలము. భావచేష్టలం దంతట రాక్షసప్రకృతి యుండును. ఇట్టిది రాక్షసశీల.

౫. నాగసత్వ : తీక్ష్ణమయిన ముక్కు కొనలుదేరిన పళ్ళు శోభనమయిన శరీరము ఎఱ్ఱబారినకనులు నీలోత్పలసమానమగు వర్ణము నాగసత్వకుండును. ఈమె నిద్రాస్వభావ. అతికోపన. అడ్డము తిరుగును. ఎదురు తిరుగును. ఈమెతో రతారంభము మిక్కిలి చురుకుగా నుండును. మిక్కిలి నిట్టూర్చును. అతిమానిని. గంధమాల్యాదులిష్టపడును. మద్య మాసవ మానును.

౬. పక్షిసత్వ : అంతర్ముఖ మీమెకు విస్తీర్ణముగా నుండును. ముఖ మెప్పుడు తెరచుకొనును. ఈమె తీక్ష్ణశీల. నదులు వాగు లన్న నిష్టపడును. సురలు మద్యములు క్షీరము లీమె కిష్టము. సంతాన మధికముగా కనును. పండ్లధికముగా తినును. నిత్యము శ్వాసించును. ఉద్యానవనములం దాదరము కలిగి యుండును. ఈ పక్షిశీల చపల బహుభాషిణి శీఘ్రసాధ్య.

౭. పిశాచసత్వ : పిశాచశీలమున నుండు స్త్రీలకు వ్రేళ్లుగాని చేతులుకాని యధికముగా నుండవచ్చును. తక్కువగా నుండవచ్చును. రాత్రులందీమె గృహారామములందు సంచరించును. బాలురను బెదరగొట్టుట భయపెట్టుట పిశాచశీలా శీలము. ఈమె పిశునచిత్త. క్లిష్టభాషిణి సురతసమయమున కుత్సితాచారముతో నుండును. ఔపరిష్టకాదులందు (ముఖసురతము) సమాసక్త. ఈమె రోమశాంగి మహాస్వన. మద్య మాంసబలిప్రియ. సురతప్రియ. దివాభోగ.

౮. యక్షసత్వ : ఈయమ యంగములు నిద్దురబద్ధకము కలిగి ప్రస్వేదముతో నుండును. గట్టిశయ్య మంచియాసన మీయామె కభీష్టము. మేధావిని బుద్ధిమతి ప్రతిభకలది. "అశేషావిస్మరణం బుద్ధిః ప్రతిభా" దేనిని మరచిపోకుండునట్టి బుద్ధి ప్రతిభ. మద్యగంధామిషప్రియ, పూర్వ పరిచితులు చిరదృష్టులయినచో కృతజ్ఞ కావున హర్ష పడును. ఆసక్త పడును. శయనించుచునన్న మాటయే కాని దీర్ఘకాలము నిదురింపదు. యక్షశీలాంగన సుకుమారరతాసక్త సుభగ.

౯. సర్పసత్వ : ఈమెయె నాగశీల. మానావమానముల నీమె గణింపదు. అన్నిటిసమముగ జూచును. ఈమె చర్మము పరుషము. కంఠస్వరము ఖరస్వరము. శఠులకథలు పల్కును. అసత్యభాషణ మొనరించును. ఉద్ధతచేష్టాలాపము చేయును. ఈమె పింగాక్షి బంధ రతప్రియ.

౧౦. మానవసత్వ : ఆర్జవాభిరత నిత్యము దక్ష, క్షాంతి గుణాన్విత. ఈమె యంగములు సువిభక్తములై సుందరముగా నుండును. కృతజ్ఞ గురుదేవద్విజభక్త ధర్మకామార్థములందు నిరత. అహంకార వివర్జిత. సుహృత్ప్రియ సుశీల మానవసత్వలో కామకాంక్ష లధిక ముగా భాసింపవు. కావుననె ధర్మకామార్థనిరత యని కామమును ధర్మార్థగర్భముగ నిరూపించుట యుక్తముగ నున్నది. మానవవనితలలో నందరు మానవసత్వలు కాజాలరు.

౧౧. వానరసత్వ : ఈమె దేహమల్పము నిత్య మంగముల ముడుచుకొనును. హర్షముతో నుండును. రోమములు పింగలవర్ణముతో నుండును. ఫలప్రియ ప్రగల్భ చపల తీక్ష్ణస్వభావ వృక్షారామ వనప్రియ. స్వల్ప మయినయుపకారము నేని నిత్యమీయామె బహుమానించును. బలవంతమున పట్టి రమించుట నీమె యభిలషించును. తానును కాముకుని పట్టి యట్టిదగును.

౧౨. హస్తిసత్వ : ఈమె దవడలు పెద్దవిగా నుండును. లలాటము పెద్దదిగా నుండును. శరీరము కూడ మంచివృద్ధిలో నుండును. బలముతో నుండును. తగిన యెముకలపుష్టి యుండును. ఈమె పింగాక్షి. రోమశాంగి. గంధమాల్యాసవప్రియ. కోపన స్థిరచిత్త. పట్టుదల

గల్గది జలోద్యానములందు వనములం దాసక్త. మధురభావ. రతి ప్రవీణ. హస్తిసత్వ యుత్కటముగా నాహారప్రియ.

౧౩. మృగసత్వ: స్వల్పోదరి. భగ్ననాస మగ్ననాస. సన్నని పిక్కలు కలది. వనప్రియ చలనయన, విపులనయన. చపల. శీఘ్ర గామిని. పగలు భయపడునది. నిత్యము గీతవాద్యరతిప్రియ. సౌధాది నివాసమునందె స్థిరచిత్త. అటునిటు సంచలన మభిలషింపదు.

౧౪. మత్స్యసత్వ: ఈమె రొమ్ము పెద్దది. పీన మున్నతముగా నుండును. చలభావ. అయినను నిమేషోన్మేషముల్లెల్లె యొనర్పదు. దాసదాసీపరివార మధికముగా నుండుట నీమె యభిలషించును. బహుసుత. మత్స్యసత్వ యధికముగా జలప్రియ.

౧౫. ఉష్ట్రసత్వ: లంబోష్ఠి. స్వేదబహుల కొంతవికటముగా వంకరగా నడచునది. కృశోదరి. పుష్పఫలప్రియ లవణామ్లకటుప్రియ. ఈమె కటిపార్శ్వ ముబ్బెత్తుగా బంధురముగా నుండును. ఖరనిష్ఠుర భాషిణి. ఈమె కటి యామె కంఠ మత్యున్నతముగా నుండును. ఈమె యటవీప్రియ.

౧౬. మకరసత్వ: పెద్దతల. బలిసిన మెడ. వెడల్పుగా బ్రద్ద లుగానుండు ముఖగహ్వర ముండును. కంఠస్వనము పెద్దదిగా నుండును. క్రూరస్వభావ. ఈమె యందు మత్స్యగుణము లుండును.

౧౭. ఖరసత్వ: జిహ్వోష్ఠదశనములు స్థూలముగా నుండును. ముదురుబారిన మేనిచర్మము. కటుభాషణము. ఈమె రతియుద్ధకరి. ఈమెతో రతి రతిగా నుండదు. రతిలో నీమె యుద్ధ మొనర్చునట్లుం డును. నఖక్షతదంతక్షతములు తానభిలషించును. తానొనర్చును. ఈమె ధృష్ట. దక్ష. సవతులను ద్వేషించును. చపల. శీఘ్రగామిని. సరోగ. బహ్వపత్య. చండరతిబంధమున గాని యీమె తుష్టి పడదు.

౧౮. సూకరసత్వ: ఈమెపృష్ఠము దీర్ఘము. ఉదరము దీర్ఘము. ముఖమును దీర్ఘము. అంగము లన్నియు రోమశములై యుండును. బల మధికము. లలాటము సంక్షిప్త మల్పము. కందమూలఫలము లీమె కభీష్టములు. రూపము నలుపు. పన్నులు పెద్దవి. కోర లుత్కటములు. ముఖము దంతములతో నిండి యున్నట్లుండును. ఈమె తొడలుబలిసి

యుండును. తలవెంట్రుకలు పొట్టివి. గిడసబారి యుండును. హీనాచార. బహుసంతాన. ఇట్టి వనిత సౌకరసత్త్వాశ్రిత యగును.

౧౯. అశ్వసత్వ: అశ్వశీల యగువనిత స్థిరస్వరూప. పార్శ్వములు కాని యూరువులు కాని కటీభాగము కాని పృష్ఠము కాని కంఠము కాని యన్నియు విభక్తములుగా నుండును. ఈమె సుభగ దానశీల. ఈమె కేశములు నిడువుగా స్థూలముగా నుండును. కృశశరీరము. చిత్తము చంచలము. వాక్కు స్నిగ్ధము గమనము శీఘ్రము. కామము క్రోధ ముండును.

౨౦. మహిషసత్త్వ: ఈమె పృష్ఠము స్థూలము. నేత్రములు పెద్దవి. దంతములు పెద్దవి. పార్శ్వ ముదర మంత పెద్దవిగా నుండవు. స్థిర. పచ్చనిరోమములు కలది. రౌద్రి. లోకద్వేషము కలది. రతిప్రియ. ఈమె ముఖ ముబ్బుగా నుండును. జలక్రీడావనప్రియ. లలాటము పెద్దది. సుశ్రోణి. మాహిషసత్త్వము కలిగి యున్నపుడీ విశేషము లుండునని సత్వవిదు లనుచున్నారు.

౨౧. అజసత్వ: కృశ. తనుభుజ. తనూరస్క. నిష్టబ్ధస్థిరలోచన. సంక్షిప్తపాణిపాద. సూక్ష్మరోమాంచిత. భయశీల. జలోద్విగ్న. బహ్వాపత్య. వనప్రియ. చంచల. శీఘ్రగమన.

౨౨. శునకసత్వ: కొందరు శ్వశీల లయిన వనితలున్నారు. వారి దేహము నేత్రములు పట్టు బిగి కూడియుండును. విజృంభించుట వారి కభీష్టము. ముఖము చిన్నది. పొడవుగా నుండును. పాణిపాదము లల్పముగా నున్న నందముగా నుండును. వారి కంఠస్వరము పెద్దది. నిద్ర యల్పము. క్రోధనలు, సుకృతప్రియలు, హీనాచారలు. కృతజ్ఞలు. వీరు శునకస్వభావలు.

౨౩. గోసత్త్వ: పృథుపీనోన్నతశ్రోణి తనుజంఘ సుహృత్ప్రియ సంక్షిప్తపాణిపాద దృఢారంభ ప్రజాహిత పితృదేవార్చనరత సత్యశౌచగురుప్రియ. స్థిరపరిక్లేశసహ యగువనిత గోసత్త్వ యగును. ఇట్లింకను విభిన్నశీల లయిన స్త్రీలుందురు. వారి సత్వము వారివారి చైతన్యబల మట్టి శీలహేతువు. పురుషసంయోగమున వారి శీలము లందు మార్పును రావచ్చును. పురుషులందున్న సత్వసంక్రమణము

సత్త్వపరిణామము కలుగుట లోకదృష్టమె. ఇట్టి సత్త్వస్వభావముల కియత్త కానరాదు. కతిపయ సంకేతమువలన సచేతసుల బుద్ధి యాసాదితాలోకము కాగలదని యిది నిదర్శిత మయినది.

౨౩ నానాశీలాః స్త్రియో జ్ఞేయాః స్వం స్వం సత్త్వం సమాశ్రితాః
విజ్ఞాయ చ యథాసత్త్వముపసేవేత తాః పునః
౨౪ ఉపచారో యథాసత్త్వం స్త్రీణామల్పోపి హర్షదః
మహానప్యన్యథాయుక్తో నైవ తుష్టికరో భవేత్

స్త్రీల శీలపరిజ్ఞానమున రమ్యమయిన యుపయోగ మున్నది. స్త్రీలు నానాశీలముల నుందురు. తమ తమ సత్త్వము ననుసరించి వారట్లుందురు. ఈ సత్త్వవిశేషము ననుసరించి వారి తత్త్వముల గుర్తించి వారి సేవింపవలెను. సత్త్వానుసారమున నుపసేవనమె తుష్టి నిచ్చును. సత్త్వము గుర్తించిన పిమ్మటనె సేవించుట సముచితము. సత్త్వానుసారి సేవాప్రయోజనము మనోహరము. ఉపచార మల్పమయినను యథాసత్త్వమున్నచో నవి స్త్రీలకు హర్షప్రద మగును. అదియే సముచితప్రక్రియ. అట్లు కాకున్న నేమియు తుష్టి యుండదు. సత్త్వానుసారమున నుండని యుపచారము పూర్ణముగా నున్నను తుష్టికరము కాదు. అయథాసత్త్వసేవన మరసికవిధానము లోకమున నెవరికేని సంప్రార్థితము లభించినపుడు ప్రీతి యుదయించును. రతి జనించును. స్త్రీ పురుషులకు రత్యర్థమై యుపచారము నిర్ణీత మయినది. రతిసిద్ధి ముఖ్యము. రత్యర్థ ముపచార మున్నది. సత్త్వానుసార ముపచారము యుక్తము. సత్త్వము లన్నిట గుణము లున్నవి. దోషము లున్నవి. సత్త్వభేదమున గుణము లుపాదేయములుకావు. దోషము లుపాదేయము లగును. ఉపాదేయానుపాదేయవ్యవస్థ యంతయు రత్యర్థమనుట యవిస్మార్యము.

కామోపభోగము

౨౫. ధర్మార్థం హి తపశ్చర్యా సుఖార్థం ధర్మ ఇష్యతే
సుఖస్య మూలం ప్రమదాః తాసు సంభోగ ఇష్యతే।
౨౬. కామోపభోగో ద్వివిధో నాట్యధర్మేఽభిధీయతే
బాహ్యాభ్యంతరతశ్చైవ నారీ పురుష సంశ్రయః।

౪౪. అభ్యంతరః పార్థివానాం న చ కార్యస్తు నాటకే
బాహ్యో వేశ్యాగతశ్చైవ న చ ప్రకరణే భవేత్‌।

సత్త్వపరిజ్ఞాన ముపచారవిధి సర్వము కామపురుషార్థమునకే యన్నట్లు ప్రకృతము భాసించును. పురుషార్థాంతరమున నిది వ్యుత్పన్న మగుట లేదనియు గోచరించును. ఇందుపపత్తి యేదియో తెలియ వలసి యున్నది. ధర్మసిద్ధికై తపమొనరింప వలెనని యాగమము లనినవి. తపశ్చర్య యంతయు ధర్మార్థము కాగా ధర్మ మెందులకనుకొందురు. సుఖసిద్ధికై ధర్మము కావలెను. "సుఖార్థం ధర్మః," సుఖములకు ప్రమదలు మూలము. వారియందు భోగసంభోగములు సముచితములు. ఇదియంతయు కామోపభోగసూచిక. సామాన్యాభినయప్రసక్తిలో నిది సంగతము కాగా నంతయు నింతగా నిరూపిత మయినది. ఈ సామాన్యాభినయమునకు ప్రకృతములో నుపయోగమిట్లున్నది. నాట్యధర్మమున కామోపభోగము ద్వివిధముగా నున్నది. నారీపురుషసంశ్రయ మయిన యీ యుపభోగము బాహ్యమని యాభ్యంతరమని సంకేతితము. అభ్యంతర మంతఃపురము. అందలిది యాభ్యంతరము. నాట్యోపాయమయిన యితివృత్తము నాట్యధర్మము. ఆభ్యంతరము పార్థివులకు నాటకమున నిబంధనీయము. నాటికలో గూడ నిబంధనీయము. బాహ్యము వేశ్యాగతమయిన కామోపభోగము ప్రకరణమునందు నిరూపింపవలెను. ఇందు రాజోపభోగ మనుపూర్వముగా ప్రతిపాదితము కాగలదు.

౧. స్త్రీలు మూడువిధముల నుండుట.
౨. రాజోపచారమున నాయికకు సంబంధించిన కామోపపత్తి
౩. ఇంగితాత్మక మయిన యిష్టవేదనము
౪. నానావిధములగు కామావస్థలు
౫. విప్రలంభసమయములం దొనర్పదగిన ఉపచారవిధులు.
౬. దూతీప్రేషణము ౭. సందేశరీతి
౮. రత్యుపాయచింతనము ౯. కన్యామిత్రాన్వేషణము
౧౦. ప్రచ్ఛన్నకామితావిధానము ౧౧. అంతఃపురభోగము
౧౨. నివాసకవిధి

మొదలగు వానిని క్రమముగా నిరూపింతుము. ఈ రాజోపభోగ ముప చారవిధి యంతయు కామతంత్ర సముత్థితము నానాసత్వసముద్భవ మయిన స్త్రీల ప్రకృతిని మూడువిధములుగా విభావింపవచ్చును. బాహ్యప్రకృతి మొదటిది. ఆభ్యంతర ప్రకృతి రెండవది. బాహ్యాభ్యంతరప్రకృతి మూడవది.

౧. కులీనవనిత యాభ్యంతరప్రకృతిగా గుర్తింపవలెను.

౨. వేశ్యాంగన బాహ్యప్రకృతి యని ప్రసిద్ధి

3. కృతశౌచ యగువనిత బాహ్యాభ్యంతర

రాజుల భోగరీతి యభ్యంతరవిధానముల ననుసరించుటను నాటకభోగ ముగా జెప్పునపుడు రాజుల భోగములనె కాక యభ్యంతరభోగముల గూడ జెప్పుదురు. వేశ్యలు గణికలు. వేశము గణికాస్థానము. అందు ప్రభవించువారు వేశ్యలు. బాహ్యాభ్యంతరవనిత యందొక విశేషము కలదు. శుద్ధశీలగా నున్న కాంత కాంతావరుద్ధ యయ్యు భోగవనిత యగునది బాహ్యాభ్యంతర.

౭౮ అంతఃపురోపచారే తు కులజా కన్యకాపి వా
న హి రాజోపచారే తు బాహ్యస్త్రీభోగ ఇష్యతే

అంతఃపురోపచారములను నిబంధించునప్పుడు కులకన్యను నిరూ పింపవచ్చును. కన్యక యనదగిన గణికాకుమారికను నిబంధింపవచ్చును. అంతియెకాని రాజోపచారవిధానమున బాహ్యస్త్రీభోగోపనిబంధనము సముచితము కాదు. పాలకుడగు రాజున కభ్యంతరభోగనిబంధనము యుక్తము. బాహ్యజనునకు బాహ్యావనితాభోగము కూర్పవచ్చును. రాజోపచారమున బాహ్యస్త్రీభోగము యుక్తము కాదనియన్న నొక యపవాద మున్నది. రాజుల కొకప్పుడు దివ్యవేశ్యాసంగమము చెప్ప వచ్చును. దివ్యాంగనాసంగమము నిరూపింపవచ్చును. పురూరవున కూర్వశితోడి యనురాగభోగములను విక్రమోర్వశీయమున కాళి దాసు విరూపించినాడు.

౭౯. కులజాకామితం యచ్చ తత్జ్ఞేయం కన్యకాస్వపి
యా చాపి వేశ్యా సాప్యత్ర యథైవ కులజా తథా

కులజలయిన వనితలకు సంబంధించిన కామితము లోకసమాజ ప్రసిద్ధముగా నున్నది. అట్టిదానినే సామాన్యముగా గణికాదారిక

లయిన కన్యకలకు సంబంధించిన కామితముగా నిరూపింపవచ్చును. కులజాశృంగారమని కులటాశృంగారమని వేరువేరుగానుండవు. కులజా వేశ్యాశృంగారములు భిన్నాభిన్నములని యనము. సంఘమునందలి సౌకర్యములు కల కులజల విషయమున ప్రదర్శింపదగు కామితవిధానమును వేశ్యాకన్యకలకును నిబంధింపదగును. విభావానుభావములందలి విశేషములు వేరువేరుగా నున్నను తత్తత్కామిత మేకవిధముగా నుండును. "కులజాకామిత" స్థానమున కొందరు "కులటాకామిత"మును పఠించుచున్నారు.

౮౦. ఇహ కామసముత్పత్తిర్నానాభావసముద్భవా
స్త్రీణాం వా పురుషాణాం వా ఉత్తమాధమమధ్యమా
౮౧. శ్రవణాద్దర్శనాద్రూపాదంగలీలా విచేష్టితైః
మధురైశ్చ సమాలాపైః కామః సముపజాయతే
౮౨. రూపగుణాదిసమేతం కలాదివిజ్ఞానయౌవనోపేతం
దృష్ట్వా పురుషవిశేషం నారీ మదనాతురా భవతి.

నానాభావముల వలన నుండు కామోత్పత్తి స్త్రీలకుగాని పురుషులకుగాని యుత్తమాధమ మధ్యమరూపముగా నుండును. స్త్రీలందరేకవిధముగ నుండరు. పురుషులందరొకవిధమున నుండరు. స్త్రీపురుషయోగము సంయోగము పరస్పరసదృశముగ నుండకపోవచ్చును. స్త్రీలలోనుత్తమాధమమధ్యమ లుండునట్లు పురుషులందు నుందురు. వీరి యన్యోన్యసంయోగ మటుగానిటుగానున్నపు డుదయించు కామములు బహుభేదముల నుండును. కావుననె కామోత్పత్తి నానాభావసముద్భవ మనుట. నానాబీజముల వలన కామముదయించును. ఇట్లనేక హేతుకమయి యనంతభేదభిన్నమయిన నుత్తమమని యధమమని మధ్యమమని పరిగణించుట వర్గీకారసౌకర్యము సూచించును. కామోపచారము ప్రస్తుతమయినందున కామోత్పత్తికథనము సముచితము కదా!. కామ మయిదు విధముల గలుగును. శ్రవణము, దర్శనము, రూపము, అంగలీలావిచేష్టితము, మధురాలాపము. ఇవి కామజనిహేతువులు.

౧. సీతను రావణుడు వినినాడు. శ్రవణముననె యాతడు కాముకుడయినాడు. ఇది శ్రవణకామము.

౨. శకుంతలను దుష్యంతుడు చూచినాడు. "మధురమాసాం దర్శనం" శకుంతలాదర్శనమున దుష్యంతునకు కామముదయించినది. ఇది దర్శనకామము.

3. రూపము చిత్రాదిప్రతికృతి. రూపదర్శనమును కామ హేతువు. అగ్నిమిత్రుడు మాలవికను మొదటగా చిత్రమున జూచి నాడు. కామాంకురము కలిగినది.

౪. ఒకప్పుడు రూపదర్శనమున కామముదయింపదు. వత్స రాజునకు తాపసవత్సరాజమున నాయికాకారము చూచినను కామ ముదయింపలేదు. అప్పుడామె యంగలీలావిచేష్టితములు కామోత్పత్తి కారణములయినవి. ఒకప్పుడు రూపము నష్టరాగప్రత్యాయన మొన రించును. అంగలీలావిచేష్టితమును నష్టరాగ ముద్యోతించును. విశాఖ దేవుడు వత్సరాజకామదీపనమునకై యభిసరణకల్ప మేర్పరచినాడు. పద్మావతి యనుసరించిన శబరీవేషాద్యాచరణము లీలాచేష్టిత మయి నది. వత్సేశు డది యంతయుచూచి భావించి కామవృత్తి కలవా డయినాడు.

౫. మధుర సమాలాపములును కామ సంజనము లగును. మాధుర్య మర్థద్వారమున గలుగునది కావచ్చును. స్వరూపమున నె కలుగునది కావచ్చును. ఇవియె కాక కామోత్పత్తిహేతువు లింక నుండవచ్చును. నాయిక నాయకు నత్యంత మనువర్తించుటయు కామో త్పత్తిహేతువు కాగలదు. తాపసవత్సరాజములో వత్సేశునకు కామోత్పత్తి యత్యంతానువృత్తివలననె గలిగినది. వత్సేశుడు పద్మా వతి నిట్లు భావించును;

మయి మనః ప్రణిధాయ ధృతా జటా
న గణితః స్వజనో న నవం వయః
అనుగమైరితి మామనురాగిణీ
వ్యవసితా దపనేతుమివేచ్ఛతి."

నాయందు మనసుచేర్చి జట శిరమున ధరించినది. స్వజనము గణింప లేదు. నవవయసు చూడలేదు. నన్ను నిరంతర మనుగమించుచున్నది. నాయందనురక్త యయినదో! నాయత్నమునుండి నన్ను మరలింప

నీమె యత్నించుచున్నది. కాబోలును! "ఇట్లు రాజు భావించుటలో కామోత్పత్తి యున్నది.

రూపగుణాదులు కలవానిని కలాదివిజ్ఞానము కలవానిని యౌవనముతో గూడినవానిని ఇంకను విశేషవిశిష్టుడగు వానిని చూచి నారి మదనాతుర యగును. ఇట్లెపురుషుడును మదనాతురు డగును. కామయమానావస్థలో నుండు స్త్రీలకుగాని పురుషులకుగాని కామభావేంగితము లనేకము లుండును. కామభావము కామాఖ్యమగు చిత్తవృత్తి శరీరవికారములు తత్కృతము లయిన యింగితములు, అట్టియింగితము లనేకవిధములు. వానిని సావధానముగా గుర్తింపవలెను. కామభావేంగితములు కొన్ని యిట నిరూపితములగును. ఇవి యితరముల గూడ నభ్యూహింప జేయగలవు.

కామ్యదృష్టి విలక్షణముగా నుండును. ఆ దృష్టి లలితము, నేత్రపక్ష్మములు చలించుచుండును. ఈక్షణములు ముకులితములగును. కన్నుల పైపుటములు కొంతగా దిగజారినట్లుండును. లలితదృష్టి వలితాంతముగా నుండును. లాలిత్యమునకు తగిన విశేషములతో నుండును. స్త్రీలర్థావలోకన మొనరించునపుడు లలితదృష్టి కలుగును. ముఖరాగము మరియొక యింగితము. గండభాగము లొకింత సంరక్తము లగును. చిరుచెమటల చిత్రణ ముండును. రోమాంచము ప్రస్పందమాన సుందరముగా నుండును. ముఖము రాగరంజితమై శోభాయుక్తముగ నుండును. మదనాతురలయిన వేశ్యలం దీవిశేషములు గోచరించును. కామ్యముగునట్లు వేశ్యయంగవికారము ప్రదర్శించును. కటాక్షనిరీక్షణ మొనరించును. ఆభరణముల మాటిమాటికి స్పృశించును. కర్ణకండూయన మొనరించుకొనును. బొటనవ్రేలి యగ్రభాగమున నేమేమియో విలిఖించును. స్తనములు వెలువడ జేయును. నాభి చూపును. గోళ్లుల గిల్లుకొనును. రంగు వేయును. జుట్టుముడి సవరించును. అందులకై బాహువులెత్తును. భుజమూలములు కనపర్చును. కుచసీమ బిగించును. ఊరువు లప్పళించును. అధర మటునిటు త్రిప్పును: ఇట్టివన్నియు కామభావేంగితములు. వీని నిట్టివాని చూచి వేశ్యమదనాతుర యని భావించవచ్చును.

కులజాభావేంగితము లీవిధమున నుండును. కులజ కన్నులతో నవ్వును. తేరిపార జూచును. పెదవి విడివడ హసించును. అధోముఖరై నిగూఢముగా నేదో పల్కును. ఒకపుడు స్మితమె సమాధానముగా నొనర్చును. మందమందముగా బల్కును. స్వేదాకృతి కప్పి పుచ్చుకొనును. అధర మదర చేయును. చకితచకితముగ చూచును. ఇవి యన్నియు కులాంగనాభావేంగితములు. సురతసుఖ మనుభవించిన వారె యిట్లొనరింతురు. సురతోత్సవ మింకను పొందని వారిలో దశస్థానగతముగా కామ మవభాసించును. ఇవి పది కామావస్థలనదగి యున్నవి. వీనిని నానాభావములచే ప్రదర్శింపవలెను. పైన నిరూపించిన కామవికారములు ప్రాప్తసంభోగలు సంభోగసంతుష్ట లయినచో ప్రదర్శింపరు. ప్రాప్తసురత లయినను పునారతాసక్త లగునపు డిట్లు వికారములు ప్రదర్శించుట కలదు. అప్రాప్తభోగలు భోగాభిలాషతో నుందురు కావున నీ కామవికారముల ప్రదర్శింతురు. కామమన్నది యుదయింపగనె యది మొదలుగ నంగనలు ప్రాప్తసంభోగలె. వారల కప్పటినుండియె కామావస్థలు కలుగును. ప్రాప్తసంభోగలు విప్రలంభ సమయమున కుసుమసమధర్మ లగుదురు. వాడివత్తలగుదురు. "కుసుమ సధర్మాణో హి యోషితః." కామిజనసంభోగము భావమున సాక్షాత్కరింపగానె యీ యవస్థ లన్నియు గలుగును. పూర్వమె సంభోగ మనుభవించిన వారలకును కామావస్థ లుండునని యవి శృంగారాంగముగ నుండగలవని పెద్దలు నిరూపించిరి. సాగరిక ప్రాప్తభోగ కాదు. వత్సరాజును వలచినది. ఆమెలో కామావస్థ లుండుట దర్శితశృంగార మగుట రసభావప్రఘట్టాంశమున స్పష్టమె యయినది.

కామావస్థలు.

| | | | |
|---|---|---|---|
| ౧. | అభిలాష | ౨. | చింతనము |
| ౩. | అనుస్మృతి | ౪. | గుణకీర్తనము |
| ౫. | ఉద్వేగము | ౬. | విలాపము |
| ౭. | ఉన్మాదము | ౮. | వ్యాధి |
| ౯. | జడత | ౧౦. | మరణము |

అభిలాషాత్మక మయిన కామ మొక్కటియె క్రమముగా నీ దశలను పొందును. ఈ పదికామావస్థలు వ్యభిచారిభావములె యని కొందరు తలచిరి. కాని లక్షణాంతర మున్నందున నిచట పరిగణించుట సముచితమె. ఈ కామావస్థలు స్త్రీలకు పురుషులకు నుండును. ఇవి క్రమ క్రమముగా గలుగును. ఒకదానికన్న మరొకదానిలో నతిశయ మున్నది. విశేష మున్నది. కామపరిపాక మున్నది.

౮౩. వ్యవసాయాత్సమారబ్ధః సంకల్పేచ్ఛాసముద్భవః
సమాగమోపాయకృతః సోఽభిలాషః ప్రకీర్తితః
౮౪. కేనోపాయేన సంప్రాప్తిః కథం వా సా భవేన్మమ
దూతీనివేదితైర్భావైరితి చింతాం నిదర్శయేత్
౮౫. ముహుర్ముహుర్నిశ్వసితైః మనోరథవిచింతనైః
ప్రద్వేషాచ్చాన్య కార్యాణామనుస్మృతి రుదాహృతా
౮౬. అంగప్రత్యంగ లీలాభిర్వాక్చేష్టా హసితేక్షణైః
నాస్త్యన్యః సదృశస్తేనేత్యేతత్ స్యాత్ గుణకీర్తనం
౮౭. ఆసనే శయనే చాపి న తుష్యతి న తిష్ఠతి
నిత్యమేవోత్సుకా చ స్యాదుద్వేగస్థానమాశ్రితా
౮౮. ఇహస్థిత ఇహాసీన ఇహచోపగతో మయా
ఇతి తైస్తైర్విలపితైర్విలాపం సంప్రయోజయేత్
౮౯. తత్సంశ్రితాం కథాం యుంక్తే సర్వావస్థాగతాపి హి
పుంసః ప్రద్వేష్టి చాప్యన్యామున్మాదః సంప్రకీర్తితః
౯౦. సామదానార్థసంభోగైః కామ్యైః సంప్రేషణైరపి
సర్వైః నిరాకృతైః పశ్చాత్ వ్యాధిః సముపజాయతే
౯౧. పృష్టా న కించిత్ప్రబ్రూతే న శృణోతి న పశ్యతి
హా కష్టవాక్యా తూష్ణీకా జడతాయాం గతస్మృతిః
౯౨. సర్వైః కృతైః ప్రతీకారైః యది నాస్తి సమాగమః
కామాగ్నినా ప్రదీప్తాయా జాయతే మరణం తతః

౧. అభిలాష : కామింపదగిన వానిని సరిగా గుర్తించి, యాతని ప్రేమింపవచ్చు నన్న నిశ్చయము పొంది సమాగమోపాయముగా యత్నమొనరించుట యభిలాష యగును. అభిలాష యొక యత్నమున గలుగును. సంకల్పపూర్వక మయిన యిచ్ఛ వలన జనించును. ఇచ్ఛ యుండగా నభిలాష యుద్రిక్తమగును. ప్రియసమాగమమునకై చింత యనునది ద్వితీయావస్థ. ఈ యభిలాష యా చింతలో కారణ

ముగా నుండును. ఏ యుపాయముచే సంప్రాప్తి యగునో యని చింతలో నాలోచన మొనర్చుట కలదు. అట్టి చింతలో నిది కారణముగా నుండును. కామమున ప్రథమస్థానముననున్న వనిత ఇలు వెడలును. ప్రవేశించును. మదనవికృతి పొందును. దేహమట్లు చేసికొనును. ప్రియుని చూపుమేరలో నిలబడును. అభిలాషకల వనిత కన్యసాహచర్య మున్నచో వాగ్వ్యాపారోచిత మయిన శబ్దము నుండును. ఇట్టి వనితను చూడగనె మదనాకృతి పట్టిన దనిపించును. ప్రియుడు చూచుటకు తగినట్లు ప్రియుని చూచుటకు వలనుపడునట్లు దర్శనపథము ప్రవేశించి యభిలాషకల వనిత కామావస్థపడును.

౨. చింత : ప్రియాభిలాష కలిగిన యువతి యీ విధముగా చింతించును. "ప్రియు డెట్లులభించును ? ఏ యుపాయ మనుసరింపవలెను ? నా దూతి చెప్పిన విధముగ జరుగునా ?" దూతి చెప్పిన భావముల ననుసరించియు, స్వయముగా తానూహించిన భావముల బట్టియు నిట్టి చింత పొందును. ఆమె మాటిమాటి కాకేకరార్ధవిప్రేక్షితము లొనర్చును. వలయములు పరామర్శించును. రశనామణుల తడవి చూచును. నీవీ బంధము తాకును. నాభి స్పృశించును. ఆకేకరదృష్టి యనుట విచలావిచల మయిన దృష్టి యనిభావము. ద్వితీయ మదనావస్థ యయిన చింతలో నిట్టి చేష్ట లభినయమున నుండవలెను.

౩. అనుస్మృతి : ముహుర్ముహుర్నిశ్వాసములు ముహుర్ముహుర్మనోరథవిచింతనములు, అన్యకార్యప్రద్వేషములు ననుస్మృతిలో నుండును. మాటిమాటికి ప్రియస్మరణము కలుగగా నిశ్వాసాదులతిశయించును. అప్పుడామెకు నిశ్చయము తోచదు. కర్తవ్యము గోచరింపదు. ఆసనమునగాని శయ్యలోగాని ధృతి పొందలేదు. స్వాంగకర్మలగూడ నాచరింపలేదు. అంతట విహస్తగా నుండును. అశక్తగా నుండును. ఈ విధాన మంతయు చింతాసముపగతమై యుండును. ఈ తృతీయవిధానము నిట్లు ప్రయోగించుట సముచితము.

౪. గుణకీర్తనము : ప్రియుని నానాగుణములు నీమె కీర్తించును. తన ప్రియసమానుడు లేడని భావించును. అట్టి యంగప్రత్యంగలీల లెవనియందు నామె చూడదు. ఆవాక్కు లాచేష్ట లాహాసితము

లాపేక్షితములు కలవారెవ్వరును లేరని యామె భావనము. ప్రియ సదృశుడు లేడన్న భావ ముత్తమరతిస్వరూపరేఖను గోచరింప జేయును. రంగమున గుణకీర్తనమున కీ విధానము లుండవలెను. ఉల్లాసపడి వేడుకపడి గుణముల నడుగకున్నను కీర్తించునది. అశ్రు మార్జనము స్వేదాపమార్జనము, నిత్యము దూతితో నుండుట విస్రంభా లాపము లొనర్చుట యిట్టివన్నియు గుణకీర్తనచేష్టితములు. ఈ చతు ర్థావస్థలో నభినయయోగము నిట్లు కూర్పవలెను.

౫. ఉద్వేగము : దీని నుద్వేగస్థాన మనియు ననిరి. ఉద్వేగ స్థాన ముద్వేగావస్థ. ఉద్వేగము పొందిన యువిద నిత్యముత్సుకముగా రణరణకముగా నుండును. ఆసనమున నుండదు. శయనమున నుండదు. ఎచ్చటనిష్ట పడలేదు. క్షణముండలేదు. నిర్వేదనిరూపణములో కొంతగా నుద్వేగాభినయము నిర్దిష్ట మయినది. చింతానిశ్వాసఖేదములు హృద్దాహాభినయ ముద్వేగాభినయమున నత్యంత మాచరించునది.

౬. విలాపము : పూర్వావస్థకు సంబంధించిన రుదితనిఃశ్వసితాదు లుత్తరావస్థయం దనుగతము లగును. కావుననే వనిత యుద్విగ్నయయి విలాపిని యగును. "ఆ నా ప్రియు డిక్కడ నిలబడినాడు. ఇట కూర్చొనినాడు. ఇచట నన్ను కూడినాడు. ఇట పలుకరించినాడు. ఇచట ఇట్లు! ఇట్లు." ఈ విధము లయిన విలాపములు కలదగును. ఇట్లె విలాపము ప్రయోగింపవలెను. మిక్కిలి యుద్విగ్నయై యౌత్సుక్యము కలదై యధృతికలదై విలాపముకల వనిత విలపించును. ఇటునటు భ్రమించును. నిలకడగా నొకచో నుండలేదు. ఇది విలాపస్థానాభినయ ప్రయోగము.

౭. ఉన్మాదము : ఎట్టి యవస్థలో గాని యెట్టి పరిస్థితిలో గాని యెవరున్న గాని నిత్యము ప్రియసమాశ్రితకథనె కూర్చుకొనును. ఆ విషయములనె చెప్పును. పురుషులనందరిని ద్వేషించును. అసూయించును. ఇట్లుండుట యున్మాదము. ఉన్మాదము కల యామె యనిమిష దృష్టితో నట్టె నిలబడును. దీర్ఘ దీర్ఘముగా నిట్టూర్చును. ధ్యానించు నట్లుండును. ఏమో యాలోచించును. విహరించు సమయమున శోకించును. పెద్దలు గురుజనులు దగ్గరలో నున్నను ప్రియాలాపమె పలు

కును. స్థానాస్థానము లామె చూడదు. క్రీడాసముచిత సమయము లందును ఖిన్నురాలై యేడ్చును. ఉన్మాదముపొందిన వనిత యిట్లే నాట్యప్రక్రియ దర్శించును. కాని గుడ్డపీలికలు కుండపెంకులు కర్ర ముక్కలు చాపచిదురులు చిల్లపెంకులు పట్టి తిరుగుట కామోన్మాద నాట్యప్రయోగము కాదు.

౮. వ్యాధి : చిత్తవృత్తిసంభూత మయిన కామ మున్మాద పర్యంతము రాగా శరీరముకూడ మార్పుపొందుట ప్రసిద్ధము. రుగ్ణ మగుట యు సంభవము. శరీర మన్యథా యగుట వ్యాధి. ప్రేయసీ ప్రియులకు గలిగిన ప్రణయకలహమున నొకరొకరొకింత యెడబాటుతో నుందురు. అప్పుడు ప్రియుడు ప్రేమసాఫల్యానుభూతికై సామవచన ములు పలికినను ప్రేయసి యొల్లదు. భూషణాదుల దానముచేసిన నంగీకరింపదు. భోగప్రసక్తు లెత్తిన నొప్పదు. కామ్యవస్తువులుపంపి నను నిరాకరించును. సర్వమిట్లు నిరాకృతముకాగా నామె వ్యాధిపీడిత యగును. ఇచట వేరొక యోజనము కూడ సంగతము. ప్రేయసియె ప్రియుని పొందభిలషించినదై సామాదులు ప్రయోగించియు కామ్య సంభోగములు కబురంపియు నన్నియు విఫలీభూతములు కాగా వ్యాధి గ్రస్త యగును. అపుడామె హృదయ మామెలో నుండదు. మూర్ఛ పొందును. తలనొప్పితో తీవ్రముగా బాధపడును. ధృతి పొందలేదు. మనసు చిక్కపట్టలేదు. తుకతుక పడును. ఇట్టి యష్టమావస్థను ప్రయోగింపవలెను.

౯. జడత : ఎవరేని పలుకరించిన పలుకదు. పిలిచిన పలుకదు. అడిగినను చెప్పదు. ఏమియు వినదు. ఏమియు చూడదు. 'హా! కష్టం!' "అబ్బా! అమ్మా?" అనియే పలుకును కాని తదతిరిక్తముగా నేమియు పలుకదు. ఊరకనే యుండదు. ఇట్టిదిది జడత. ఇందు స్మృతి యుండదు. అసమయములో "హుం" అనును. అంగములు దిగజార్చును. ముఖ మున శ్వాసలు చిమ్మును. ఇదియంతయు జడతాభినయవిధానము.

౧౦. మరణము : ఎన్నియుపాయము లొనర్చినను ఎన్ని ప్రతీ కారము లొనర్చినను ప్రియుని సమాగమము కలుగనపుడు కామాగ్ని

ప్రదీప్త మయిన ప్రమదకు మరణమె కలుగును. ఇట్టి వన్నియు కామస్థానములు. కామతంత్రము బాగుగా సమీక్షించి వీని నిబంధనమున పూనుకొనవలయును. కామ్యజనుడు లభింపనప్పుడు నైధనము (మరణము) విడిచి యన్యముల నిబంధింపవలయును.

విప్రలంభసముద్భవము లయిన యీ వివిధభావములు పురుషునకును గలుగును. ఈ కామభావములచే నానావిధము లయిన యవస్థావిశేషములను యోజనము చేయునది. ఇట్లు కామయమానావస్థలందు స్త్రీలకు గాని పురుషులకు గాని సామాన్యగుణయోగమున నభినయవిదు డభినయయోజన మొనర్పవలెను. పురుషుడు సులభోపాయుడు. కాన మొదటినుండియు నాతనిలో విశేషములు నిరూపింప నవసరము లేదు. మధ్యసమయమునుండి యాతని సమాగమము నిబంధించుటయు సముచితమయిన శక్యక్రియ. స్త్రీలకట్లు కాదు. వారు సులభోపాయలు కారు. కావున కామావస్థలు స్త్రీలవిషయమున నియతముగా నుపదిష్టము లయినవి. అవియె పురుషుల కతిదిష్టములగును. అవసరాపేక్షితను బట్టి యొకచో నియతముగా నుపదేశముగా నిర్ణీతములయినవాని నౌచిత్యానుసారమున నన్యములందును సంక్రమింపజేయుటలో నతిదేశము భాసించును. స్త్రీలకు ముఖ్యముగా నిర్దిష్టములు పురుషుల కతిదిష్టము లయినవి. చింతానిఃశ్వాసఖేదమున హృద్దాహాభినయమున, అనుగమనమున, మార్గనిరీక్షణమున, ఆకాశవీక్షణమున, దీన ప్రభాషణమున, స్పర్శనమున మోటనమున, అపాశ్రయాశ్రయమున, విప్రలంభసముత్పన్నము లయిన నానాశ్రయవిధానములచే సర్వవిధములయిన కామస్థానములను ప్రయోగింపవలెను. ఈ చింతానిశ్వాసఖేదాదు లన్నియు సామాన్యగుణయోగముతో నుండు విధానములు. వీని యనుసరణము ప్రయోగ రమ్యతను కూర్పగలదు.

౯౩ స్రజో భూషణగంధాంశ్చ గృహాణ్యుపవనానిచ
కామాగ్నినా దహ్యమానః శీతలాని నిషేవతే
౯౪ ప్రదహ్యమానః కామార్తో బహుస్థానసమర్దితః
ప్రేషయేత్కామతో దూతీమాత్మావస్థాప్రదర్శనీం
౯౫ సందేశం చైవ దూత్యాస్తు ప్రదద్యాన్మదనాశ్రయం
తస్యేయం సమవస్థేతి కథయేద్వినయేన సా

౮౬. అథావేదితభావార్థో రత్యుపాయం విచింతయేత్
అయం విధిర్విధానజ్ఞైః కార్యః ప్రచ్ఛన్నకామితే

కామస్థానములను పొంది కామాగ్నిచే దహ్యమాన దేహుడగు పురుషుడు దాహశాంతికి తగినట్లుగా పూలమాలలను సేవించును. భూషణముల ధరించును. శ్రీచందన మలదుకొనును. ఉద్యానవనముల సేవించును. అందుండు సముద్రగృహకాదుల నాశ్రయించును. అంతర్దాహ మధికము కాగా బహిశ్శీతలప్రక్రియ లంతగా నుపయోగింపవు. ఆతడు కామార్తు డగును. ప్రదహ్యమానుడగును. నానావిధ కామస్థానమర్దితు డగును. ఇక కర్తవ్యపాలనమునకై కామదూతిక నొకతెను కుదుర్చుకొని తన యవస్థను ప్రదర్శించు దానిగాచేసికొని దూతికను పంపును. అప్పటి తలంపును బట్టి యిట్లు దూతీప్రేషణ మొనర్పవలెను. మదనాశ్రయమయిన సందేశ మొకటి యా దూతి యధీన మొనర్పవలెను. ఆ దూతియు సావధానముగ నంతయు గుర్తించి "ఆతని యవస్థ యిట్లున్న" దని నాయికకు నివేదింపవలెను. దూతీముఖమున తన భావార్థము నట్లావేదిత మొనర్చిన పిమ్మట పురుషుడు రత్యుపాయమును పరిశీలింపవలెను. ఇట్టి యీ విధాన మంతయు విధానజ్ఞులగువారు ప్రచ్ఛన్నకామిత మందు సావధానముగ కూర్పవలెను. ప్రచ్ఛన్నకామితము నాయికలందరిలో ప్రకృతనాయిక యందు విశిష్టతను తత్ప్రధానతను గోచరింప జేయును.

## రాజోపచారము.

ఇక నిటుపై కామతంత్రసముత్పన్న మయిన రాజోపభోగము లందలి యభ్యంతరగతమయిన విధానమును నిరూపింతుము. అది యంతయు తత్త్వతః రాజోపచారవిధివిశేషమును సూచించును.

౮౭. సుఖదుఃఖకృతాన్ భావాన్ నానాశీలసముత్థితాన్
యాన్యాన్ప్రకురుతే రాజా తాంస్తాంల్లోకోనువర్తతే
౮౮. న దుర్లభాః పార్థివానాం స్త్రీష్ఠమాజ్ఞాకృతా గుణాః
దాక్షిణ్యాత్తు సముద్భూతః కామో రతికరో భవేత్
౮౯. బహుమానేన దేవీనాం వల్లభానాం భయేన చ
ప్రచ్ఛన్నకామితం రాజ్ఞా కార్యం పరిజనం ప్రతి

పాలకుడగు ప్రభువు నానాశీలసముత్థితములయిన సుఖదుఃఖకృతములగు నే యే క్రియావిశేషముల నాచరించునో లోకము వాని వాని నా యా విధమున ననుసరించును. ఆయా సత్త్వప్రకృతికముగా సుఖసిద్ధికై రాజొనరించు వానిని లోకులును సుఖకాములై యాచరింతురు. అట్లె దుఃఖనివృత్త్యుపాయముగా రాజాచరించు వానిని లోకులాదరింతురు. "యథా రాజా తథా ప్రజా" రాజులకశక్యము లుండవు. వారు చింతించిన వానిని సాధింప కెట్లుందురు? అయినను ప్రణయసిద్ధికై దూతీప్రేషణాది ప్రయాస మనుభవింతురు. రాజు తలచిన కొదువేమి? "న దుర్లభాః పార్థివానాం" రాజుల కన్నియు సులభములు. వారలకు దుర్లభము లుండవు. అయినను స్త్రీల కొఱకై రాజులకు సంబంధించిన యుపలబ్ధి కయిన యుపాయయము లెన్నియో కలవు. సర్వోపాయములు వారి యాజ్ఞాకృతములుగా సంప్రాప్తము లగును. "ఉపాయః = ఉప=ప్రలంభాదుదాహరణాత్, అయః" అనుకూలమగు విధానము ప్రాప్త్యుదాహరణముగనె లభించుటచే నుపాయ మగును. ఇట్టివెన్నియో వారలకుపాయములు. అన్నియు సులభములు. వారు వాని నాజ్ఞాబలమున సాధించుట రమ్యము కాదు. అందభిమత మనుగతమై సుందరముగ నుండదు. అందుననె వారుపాయము లందాత్మబల ముపయోగింపరు. అంతట దాక్షిణ్యసముత్పన్న మయిన కామమె రతికర మగును కాని బలజన్యమయిన కామము కామమై యరతికర మగును. దాక్షిణ్యసముత్పత్తి యుభయవిషయము. పురుషునకు దాక్షిణ్య మావశ్యకము- స్త్రీకిని దాక్షిణ్య మపేక్షితము. ఈ దాక్షిణ్యములందు భేదమున్నది. పురుషునకు పూర్వనాయికలందు దాక్షిణ్య మావశ్యకము. వారియందు విరక్తుడై నవనాయికలయం దనురక్తుడగుట నిబంధనీయము కాదు. అభిలషింప దగిన ప్రమదయందొక దాక్షిణ్య ముండును. ఆమెకు రాజవిషయమయిన ప్రేమ యుండవలయును. ఇట్లు పరస్పరదాక్షిణ్యజన్యమగు కామమె సముచితము. ప్రణయవిషయమున ప్రభువులును ప్రచ్ఛన్నప్రవృత్తికల వారగుదురు. అట్టి ప్రచ్ఛన్నతలో దేవీబహుమాన మొక నిమిత్తము. పట్టపుదేవిని గౌరవించుట సముచితము.

ఆమె యెదుటనే యన్నియు నాచరించుట బహుమానము కాదు. అందుననె ప్రచ్ఛన్నత. దేవీజన మభిషేకము పొందినారు. ప్రాప్తాభిషేక దేవి యుత్కృష్టముగ మాననీయ. వల్లభాభయము వేరొక హేతువు. రాజులకు పట్టపుదేవి కాక వల్లభ లయిన యాఁడువాండ్రుందురు. వారు ప్రణయభాజనలు. వారలు నవప్రేమక్రియలు చూచి విప్రియ లగుదురేమొ? వారలకు తెలియకుండునట్లు ప్రచ్ఛన్నముగా ప్రేమించుట మంచిది. మాలవికలో నిరావతి రాజవల్లభ. ఆ వల్లభాభీతిచే రాజు ప్రచ్ఛన్నకాముకు డయినాఁడు. ఇట్లు రాజు పరిజనము నాశ్రయించి ప్రచ్ఛన్నకాముకు డగుట యుక్తము. అదియె ప్రచ్ఛన్నకామితము.

ప్రచ్ఛన్నకామితము.

౧౦౦. యద్యప్యస్తి నరేంద్రాణాం కామతంత్రమనేకధా
ప్రచ్ఛన్నకామితం యత్తు తద్ధి రతికరం భవేత్।
౧౦౧. యద్వామాభినివేశిత్వం యతశ్చ వినివార్యతే।
దుర్లభత్వం చ యన్నార్యాః సా కామస్య పరా రతిః॥

రాజవ్యక్తుల కామతంత్ర మనేకవిధముల నున్నది. వివాహితలయిన స్త్రీల విషయమగు కామతంత్ర మొకవిధము. వివాహితలు కాకున్నను రాజాంతఃపురములం దవరుద్ధలయిన వనితలుందురు. తద్విషయకామతంత్ర మన్యవిధము. ఇట్లె వారికి వారివారికి సంబంధించిన కామతంత్ర మనేకరీతుల నుండును. అయినను ప్రచ్ఛన్నకామితమె రతికరమై రమణీయముగా నుండును. అప్రతిరోధమయిన కామసేవనము రమ్యముగ నుండదు. కొన్ని ప్రతిరోధము లడ్డంకులు నివారణములు భయసంభావనములు భీతిభావనము లుండవలెను. భయసంభావన మున్నపుడు "వలదు వలద"ని, "కాదు కాదని" నివారణ మున్నపుడు "ఊఁహూఁ"లతో చేష్టానిరోధము లున్నపుడు, ప్రాప్తి దుర్లభముగా నున్నపుడు కామము రతికర మగును. వనితలప్రతిరోధమయిన యనుభవ మొల్లరు. వారు కొంత వామాభినివేశమున నుందురు. వక్రరీతితో నున్నట్లుందురు. అనుభవసమయములో నడ్డుపెట్టుదురు. "సులభావమానీ హి మదనః" మదనుడు సులభముగా నవమానింపగలడు కదా! అట్లు కామవిఘ్నము కలుగును. అభిలషించిన వస్తువు వెంటనే ప్రాప్త

మయినచో నింక అభిలాష యేమున్నది? ప్రాప్తము ప్రాప్తముగ నుండరాదు. అది యపహృత మయినట్లు క్షణములో పోయినట్లుగా నుండవలెను. ప్రాప్త మపహారితముగ గతముగ నుండుటలో గత మపహారితము ప్రాప్తముగ నుండుటలో కామరతి సమధికముగ నుండును. ఆ కామము కమనీయ మగును. అందుననె నరునకు నారి దుర్లభగ నుండుట కామములో రతిపారమ్యము సూచించును. వనిత దుర్లభగానున్నదని పురుషుడు వీరత్వసహజము లయిన పరాక్రమ ప్రాభవాదుల ప్రదర్శించుట యెంతయు నసంగత మగును. పరరతి కల కామము లేకున్న భౌతికభోగ మేమియు స్పృహణీయము కాదు. ఎరికిని సంభావనీయముకాదు. కామమున వామరీతి నివారణము దుర్ల భత పరరతిసంపాదకము లగును.

స్పష్టకామితము

౧౦౨ రాజ్ఞా మంతఃపుర జనే దివాసంభోగ ఇష్యతే
వాసోపచారో యస్త్వేషాం న రాత్రౌ పరికీర్తితః
౧౦౩ పరిపాట్యాం ఫలార్థే వా నవే ప్రసవ ఏవ వా
దుఃఖే చైవ ప్రమోదే చ షడేతే వాసకాః స్మృతాః
౧౦౪ ఉచితే వాసకే స్త్రీణాం ఋతుకాలేపి వా నృపైః
ప్రేష్యాణామథవేష్టానాం కార్యం చైవోపసర్పణం

ప్రచ్ఛన్న కామితము నిరూపితమయినది. స్పష్టకామిత మిందు నిరూపిత మగును. రాజుల కంతఃపురజన విషయమున స్పష్టకామిత మున్నది. స్పష్టకామితమున నంతిపురమువారే యుందురు. వారి యందు దివాసంభోగము సముచితము. ఇచట దివాసంభోగ మనునది సంకేతసిద్ధముగా నున్నది. ఇచటి సంభోగపదమును— పరస్పరావ లోకనము, ప్రణయము, ప్రణయకలహము, తన్నివారణవిధి సంగీతకము మొదలగువాని పరముగా ప్రయుక్త మయినట్లు భావింపవలెను. రాజులకు వాసము నందలి కామోపచారము రాత్రియందే సముచిత మని పరికీర్తిత మయినది. అంతఃపురజన మనగా వివాహితవనిత, పునర్భూ, అవరుద్ధగణిక యని గుర్తింపవలెను. కన్యకాప్రేష్యా విషయమున ప్రచ్ఛన్నకామితము సముచితమని నిరూపిత మయినది. తాపసవత్స రాజములో రాజుస్పష్టకామితములో నుండుట యిట్లు రూపిత మయి

నది. "ఆమె ముఖమును చూచుచు పగలు రాత్రి చేసితిని. మదనోత్సాహము కల యామె యంగకార్పణముల గోష్ఠితోడనె రాత్రి తెల్లవారినది. అయిన నిపుడామె నా మార్గమె చూచుచు నిలబడగా నామెను చూచుటకై నాకేమో! యేమో! యుత్కంఠగా నున్నది. ప్రేమోత్సవరీతి యిట్టిదే కాబోలు.!" పూర్వార్థములో దివాభోగ మున్నది. ఉత్తరార్థములో రాత్రివాసోపచార మున్నది. వాసకము లారు విధములు. ఈ యారు వాసకరీతులను భావించి రాజుపచారమున ప్రవృత్తు డగును. వాసకవృత్తాంత మిట్లుండును

వాసకరీతులు.

౧. పరిపాటి : ఒక్కొక నాయిక కొక్కొక క్రమ మేర్పఱచి యా యానుపూర్వి ననుసరించి వారల సేవించుట పరిపాటి. ఒక్కొక దిన మొక్కొక యామెవంతురావచ్చును. ఈమె యింటి కీనాడు ఆమె యింటికి మరునాడు ఆయింటి కానాడు ఇట్లు వారము నిర్ణయించుట పరిపాటి. ఈ పరిపాటి నతిక్రమింపక వాసోపచార మనుసరింపవలెను.

౨. ఫలార్థము. వాసోపచారమున నిది రెండవది. మొదటి దాని కిది యపవాదము. పరిపాటి క్రమమనుసరించి యొక వనిత యింటి కడ వాసోపచారము క్రమప్రాప్త మయినను ఫలార్థ మయిన విధానము రాగా నిదియె యనుసరణీయము. ఫలార్థమనుట ఋతుకాలము. ఆర్తవకాలము సర్వశ్రేష్ఠము. సముచితము. "వాసయతి తత్ర స్థానే రాత్రిమితి వాసః" ఆ రాత్రి యా స్థానమున నివసించుటచే నది వాసమను సంజ్ఞ కలదయినది. వాసస్థానమున సముచితమయిన కామోపచారము ఫలార్థమగును. ఫలార్థమయిన వాసము సర్వాపవాదకము. ఎన్ని యితరము లున్నను ఫలార్థము విడువరాదు. ధర్మవృత్తి యగు రాజు "ఋతావుపేయాత్" ధర్మవిధి ననుసరింపవలెను. స్త్రీల ఋతుకాలము సంప్రాప్త మగునేని సముచితవాసకమునందే వారున్నచో దేశాంతరగతు డయిన రాజవశ్యము వారిదరిచేరి యుపచరింపవలెను. ద్వేష్య యయినను దుర్భగయయినను ధర్మవృత్తియగు రాజుపచరింపవలె ననియె విధిచోదన మున్నది. ఆర్తవకాలము ఫలమును బట్టి పరముల కన్న ప్రశస్య మనిరి. ఋతుకాలములో నే యే

దినము లుపచరింపదగినవో నియమవిధు లున్నవి. స్త్రీసంతానఫలమునకు కొన్ని దినములును, పురుషసంతానమునకు కొన్ని దినములును సంకేతితములై యున్నవి. ఈ దినములలో గూడ తిథి విశేషములను నక్షత్రవిశేషములను విడువవలసి యుండును. రాజులకు పుత్రుడు ముఖ్యఫలము. "ప్రజాయై గృహమేధినాం" అని కవికులపతి యనినాడు. ఈ విషయమున కొందరి వృద్ధపశువుల మాటలున్నవి. మాసప్రసూత, షణ్మాసగర్భిణి, ఏకదినజ్వరముక్త యయిన వనిత ఫలార్థముగ వాసకమున నుపచరింపదగినదని వారనిరి. కాని యిది నిషిద్ధము. స్మృతి యొప్పదు. వైద్య మొప్పదు. అస్మృతు లవైద్యులు పలుకు కామోపచారములు మానింపవలెనని తలచరాదు.

3. నవత్వము మూడవది. నవవధువు నిత్యోపచారలాలనీయ. నవోఢాభాగ్యము నితరవనితలు ననుభవించి యుందురు. వారు నవోఢల నంతగా ననూయింపరు.

౪. ప్రసవము నాల్గవది. "ప్రసవే" యను మూలవాక్యమున "ప్రసవే వృత్తే" యని యర్థమూహింపవలెను. నవప్రసూత వనిత యుపచార పరిగ్రాహ్యా. ప్రసూత యయిన తరువాత బాలింతలక్షణములు కొంతతగ్గి యారోగ్యము పట్టగాచిరవిరహాఖిన్న సముల్లసన్మధురభావ యనుగ్రాహ్యా యగును. ప్రసూతపుత్ర నవప్రసూత కామోపచారలాలనీయ.

౫. దుఃఖసమయము వేరొక వాసకము. నాయిక బంధువుల యాపదలు విని దుఃఖిత యయినప్పుడు నాయకుడు నియతవాసరపరిపాటి కాకపోయినను ఆమె వాసకమున కేగి యా రాత్రి యచట గడపి యామె నాశ్వాసింప చేయవలెను.

౬. ప్రమోదసమయము. నాయికపుత్రోత్సవ మొనరించునప్పుడుపచారమున నాదరింపవలెను. "పుత్రోత్సవో మాననీయః" పుత్రోత్సవము లనేకరూపములు. ఇవి షడ్విధవాసకములు. వీనిలో రెండవది యయిన ఫలార్థ మనునది సర్వాపవాదకమని తత్ప్రసక్తిలో నిరూపితమయినది.

## నాయికాభేదములు

నాయికలలో కొందరు వాసకమునందుందురు. కొందరకు వాసకముండదు. కాగా వాసకాభావభావితనాయికాభేదములు కొన్ని యున్నవి. వాసకసజ్జికాది నాయికాభేదాష్టకము వాసకాభావభావితమని సాంకేతిక మయిన పరిభాష యున్నది. ఆరువిధములయిన వాసకములు నిర్దిష్టములు. వాసకస్థితి కల నాయికల స్వరూపపరిగణన మిట ప్రసక్తము కాదు. అట్టి వాసకవిధానము లేని నాయికల భేదములె యిచట నిరూపణీయము లగుచున్నవి. అట్లు వాసకాభావభావితములయిన యెనిమిది నాయికల భేదములను వాని నామసంకేతములతో నిట్లు గుర్తింప వచ్చును.

| | |
|---|---|
| ౧. వాసకసజ్జిక | ౨. విరహోత్కంఠిత |
| ౩. స్వాధీనభర్తృక | ౪. కలహాంతరిత |
| ౫. ఖండిత | ౬. విప్రలబ్ధ |
| ౭. ప్రోషితభర్తృక | ౮. అభిసారిక |

ఈ యష్టవిధనాయికల లక్షణము లిట్లున్నవి

౧౦౫. ఉచితే వాసకే యా తు రతిసంభోగలాలసా
మండనం కురుతేహృష్టా సా వై వాసకసజ్జికా

౧౦౬. అనేకకార్యవ్యాసంగాద్యస్యా నాగచ్ఛతి ప్రియః
తదనాగతదుఃఖార్తా విరహోత్కంఠితా తు సా

౧౦౭. సురతాతిరసైర్బద్ధో యస్యాః పార్శ్వే తు నాయకః
సాంద్రామోదగుణప్రాప్తా భవేత్ స్వాధీనభర్తృకా

౧౦౮. ఈర్ష్యాకలహనిష్క్రాంతో యస్యా నాగచ్ఛతి ప్రియః
సామర్షవశసంప్రాప్తా కలహాంతరితా భవేత్

౧౦౯. వ్యాసంగాదుచితే యస్యా వాసకే నాగతః ప్రియః
తదనాగమదుఃఖార్తా ఖండితా సా ప్రకీర్తితా

౧౧౦. యస్యా దూతీం ప్రియః ప్రేష్య దత్వా సంకేతమేవ వా
నాగతః కారణేనేహ విప్రలబ్ధా తు సా భవేత్

౧౧౧. నానాకార్యాణి సంధాయ యస్యా వై ప్రోషితః ప్రియః
ప్రరూఢాలకకేశాంతా భవేత్ ప్రోషితభర్తృకా

౧౧౨. హిత్వా లజ్జాం తు యా శ్లిష్టా మదేన మదనేన చ
అభిసారయతే కాంతం సా భవేదభిసారికా

౧. వాసకసజ్జిక : రతిసంభోగలాలసయై సముచితవాసభవనము నందు ప్రియుడు వచ్చునని యనుభవించునని యభిలాషిణియై హర్షమున నుండు స్త్రీ వాసకసజ్జిక. వాసభవనమునందు కామోపభోగమునకు సంసిద్ధయై యున్నది కావున నామసంకేతము సముచితముగా నున్నది.

౨. విరహోత్కంఠిత : అనేకకార్యవ్యాసంగము వలన ప్రియుడు రాకపోగా నాతడు రాలేదని దుఃఖార్తయగునది విరహోత్కంఠిత యగును. విరహముచే నుత్కంఠము కల వనిత యని భావము.

౩. స్వాధీనభర్తృక : నాయకుడు సుభగసురతాసక్తుడై తద్రస సమాబద్ధుడై నాయికాపార్శ్వమును విడనాడక యుండునేని యా నాయిక సాంద్రామోదము కలదగును. ఆమె స్వాధీనపతిక. ఆమె పతి యామె యభిలాష కధీనుడై యున్నాడని భావము. ఈమె కామోద గుణము హర్షము సౌభాగ్యాభిమానమును. స్వయము పురుషుని భోగముకోరునది సాభిలాష. స్వయము పురుషుడె భోగము కోరునేని వనిత స్వాభిలాష యనవచ్చును. ఈమె స్వాభిలాష.

౪. కలహాంతరిత : ప్రియుడీర్ష్యాకలహమున నిర్గమించి మరల రాకపోగా నమర్షవశయై సంతప్తచిత్తయగు వనిత కలహాంతరిత యగును.

౫. ఖండిత : అన్యనారీసంగ మనెడు వ్యాసంగమున నుండి రావలసిన తన యింటికి రానపుడు వాడు రాలేదని దుఃఖార్త యగు వనిత ఖండిత యగును.

౬. విప్రలబ్ధ : ప్రియుడు దూతిని పంపినాడు. వచ్చెద ననినాడు. సంకేత మిచ్చినాడు. కాని యేదో కారణమున రాలేక రాలేదు. అప్పుడానాయిక విప్రలబ్ధ.

౭. ప్రోషితభర్తృక : నానావిధములగు కార్యము లభిసంధా నించుకొని ప్రియుడు దేశాంతరము పోగా దిగజారు వ్రేలాడు బిరుసు పడు ముంగురులు కలిగి వికీర్ణకబరీభారముతో నుండునది ప్రోషితభర్తృక. ఈమె కేశములు సంస్కారము లేనందున నొకేవిధముగా పెనవేసికొని యుండును. ఇచటి ప్రరూఢాలక కేశాంతపదమును కొందరు వేరొక విధముగా వ్యాఖ్యానించిరి. ప్రియుడు సమీపమున లేనందున కేశము

లకు సంస్కారకర్మ లేదు. కేశాంతప్రదేశముగా నెన్నదగిన లలాటమున నూగుపెదిగి ముదిరి మునుముంగురులతో కలియక పెనుగురులతో కూడక వేరుగా నుండును.” ఇది వారి భావము.

౮. అభిసారిక : స్త్రీసహజ మయిన లజ్జను విడనాడి మదశ్లిష్ట మదనశ్లిష్టయై కాంతు నభిసరింపజేయు వనిత యభిసారిక యగును. మదశ్లిష్ట=మద్యకృతమయిన మదమున గూడినది. మదమదనసంశ్లిష్ట యనుటలో రెండున్నను మదనసంశ్లేషమునకే ప్రాధాన్య మున్నది. అభిసారిక=అభిసరము సహాయము దానివ్యాపారమున వనిత ప్రియతము నతిక్రమించును. ప్రియున కభిసరము లేదు. ఈమె కున్నది. ఈమె యాతని మీరినదయినది. ఇది రాగాతిక్రమణము.

ఇంకను కుప్యంతీనాయిక ప్రశాంతనాయిక చెప్పవచ్చు నందురు గాని వారిచట నాయికాభేదమున పరిగణనములోనికి రారు, వారు వాసకాభావభావితలు కారు. ఈ యెనిమిది విధము లయిన యవస్థలలోని నాయికలు నాటకాశ్రయులై యుందురు. నాట్యవిషయముగా వీరినే భావింపవలయునని భావము. వీరలకందరకు ననేకవిధములయిన కామతంత్రములున్నవి. వానినిక ప్రతిపాదించుట యుక్తము.

విప్రలంభజీవితము.

ఇందు వాసకాభావభావితము లయిన నాయికాభేదముల నాశ్రయించి శృంగారానుసారమున నిరూపింపదగిన విప్రలంభజీవిత మొకటి భావ్యమానసుందరము కలదు. ఈ విప్రలంభజీవితానుగత మయిన యభినయము సామాన్యాభినయము కాగలదు. మదనోపచారములు సకలసహృదయహృదయసంవాదము పొంది సామాన్యాత్మకములు కాగా నీయభినయమును సామాన్యాభినయ మగును. ఈ నాయికలలో ఖండిత, విప్రలబ్ధ, కలహాంతరిత, ప్రోషితభర్తృక యను నలుగురు నాయిక లీ భావముల నభినయమున ప్రయోగింప వలెను. అనుభావ వ్యభిచారిభావసముచితము లయిన భావములను కలిగియుందురు కావున వాని ననుకూలములగు ననుభావముల యోజనమున ప్రదర్శింపవలెను. ప్రదర్శింపదగిన కతిపయానుభావవ్యభిచారుల నిట్లు గుర్తించునది.

చింతానిశ్వాసఖేదము, హృద్దాహాభియము, తమ యవస్థాపరిశీలనమున సఖులతో సంలాపము, గ్లాని దైన్యాశ్రుపాతములు, రోషప్రకటనము, నిర్భూషణభుజాందోలనము, దుఃఖము, రుదితము మొదలగువాని నా నాయికలు ప్రదర్శింపవలెను. ఈ నలుగురి నాయికలలో వాసకసజ్జక నభిసారికను చేర్పలేదు. వారు స్వావసరమున స్వాధీన భర్తృకతో సమానలెకాగలరు. వారినిందు వేరుగా జెప్ప నక్కఱలేదు.

౧౧౩. విచిత్రోజ్జ్వలవేషా తు ప్రమోదోద్ద్యోతితాననా
ఉదీర్ణశోభా చ తథా కార్యా స్వాధీనభర్తృకా

స్వాధీనభర్తృకాశృంగారజీవన మీ విధముగ నుండును. ఆమె వేషము విచిత్రము సముజ్జ్వలముగా నుండును. తన్ముఖ మానందమున నుద్ద్యోతితముగా నుండును. శోభ సముత్కటముగా నుండును. ఇది యామె చేష్ట. ఇది యామె యలంకారము.

అభిసారణ స్వరూపము

౧౧౪. వేశ్యాయాః కులజాయాశ్చ ప్రేష్యాయాశ్చ ప్రయోక్తృభిః
ఏభిర్భావవిశేషైస్తు కర్తవ్యమభిసారణం.

వేశ్య, కులజ, ప్రేష్య యను మూవురభిసరింపవలసి యున్నప్పుడు ప్రయోక్త లీ భావ (వస్తు) విశేషానుసారముగ వారివారి యభిసరణమును ప్రయోగమున నిబంధింపవలెను.

౧. వేశ్యాభిసరణ మిట్లుండును. ఆమె సమద మృదుచేష్ట పరిజన సమావృత నానాభరణచిత్రాంగియై మెల్లగా వీతభయగా నభిసరణ మొనర్చును. వేశ్యయు నభిసరించునా? యని తలచ నక్కఱలేదు. విశిష్టసుందరసదనము సంకేతస్థాన మయినపు డభిసరణమును సుందర మగును.

౨. కులజాంగనాభిసరణ మీ రీతి నుండును. కులజ తనశరీరమున తనయవయవములను ముడుచుకొన్నట్లు సంలీనగా భయభీతగా నభిసరించును. వదనము వంచికొని పోవును. తలయెత్తదు. అవగుంఠన మొక్కటి యంతట కప్పికొనును. కులజ యభిసరించుటయు సంకేతస్థాననియతి ననుసరించి యుండునని గ్రాహ్యము.

3. ప్రేష్యాభిసరణ మీ విధమున నుండును. ఆమె సంలాపము లన్నియు మదస్ఖలితములై యుండును. దూతితో గాని సఖితో గాని యుక్తిప్రత్యుక్తు లొనర్చుచు నామె మదస్ఖలితముగను నుండును. ఆమె లోచనములు విభ్రమోత్ఫుల్లములై యుండును. ఆమె గతి సంచార మావిద్ధముగా తొట్రుపాటుతో నుండును. ప్రేష్యసముద్ధత మయిన గమనముతో నభిసరించును. ఆమెకు భయములేదు. ఆమె కది యుల్లాసప్రక్రియ. నిత్యవిధి వంటిది.

ఈ మూవురు మూడువిధముల నభిసరించుట సంకేతిత మయినది. వారభిసరించి సంకేతగృహము చేరి యచట ప్రియుడు శయనించి యున్నట్లుగా గుర్తింతురేని యాతని ప్రబోధించుటకు మూవురు మూడువిధముల నుపచారములను స్వీకరింతురు. అట్లొనర్పవలెను. ఇది ప్రయోగతంత్రము. కులీనవనిత యలంకారశబ్దము లొనరించును. నూపురాద్యలంకారముల కదిలించి ఘలుఘల్లు మనుపించును. కంకణ నిక్వాణముల వెలయింపజేయును. ఇట్టి సవ్వడులతో నాతని మేల్కొల్పును. వేశ్యాంగన గంధపరిమళద్రవ్యముల గుప్పు మనిపించి ప్రతిబోధన మొనరించును. ప్రేష్యయయిన సేవిక చలచల్లని వస్త్రవ్యజనముల వీచును. పైటకొంగుసారించి తగిలీ తగలనట్లుగా వీచివీచి యాతని ప్రబుద్ధుని చేయును.

ఈ కామాశ్రయవిధానము కేవలము కులాంగనలకె నియతము చేయుటలేదు. అందరకు నిది విహిత మగుచున్నది. వేశ్యలకు నిట్టి కామాశ్రయవిధి యున్నది. రాజులకు వేశ్యాదిసంభోగము నిహ్నవ కారుల యపాయసంకులముగా నుండవచ్చును. అయినను దాని నిచట దర్శించుట సముచితమె. నాటకము సర్వావస్థానుభావ్యము కదా! నాట్యమునందన్నివిధములవారి యన్ని యవస్థావిశేషముల యన్ని యనుభవములను నిరూపించుట సముచితము. సర్వావస్థ లనుభావ్యములు కావలెను. అన్నియు ప్రత్యక్షాయమాణములై భాసింపవలెను. ప్రకరణాదులలో వేశ్యాసంభోగ మున్నదని దశరూపకముల ప్రసంగములో నిరూపితమె. వాసకమున ప్రకటప్రకారము నిరూపిత మగునట్లు నాటకమున సర్వప్రకారముల సర్వావస్థలు నిరూపితములు కావలెను.

౧౧౩. నవకామప్రవృత్తాయాః క్రుద్ధాయా వా సమాగమే।
సాపదేశైరుపాయైస్తు వాసకం సంప్రయోజయేత్।
౧౧౮. నానాలంకారవస్త్రాణి గంధమాల్యాని చైవ హి
ప్రియాయోజితభుక్తాని నిషేవేత ముదాన్వితః॥

వేశ్యావిషయమున వ్యాజప్రకారము కూడకలదు. అదియు నిరూపణీయము. ఒకానొక వేశ్య నవకామప్రవృత్త. ఒకానొక నవ పురుషుని సంభోగమునకు ప్రవర్తింపగా నామె తనకె ప్రథమముగా సమాగమింప దగినదనెడు భావమున వ్యాజసహితము లయిన యుపాయములచే నామెను వాసకమున జేర్పవలెను. అట్లె యొకానొక పునర్భువు (మారుమనువుకలది) ప్రణయకలహకుపిత యయినచో నామె సమాగమ మొనరింప దలచిన పురుషుడు సాపదేశోపాయములతో నామెను వాసకమున జేర్చునది. అట్లె యొకానొక యక్షత యయిన కన్యయు "గాంధర్వవివాహమున వివాహ్యా" యని తలచి యామె సమాగమమునకును సాపదేశోపాయముల నుపయోగింపవలెను. వీరు ప్రకటముగా సంగమ మంగీకరింపక పోవచ్చును. అందువలన నీ వ్యాజ ప్రకార మావశ్యకము. "నాయికాంతరేభ్యశ్చ ఝటితి భీరుర్నాయకో భవతి" నాయకుడు నాయికలకన్న ముందుగా భయపడువాడగుట లోకమున నున్నది. అట్టివాడు వ్యాజప్రకార మాశ్రయింపవలెను. ఆతని యుపాయములు సవ్యాజములు. వాసకమును వ్యాజముతో నుండును. వీరు సంగమ మంగీకరింపరని తోచినచో వ్యాజవిధాన మావశ్యక మగుట కామతంత్రనిర్దేశము. అవరుద్ధవనిత ఖండిత కలహాంతరితలు వాసక మంగీకరింపనివారై వ్యాజప్రయోగమున నంగీకరించు వారగుదురు. నాయికాహృదయగ్రహణమునకు సముచిత మయిన విదగ్ధతకై నాయకు డొనరింపవలసిన యుపచారములును గలవు. ప్రియురాలాయోజితము చేసికొనిన నానాలంకారములను వస్త్రము లను గంధమాల్యాదులను సంతోషభరస్వాంతముతో ప్రియుడు స్వీక రించి సేవింపవలెను. తాననుభవించిన వానిని ప్రియుడనుభవించు చుండగా ప్రియురాలు రాగరంజిత యగును. ప్రమద ప్రాప్త కాక పోయినచో పురుషుడు నివృత్తకాముడె యగును కదా! ఈయుప చారప్రతిభర మేల? అని యనిపింప వచ్చును. కాని;

౧౦౭. న తథా భవతి మనుష్యో మదనవశః కామినీమలభమానః
ద్విగుణోపజాతహర్షో భవతి యథా సంగతః ప్రియయా
౧౦౮. విలాసభావేంగితవాక్యలీలా మాధుర్యవిస్తారగుణోపపన్నః
పరస్పరప్రేమనిరీక్షితేన సమాగమః కామకృతస్తు కార్యః

సమాగమమున కామము ద్విగుణీకృత మగును. కామపరవశు డయిన పురుషుడు ప్రియురాలితోఁ గూడుకొనినప్పుడు హర్షాతిశయము కలవాడగును. ఉపచారములు మఱలమఱల నొనర్చును. కామినిని పొందునప్పు డంతగా మదనభావపరవశుడు కాడు. కామహర్ష మంతగా పొందడు. ప్రియాసంగతు డయినప్పుడు కామాతిరేకము కలవాడగును కావున నుపచారవిధానమున యత్నమును సముచితము. విలాసప్రధానము లయిన చేష్టితములు కలవాడు కావలెను. ఇంగితములు ప్రేమసూచకములయి వ్యాపారములు కలిగియుండవలెను. వాక్యలీల లనుసరింపవలెను. మాధుర్యోపేతుడు కావలెను. విలాసభావములలో నింగితములలో వాక్యలీలలలో మాధుర్యమున కవివర్ణనాకృత మయిన విస్తారగుణమున సముపపన్నుడయిన పురుషుడు కామోపచారదక్షుడగును. అప్పుడు పరస్పరప్రేమనిరీక్షిత ముదయించును. ఇంతటి యుపచారమున నామె రాగరంజితయై యట్టిచూపు చూచును. అట్లువారలకు కామకృతమయిన సమాగమ మొనరింపవలెను. స్త్రీవిలాసము పురుషధీరదృష్టి కామ్యాంగవికారరూప మయిన యింగితము పూర్వమునిరూపిత మయినది. ఇట్టి యుపచారముల వలన కామభావ ముదయింపగా వనిత నాయకుని యాగమనమునకై వాసోపచార మొనరింపవలెను. వాసోపచారమునం దత్యంత మధికముగా భూషణగ్రహణ ముండదు. రశన నూపురములు వానికుణుకుణు నిస్వనములప్పుట ప్రశస్యములు. గంధమాల్యములు గ్రహించి పటవాసచూర్ణముష్టి స్వీకరించి యద్దమున జూచుచు సవిలాసముగా నాయకుని గ్రహింపవలెను. తాత్కాలిక మయిన యభిలాషాను సారముగ నయిన పురుషుని గ్రహించునది. వస్త్రోపచారవిధానమున గూడ నాడంబర మక్కఱలేదు. రమ్యసుకుమార మయిన వస్త్రము చాలును. భూషణధ్వను లుండుట మంజులముగా నుండును. అధనులకు వాసగృహమున రత్నమణిదీపము లుండవు. దీపశూన్యవాసగృహమున చీకటిలో కన్పడదు గావున నిస్వ

నములు గల భూషణము లావశ్యకములు. అదియుగాక సురతలీలందుపయోగించు ప్రశస్తశబ్ద ముండుట యుక్తము.

౧౧౯. నాంబరగ్రహణం రంగే న స్నానం న విలేపనం
నాంజనం నాంగరాగశ్చ కేశసంయమనం తథా
౧౨౦. నాప్రావృతా నైకవస్త్రా న రాగమథరస్య తు
ఉత్తమా మధ్యమా వాపి కుర్వీత ప్రమదా క్వచిత్
౧౨౧. అధమానాం భవేదేష సర్వ ఏవ విధిస్సదా
కారణాంతరమాసాద్య తస్మాదపి న కారయేత్

ప్రయోగప్రసక్తి కలిగినదని రంగమున నంబరగ్రహణ మొనరింపరాదు. ప్రియుడు ప్రియావస్త్రముల నాకర్షింపరాదు. రంగమున స్నాన మొనరింపరాదు. విలేపన మొనరింపరాదు. రంగమున నంజనము ధరించుట నిరూపింపరాదు. అంగరాగము కేశసంయమన మిట్టి వేవియు జేయరాదు. ఇవియన్నియు ప్రసంగమున రంగమున నిషేధములు. వాసోపచారసిద్ధికై యుపచారోపయోగముగా రంగమున గొన్ని యాచరింప వచ్చును. కాని యంబరగ్రహణాదు లొనర్పరాదు. ఇట్టీరంగనిషేధములు సామాన్యముగా నిరూపితము లయినను ఉత్తమమధ్యమవనిత లిట్లు చేయరాదని గమ్య మంగీకరింపవలెను. అధమవనిత కిట్టివన్నియు నుచితములు కావచ్చును. ఉత్తమమధ్యమవనితలు రంగమున నాచ్ఛాదనములేక రారాదు. వారు ప్రావృతలై యుండవలెను. ఏకవస్త్రమున రారాదు. (ఏకవస్త్ర=ఋతుమతి వనిత) ఏకవస్త్ర యయిన వనిత రంగమున ప్రవేశింపరాదు. అధరమునకు రాగము సిద్ధము చేసికొని ప్రియసమీపమునకు రారాదు. ప్రియాస్వాదమున కేతెంచు వనిత సహజముగా నరుణారుణమయిన యధరముతో రావలయునే కాని రంగులు పూసికొనిన పెదిమలతో రారాదు. ఉత్తమమధ్యమ ప్రమద లిట్లొనరింపరాదు. ఈ సర్వవిధానము సర్వదా యధమప్రమదల కుండవచ్చును. కాని వారలకు నసభ్యకార్యమును ప్రయోక్తలు నిబంధింపరాదు. ఎంతటి యధమత్వ మున్నను సంభోగము రంగమున కూర్పరాదు. నారీనరుల యధమత్వము రంగసంభోగపర్యంతము రాకూడదు. అంతటి ప్రసంగము వచ్చినచో కారణాంతర మనుసరించి వారలకును వానిని కూర్పకుండుటలో ప్రయోక్త సావధానుడు కావలెను.

నాటకమునందు ప్రేష్య మొదలగు స్త్రీలకు పురుషులకును భూషణగ్రహణము పుష్పగ్రహణము నిరూపింపవలెను. ఇది ప్రకృత్యోప చారవిధి.

౧౨౨. గృహీతమండనా చాపి ప్రతీక్షేత ప్రియాగమం
లీలయా మండితం వేషం కుర్యాద్యన్న విరుధ్యతే

అలంకారముల ధరించి ప్రియుని రాకను ప్రతీక్షించు చుండ వలెను. సవిలాసముగా సుందరమగు వేషము ధరింపవలెను. ప్రకృతి విరుద్ధము కాని వేషము ధరించి యుపచారములందు సముచితాదర మును ప్రకటింపవలెను. యథావిధిగా వాసకరీతి ననుసరింప వలెను. వాసకోచితమయిన యుపచారవిధు లనుసరింపవలెను. ఉపచార విధానము లన్నియు సమాప్తములయిన పిమ్మట "ఇంకను ప్రియుడు రాలేదేమి ?" యని నాయిక నాయకుని రాకను ప్రతీక్షించునదై నాలికాశబ్దమునిర్దేశింపవలెను. "ఇంత సమయ మయినది. ఇంత కాలము గతించినది. ఇంకను రాలేదే ?" యని వంతపడి యింకను రాకపోగా నియతసమయము దాటిపోగా గడియలు గంటలు దాటుట గుర్తించి నాయకుని యాగమనవిషయమున విక్లబురాలై విషణ్ణురాలై కంప మానయై తోరణద్వారసమీపమున కేగునది. అచట ;

౧౨౩. తోరణం వామహస్తేన కవాటం దక్షిణేన చ
గృహీత్వా తోరణాశ్లిష్టా సంప్రతీక్షేత నాయకం

తోరణద్వారమును వామహస్తమున బట్టి కవాటమును దక్షిణ హస్తమున స్వీకరించి తోరణాశ్లిష్టయై నాయకుని ప్రతీక్షించు చుండ వలెను. తోరణ మాశ్రయించి శంకను చింతను భయమును పొంద వలెను. రమణుడు కన్పడడేని వనిత విషణ్ణచిత్త కానలెను. దీర్ఘము నిట్టూర్చ వలెను కన్నీరు విడచ వలెను. డిల్లపడి రిత్తపడి తల్లడపడి యాసనమున దేహమును దిగజార్చి చతికిలపడ వలెను. "నాయకు డేల రాలేదు?" అని వ్యాక్షేపమున నాలోచింపవలెను. ఈ యాలో చనములలో శుభసముత్థితము లయిన విచారణోపాయము లుండును. అశుభసముత్థితము లయిన యుపాయములు నుండును. "ఏల రాలేదు? గురుకార్యమున నాగి పోయెనా ? మిత్రులాపినారా? మంత్రి నిలిపెనా? రాజ్యచింతతో నట్టియుండెనా? వల్లభ యెవతెయేని ప్రియుడని చుట్ట

బట్టినా?" ఇట్లు పర్యాలోచనము చేయవలెను. ఈ పర్యాలోచన ములో ననుభావవర్గమును యథాయోగముగా యోజనము చేయు వలెను. అసూయాఖేదచింతాది వ్యభిచారి సంభవమును గూడ యోజ నము చేసికొనవలెను. ఇట్లు పర్యాలోచన మొనర్చుటలో గొన్ని శుభాశుభసముత్థితము లయిన యుత్పాతములను గూడ నిర్దేశింప వలెను. ఆత్మగతములయిన నిమిత్తములను స్ఫురితములను స్పందితము లను భావించుచు నుత్పాతములను నిర్దేశింపవలెను. వెంటనె యశుభ సూచక మగు మహాభూతపరిస్పందము పరస్థము. స్వదేహమందె స్ఫురిత స్పందనము లుండును. వాని ననుసరించుట స్వభావరీతి.

౧౨౪. శోభనేషు తు కార్యేషు నిమిత్తం వామతః స్త్రియః
అనిష్టేష్వథ సర్వేషు నిమిత్తం దక్షిణం భవేత్

స్త్రీకి శోభనకార్యములందంతటను వామభాగమున స్ఫురిత స్పందితము లుండును. సర్వానిష్టకార్యములందు దక్షిణభాగ స్థురిత ములు నిమిత్తసూచకము లగును. నేత్రలలాట భ్రూనాసోష్ఠము లూరు బాహు స్తనములు వామపక్షముగా స్ఫురించు నేని ప్రియునితో సమాగ మము కలుగును. ఈ యవయవము లన్యథా యున్నచో దుర్నిమిత్త మునే నిర్దేశింపవలెను. దుర్నిమిత్తము గోచరించెనేని క్షణము మూర్ఛ పోవలయును. [నాయకుడు రాకపోయినచో కరమును కపోలమున బెట్టు కొని భూషణములందు ననాదరము చూపవలెను. రోదింపవలెను. నాయకాగమనముననా నిమిత్తము శోభన మగునేని నాయిక వెంటనే గంధాఘ్రాణ మొనర్చుచు నాయకు డాసన్ను డయినట్లు సూచింప వలెను. నాయకుడు రాగనె చూచి లేచి హర్షపడి యథావిధిగా నెదు రుగా పోవలెను. ఆ పిమ్మట ప్రహర్షప్రఫుల్లవిలోచనయై కాంతుని చూడవలెను. ఆ చూచుటయు నాట్యభంగితో నుండును. అది యిట్లుండును.

౧౨౫. సఖీస్కంధార్పితకరా కృత్వా స్థానకమాయతం
దర్శయేత తతః కాంతం సచిహ్నం సరసక్రియా

సఖీస్కంధమున కరముంచి యాయతముగా పొడవుగా స్థానక మొనరించి సరసవ్రణచిహ్నితుడయిన కాంతుని చూపవలెను. ఈ నిరూపిత మయిన దంతయువాసకసజ్జికకు సంబంధించిన వాగంగసత్వ

న్యామిశ్రమగు సామాన్యాభినయము. ప్రియసంప్రాప్త్యవధికముగా ప్రదర్శిత మయినది. ఇక ఖండితాదుల సామాన్యాభినయము ప్రదర్శనీయము.

౧౨౬. యదిస్యాదపవరాద్ధస్తు కృతస్తైరుపక్రమైః
ఉపాలంభకృతైర్వాక్యైః ఉపాలభ్యస్తు నాయకః
౧౨౭. మానాపమాన సమ్మోహై రవహిత్థభయ క్రమైః
వచనస్య సముత్పత్తిః స్త్రీణామీర్ష్యాకృతా భవేత్।

నాయకు డన్యవనితాసంగమచిహ్నసంగతుడై యపరాధ మొనర్చిన వాడగు నేని ఖండితావనిత నాయకుని ఉపాలంభ మొనరింపవలెను. మానావహిత్థవస్త్రభంగాభిష్యందాద్యుపక్రమములు కల దెప్పిపొడుపు మాటలతో నాయకుని నిందింపవలెను. నాయిక కోపము తెచ్చికొని మాటలాడుట, తన యాకారగోపనముతో నిందించుట, నాయకుని వస్త్రము లాగి పలుకుట, దూకుడుగా నెదురేగి నిందించుట మొదలగునవి యన్నియు నామె స్వభావరీతులు. ఖండిత లయిన వనితల యీర్ష్యాకృత మయిన వచనసముత్పత్తి మానావమానసమ్మోహములతో నవహిత్థాభయక్రమములతో గూడి యుండును. కోపమున నొకప్పుడు కొందరు హద్దుమీరి యన్యథా భాషించుటయు నుండకపోదు. ఈ సందర్భమున నొక విషయాంశమవశ్యపరిగ్రాహ్యముగా నున్నది.

అనాభాష్యభాషణము

౧౨౮. విస్రంభస్నేహరాగేషు సందేహే ప్రణయే తథా
పరితోషే చ మర్షే చ దాక్షిణ్యాక్షేపవిస్మయే
౧౨౯. ధర్మార్థకామయోగేషు స్మరణే చ పరీక్షణే
హాస్యే కుతూహలే చైవ సంభ్రమే వ్యసనే తథా
౧౩౦ స్త్రీపుంసయోః క్రోధకృతే పృథఙ్మిశ్రే తథాపి వా
అనాభాష్యోపి సంభాష్యః ప్రియ ఏభిస్తు కారణైః

కొన్ని కారణముల బట్టి ప్రియునితో మాటలాడవలయును. ప్రియురాలు కోపము వహించి మాటలాడరాదని యెంతగా నిశ్చయించుకొనినను ప్రియుని పలుకరింప వలెను. అనాభాష్యుడును సంభాష్యు డగుటకు కొన్ని కారణము లున్నవి. ఆ కారణముల నిట్లు గుర్తింపవచ్చును.

౧. విస్రంభము. ఏదేని కార్యము నిరూపింప వలసి యున్నపుడు విశ్వసింపదగిన ప్రకృతితో నుండవలెను. తనయందు తగిన విస్రంభ ముత్పాదింపవలసి యున్నది కావున అనాభాష్యుడును సంభాష్యుడు.

౨. స్నేహము. శారీరికము లయిన విశేషములను భావించుటకు వార్తాప్రశ్నాదులందు ప్రదర్శించు నప్పటి స్నేహప్రసంగము వచ్చినపుడు భాషింపవలెను.

౩. రాగము. వార్తాప్రశ్నాదు లడుగుటలో నొక యనురాగ ముపలక్షిత మగును. అట్లనురాగము గోచరించి నపుడు పలుకవలెను. అనాభాష్యుడని నిశ్చయించుకొనినను ప్రియుడు విస్రంభస్నేహరాగములు కలవాడుగా కన్పడు నేని సంభాష్యుడగును.

౪. సందేహము : నాయకుడు ప్రణయాపరాధ మొనర్చెనో ? లేదో ? అకృతాపరాధుడయిన తాను కోపించుట సముచితము కాదు ఇట్లు సందేహ ముదయించినచో నవశ్య మాభాషింపవలెను.

౫. ప్రణయము : ప్రణయ మనునది ప్రార్థనము. నాయకుడు ప్రణయము ప్రార్థించు నపుడు కాదనరాదు. అప్పుడాతని పలుకరింపవలెను.

౬. పరితోషము : అపత్యాదుల యభ్యుదయనిమిత్తమయిన పరితోషసమయమున ననాభాష్యుని గూడ సంభాషింపవలెను.

౭. ఘర్షము : సంఘర్షము నాయకుని కలాశిల్పాదినిక్రృతిపక్షము ననుసరించిన స్పర్థాసమయమున గూడ సంభాషింపవలెను.

౮. దాక్షిణ్యము : సఖీజనాదిపరిజనమునకు సంబంధించిన కార్యమును ప్రియుడు సంపాదింపవలసి యున్నపుడు తానది గుర్తించి సఖీ కార్యమున వివాదము కల్పించుకొని తద్విషయమును తన పక్షముగ భావించుట దాక్షిణ్య మగును. ఈ దాక్షిణ్యమున సంభాష్యుడగును.

౯. ఆక్షేపము : నాయకుడు దాక్షిణ్యము కలవాడనని, యందరి యందు రాగసామ్యము చూపువాడనని యనునపుడు వాని పక్షమాక్షేపించి, తనయందట్టి రాగబంధము కన్పడుట లేదని పలుకుట యాక్షేపము. ఆక్షేపములో నాభాష్యుడు.

౧౦. విస్మయము : మాయేంద్రజాలాది ప్రదర్శనమున నాశ్చర్యము పొందుట విస్మయము. విస్మయసమయమున పలుకరింపదగును.

౧౧ ౧౨, ౧౩ ధర్మార్థకామయోగములు. ధర్మార్థకామముల కుపయోగించు వ్రతములు గృహకృత్యములు కౌముదీహర్షోత్సవము మొదలగునవి యవశ్యకర్తవ్యములు కాగా నప్రియస్మరణమేమాత్ర మొనరింపరాదు. అప్పుడా భాషింపవలెను.

౧౪. స్మరణము. ధర్మార్థకామఫలక మయిన యంశము స్మరణమునకు రాగా నాభాషింప వలెను.

౧౫. పరీక్షణము: ఉపాలంభ మొనరింపగా నీతడేమి పలుకునో పరిశీలింపవలెనని యనుకొనుట పరీక్షణము. అట్టి యప్పుడు పలుకరించునది.

౧౬. కుతూహలము. నాయకు డత్యాదరమున నేమేని యడుగుట కుతూహలము. అట్టి కుతూహల సమయమున పలుకరింప దగును.

౧౭. హాస్యము: అందరు నవ్వెదరేమో యని, యీ విశేష మీ కలహము చూచి యందరు నవ్వునపుడు తత్పరిహారమునకై పలుకరింపవలెను.

౧౮. సంభ్రమము. అగ్న్యాదులవలని యుత్పాత ముదయింపగా సంభ్రమము కలుగును. అప్పుడాతని సంభాషింపవలెను.

౧౯. వ్యసనము. బంధువియోగాదులు కలిగినపుడు కోపము నిలుపుకొనరాదు. అప్పు డనాభాష్యుడును సంభాష్యుడు. ఇట్లు సంభాషణావసరము లెన్నియో కలుగ వచ్చును. నాయకుని ప్రచ్ఛన్నవచనములలో గూడ నాభాషింపవలెను. తనవిషయమున నాత డేమేని శంకించి గూఢవచనములు పలుకునపు డట్టి వచనముల కవకాశము రాకుండుటకై తా నే పలుకవలయును. ఇట్టి ముఖ్యసమయము లిచట నిరూపితములు. ఈ సందర్భములందును సంభాషణ మొనర్పక పోయినచో నిస్నేహత కలుగును. చిరుకోపములను ముదర చేసికొని స్నేహ దూరులగుట పాడిగాదు.

## ఈర్ష్యాహేతువులు.

౧౩౧. యత్ర స్నేహో భవేత్తత్ర హీర్ష్యామదనసంభవా
చతస్రో యోనయస్తస్యాః కీర్త్యమానా నిబోధత

స్నేహమున్నచోట మదనసంభవ మయిన యీర్ష్య యుండును. ఆ యీర్ష్యాహేతువులు నాలుగున్నవి. నాయకు డపరాద్ధు డయినచో నాతని యపరాధము ముందుగా తెలియవలయును. వైమనస్యము, వ్యలీకము, విప్రియము, మన్యువు నని నాలుగు నీర్ష్యాయోనులు. వాని లక్షణస్వరూపము లీవిధముగా నున్నవి.

౧౩౨. నిద్రాఖేదాలసగతిం సచిహ్నం సరసవ్రణం
ఏవం విధం ప్రియం దృష్ట్వా వైమనస్యం భవేత్ స్త్రియాః
౧౩౩. బహుధా వార్యమాణోపి యస్తస్మిన్నేవ దృశ్యతే
సంమర్షమత్సరాత్తత్ర వ్యలీకం జాయతే స్త్రియాః
౧౩౪. జీవంత్యాం త్వయి జీవామి దాసోహం త్వం చ మే ప్రియా
ఉక్త్వైవం యోఽన్యథా కుర్యాద్విప్రియం తత్ర జాయతే
౧౩౫. ప్రతిపక్షసకాశాత్తు యః సౌభాగ్యవికత్థనః
ఉపసర్పేత సచిహ్నస్తు మన్యుస్తత్రోపజాయతే.

౧. వైమనస్యము సురత మొనరించి నిద్రపోయి లేచి బడలికచే మందగతి యగువానిని ప్రియాభోగచిహ్నముల కూడినవానిని సరసవ్రణము లధరక్షతములు కలవానిని చూడగా యువతికి వైమనస్యము కలును. వైమనస్యము పొందిన యువతి నిద్రాభ్యసూయకల చూపుతో చూచి, రోషమున కంపమానాంగియై "సాధు సాధు సుష్ఠు సుష్ఠు! బాగు! బాగు! మేలు! మేలు! బాగున్నావులే?" యని పలుకవలయును, ఇది యామె వాగభినయరీతి.

౨. వ్యలీకము. "నీ వా నాయికతో నుండవలదు. అని యనేక విధముల నన్యనాయికాప్రణయప్రసక్తిని నిషేధించినను మఱల మఱల నట్లె యాతడు ప్రవర్తింపగా సంఘర్షమత్సరములతో నుండు వనితకు వ్యలీక ముదయించును. ఈ వ్యలీకమునం దురమున వామహస్తముంచి దక్షిణహస్తమును విదల్చుచు పాదము నేలపై ఘాత మొనర్చి యభినయ మొనరింపవలెను.

3. విప్రియము : ప్రతిజ్ఞాతమును పరిపాలింపకుండుట విప్రియము. "నీవు జీవించిన నేను జీవింతును. నేను నీ దాసుడను. నీవు నా ప్రియవు." ఇట్లు నాయకుడు పలికియు వేరువిధమున నాచరించినచో స్త్రీకి విప్రియము కలుగును. నాయకుడు విప్రియ మొనరింపగా నాతడు దూతిని

ప్రసాదనప్రతివచనములకు పంపినను, ప్రణయలేఖముఖమున నేమేని యాచించినను అన్నిటిని నిరాకరించి దూషించి త్రోసిపుచ్చ వలయును. క్రోధము చూపవలెను. పరిహాసప్రాయముగా నవ్వవలెను. దుఃఖపడ వలెను. మాటి మాటికి శిరఃకంపములను క్రోధాదిసూచకముగా నాచరింపవలెను.

ర. మన్యువు : నాయికకు ప్రతిపక్షముగా నెన్నదగినపరనాయికా సమీపమునుండి తనసౌభాగ్యమును శ్లాఘించుకొనుచు సగర్వముగా నాయికాభోగచిహ్నములతో నాయకుడు నాయిక సమీపమున కేతెంచునేని మన్యువు జనించును. మన్యువు జనింపగా నాక్షణమునందే శరీరమున కృశత్వ మేర్పడును. కాన వలయపరివర్తనము జరుగును. కంకణముల జార్చుచు శిథిలశిథిలమై యూడి జారిపోవు వస్త్రమును మొలనూలును పైకిలాగికొనుచు బాష్పాంబుపూర్ణనేత్రయై సశంకిత ముగా మన్యువు నభినయింపవలెను.

ఈ యంశమున కొందరు సహృదయు లిట్లనిరి. నాయికకు మన్యువు కలుగగా నాయకుడు వచ్చినను సఖీజనమధ్యమునందె యాత నిని తగినట్లుగా నాయిక గౌరవింపదు. అప్పుడె యబహుమానలక్షణ ముగా నప్రతిపత్తి స్పష్టమగుచున్నది. వలయపరివర్తనము కాని లోచన భ్రమణాదికము గాని రశనోత్క్షేపణము కాని యంత్రోత్క్షేపణము గాని యుండును. అని.

౧౩౬. దృష్ట్వా స్థితం ప్రియతమం సశంకితం సాపరాధమతిలజ్జం
ఈర్ష్యా వచన సముత్థైః ఖేదయితవ్యో హ్యుపాలంభైః
౧౩౭. న చ నిష్ఠురమభి భాష్యో న చాప్యతిక్రోధనస్తు పరిహాసః
బాష్పోన్మిశ్రైర్వచనైః అత్మోపన్యాస సంయుక్తైః
౧౩౮. మధ్యాంగుల్యంగుష్ఠాగ్రవిచ్యవత్పాణినోరసి కృతేన
ఉద్వర్తితనేత్రతయా ప్రతతైరభివీక్షణైశ్చాపి
౧౩౯. కటిహస్తవివర్తనయా విచ్ఛిన్నతయా తథాంజలేః కరణాత్
మూర్ధభ్రమణ, నిహంచిత నిపాతనంశ్లేషణాచ్చాపి
౧౪౦. అవహిత్థవీక్షణాద్వా అంగులిభంగేన తర్జనైర్లలితైః
ఏభిర్భావవిశేషైరనునయనేష్వభినయః కార్యః
౧౪౧. శోభసే! సాధు! దృష్టోసి గచ్ఛత్వం కిం విలంబసే?
మా మాం స్ప్రాక్షీః ప్రియా యత్ర తత్ర యా తే హృది స్థితా

౧౪౨. గచ్ఛేత్యుక్త్వా పరావృత్త్య వినివృత్తాంతరేణ తు
కేన చిద్వచనార్థేన ప్రహర్షం యోజయేత్పునః

సశంకితుడు సాపరాధుడు ప్రియతము డతిలజ్జతో వచ్చి నిల బడగా నీర్ష్యావచననజన్యము లయిన యుపాలంభవచనములతో నాతని ఖేదపెట్టవలెను. మిక్కిలి నిష్ఠురముగా పలుకరాదు. మిక్కిలి కోపము కలుగునట్లు పరిహాసింపరాదు. కన్నీటి పలుకులతో తన విషాదవిమిశ్రము లయిన వచనములతో, మధ్యాంగులి యంగుష్ఠాగ్రము జారివేరుగా నుండున ట్లురమున హస్తముంచి కన్నులు త్రిప్పుచు నభివీక్షింపవలెను. కటీపార్శ్వమునం దున్న హస్తమును వివర్తింప జేయుచు నంజలి విడి వడ జేసి, తనశిరము చుట్టు నిహంచితహస్తమును త్రిప్పి, చాచి, గర్వముతో గాంభీర్యముతో జూడవలెను. అంగులిభంగముతో లలిత ముగా భయపెట్టవలెను. బెదరగొట్టవలెను. ఇట్టి భావవిశేషములతో ననునయనములం దభినయింపలెను. అనంతర మిట్లనవలయును. "సాధు! బాగున్నావు. ఇప్పటి కయిన కన్పడితివి. పొమ్ము! నీ వాలసింతు వేల? నన్ను స్పృశింపకుము! నీ ప్రియురాలున్నచోటికి పొమ్ము! ఎవతె నీ హృదయమున నున్నదో? పొమ్ము? పొమ్ము? ఇట్లుపలికి వెనుదిరుగ వలయును. అత్యంతము నిరపేక్షభావ కారాదు. నాయకు డచటనుండు లోపలనె యేమేని యుత్తర మిచ్చునేమో యని వెంటనె మఱల నాతని వైపునకు తిరిగి యేదేని వచనార్థమున మఱల నాతనికి ప్రహ ర్షము కలుగ జేయవలయును. ఇది యంతయు నాయిక చేయవలసిన విధానమున లలితోపదేశము,

౧౪౩. రభసగ్రహణాచ్చాపి హస్తే వస్త్రేచ మూర్ధని
కార్యం ప్రసాదనం నార్యా హ్యపరాధం సమీక్ష్యతు

నారి నరుని యపరాధము గుర్తించి వేగమున సమీపమున కేతెంచి నపుడు నరుడు హస్తముపట్టవచ్చును. వస్త్రము పట్ట వచ్చును. తలపై జుట్టు పట్టవచ్చును. రెండుచేతులతో తలపట్టవచ్చును. అపరాధ మల్ప ముగా నున్న శిరము పట్టునది. అపరాధ మొకవిధముగా నున్న హస్త తలమునగాని భూషితవస్త్రమునగాని బట్టునది. అట్లుపట్టుపట్టి యామెను ప్రసన్నురాలి జేసికొనుటకు నాయకు డారంభింపవలెను. హస్తవస్త్ర కేశాంతముల పట్టగా యువతియు కాంతునే యనుసరింపగా నెమ్మ

దిగా విడువవలయును. అపుడు నారి స్పర్శాలసముగా నాతని "హుం! ముంచ! ఊఁ విడు!" అనవలెను. పాదాగ్రమున నిలబడిన వనిత కొంతగా బాధ నభినయించుచు నశ్వక్రాంతవిధానమున నెమ్మ దిగా కేశమోక్షమొనరించు కొనవలెను. వాడు వెంటనే కేశాంతము విడువనిచో ఖేదలేశ మనుభవించుచు మందమందముగా నాతని తాకి "ఊఁ ఊఁ! విడు! విడు! పో! పో!" యనవలెను. గచ్ఛ! యని రోష వాక్యము పలికి కొంతదూరము పోవలెను. వెంటనే వెనుదిరిగి యేదేని వచనార్థమున "వెళ్లెదవా? లేదా?" యని గర్జించి పలుకవలెను. హస్తము విదల్చి హుంకారము ప్రయోగింపవలెను. విదల్పవలెను. ఒట్టుపెట్టవలెను. మిషపెట్టవలెను, "నే నీనాడు వ్రతము పట్టితిని. ఉపవాసముంటిని. నాదరి రాకుము!" అనవలెను.

నాయకుడు వెనుకగా వచ్చి యాలింగనము పట్టి కన్నులుమూసి నచో నాయిక తన శరీరమును ముడుచుకొనవయును. ఆతడు నారీ వస్త్రమునె లాగెనేని రత్నదీపమును కప్పివేయవలెను. వస్త్రాపహారము శయ్య మొదలగునవి రంగమున ప్రదర్శింపరాదని రంగనిషిద్ధములుగా నిరూపితము లయినవి, ఇచట వస్త్రాపహార ముపదేశించుట యుక్తమా? యనిపించును. సత్యమె. కామోపచార ప్రసంగమున నివి యన్నియు నిరూపితములు. వీనిని గీతవిధానమున సూచింప వచ్చును. నాయిక నాయకుని ఇట్లు నానావిధముల ఖేదపెట్టనలెను. ఆతడు పాదగతుడగు వరకు ఖేదపెట్టవలెను. నాయకుడు చరణపతితుడు కాగానే నాయక దూతికను నిరీక్షింపవలెను. అప్పుడు దూతిక దూసికొని ముసిముసి నవ్వులతో నేగును. ఇక నాయిక పాదపతితనాయకుని లేవదీసి యాలిం గనము చేసికొనవలెను, రతిభోగాసక్తయై హృష్టయై శయనమున కభిముఖముగా నడువవలెను.

౧౪౪ ఏతద్గీతవిధానేన సుకుమారేణ యోజయేత్
యదాశృంగారసంయుక్తం రతిసంభోగకారకం.

శృంగారసంయుక్తమై రతిసంభోగమాపాదించు దీని నంతను సుకుమారమగు గీతవిధానమున యోజన మొనరింపవలెను. అంతియె కాని స్పష్టముగా నన్నిటిని రంగమున ప్రయోగింపరాదు. రంగ

ప్రయోగానర్హము లగువానిని ప్రసమీక్షించి యట్టివి కలచోట గీత విధి సూచనము యుక్తము. ఆకాశపురుష పరస్థవచనాశ్రయముగా కావ్యమున్నచో తద్విధానుసారమున వనిత దీని యభినయ మొనరింప వచ్చును. ఆకాశపురుషుడుగా భావితుడగు ప్రధానపురుషుడు రంగ మున ప్రవేశింపడు. దూరమున నేపథ్యమునందుండి పలుకును. అది "ఇదిగో! యిది యిట్లున్న"దని చూచిన విధమున పలుకుచు నభిన యింప వచ్చును. అట్లై పరగతమగునది వ్యాఖ్యాతమగు నపుడు తద్వచనాశ్రయముగా కావ్యమున్నపుడు యథోచితముగా వీని నను గతము చేసికొనవలెను. నాటకమున నతిశృంగారసంబద్ధమగు కావ్యము శృంగారరససంయుక్తముగా నున్నపుడు నిట్టి విధానమున యనుసరింప వలెను. అట్టివన్నియు ప్రత్యక్షప్రాయముగా నుండవు.

౧౮౫ న కార్యం శయనం రంగే నాట్యధర్మం విజానతా
కేనచిద్వచనార్థేన అంకచ్ఛేదో విధీయతే.

నాట్యధర్మమును గుర్తించిన ప్రయోక్త రంగమున శయన మేర్పఱుపరాదు. నాయికానాయకు లేకశయ్యాపై శయనించుటను ప్రయోగమున ప్రదర్శింపరాదు. ఏదియేని వచనార్థమున నంకచ్ఛేద మొనరింపవలెను, ఏదియేని కార్యవశమున నొకడే శయనించినట్లు ప్రదర్శింపవచ్చును. స్వప్నవాసవదత్తమున వత్సరాజు సముద్రగృహాక మున శయ్యాపై శయనించినాడు. వాసవదత్త నచట చేర్చుటకై కవి యట్లు నిబంధించెను. ఒకప్పుడు నాయికాసహితుడుగ గూడ శయ్యాపై నుండవచ్చును. వాసవదత్తావత్సరాజు లట్లు శయ్యాపై నుండుట స్వప్న నాటకమునందె యున్నది. అట్లున్నను నాయికానాయకులకు చుంబన మాలింగనము ఇంకనిట్టి గుహ్యకర్మలు ప్రయోగింపరాదు. దంత చ్ఛేద్యము నఖచ్ఛేద్యము నీవీస్రంసనము స్తనాంతర విమర్దము రంగ మధ్యమున నొనరింపరాదు. భోజనము సలిలక్రీడ మొదలగు లజ్జాకర ములగు వాని నిట్టివానిని రంగమున కూర్పరాదు. శయనాదులు చూపరాదనుట కేవల శయనము చూపరాదనికాదు. చుంబనాదులు చూపరాదని భావము. ఇట్లు ప్రదర్శింపరాదనుటలో నుపపత్తియున్నది. అది యిట్లున్నది.

౧౪౬. పితాపుత్రస్నుషాశ్వశ్రూదృశ్యం యస్మాత్తు నాటకం
తస్మాదేతాని సర్వాణి వర్జనీయాని యత్నతః।

౧౪౭. వాక్యైః సాతిశయైః శ్రవ్యైః మధురైఃనాతినిష్ఠురైః
హితోపదేశసంయుక్తైః తజ్ఞైః కుర్యాత్తు నాటకం.।

నాటకమును పితరులు చూచెదరు. పుత్రులు చూచెదరు. కోడళ్లు చూచెదరు. అత్తలు చూచెదరు. అందరు చూచెదరు. సర్వదృశ్యము నాటకము. కావున రంగనిషిద్ధముల నన్నిటిని వర్జింప వలెను. కాకున్న సముచితాస్వాదము కలుగదు. "తతశ్చ రసో భజ్యేత" రసము విరిగి పోవును. రసమనునది సాధారణాన్యోన్యానుప్రవేశప్రాణ మని ప్రతి పదము పలికెదము. అభిజ్ఞుడగువాడు హితోపదేశసంయుక్తములగు సాతిశయవాక్యములతో శ్రవ్యములగు మధురవచనములతో నాతి నిష్ఠురపదవిన్యాసములతో నిర్మింపవలెను. విషయమున వచనమున రచనమున నతిశయమును మధురతను హితమును సావధానముగ గూర్పవలెను. ఈవిధముగనె యంతఃపురకృత మయిన యభినయమును బుధులొనర్ప జేయవలయును.

ఈ సామాన్యాభినయమునందు వాచికాభినయము కూడకలదు. మదనాశ్రయ మయిన స్త్రీల సమాగమమున ప్రియుల విషయమున పలుకదగిన వచనములు గలవు. అవి యిట్లున్నవి. ఈ దిగువ సూచితము లగునవి యభిప్రేతు డయిన ప్రియుని విషయమున నిర్దేశింపదగియున్నవి.

| | | |
|---|---|---|
| ప్రియుడు | కాంతుడు | వినీతుడు |
| నాథుడు | స్వామి | జీవితము |
| నందనుడు | — | — |

నాయికలకు కోపమువచ్చినపుడు ప్రియు నీవిధముగా వ్యపదేశింప దగును.

| | | |
|---|---|---|
| దుశ్శీలుడు | దురాచారుడు | శఠుడు |
| వాముడు | వికత్థనుడు | నిర్లజ్జుడు |
| నిష్ఠురుడు | — | — |

ప్రియాదిస ప్తకలక్షణము లీవిధముగా సంభావనీయములు. ఈ వచన విన్యాసములు రతిప్రీతికరములు.

౧౪౮. యో విప్రియం న కురుతే న చాయుక్తం ప్రభాషతే
తథార్జవ సమాచారః స ప్రియస్త్వభిధీయతే
౧౪౯. అన్యనారీసముద్భూతం చిహ్నం యస్య న దృశ్యతే
అధరే వా శరీరే వా స కాంత ఇతి భాష్యతే
౧౫౦. సంక్రుద్ధేపి హి యో నార్యా నోత్తరం ప్రతిపద్యతే
పరుషం వా న వదతి వినీతః సోఽభిధీయతే
౧౫౧. హితైషీ రక్షణే శక్తో న మానీ న చ మత్సరీ
సర్వకార్యేష్వసంమూఢః స నాథ ఇతి సంజ్ఞితః
౧౫౨. సామదానార్థ సంభోగైః తదా లాలన పాలనైః
నారీం నిషేవతే యస్తు స స్వామీ త్యభిధీయతే
౧౫౩. కులీనో ధృతిమాన్ దక్షో దక్షిణో వాగ్విశారదః
శ్లాఘనీయః సఖీమధ్యే నందనః సోఽభిధీయతే
౧౫౪. నారీప్సితైరభి ప్రాయైర్నిపుణం శయన క్రియాం
కరోతి యస్తు సంభోగే స జీవితమితి స్మృతః

౧. ప్రియుడు : విప్రియ మొనరింపడు. అయుక్తము పలుకడు. ఋజుత్వము కూడిన యాచారవిచారములు కలవాడగును. ఇట్టివాడు ప్రియుడని సంకేతము సిద్ధమయినది.

౨. కాంతుడు : అన్యవనితల సంభోగచిహ్నము లాతని దేహమున నుండవు. అధరమున గాని శరీరమున గాని యవి యుండవు. ఉండవని యనుట యుండనట్లొనరించునని యర్థముకాదు. అసలట్టి ప్రవృత్తి యాతనిలో నుండదు.

౩. వినీతుడు : ఆడుది యేమో భావించి యేమో పలుకును. నాయకునకు కోపము కలుగును. కోపము కలిగినను నారితో నేమియు నుత్తరము పలుకడు. పరుషముగా నయిన పలుకడు. ఇట్టివాడు వినీతుడనదగును.

౪. నాథుడు : హితైషి. రక్షణసమర్థుడు. మాని కాడు. కోపము వహింపడు. పట్టుదల పట్టడు. మత్సరి కాడు. సర్వకార్యములందప్రమత్తుడై ప్రవర్తించును. అట్టివాడు నాథుడు.

౫. స్వామి : మంచిమాటలు చెప్పి స్త్రీలను సేవించును. దానములిచ్చి సేవించును. ద్రవ్యములిచ్చి భోగించును. లాలన మొనర్చి భోగించును. పాలించును. సర్వవిధముల స్త్రీలను సేవించును. ఇట్టివానికి స్వామి యని పేరు.

౬. జీవితము : వనితల కభీష్టములయిన యభిప్రాయముల ననుసరించియె నిపుణముగా శయనక్రియాచతురుడగును. ఆతని సంభోగక్రియాసర్వస్వము నారీప్సితమనుసరించును. తనకుచితమునె తాననుసరించుటను ముఖ్యము చేసికొనడు. ఆతడాడుప్రాణికి జీవితము.

౭. నందనుడు : కులీనుడు. ధృతికలవాడు. దక్షుడు. దక్షిణుడు. వాగ్విశారదుడు. సఖీమధ్యమున శ్లాఘనీయుడు. నా భర్త యిట్టివాడని యామె యందరికడ నానందముగా జెప్పికొనును. అందుననె యాతడు నందనుడు.

భర్తలకు సంబంధించిన యీ నామసంకేతము లన్నియు రతిప్రీతికరములు. రతిసమయమున ప్రీతిపరితోషములను సంపాదించు వీరందరు రతిపండితులు. ఒకప్పుడు రతిలో క్రోధము కలుగవచ్చును. కాని పరితోషము నున్నది. రతినీయగలరు. ప్రీతినీయగలరు. కావుననే రతిప్రీతికరులు, నాయికలకు ప్రీత్యానందములు కలిగిన సమయము నందలి యీ వ్యపదేశములె కాక అప్రీతివాక్యములును గొన్నిగలవు. వాని సంకేతప్రదాన మయినది. లక్షణదానమిట ప్రసక్తమగుచున్నది.

౧౫౫. నిష్ఠురశ్చాసహిష్ణుశ్చ మానీ ధృష్టో వికత్థనః
అనవస్థితచిత్తశ్చ దుశ్శీల ఇతి న స్మృతః
౧౫౬. తాడనం బంధనం చాపి యో విమృశ్య సమాచరేత్
తథా పరుషవాక్యశ్చ దురాచారః న తన్యతే
౧౫౭. వాచైవ మధురో యస్తు కర్మణా నోపపాదకః
యోషితః కంచిదప్యర్థం న శఠః పరిభాష్యతే
౧౫౮. వార్యతే యత్ర యత్రార్థే తత్తదేవ కరోతి యః
విపరీతనివేశీ చ స వామ ఇతి సంజ్ఞితః
౧౫౯. నరనవ్రణచిహ్నో యః స్త్రీసౌభాగ్యవికత్థనః
అతిమానీ తథా స్తబ్ధః వికత్థన ఇతి స్మృతః
౧౬౦. వార్యమాణో దృఢతరం యో నారీముపసర్పతి
నచిహ్నః సాపరాధశ్చ స నిర్లజ్జ ఇతి స్మృతః
౧౬౧. యోఽపరాద్ధస్తు సహసా నారీం సేవితుమిచ్ఛతి
అప్రసాదనబుద్ధిశ్చ నిష్ఠురః సోఽభిధీయతే

౧. దుశ్శీలుడు : నిష్ఠురుడు ఏమాత్రమేదియు సహింపలేడు. అభిమానముతో నుండును. ధార్ష్ట్యము ప్రదర్శించును. ఆత్మను శ్లాఘించు

కొనును. స్థిరచిత్తముతో నుండలేడు. చపలస్వభావుడు. ఇట్టి స్త్రీభోగి దుఃశీలుడు.

౨. దురాచారుడు : నాయికదగ్గరకు వచ్చి యేమేమో విమృశించి తాడనము చేయును. త్రాటితో బంధించును. పరుషవాక్యములు పలుకును. నిందించును. తిట్టును. వీడు దురాచారుడు.

3. శఠుడు : మధురముగా మంచిగా చక్కగా తియ్యని మాటలు పలుకునే కాని చేతతో నేమియు స్త్రీలకు చేయడు. మాటలు దాటించును. క్రియాశూన్యుడు. వీడు శఠుడు.

౪. వాముడు : దేని దేని వారించినను అదియె యదియే చేయును. ఒకరు చెపుటేమి? తాను చేయుటేమి? మానుటేమి? ఉత్తవిపరీతకార్యాభినివేశి. తానాచరించునది యభీష్టమో యనిష్టమో యాలోచింపడు. తనపట్టుదల తనదిగా ప్రవర్తించును. ఈతడు వాముడు.

౫. వికత్థనుడు : పచ్చిపచ్చి వ్రణములు దశనదంశములు నఖరక్షతములు చిహ్నములు చేసికొని వేసికొని వచ్చును. స్త్రీసౌభాగ్య వికత్థనుడు ఆ స్త్రీ ఇట్లుండును. ఆమె యిట్లుండును ఈమె యిట్టిది. ఈయువ యిట్టిది. అని స్త్రీల సౌభాగ్యమును సాదరముగా చెప్పును. అది యాత్మశ్లాఘగా నుగ్గడించును. అతిమాని. స్తబ్ధప్రకృతి. వీనిని వికత్థనుడందురు.

౬. నిర్లజ్జుడు : "నీవా స్త్రీని కలియరాదు" అని యెంతగా నెందరు దృఢతరముగా చెప్పినను వినడు. ఆస్త్రీని కలియుటకె యత్నించును. అట్లె చేయును. సచిహ్నుడై వచ్చును. నాయికకపరాధ మొనర్చును. వీడు నిర్లజ్జుడు.

౭. నిష్ఠురుడు : అన్యాసంగమాపరాధుడయ్యు తన యింటి యామె నందులకై సేవించుటకు సిద్ధముగా వచ్చును. అందుల క్లిష్ట పడును. నాయికాప్రసాదన మొనరింపడు. ప్రసాదనబుద్ధియె పెట్టుకొనడు. వీడు నిష్ఠురుడు.

ఈ వచనవిన్యాసము లన్నియు ప్రియుల విషయమై యప్రియుల విషయమై విభాషితము లయినవి. కేవలమివియె కాక యన్యములను

గూడ నాటకమునందు బహువిభాషితములను నర్తకీసంశ్రితములుగా నొనరించి ప్రయోగమున బట్టవలయును. ఇది యంతయు సుకుమార గీతవిధానమున రమ్యముగ నిబద్ధమై రమ్యత నాపాదించును. ఈ సుకుమారవిధి యంతయు శృంగారరససంభూతము. రతినిమిత్త మయిన సంభోగమును ఖేదమును నిరూపించును. ఇది యాకాశపురుషు నుద్దేశించి యుండును. ఇది పరస్పవచనాశ్రయము. ఇట్లై ప్రీతికోపముల ననుసరించి శృంగారమున దీని నిరూపించుట యుక్తము. స్పష్టముగా శృంగారమును జెప్పవలసి యున్నపుడు నిదియె వచనక్రమను పాటించుట సముచితము. ప్రత్యక్ష పురుషయుక్తముగా గూడ నాటకమున కార్యమును శృంగారరససంయుక్తముగా జేయునపుడు నీ వచనక్రమానుసరణమె సహృదయులకు సమ్మతము. ఇట్లంతఃపురగత మయిన యభినయము నభినయవిదులు ప్రయోగమున సావధానముగ నిరూపింపవలెను.

దివ్య వేశ్యాంగనలతో గూడ రాజులకు సంభోగవిధాన ముండునను యిగివరలో సూచితము. అందలి సామాన్యాభినయరీతి నీరీతి గుర్తింపవచ్చును.

౧౬౨. నిత్యమేవోజ్జ్వలో వేషో నిత్యం ప్రముదితం మనః
నిత్యమేవ సుఖః కాలో దేవానాం లలితాశ్రయః
౧౬౩. న చేర్ష్యా నైవ చ క్రోధో నాసూయా న ప్రసాదనం
దివ్యానాం దృశ్యతే పుంసాం శృంగారే యోషితాం తథా
౧౬౪. యే భావా మానుషాణాం స్యుర్యదంగం యచ్చ చేష్టితం
సర్వం తదేవ కర్తవ్యం దివ్యైర్మానుషసంగమే
౧౬౫. యదా మానుషసంభోగో దివ్యానాం యోషితాం భవేత్
తదా సర్వాః ప్రకర్తవ్యా యే భావా మానుషాశ్రయాః
౧౬౬. శాపభ్రంశాత్తు దివ్యానాం తథా చాపత్యలిప్సయా
కార్యో మానుషసంయోగః శృంగారరససంశ్రయః.

దేవతలకు నిత్య ముజ్జ్వలవేష ముండుగావుత! నిత్యము మనస్సు ప్రముదితమై యుండుగావుత! నిత్యము కాలమంతయు సుఖమయము గనే యుండుగావుత! వారికంతయు లలితాశ్రయముగనె యుండుగావుత! వారల కీర్ష్యగాని క్రోధముగాని యసూయగాని ప్రసాదనము

గాని దివ్యపురుషులకు దివ్యవనితలకు శృంగారమున లేక పోవుగావుత! అయినను మానవులతో సంబంధము వర్ణించు నపుడు మానవ భావము లనె వారలకును వర్ణింపవలెను. మానవుల యవయవ సౌష్ఠవమునె వారి యంగప్రత్యంగముల వర్ణింపవలెను. మానవుల చేష్టితములనె వారలకును నిరూపింపవలెను. దివ్యులతో మానుషసంగమము వర్ణించు పట్టులందంతట సర్వము మానవమే యుపనిబంధింప వలెను. దివ్యవనిత లకు మానుషసంభోగము వర్ణిత మగునపుడును మానుషాశ్రయము లయిన సర్వభావములను ప్రతిపాదింప వలెను. దివ్యవనితలకు శాపము వలన స్థానభ్రంశము కలిగినట్లు వారు సంతానకాంక్షచే మానుష సంయోగము పొందినట్లును శృంగారరససంశ్రయముగా నిరూపింప వలెను. కాళిదాసు విక్రమోర్వశీయమున నిదియంతయు గోచరమగును. దివ్యవనిత యదృశ్యగా ప్రవేశించి పుష్పములు నాయకునిపై విసిరి యాతని ప్రలోభింపజేయవలెను. భూషణజన్యము లయిన శబ్దములచే నాసక్తి కలుగ జేయవలయును. రాజుకంటబడి యంతరితురాలు కావలెను. వస్త్రాభరణమాల్యాదులను పంపవలెను. కాదంబరిలో కాదంబరి చంద్రాపీడునకు వస్త్రాభరణాదులు పంపినది. లేఖసంప్రేష ణములతో నాయకుని తోషపెట్టవలయును. ఊర్వశీప్రణయలేఖ ప్రసిద్ధము. ఇట్టి యుపచారములచే నాయకునకుప్రణయోన్మాద ముత్పా దించుట సముచితము. "ఉన్మాదనాత్సముద్భూతః కామో రతికరో భవేత్" ఉన్మాదనానంతర ముదయించిన కామము కరము రతికరము కాగలదు. ఇదియంతయు విక్రమోర్వశిలో స్ఫుటముగ గోచరించు చున్నది.

౧౬౭ స్వభావోపగతో యస్తు నాసావత్యర్థభావకః
ఏవం రాజోపచారో హి కర్తవ్యోఽభ్యంతరాశ్రయః

ఈ శృంగారచేష్టావిలాసవిశేషము లేక స్వభావోపగతముగా నుండునది శృంగారమున సముచితముగా నర్థభావన మర్పింపదు. "నానారత్యర్థభావకః" నానావిధములయిన రతిఫలములను బాగుగా భావింపజేయునది యగును. ఈ రెండుపాఠముల స్వారస్యమును హృదయాభిరుచి ననుసరించి స్వీకరించునది. ఈ నిరూపితమయిన విశేష సర్వస్వమును భావించి యభ్యంతరాశ్రయమయిన రాజోపచారమును

నిబంధించుటలో ప్రయోక్త సావధానుడు కాదగియున్నది. ఇప్పటికీ చెప్పినదంతయు నభ్యంతరాశ్రయవిధి. ఇక వైశికమునకు సంబంధించిన బాహ్యోపచారవిధిని నిరూపించుట యవసరసంప్రాప్త మయిన సముచితవిధి. ఈ సామాన్యాభినయప్రఘట్ట మంతయు శ్రవ్యదృశ్యవిశేషము లందుండదగిన శృంగార భావనప్రక్రియను సముచితముగా సుందరముగా నిబంధించుటకు, నిబంధితమును సహృదయత్వమున భావించుటకు నుపకరించు ననుట స్పష్టము.

### సామాన్యాభినయము : వైశికము.

వైశికము సామాన్యాభినయశేషము. వైశికము నందు బాహ్యోపచారకథనము ప్రతిజ్ఞాత మయినది. తద్వశమున వైశిక మిప్పుడు ప్రసంగసంగతముగా చెప్పవలసి యున్నది. ఇందిది నిరుక్తము.

౧౬౮. విశేషయేత్కలాః సర్వా యస్మాత్ తస్మాత్తు వైశికః
వేశోపచారే సాధుర్వా వైశికః పరికీర్తితః
౧౬౯. యో హి సర్వకలోపేతః సర్వశిల్ప విచక్షణః
స్త్రీచిత్త గ్రహణాభిజ్ఞః వైశికః స భవేత్పుమాన్.

వేశ్యాకాముకుడు వైశికుడు. ఆత డతివిదగ్ధుడగుట వలన సర్వ కామములను విశేషింప జేయగలడు. విశేషము గుర్తించును. అధికముగా కామించును. “వేశోపచారే సాధుః వైశికః” అని వ్యాకరణోచిత నిర్వచనము. “వేశ్యోపచారే సాధుః వైశికః” అనియు ననవచ్చును. వేశ మనగా వేశ్య. వేశోపచారము వేశ్యోపచారము. అందు దక్షుడు వైశికు డని భావము. వైశికుడు సర్వకలాసముపేతుడు. సర్వకలావిశేషజ్ఞుడు. సర్వశిల్పవిచక్షణుడు. స్త్రీచిత్తగ్రహణాభిజ్ఞుడు. ఇట్టి పురుషుడు వైశికు డగును. ఇంతకాగా వైశిక నిర్వచన మిట్లు నిశ్చిత మయినది.

| | |
|---|---|
| ౧. విశేషము గుర్తించువాడు | ౨. బాగుగా కామించువాడు |
| ౩. వేశ్యా కాముకుడు | ౪. సర్వకామ విదగ్ధుడు |
| ౫. వేశోపచార నిపుణుడు | ౬. సర్వకలా విశేషాభిజ్ఞుడు |
| ౭. సర్వశిల్ప విచక్షణుడు | ౮. స్త్రీచిత్తగ్రహణాభిజ్ఞుడు. |

వైశికుని గుణములు సవిశేషముగా విజ్ఞేయములు. అవి యన్నియు స్వశరీరసముత్థితములు. ఇవి యాహార్యము లని సహజము లని రెండువిధములు. ఇవి యన్నియు సంక్షేపముగాముప్పది మూడున్నవి. వాని పేర్లిట్లున్నవి.

౧. శాస్త్రవిత్ ౨. శిల్పసంపన్నుడు ౩. రూపవంతుడు
౪. ప్రియదర్శనుడు ౫. విక్రాంతుడు ౬. ధృతిమంతుడు
౭. వయోవేషుడు ౮. కులాన్వితుడు ౯. సురభి
౧౦. మధురుడు ౧౧. త్యాగి ౧౨. సహిష్ణువు
౧౩. అవికత్థనుడు ౧౪. అశంకితుడు ౧౫. ప్రియాభాషి
౧౬. చతురుడు ౧౭. శుభదుడు ౧౮. శుచి
౧౯. కామోపచారకుశలుడు ౨౦. దక్షిణుడు
౨౧. దేశవిదుడు ౨౨. కాలవిదుడు ౨౩. అదీనవచనుడు
౨౪. స్మితవంతుడు ౨౫. వాగ్మి ౨౬. దక్షుడు
౨౭. స్త్రీలుబ్ధుడు ౨౮. ప్రియంవదుడు ౨౯. సంవిభాగి
౩౦. శ్రద్ధానుడు ౩౧. దృఢస్మృతి ౩౨. గమ్యావిస్రంభి
౩౩. మాని

ఇందు శాస్త్రజ్ఞతాదు లాహార్యములు. రూపలావణ్యాదులు సహజములు. వైశికుడెంతటి కాముకు డయినను వెంటనే గమ్య లని విశ్వసింపడు. వారి స్ఫుటభావము గుర్తించుటకు యత్నించును. వైశికునకు వయస్యు డొకడుండును. ఈతడును వైశికగుణములు కలిగి యుండువాడె. వయస్యుడు చిత్రవిచిత్రముగ పరిహాసపేశలముగ మాట లాడును. వక్రోక్తికుశలుడుగ నుండును. విశ్వాసము బుద్ధి చాతుర్యము కలిగి మెలగును. ఈతని స్వరూపమున నీ విశేషములు నుండును.

౧. అనుయుక్తుడు ౨. శుచి ౩. దక్షుడు
౪. దక్షిణుడు ౫. ప్రతిపత్తిగలాడు ౬. చిత్రాభిధాయి

ఇన్ని యున్నను కొన్నిట నాయకుని కన్న న్యూనగుణుడు. అందువనే యాతని కీతడు వయస్యుడు. ఈ నాయకునకు నాయికాసంధానచాతుర్యము కలదూతి యుండును. దూతీలక్షణములు దూతీసంకేతనామములందు గూడి యున్నవి. దూతి విజ్ఞానగుణసంపన్న. బృహత్కథాది

కథనకుశల, తదాకర్ణనకుశల, చిత్రరచనాచతుర. ప్రక్కయింటియందున్న వనిత, కొన్నికొన్ని వ్రతము లాచరించుస్త్రీ, చాకలివాని భార్య, వంధిమాగధుల వనిత, రంగనర్తకి, నాయికల ప్రోత్సాహనమున కుశల. నాయికను ప్రోత్సహింపజేయిగలదు. నాయికచే నాయకుని ప్రోత్సహింపజేసి సమ్ముఖీకరింపగలదు. ఏవంవిధవిశేషములు కలది దూతి యగును. దూతిక లనేకవిధముల నుందురు.

| | | |
|---|---|---|
| ౧. కథని | ౨. లింగిని | ౩. ప్రాత్రివేశిని |
| ౪. సఖీ | ౫. దాసి | ౬. కుమారి |
| ౭. కారువు | ౮. శిల్పిని | ౯. ధాత్రి |
| ౧౦. పాషండిని | ౧౧. రంగజీవన | ౧౨. మధురకథ |
| ౧౩. దక్షిణ | ౧౪. కాలజ్ఞ | ౧౫. లడహా(ప్రగల్భ) |
| ౧౬. సంవృతమంత్ర | | |

ఇన్ని సంకేతములున్నను సామాన్యముగా దూతి యీ లక్షణములు గుణములు కలదగునని భావింపవలెను. నాయికా సమక్షమున నానా కథలు చెప్పగలది, నాయిక యేన్ని చెప్పినను వినగలది, చిత్రములు శిల్పములు నిర్మాణింపగలది, తగిన స్త్రీపురుషుల కామగుణములను గుర్తింపగలది, నాయికా నాయకుల ప్రోత్సహింప జేయగలది, సముచితసమయము సంకేతింప గలది, ఉభయుల కామరహస్యములను దాచగలది దూతి యగును. ఇట్టి దౌత్యమును నాయిక యనేకవ్యక్తులచే చేయించును. వారిలోని భేదములే సంకేతితము లయినవి. ఈ దూతి నానావిధముల కారణముల ప్రదర్శించి యుత్సాహన మొనరించుటలో నిపుణ యగును. యథోక్తము చక్కగా చెప్పవలెను. నాయికానాయకుల సమ్ముఖీకరణ మీమెపని. సందేశార్పణ మీమె ముఖ్యకార్యము. కామ్యకామినీభావపరీక్షణ మీ దూతీకార్యము. ఇది యంతయు నీమె వ్యాపారాంతరము. ఈ భావార్థమె యీ శ్లోకమున నాసూత్రిత మయినది.

**౧౭౦. తయా వ్యుత్సాహనం కార్యం నానాదర్శితకారణం**
**యథోక్తకథనం చైవ తథాభావ ప్రదర్శనం**

**దూతీదూతనిర్ణయమున గొన్ని విశేషములున్నవి.**

౧౭౧. న జడం రూపసంపన్నం నార్థవంతం న చాతురం
దూతం వాప్యథవాదూతీం బుధః కుర్యాత్కదాచన

జడుని దూతగా నేర్పఱచుకొనరాదు. వాడు కరణీయ మొనర్ప శక్తుడు కాడు. ఈ కామతంత్రములో ప్రత్యుత్పన్నమతులు సాధింప వలసిన కృత్యము లనేకము లున్నవి. జాడ్యమాంద్యములు కల వారట్టివి చేయలేరు. రూపసౌందర్యము కలవారిని దౌత్యమున నుంచ రాదు. అట్టివారు వీరి పనిచేయరు. తామె యందు ప్రవర్తింతురు. సుందరదూతి నాయిక నందీయదు. తానె నాయకు నందికొనును. సుందరదూత యగువాడును నాయిక దగ్గర నాయకుడె యగును. ద్రవ్యముకలవారును దూతకృత్యమునకు తగరు. ద్రవ్యదృష్టితో వారు దౌత్య మొనరింపరు. తమద్రవ్యమునే వినియోగింతురు. ఆతురుడు రోగబాధితుడు దూత కాదగడు. ఆతురుని చూడగనె జుగుప్స కలుగును. రతికార్యములో నట్టివాడుండరాదు. వాడు నిరపేక్షుడు. కామదూత కాదగడు. దూతనుగాని దూతిని గాని నిశ్చయించునపుడు చెప్పిన నిషేధములను పరిశీలింపవలెను. నానావిధముల కారణముల ప్రదర్శించి ప్రోత్సాహన మొనర్చుట దూతీకార్యముకదా! ఆ కారణము లిట్లున్నవి.

౧౭౨. కులభోగ ధనాధిక్యైః కృత్యాధిక వికత్థనం
దూతీ నివేదయేత్కామమర్థాం శ్చైవానువర్ణయేత్

౧౭౩. న చాకామప్రవృత్తాయాః క్రుద్ధాయా అపిసంగమః
నానుపాయః ప్రకర్తవ్యో దూత్యా హి పురుషాశ్రయః

౧౭౪. ఉత్సవే రాత్రిసంచారే ఉద్యానే మిత్రవేశ్మని
ధాత్రీ గృహేషు సఖ్యా వా తథా చైవ నిమంత్రణే

౧౭౫. వ్యాధితవ్యపదేశేన శూన్యాగార నివేశనే
కార్యః సమాగమో నృణాం స్త్రీభిః ప్రథమసంగమే.

దూతి చెప్పిచెప్పి ప్రోత్సాహన మొనర్పవలెను. "నాయకుడు కులభోగధనాధికుడు. అని యధికముగా శ్లాఘ యొనర్పవలెను. ఆతని కామమును ద్రవ్యసంపదను చక్కగా వర్ణింపవలెను. నాయిక కామ ప్రవృత్త యగునట్లు చేయవలెను. అకామప్రవృత్తకు సంగమము లేదు. కుపితవనితకు సంగమము లేదు. నాయిక కుపిత కాకుండునట్లు పరిశీలింప వలెను. దూతి తనగృహమునందే రాత్రిచారప్రధాన మయిన యొక

యుత్సవ మేర్పఱచి స్త్రీలతో పురుషులకు ప్రథమసంగమమున సమాగ మము కూర్పవలెను. గాంధర్వవివాహమున వేశ్యాపునర్భూసంగమ మున నిదియె కల్పము. ఉద్యానము నందయిన సంగమము కూర్ప వచ్చును. తన మిత్రుల భవనములందు గాని ధాత్రీగృహములందు గాని సఖీగృహమునందుగాని కార్యము సాధించునది. వ్యాధి కలిగినది జ్వరమువచ్చినది యని వ్యపదేశముకల్పించి శూన్యాగారమున కూర్ప వలెను. ఇది యంతయు దూతి చాతుర్యమున జేయవలసిన విధానము. విధిపూర్వకముగా నుపాయసహితముగా నిట్లు సమాగమము సిద్ధము చేసి యప్పటి యచ్చటి నాయిక యనురక్తయో విరక్తయో యాకారలింగములతో గుర్తింపవలెను. అనురక్తవనితాలక్షణము లీవిధముగా నుండును.

౧౭౬. స్వభావ భావాతిశయైర్నారీ యా మదనాశ్రయా
కరోతి నిభృతాం లీలాం నిత్యం సా మదనాతురా
౧౭౭. సఖీమధ్యే గుణాన్ బ్రూతే స్వధనం చ ప్రయచ్ఛతి
పూజయత్యన్య మిత్రాణి ద్వేష్టి శత్రుజనం సదా
౧౭౮. గమాగమే సఖీనాం యా హృష్టా భవతి చాధికం
తుష్యత్యన్య కథాభిస్తు సస్నేహం చ నిరీక్షతే
౧౭౯. సుప్తే తు పశ్చాత్స్వపితి చుంబితా ప్రతిచుంబతి
ఉత్తిష్ఠత్యపి పూర్వం చ తథాక్లేశసహాపి చ
౧౮౦. ఉత్సవే ముదితా యా చ వ్యసనే యా చ దుఃఖితా
ఏవంవిధైర్గుణైర్యుక్తా త్వనురక్తా తు సా స్మృతా

సంభోగవ్రతులగు వారు సామాన్యముగా కొన్ని విశేషములను సహింపగలవారు కావలెను. అట్లుసహించుట వారి వారి స్వభావాతి శయమునను భావాతిశయమున నుండును. స్వభావానుకూలముగా భావానుకూలముగా సురత మున్నపుడు నఖసహిష్ణుత రదనసహిష్ణుత మొదలగునవి యులవడును. ఇట్లు నఖరదనసహిష్ణుతాదులు కల యువతి యనురక్త యని గుర్తింపదగును. ఇంక నీవిశేషములను రక్త యువతి యందు గోచరించును. మదనాశ్రయ యగునది, నిభృతముగా ప్రియానుకరణాత్మకము లయిన లీలల నాచరించునది, నిత్యము మద నాతుర, యనురాగిణి యని గుర్తింపవలెను. ఇంక నీమె సఖులమధ్య మున ప్రియగుణములను పలుకును. తన ధనము ప్రియనిమిత్తమె

యిచ్చును. ప్రియుని మిత్రులను పూజించును. ప్రియుని శత్రువులను ద్వేషించును. ప్రియుని చెలియలు రాకపోకలు కావించుటను హర్షించును. నాయకుని కథలెవరేని పలుకుచో నాదరపడి సంతసంపడును. స్నేహాతిరేకముతో జూచును. ప్రియుడు నిద్రించిన పిమ్మటనే తాను నిద్రించును. ఆతడు ముందు చుంబించిన తాను ప్రతిచుంబన మొనరించును. తానె ముందుగా నిద్రనుండి మేల్కొనును. క్లేశముల నెన్నిటినేని సహించును. ఉత్సవము రాగా సంతోషపడును. ఆతడు లేకున్న తనకేమిసుఖము ? తనకేమి యుత్సవము ? నాయకునకేమేని వ్యసనము కలిగిన తాను దుఃఖపడును.

విరక్తా చిహ్నములు

౧౮౧. విరక్తాయాస్తు చిహ్నాని చుంబితా నాభిచుంబతి
అనిష్టాం చ కథాం బ్రూతే, ప్రియభుక్తాపి కుప్యతి
౧౮౨. ప్రద్వేష్టి చాన్య మిత్రాణి భజతేఽరిజనం తథా
శేతే పరాఙ్ముఖీ చాపి శయనే పూర్వశాయినీ
౧౮౩. సుమహత్యప్యుపకారేపి న తోషముపయాతి చ
క్లేశం న సహతే చాపి తథా కుప్యత్యకారణాత్
౧౮౪. యా స్యాదేవంప్రకారా తు విరక్తాం తాం వినిర్దిశేత్

ప్రియుడాసక్తితో చుంబన మొనరించినను తాను ప్రతిచుంబన మీయదు. చుంబించుటకవకాశము నీయదు. అనిష్టకథనే చెప్పును. పూర్వ మాతని వలన గలిగిన యనిష్టము నుద్ఘాటించును. తనకు తానై ప్రియు డనుభవించినను కోపించును. ప్రియుని మిత్రులను ద్వేషించును. శత్రువులను సేవించును. శయనమునకు రాదు. వచ్చినను సుముఖముగా నుండదు. పరాఙ్ముఖముగా శయనించును. ఒకప్పుడు నాయకుడు రాకపూర్వమె శయ్యజేరి ముందుగా శయనించును. ఉపకార మెంతగా జేసినను సంతోషము పొందదు. క్లేశ మేమాత్రము సహింపదు. నఖరదనక్లేశము సహింపదు. అకారణముగా కోపము తెచ్చికొనును. ఏవం ప్రకారముగా నుండునది విరక్త యని నిర్దేశింపవలెను.

విరక్తావశీకారము

౧౮౫. హృదయగ్రహణోపాయమస్యా వ్యాపారచేష్టితం
అర్థప్రదర్శనం చైవ ఉపదానం పునర్భవేత్

౧౮౬. అకారణముపన్యాసః తథైవ వ్యాధితాపి చ
వ్యాజాత్త్యాగోఽథ నికటాద్భావోపక్షేప ఏవ చ

విరక్తగా నయిన వనితను రక్తగా జేసికొనుటకు కొన్నియుపాయములున్నవి. ఆమెను వశీకరించుకొనుటకై యామె హృదయగ్రహణోపాయములు కామతంత్రములో నున్నవి. అనురక్తలయిన వనితల వ్యాపారములను చేష్టితముల నామెదగ్గర నిరూపింపవలెను. ఇట్టినిరూపణము కూడ హృదయగ్రహణమున కనుకూలించును. "నా సమీపమున నింత ధనమున్నది" యని తనద్రవ్యము ప్రదర్శించునది. అంత కొంతగా నుపదానము చేయవలెను. "నీకు మఱలనింత ద్రవ్యమిచ్చెద" ననవలెను. అకారణముగనె యుపన్యాస మొనర్పవలెను. ఇతరుని ముఖమున "వేరొకతె యీతని యందనురక్తమై యున్నది." అని చెప్పింపవలెను. అట్లె ఈమె వ్యాధిత, విచిత్రములయిన రోగము లున్నవి సుఖరోగములున్నవి" అనియు ననవలెను. "విచిత్రా ఆధయః యస్య తస్య భావః" దీని మనసులో పుండున్నది. చిత్రమనోవ్యాధి యున్నది. అందువలననే నేను కలియుట లేదు" అని నెమ్మదిగా విచిత్రాభిప్రాయమును వ్యాపింపజేసినచో విరక్త విరాగము మానును. ఆమె సమీపమునుండి యేదేని వ్యాజమున తొలగుటయు నావశ్యకము. ఇట్లె భావోపక్షేపము మరియొక యుపాయము. "ఈతడన్యస్త్రీ యందొకచో ననురక్తుడై యున్నాడు" అని యన్యునిచే చెప్పింపవలెను. ఇవి యన్నియు నామె మనసున కనురాగము పట్టింపగలవు. మగవాని లోని కొన్నివిశేషములు రక్తకును విరాగకారణము లగును. అవి యిట్లున్నవి.

అనురక్తావిరాగహేతువులు

౧౮౭. దారిద్ర్యాత్ వ్యాధితో దుఃఖాత్పారుష్యాత్ దుఃశ్రవాత్తథా
ప్రవాసగమనాదేవ హ్యతిలోభాదతిక్రమాత్
౧౮౮. అతీవాభిగమాచ్చాపి తథా విప్రియకారణాత్
ఏభిః స్త్రీ పురుషో వా పి కారణైస్తు విరజ్యతే

దారిద్ర్యము, వ్యాధి, దుఃఖము, పరుషత్వము, దుర్వార్తాశ్రవణము, ప్రవాసగమనము, అతిలోభము, అతిక్రమణము, అతిసంభోగము, విరుద్ధాచరణము నను పదికారణముల వలన స్త్రీగాని పురుషుడుగాని

విర క్తులగుదురు. మొదట ననురాగము కల వారయినను వీనివలన రాగములేనివారగుదురు. ఇంక నపత్యమరణాదులును విరక్తి హేతువులు కావచ్చును. అట్టివంతగా నిరూపణార్హములు కావు. ఎంతగా విరక్తి హేతువులున్నను రాగరక్షణము చాల సముచితప్రక్రియ. కామతంత్ర కుశలు రయిన పురుషులు మదనాశ్రయవిధానమున స్త్రీల భావగ్రాహు లగు కార్యముల నాచరింపవలయును. నారి సంతసించునట్లు ప్రవర్తింప వలెను. పురుషు లావిధముగా స్త్రీలను వశపరచుకొనవచ్చును. ఈ భావము నీ శ్లోకము సూచించును.

౧౮౯. భావగ్రాహీణి నారీణాం కార్యాణి మదనాశ్రయే
తుష్టిమేతి యథా నారీ ప్రాప్యతే పురుషైరథ

పురుషులు నారీసేవన మొనర్చుట కీ విధానము లనుసరణీయములు. ఒక్కొకవిధమయిన వనిత నొక్కొకవిధముగా రంజింపజేయవచ్చును. చూడుడు!

| | | |
|---|---|---|
| ౧. | అర్థప్రదానమున | లుబ్ధవనిత |
| ౨. | కలావిజ్ఞానమున | కలావతి |
| ౩. | ప్రాగల్భ్యమున | చతురస్త్రీ |
| ౪. | అనువర్తనమున | మానిని |
| ౫. | ఇష్టకథోపక్రమమున | పురుషద్వేషిణి |
| ౬. | క్రీడావిశేషములచే | బాల |
| ౭. | ఆశ్వాసమున | భీరునారి |
| ౮. | నీచసేవనమున | గర్వితవనిత |
| ౯. | శిల్పదర్శనమున | ఉదాత్త |

ఇట్లు స్త్రీలు వశంవద లగుదురు. ఇందు నీచసేవనము పాదస్పర్శనాదు లని భావించునది. వేశ్యలయిన వనితల కందరకు సర్వసామాన్యముగా నుత్తమప్రకృతి మధ్యమప్రకృతి నీచప్రకృతి యని త్రివిధప్రకృతి యుండును, కావున ప్రతిపదభేదసంగ్రహము శక్యముకాదు. వేశ్యల కీ ప్రకృతులు స్వభావముననె కలుగును.

౧. ఉత్తమప్రకృతి : ప్రియుడు విప్రియముగానున్నను ప్రియమునె పలుకును గాని యప్రియము పలుకదు. దీర్ఘరోషమున నుండదు.

కలావిచక్షణ శీలశోభాకులాధికు లయిన పురుషు లీమెను కామింతురు. కామతంత్రకుశల. దక్షిణ. రూపశాలిని, ఏదేని నిమిత్తమున రోషపడి నను ఈర్ష్య విడనాడి శాంతముగా పలుకును. కార్యము గుర్తించి కాలము గుర్తించి విశేషము భావించి వ్యవహరించును. సురూప. ఇట్టిది యుత్తమప్రకృతి కలదనవచ్చును.

౨. మధ్యమప్రకృతి : పురుషులు కామింతురు. ఆమె వారట్లు కామించునట్లుగా చేయగలదు. అట్టియాకర్షణమోహామంత్రము లీమెకు గలవు. కామోపచారకుశల. ప్రతిపక్షము వారి నసూయించును. ఈర్ష్యాతుర, నిబ్బరముగా నుండజాలదు. క్షణక్రోధ. క్షీణక్రోధ. అతి గర్వితి, క్షణములో ప్రసన్న కాగలదు. ఇట్టి నారి మధ్యమ ప్రకృతి.

3. అధమ ప్రకృతి : అస్థానకోపన దుష్టశీల, అతిమానిని చపల పరుషదీర్ఘరోష. ప్రతికూలనారి యధమప్రకృతి.

స్త్రీలకందరకు యౌవనభేదములు నాలుగు కలవు. ప్రథమ యౌవన మిరువదివత్సరముల వరకుండును. ముప్పదివత్సరములవరకు ద్వితీయయౌవన ముండును. తృతీయయౌవనము నలుబదివరకు నాల్గవ యౌవన మేబదివరకుండునని వయోవిభాగము గుర్తింపవలెను. కొందరు పదునారు పంచవింశతి ముప్పదియయిదు నలుబదియయిదు వత్సరముల సంకేతమును విభాగముగా జెప్పిరి.

౧. ప్రథమయౌవనము : దీనినె నవయౌవన మందురు. శృంగార రీతి ననుసరించి వేషభూషావిశేషాత్మక మయిన నేపథ్యరచనము చిత్ర ముగ నుండును. రూపము చేష్టలు గుణములు శృంగారపు పొంగు సూచించును. ఊరువులు పీనములగుట గండములు జఘన మధరము స్తనములుబ్బుగలవయి కర్కశములుగా నుండుట రతి మనోజ్ఞముగా నుండుట శృంగారసముత్సాహ ముండుట ప్రథమయౌవనస్వరూపము. నవయౌవన యధిక క్లేశము సహింపలేదు. ఇతర స్త్రీలను కోపింపదు. అంతగా హర్షింపదును. సౌఖ్యము కూర్చు గుణములందును సౌమ్యము సంపాదించు గుణములందును నవయౌవన యాసక్తయగును.

౧౮౦. నాత్యర్థం క్లేశసహా న కుప్యతి న హృష్యతి స్త్రీభ్యః
సౌఖ్యగుణేష్వవసక్తా నారీ నవయౌవనా జ్ఞేయా

౨. ద్వితీయయౌవనము : ఇందు శరీరమునం దవయవము-లన్నియు నిండుగా పూర్ణముగా నుండును. పీనపయోధరములు నత మధ్యము ద్వితీయయౌవనసూచకములు. ఈయౌవనము కామసారము. కామపారము. స్త్రీద్వితీయావస్థలో కొంతకోపించుట కొంతకలహిం చుట కొంతప్రణయకలహమునకు దిగుట యలవరచుకొనును. నాయ కునకు కోపము కలిగినచో మాటలాడడు. ఊరకనె యుండును. ఇదె యర్థ మిందున్నది.

౧౮౧. కించిత్కరోతి మానం కించిత్క్రోధం చ మత్సరం చైవ
క్రోధే చ భవతి తూష్ణీం యౌవనభేదే ద్వితీయే తు.

౩. తృతీయ యౌవనము : సర్వశ్రీసంయుక్తము. రతికర మున్మా దనము రతిసాధనముల నుత్పాదింపగలది. రతిగుణపరిపూర్ణమగునది. కామసంపుష్టమగు శోభకలది. ఇది మూడవ యౌవనము. ఈ యౌవన మున నారి రతిసంభోగదక్ష ప్రతిపక్షాసూయిని రతిగుణాఢ్య యగును. గర్వచేష్టలను వ్యక్తము చేయును.

౧౮౨. రతిసంభోగే దక్షా ప్రతిపక్షాసూయినీ రతిగుణాఢ్యా
అనిభృతగర్వితచేష్టా నారీ జ్ఞేయా తృతీయే తు.

౪. చతుర్థయౌవనము : నవయౌవనము గతింపగా ద్వితీయము పోగా తృతీయమును దాటగా శృంగార శత్రుభూత మయిన నాల్గవ యౌవనము గోచరించును. ఈ యౌవనమున కపోలములు వాడిపోవును. జఘనము చిక్కిపోవును. అధరము మ్లానమగును. స్తనములు వాలి పోవును. లావణ్యము తగ్గి పోవును. కామవిషయమున నేమియు నుచ్ఛ్వాస ముండదు. ఇది చతుర్థ యౌవనము. ఇందు నారిచిత్తగ్రహణ సమర్థ. కామాభిజ్ఞ. అమత్సరోపేత. పురుషు డెల్లప్పుడు దగ్గరనె యుండ వలయునని కాంక్షపడును. అట్లుండుట యామె యభిలాష.

౧౮౩. చిత్తగ్రహణసమర్థా కామాభిజ్ఞా త్వమత్సరోపేతా
అవిరహితమిచ్ఛతి సదా పురుషం నారీ చతుర్థేతు

నాటకములందీ నాలుగుయౌవనభేదము లున్నవి. వీరిలో కొంత యుపచారభేదము నుండును. నవయౌవన నఖరదశనాదుల కార్యము నంతగా సహింపజాలదు. తృతీయయౌవన కామతంత్రప్రయోగమున ప్రగల్భ యగును.

## పురుష భేదములు

ఉపచారపద్ధతులను గుర్తించుటకై పురుష భేదములను తెలియవలసి యున్నది. కామతంత్రము ననుసరించి స్త్రీసంప్రయోగవిషయమున పురుషు లయిదు విధములనున్నారు. వారి పేర్లిట్లున్నవి.

౧. చతురుడు ౨. ఉత్తముడు ౩. మధ్యముడు
౪. నీచుడు ౫. ప్రవృత్తకుడు

౧౯౪. సమదుఃఖక్లేశసహః ప్రణయక్రోధప్రసాదనే కుశలః
యోర్థీ నాత్మచ్ఛందోదక్షశ్చతురః స బోద్ధవ్యః
౧౯౫. యో విప్రియం న కురుతే నార్యాః కించిద్విరాగసంజ్ఞాతం
అజ్ఞాతేప్సితహృదయః స్మృతిమాన్ ధృతిమాన్ స తు జ్యేష్ఠః
౧౯౬. మధురస్త్యాగీ రాగం న యాతి మదనస్యచాపి వశమేతి
అవమానితశ్చ నార్యా విరజ్యతే చోత్తమః స పుమాన్
౧౯౭. సర్వార్థైర్మధ్యస్థో భావగ్రహణం కరోతి యో నార్యాః
కించిద్దోషం దృష్ట్వా విరజ్యతే మధ్యమః స భవేత్
౧౯౮. కాలే దాతా హ్యవమానితోపి న క్రోధమతితరామేతి
దృష్ట్వా వ్యలీకమాత్రం విరజ్యతే మధ్యమోయమపి
౧౯౯. అభినవకృతే వ్యలీకే ప్రత్యక్షం రజ్యతే దృఢతరం యః
మిత్రైర్నివార్యమాణో విజ్ఞేయః సోఽధమః పురుషః
౨౦౦. రతికలహసంప్రహారేష్వకర్కశః క్రీడనీయకః స్త్రీణాం
ఏవంవిధస్తు తజ్జ్ఞైర్విజ్ఞేయః సంప్రవృత్తస్తు.

౧. చతురుడు : సమానముగా దుఃఖక్లేశములు సహింపగలడు. ప్రణయకోపమును బోగొట్టి స్త్రీలను ప్రసాదన మొనర్చుటలో కుశలుడు. కేవలము తన యభిలాషమునె జూచుకొనువాడు కాడు. దక్షుడు. ప్రియకు విప్రియ మాచరింపడు. విరాగ మొదవించు విధానము లవలంబింపడు. తన హృదయేప్సితమునుగోచరము కానీయని గంభీరుడు. స్మృతిధృతులు కలవాడు. ఇట్టివాడు జ్యేష్ఠుడయిన చతురనాయకుడు.

౨. ఉత్తముడు : మధురస్వభావుడు. త్యాగి. అతిరాగము పొందడు. మదనునకు వశము కాడు. స్త్రీ యవమానించినచో విరక్తుడగును. ఆత డుత్తమపురుషుడు.

౩. మధ్యముడు : అన్నిట మధ్యస్థుడుగా నుండును. నారి భావము గ్రహించును. స్త్రీయందేమేని దోషము గోచరించినచో

నిక నామెను ప్రేమింపడు. విరక్తుడగును. వీడు మధ్యముడు. మరియొక డును మధ్యముడె. తగినసమయమున తగినవిధమున దానమొనరించును. అవమానము పొందిన నధికముగా క్రోధము పొందడు. దోషము గోచరించెనా వెంటనె విరక్తుడగును. వీడును మధ్యముడు.

౪. అధముడు : స్త్రీ యవమానించినను లజ్జారహితముగ ముఖవికార మేమాత్రము పొందక వెంటనే సమీపమున కేగును. నాయిక యితరపురుషసంక్రాంత యయినచో నంతగా కోపింపడు. కాని యన్యదీయస్నేహము ననుసరించి భావము మరలించు కొనును. వీడు నీచస్వభావుడు. తననాయిక నితరున కందించుటకు నిష్టపడును. అప రాధ మభినవముగా గలిగినను ప్రత్యక్షముగా దృఢముగ నా నాయిక యందే రక్తుడగును. మిత్రులు నివారించినను తన ప్రేమను మరలించు కొనడు, వీడు నీచు డధముడు.

౫. సంప్రవృత్తుడు : భయ మమర్షము గణింపడు, మూర్ఖ ప్రకృతి. వెకిలిగా నవ్వును. ఏకాంతమున ధృఢముగా సంసక్తుడగును. కామతంత్రములందు లజ్జలేనివాడు. రతికలహాసంప్రహారము లందే మాత్రము కఠినముగా నుండడు. స్త్రీల కాటవస్తువుగా నుండును. ఇట్టి వానిని సంప్రవృత్తుడందురు.

౨౧౧ నానాశీలాః స్త్రియో జ్ఞేయా గూఢార్థహృదయేప్సితాః
విజ్ఞాయ తు యధాసత్వముపసర్పే త్తథైవ తాః
౨౧౨. భావాభావౌ విచిత్యాథ తత్ర తైస్తైరుపక్రమైః
పుమానుపచరేన్నారీం కామతంత్రం సమీక్ష్య తు

స్త్రీలు నానాశీలముల నుందురు. నారి హృదయము లందభి ప్రాయములు గూఢముగా నుండును. గూఢార్థహృదయేప్సితాః "అర్థనమర్థః అభిప్రాయః = గూఢాభిప్రాయం హృదయమాసాం." సత్వానుసారముగా నాశయానుసారముగా వారి విశేషములను గుర్తించి పురుషు డుపసర్పణ మొనరింపవలెను. పురుషుడు కామతంత్ర మును బాగుగా సమీక్షించి స్త్రీలయనురాగవిరాగములను తెలిసి కొని యాయా యుపక్రమములతో యువతి నుపచరింపవలెను. స్త్రీల విషయము చిత్రముగ నుండును. వారిని బంధించుటగాని స్వీకరించుట

గాని సాభిప్రాయముగ నుండవలెను. బంధనముకాని స్వీకారముగాని సాధింపవలసి యున్నపు డయిదుపాయములున్నవి. వాని పేర్లిట్లున్నవి.

౧. సామ ౨. ఉపప్రదానము ౩. భేదము
౪. దండము ౫. ఉపేక్ష.

యథాక్రమముగా సామాదుల లక్షణములు స్వరూపములు.

౨౦౩. తవాస్మి మమచైవాసి దాసోహం త్వం చ మే ప్రియా
ఆత్మోపక్షేపణకృతం యత్తత్సామేతి కీర్తితం
౨౦౪. కాలే కాలే ప్రదాతవ్యం ధనం విభవమాత్రయా
యన్నిమిత్తాంతరకృతం ప్రదానం నామ తత్స్మృతం
౨౦౫. భేదః స్యాత్తత్ప్రియస్యేహ సోపాయం దోషదర్శనం
బంధనం తాడనం చాపి దండ ఇత్యభిధీయతే
౨౦౬. సామాదీనాం ప్రయోగే తు పరిక్షీణే యథాక్రమం
న స్యాద్యా చ సమాపన్నా తాముపేక్షేత బుద్ధిమాన్

౧. సామ : "నేను నీవాడను. నీవు నాదానవు. నేను దాసుడను. నీవు నా ప్రియవు." ఇట్లు నిజభావమును ప్రదర్శించుట సామయయినది.

౨. ప్రదానము : తన విభవానుసారముగా దినదినము ధనము ప్రదానము చేయవలెను. ఒకేసారి యధికమిచ్చుట కన్న దినదినము ప్రదాన ముపరంజన మిచ్చును. నియమముగా నింత ధన మీయ వలెనన్న నియతి లేకపోయినను ఏదేని నిమిత్తవిశేషము ననుసరించి ధన మీయ వలెను. దాన నా వనితకు ప్రమోదము కలుగును. వ్యసనము పోవును. ఇది యంతయు నిమిత్తాంతరకృత మయిన ప్రదానము. నాయకుడు తన ప్రమోదోత్సవసమయములందు ద్రవ్య మిచ్చుట, యామె వ్యసనసమయములందు ద్రవ్య మిచ్చుట యుక్తము.

౩. భేదము. వేశవనిత సత్యములని నమ్మునట్లు సోపాయముగా నామె వలచిన యన్యప్రియుని దోషములను వర్ణించుట భేదము.

౪. దండము : నాయిక తనమార్గమున నుండక సామాదుల లొంగక యుండునేని బంధనము తాడన మొనర్పవలసి యుండును. ఆమె తనకు భోగదాయిని నాయిక. చీటికి మాటికి నామెను తాడ

నము చేయరాదు. అట్లు కొట్టినచో నాయకుని నలుగురేమేని యందురు. కాని యన్నిట నుపేక్షింపరాదు. త్రాటితో గాని బెత్తముతో గాని మృదువుగా గొట్టవలెను. ఆమె దుష్టాచార మొనర్చినచో నన్యభావము కలదయినచో తాడన బంధన దండ మావశ్యకము. ఆమె యొకప్పుడున్న ప్రదేశము విడిచి నగరాంతర దేశాంతరములు పోవచ్చును. పురుషాంతరగృహము నందే నివాస మొనర్పవచ్చును. అట్టి యప్పుడును నాయకుడు స్త్రీనిరపేక్షుడు కారాదు. మృదుతాడన బంధనములతో దండప్రయోగ మొనరింపవలసినదే.

౫. ఉపేక్ష : యథాక్రమముగా ప్రయోగించిన సామాదుల విధానము పరిక్షీణము కాగా నుపేక్ష ననుసరింపవలసియుండును. దండ మొనర్చిన నామె సామ్ముఖ్యము విడనాడు నేని బుద్ధికలవా డుపేక్షించుటయె యుక్తము. అత్యంత ముపేక్షించుట తగదు. ఉపేక్షయు నుపాయము కావున నామె సమ్ముఖీనయగుటకె యుపేక్షింపవలెను. అంతటి నాయకు డిట్లగుట నామెసైపదు. సామ్ముఖ్యము భజించును.

౨౦౭. మధ్యస్థాం మానయేత్సామ్నా లుబ్ధాం చోపప్రదానతః
అన్యావబద్ధభావాం చ భేదేన ప్రతిపాదయేత్

సామాద్యుపాయచతుష్టయమునకు నియత మయిన విషయ మున్నది. కొంతగా స్నేహాయుక్త యగునది మధ్యస్థ. అట్టి యామెను సామచే మానింపవలెను. ద్రవ్యలుబ్ధయగు స్త్రీనుపప్రదానమున స్వీకరింపవలెను. ఇతరపురుషు నందభిప్రాయము పెట్టుకొనిన దానిని భేద ప్రయోగమున తనయందభిముఖ యగునట్లు యత్నింపవలెను. ఇవి ఫలింపనిచో దండ మది సఫలముకానిచో నుపేక్ష యుయుక్తము.

౨౦౮. ముఖరాగేణ నేత్రాభ్యాం విజ్ఞేయో భావచేష్టితైః
ద్వేష్యో వాపి ప్రియో వాపి మధ్యస్థో వాపి యోషితాం
౨౦౯. అర్థహేతోస్తు వేశ్యానాం ప్రియో వా యది వాఽప్రియః
గమ్య ఏవ నరో నిత్యం ముక్త్వా దివ్యనృపస్త్రియః

బుద్ధిమంతుడగు పురుషుడు వేశ్యావిషయమున గుర్తింపవలసినవి కలవు. పురుషుడు ద్వేష్యుడగునో ప్రియుడగునో మధ్యస్థుడగునో స్త్రీలు మనసులో భావించు కొనినను వారి ముఖరాగమున గుర్తింప

వచ్చును. దృష్టివిశేషమున గుర్తింప వచ్చును. భావచేష్టితముల ననుసరించి తెలియవచ్చును. వేశ్యలకు మగవాడు ప్రియుడయినను ప్రియుడు కాకున్నను ద్రవ్యముకొఱకై నిత్యము గమ్యుడౌ యగును. దివ్యవనితల విషయమున రాజవనితల విషయమున ని నీతి పట్టదు. "వేశ్యాచిత్తం తు దుర్లక్షం" వేశ్యల చిత్తము గుర్తింప శక్యము కాదు. అయినను ప్రయత్నవిశేషము ననుసరించి గుర్తింప వచ్చును. వారర్థ లుబ్ధలు పణ్యాంగనలు. సర్వవేశ్యల కిది సామాన్యనియమము కాదు. ఊర్వశి దివ్యవేశ్య. ఆమె విషయము వేరు. రాజవేశ్యల విషయమును విశిష్టముగా నుండును. వారర్థ లుబ్ధ లనలేము. వారు కలాహృదయలు.

వేశ్యలభావములను వారి మాటల వలన దెలియ వచ్చునని కొందరను కొందు రేమో? వేశ్యల భాషాభావములు వక్రతలతో నిండియుండును.

> ౨౧౦. ద్వేష్యం తు ప్రియమిత్యాహుః ప్రియం ప్రియతరం తథా
> సుశీలమితి దుశ్శీలం గుణాఢ్యమితి నిర్గుణం
> ౨౧౧. ప్రహసంతీ చ నేత్రాభ్యాం యం దృష్ట్వోత్ఫుల్లతారకా
> ప్రసన్నముఖరాగాచ లక్ష్యతే భావరూపణైః

ద్వేషింపదగిన వానిగూడ ప్రియు డందురు. ప్రియుని ప్రియతరు డందురు. సుశీలుని దుశ్శీలుడందురు. గుణపరిపూర్ణుని నిర్గుణుడందురు. వారి పరిభాషార్థమె వేరు. కన్నులతో నవ్వుదురు. చూచి చూచి చూచుచునె కన్నులత్రిప్పుదురు. భావరూపణములతో ప్రసన్న ముఖరాగలు నగుదురు. వారి లో నొకటి. బయటి కొకటి, దీని భావ మేమో తెలియుట కష్టము.

> ౨౧౨. భావాభావౌ విదిత్వైవ నిరస్తైస్తైరుపక్రమైః
> యత్నాదుపచరేన్నారీం కామతంత్రం ప్రతీక్ష్య తు

ఆ యా యుపక్రమముల నన్నిటిని నిరస్తములు చేసికొని వారి రాగవిరాగములు గుర్తించి కామతంత్రమును సమీక్షించి యత్నవిశేష మనుసరించి వారనారిని సేవింపవలసి యున్నది. ఎంతబింకముగా నున్నను స్త్రీలహృదయగత మయిన భావమును వారల యవయవసన్ని వేశస్పందప్రస్పందములె సూచించును. వానిని గుర్తించి

వారిని తెలియఁబట్టవచ్చును. ఎంతగానయినను వారును వనితలగుట వలన నిత్య మస్వకార్యహృదయలుకారు. దాని నిట్లు గుర్తింపవచ్చును.

౨౧౩. ఉపచారబలత్వాచ్చ విప్రలంభాత్తథైవ చ
తాసు నిష్పద్యతే కామః కాష్ఠాదగ్నిరివోత్థితః

కాష్ఠమున నగ్ని జన్మించు నట్లు వారలందును కామము జనించును. అది యుపచారబలమున గలుగును. విప్రలంభమున గలుగును. వేశ్యాలోకవిధమున నుపచరింతురు. వారి యుపచారమంతయు నర్థకామమయముగా నుండును. మధ్యమధ్యలో వారు స్వహృదయమున సేవింతురు. వారి యుపచారము లన్నియు నర్థలోభబద్ధములని యనుకొన్నను పురుషులు కామించుటలో నొక విశేష మిమిడి యున్నది. వేశ్యలు పురుషుల హృదయగ్రహణోచితోపచారము కావింతురు. ఒకప్పు డుపచారసముదాచారమును నిందింతురు. పురుషు డామె హృదయగ్రహణోచితోపచార మొనరింప కాదందురు. వలదందురు. హసింతురు. పరిహాసింతురు. నిందింతురు. కాని లో నానందింతురు. మధ్యమధ్యలో విప్రలంభ మొనరింతురు. వంచింతురు. కాని వీని యన్నిటి వలన వారి యందును కామ ముదయించును. సర్వము కామాభినివేశముతో నుండక తప్పదు. కాష్ఠములో నగ్నివలె నని యనుటచే వారియందలి యప్పటి భావమును దుశ్చికిత్సమె యగునని భావము.

ఇప్పటి కిది యంతయు వైశికాశ్రయమయిన వనితోపచారవిధి. దీనినంతను సావధానముగ గుర్తించి నాటకమున ప్రకరణమున నిబంధింపవలెను. నాటకమునందు దివ్యవేశ్యాసద్భావముతో వైశికమును కూర్పవచ్చును. వానిలో పతాకానాయకగతముగ నిబంధించుట సముచిత మగును. ఈ వేశ్యోపచారమును నాట్యవిదులు నాట్యమున గ్రథింపవలెను. ఇది యంతయు కామోపచారము. కామము స్త్రీపురుష హేతుకమని యిదివరలో విశదముగ నిరూపితము. స్త్రీలలో విచిత్రములగు స్వభావము లున్నవి. పురుషులందు నట్లె విచిత్రస్వభావము లున్నవి. వానిని ప్రతిపద మాకలనము చేయుట శక్యక్రియ కాదు. కాని ప్రకృతిపరిశీలనమున కొంత ప్రవచన మొనరింప వచ్చును.

## ప్రకృతి నిరూపణము

స్త్రీపురుషుల విచిత్రస్వభావములను వారి వారి ప్రకృతులు నిరూపింప గలవు. సామాన్యముగా స్త్రీపురుషప్రకృతులు మూడు విధములుగా నున్నవి. ఈ ప్రకృతి త్రయము ననుసరించి స్వభావముల నన్నిటిని సంగ్రహింప వచ్చును. ఆ ప్రకృతిత్రయ మిట్లున్నది.

౨౧౪. సమానతస్తు ప్రకృతిస్త్రివిధా పరికీర్తితా
పురుషాణా మథస్త్రీణా ముత్తమాధమ మధ్యమా

కామోపచారమును నాయకవిశేషము. అది శృంగారమున పర్యవసించును. కామోపచారకథన మయిన పిమ్మట నాయకభేదము లనె చెప్పుట సముచితము. ఆ నాయకుని యంతఃపురజనుల కేమేమి నామము లున్నవో బహిర్జనుల పేరు లెట్లున్నవో పరివార మెంత యున్నదో సర్వము కవి తెలిసి కొనవలయును. నటుడును తెలియ వలయును. కావున ప్రకృతి- నాయక- పరివారభేదములను జెప్పుట కీప్రఘట్ట మావశ్యకము. ప్రకృతి భేదము ననుసరించి యుపచరించుట యిందు గోచరము కాగలదు. నపుంసకుడు కామము లేనివాడు కావున వాని యుపచారము స్నేహవ్యవహారమగును. ప్రకృతివ్యవహార మిందు నిరూపిత మగును. ఉత్తమాధమ మధ్యమ రూపమున ప్రకృతి మూడు విధముల నున్నది. పురుషుల ప్రకృతి త్రివిధము. స్త్రీల ప్రకృతియు త్రివిధము. విస్తరముగా నీ ప్రకృతి నిరూపిత మయినను ప్రకృతము సంక్షేపముగా నిరూపింప వలసి యున్నది.

### ఉత్తమ ప్రకృతి

౨౧౫. జితేంద్రియజ్ఞానవతీ నానాశిల్పవిచక్షణా
దక్షిణాఢ్యమహాలక్ష్యా భీతానాం పరిసాంత్వనీ
౨౧౬. నానాశాస్త్రార్థసంపన్నా గాంభీర్యౌదార్యశాలినీ
స్థైర్యత్యాగగుణోపేతా జ్ఞేయా ప్రకృతిరుత్తమా

ఇంద్రియజయము విజ్ఞానము నానాశిల్పవైచక్షణ్యము దాక్షిణ్యము కలిగి యుత్తమలక్ష్యముతో నుత్తమప్రకృతి యుండును. భయభీతులను చక్కగా సాంత్వన మొనరించును. నానావిధములగు శాస్త్రార్థ సంపత్తి కలిగి యుండును. గాంభీర్య మౌదార్యము కలిగి శోభించును. స్థైర్యత్యాగగుణముల కూడి యుండును. దీనావనపరాయణమై

యుండును. అందర కభినందనీయస్వభావమున నుండును. ఇట్టిదిది యుత్తమప్రకృతి

మధ్యమప్రకృతి

౨౧౭. లోకోపచారచతురా శిల్పిశాస్త్రవిశారదా
విజ్ఞానమాధుర్యయుతా మధ్యమా ప్రకృతిఃస్మృతా

లోకుల నుపచరించుటలో చాతుర్యము కలది శిల్పశాస్త్రము నందు ప్రావీణ్యము కలది విజ్ఞానము మాధుర్యములతో కూడి యుండునది మధ్యమప్రకృతి యని పెద్దలనిరి. ఇందు లోకోపచారచాతుర్యమనునది లోకవ్యవహారములను దేశార్థనీతులను గుర్తించుటలోని నైపుణ్యముగా గుర్తించునది.

అధమప్రకృతి

౨౧౮. రూక్షవాచోఽథ దుఃశీలాః కుసత్త్వాః స్థూలబుద్ధయః
క్రోధనా ఘాతుకాశ్చైవ మిత్రఘ్నాశ్ఛిద్రమానినః
౨౧౯. పిశునా స్తూద్ధతైర్వాక్యైర కృతజ్ఞా స్తథాలసాః
మాన్యామాన్యావిశేషజ్ఞాః స్త్రీలోలాః కలహప్రియాః
౨౨౦. సూచకాః పాపకర్మాణః పరద్రవ్యాపహారిణః
ఏభిర్దోషైస్తు సంపన్నా భవంతీహాధమా నరాః

అధమనరుల వచనము పరుషము. శీలము దుష్టము. సత్త్వము కుత్సితము. బుద్ధి స్థూలము. వారు క్రోధనులు ఘాతుకులు మిత్రజ్ఞులు కారు మిత్రఘ్నులు. ఛిద్రాన్వేష మొనరింతురు. దోషదృష్టులు. లుబ్ధబుద్ధులు. ఉద్ధతవాక్యములతో పరుషవచనములు పలుకుదురు. కృతజ్ఞులు కారు. ఒరులొనరించిన యుపకారమును విస్మరింతురు. ఎవరు గౌరవింపదగుదురో? ఎవరుకారో? విశేషము గుర్తింపజాలరు. స్త్రీలోలురు కలహప్రియులు. సూచకులు చాడీలు చెప్పుదురు. కొండెములు పల్కుదురు. పాప మాచరింతురు. పరద్రవ్య మపహరింతురు. ఈ దోషములు కూడియుండు వారధమ ప్రకృతులు. ఇట్లు శీలానుసారమున మానవప్రకృతి త్రివిధమయినది. స్త్రీల ప్రకృతియు నిట్లుండును.

౧. ఉత్తమస్త్రీ మృదుభావమున నుండును. చపలస్వభావ కాదు. నిష్ఠుర కాదు. స్మితపూర్వభాషిణి, వచనదక్ష యయినను

గురువులవిషయమున సలజ్జ. లజ్జావినయములు కూడియుండును. స్వాభావికము లయిన రూపాభిజనమాధుర్యాదిగుణములు కలదై గాంభీర్యధైర్యసంపన్నయై యుండును. ఇట్టి యీమె యుత్తమ ప్రమద. ఈ యుత్తమాధమమధ్యమా స్వరూపము లిదివరలో గొంతగా నిరూపితము లయినను అచట కామోపచారాభిప్రాయము ననుసరించి ప్రకృతి త్రైవిధ్యము వ్యాఖ్యాత మయినది. ఇచట సర్వవ్యవహార విషయముగ విశేష మున్నది. సత్వసముద్భవమయిన విశేషము ననుసరించి విషయభేదమున నుత్తమాదిత పూర్వోపాత్తము. రస్యములు స్నిగ్ధము లయిన యాహారములు సాత్వికప్రియములని సత్వమాహారవిషయమని సథూమాభ్యవహారముగ నిరూపితములయినవి. కటుకాహారవ్రత మొనరించు ముని సాత్వికుడు కాడు. ఘృతగుడపయోన్నభోజి సాత్వికు డగును. ఇచటి యుత్తమత్వాదికము భావబంధముతో కూడినదని గ్రాహ్యము. ఈ యుత్తమవనితయు నుత్తమ భావయోగ్య.

౨. మధ్యమస్త్రీకూడ ఉత్తమ వనితాలక్షణములు కలిగియుండును. కాని వాని యందతిశ్రేష్ఠత యుండదు. సమగ్రతయు నుండదు. కొన్ని స్వల్పదోషములతో ననువిద్ధయు నగును. దోషస్పర్శ యుండుట శ్రేష్ఠతాహీనము లసమగ్రము లయిన గుణములు కలదగుట వలన నీమె మధ్యమ ప్రకృతి యయినది.

3. అధమప్రకృతి వనిత యధమప్రకృతి కల పురుషుల స్వభావముల నన్నిటి నందుకొనినదిగనె యుండును. స్త్రీలలోనిట్టిది యధమ.

రాజపరివారములందు నపుంసకు డొకడుండును. వాడు సంకీర్ణ ప్రకృతి. ఒకడు మిశ్రప్రకృతి. వేరొక డధమప్రకృతి. ప్రేష్యాదిపరివారముకూడ మిశ్రప్రకృతిగా నుండుటయు నున్నది. వారును సంకీర్ణ ప్రకృతి యనియె ప్రసిద్ధము. స్వామిచిత్తము ననుసరించి ప్రవర్తించుట వారి స్వభావము. తమ ప్రభువెట్టివాడయిన వారు నట్టివారగుదురు. విటుడు శకారుడును సంకీర్ణప్రకృతికులె యగుదురు. వారిదివరలో విభవ మనుభవించినారు. ప్రకృతము మధ్యమచేష్టిత మాచరింతురు. ఇట్లుత్తమ మధ్యము లగుట సంకీర్ణులు. "పరమార్థతస్తు ప్రేష్యవిటశకారా

అధమా ఏవ" వాస్తవముగా జూడగా ప్రేష్యాదులు మూావు రధములే. నాట్యవిషయమున వీరి నాయా ప్రకృత్యనుసారమున నిబంధించుటయె సముచితమగును. పురుషస్త్రీనపుంసకులతో నీ ప్రకృతు లిట్లున్నవి. ఈ ప్రకృతుల కన్నిటికి శీలసంశ్రయ మయిన విధానమును చెప్పవలసినది కలదు.

## నాయక భేదము

మధ్యమోత్తమప్రకృతిలో నానాలక్షణలక్షితులయిన నలుగురు నాయకులున్నారు.

౧. ధీరోద్ధతుడు ౨. ధీరలలితుడు
3. ధీరోదాత్తుడు ర. ధీరశాంతుడు

౨౨౦. దేవాధీరోద్ధతాజ్ఞేయాఃస్యుర్ధీరలలితానృపాః సేనాపతిరమాత్యశ్చధీరోదాత్తౌప్రకీర్తితౌ
ధీరప్రశాంతా విజ్ఞేయా బ్రాహ్మణా వణిజస్తథా

దేవతలు ధీరోద్ధతులు రాజులు ధీరలలితులు సేనాపతి యమాత్యుడు ధీరోదాత్తులు బ్రాహ్మణులు వైశ్యులు ధీరప్రశాంతు లగుదురని తెలియవలసియున్నది. ఈనల్గురకు నాలుగువిధముల విదూషకులుందురు. సురతవిషయమున సంబంధిగ్రహణమున వీరు దూషణము చేయుదురు. విగ్రహము (యుద్ధము) వలదని సంధియుక్త మని వీరు పలుకుదురు. నాయకునకును నాయికతో విప్రలంభము కలిగిన సమయమున వినోదనములతో "దూషయంతి విస్మారయంతి" విస్మరింపజేయుదురు. అందుననే వీరలకు విదూషకులని సంకేతము కలిగినది.

౧. లింగి (ఋషి) ౨. ద్విజుడు
3. రాజోపజీవి ర. శిష్యుడు

ఈ నలుగురు యథాక్రమముగా దేవరాజామాత్యబ్రాహ్మణులకు సంబంధించిన విదూషకు లగుదురు. యథౌచిత్యముగా ప్రయోజన మొనర్చినచో;

౧. లింగి దేవతలకు
౨. వీరబ్రాహ్మణుడు సేనాపతికి
3. రాజోపజీవి రాజునకు
ర. శిష్యుడు బ్రాహ్మణునకు

సంబంధించిన వారగుదురు. ముద్రారాక్షసమున బ్రాహ్మణుడయిన చాణక్యునకు శిష్యుడు కలడు. సంకథాలాపపేశలు రయిన యీ నలుగురు నాయకులకు విప్రలంభస్నేహితులుగా నుందురు. ఇదియె వీరి వ్యాపారము. "విప్రలంభసుహృదోఽమీ సంకథాలాపపేశలాః"

నాయకుడు

౨౨౧. వ్యసనీ ప్రాప్య దుఃఖం వా యుజ్యతేఽభ్యుదయేన యః
తథాపురుషమాహుస్తం ప్రధానం నాయకం బుధాః

౨౨౨ యత్రానేకస్య భవతో వ్యసనాభ్యుదయౌ పునః
సపుష్టౌ యత్ర తౌ స్యాతాం న భవేత్తత్ర నాయకః

కావ్యస్వరూపము పొందెడి యితివృత్తము కొన్నిట నేకపురుష సంభవముగా నుండును. కొన్ని యనేకసంభవముతో నుండును. అందేకసంభవ మయిన యితివృత్తమున నుండు నాయకుని స్వరూప మిట్లున్నది. వ్యసనియగు పురుషు డభ్యుదయముతో గూడినవాడగునేని యట్టివాడు ప్రధాననాయకు డగునని బుధులందురు. మొదటనే వ్యసనపతితుడు కాక సుఖము ననుభవించి దుఃఖమును పొందినవాడు నభ్యుదయము పొందునేని నాయకు డన్నవ్యపదేశము పొందును. అనేకసంభవ మయిన యితివృత్తములో నున్న ముఖ్యులకు మఱల మఱల గలిగిన వ్యసనాభ్యుదయములు పరిపుష్టములై యవభాసించునేని వారలలో నాయకవ్యవహారము రాదు. రామచరితములో సుగ్రీవ విభీషణులకు పునఃపున ర్వ్యసనోదయము లున్నవి. అవి పరిపుష్టములుగను నున్నవి. వారలకు నాయకత్వము లేదు. రాముడు వ్యసనియై యభ్యుదయము పొందినాడు. ఆతడే ముఖ్యనాయకుడు.

అంతఃపురనాయికలు

౨౨౩. దివ్యా చ నృపపత్నీ చ కులస్త్రీ గణికా తథా
ఏతాస్తు నాయికా జ్ఞేయా నానాప్రకృతిలక్షణాః

నాయకభేదానంతరము నాయికాభేదము ప్రసంగప్రాప్తము. దివ్యవనిత, రాజపత్ని, కులస్త్రీ, గణికయను వీరు నానాప్రకృతిలక్షణములు కలవారై నాయికలుగా నుందురు. ఇందు దివ్యవనితలు రాజాంగనలును ధీరలు లలితలు ఉదాత్తలు నిభృతలు నగుదురు. గుణ

యుక్తలై యుందురు. కులాంగన యుధాత్తనిభృత యగును. గణిక కాని శిల్పకారిక కాని లలితస్వభావ లభ్యుదాత్తలు నగుదురు.

నానాప్రకృతివిభాసిత లయిన సర్వవిధవనితల యుపచారరీతి బాహ్యమని యాభ్యంతరమని నిశ్చితప్రసిద్ధము. వాక్యోపచారము బాహ్యము. రాజోపచారమున రాజుల యంతఃపురాశ్రిత మయిన యుపచారవిభాగము ననుసరించి స్త్రీవిభాగ మున్నది. అందుననె ప్రకృతము అంతఃపురసమాశ్రయ మయిన రాజోపచారమును నిరూపింపవలసి యున్నది. రాజునకీపేర్లు కలవారంతఃపురజన మని ప్రసిద్ధి యున్నది.

| | | |
|---|---|---|
| ౧ మహాదేవి | ౨ దేవి | ౩ స్వామిని |
| ౪ స్థాపిత | ౫ భోగిని | ౬ శిల్పకారిణి |
| ౭ నాటకీయ | ౮ నర్తకి | ౯ అనుచారిక |
| ౧౦ పరిచారిక | ౧౧ సంచారిక | ౧౨ ప్రేషణకారిక |
| ౧౩ మహత్తరి | ౧౪ ప్రతీహారి | ౧౫ కుమారి |
| ౧౬ స్థవిర | ౧౭ ఆయుక్తిక | — |

మహాదేవి మొద లాయుక్తికాంత మీా పదునేడుగురును స్త్రీగణము. నపుంసకాదివర్గముతో పదునెనిమి మంది కలరు. నపుంసకులు నంతఃపుర విషయమయిన పరివారమె. స్త్రీగణమునందు "మహాదేవి" యని యేకవచనము వివక్షితము. మహాదేవి యొక్కతయె యుండును. దేవి స్వామిని మొదలగువారందరు బహుసంఖ్యాకలు. వారు విభవము ననుసరించి యెంతమందియేని యుందురు. మహాదేవి మొదలగు నారి లక్షణస్వరూపము లీవిధముగా నుండును.

౧. మహాదేవి : మూర్ధాభిషిక్త. "సర్వేషాం మూర్ధని ప్రధానస్థానా ఇతి అభిషిక్తా" అందరిపై ప్రధానముగా నుండునది. రాజ్యాభిషేకవైభవము కలది. అభిషిక్త. కులశీలసమన్విత, గుణవతి. వయస్థ. మధ్యమవయసునందుండునది. కొంతగా క్రోధన. ఈర్ష్య విడిచినది. రాజశీల మెరింగినది. సుఖదుఃఖములను సహింపగలది. శాంతిస్వస్త్యయనాదు లొనరించుచు నిత్యము తనభర్తకు శుభము కోరునది. శాంత పతివ్రత. ధీర. అంతఃపురహితాసక్త. అంతఃపురమునకు సంబంధించిన

వర్గమునందును బాహ్యవర్గమునందును సమాదరముకలది. ఈ సమాదర మంతయు నంతఃపురకౌశల సంపాదనము ననుసరించును. ఇట్టి గుణములు కలది మహాదేవి యగును.

౨. దేవి : మహాదేవి యొక్క తెయే గాని దేవీపదమున జెప్ప దగినవారలనేక లుందురు. మహాదేవీగుణములన్నియు వీరిలో నుండును గాని మహాదేవీసంస్కారము లుండవు. మహాదేవి యధికముగా శృంగారమున కుపయోగింపదు. అధికముగా నాభిముఖ్యము వహింపదు. ఈ దేవీనామాంచిత లట్లుగాదు. వీరియందు సముచితశృంగార జీవన ముండును. శృంగారోచిత లగుదురు. ఆభిముఖ్యము వహింతురు. వాసవదత్తాదుల విషయమై కవులు "దేవీ" యనెడు వాచోయుక్తి ననుసరించియె వ్యవహరించిరి. ఈ దేవీసంజ్ఞ కలవారు గర్వితలై యుందురు. అతిసౌభాగ్యము కలవారు. పతిసంభోగపరాయణలు. వీరి యాకారము శుచిగా నిత్యోజ్జ్వలముగా నుండును. ప్రతిపక్షప్రమదల ననూయింతురు. మంచివయసు కలవారు. రూపగుణపరిపూర్ణలు. ఇట్టివారు 'దేవి' యనదగి యుందురు.

3. స్వామిని : సేనాపతి యమాత్యులు మొదలగువారి తనయలు రాజగృహీతలు కాగా "స్వామిని" యనదగిన వారగుదురు. ఇట్లె భృత్యుల తనయలును స్వామిను లగుదురు. సేనాపతిప్రభృతులు రాజానుగ్రహాలబ్ధికై వయసువచ్చిన యవివాహితలయిన తమ తనయలను రాజోపభోగములకు సమర్పింతురు. వారు స్వామిను లగుదురు. శీలరూపగుణసంపన్న లయిన వీరు రాజునకు హితముగా నుందురు. తమ గుణవిశేషములను బట్టి రాజసమ్మానము పొందుదురు. లబ్ధసమ్మాన లయిన వీరు రాజభోగముల సంతుష్టలై స్వామిను లగుదురు.

౪. స్థాపిత : రూపయౌవనముల శోభలు కలవారు. సౌభాగ్యగర్వమున కర్కశముగా నుందురు. విభ్రమాన్వితలు. రతిసంభోగ కుశలలు. ప్రతిపక్షాభ్యసూయతో నుందురు. దీక్షలు. భర్తృచిత్తజ్ఞలు. నిత్యము గంధమాల్యోజ్జ్వలముగానుందురు. నృపతిచ్ఛందానుసారమున ప్రవర్తింతురు. తమలో తామీర్ష్యామానగర్వితలు కారు. అభ్యుదయమున నుందురు. పానప్రమత్త లగుదురు. వీరిలో నలసత్వ ముండదు.

నైష్ఠుర్యముండదు. మాన్యామాన్యవిశేషములను వీరు చక్కగ గుర్తింతురు. ఇట్టివారు వీరు "స్థాపిత"లనదగి యున్నారు. రతిభోగములకై రాజిట్టివారిని నిలువచేసికొని యంతఃపురములం దుంచును.

౫. భోగిని : వయఃకులశీలాదులు కలవారగుటచే పూజలు పొందగలవారు. మృదుస్వభావసముపేతలు. ఉద్భటలు కారు. కాక పోరు. మధ్యస్థలు. నిబ్బరము కలవారు. క్షాంతిసముపేతలు. కేవలము భోగము ముఖ్యముగా భావించు వీరు భోగినీపద వాచ్యలు.

౬. శిల్పకారిక : నానాకలావిశేషజ్ఞలు. నానాశిల్పవిచక్షణలు, గంధపుష్పవిభాగజ్ఞలు. లేఖ్యాలేఖ్యకర్మనిపుణలు. నర్మమర్మకలా విశేషములను గుర్తింతురు. చతుష్షష్టికలల పరిచయము కలిగి యుందురు. దారులోహాదిశిల్పముల నొనరింపగలరు. వాని గుణదోషములు గుర్తింపగలరు. గంధవిశేషములను పుష్పవిశేషములను తద్వ్యక్తివిశేషములను, సముచితసమయమున వినియోగములను తద్విభాగతద్రచనాప్రక్రియలను బాగుగ గుర్తింతురు. చిత్రంచన చేయుదురు. వర్ణికాభంగ మొనర్తురు. లేప్యకర్మనాచరింతురు. శయనాసనవిభాగములను చక్కగా గుర్తించి సుసజ్జితము చేయుదురు. చతురలు మధురలు ముదితలు దక్షలు సౌమ్యలు శ్లిష్టస్వభావలు స్ఫుటచేష్టలు నిభృతలు. ఇట్టివీరు శిల్పకారిణులు. వీరిపిల్లలు శిల్పదారికలు స్వప్నచరితములో నున్నారు. అంతఃపురవనితలకు వీరు కైసేత లొనరింప గలరు.

౭. నాటకీయ : సంగీతశాస్త్రమునకు సంబంధించిన స్వరతాలలయ విశేషములను తెలిసి గ్రహమోక్షములను గుర్తించి రసభావ వికల్పములను భావించి చతురలై నాట్యకుశలలై యూహాపోహవిచక్షణలై రూపయౌవన సంపన్నలై యుండు వనితలు నాటకీయ లనదగుదురు.

౮. నర్తకి : హేలాభావవిశేషములు బాగుగాగలదియు సత్త్వాభినయసంపన్నయు మాధుర్యసముపేతయు నాతోద్యకుశలయు నంగప్రత్యంగ సంపన్నయు చతుష్షష్టికలాసమన్వితయు నగు వనిత నర్తకి. ఇట్టివార నేక లుందురు. వీరందరు చతురలు. వినయసముపేతలు. స్త్రీ

దోషరహితలు. ప్రాగల్భ్యము కలిగియుందురు. అలసత్వము లేనివారు. జితశ్రమలు. నానాశిల్పప్రయోగవినియోగ యోగములు తెలిసి యుందురు. నృత్తగీతవిచక్షణలు. గోష్ఠిబంధములందు సమాగత లయిన వారెవరుకానివీరి రూపయౌవన కాంతులతో గుణములతో విశేషములతో సాటి వచ్చు వారుగా కన్పడరు.

౨౨౪ అథ రూపగుణౌదార్య ధైర్యసౌభాగ్య శీలసంపన్నా
పేశల మధుర స్నిగ్ధానునాదికలచిత్రకంఠా చ

నర్తకి రూపము గుణము ఔదార్యము ధైర్యము సౌభాగ్యము శీలము కలిగి యుండును. ఆమె కంఠస్వరము కలమధురమై చిత్ర సుభగమై పేశలమై మధురమై స్నిగ్ధమై యనునాదము కలదై శ్రుతి పేయముగా నుండును. ఇట్టి నర్తకీగణము రాజపరివారమునకు శోభ.

౯. అనుచారిక : ఏ యవస్థలో గాని పార్థివుని పరిత్యజింపదు. సర్వవిధముల నుపచరించును. ఈమె దక్షిణ. ఈమె దక్ష. రాజు ననుసరించి సేవ లాచరించి జీవించును. అనుచరణ మాత్మధర్మముగ భావించును.

౧౦. పరిచారిక : ఈమె కార్యవిశేషము లనేకము లున్నవి. అనేక పరిచారిక లుందురు. ఒక్కొక రొక్కొక కార్యమాచరింతురు. అంద రన్నిటి నొనరింపగలరు. ఒకతె శయ్యాపాలీరచన చేయును. మరి యొకతె ఛత్రము పట్టును. వేరొకతె వ్యజనము ధరించును. వీచును. ఒకతె సంవాహనము చేయును. ఒకతె సుగంధపరిమళరసద్రవ్యముల నాయోజనముచేసి సిద్ధపఱచును. ఒక మగువ మాల్యసంయోజనము చేయును. ఒకప్రమద యాపాదమస్తకము ప్రసాధనము చేయును. ఒక భామిని యాభరణముల కూర్చును. ఇట్టివారు పరిచారికలు. నీచ హీనకర్మ లాచరించుట వీరి పనికాదు. పరిచారికల పరిచర్యాసంవత్తి రాజోపచారములం దుదాత్తతను కలారమ్యతను సంపాదించును. ఇది పరిచారికా ప్రాభవము.

౧౧. సంచారిక : వీరు నధికసంఖ్యగా నుందురనియె నాట్యవిదుల నిశ్చయము. వీరు నానాకక్ష్యలలో నివసింతురు. సంచరింతురు. విచరింతురు. అటు యుపవనములందును తిరుగు లాడుదురు. దేవాయతనను

లందు క్రీడాప్రాసాదములందును పరిచారికలుగా వీరు సంచరింతురు. వీరు "యామకిన్యః" జాముజామునకు మేల్కొని తమ తమ కార్యములందు సావధానముగ నుందురు. ఇట్టి లక్షణసముపేతలు సంచారికలు.

౧౨. ప్రేషణకారిక : నృపాలకులకు గూహనము చేయదగిన గుహ్యకార్యములు కొన్నియుండును. అవి కామసంయుక్తములు కావు. కామ్యసంబంధమును కలవి కావు. అట్టి రహఃకార్యముల ప్రేషణమున నృపాలకులు కొందరిపరిచారికలను నియమింతురు. అట్లు రాజనియుక్త పరిచారికలె ప్రేషణకారికలు.

౧౩. మహత్తర : సర్వాంతఃపురరక్షా కార్యములందు వీరు నియుక్త లగుదురు. స్తుతు లాచరించి స్వస్త్యయనములు పలికి రాజుల యభివృద్ధి నభినందింతురు. ఇట్టివీరు మహత్తరలు. "అత్యంతం మహతీ మహత్తరీ" వయసులో విశేషములో నందరి కన్న మహతి కావున మహత్తరి. మహత్తరి, మహత్తరిక, మహత్తర పర్యాయపదములు. ఈ యర్థముల కల శ్లోక మిదిగో ;

౨౨౫. సర్వాంతః పురరక్షాసు స్తుతిస్వస్త్యయనేన చ
యా వృద్ధిమభినందంతి తా విజ్ఞేయా మహత్తరాః

౧౪. ప్రతీహారి : సంధివిగ్రహసంబద్ధ మయిన నానాచారసముత్థిత మయిన కార్యవిశేషమును రాజులకు నివేదించుట ప్రతిహారి పని. కొంత రాజకీయసమాచారములను కొన్ని సామాజిక విచారములను వీరు గుర్తింతురు. రాజులకు తెలియజేయుదురు.

౨౨౬. సంధివిగ్రహ సంబద్ధ నానాచార సముత్థితం
నివేదయంతి యాః కార్యం ప్రతీహార్యస్తు తాః స్మృతాః

౧౫. కుమారి : ఈపదమున నుండువారు నధికముగ నుందురు. వీరు బాలికలు. లజ్జాన్వితలు. నిభృతలు. సురక్షితలు మృదుస్వభావలు. ఉద్భటలు కారు. సంభ్రాంతలు కారు. రసాస్వాద మెరుగరు. అప్రాప్తసంభోగలు. వీరు కుమారికలు.

౨౨౭. అప్రాప్తరససంభోగా న సంభ్రాంతాష్టనచోద్భటాః
నిభృతాశ్చ సలజ్జాశ్చ కుమార్యోబాలికాః స్మృతాః

౧౬. వృద్ధ : పూర్వరాజుల నయనీతులను గుర్తించి యుందురు. పూర్వరాజ పరిపూజితలు. పూర్వరాజుల యనుచరణమున ప్రసిద్ధి

గౌరవము సంపాదించి యుందురు. చక్కగ సంప్రదాయముల తెలిసిన వీరు వృద్ధులన్నసంజ్ఞతో నున్నారు.

౨౨౮. పూర్వరాజనయజ్ఞా యాః పూర్వరాజాభిపూజితాః
పూర్వరాజానుచరితాః తాః వృద్ధా ఇతి సంజ్ఞితాః

౧౭. ఆయుక్తిక : రాజుల భాండాగారములం దధికృత్తలై యాయుధాగారములందు నియుక్తలై యుందురు. ఫలముల దెత్తురు. మూలకందముల సంపాదింతురు. ఓషధుల నన్వేషించి సమీక్షింతురు. బీజముల నేర్చి పెట్టుదురు. బీజౌషధపరీక్షాసమీక్షాదక్షలు గంధాభరణ వస్త్రములను మాల్యములను సంచింతనము చేయుదురు. అనేకులొనరింప దగిన బహ్వాశ్రయకార్యమున వీరు నియుక్త లగుదురు. నియుక్త లగు వీ రాయుక్తిక లనదగుదురు. అంతఃపురమున సంచరించు నితర వనితల కన్న వీరియందు విశేషణవిశేషమున గుర్తింపదగిన విశేషము లింకను గలవు. రాజ్యానురక్తలు రాజభక్తలు. వివిధము లయిన కార్యనియోగములందు నియుక్త లగుదురు. అన్నివిధముల నన్నిపార్శ్వముల సముత్థితలై శ్రద్ధావిశ్వాసములతో నియతకార్య మాచరింతురు. వీరు ధ్వటలుకారు, సంభ్రాంతలు కారు. లుబ్ధలు కారు. నిష్ఠురలు కారు. దాంతలు, శాంతలు, ప్రసన్నలు, జితక్రోధలు, జితేంద్రియలు. అకామలు. అకామ్యలు. పరునకు కామింప సాధ్యపడరు. కామార్హలు కారు. కామశక్యలు కారు. ఎవరేని యెందులకేని కామించినను, వీరట్టివారు కారు. అట్లు కానీయరు. స్త్రీదోషములు వీరిలో నుండవు. ఆయుక్తిక బింతటివారు. రాజభవనము లందు రాజాంతఃపురసంచారమునందు నిట్టివారి నాయోజనము చేయదగును. ఏవంవిధ లందరు నియోక్తలు నియమించిన నియోగినులు.

అంతఃపురపరివారమున వర్షవరు లనదగిన నపుంసకులుందురు. వీరు పదునెనిమిదవవర్గము. స్త్రీలకు ప్రేషణకార్యములం దిట్టివారుండవలెను. పుట్టినదాదిగా పెరిగిన కేశములుండుట వీరి చిహ్నముగా నుండును. కుమారీరక్షణమున బాలికారక్షణమున వర్షవరుల నియమనమె సముచితము. వర్షవరులు పురుషులు కారు స్త్రీలును కారు.

తెలిసియు స్త్రీలీలాధారణ మిష్టపడుదురు. వర్షవరులు కాంచుకీయు లగుదురు.

౨౨౯. వినీతాః స్వల్పసత్వాయే క్లీబా వై స్త్రీస్వభావికాః
జాత్యా న దోషిణశ్చైవ తే వై వర్షవరాః స్మృతాః

వర్షవరులు వినీతులు స్వల్పసత్వులు నిరింద్రియులు స్త్రీస్వభావమున నుందురు. తజ్జాతిసహజముగనే కామదోషము వీరిలో నుండదు. ప్రభువులభవనములందు వీరి నియమన మావశ్యకము. వీరు సర్వవృత్తాంతసంవాహకులు. అంతఃపురాధికారములం దుందురు. రాజుల చర్యానువర్తులై యుందురు. కార్యనియుక్తులు కాదగినవారు.

౨౩౦ బ్రాహ్మణాః కుశలా వృద్ధాః కామదోషవివర్జితాః
ప్రయోజనేషు దేవీనాం ప్రయోక్తవ్యా నృపైస్సదా

దేవీప్రయోజనములందు వృద్ధబ్రాహ్మణులను రాజులు నియమింపవలెను. ఆ బ్రాహ్మణులు కుశలురు కామదోషరహితులుగా నుండవలెను. జ్ఞానవిజ్ఞానసంపన్నులు కావలెను. ఈ పరివారమంతయు రాజులకు సంబంధించిన యంతఃపురజనము. ఈ యనంతరము బాహ్యపరివారకథన మవసరప్రాప్తి మగుచున్నది.

బాహ్యపరివారము

౧. యువరాజు ౨. సేనాపతి 3 పురోహితుడు
౪. మంత్రులు ౫. సచివులు ౬. ప్రాడ్వివాకులు
౭. కుమారాధికృతులు

వీరందరు నృపాలునకు మాన్యులు ఉండదగినవారు. వీరివిశేషము వీరి లక్షణ మిక తెలియుట యుచితము. ఇట రాజు యువరాజు వాని లక్షణమిట్లున్నది.

౨౩౧. బలవాన్ బుద్ధిసంపన్నః సత్యవాదీ జితేంద్రియః
దక్షః ప్రగల్భో ధృతిమాన్ విక్రాంతో మతిమాన్ శుచిః
౨౩౨. దీర్ఘదర్శీ మహోత్సాహః కృతజ్ఞః ప్రియవాక్ మృదుః
లోకపాల వ్రతధరః కర్మమార్గ విశారదః
౨౩౩. ఉత్థితశ్చాప్రమత్తశ్చ వృద్ధసేవ్యర్థశాస్త్రవిత్
పరభావేంగితాభిజ్ఞః శూరో రక్షాసమన్వితః

౨౩౪. ఊహాపోహవిచారీ చ నానాశిల్పప్రయోజకః
నీతిశాస్త్రార్థకుశలః తథా చైవామరాగవాన్
౨౩౫. ధర్మజ్ఞోఽవ్యసనీ చైవ గుణైరేతైర్భవేన్నృపః

బలసంపన్నుడు బుద్ధిసంపన్నుడు సత్యవాది జితేంద్రియుడు దక్షుడు ప్రగల్భుడు ధృతిమతులు కలవాడు శుచి దీర్ఘదర్శి మహోత్సాహుడు కృతజ్ఞుడు ప్రియవాక్కు మృదుప్రకృతి. లోకపాలుర వ్రతము ధరించువాడు. కర్మమార్గమున విశారదుడు. నిత్యోత్థితుడు. అప్రమత్తుడు. వృద్ధసేవి. అర్థశాస్త్రవిదుడు. పరులభావముల నింగితములను గుర్తింపగలవాడు. శూరుడు. రహస్యసమన్వితుడు. కార్యమూహింపగలడు. విరుద్ధ మపోహింపగలడు. తద్విచార చతురుడు. నానాశిల్పప్రయోజకుడు. నీతిశాస్త్రార్థములందు కుశలుడు. ప్రజలందను రాగము కలవాడు. ప్రజానురాగి ప్రభువు నందు ప్రయత్నము లేకుండగనె ప్రజ లనురక్తు లగుదురు. "అనురాగో హి సార్వగుణ్యాం" యని కౌటిల్యు డనెను. సర్వగుణములు కలిగి యున్నపుడు ప్రజానురాగ మయత్న లభ్యమె యగును. ఇట్టి వాడీతడు ధర్మజ్ఞుడు. వ్యసనరహితుడు. ఇట్లు ముప్పది గుణములు కలవాడు యువరాజగును.

## ౨. సేనాపతి

౨౩౬. బుద్ధిమాన్నీతిసంపన్నస్త్యక్తాలస్యః ప్రియంవదః
పరరంధ్ర విధిజ్ఞశ్చ యాత్రాకాలవిశేషవిత్
౨౩౭. అర్థశాస్త్రార్థ కుశలః అనురక్తః కులోద్భవః
దేశవిత్కాలవిచ్చైవ కర్తవ్యః క్షితిపైస్సదా

బుద్ధినీతిసంపన్నుడు. అలసత్వము లేనివాడు ప్రియంవదుడు. పరరంధ్రవిధిజ్ఞుడు. దండయాత్ర లొనరించుటకు తగిన కాలవిశేషము గుర్తింపగలడు. అర్థశాస్త్రార్థకుశలుడు. అర్థశాస్త్రార్థము గుర్తించుటకేకవాక్యధర్మములు తెలియవలెను. తాత్పర్యము భావింపవలెను. అప్పుడు తదర్థము సుగమ మగును. రాజానురక్తుడు. సత్కులోద్భవుడు. దేశకాలవిదుడునగువాడు సేనాపతి కాదగును. స్త్రీ-మద్య-మృగయాక్షాది వ్యసనములం దసక్తుడై యవ్యసనియై యుండుటయు ముఖ్యము. సేనాపతి దేశజుడును కావలయును.

## ౩. పురోహితుడు మంత్రి.

౨౩౮. కులీనా బుద్ధిసంపన్నా నానాశాస్త్రవిపశ్చితః
స్నిగ్ధాః పరైరహార్యాశ్చ న ప్రమత్తాశ్చ దేశజాః

౨౩౯. అలుబ్ధాశ్చ వినీతాశ్చ శుచయో ధార్మికాస్తథా
పురోధోమంత్రిణస్త్వేభిః గుణైర్యుక్తా భవంతి హి

పురోహితులకు మంత్రులకు లక్షణము సమానముగ నున్నది. మంత్రిపదవులందు పురోహితులకును స్థానమున్నదని స్పష్టమగుచున్నది. వీరు సత్కులసంజాతులు సుబుద్ధిసంపన్నులు నానాశాస్త్రములందు పాండిత్యముకలవారునై యుందురు. స్నేహరాగము లంతట ప్రదర్శింతురు. శత్రువు లే యుక్తిబలమునగాని వీరిని స్వవశులను జేసికొన జాలరు. ఇతరులకు వీరెట్లును లొంగరు. అభేద్యులు. వీరు ప్రమత్తులు కారు. లుబ్ధులు కారు. దేశసంజాతులు. వినయోపేతులు. శుచి స్వభావులు. ధార్మికులు. పురోధోమంత్రు లీవిధముగ నుందురు. రాజిట్టి వారిని నియమింపదగును.

౫. సచివులు.

౨౪౦. దక్షాః ప్రియంవదా భక్తాః శుచయః శ్రమవర్జితాః
వినీతాః కుశలాః దాంతాః ప్రభవః సచివాః స్మృతాః

సచివులు కార్యసచివులు. సాహాయ్యకరణదక్షులు. రాజకీయ మంత్రణమున నుపయోగింతురు. వీరు దక్షులు ప్రియంవదులు భక్తులు శుచివ్రతులు శ్రమవర్జితులు వినీతులు కుశలురు దాంతులు సమర్థులు, సచివు లిట్లుండవలెను.

౬. ప్రాడ్వివాకులు.

౨౪౧. వ్యవహారార్థతత్త్వజ్ఞా బుద్ధిమంతో బహుశ్రుతాః
మధ్యస్థా ధార్మికా ధీరాః కార్యాకార్యవివేకినః
౨౪౨. క్షాంతా దాంతా జితక్రోధాః సర్వత్ర సమదర్శినః
ఈదృశాః ప్రాడ్వివాకాస్తు ధర్మాసనే ద్విజాః

అధికరణమండపమున సభ్యాఢ్యులై ధర్మాసనసముపవిష్టులై ప్రాడ్వివాకులు న్యాయనిర్ణయ మొనరింతురు. నయవినిశ్చయము తెలియజెపుదురు, "ప్రాడ్వివాకో రాజస్థానీయః" యని లోకప్రసిద్ధి. ప్రాడ్వివాకపదవ్యుత్పత్తి యిట్లుండును.

"పృచ్ఛతి వివాదపదే నిర్ణయమితి ప్రాయో వివదితారః.
తేషాం వివేక ఉచ్యతే యైస్తైః ప్రాడ్వివాకః"

పృచ్ఛేః క్విబచీతి క్విపి దీర్ఘే ప్రాడితి రూపంని
పూర్వస్య బ్రూ తేర్ఘఞి వివాక ఇతి–”

నిర్ణయప్రమాణమున వివాదపడువారె సామాన్యముగ లోకమున నుందురు. వివాదపదమున నిర్ణయ మభ్యర్థించిన వారల కుద్బోధింప సమర్థుడు ప్రాడ్వివాకుడె. క్విప్ ప్రత్యయాంతమయిన పృచ్ఛి” ధాతువునకు దీర్ఘము రాగా “ప్రాడ్” అని రూప మేర్పడును. ‘వి’ పూర్వకమయిన బ్రూ॒తికి ఘఞ్ ప్రత్యయము రాగా వివాక పద మేర్పడును. ఇదిప్రాడ్వివాకనిష్పత్తి. ప్రాడ్వివాకులు వ్యవహారార్థతత్వజ్ఞులు బుద్ధిమంతులు. బహుశ్రుతులు. వేదవేదాంగవిదులు. పురాణేతిహాసజ్ఞులు. పురుషార్థశాస్త్రవిచక్షణులు. వాగ్మిలు. మధ్యస్థులు. వాదవివాదములం దేకపక్షము వహింపరు. ధార్మికులు ధీరులు కార్యాకార్యవివేకులు శాంతి దాంతి కలవారు జితక్రోధులు సర్వత్ర సమదర్శులు. బ్రాహ్మణులునగు ప్రాడ్వివాకులను రాజు ధర్మాసనమున నుంచదగును. అర్థశాస్త్రవిధివిధానముల దెలియుట జ్ఞానము. వీరలకు జ్ఞానముండును. తదధిష్ఠానకౌశల మనుష్ఠానకౌశలము విజ్ఞానము. అదియు వీరలకుండును. ప్రాడ్వివాకులు లక్ష్యలక్షణవిదులు. వీరి నిర్ణయము ధర్మానుసారి.

## ౭. కుమారాధికృతులు

౨౪౩. ఉత్థితాశ్చ ప్రమత్తాశ్చ త్యక్తాలస్యా జితశ్రమాః
స్నిగ్ధాః శాంతా వినీతాశ్చ మధ్యస్థా నిపుణాస్తథా
౨౪౪ నయజ్ఞా వినయజ్ఞాశ్చ ఊహాపోహ విచక్షణాః
సర్వశాస్త్రార్థ సంపన్నాః కుమారాధి కృతాస్తథా

కుమారాధికృతులు రాజపుత్రుల రక్షార్థమైయధికృతులగువారు నిత్య ముద్యమోత్థానముతో నుందురు. అప్రమత్తులుగా నుందురు. అలసత్వము పొందరు. జితశ్రములు స్నిగ్ధులు శాంతులు వినీతులు మధ్యస్థులు నిపుణులునై యుందురు. వీరు నయవినయజ్ఞులు. నయహేతువగుట అర్థశాస్త్రము నయము. ఇచట వినయము ధర్మశాస్త్రము వీరూహాపోహావిచక్షణులై సర్వశాస్త్రార్థసంపన్నులై యుందురు. కుమారాధికృతు లగువారు మంత్రిలక్షణోపేతులై మంత్రులు కాదగి యుందురు.

౨౪౩. బృహస్పతి మతోదేషాం గుణాంశ్చాభి కాంక్షయేత్
విజ్ఞేయం చోపహార్యం చ సభ్యానాం చ వికల్పనం

ఇంతవరకు నీ యువరాజాదుల స్వరూపము సంక్షేపముగా నిరూపిత మయినది. వీరి లక్షణస్వరూపవిశేషములు తత్తత్ప్రధానము లయిన శాస్త్రములందు విస్తృతముగా నున్నవి. బృహస్పతి యాశన సుడు మొదలగు వారి ముఖ్యగ్రంథముల నుండి వాని నవధరింప దగును. వీరి వీరి గుణముల నట్లె తెలియవలయును. యువరాజాది కుమారాధికృతపర్యంత మున్న వీరు తెలియదగినవి కలవు. వీరు పరిహా రింపదగినదియు కలదు. అదియంతయు నాకరములందు స్పష్టము. ఈ సభ్యు లెందరుండవలెనో కూడ తన్మతమున దెలియుటయె సముచి తము. ప్రజలను మాత్స్యన్యాయమున రక్షించునట్టి యధికారము రాజునకుగలదు. చిన్నచేపను పెద్దచేప మ్రింగును. దానిని వేరొకటి మ్రింగును. ఇట్లు మత్స్యము లందున్న యీ వ్యవహారము మాత్స్య వ్యవహారము. జాలరులు చిన్నచేప నెఱపెట్టి పెద్దచేపను బట్టుదురు ఇదేవిధముగ లోకపాలనతంత్ర ముండును. సబలులు దుర్బలులపై నధి కారము వహింతురు. అప్పుడు "దుర్బలస్య బలం రాజా" మాత్స్యన్యాయ స్వరూపవిస్తరణము నా గ్రంథములు విశదముగ వర్ణించినవి. ఈ విధానము వివాదాస్పద మయినప్పుడు నిర్ణయమున ప్రాడ్వివాకుడె ప్రధానుడు. అందుననె యీతడు రాజువంటివాడు. ఇప్పటి కిట్లు రాజోపయోగి యని బాహ్యాభ్యంతరపరివార నిర్ణయము నిరూపిత మయినది.

పాలకప్రభువుల యుపచార విధుల నన్నిటిని భావించి సంస్కృ తజ్ఞులయిన నాట్యవిదులగు కవులు తమ నాట్యరూపకములం దీ విశేష ముల నన్నిటిని సావధానముగ నిరూపించినారు. అంతఃపురపరివారము వారి పరిభాషావినిశ్చయములు సంస్కృతనాటకములందు విశదముగ గోచర మగుచున్నవి. వీని యర్థసంకేతములను గుర్తించి నాట్య సమీక్ష యొనర్చుట భావరసచర్వణమున నుపయోగి యగును. ప్రకృతి నిబంధనమున నేయే వ్యక్తి యెట్లెట్లు స్వస్వరూపప్రచ్యుతి పొందదో గుర్తించుటయు సహృదభావకుల కావశ్యక మగుచున్నది.

## చిత్రాభినయము

"వాగంగసత్త్వచేష్టాచిత్రాభినయప్రయోగరచనచణః
సంసారనాట్యనాయకపురుషాకారః శివో జయతి"

శివుడు సంసారనాట్యనాయకుడు వాగంగసత్త్వచేష్టావిశేషములచే చిత్రాభినయప్రయోగరచనమున సమర్థుడు. అట్టి శివసంపత్తి భావన మీ చిత్రాభినయసంభావనమునకు సముల్లాసము కలుగజేయగలదు. చిత్రాభినయము సామాన్యాభినయమునకు శేషరూపము. సామాన్యాభినయమునందె చిత్రాభినయమును సంగతమై యున్నది. అయినను చిత్రాభినయమును పృథక్కరించి చెప్పుట యిచటి భావము. పరస్పరసంలీనాత్మక మయిన తత్త్వమఖండముగా గుర్తించు వివేకశీలురును స్వరూపాఖ్యానసమయమున స్పష్టతాప్రతిపత్తికై విశకలితరీతి నభిమానింతురు. సామాన్యాభినయనిరూపణప్రఘట్టమున నభినయములకు సమానీకరణ ముండును. అభినయముల కన్నిటికి రసాత్మకత ప్రధాన మయినందున నట్టి పదార్థవిశేషమె సామాన్యాభినయ సమానీకరణస్వరూపములో గోచరించును. ఈ చిత్రాభినయప్రఘట్టము నందభినయముల కుపయోగించు విభావాదిప్రదర్శన ముండును. అది రసాత్మకము కాగా నిది విభావాదివిషయముగా నుండును. ఇతి కర్తవ్యతారూపమున నుండునవి ప్రధానస్వరూపసంపాదకము లగుట మీమాంసాసమ్మతము. రసమీమాంస యందును విభావాదు లితి కర్తవ్యతారూపములై ప్రధానీభూతరససముల్లాసహేతువు లగును. ఈ చిత్రాభినయము సామాన్యాభినయ సంపూర్ణతా ప్రోల్లాసమునకు సహకారి.

చిత్రాభినయ భావావిష్కరణ ప్రసక్తిలో నీ భావమును ధారణ యోగ్యము. పూర్వము నిరూపించిన యే యొక యభినయ మయినను కార్యాంతర లాభమున తద్విరుద్ధార్థ ముద్బోధింపగలదు. అట్టివిరుద్ధార్థాభినయ మున్నపుడు సామాన్యాభినయమె చిత్రాభినయ మని యనదగినదియగును. ఆ వైదగ్ధ్యమె యిందు నిరూపిత మగును. ఈ భావాభిధానమునకై యీ యారంభము కలదు.

౨౪౬. అంగాద్యభినయస్యైవ యో విశేషః క్వచిత్క్వచిత్
అనుక్త ఉచ్యతే చిత్రః సచిత్రాభినయః స్మృతః

అంగాదుల యభినయమున కే విశేషము నొక్కొకచో నిరూపింతుమో యది చిత్రము కావున చిత్రాభినయ మని ప్రసిద్ధి కలదగును. అంగాద్యభినయపదమున నీ యర్థభావము గుర్తింపవలెను. అంగమని యనుట యుపలక్షణము. అంగములచే నిర్వర్తింపదగు నానావిధములగు కరణములు నానా యగు నంగహారములు నంగపద గ్రాహ్యములు. కరణాంగహారము లభినయము లని యిదివరలో ననలేదు. "రేచకములచే నంగహారములచే శిఖసారసహంసాదుల యభినయము ప్రయోగింపవలయు" నని యనుచోట నిది యనదగియున్నది. అంగాది పదములోని యాది పదమున విభావాదులను గ్రహింపవలెను. కరణము లంగహారములు విభావాదులు నని యంగాదిపదార్థము. విభావమును విభావమున కభినయమని నిరూపిత మగును. అభినయపదమున కిట్లర్థములు కలవు.

౧. అభినీయతేఽనేనేత్యభినయః
౨. అభినీయతే ఇతి చాభినయః

సముద్దిష్ట మయిన యంశ మొకటి సముచితావయవవిన్యాస విశేషమున నభినీత మగును. అభినీయమానమగును. అభినయింపబడును. కావున నభినయమని వ్యవహారము కలిగినదని మొదటి వ్యుత్పత్తి వలన లభించిన యర్థము. అభినయింపబడును గావున నభినయమగునని రెండవ వ్యుత్పత్తి వలన లభించిన యర్థము. సాధనముచే సాధ్యము సిద్ధమగుట సాధ్యమె యభినయమను సంకేతము కలదగుట ప్రథమపక్షము. సాధనాత్మక మగునదియె యభినయమని ద్వితీయ పక్షము. సాధ్యస్వభావక మయిన యభినయము యొక్క విశేషములుత్తమోత్తమాదిరూపములు నిరూపితములు కానున్నవి. సాధనాత్మకమగు నభినయము నందును విశేషము కలదు. అభినయముగా నిరూపితమగు నట్టిదియు నిచట నభినయాంతరమునకు సంబంధించిన యభినయముగా నుండగలదు. అలపద్మకపీడలచే సర్వార్థగ్రహణమనుటలో నీ యంశ మవభాసించును. అంగాభినయపద మిందు

సమాహారమున సమసించిన దనవచ్చును. కరణాంగహారాభినయముల సమాహారస్వరూపమని యర్థము. అట్టిదాని విశేషమిందు నిరూపింతు మని సంబంధార్థమును గ్రహించునది. ఆ విశేష మొక్కొకచో నిరూపితమమగునె కాని యంతట నిరూపితముకాదు. అంతట నిరూపింపవలసిన యవసరము లేదు. ఒక్కొకచో నట్టి విశేష మున్నను నిరూప్యమాణాభినయవిశేషముతో నభిన్నమె యగునేని దాని జెప్ప వలసిన యవసరము లేదు. అట్టిపట్ల నది యనుక్తము. ఒక్కొకచో నట్టివిశేషము నిరూపితమె యయినది. ఉక్తానుక్తవిశేషముల కన్న నధికమగు విశేషమె యిందు చిత్రమగు నభినయము. చిత్రాభినయ మును సంపాదించు నదియు నుపచారవశమున చిత్రాభినయ మగును. అట్టి చిత్రాభినయ మిందు నిరూపితమగునని మహాతాత్పర్యము.

ప్రభాతగగన ప్రదోషాదు లన్నియు సర్వసాధారణము లయినను తద్విషయ మయిన యభినయము సముచిత సహకారియోగమున చిత్రత కలదై చిత్రాభినయ మగుట ప్రదర్శింప దగియున్నది.

౨౪౩. ఉత్తానౌ తు కరౌ కృత్వా స్వస్తికౌ పార్శ్వ సంస్థితౌ
ఉద్వాహితేన శిరసా తథా చోర్ధ్వ నిరీక్షణాత్
౨౪౪. ప్రభాతం గగనం రాత్రిః ప్రదోషం దివసం తథా
ఋతూన్ ఘనాన్ వనాంతాంశ్చ విస్తీర్ణాంశ్చ జలాశయాన్
౪౫. దిశో గ్రహా నక్షత్రాణ కించిత్స్వస్థం చ యద్భవేత్
తస్య త్వభినయః కార్యో నానాదృష్టి సమన్వితః

కరణముల యుత్తానకరణమున స్వస్తికహస్తములను కూర్చి పార్శ్వసంస్థితములగు నట్లొనరించి యుద్వాహితశిరఃకర్మతో నూర్ధ్వ నిరీక్షణమున నానాదృష్టిసమన్వితముగా ప్రభాతాదుల నభినయింప వలెను. స్వస్తికము సంయుతహస్తములలో నొకటి. హస్తములు సంయుక్తములై యుండుట స్వస్తికమగును. "ఉత్తానౌ వామపార్శ్వస్థౌ స్వస్తికః పరికీర్తితః" యని స్వస్తికరూపము "స్వస్తికౌ పార్శ్వసంస్థితౌ" యనుస్థలమున "పతాకౌ స్వస్తికస్థితౌ" యను పాఠము కలదు. పార్శ్వసంస్థితములయిన స్వస్తికహస్తవిధానమున నభినయింపవలెను. దీనిలో చిత్రతాసంపాదకము లయిన విశేషములు ;

౧ కరము లుత్తానములగుట

౨ పార్శ్వసంస్థితము లగుట

౩ శిర ముద్వాహిత మగుట

౪ దృష్టి యూర్ధ్వమున కుండుట

ఇట్టి విశేషముల నంతట గుర్తించునది. స్వస్తికలక్షణమున నీ యంశము కలదు.

౨౫౦. స్వస్తికవిచ్యుతికరణాద్దిశో ఘనాః ఖం వనం సముద్రాశ్చ
ఋతవో మహీతలోచ్చంవిస్తీర్ణం చాభినేయం స్యాత్"

ఇందలి యర్థము సవిశేషముగా నిచట నిరూపిత మయినది. ప్రభాతము, గగనము, రాత్రి, ప్రదోషము. దివసము, ఋతువులు, మేఘములు, వనాంతములు, విస్తృతము లయిన జలాశయములు, దిశలు, గ్రహములు, నక్షత్రములు, స్వస్థముగా నుండునవి, దివ్యార్థములు వీనిని నానాదృష్టి సమన్వితముగా నభినయింప వలెను. ఇందు నానాదృష్టిసమన్విత మనుట సాభిప్రాయము. ఒకప్పుడు విస్మితము మరియొకప్పుడు మరియొకటి యను విధమున నానాదృష్టులతో నభినయించుట యిందలి విశేషము.

ఊర్ధ్వగతము తద్విరుద్ధ మగు నధస్థము నిట్లభినయింపవలెను.

౨౫౧. ఏభిరేవ కరైర్వ్యాయస్తైర్నైవ శిరసా పునః
అధోనిరీక్షణేనాథ భూమిస్థాని సంప్రదర్శయేత్

౨౫౨. స్పర్శస్య గ్రహణేనైవ తథోల్లుకనేన చ
చంద్రజ్యోత్స్నాం సుఖం వాయుం రసం గంధంచ నిర్దిశేత్

౨౫౩. వస్త్రావగుంఠనాత్సూర్యం రజోధూమానిలాంస్తథా
భూమితాపమథోష్ణం చ కుర్యాచ్ఛాయాభిలాషతః

౨౫౪. ఊర్ధ్వాకేకర దృష్టిస్తు మధ్యాహ్నే సూర్యమాదిశేత్
ఉదయాస్తగతంచైవ విస్మయార్థైః ప్రదర్శయేత్

ఈ నిరూపించిన కరములనె యిందు నుపయోగింపజనును. ఉత్తానకరములు స్వస్తికములు పార్శ్వసంస్థితములగు కరములతో నుద్వాహితశిరముతో నధోనిరీక్షణముతో భూమిస్థము లగువానిని ప్రదర్శింప వలెను. ఆకాశము నందున్న మృగాంకాది పదార్థముల

నెట్లభినయింపవలెనో నిరూపించుటకే స్పర్శగ్రహణాదికము చెప్పుట. స్పర్శను శరీరమునకు సంబంధించిన విధమున గ్రహించుటచే నుల్లుక సనవిధానముచే నాకాశగతము లయిన చంద్రజ్యోత్స్నను సుఖమును వాయువును రసమును గంధమును నిర్దేశింపవలెను. స్పర్శగ్రహణ యోగ్యములను గండగ్రహణయోగ్యములను నింకనితర గ్రహణ యోగ్యములను తత్తదుచితముగా నిర్దేశించుట సముచితమని గ్రహింప వలెను. నేత్రముల నాకుంచనము కూర్చుకొని, భ్రూక్షేప మాచరించి యంసములను గండస్థలములను స్పృశించి చంద్రజ్యోత్స్నాదుల నభినయింపవచ్చును. ఉల్లుకసనము = గూబవలె పై భాగమునకు విదల్చుట. "ఉలూకవదంసనా యస్యోర్ధ్వం విధూననం." కొంచె మూర్ధ్వముఖమగునట్లు శిరమెత్తి యులూకము వలె విధూనన మొనరించుట యుల్లుకసనము. వస్త్రావగుంఠన మొనరించుకొనుటచే సూర్యుని రజోధూమానిలానలములను నిర్దేశింపవలెను. నీడను గోరుచున్నట్లభినయించుచు భూమితాపము నుష్ణమునుసూచింప వచ్చును. ఊర్ధ్వానేకకరదృష్టి ప్రసారమున మధ్యాహ్న సూర్యుని నిర్దేశింపజనును. ఉదయగతసూర్యుని అస్తంగతసూర్యుని విస్మయార్థ విశేషములచే నభినయించి ప్రదర్శింపవలెను. విస్మయాభినయముల యందు స్మయమే యభినయ ప్రయోజనముగా నుండునట్లు పరి శీలింపవలెను. స్మయమభినయార్థ మగుటయె యిందు ముఖ్యాంశము.

సర్వగ్రాహకమయిన లక్షణ మీవిధముగ నున్నది.

౨౫౫. యాని సౌమ్యార్థయుక్తాని సుఖభావకృతాని చ
గాత్రస్పర్శైస్సరోమాంచైస్తేషామభినయో భవేత్
౨౫౬. యాని స్యుస్తీక్ష్ణరూపాణి తాని చాభినయేత్సుధీః
అసంస్పర్శైస్తథోద్వేగైస్తథా, ముఖవికుంచనైః
౨౫౭. గంభీరోదాత్తసంయుక్తా నర్థానభినయేద్బుధః
సాటోపైశ్చ సగర్వైశ్చ గాత్రైః సౌష్ఠవసంయుతైః

సౌమ్యార్థయుక్తములు సుఖభావకృతములగు పదార్థములను సావధానముగా నుపలక్షింపవలెను. కొన్ని పదార్థములకు సౌమ్యభావమే ప్రయోజనము, ప్రసన్నభావసముపేతములగు పదార్థములని భావము.

కొన్ని తీక్ష్ణస్వభావకము లయిన భావములుండును. వాని యభినయము వీని యభినయముకన్న భిన్నము. సౌమ్యప్రసన్న భావముతో నుండుటను సుఖభావకృతమను పదము వ్యాఖ్యానించును. సుఖప్రధానమగు భావమున కొన్నిపదార్థములకు స్వరూపసంపత్తి కలుగును. సుఖప్రధాన భావములు సౌమ్యార్థయుక్తము లగుట సంగతము. తీక్ష్ణరూపములు సుఖభావకృతములు కావు. సోముని వలె సౌమ్యసుఖమున కగునవి యాహ్లాదకరములు. రోమాంచసహితము లయిన గాత్రసంస్పర్శములచే నట్టివాని యభినయముండును. తీక్ష్ణరూపములగు పదార్థములను ముఖవికుంఠనములచే నభినయింపదగును. ఉద్వేగసహితము లయిన యసంస్పర్శనములచే వాని నభినయింపవలెను. వికుంఠన మనునది సంకోచనము. ముఖసంకోచనము వలన నసుఖాస్పదములగు తీక్ష్ణపదార్థముల యభినయము సంగతమగును. గంభీరములు నుదాత్తములు నగు భావములను గర్వాటోపసౌష్ఠవము కల గాత్రములచే నభినయింపవలెను. గంభీరోదాత్తసంయుక్తపదము భావప్రధానమగు నిర్దేశమున నున్నది. గాంభీర్యముతో నౌదాత్త్యముతో సంయుక్తములని యర్థము లభించును. నే నింతటి వాడనని యాత్మనిర్దేశ మొనరించుటలో నుదాత్తమయిన ప్రసంగములో రాజోచితములయిన గర్వాటోపములందును గంభీరోదాత్తభావయుక్తములగు వాని యభినయము స్పష్టమగును.

౨౧౮. యజ్ఞోపవీతదేశస్థమరాలం హస్తమాదిశేత్
స్వస్తికౌ విచ్యుతౌ హారస్రగ్దామార్థాన్ నిదర్శయేత్
౨౧౯. భ్రమణేన ప్రదేశిన్యా దృష్టేః పరిగమేన చ
అలపద్మకపీడాయాః సద్వ్యస్త్రగ్రహణం భవేత్

అరాలహస్తమును యజ్ఞోపవీతదేశమున నుండునట్లొనరించి స్వస్తికహస్తములను విచ్యుతములుగా నుండునట్లుచేసి హారస్రగ్దామార్థములను ప్రదర్శింపవలెను. సామాన్యముగా హారాదులు సమానార్థములు. అయినను ముక్తాహారము పుష్పమాల మణిమాల మొదలయిన వానిని యథోచితముగా గుర్తింపవచ్చును. అరాలహస్తము నంసభాగమునుండి సారించుటచే హారాదులు సూచితములు కాగలవు. స్వస్తికహస్తముల నస్తవ్యస్తమొనరింపగా హారాదుల యభినయ మవభాసింపగలదు. ప్రదేశినీభ్రమణముచే దృష్టిపరిగమనముచే నలపద్మ

పీడ యొక్క సర్వార్థగ్రహణము సంభవించును. ఇందలపద్మకపీడ ముచే హస్తమునకు సంబంధించిన యంగుళులను గుర్తించునది. వాని 'పీడ' యనునది కరతలమున నా యంగుళుల సంయోగము, ఒకవిధ ముగా గుప్పిటపట్టుట యనిభావము. ఇట్లు పిడికిలి పట్లనేకవిధముల నుండవచ్చును. కావున అలపల్లవ స్వరూపమును గుర్తించుకొని తద్విధానానుసారమున కరాంగుళులను హస్తతలమున సంబంధింప జేయవలసి యుండును. ప్రదేశభ్రమణము దృష్టిపరిగమనములు నిర్దే శింపగా నభినయమునం దభినయాంతరసూచనమును అలపద్మకపీడా పదమున సూచిత మగును. ఇచట నిట్టివిధానము అలపద్మకసర్వార్థ మును గ్రహించునది యగుననుట సాభిప్రాయము. పూర్వమలపద్మ మున కిట్టిరూపము నిర్దిష్టము కాలేదు. ఈ చిత్రాభినయమునందే యది సంకేతిత మగుచున్నది

సర్వశబ్దము నిఖిలార్థమునందు వ్యవహృతమగును. ఇందు విశేష సహకారులను సంకేతించి నిరూపించుట యావశ్యకము.

౨౬౦. శ్రవ్యం శ్రవణయోగేన దృశ్యం దృష్టివిలోకనైః
ఆత్మస్థం పరసంస్థం వా మధ్యస్థం వా వినిర్దిశేత్
౨౬౧. విద్యుదుల్కా మనరవా విస్ఫులింగార్చిష స్తథా
త్రస్తాంగాక్షినిమేషైశ్చ తేఽభినేయాః ప్రయోక్తృభిః
౨౬౨. ఉద్వేష్టితపరావృత్తౌ కరౌ కృత్వా నతం శిరః
అసంస్పర్శే తథానిష్టే జిహ్మదృష్టేన కారయేత్
౨౬౩. వాయుముష్ణం తమస్తేజో ముఖ ప్రచ్ఛాదనేన చ
రేణుతోయపతంగాంశ్చ భ్రమరాంశ్చ నివారయేత్

శ్రవ్యము శ్రవణయోగమునను దృశ్యమును దృష్టివిలోకనము లతో నభినయించి ప్రదర్శించుట యుక్తము. శ్రవ్యము దృశ్యము మూడువిధముల నుండును.

౧ ఆత్మస్థ శ్రవ్యము దృశ్యము
౨ పరసంస్థ శ్రవ్యము దృశ్యము
3 మధ్యస్థ శ్రవ్యము దృశ్యము

సాచీకృతమగు దృష్టి నవలంబించి శిరమును పార్శ్వానత మొనరించి వినుట నభినయించినచో నది శ్రవణయోగ మగును. అట్టిశ్రవణ

యోగసహితముగ శబ్దవిషయమయిన సర్వాభినయమును ప్రయోగింపవలెను. విద్యుదాదుల విషయమున నిరూపితము లయిన యభినయములన్నియు శ్రవణయోగసహితశబ్ద విషయములై ప్రదర్శనరమ్యము లగును. శ్రవ్యము శ్రవణయోగమున నని యనుటచే దృశ్యము దర్శనయోగమున నను నర్థమును లభించును. దర్శనయోగము ననుసరించిన దృష్టి విలోకనములచే దృశ్యనిర్దేశము రమ్యముగ నుండును. ఆత్మస్థమయిన శ్రవ్యముగాని దృశ్యముగాని పరసంస్థమయిన శ్రవ్యముగాని దృశ్యముగాని మధ్యస్థమయిన దృశ్యముగాని శ్రవ్యముగాని పై విధమున నిర్దేశింప వలెననుట ఇట్టి నిర్దేశమున సర్వార్థగ్రహణసామ్యమున సర్వశబ్దగ్రహణము సర్వదృశ్యగ్రహణము సంగృహీత మగును. విద్యుదభినయనిర్దేశమున విరలాంగులి సూచీహస్త ముపయోగింపవలెనని తటిల్లతాచక్రనిర్దేశమున వేరొకవిధమున నిర్దేశింపవలెనని సూచితములయిన వాని కింద కొన్ని విశేషములు కలవు. ప్రయోగకౌశలము కల ప్రయోక్తలు త్రస్తాంగములతో నేత్రనిమేషములతో విద్యుత్ - ఉల్కాపాతము - మేఘగర్జనము - విస్ఫులింగము - జ్వాల యనువానినభినయింపవలెను. త్రాసాక్షి నిమేషము లుండుటయె యిందలి విశేషము. ఆవిశేషమె చిత్రత నాపాదించును. త్రాసాభినయము ప్రసిద్ధమె అంగసంకోచము నేత్రనిమేషము విద్యుదాద్యభినయమున సుందరముగ నుండును. విద్యుదాదివ్యంగ్యమగు నభినయమును కలదు. అదియే యుద్వేష్టితపరావృత్త కరవిన్యాసమున స్పష్ట మగును. కరములను పరావృత్తములొనర్చి యుద్వేష్టితముల జేయవలెను. అటుకరమునిటు నిటుకరము నటు నుంచుట పరావృత్తవిధి. వాని నుద్వేష్టింపజేయుట పరావృత్తములుగ నున్నవాని నొకదానిచుట్టు మరియొకటి మెలిదిరుగునట్లు చేయుట. ఆయుద్వేష్టనము సమంతాదుద్వేష్టనముకావలెను. క్రమముగా కనీయసిని విడుచుట శిష్టాంగులను పట్టుటయు నిందున్నది. మొదట ముష్టిగాబట్టి పశ్చాద్భాగమున పరాఙ్ముఖమగునట్లు చేయుట యుండావశ్యకము. అసంస్పర్శము నందలి యభినయమును అనిష్టరూపమయినదాని యభినయమును జిహ్మదృష్టిచే నాచరింపవలెను. జిహ్మదృష్టి వక్రదృష్టి కనుపుటములు కుంచితములగుట తిర్యగ్విలోకన

ముండుట, తారలు నిగూఢముగా నుండుట జిహ్మదృష్టి యగును. వస్త్రాంచలముచే ముఖము ప్రచ్ఛాదనముచేసికొని, అథవా; కరతలములచే ముఖము గప్పికొని వాయువు నుష్ణమును తమమును తేజమును ధూళిని, జలమును పతంగములను భ్రమరములను నివారణ మొనరించుట నభినయింపవలెను. ఊర్ణనాభము (సాలీడు) తన హస్తములచే ముఖమును గప్పికొని యితరములను నివారించుననట్లు ప్రయోగనిపుణుడు ముఖప్రచ్ఛాదనమున వాయ్వాదులనివారణ మభినయించునది. శాకుంతలమునందు శకుంతల భ్రమరబాధాభినయసందర్భమున నిట్టి విశేషముల సంభావింపవచ్చును. శ్రవణవిధి, దృష్టివిలోకనము, అక్షినిమీలనము, జిహ్మదృష్టి, ముఖప్రచ్ఛాదనము అనునవి యిందు చిత్రతనాపాదించినవి.

ఇంక నిందలి విశేషము లిట్లున్నవి.

౨౬౪. కృత్వా స్వస్తిక సంస్థానౌ పద్మకోశా వధోముఖౌ
సింహర్క్షవానరవ్యాఘ్రశ్వాపదాంశ్చ నిరూపయేత్

పద్మకోశమను హస్తమునకు సంబంధించిన విశేష మిందున్నది. పద్మకోశహస్తములను స్వస్తికముగానుంచి సింహమును ఎలుగును వానరమును వ్యాఘ్రమును శ్వాపదమును నిరూపింపవలెను. పద్మకోశహస్తాంగుళులు కుంచితము లగుట యుక్తము. ఇది పద్మకోశమున కనుక్తకర్మ. ఇట్టి విశేషము లన్నిట నుండును.

త్రిపతాకమున కనుక్తకర్మ యిట్లున్నది.

౨౬౫. స్వస్తికౌ త్రిపతాకౌ తు గురూణాం పాదవందనే
ఖటకస్వస్తికౌ చాపి ప్రతోదగ్రహణే స్మృతౌ

గురువుల పాదాభివందన ప్రసక్తిలో స్వస్తిక హస్తములను త్రిపతాకాహస్తముల నుపయోగించునది. ప్రతోదగ్రహణ సమయమున ఖటకాముఖహస్త ముపకారి స్వస్తికహస్తమును సహకారి యన్నాన శరాపకర్షణ పుష్పాపచయప్రతోద కార్యములలో ఖటకాముఖ ముండుట పూర్వనిరూపిత మయినను ప్రతోదకృత్యము (పగ్గములు పట్టుట. రథసారథి కార్యము) నందు ఖటకస్వస్తికము లుండుననుట యిచటి విశేషకర్మ. అనుక్తకర్మలు విశేషకర్మలు కతిపయము లున్నందుననే యిది చిత్రాభినయవ్యవహారము కలదయినది.

ఇక సర్వవిధవ్యవహారములందు నుపయోగించు సంఖ్యాభినయ మును ప్రదర్శింప వలసియున్నది. ఇదివరలో నిరూపితము లయిన హస్తములకే యనుక్త మయిన కర్మదర్శన మిందుండును.

౨౬౬. ఏకం ద్వే త్రీణి చత్వారి పంచ షట్ సప్త చాష్టధా
నవ వా దశ వాపిస్యుర్గణనాంగులిభిర్బుధైః
౨౬౭. దశాఖ్యాశ్చ శతాఖ్యాశ్చ సహస్రాఖ్యా స్తథైవచ
పతాకాభ్యాం తు హస్తాభ్యాం ప్రయోజ్యాస్తాః ప్రయోక్తృభిః
౨౬౮. దశాఖ్యగణనాయాస్తు పరతో యా భవేదిహ
వాక్యార్థేనైవ సాధాऽసౌ పరోక్షాభినయేన చ

ఒకటి రెండు మూడు నాలుగయిదారేడెనిమిది తొమ్మిది పది యనునట్లు వ్రేళుల సూచనమున గణనాభినయ మొనర్పవలెనని సామాన్యముగా నిందలి భావము. ఇందీయంశము నిరూపితము. ఒకటి మొదలయిదు వఱకు సంఖ్యాగణనాభినయము నిట్లు సూచింపవలెను.

౧. సూచీముఖరూపమయిన ప్రదేశినీవిన్యాసమున ఏకసంఖ్యాభినయము సముచితము.

౨. రెండవ సంఖ్యాభినయమునకు సూచీముఖము కూర్చిన యంగుళిద్వయవిన్యాసము యుక్తము కాగలదు.

౩. మూడవ సంఖ్యాభినయమునకు త్రిపతాకాంగులికాప్రదర్శన మావశ్యకము.

౪. ఊర్ధ్వముఖాంగులిచతుష్కవిన్యాసముచే చతుస్సంఖ్యాభినయము యుక్తము.

౫. ముకులహస్తమును వికసింపజేయు విధానమున నేకాదికముగ గణించి పంచసంఖ్యాభినయ మొనర్పవలెను.

షడాదిసంఖ్యాభినయమున గూడ చిత్రత నాపాదించు విధానమును స్వీకరింప వలెను. హస్తద్వయాంగుళివిన్యాసమున నిది సుందరమగును. ముకులహస్తమున సూచ్యాస్య ముపయోగించి షట్సంఖ్య నభినయింపవచ్చును. అట్లె ముకులహస్తమున నంగుళిద్వయాభినయము సప్తసంఖ్యానుకూలము. ఈ విధముగనె దశపర్యంతాభినయము సాధ్యము. పదికి పైవాని పరిగణనమున బహుత్వాభినయమె యుక్తము.

దశాఖ్య శతాఖ్య సహస్రాఖ్యల పరిగణనమున వేరొకవిశేష ముండును. పది పది యని పదులుగా జెప్పదగిన సంఖ్యలు నూరు నూరని నూరులుగా జెప్పదగిన సంఖ్యలు వేయి వేయి యని వేలుగా జెప్పదగిన సంఖ్యలు ఇరువది, రెండునూరులు, మూడువేలు మొదలగు నవి కలవు. అవి దశాఖ్యసంఖ్యలు, శతాఖ్యసంఖ్యలు, సహస్రాఖ్య సంఖ్యలని చెప్పదగి యున్నవి. "దశభిరాఖ్యా యేషాం తే దశాఖ్యాః" అని దశాఖ్యాపదవృత్తి. ఇట్లె శతాఖ్య సహస్రాఖ్యయు. అట్టి వానిని పతాకాహస్తములచే ప్రయోక్తలు ప్రయోగింప వలెను. దశాఖ్యాది పదములం దాఖ్యాపద మవధివాచి. దశాఖ్యగణన కన్న తరువాతి సంఖ్యాగణన మావశ్యకమై యుండునేని దానిని వాక్యార్థమునను పరోక్షాభినయమునను సాధించునది.

"సంఖ్యాయాస్తు దశభ్యస్తు పరతోఽభ్యధికా యదా వాచికేనైవ సాధ్యా"

పదికన్న నధికమగు సంఖ్యను వాచికముగనె నిరూపించవలె నని యిచటి పాఠభేదార్థము సూచించును. వాక్యార్థమునని సూచింప వలయుననుట బహుత్వమాత్రమున సంక్షేపముగా సూచింపవలెనని భావము. "వాక్యార్థశబ్దోఽత్ర సంక్షిప్తముపలక్షయతి పదార్థా హి తత్ర సంక్షిప్యంతే" వాక్యార్థశబ్దము సంక్షిప్తమను భావము సూచిం చును. పదార్థములు వాక్యార్థమున సంక్లిప్తములగును గదా!. ఇట్లు బహుత్వాకారమాత్రమున సంక్షేపాభిధానమనునది పరోక్షాభి నయమునందె యుక్తము. ప్రత్యక్షమునం దయినచో నొక్కొక్కదాని నిర్దేశించుటయే సముచితము.

ఖటకాముఖమునకు సంబంధించిన సామాన్యకర్మయె నిరూపిత మయినది. తద్విశేషమిట ప్రదర్శించుట యుక్తము.

౨౬౯ ఛత్రధ్వజపతాకాశ్చ నిర్దేశ్యా దండధారణాత్
నానాప్రహరణం చాథ నిర్దేశ్యం ధారణాశ్రయం

దండధారణాభినయమున ఛత్రపతాకలను నిర్దేశింపవలెను. దండ ధారణవిధారణ విధానమునందె ధ్వజాది నిర్దేశ మంతర్భూతమై యున్నది. ఆయుతదండాది గ్రహణప్రకారము ధ్వజాదుల నిర్దేశ భేదమును

సూచించును. ధారణాశ్రయ మయిన నానాప్రహరణాభినయమును నిర్దే శింపవచ్చును. ఆ యా ప్రహరణముల ధారణవిధానమున నా యా ప్రహరణముల నిర్దేశము సుకరము. "నానాప్రహరణం చాథ" యను స్థలమున గల "చ" కారము అభినయాంతరములను గూడ సూచింప గలదు. "అధ" శబ్దమును అభినయాంతరములను సూచించును. ప్రయోగం మొనరించు నాతడధోముఖుడై శిరమున నూర్ధ్వముగా ధార ణము చేయుట పంచాంగులి పరికరమున పట్టుట, అంగులి పతాకా ప్రదర్శనమున సూచీముఖీనిర్దేశము సముచితమని యనిపింపగలదు. ముష్టి—శిఖర—కపిత్థ—మృగశీర్ష కాదిహస్తభేదముల నా యా ప్రహరణ నిర్దేశమున నుపయోగించునది.

యోగానుసంధానసమయము నందలి ధ్యానము నభినయించు నప్పుడు ఏకచిత్తతను సూచించు నధోదృష్టి కొంచెముగా నతశిరస్కత సందంశరూప మయిన సవ్యహస్తప్రయోగము ననునవి విశేషరూప ములుగా నుండును. యోగధ్యానమున నొకింత విస్మితదృష్టి కొన్ని స్థలములందు శోభావహముగ నుండును. అపూర్వశాలిసంపద్దర్శన ముండునేని విస్మితదృష్టి రమ్యముగ నుండును గదా? గ్లానదర్శన మభీష్టసందర్శన ముండునేని దృష్టి భేదానుసరణ మావశ్యకము. వ్యసనసంభూతియుండునేని తన్నిమిత్తమయిన యవస్థాంతరసూచకమును ప్రయోగమున సూచింపవలసి యుండును. స్మృతినభినయించునపుడు ధ్యానాభినయమునందు వితర్కితప్రయోగమునందును ఏకచిత్తా ధోదృష్టినతశిరస్కతల నుపయోగింపవలెను. అపత్యాభినయరూపణ మునందు శిర ముద్వాహిత మొనర్చుట ప్రదక్షిణాకృతిగా హంసపక్ష హస్తములను ప్రయోగించుట యావశ్యకము. మానాభిమానముల నిర్దేశమునందు శిర ముద్వాహిత మగును. హంసవక్త్ర మూర్ధ్వగత ముగా నుండును. గతము నిర్దేశించుటలో నిర్వృత్త మభినయించుటలో ధ్వస్తప్రయోగమున శ్రాంతవాక్యమునందును శిరమునం దరాల హస్తము పట్టుట వామహస్త ముద్వాహితముగా నూపుట నభినయ విదు లనుసరింతురు.

## శరదాద్యభినయము

౨౩౦. సర్వేంద్రియస్వస్థతయా ప్రసన్నవదనస్తథా
విచిత్రభూతలాలోకైః శరదం తు వినిర్దిశేత్।

౨౩౧. గాత్రసంకోచనాచ్చాపి సూర్యాగ్నిపటుసేవనాత్
హేమన్తస్త్వభినేతవ్యః పురుషైర్మధ్యమాధమైః।

౨౩౨. శిరోదంతోష్ఠకంపేన గాత్రసంకోచనేన చ
కూజితైశ్చ ససీత్కారై రధమ శ్శీతమాదిశేత్

౨౩౩. అవస్థాంతరమాసాద్య కదాచిత్తూ త్తమైరపి
శీతాభినయనం కుర్యాద్దైవాద్వ్యసన సంభవమ్

౨౩౪. ఋతుజానాం తు పుష్పాణాం గంధాఘ్రాణైస్తథైవ చ
రూక్షస్య వాయోః స్పర్శాశ్చ శిశిరం రూపయేద్బుధః

౨౩౫. ప్రమోదజననారంభై రుపభోగైః పృథగ్విధైః
వసన్తస్త్వభినేతవ్యో నానాపుష్ప ప్రదర్శనాత్

౨౩౬. స్వేదప్రమార్జనైశ్చైవ భూమితాపైస్సవీజనైః
ఉష్ణస్య వాయోః స్పర్శేన గ్రీష్మం త్వభినయేద్బుధః

౨౩౭. కదంబనీపకుటపైః శాద్వలైస్సేంద్రగోపకైః
మేఘవాతైః సుఖస్పర్శైః ప్రావృట్కాలం ప్రదర్శయేత్

౨౩౮. మేఘౌఘనాదై ర్గంభీరై ర్ధారాప్రపతనై స్తదా
విద్యున్నిర్ఘాత ఘోషైశ్చ వర్షారాత్రం సమాదిశేత్

ఈ భరతశ్లోకములలో సర్వఋతువుల యభినయము సంక్షిప్తమై యున్నది. శరదాదికముగా ఋతుపరిగణనము భావరమ్యము శరదృతువునందు సర్వేంద్రియములు స్వస్థములుగానుండును గావున ప్రయోక్త ప్రసన్నవదనుడై విచిత్రభూతలాలోకన విధానములచే శారదము నిర్దేశింప వలెను. హేమంతాభినయమును గాత్రసంకోచమునను సూర్యాగ్నుల ననుకూలముగా సేవించుటలచేతను ప్రదర్శింప వలెను. ఈ యభినయము మధ్యమాధమపురుష కార్యము. ఉత్తముల కెంతటి హేమంతమున నయినను గాత్రసంకోచము కలుగ దనుట సూర్యాగ్నిపటుసేవన ముండదనుట సముచితము. అధమప్రకృతియగు నాతడు శిరఃకంపదంతకంపోష్ఠకంపములు కలిగిన వాడగును. గాత్ర సంకోచనము పొందును. సీత్కారసహితముగా కూజితములు పెట్టును. ఉఃఉఃహూలధిక మొనరించును. కావున నీవిధముగనే యధముడు శీత మభినయించుట యుక్తము. ప్రకృతిభేదమున నభినయభేద ముండ

వలెనే కాని యందర కొకే యభినయము యుక్తముకాదు. ఉత్తమ ప్రకృతులగు వారొకప్పు డవస్థాంతర మనుసరించి దైవకృతముగా గలిగిన వ్యసన మనుభవించు వారగునేని వ్యసనసంభవ మయిన శీతాభినయన మొనరించుటయు యుక్తమె యగును. శిశిరాభినయ మునం దొకవిశేషము కలదు. శిశిరసమయసంభూతము లయిన పుష్ప ముల గంధమాఘ్రాణించు విధానములచే శిశిరము రూపింపవచ్చును. పుష్పసంపత్తి కేవలశిశిరకృతమె కాదు. ఇతరఋతువులందును పుష్ప సంపద యుండును. అయినను తత్తదార్తవపుష్పాఘ్రాణము తత్తన్ని యత మయిన విశేషముతో నుండును గావున తత్తత్కాలాభినయ మనుకరము కాదు. రూక్షమగు వాయువు స్పర్శవిధానాభినయమునను శిశిరము రూపింపవచ్చును. వాయుగతమయిన రూక్షత యుద్వేజనము గలుగజేయుట. వసంతము నిట్లభినయింపవలెను. నానావిధములగు ప్రమోదజననారంభము కల యుపభోగములచే వసంతాభినయము సుకరము. నానాపుష్పప్రదర్శనమున వసంతము నభినయింపవచ్చును. ప్రావృట్కాలప్రదర్శనమునకు కదంబనీపకుటజములు సేంద్రగోపకము లయిన (ఆర్ద్రి - ఆరుద్రి పురుగులని లోకవ్యవహారము పొందిన ఎఱ్ఱనిపురుగులు వానిపై స్పర్శ లలితమృదులముగా నుండును.) శాద్వ లములచే సుఖస్పర్శ కల మేఘవాతములచే ప్రావృట్కాలాభినయ ప్రదర్శనము రమ్యముగ నుండును. మేఘసమూహముల నినాదములు ధారాప్రపతనములు విద్యున్నిర్ఘాతఘోషములు వర్షారాత్రమునం దుండును గావున వానిచే దాని యభినయ మాదేశించుట యుక్తము. ప్రావృడ్వర్షారాత్రసమయమున ప్రథమభాగమున ప్రావృణ్మేఘములు బహులముగా వర్షించుట యున్నది. నిర్ఘాత మనునది యాకాశ స్ఫోటాత్మక మయిన శబ్దము. అది గర్జితము కన్న భిన్నముగ నుండును. పుష్పమునకు పుష్పశేషవిశేషమునకు గలభేదము నిట్టియెడ గూడ గ్రహింపదగును. తత్తత్కాలోచితము లయిన వస్త్రాభరణాది ప్రసాధన విధానము లిందుండుటను గుర్తింపవచ్చును. ఇట్టి వాని గుర్తింపునందే రూపానుసరణమును నిగ్రాహ్యము. వర్షారాత్రములం దొకప్పుడు చంద్రోద్యోతము. మరియొకప్పు డధికమగు నంధకారము. దివాసమయ

మయినచో నాతపప్రకాశ మన్యముండుట ప్రసిద్ధము కదా! ఇట్లీశరదాదుల యభినయము రుచిర మగును. ఈ యంశమున కుపష్టంభకముగా విశేషావిష్కరణ మిట్లున్నది.

౨౪౯. యద్యన్య చిహ్నం వేషో వా కర్మ వా రూపమేవ వా
నిర్దేశ్యః స ఋతుస్తేన ఇష్టానిష్టార్థ దర్శనాత్
౨౫౦. ఏతానృతూ నర్థవశాద్దర్శయేద్ధి రసానుగాన్
సుఖినస్తు సుఖోపేతాన్ దుఃఖార్తాన్ దుఃఖసంయుతాన్
౨౫౧. యో యేన భావేనావిష్టః సుఖదేనేతరేణ వా
స తదాహితసంస్కారః సర్వం పశ్యతి తన్మయమ్

ఒక్కొక్క ఋతువున కొక్కొక చిహ్నముండును. వేషముండును. కర్మయుండును. రూపముండును. ఆ చిహ్నదులిష్టార్థ సంపాదకములును గావచ్చును. అనిష్టార్థసంపాదకములును గావచ్చును. ఏ ఋతువున కే యే చిహ్నవేషకర్మరూపము లుండునో వాని వలన గలుగు నిష్టానిష్టార్థ దర్శనము ననుసరించి యా ఋతువును నిర్దేశింపవలెను. రసానుగతములుగా నుండు నీ ఋతువులను ప్రయోజనవశమున ప్రదర్శింపవలెను. తత్తద్రసములందీఋతువులుద్దీపనవిభావాత్మకములై యుండి రసము నుల్లసింప జేయగలవు. రసప్రవణములగు ఋతువులె రసానుకూలప్రయోజన మాపాదింప గలవు. ప్రయోజనాపాదకములు కాజాలని ఋతువులు రసానుగములు కాజాలవు. కావున తత్తత్కార్యవశమున రసానుగతి కల ఋతువులను రసానుకూలముగనె ప్రదర్శింపవలసి యుండును. సుఖంకరము లగువానిని సుఖోపేతములనుగా నభినయింపవలెను. దుఃఖప్రయోజనకములను దుఃఖసంయుతములనుగా ప్రదర్శింపవలెను. ఒకడొక సుఖదభావావిష్టుడగునేని యా సుఖాహితసంస్కారుడై యా సుఖమాపాదించిన సంస్కారోద్బోధముకలవాడై సర్వము సుఖమయముగ సంభావించును. ఒకడొక సుఖేతరభావావిష్టుడగునేని యా సుఖేతరభావసంపాదితసంస్కారుడై సర్వము సుఖేతరభావ మయముగనె భావించును. భావావేశము భావాహిత సంస్కారమును వాని దర్శనమున కుద్బోధక మగును.

౨౫౨. భావాభినయనం కుర్యాద్విభావానాం నిదర్శనైః
తదైవచానుభావానాం భావసిద్ధిః ప్రవర్తితా

౨౮౩. విభావేనాహృతం కార్యమనుభావేన నీయతే
ఆత్మానుభవనం భావో విభావః పరదర్శనమ్

౨౮౪. గురుర్మిత్రం సఖా స్నిగ్ధః సంబంధీ బంధురేవ వా
ఆవేద్యతే హి యః ప్రాప్తః స విభావ ఇతి స్మృతః

౨౮౫. యత్త్వన్య సంభ్రమోత్థానైరర్ఘ్యపాద్యాసనాదిభిః
పూజనం క్రియతే భక్త్యా సోనుభావః ప్రకీర్తితః

౨౮౬. ఏవమన్యేష్వపి జ్ఞేయో నానాకార్యప్రదర్శనాత్
విభావో వాపి భావో వా విజ్ఞేయోఽర్థవశాద్బుధైః

౨౮౭. యస్త్వపి ప్రతిసందేశో దూతస్యేహ ప్రతీయతే
సోఽనుభావ ఇతి జ్ఞేయః ప్రతిసందేశదర్శితః

౨౮౮. ఏవం భావో విభావో వాప్యనుభావశ్చ కీర్తితః

వీనిలో భావవిభావానుభావ రూపపరిచయ మభినయయోగాను కూలముగ నిర్దిష్ట మగును. రసమీమాంసాప్రఘట్టమున నిరూపితము లయిన భావవిభావానుభావస్వరూపములం దంతర్నిహితము లయిన విశేషము లిచట ప్రతిపాదితము లగును. విభావములచే భావముల యభినయము సూచితమగును. విభావాభినయము భావాభినయము నుద్యోతింపజేసి సూచించును. కేవల మభినయసారముగ నిందువాని ప్రతిపాదన ముండును. విభావముల నిదర్శనములచే భావాభినయ మొనర్పవలెను. అట్లె యనుభావముల నిదర్శనములచే గూడ భావసిద్ధి యున్నది. విభావముల నభినయించి భావముల నభినయించుట ప్రసిద్ధముగనె యున్నది. పరస్థమయిన క్రోధము నభినయించు నప్పుడు సూచీముఖాంగులి ప్రదర్శనము యుక్తముగనె యున్నది. తద్ద్వారమున క్రోధము ప్రదర్శిత మగును. భావసిద్ధ్యనుకూలముగనె యనుభావాభినయ ముండుట యావశ్యకము. శోకోచితమయిన ముఖవికూణనాది ప్రదర్శనమున భావసిద్ధి కల యనుభావముల యభినయము విశదము కాగలదు. విభావ మెట్లభినేయము కాగలదను శంకానివారణ మిట్లున్నది. అదియే 'విభావేనాహృతం కార్యము లో విశదము కాగలదు. విభావము కారణరూప మయినందున గమకము. గమకమయిన విభావముచే సమాహృతమయిన కార్యము ననుభావమున ప్రదర్శింపవలెను. విభావముచే నొక కార్య మాహృతము కాగా తత్సామగ్రి యా కార్య మంతట విశేషముగ సంచరించునదై దాని నవగమింపజేయును.

భావ మనుభావమునకు గమక మెట్లగునదియు నిందున్నది. అనుభావముల యభినయములు భావసిద్ధి ప్రవర్తితము లగుట వలన భావము గమక మనుట స్పష్టము. అనుభావము నావిర్భవింప జేయుట యను భావాంతరము నందును గలదు. ఇట్టి సాహచర్యానుభవము వలన గమక మనుటయె యిచటి తత్త్వము. భావవిభావాదుల స్వరూప మిదివరలో నిరూపితప్రాయ మయినను విస్మరణశీలురగు వారలకు శృంగగ్రాహికగా విభావానుభావ భావస్వరూపము దర్శింపజేయుట యావశ్యక మయినందున ఆత్మానుభవనము భావమని విభావము పరదర్శన మని యిచట నిరూపిత మగును. ఆత్మానుభవన పదమున కర్థ మిట్లుండును. ఆత్మవిశ్రాంత మగు సుఖదుఃఖసంవిద్రూపమగు ననుభవన మాత్మానుభవనము. ఇట్టి యాత్మానుభవనమె భావమని యర్థము. ఆత్మానుభవనమని యున్నందున నట్టిదే భావము కాని ఘటాద్యనుభవనము భావము కాదని భావ ముద్బోధించి నట్లయినది. ఆత్మానుభవన మనుచోట ణిజర్థము సంతర్భవింపజేసి కొందరీవిధముగా నర్థము వ్యాఖ్యానింతురు. వేనిచే నాత్మ యనుభవింపబడునో యవి భావము లగును. ఆత్మ ననుభవనమునకు దెచ్చునవి భావములు. ఈ యర్థమున ప్రకర్ష గమ్యమగును. ఏదేని లబ్ధసత్తాక మగునేని యట్టి సుఖాదిరూప మవశ్య మనుభూయమాన మగును. అదియే భావ మని యర్థము. సుఖదుఃఖాదిసంవిద్రూపమాత్మ విశ్రాంతమగుట యాత్మానుభవమని యనుటయె సంవిచ్ఛాస్త్రానుకూలము సుందరమును.

ఆత్మవిశ్రాంతసుఖాదిసంవిద్ధర్మమె భావము. విభావము పరదర్శనము. ఆత్మవ్యతిరిక్తవస్తుజ్ఞాన మేది కలదో యది సర్వము సుఖాది జనకమె కావున విభావ మగును. ప్రాణి సుఖదుఃఖాత్మకము లయిన సంవిద్రూపచిత్తవృత్తులు బాహిరపదార్థముల సందర్శనాదుల వలన సముద్బుద్ధము లగును గావున విభావము లయినవి. విశేషముగా భావింపజేయుట యను వ్యుత్పత్తి సంగతమె యగును. ఇతరములును సుసంగతము లగును. గురుర్మిత్రం సుఖేత్యాదిక ముదాహరణము, గురుదర్శనమున వినయగ్రహణ ముండును. అందు మొదట ఉత్సాహ ముదయించును. మిత్రాదుల దర్శనమున యథోచితముగా హర్షాము లుదయించుట నూహించునది. కార్యవశమున గలియువాడు మిత్రుడు.

సమానఖ్యాతియోగము కలవాడయినందున సహపాంసు క్రీడనాపరిచితుడు సఖుడు. స్నేహయోగమున నభిమానాస్పదుడు స్నిగ్ధుడు. సన్నిహితసంబంధవిశేషము కలవాడు సంబంధి. గోత్రబంధువు బంధువు. ఇట్టి వీరి స్వరూపకీర్తనమున వ్యత్యాసము నుండవచ్చును. వీరి ప్రాప్తి సూచిత మగుట విభావ మగును. "ఆవేద్యతే హి యః ప్రాప్తః" అని మూలమున గలదు. వారి ప్రాప్తి యావేదిత మగుట యున్నందున దర్శనము వలె భావనమును భావనీయము, తత్తదాత్మక మయిన చిత్తవృత్తి కల్గుటలో గుర్వాదిప్రాప్తివేదనము నిమిత్త మయినందున సంభ్రమోత్థానాదుల నిరూపణ మావశ్యక మయినది. గుర్వాదుల ప్రాప్తి సమయమున సంభ్రమోత్థానము లుండును. అర్ఘ్యపాద్యాసనాది ప్రదాన ముండును. వీనిచే భక్తిపురస్సరముగా పూజన ముండును. ఇట్టివన్నియు ననుభావములను వ్యపదేశము పొందును. గురుచరణులు విచ్చేసినా రనగనె సంభ్రమముగా లేచుట ప్రత్యుద్గమన మొనరించుట ప్రభృతులు సంగ్రాహ్యములు. వారి వారి ప్రాప్తి సంవేదనములో యథోచిత మయిన భావసంగ్రహ మావశ్యకము. మిత్రాదుల కాలింగనాదిక మభ్యూహ్యము. ఇట్టి యనుభావవిశేషప్రదర్శన ముదాహరణమాత్రము. ఇట్లే యితరములందును నానాకార్యప్రదర్శనమున ప్రయోజనానుకూలముగ విభావభావానుభావములను గుర్తించునది. శృంగారాదిరసములందు నీ నీత్యనుసరణమె సముచితము. నాట్యబుధులగువారు తత్తత్ప్రయోజనవశమున విభావము ననుభావమును గుర్తించునది. భావమునేని గుర్తించునది. "విభావో వాపి భావో వా" యనుమూలమున మొదటి 'వా' కార మనుభావమును సూచించును, రెండవ 'వా' కారము వికల్పార్థము. "అపి" శబ్దము స్థాయి వ్యభిచారులనుగూడ ప్రయోజనానుసారమున గుర్తింప వలసియుండుటను సూచించును. కాగా శృంగారాదిరసవిషయముగా నాయా ప్రయోజనానుసారమున విభావానుభావవ్యభిచారిస్థాయి భావములను గుర్తింపవలెనని భావము.

ఇది యీ చిత్తవృత్తిలో నియమముగా విభావ మగుననుట శక్యము కాదు. ప్రయోజనాంతర సంబంధమున్నచో నదియె యన్యస్థలమున విభావమగును. వ్యాఘ్ర మొకటియె వీరవృత్తిలో విభావము

కావచ్చును. అదియె భయానకప్రవృత్తిలో కారణాంతరసహాకారమున విభావము కావచ్చును. అట్లై యనుభావాదులును నియతావస్థితిక ములు కావు. కేవలము ప్రత్యక్షముగా గోచరించు ననుభవమె చిత్త వృత్తి నుత్పాదించునని లేదు. శబ్దాదిప్రమాణాంతరముచే ప్రతిపన్న మయిన యవిదితమును చిత్తవృత్తి నుత్పాదించుట యున్నది. ఇదియు నిందున్నది. దౌత్యమాశ్రయించి సందేశము కొనివచ్చిన దూతకు ప్రతిసందేశ ముద్బోధించుటయు ననుభావ మగును. అది ప్రతిసందేశ మునన ప్రదర్శితమగును. ఇట్టిది శబ్దప్రమితిచే నవభాసించిన విషయము. ఇది యనుమానమునకు నుపలక్షణము. సంతమసమున గద్గదవచనము విని మూల మభ్యూహింపవచ్చును. గురువచనము గుర్తించి యూహింప వచ్చును. సజ్జనవచన మాలించి యనుమేయ మనుమింపవచ్చును. బాష్పము హేతువుగా శోక మవగత మగును. ఇట్లన్నియు నుపపత్తి సహాకృతములై భాసించును.

ఇట్లు సంకేతితములు సంకీర్తితము లయిన భావవిభావాను భావములను పురుషులు గాని ప్రమదలు గాని యభినయింపవలెను. ప్రమదోచితములను పురుషోచితములను పురుషులు నభినయించుట యౌచిత్యసంప్రాప్త మగుట నిరూప్యము కాదు,

పురుషులు ప్రమదలు నిరూపింప వలెననుటచే వారిస్థాన మాపా దించుట యావశ్యక మగుచున్నది. గతిప్రదర్శనము నపేక్షిత మగు చున్నది.

౨౮౯. స్వభావాభినయే స్థానం పుంసాం కార్యం తు వైష్ణవమ్
అయతం వావహిత్థం వా స్త్రీణాం కార్యం స్వభావతః

౨౯౦. ప్రయోజనవశాచ్చైవ శేషాణ్యపి భవంతి హ
నానాభావాభినయనైః ప్రయోగైశ్చ పృథగ్విధైః

౨౯౧. ధైర్యలీలాంగసంపన్నం పురుషాణాం విచేష్టితం
మృదులీలాంగహారైశ్చ స్త్రీణాం కార్యం తు చేష్టితం

౨౯౨. కరపాదాంగసంచారాః స్త్రీణాం తు లలితాః స్మృతాః
సుధీరశ్చోద్ధతశ్చైవ పురుషాణాం ప్రయోక్తృభిః

౨౯౩. యథారసం యథాభావం స్త్రీణాం భావప్రదర్శనం
నరాణాం ప్రమదానాం చ బావాభినయనం ప్రథక్

స్వభావాభినయసమయమున పురుషులకు వైష్ణవస్థానవిన్యాసము యుక్తము. స్త్రీలస్వభావానురోధమున ఆయతస్థానమును గాని యవహిత్థస్థానమును గాని విన్యసించుట యుక్తము. వైష్ణవస్థానకాదివిశేషములు గతిభేదవిశేషములను సూచింమననుట గతినిరూపణప్రకరణమున నున్నది. ప్రయోజనవశమున నితరస్థానవిశేషములను గూడ నిరూపింప వచ్చును. నానాభావాభినయనములతో నానావిధములగు ప్రయోగవిధానములతో స్త్రీలకు పురుషులకు స్థానవిశేషములను గతిసంచారములందు సూచింపవలెను. పురుషుల చేష్టితము ధైర్యలీలాంగసంపన్నముగా నుండుటయు స్త్రీల చేష్టితము మృదులీలాంగహారములతో నుండుటయు ప్రసిద్ధము కావున వారి చేష్టితముల నట్లె నిబంధింపవలయును. మార్దవలీలాప్రధానము లయినయంగవిక్షేపములచే స్త్రీచేష్టిత నిరూపణ ననునది సావధానముగ సమీక్ష్యము. స్త్రీల కరపాదాంగసంచారవిధానము లన్నియు లలితములుగా నుండుననుట సర్వత్ర సర్వప్రసిద్ధము. పురుషుల చేష్టితసంపద సుధీరముగా నుండుట యుద్ధతముగా నుండుట యంతట ప్రసిద్ధము. కావున ప్రయోక్తలు వాని నట్లె ప్రయోగించి నాట్యసౌందర్య మాపాదింపవలెను. స్త్రీల భావాభినయము పురుషుల భావాభినయము వేరువేరుగా నుండును. అందును స్త్రీల భావప్రదర్శనము క్షణక్షణమునను చిత్రతాశాలియై యుండును. రసనియతముగా భావనియతముగా వారి భావప్రదర్శన ముండుట గుర్తించి యథారసముగా యథాభావముగా స్త్రీభావప్రదర్శన మొనరించుట యుక్తము. స్త్రీభావప్రదర్శనము పురుషులకును పురుషభావప్రదర్శనము స్త్రీలకు నిరూపించుట హాస్యమున కగునె కాని రసమునకు భావమునకు గాదు. ఏదేని ప్రయోజనవశమున కూర్చుట యనునది ముహుఃప్రతిబోధ్యము కాదు. స్త్రీపురుషుల చిత్తవృత్తుల ననుసరించిన యీభావదర్శనము భావుకుల దర్శనము.

భావానుభావనము

౨౯౪. బావాభినయనం యుక్తం వ్యాఖ్యాస్యామ్యానుపూర్వశః
అలింగనేన గాత్రాణాం నస్మితేన చ చక్షుషా

౨౯౫. తథోల్లుకసనాచ్చాపి హృష్టం నందర్శయేన్నరః
ప్రసంజాతరోమాంచాద్బాష్పేణావృతలోచనా

౨౯౬. కుర్వీత నర్తకీ హర్షం ప్రీత్యావాక్యైశ్చ సస్మితైః
నిశ్వాసోచ్ఛ్వసబహులైరథోముఖవిచింతనైః
౨౯౭. ఆకాశవచనాచ్చాపి దుఃఖం పుంసాం తు యోజయేత్
రుదితైః శ్వసితైశ్చైవ శిరోభిహననేన చ
౨౯౮. భూమిపాతాభిఘాతైశ్చ దుఃఖం స్త్రీషు ప్రయోజయేత్
ఆనందజం చార్తిజం వా ఈర్ష్యానంభూతమేవ వా
౨౯౯. యత్పూర్వముక్తం రుదితం తత్ స్త్రీనీచేషు యోజయేత్
అనేన విధినా కార్యాః ప్రయోగాః కరణోత్థితాః
౩౦౦. పౌరుషాః స్త్రీకృతా వాపి భావాహ్యభినయం ప్రతి
సర్వే సలలితా భావాః స్త్రీభిః కార్యాః ప్రయత్నతః
౩౦౧. ధైర్యమాధుర్యసంపన్నా భావాః కార్యాస్తు పౌరుషాః

ఇటుపై యుక్తసముచిత మయిన భావానుభావన మానుపూర్వ్య సహితముగా వ్యాఖ్యానింపవలసి యున్నది. ఇదివరలో నిరూపిత మంతయు రసవిషయక మయిన సామాన్యాభినయము. అదియు శృంగారద్వారమున నిరూపిత మయినది. ఇక నిచట వ్యభిచారిభావ విషయక మయిన భావాభినయము నిరూపింప దగియున్నది. తత్తద్భావాభినయమునందు పురుషచేష్టలు వేరుగను స్త్రీలయభినయచేష్ట లన్యాదృశములుగను నుండును. తద్వివేకానుసారముగనె తదభినయము మనోరంజక మగును. హర్షము, క్రోధము, దుఃఖము, భయము, మదము, శౌర్యధైర్యగర్వదర్పౌదార్యములు ప్రతినియతాభినయ సుందరములై యుండును.

హర్షము : గాత్రాలింగనమున సస్మితనేత్రమున ఉల్లుకసనము వలనను నటుడు హర్షమును ప్రదర్శింపవలసి యుండును. ఇది పురుష ప్రదర్శనీయమగు నభినయవిశేషము. నర్తకి హర్షాభినయమున వెంటనే రోమాంచము కలదై బాష్పావృతలోచనయై సస్మితవాక్యములతో ప్రీతితో హర్షమును ప్రదర్శింపవలెను.

క్రోధము. క్రోధమభినయించు నరుడు రక్తనేత్రముల నుద్వృత్తము లగునట్లొనరింపవలెను. కన్నులెఱ్ఱజేసి త్రిప్పవలెను. సందష్టాధరుడు కావలెను. నిశ్వాసములచే నొడలంతయు కంపించు నట్లొనరింపవలెను. అట్టివిధానమున క్రోధము నభినయింప వచ్చును. క్రోధము

కలవా డుద్ధతుడగును. గావున నిట్టి చేష్టానుసరణ మావశ్యకము. స్త్రీ క్రోధాభినయ మొనరింపవలసి యుండునేని కన్నులనిండ నీరు నింపుకొన వలెను. చిబుకౌష్ఠప్రకంపన మొనర్ప వలెను. శిరః కంపనము భ్రుకుటీ కరణము మాటలాడకుండుట మెటికెలు విరుచుట మాల్యాభరణపరి త్యాగము ఆయతస్థానకస్థితి ఈర్ష్యావ్యాకులత యిట్టివన్నియు స్త్రీ క్రోధమున సహజములు. వీనిచే స్త్రీ క్రోధ మభినయింపజనును.

దుఃఖము. ఇచట దుఃఖమనునది శోకము. కేవల దుఃఖము కాదు. స్థాయిభావాత్మక మయిన శోకము కాకున్నను స్థాయిభవన యోగ్య మయిన శోకమని భావింపవలెను. ఇట్టి దుఃఖాభినయనమునందు పురుషుల కీరీతి విశేషము లుండును. బహుళముగా నిశ్వాసోచ్ఛ్వాస ములు అధోముఖవిచింతనములు ఆకాశ భాషితము, ఇట్టి విశేషములను పురుషులకు కూర్పవలెను. స్త్రీలకు దుఃఖాభినయప్రసక్తిలో రుదిత ములు శ్వసితములు తల బాదికొనుటలు మోదుకొనుటలు భూమి పాతము అభిఘాతము మొదలగునవి ప్రయోగింప వలెను. భూమిపై చేతులతో బాదుట హస్తతాడనములు ఆకాశమున హస్తఘాతములు స్త్రీలకు సహజములు. ఆకాశము శూన్య మయినను స్వావలంబన స్మృతిచే నట్టి ఘాతములను వారొనరింతురు. ఆనందజన్యమగు విశే షము కాని యార్తిజన్య మయిన రోదనము కాని యీర్ష్యాసంభూత మగు నేడుపుగాని పూర్వము నిరూపించిన రుదితవిశేషము స్త్రీల యందును నీచప్రకృతిమానవులందును ప్రయోగింపవలెను. శోకము కలిగిన నంద రేకవిధముగ శోకింపరు. వారి వారి శోకము వారి వారి ప్రకృత్యనుసార ముండును. స్త్రీలు దుర్బల ప్రకృతి కలవారయినందున నిగ్రహ మొనరించుకొనజాలరు. నీచప్రకృతికల పురుషులును నిగ్ర హము కలవారు కారు. ఇట్టి ప్రకృతిభేద ముపలక్షించి యభినయము నాయోజనము చేయవలయును.

భయము: పురుషులకు ధైర్యావేగబలాదులచే చలతారక నేత్రములచే స్ఫురితకంపితగాత్రములచే సంత్రస్తహృదయు లయినందున పార్శ్వావలోకనములచే భయాభినయము యోజనము చేయువలయును. స్త్రీలకు భయాయోజనమున భర్తనన్వేషించుట ఉచ్చైరాక్రందనము

పెద్దపెట్టుగా నేడ్చుట తన ప్రియునాలింగనము చేసికొనుట కూర్ప వలెను. స్త్రీనీచప్రకృతులందు పూర్వము చెప్పిన విశేషములను కూర్ప జనును. స్త్రీనీచజనులకు రాక్షసాది దర్శనమున భయము కలిగినపు డుద్వేగము కలిగినప్పుడును తత్తదుచితము లయిన శిరోగ్రీవాదికర్మలను చలిత విచలిత పదయుక్తము లయిన గతిప్రచారములను మంథరగమన ములను ఆరేచితకాదులగు నంగహారములను కూర్పవలెను. ఉత్తము లకు విస్మయము కూర్చుటసముచితము. స్త్రీనీచప్రకృతుల విషయమై రసమీమాంసాప్రకరణమున నిరుక్తము లను సమీక్షించి ప్రదర్శింప వలెను.

మదము : మదప్రయోగమునందు పురుషుల వ్యవహార ముత్తమ మధ్యమాధమ సంకేతములో నిదివరలో నిరూపితము. స్త్రీ మదాభి నయ మొనరించునపుడు మృదులలితస్ఖలితపదములు నిత్యమాకాశావ లంబనము నేత్రావఘూర్ణనము సాలస్యకథితములు కూర్పదగును. గాత్రకంపనముల నధికముగా నిరూపింపవలెను.

ఇట్టి విధానముల ననుసరించి సముచితకారణ సముత్పన్నము లయిన ప్రయోగకార్యములను కూర్చునది. అభినయోద్దేశమున పురుషకృత భావములు కాని స్త్రీకృత భావములు కాని శాస్త్రవిధి మర్యాదలతో నుండుట నాట్యశోభ. స్త్రీలు ప్రదర్శించు భావము లన్నియు లలితములుగా నుండవలెను. అవియన్నియు నట్లుండునట్లు ప్రయత్నసమీక్ష చేయవలెను. పౌరుష భావము లన్నియు ధైర్యమా ధుర్యసంపన్నములుగా నుండవలెను.

౩౦౨. త్రిపతాకాంగులీభ్యాం తు వలిభాభ్యాం ప్రయోజయేత్
శుకాశ్చ శారికాశ్చైవ సూక్ష్మా యే చాపి పక్షిణః

౩౦౩. శిఖిసారసహంసాద్యాః స్థూలా యేపి స్వభావతః
రేచకై రంగహారైశ్చ తేషామభినయో భవేత్

౩౦౪. ఖరోష్ట్రాశ్వతరా సింహవ్యాఘ్రగోమహిషాదయః
గతిప్రచారైరంగైశ్చ తేఽభినేయాః ప్రయోక్తృభిః

౩౦౫. భూతాః పిశాచా యక్షాశ్చ దానవాః సహరాక్షసైః
అంగహారైర్వినిర్దేశ్యా నామసంకీర్తనాదపి

౩౦౬. అంగహారైర్వినిర్దేశ్యా అప్రత్యక్షా భవంతి యే
ప్రత్యక్షాస్త్వభినేతవ్యా భయోద్వేగైః సవిస్మయైః

౩౦౭. దేవాశ్చ చిహ్నైశ్చ ప్రణామకరణైర్భావైశ్చ విచేష్టితైః
అభినేయో హ్యర్థవశాదప్రత్యక్షాః పయోగజ్ఞైః

౩౦౮ సవ్యోత్థితేన హస్తేన హ్యరాలేన శిరః స్పృశేత్
నరేఽభివాదనం హ్యేతదప్రత్యక్షే విధీయతే

౩౦౯ ఖటకాపర్ధమానేన కపోతాఖ్యేన వా పునః
దైవతాని గురూంశ్చైవ ప్రమదాశ్చాభివాదయేత్

౩౧౦. దివౌకసశ్చ యే పూజ్యాః ప్రత్యక్షాశ్చ భవంతి యే
తాన్ ప్రమాణైః ప్రభావైశ్చ గంభీరార్థైశ్చ యోజయేత్

పక్షిపశువుల యభినయము, భూతపిశాచదానవాదుల యభిన యము ప్రత్యక్షాప్రత్యక్ష నరదేవాదుల యభినయము నిర్దేశింపవలసి యున్నది. వీనియందావిశేషములు కలవు. త్రిపతాకనుబట్టి వలితము లయిన యంగుళుల విన్యాసవిశేషముచే శుకసారికాది పక్షుల నభిన యింపవలెను. సూక్ష్మము లయిన పక్షుల విషయమున నిది విధానము. స్వభావతః స్థూలము లయిన శిఖిసారసహంసాది పక్షుల స్వరూపాభి నయనసమయమున రేచకాంగ హారముల ప్రదర్శనము లపేక్షితములు. ఖరము ఉష్ట్రము అశ్వతరము=కంచరిగాడిద సింహము, వ్యాఘ్రము, గోవు, మహిషము మొదలగు వాని యభినయప్రసక్తిలో తగిన గతి ప్రచారములు అంగహారములు ప్రయోగింపవలెను.

"మహాపశూనంగహారైర్గతిభిశ్చ ప్రయోజయేత్" మహా పశువులయిన ఖరోష్ట్రాదులను అంగహారములచే గతిభేదములచే నభిన యించి ప్రయోగించుట ప్రసిద్ధము. భూతపిశాచయక్షరక్షోదానవులను నామకీర్తనమున నంగహారములతో నభినయించునది. అప్రత్యక్షము లగు భూతప్రేతపిశాచులను నామకీర్తనమున నంగహారములతో నిర్దే శించుట యుచితమగును. అప్రత్యక్షములగువాని నన్నిటి ననుకరణమున నంగహారములతో ప్రదర్శించుట యుండనే యున్నది. ప్రత్యక్షగోచర ములగు భూతపిశాచాదులను విస్మయముతో గూడుకొనిన భయోద్వే గములతో నభినయింపవలెను. ప్రత్యక్షభూతదేవాభినయనమున నా యా దేవతలకు ప్రణామము లొనర్చి వారి వారి చిహ్నములతో

తత్తద్భావానుకూలవిచేష్టితములతో ప్రయోక్తలు ప్రవర్తింపవలెను. ప్రయోగవిదులగువారు ప్రయోజనవశమున నప్రత్యక్షముగ నుండు వారిని యథోచితముగ నభినయించునది. అప్రత్యక్షమానవుని సాభిమానముగ నభివాదనము చేయు సమయమున అరాలహస్తమును సవ్యభాగమునుండి పైకి నెత్తుచు శిరమును స్పృశింపవలెను. ఖటకావర్ధమానము కపోతహస్తము దైవతాభివాదనమున గురువందనమున ప్రమదాభివాదనమున నుపకరించును. పూజింపదగిన ప్రత్యక్షదేవతలను గూడ గంభీరార్థము లయిన ప్రమాణప్రభావములతో యోజనము చేసి యభినయింపవలెను. ఇట్లీ యభినయసంపద తత్తద్విషయముగా సుప్రయుక్తమయినచో చిత్రత నాపాదించును. మహాజనులను సఖీవర్గమును విటధూర్తజనమును గూడ గంభీరార్థవిధానములతో నభినయించుట యుక్తము. పరిమండలగతమయిన హస్తముద్రాప్రయోగమున నటుడు ప్రాంశుదేహుడై సమున్నతములయిన పర్వతములను వృక్షముల నభినయింపవలెను. ఉత్క్షిప్తములగు పతాకాహస్తములతో బహువిస్తీర్ణమగు సాగరమును సేనను ప్రదర్శింపవలెను. ఈవిధముగా నభినయించుట విశేషరూపము కాక పోయినను ఏకమనేకానుగతమగుట యనేకగత మేకానుగతమగుట వలన చిత్రత యున్నది. ఆ చిత్రతాదర్శనమే యిందు ముఖ్యము.

> ౩౧౧. శౌర్యం ధైర్యం చ గర్వంచ దర్పమౌదార్యముచ్ఛ్రయం
> లలాటదేశస్థానేన త్వరాలేనాభిదర్శయేత్
>
> ౩౧౨. వక్షోదేశాదపావిద్ధౌ కరౌ తు మృగశీర్షకౌ
> విస్తీర్ణప్రద్రుతోత్క్షిప్తౌ యోజ్యౌ యత్స్యాదపావృతమ్
>
> ౩౧౩. అధోముఖోత్తానతలౌ హస్తౌ కించిత్ప్రసారితౌ
> కృత్వా త్వభినయేద్వేలాం బిలద్వారం గృహం గృహాన్

అరాలహస్తమును లలాటదేశగతముగా బట్టి శౌర్యధైర్యాదుల నభినయింపవచ్చును. మానియగు మానవునకు స్వభావసహజముగా నున్న స్వాత్మవిశ్వాసమును శౌర్యాదులు సూచింపగలవు. శౌర్యము ధైర్యము కలవానికి దర్పగర్వము లుండవచ్చును, అట్లే యౌదార్య ముండును. ఉచ్ఛ్రాయమును నతిశయము నుండును. లలాటగతారాళహస్తమున వీని నభినయించునది. మృగశీర్షకమును సంయుత

హ స్తములను వక్షోదేశమునుండి యపావిద్ధము లొనరించునది. సంయుతహ స్తములను ముందుగా నురమున బట్టి వాని నటునిటు వేగ మున లాగుట యపావిద్ధక్రియ. అట్టి హ స్తములను వేగముగ దూర ముగ దిగువగ నూర్ధ్వముగ పట్టి పట్టి లాగి యుంచుట యపావృతవిధి. ఈ విధి కల హ స్తములను కొంతగా ప్రసారితములనుగ జేసి యధో చితముగ నుత్తానతలముగ బట్టి వేలాప్రదేశము నభినయించునది. పర్వతగత మయిన బిలద్వారమును సూచించునది. పర్వతమున ప్ర స్తర వినిర్మితము లయిన గృహములను సూచించునది. భూతలగతగృహ ముల గూడ నిట్లు సూచించుట యు క్తముగ నె యుండును.

శాపగ్రహగ్రస్తులు జ్వరోపహత చేతసులగు వారి నభినయింప వలసి యున్నప్పుడు నాట్యవిబుధులు సంగతముగ భావించి వారి వారి యంగప్రత్యంగాద్యభినయములచే వారి వారి చేష్టితముల నభినయింప వలసి యుండును. "అంగాద్యైః సదృశైర్బుధః" అభినయవిదుడు సదృశములుగా సంభావితములగు నంగాదులచే నభినయించుట ముఖ్య సూచనము. అంగాదు లను నాది పదమున సముచితములగు దృష్టి విశేషములను సాత్త్వికాదులను స్వీకరింపవలెనని భావము. సదృశము లని యనుటయు సాభిప్రాయము. శాపగ్రహగ్రస్తులు జ్వరితులు దిగ జారియుందురు గావున వారి యభినయమున డోలాహస్తాదుల ప్రదర్శ నము సదృశముగ నుండునని భావింపవలెను. దోలావిలోలనములచే దోలాభినయ మొనరింపవలెను. ఈ విలోలనములు చంచలవిలోలన ములుగా నుండవలెను. హ స్తవిలోలచాలనములచే దోలావిలోలనముల నభినయించుట యిందు సూచితము. రంగమున ప్రత్యక్షముగ సర్వాంగసుందరమయిన డోల యుండునేని గాత్రసంక్షోభములచే రజ్జుసూత్రగ్రహణముచే ప్రత్యక్షడోలాకర్షణ మొనరింప వచ్చును. ఒకప్పుడు కృత్రిమముగా ప్రయోగరంగమునకు తగిన పుస్తజదోలయే యుండవచ్చును. దానినయినను పై విధమున నాకర్షించి యభినయించు నది. ఆ యా యాసనములం దుపవిష్టు లయిన వారలకు దోలనము కూర్చుట యుపపన్నముగ నుండును.

## వాచిక ప్రసక్తి

చిత్రాభినయమున వాచికప్రసంగమునకును సుప్రవేశము కలదు. వాచికప్రసంగము ననుసరించిన చిత్రాభినయప్రతిజ్ఞాన మావశ్యకము. ఆకాశవచనము లాత్మగతము లపవారితకములు జనాంతికములు దూరస్థాభాషణము లశరీరనివేదనములు వాచికగతము లయిన చిత్ర విశేషములకు సూచకములు. వీని లక్షణస్వరూపనిర్దేశ మీ విధమున నుండును.

౨౧౪. దూరస్థాభాషణం యత్స్యాదశరీరనివేదనమ్
పరోక్షాన్తరితం వాక్యమాకాశవచనం తు తత్
౨౧౫. తత్రోత్తరకృతైర్వాక్యైః సంలాపం సంప్రయోజయేత్
నానాకారణ సంయుక్తైః కావ్యభావనముత్థితైః
౨౧౬. హృదయస్థం వచో యత్తు తదాత్మగతమిష్యతే
సవితర్కం చ తద్యోజ్యం ప్రాయశో నాటకాదిషు
౨౧౭. నిగూఢభావసంయుక్త మపవారితకం స్మృతమ్
కార్యవశాదశ్రవణం పార్శ్వగతైర్యజ్జనాంతికం తత్స్యాత్
౨౧౮. హృదయస్థం సవికల్పం భావస్థం చాత్మగతమేవ
ఇతి గూఢార్థయుక్తాని వచనానీహ నాటకే
౨౧౯. జనాంతికాని కర్ణే తు తాని యోజ్యాని యోక్తృభిః
పూర్వవృత్తం తు యత్కార్యం భూయః కథ్యం తు కారణాత్
౨౨౦. కర్ణప్రదేశే తద్వాచ్యం మాగాత్తత్పునరుక్తతామ్.

ఈ కారికలలో నీ యాకాశభాషితాదులను నాటకభాషా రూపముగా పరిగణింతురు. రంగమున సంచరించు నటుడు కార్యవశ మున వీనిని ప్రయోగింపవలసి యుండును. ఈ ప్రసక్తిలో నీ నిర్దిష్టముల స్వరూపవిచారము కలదు.

౧. ఆకాశవచనము : దూరమునందున్న వానితో సంభాషిం చుట యిందు ముఖ్యము. రంగము ప్రవేశింపకయె దూరమునందున్న పాత్రముతో వ్యవహరించుట. కావుననె యిది యశరీరనివేదన మగును. ఇట్టి యాకాశవచనమును పరోక్షాన్తరిత మయిన వాక్య మనదగును. రంగప్రవిష్టు డగువాడు రంగాప్రవిష్టు నొకని నుద్దేశించి సంభా షించును. పరోక్షముగా నున్న వ్యక్తి పలుకు వాక్యము రంగ ములో నుండు వానివాక్యముల కంతరాళములో నుండును. రంగ

ప్రవిష్టుడే యా వాక్యముల గూడ పలుకును. "పరోక్షాంతరిత" మను స్థలమున "పరోక్తాన్తరిత"మనియు పాఠము కలదు. ఇతరుడు పలికిన వాక్యముచే వ్యవహితమగుట యని తద్భావము. ఆ వ్యక్తి రంగమె ప్రవేశింపడేని తత్సంబంధివచన మెవరు పలుకుదురు? రంగమునందున్న వ్యక్తియె పలుకును. దూరము నందున్న వ్యక్తి ప్రశ్నింపగా తత్సమాధానముగా రంగవ్యక్తి పలుకు వాక్యములను యోజన మొనర్చి పలుకుట యిందు ముఖ్యము. "ఏమనుచుంటివి?" "నీవిట్లు పలుకుచున్నావా?" "వారీ విధముగ పలికిరా?" ఇట్టి వాక్యములను రంగప్రవిష్టుడె పలుకుచు సంలాపమును ప్రయోగమునం దవతరింప జేయవలయును. ఉత్తరరూపముగ నుండు వాక్యములు నానాకారణములతో నుండును. రమ్యముగ కావ్యభావమున వెలువడునవి యగును. చిత్రిత నాపాదించునట్టి యిట్టివచనములు కావ్యరమణీయత నాస్వాదింపజేయగలవు. ఇట్టిదాని నాకాశభాషిత మందురు. పూర్వము ప్రవేశించిన పాత్రయె కర్తగా పరోక్తవచనమును అనుభాషణచ్ఛాయారూపమున పలుకవలెనని యిందలి తాత్పర్యము. ఇట్టి సంభాషణము చిత్రత నాపాదించును.

౨. ఆత్మగతము : ఇది హృదయము నందలి మాట. దీనికే స్వగతమనియు పేరు. హృదయగత మయిన మాటను ప్రయోగమున కూర్చుట యాత్మగతము. నాటకాదులలో దీనిని సవితర్కముగా గూర్చుట యుక్తము. నిరభినయముగ దీని పలుకవలయునే కాని పలుకుసమయమున నర్తానురూపముగ నభినయించుట తగదు. ఇతరములలో గొంత యభినయముండును. ఇందేమియు నుండదు. ఎదుట నుండు వ్యక్తి యాతడేమియు మాటలాడుట లేదని తలచునట్లు అభినయశూన్యముగ దీని వ్యాహరింపవలయును. ఇది యాత్మగతము.

3. అపవారితకము: నిగూఢభావసంయుక్త మగునది యపవారితక మగును. "నిగూఢభావో నిగూహనం సర్వేషాం యన్నిగూహ్యాతే ఏతఏవ శ్రుణుయాదితి" నిగూఢభావముతో గూడియుండుట = నిగూహనముతో నుండుట. రంగమునందు వారల కందరకు నిగూహన మొనరించుటలో నొకడు మాత్రమె వినవలయునని యభిసంధియుండును.

ఇతరులు వినరాదనునట్లు త్రిపతాకాదిహస్తముల నంతరాళమునందే నుంచి పలుకుట యిందుండును.

౪. జనాంతికము : ఏదియేని ప్రయోజనవశమున పార్శ్వమున నుండువారు వినకుండునట్లుగా పలుకుట జనాంతికము. అపవారితక ములో నెవరును వినరాదను సర్వనిగూహన మున్నది. ఇందు కొందరి నిగూహనమె యున్నది. రంగమున నుండువారిలో నొకరిద్దరు విన కుండునట్లు తన మాట వినవలయు వాని కొంతప్రక్కగా దీసికొని చెవిలో జెప్పుట జనాంతిక మగును.

కొందరీరెండును జనాంతిక మనియె భావించిరి. జనుని యంతిక మున బలుకుట జనాంతికము. రంగమున నలుగు రయిదుగు రుందురు. వారిలో నెవరి సమీపమున నేది పలుకదగునో వాని సమీపమున దాని బలుకుట జనాంతిక మగును. అపవారితకము కూడ ఇట్టిదె. పలుకు వాని భావములో నితరులు వినవలయునను భావముండదు. తానన్యుల నుద్దేశించి పలుకుట లేదు. ఒకనినె యుద్దేశించి తానుపలుకును. తన యా మాట నితరుడును వినవచ్చును. అట్లు వినుగావుత. ఒకని నుద్దే శించి యిట్లు చెప్పునప్పుడు ఇందేదియో రహస్యమున్నదని యిందలి ముఖ్యత్వము స్ఫురింపవలెను. వీరిద్దరేదియో మాటలాడు కొనునప్పు డితరులిందు నిగూఢాశయ మున్నదని భావింతురు. అట్లవ్యభిచరితముగ నిగూఢాశయ ముండుట యపవారితకము. హృదయగతము సవికల్పము భావస్థ మాత్మగతమె యగును. నాటకమునందిట్లు గూఢార్థయుక్తము లయిన వచనము లుండును.

౫. కర్ణోక్తము : ఇదియు చిత్రాభినయము నందలి నాటకభాష. ఒకడేదియో రహస్యము గుర్తించివచ్చి యది యప్రకాశ్య మయినం దున రంగమునందున్న యితరవ్యక్తులు వినకుండు నట్లు వినవలసిన వాని సమీపమునకేగి వాని చెవిలో నిగూఢముగ జెప్పుట కర్ణోక్త మగును. రూపకప్రయోగములో నా కర్ణోక్తము తత్సమయమున వ్యాపింపదు. అనంతరసమయమున నది స్ఫుటమగును. ఇట్టి కర్ణోక్తము నాటకమున ప్రయోగచమత్కార మాపాదింపగలదు. కర్ణోక్తములగు వచనములను ప్రయోగించువారు వినవలసినవాని చెవిలో జెప్పవలెను.

జనాంతికాపవారితక కర్ణోక్తములను మఱల మఱల పలుకరాదు. వానికి పునరుక్తి తగదు. ఆకాశభాషితము పలుకునపుడు జనాంతికాత్మగత ములు పలుకు నప్పుడును అవ్యభిచరితముగా వాని ధర్మము లనుసరింప వలెను. ప్రత్యక్షపరోక్షకృతములను ఆత్మసముత్థములను పరకృతముల నన్నిటిని యథోచితముగా ప్రయోగింప జనును.

౩.౨౧. హస్తమన్తరితం కృత్వా త్రిపతాకం ప్రయోక్తృభిః
జనాంతికం ప్రయోక్తవ్యమపవారితకం తథా

జనాంతికము నపవారితకమును ప్రయోగించువారు త్రిపతాక హస్తము నంతరాళములో కూర్పవలెను. ఇట్లు కూర్చియె మాటలు పలుకవలెను. రంగమున నుండు వ్యక్తులీ త్రిపతాకాహస్తము చూచి యటువారి మాట వినుట కుద్యమింపరాదు. "మీ రీ మాట వినరా" దనుటయె త్రిపతాక ప్రయోగమునందలి భావము. ఈ సంభాషణములె కాక స్వప్నాయితవాక్య మనునది మరియొకటికలదు. దాని ప్రయోగ మున నొకవిశేషముకలదు.

౩.౨౨. స్వప్నాయిత వాక్యార్థ స్త్వభినేయో న ఖలు హస్తసంచారైః
సుప్తాభిహితైరేవ తు వాక్యార్థైః సోఽభినేయః స్యాత్

౩.౨౩. మందస్వర సంచారై ర్వ్యక్తావ్యక్తం పునరుక్తవచనార్థం
పూర్వానుస్మరణకృతం కార్యం స్వప్నాంచితే పాఠ్యం

స్వప్నాయితము ఉత్స్వప్నాయితమును నిదురలో పలువరింతకు కలువరింతకును పేరులు. ఇట్టి స్వప్నాయితమగు వాక్యార్థము నభిన యించుటలో కొన్నివిశేషములు కలవు. తత్తద్భేదానుసారముగా వాని వాని నిబంధించుట వలన ప్రయోగరమ్యత కలుగును. స్వప్నా యితవాక్యార్థమును హస్తసంచారవిధానములచే నభినయింపరాదు. హస్తాభినయ మందుండదు. సుప్తాభిహితములగు వాక్యార్థములె యం దుండును. అట్టివాని చేనగు నభినయమె యిందపేక్షితము. నిద్రా ముద్రాముద్రితుడగు నాతడట్లుండియె పలుకుట స్వప్నాయితాభిన యము. అదియె సుప్తాభిహితము. సుప్తాభిహితములగు వాక్యార్థము లుండవలసినవిధానమున గూడ వివేక మావశ్యకము. స్వప్నాంచితము నందలి పాఠ్యము పూర్వస్మరణకృతముగా నుండవలెను. పూర్వాను

జరిగిన విషయములను స్మరించు విధముననే యుండవలయును. వర్తమానాంశములను ఆయతిలోని యంశములను నిరూపించునవిగా నుండరాదు. అట్లున్నచో వానియందు స్వప్నాయితస్వభావమున విశ్వాసముదయింపదు. వంచనాత్మకమయిన కపటవిధానమని భావింపవలసివచ్చును. అట్టియపుడు ప్రకృతరసభంగము కలుగును. అట్లు కలుగ జేయుటయె కావ్యార్థమయినచో సావధానత యింక నపేక్షితమగును. భాసుని స్వప్నచరితము (స్వప్నవాసవదత్త)నందుత్స్వప్నాయితమున్నది. సముద్రగృహకమునందు వత్సరాజు నిద్రించునప్పుడు పద్మావతీశుద్ధాంతపరిరక్షిత వాసవదత్త బ్రాహ్మణీరూపమున పద్మావతి యని వచ్చుట వత్సరాజు సుప్తాభిహితము గుర్తించి భయచకితయగుట మొదలుగాగల ప్రయోగవిధాన మత్యంతము రమణీయముగ నున్నది. భవభూతి మాలతిలో మాలతి యని ప్రక్కజేరిన మదయంతికను రాగోత్తేజితనుచేయుటకై మకరందుని సుప్తాభిహిత మసుప్తాభిహితమయ్యు రమణీయముగ నున్నది. శూద్రకుని శకటికలో రేభిలసంగీతము విని వచ్చిన మైత్రేయుని సుప్తాభిహితము రమ్యతను సంపాదించి ప్రయోగానుకూల్యము కూర్చినది. ఇట్లె యితరములందును కించిద్వైజాత్యమున నుత్స్వప్నాయితవాక్యార్థాభినయము పూర్వానుస్మరణకృతముగనె యున్నది. పూర్వానుస్మరణప్రయుక్త మయిన స్వప్నాభిహితనియత లక్షణములతో నుండవలెను. మందస్వరసంచారాదిక మీ లక్షణస్వరూపము. స్వప్నాభిహితములు బిగ్గరగా నుండరాదు. మందస్వరసంచారములతో నుండవలెను. వ్యక్తావ్యక్తస్వరూపసుందరములై యుండవలెను. పునరుక్తములగువచనముల యర్థములతో రమణీయముగా నుండవలెను. సుప్తాభిహితవచనప్రయోగవ్యవహారమున లలితగంభీరమయిన భావభావన మున్నది. సుప్తాభిహితమొనరించు వాని చిత్తరంగము వేరు. తద్భావభావన మొనరించు రంగవ్యక్తిసంచారరంగము వేరు. ఈ రెండు రంగములను సచేతోధర్మమున సహృదయుడు సంభావింపవలసి యున్నది. కావుననే మందస్వరసంచారము లావశ్యకములు. వ్యక్తావ్యక్తభాషణరీతు లావశ్యకములు. ఈ మందాయితవచన వ్యవహారము సహృదయులకు నాట్యాయిత సంవేదన మిచ్చును.

మరణకాల వాగ్వ్యాపారప్రయోగమునందు మరికొంత విశేషమున్నది. మరణకాలాభినయమున కాకుస్వరమును ప్రయోగింపవలసియున్నది. ఆ కాకువు హిక్కాశ్వాసోపేతముగా నుండుట సముచితము. మరణసమయ మాసన్నమగునేని హిక్క లనఁగు ఎక్కిళ్ళు కొందరకు కలుగును. అట్టివారి వచనములును హిక్కామిశ్రములు. కొందర కట్టిసమయమున దీర్ఘదీర్ఘతరములగు శ్వాస లతిశయించును. వారి వాక్యరీతి శ్వాసోపేతము. కాకు వనునది స్వరవిశేషము. హిక్కాదిసహిత కాకుక్రియాప్రయోగ మింకను విశేషములు కలదియై మరణకాలమున భాసించుటను గుర్తింపవలెను. "ప్రశిథిలగురు కరుణాక్షర ఘంటానుస్వరిత వాక్యగద్గదజ"ములగు మందస్వరసంచారములు కల వచనవ్యవహారము లుండుననుట నాట్యభాష. కాకువచనప్రయోగముల లోని మందస్వరసంచారములు ప్రశిథిలములుగా నుండును. స్వస్వస్థానముల నుండి భ్రంశమానములుగ నుండును. ఆయా వర్ణములకు నియతవిహితములయిన స్థానములం దవి పలుకుదనము కలవి కానేరవు. అందుననె శిథిలప్రశిథిలభావమున నుండును. జిహ్వాగ్రముగాని జిహ్వోపాగ్రముకాని జిహ్వామధ్యముకాని జిహ్వామూలముకాని స్వస్వకర్మలో నుండనేరదు. అవి యట్లు స్వకర్మాచతురములగుటచే వెలువడు నక్షరములు గురుభారము కలవై బరువు బరువుగా నున్నవై వికృతము లగును. కరుణాక్షరప్రాయములై యుండును. అప్పుడా వర్ణములు చలద్ఘంటానుకరణము ప్రధానముగ నుండును. స్పష్టముగ నవి వినపడవు. గద్గదస్వరభేదముతో నున్నవై యసంగతముగా తారమంద్రాదివిశేషములతో నుండును. అసముచితముగా నుదాత్తానుదాత్తాదులును కూడుకొనును. ఇట్ల నేకవిధముల నుండు కాకువికారమును మరణకాలవ్యవహారములో ప్రయోగమున నభినయింపవలసియున్నది.

మదమత్తులగు వారి వచనవ్యవహారము కూడ చిత్రమె. స్వాప్నాయితము నందలి పాఠ్యమువలె నతిమత్తులందు పాఠ్య మాయోజనమొనరింపవలెను. మూర్ఛితు లయినవారి వచనవ్యవహారమున హిక్కాశ్వాససముపేత మయిన కాకువును కూర్పవలెను. గద్గదస్ఖలితాక్షరముగా వృద్ధపాఠ్య ముండును. బాలకుల పాఠ్య మసమాప్తాక్షరముగ

నుండును. కలస్వనముతో నుండును. అసమాప్తమధురాక్షరరీతి బాల పాఠ్యమున సుందరము. ఇట్టిపాఠ్యరీతులు చిత్రస్వభావములు. ఈ భావ మీ కారికలనుండి గ్రహింప దగును.

౩౨౪. హిక్కాశ్వాసోపేతాం మూర్ఛోపగమే మరణవత్కథయేత్
అతిమత్తేష్వపి కార్యం తద్వత్స్వప్నాయితే యథా పాఠ్యం

౩౨౫. వృద్ధానాం యోజయేత్పాఠ్యం గద్గదస్ఖలితాక్షరం
అసమాప్తాక్షరం చైవ బాలానాం తు కలస్వనం

ఇట్టివన్నియు చిత్రాభినయములో సూచింపదగిన వచనవ్యవహారములు.

౧. ఆకాశభాషితము ౨. ఆత్మగతము
౩. అపవారితకము ౪. జనాంతికము
౫. కర్ణోక్తము ౬. స్వప్నాయితోక్తము
౭. మరణభాషితము ౮. మూర్ఛాభాషణము
౯. మదభాషితము ౧౦. వృద్ధవచనము
౧౧. బాలభాషితము

అనునివి వచనగతము లయిన చిత్రాభినయవిశేషములు. ఇందు కొన్ని నిరూపితములు. నిరూపితప్రాయములు. నిరుక్తప్రాయములు. సూచిత ప్రాయములు. ఇందు మరణప్రసంగమున నింకను సూచింపదగినవి గొన్ని విశేషములు కలవు. నాని నిట్లుగ్రహించునది.

౩౨౬. నానాభావోపగతం మరణాభినయే బహుకీర్తితం తు
విక్షిప్తహస్తపాదైర్నిభృతైర్నస్త్రైస్తథా కార్యం

౩౨౭. వ్యాధిప్లుతే చ మరణం నిష్టబ్ధగాత్రైః సంప్రయోక్తవ్యం
హిక్కాశ్వాసోపేతం తథా పరాధీనగాత్ర సంచారం

౩౨౮. విషపీతేఽపి చ మరణం కార్యం విక్షిప్తగాత్ర కరచరణం
విషవేగ సంప్రయుక్తం విస్ఫురితాగస్క్రియోపేతం

మరణము లనేకవిధముల నుండును. అన్నిటి నొకేవిధమున నభినయింపరాదు. సర్వమరణసాధారణము లయిన విధానములు కొన్ని యుండును కాని తానన్మాత్రాభినయమున విశిష్టత రాదు. తత్తదభినయవిశేషములచే మరణగతవిశేషమును గోచరింపవలెను. అట్టి స్ఫురత్తి యున్నప్పుడే సహృదయుల సంవాదముద్ర లభించును. సాను

బంధ మయిన చమత్కారము నుదయించును. అందుననె యిందు కతిపయమరణవిధానములు సంకేతితము లయినవి. పూర్వము మర ణాభినయప్రసంగమున నానాభావోపగతమగు మరణాభినయవిధానము కీర్తిత మయినది. సర్వసాధారణముగా హస్తపాదవిక్షేపము లుండుట, చిక్కబట్టిన యవయవముల బిగుసుకొనిపోవురీతి, నీలుగుకొనియుండు వాలకము, శిథిలములయిన యవయవముల యుస్సురుస్సురను సన్న పాటులు జారుపాటులును మరణాభినయమున నుండదగిన విధానములు. ఇట్టి విధానములన్నియు నిదివరలో బహుకీర్తితములె. ఇందు నిర్దిష్టము లగు వానిని గూడప్రకృతిభేదానుసారమున ప్రయోగింపవలెను. ఆ యా ప్రకృతినియతములయిన యభినయవిశేషములకు తగిన విధమున నితరముల నాయోజనము చేయుట నాట్యవిదుల నీతి.

వ్యాధిప్లుతు డయిన మానవుడు మరణభావోపగతు డయిన సన్నివేశము నభినయించునపు డభినయవిశేషము లీ విధముగా నుండ వలెను. నిమ్నగాత్రత యిందు ముఖ్యము. నితరాం సన్నగాత్రత యని తద్భావము. ప్రశిథిలగాత్రసంధిబంధముగా నుండుట ఆయా యవయవ ముల కూడలి భాగములు సడలిపోయి స్వాధీనమునం దుండని విధ మున శిథిలవిశిథిలములై జారిపోయినటులుగా నభినయించుట యిందా వశ్యకము. ఇట్లు నిమ్నగాత్రసంప్రయోగమె వ్యాధిప్లుతమరణావస్థా సూచక మగును. ఈ మరణాభినయము హిక్కాశ్వాసముపేతముగా నుండును. మాటిమాటికి నధికముగా నెక్కిళ్ళు దీర్ఘతరము లయిన శ్వాసములు నీ యభినయమున నుండును. ఇంకను గాత్రసంచార మంతయు పరాధీనముగా నుండును. పరిసరమున నుండి పరిచర్యచేయు వారలె కాలుసేతుల నటునిటు సంచరింపజేయుచు నుందురు. అనవేక్షిత గాత్రసంచారముగా గూడ నీ యభినయముండును. వ్యాధిప్లుతుని మర ణాభినయమున హస్తపాదవిక్షేపాదిసంచార మంతయు నటు నిటు నేమియు చూడని విధముననే యుండును. పాద మిటు వేయవచ్చును. అటు వేయరాదను పరిశీలన మేమియు నుండదు. ఇట్లే యితరావయవ విక్షేపమున గూడ నభ్యూహించునది.

రెండవదియైన విషపీత మరణము నందభినయవిధి వేరుగా

నున్నది. "విషం పీతమనేనేతి విషపీతః" విషముత్రాగినవాడు విష పీతుడు. జీవితనిర్వేదము కలిగి చనిపోవలయునని యొకడు విషము త్రావును. విషము త్రాగగా నావిషము శరీరమున ప్రసరించినది మొదలుగా నాతని వేదనాతిశయమున చిత్తము స్వాధీనము తప్పును. ఎనిమిది విధములుగా నాతనిలో విషవేగము వికార ముత్పాదించును, ఒక్కొక్కవేగమున నొక్కొకవిధముగా నాతడు మరణవేదన ననుభవించును. ఇట్టి మరణవేదనాభినయమున సర్వవిధవేగ సాధారణముగా కొన్ని విధానములు కలవు. అవి యా యావేగాభినయవిశేషములకు ప్రధమసూచకములుగా నుండును. కావుననె విక్షిప్తగాత్రకరచరణాత్మక మయిన విషపీతమరణాభినయము పరాధీనగాత్రసంచారాత్మకమయిన వ్యాధిప్లుతమరణాభినయముతో సదృశముగా నున్నట్లు గోచరించినను విశేషమును గోచరింపజేసికొనవలయును. వ్యాధిప్లుతములో గాత్ర మెగిరిపడదు. ఇందది యట్లుపడును. గాత్రవిక్షేపము కరవిక్షేపము చరణవిక్షేపము విషపీతములో నుండవలెను. ఈ గాత్రకరచరణవిక్షేపము లన్నియు విషవేగసంప్రయుక్తము లగును. అంగక్రియ లన్నియు విస్ఫురణములతో గూడియుండును. విషవేగవిశేషమున రక్తప్రసారవేగము నాడీస్పందము సమధికమగును గావున నంగక్రియ లెగిరెగిరిపడుటతో నుండును.

విషవేగ మెనిమిది విధముల నుండును. అందు ప్రథమవేగమున కార్శ్యమభినయింపవలెను. ఇందును విక్షిప్తగాత్రకరచరణత్వము కార్శ్యానుగుణముగ నుండును. రెండవ విషవేగాభినయమున వేపథు వుండును. తృతీయవేగమున దాహ మధికముగా నుండును. దీనినే విదాహ మందురు. చతుర్థవేగమున విలల్లిక యుండును. దాహము తీరమి నాలుక నటు నిటు చాచుట సాచుట వ్రేలాడ జేయుట యుండును. పంచమవేగమున నురుగులు గ్రక్కుట యున్నది. షష్ఠవేగమున గ్రీవాభంగము మెడవ్రాలిపోవుట యుండును. సప్తమవేగమున జడత పట్టును. అష్టమ వేగమున మరణమె కలిగి నట్లభినయింపవలయును. కార్శ్య - వేపథు - దాహ - విలల్లికాఫేన - గ్రీవాభంగ - జడతా - మరణము లెనిమిది. ఈ యెనిమిది వేగములం దనుగత

ములై యున్నవి. ఈ విషపీతమరణాభినయ మనునది సర్వదుష్ట మరణాభినయమునకు నుపలక్షణ మని యెఱుంగునది. విషము వేగా క్రమణమున శరీరధాతువులందును, శరీరగతము లయిన రసరక్తమజ్జాదు లందును ఓజఃపర్యంతము లయిన శారీరకరసధాతువులం దంతటను సంచరించి ప్రసరించును. ఒక్కొక రసధాతువులో సంచరించు నప్పు డొక్కొక బాధావిశేషము కలుగును. ఆ యా బాధావిశేషసూచకముగా నాయా యభినయ ముండవలెను.

కార్శ్యము దాహము విలల్లిక ఫేనము జడత యనువాని నభినయించుటలో నొకింత విశేషమున్నది. దాని నిట్లు గుర్తించునది.

౩౨౯. తత్ర ప్రథమే వేగే తు క్షామవక్త్రకపోలతా
కృశత్వేఽభినయః కార్యో వాక్యానామల్పభాషణం
౩౩౦. సర్వాంగవేపథుం చ కండూయనం తథాంగానాం
విక్షిప్తహస్తగాత్రం దాహం చైవాభినయేత్తు
౩౩౧. ఉద్వృత్త నిమేషత్వాదుద్గారచ్ఛర్దితై స్తథాక్షేపైః
అవ్యక్తాక్షరకథనైః విలల్లికా మభినయేదేవం
౩౩౨. ఉద్గారవమన యోగైః శిరసశ్చ విలోలనైరనేకవిధైః
ఫేనస్త్వభినేతవ్యో నిస్సంగతయా నిమేషైశ్చ
౩౩౩. అంసకపోలస్పర్శః శిరసోఽథ వినామనం శిరోభంగః
సర్వేంద్రియసమ్మోహాజ్జడతామేవం త్వభినయేత్తు

ప్రథమవేగము లోని కృశత్వము నీ విధముగా నభినయింపవలయును. క్షామవక్త్రము క్షామకపోలము నుండుట కృశత్వమున కనుగుణము. ముఖము వాడిపోయిన విధమున నుండుట కపోలము లెండిపోయిన విధమున నుండుట కార్శ్యమును సూచించును. ఆ సమయమున బలుకు వాక్యము లల్పాల్పముగా నుండును. ఆపి యాపి యాచి యాచి హీన మంద స్వరమున బలుకుట యిందలి స్వరూపము. తృతీయవేగమునందు దాహ ముదయించును. దాహ మభినయింపవలసి యున్నపుడు సర్వాంగవేపథువు ప్రదర్శింపవలెను. అంగకండూయన మావశ్యకము. దాహాతిశయమున నేమియు తోచనపుడు దేహము చిందరవందరయై కంపర మెత్తినట్లుండగా చేతులతో నటు నిటు నస్తవ్యస్తముగా గోకికొనుట సహజము. ఇట్లు సర్వాంగకండూ

యనము నభినయమున ప్రదర్శింపవలెను. ఈ వేపథుకండూయనములకు తోడు హస్తగాత్రపాదవిక్షేప ముండుటయు దాహాభినయమగును. చతుర్థవేగమున విలల్లిక యుండును. విలల్లికాభినయ మిట్లొనరింపదగును. కనురెప్పలు రెప రెప లాడుచు నుద్వృత్తములగునట్లొనరించుట విలల్లికాభినయమున కనుకూలము. తెమడ క్రక్కుట డోకుట బోకురు పెట్టుటలు దీని యభినయములు. కరచరణాక్షేపములు స్పష్టముగా నక్షరములు తెలియకుండునట్లు పలుకుటలు విలల్లికాప్రయోగమున తగియుండును. కనురెప్ప లెగురవేయుటలు రెప్పలమూతలు నిండుం డుట సహజము. పంచమవేగమునందలి ఫేనము నిట్లభినయింప వలెను. ఉద్గారవమనము లనేకవిధములయిన శిరోవిలోలనములు సంజ్ఞారహితము లయిన నిమేషోన్మేషములు ఫేనాభినయమునకు సహకరించును. ఉదరహృదయగత మయిన మలినపదార్థము విషప్రసరమున వ్యాకులమై వెలికివచ్చుటలో ననేకవిధముల కక్కులు పుట్టును. తెమడ క్రక్కుట జిగురుమియుట పసరు డోకుట తినిన యాహారమునె బొళక్కున క్రక్కుట మొదలగునవి యన్నియు వికారము పుట్టగాకలుగు విశేషములు. లోలోన దూషిత మయిన యాహారము పులుపెక్కి చేదుతిరిగి నురుగై బురబుర పొంగుటయు కలదు. అట్లాంతరముగా నురుగుండుట కాక బయటికి నదివచ్చును. నోరు నిండిన చొంగ నురుగు చెవివెల వెంట తెమడగా తెగడగా వచ్చును. సప్తమవేగమునందలి జడత నిట్లభినయింప వలెను. మాటిమాటికి భుజములపై చెంపలు మోపుట తలనటునిటు వ్రేలాడవేయుట యిందుండును. శిరోభంగ ముండును. గ్రీవాసంధిదిగజారగా మెడపై తలనిలబడక యొరిగి పోవును. ఇట్లే సర్వేంద్రియసమ్మోహము కూడ ఇందు ముఖ్య ప్రయోగము. ఇట్టి విశేషములచే జడత నభినయింప వలయును. విషపీతమరణానయమున ప్రయోగవిధానము లిట్లున్నవి. ఇచట కార్శ్య దాహ విలల్లికా ఫేనజడతాభినయములె నిర్దిష్టము లయినను వేపథు గ్రీవాభంగ మరణాభినయ విధానములును విశదములె. నాట్యధర్మానుసారముగా మరణ ప్రయోగము నందలి విశేషము నీ విధముగ గుర్తింపవచ్చును.

౩౩౪. సమ్మీలితనేత్రత్వాత్ వ్యాధివివృద్ధౌ భుజంగదంశనాద్వా
ఏవం హి నాట్యధర్మే మరణాని బుధైః ప్రయోజ్యాని

వ్యాధివృద్ధి పొందగా గలుగు మరణ మభినయించునప్పుడు గాని, సర్పపు కాటువలన గలుగు మరణ మభినయించునప్పుడు గాని సమ్మీలితనేత్రత్వ మావశ్యకము. పైన నిరూపించిన విధమున నాట్యధర్మమునం దా యా మరణముల యభినయమును తద్విధులగు బుధులు ప్రయోగింపజనును. ఇందు సమ్మీలితనేత్రత్వ మనునది యుపలక్షణము. తూలుచు సోలుచు తిరుగుటలు భూమిపై బడి పొర్లుటలు నర్తకు లభినయమున జూపదగును. ఇట్టి యభినయవిశేషము లన్నియు భావసత్త్వసంయుక్తములై యుండుట యావశ్యకము. నాట్యధర్మమునం దీ విధానము నవశ్యముగా బర్యాలోచనము చేయవలయును. కొన్ని లౌకికములయిన విశేషములున్నచో వానిని లోకమునుండియే గ్రహింపవచ్చును. "లౌకికా యే తు తే సర్వే లోకతః కార్యాః"

౩౩౫. సంభ్రమేష్వథ రోషేషు శోకావేశకృతేషు చ
యాని వాక్యాని యుజ్యంతే పునరుక్తం న తేష్విహ

౩౩౬. సాధ్వహో మా చ హే హేతికిం త్వం మా మా వదేతి చ
ఏవంవిధాని కార్యాణి ద్విత్రిసంఖ్యాని కారయేత్

సంభ్రమసమయము లందును రోషకార్యము లందును శోకకార్యము లందును ఆవేశకృతకార్యము లందును ప్రయోగము పొందు వాక్యములు పునరుక్తములు కావచ్చును. పలికిన వానినే మరల మరల పలుక వచ్చును. అట్లు పలికి నప్పుడు వానిని పునరుక్తము లయినవే యని యనవలదు. పునఃప్రయోగ మట్టి స్థలములందు భావపోషణము సంపాదించును. అట్టి పునరుక్తి దోషావహము కాదు. ప్రయోజన విశేష మాపాదించు పునరుక్తి పునరుక్తి కాదు. వీని నిట్లుదాహరణ పురస్సరముగ గుర్తింప వచ్చును. "సాధు, అహో, మా, హే హే, కిం త్వం, మావద మావద" అను సంస్కృతపదములను సంస్కృత నాటకప్రయోగములందు సమయౌచిత్యము గుర్తించుచు రెండుమూడు పర్యాయము లావృత్తి మొనరించి పలుకవచ్చును. ఇది సంస్కృత ప్రక్రియ. "బాగు బాగు ఆహా! ఆహా! ఓహో! ఓహో! నీవా?

నీవా ? మాటలాడకుము ? మాటలాడకుము ? అనునిట్టి వచనములను ద్విత్రిపర్యాయములు పలుకవచ్చును. పునరుక్తప్రక్రియలలో శబ్ద పునరుక్తము అర్థపునరుక్తము నుండును. "బాగు బాగు" అనునట్టివి శబ్దపునరుక్తములు. "అహో సాధు భద్రం" మొదలగునవి యర్థపునరుక్తములు. అవి కాని యివికాని యేవియు దోషములు కావు.

338. ప్రత్యంగహీనం యత్కావ్యం వికృతం చ ప్రయుజ్యతే
న లక్షణకృతస్తత్ర కార్యస్త్వభినయో బుధైః

కొన్ని కావ్యరూపకము లంగప్రత్యంగశోభారమణీయములై సర్వాభినయప్రయోజ్యములు కాగలవు. కొన్ని యట్లు కాజాలవు. ప్రహసనప్రధానము లగునవి యట్టివి. వానియందు ప్రత్యంగశోభ యుండదు. వస్తువిస్తరమున కంగసంయోజనము మాత్ర ముండును. అంగసంయోజనమును లేకున్నచో ప్రహసనోత్పాదనమున కేని వస్తువు సమర్థము కాదు. అంగముల కంగములగు ప్రత్యంగము లంగ సౌందర్యహేతువులు. అవి యొకానొక సంస్కారవిశేష మాధానించు నవి యగును. అట్టి ప్రత్యంగహీనమగు కావ్యము వికృతము. వికృత కావ్యము ప్రహసనప్రధానమె కావున నందభినయము నలాక్షణికముగ నుండుటయె యుక్తము. విరూపాభినయము కూడ హాసము కలుగ జేయును. ఆ యభినయ మెట్లున్నను హాసమె కలుగును. అట్టిపట్ల నున్న లాక్షణికాభినయము కూడ ఆనందముత్పాదింపదు. హాసమునె కలుగజేయును. ఎట్టి వికృతాభినయమయినను పరిహాసము కలుగ జేయును. అందు వికృతత్వకృతమయిన యంశమె సభ్యులకవభాసించును. అభినయకృతమయిన యంశమవభాసించదు. కాగా నిది నిర్ణయము. ప్రత్యంగహీనవికృతరూపకప్రయోగమున లాక్షణికాభినయ మొనరింపరాదని బుధనిర్ణయము.

ఇక సర్వానుగ్రాహకమయిన సామాన్యలక్షణ మావశ్యకము. సత్త్వభావసంయుక్తము లయిన యభినయవిశేషముల ప్రయోగించుటలో నంతట నేకవిధానము యుక్తముకాదు. ఆయా ప్రకృత్యనుసారముగా నభినయవిశేషముల ప్రయోగింపవలసి యున్నది. ఇందు సర్వానుగ్రాహకమయిన సామాన్యలక్షణనీతి యున్నది.

33ల. భావే య ఉత్తమానాం తు న తం మధ్యేషు యోజయేత్
యో భావశ్చైవ మధ్యానాం న తం నీచేషు యోజయేత్
33౯. పృథక్ పృథగ్భావరసైరాత్మచేష్టా సముత్థితైః
జ్యేష్ఠమధ్యమనీచేషు నాట్యం రాగం హి గచ్ఛతి

ఉత్తముల భావము మధ్యముల భావము నీచజనుల భావము వేరువేరుగా నుండును. వానికి సాంకర్యము తగదు. ఉత్తముల భావమును మధ్యజనులయందు కూర్పరారు. మధ్యజనసంబంధి భావమును నీచజనులందు గూర్పరాదు. ఇట్టిరీతిని విలోమముగ గూడ గుర్తింపవలెను. నీచజనుల భావము నుత్తములందు కూర్పజనదు. మధ్యములందు గూర్పజనదు. అపర్యాలోచితముగ నట్లు కూర్చినచో ప్రయోగ వైరస్యము కలుగును. జ్యేష్ఠమధ్యమనీచజనులయందు వారివారి చేష్టాజన్యములయిన వేరువేరుగానుండు భావరసములను సావధానముగ గుర్తించి నిరూపింపవలెను. అట్టి ప్రకృతిసహజపృథక్పృథగ్భావరసములచే నాట్యము రాగము కలదియగును. అట్టి నాట్యమందరకు రంజకము కాగలదు. ఇట్లీ వ్యుత్పత్తి సర్వాంగ్రాహకమయిన సామాన్య లక్షణము.

చిత్రాభినయము సామాన్యాభినయమునకు శేషరూపమనుట యిదివరలో నిరూపితమె. ఇంతవఱకు నిరూపించిన యీ యర్థముల పరిశీలింపగా నీ యంశము స్పష్టమె యయినది. అయినను చిత్రాభినయముఖమున మఱల నిరూపించి యుపసంహార మొనరించుట యుక్తము.

3౪౦. ఏతేఽభినయవిశేషాః కర్తవ్యాః సత్త్వభావసంయుక్తాః
అన్యే తు లౌకికా యే తు తే సర్వే లోకవత్కార్యాః
3౪౧. నానావిధైర్యథా పుష్పైః మాలాం గ్రథ్నాతి మాల్యకృత్
అంగోపాంగైరసైర్భావైస్తథా నాట్యం ప్రయోజయేత్

ఈ యభినయవిశేషములన్నియు సత్త్వభావ సంయుక్తములు కావలెను. ఇట్లనుట సత్త్వాతిరిక్తమయిన యభినయ మాత్మగ్రాహి కాజాలదని నిరూపించినట్లయినది. లౌకికములయిన యభినయములను లోకానుసారముగనే చేయవచ్చును. ఈ చెప్పిన వానిలో లోకసహజములు నాట్యసహజములు కలవు. నాట్యధర్మానుసారములగు వాని

కన్నిటికి సత్త్వభావసంయోగ మావశ్యకము. అవి యట్లయిననె సహృదయతర్పణము కలుగును. మాల్యము నిర్మించు మానవుడు నానావిధములగు పుష్పములను యథానుకూలముగా కూర్చి మాలానిర్మాణము కావించును. అట్లే నానావిధములయిన యంగోపాంగశోభారమణీయములగు రసభావముల నిబంధనముతో నాట్యప్రయోగవిదుడగువాడు నాట్యము ప్రయోగింపవలెను. ఇందు నానావిధములనియనుట యభినయముల సమానీకరణము సూచితమగును. చిత్రతయు నాసూత్రితమగును. నానాపుష్పములుకూడి మాలాసౌందర్యమిచ్చును. నానారసభావములు నాట్యసౌందర్యము కూర్చును. అనేకస్వభావములం దఖండైక స్వభావసంపద యుండుట యంతట ప్రసిద్ధమె.

కొందరు కొందరు నాట్యప్రయోక్తలు నియతమగు నొకక్రమము నవలంబింతురు. ఆ క్రమానుసారమున వేరొక క్రమము ననుసరింతురు. ఒక క్రమమునుండి క్రమమనుసరించుట యంతయు శ్రమావహమె యగును. అయిన నా శ్రమవశమున నాట్యోపచయమున్నదని వారి భావనము. ఇది యుక్తమె యయినను అంతగా స్వీకార్యము కాదు. లలితరమ్యమయిన నాట్యవిధానమున నిరంతరశ్రమవలన గలుగు నాట్యాతిశయము సహృదయప్రశంసాస్పదము కాదు. అట్టివాని యందు నాట్యదక్షులయిన సచేతసులు శ్రమదర్శనమున నాట్యోపచయము సంభావింపరు. కావున నట్టియుపచితత్వపరిత్యాగము యుక్తము. ఇట్టి పరిత్యాగమును ప్రయత్నపూర్వకముగా పరిరక్షించుట యావశ్యకము. జన్మసహజముగా నటనము కల నటుడత్యంతము శ్రమాభ్యాసమున నుండవలసిన యవసరములేదు. అతని నటనము లీలాప్రాయము. ఈ యంశమిందు విశదమగును.

౩౪౨. యా యస్య లీలా నియతా గతిశ్చ రంగప్రవిష్టస్య విధానయుక్తా
తామేవ కుర్యాదవిముక్తసత్త్వో యావన్నరాగాత్ప్రతినిర్వృతః స్యాత్

రంగము ప్రవేశించి నటించు నటునకు సహజముగా నయత్న కృతముగా నెట్టి లీలావిశేషముండునో యెట్టి నియతగతి యుండునో యాతడా లీలావిశేషమను ఆ నియతిగతిని సత్త్వమువిడనాడక యనుసరింపవలెను. నటుడవిముక్తసత్త్వుడై యభినయించుట చాలును. అట్టి సత్త్వసంబంధముననె సర్వము సిద్ధము కాగలదు. అందుననె

"యవిముక్తసత్త్వః" అని యనుట సంగతము. అంతమాత్రముండుట చాలును. అంతియె కాని ప్రత్యేకముగా సత్త్వావష్టభము కలవాడు కానక్కఱలేదు. పరిత్యక్తావష్టంభమున నటించుట యుక్తము. అభినయింపవలెన్న యభిమానమున పట్టుబట్టి యభినయించినచో నా యభినయము కృతకమై శోభింపదు. రంగమున నున్నంతవఱకు కాతడల్లై సత్త్వావష్టంభమున నభినయించుట శోభావహము. రాగాభినివేశమున ప్రతినిర్వృతుడు కానంతవఱకది రమ్యముగనె యుండును. రాగబంధమునుండి నివృత్తిపొందనంతవఱకది రమ్యతనాపాదించుచునె యుండును. నటుడు విషయనిర్వృతుడగు నేని రంగమునుండియు నివృత్తుడగును. కాన రంగమున నున్నంతవఱకల్లై యుండునని భావము. జనుడు నటుడగుట కష్టము. రంగమున ప్రవేశింపగల్గుట కష్టము. సత్త్వయుక్తుడగుట దుర్లభము. అవిముక్తసత్త్వుడగుట మరియు కష్టము. ఇంతయుండియు లీలాసహజప్రకృతి యగుట నియతగతికలవాడగుట దుర్లభము. అన్నియుకలవాడు భావావేశమున రాగావేశమున నన్నియు సహజసుందరముగా జేయగలడు. రాగనిర్వృతుడై సర్వమాచరింపగలడు. అట్టివానికి క్రమక్రమమున శ్రమాభ్యాసవశమున నాట్యోపచయసంపాదన మావశ్యకము కాదు. ఇట్లు విశిష్టార్హత కలవానికి క్రమక్రమనాట్యోపచితి యవసరము కానంతమాత్రమున నటులకందర కది యావశ్యకము కాదని భావింపవలదు. విశిష్టనటుని లీలాగతివిశేషములు రమ్యములుగా నుండుగావున వానిని స్వీకరింపవలయు ననుట దీనిభావము. అట్టి యాతడధికముగా శ్రమపడకున్నను సహృదయ సంతర్పణము కావింపగలడు.

ఇప్పటి కిట్లీవిధముగా నాట్యమున నభినయప్రకారములు క్రమముగా నిరూపితములయినవి. నాట్యసమాశ్రయము లయిన భావముల నిరూపించుట యయినది. ఈ నిరూపణమున నభినయప్రకార మింతమాత్రమె యని భావింపవలదు. ఇందు నిరూపితములు కాని యభినయములును గలవు. అవియన్నియు లౌకికములు. లౌకికముల నన్నిటి పరిగణించుట వాని లక్షణము నిరూపించుట శక్యక్రియ కాదు. లౌకికముల నన్నిటిని లోకమునుండియే గ్రహింపవలెను. నాట్యవిదులగు

బుధులును లోకమునుండి గ్రహించి లక్షణపరిష్కారమున గ్రహింప దగును. "అన్యే తు లౌకికా యే తే లోకాద్గ్రాహ్యాః సదా బుధైః" లోకమునుండి లౌకికములను గ్రహింపవలెననుట శంకాస్పదముగా నున్నది. లోకమనగా నేమి ? సామాన్యజీవనయాత్రలో మగ్నులున్న గ్నులు నగు సామాన్యమానవులె లోకశబ్దవాచ్యు లగుదురా ? అట్టి వారినుండి నాట్యాభినయరీతులను గుర్తింపవలెననుట శిష్టసమ్మత మగునా ? ఇట్టి యంశసంశయనివారణమునకై యిది నిరూపించుట యావశ్యకము.

౩౪౩. లోకో వేదస్తథాధ్యాత్మం ప్రమాణం త్రివిధం స్మృతం
వేదాధ్యాత్మపదార్థేషు ప్రాయో నాట్యం ప్రతిష్ఠితం
౩౪౪. వేదాధ్యాత్మోపపన్నం తు శబ్దచ్ఛన్దస్సమన్వితం
లోకసిద్ధం భవేత్సిద్ధం నాట్యం లోకాత్మకం తథా
౩౪౫. న చ శక్యం హి లోకస్య స్థావరస్య చరస్య చ
శాస్త్రేణ నిర్ణయం కర్తుం భావచేష్టావిధిం ప్రతి
౩౪౬. నానాశీలాః ప్రకృతయః శీలే నాట్యం ప్రతిష్ఠితం
తస్మాల్లోకప్రమాణం హి విజ్ఞేయం నాట్యయోక్తృభిః

లోకము వేదము అధ్యాత్మమని ప్రమాణము మూడు విధముల నున్నది. లోకమనగా లోకప్రసిద్ధము లయిన ప్రత్యక్షానుమానాగమ ప్రమాణములు. వీనిని లోకశబ్దమున వ్యవహరింతురు. అట్లు సంకేతించి వ్యవహరించుట యుక్తము. వేదమనగా నాగమము. అది యథాతథ ముగ నియతస్వరూపము కలదై యున్నది. వేదచతుష్టయమునకు వేదమని వ్యవహారము. ఈ వేద మను నాగమము లోకసిద్ధముగగూడ నున్నది. న్యాయము = యుద్ధనియుద్ధనిఃసృత గతిప్రచారవిశేషముల విషయమున ధనుర్వేదము లోక ప్రసిద్ధాగమము. స్వరతాలాది విధానమున గాంధర్వవేదము లోకప్రసిద్ధాగమము. అధ్యాత్మ మనునది స్వాత్మసంస్థమయిన వేదనము. పరిణతప్రజ్ఞ కలవానికి గలుగు స్వాత్మ ప్రత్యయము.

"సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః"

అని కవికులపతి యనినాడు. ఇట్లు వేదాధ్యాత్మప్రమాణములచే ప్రమి

తములగు పదార్థములందు సామాన్యముగా నాట్యము ప్రతిష్ఠితమై యున్నది. వేదాధ్యాత్మనిర్ణీతములందె నాట్యము ప్రతీతమగుట యేమి? వేదప్రతిపన్నము అధ్యాత్మోపపన్నము శబ్దచ్ఛందస్సమన్విత మగును గావున వేదాధ్యాత్మ నిర్ణీతములందే నాట్యము సుప్రతిష్ఠిత మగును. వేదాధ్యాత్మప్రతిపన్నములందె శబ్దసమన్వయము ఛందస్సమన్వయము సంగతమగును. కావుననె వానియందు "నాట్యం ప్రతిష్ఠితం." శబ్ద సమన్వయమనునది వ్యాకరణముచే సిద్ధమగును. అభిధానకోశముచే సిద్ధమగును. ఆగమములచే సిద్ధమగును. ఛందస్సమన్వయమనునది స్వసంవేదనసిద్ధమగు సమన్వయము. సంవిత్సంవేదనము కల సహృదయుడు స్వసంవిత్సిద్ధమయిన విశేషమును తన యభీష్టరాగభాషాదులలో సంగతపఱచి యాస్వాదించును. ప్రగతములకు సంబంధించిన శ్రవ్యవతాసంపదను తద్విదుడగు వ్యక్తి రాగభాషాదులకు సంబంధింపజేసి యాస్వాదించుట లోకమున గలదు. ఇట్లు శబ్దచ్ఛందస్సమన్వయములుండుగావున వేదాత్మనిర్ణీతపదార్థములందే "నాట్యం ప్రతిష్ఠితం" అనుట సంగతము. ఇట్టిచట ఆగమస్వసంవేదనములను జెప్పుట ప్రమోపలక్షణమె యగును. ఎల్లెని ప్రమాణములచే ప్రతిపన్నములనె గుర్తింపవలెను.

ఇక లోకము ప్రమాణమనుట పరిశీలింపవలెను. లోకసిద్ధ మగునది సిద్ధమె. అది యెవ్వరికి నసిద్ధముకాదు. ఎంతటి నాట్యసమర్థుడయినను లోకప్రసిద్ధి నపహ్నవ మొనర్పజాలడు. ఒక్కొక్కనికి లోకప్రసిద్ధ మాత్మాసిద్ధముగా నుండవచ్చును. లోకసిద్ధమునందు తనకు సరియగు సంప్రతిపత్తి లేకపోవచ్చును. సువిప్రతిపన్నవిషయ మయినను లోకప్రసిద్ధమైనచో నాట్యవిముడు కాదనరాదు. అట్లాతడు కాదనునేని కాష్ఠపాషాణతాపత్తి తప్పనియది యగును. బుధులగు వారొకరొకరు తమతమ సమాలోచనాబల మనుసరించి వైయక్తికముగా నాట్యసౌందర్య మాస్వాదింతురు. లోకులట్లుగాదు. సమాలోచన మక్కఱ లేకుండగనే స్వస్పందసంవాద సౌందర్యమున సామూహికముగా నొక్కపర్యాయమె నాట్యసౌందర్య మాస్వాదింతురు. రసభావప్రత్యయానుకూలమయిన సత్త్వావష్టంభసంపద యున్నందుననె వారట్లా యఖండాస్వాద మనుభవించుచున్నారు. ఇట్లు లోకసిద్ధమును నాట్య

బుధు డుపలాపించు నేని యాతడు రంగాంతఃప్రదేశమున కాష్ఠప్రాయు డని పాషాణప్రాయుడని యనవలసివచ్చును. అట్టివారు "కాష్ఠకుడ్యాశ్మసన్నిభాః" కావునను నాట్యము లోకాత్మకము. లోకానుకీర్తన రూపము. చరస్థావరాత్మక మయిన లోకమునకు సంబంధించిన యే యంశమును శాస్త్రమున నిర్ణయ మొనరింప శక్యముకాదు. లోకమునకు సంబంధించిన భావచేష్టావిధాన మేమాత్రము శాస్త్రనియత మొనరించుట కుదురదు. లోకము దేనిని ప్రత్యయమున స్వీకరించినదో దానినె యాగమము నిరూపించునని యిక లోకవిలోకన మక్కర లేదని భావించువారి భావన మభావన మగును. లోకసిద్ధమును శాస్త్రసాధ్య మొనరింపజాలమనుటయె యుక్తము. దేవఋషి రాజజానపదుల పూర్వవృత్తానుచరిత మంతయు నాట్యముకదా! నానావస్థాంతరరూప మయిన లోకవృత్తాంతమును నాట్యవేదవిచక్షణులు నాట్యమున గూర్పదగును.

"యాని శాస్త్రాణి యే ధర్మా యాని శిల్పాని యాః క్రియాః
లోకధర్మప్రవృత్తాని తన్నాట్యమితి సంజ్ఞితం"

శాస్త్రములు ధర్మములు శిల్పములు క్రియలు సర్వము లోకధర్మప్రవృత్తము కావున నది నాట్యసంజ్ఞిత మయినది. లోకధర్మము ననుసరించు శాస్త్రము లోకధర్మమును శాసించి నిరూపింపజాలదు. లోక మేకవిధము కాదు. "నానాశీలాః ప్రకృతయః" లోకస్వభావములనేక విధముల నున్నవి, వాని నియమించు శక్యముకాదు. "శీలే నాట్యం ప్రతిష్ఠితం" శీలమునందు నాట్యము ప్రతిష్ఠితమై యున్నది. కావున నాట్యప్రయోక్తలగువారు లోకప్రమాణము ననుసరింప వలసియున్నది. లౌకికములను లోకముననె గ్రహింపవలసియున్నదనుట యిచటి నిర్గలితార్థము.

౩౪౭. ఏతా న్విధిం శ్చాభినయస్య సమ్యక్
విజ్ఞాయ రంగే మనుజః ప్రయుంక్తే
స నాట్యతత్త్వాభినయ ప్రయోక్తా
సమ్మానమగ్ర్యం లభతే హి లోకే
౩౪౮. ఏవమేతే హ్యభినయా వాఙ్నేపథ్యాంగసంభవాః
ప్రయోగజ్ఞేన కర్తవ్యా నాటకే సిద్ధిమిచ్ఛతా

నాట్యమానవు డీ యభినయమునకు సంబధించిన విధివిధానముల నన్నిటిని దెలిసికొని రంగమున ప్రయోగింపవలెను. సామాన్యాభినయారంభముగా నింతవరకు నిరూపితములయిన యభినయ విధు లన్నియు కర్తవ్యతారూపము లయినందున వాని నన్నిటినిచక్కఁగా దెలియవలెను. కోహలాదిశాస్త్రలక్ష్యప్రవాహసిద్ధ మగు చిత్రాభినయమును గూడ సావధానముగా దెలియవలయునని సూచితమయినది. ఇట్లు వానినన్నిటిని దెలిసి రంగమున బ్రయోగించు మనుజుడు నాట్యతత్త్వాభినయప్రయోక్త యగును. లోకమున ప్రముఖసమ్మానమును పొందును. వాఙ్నేపథ్యాంగసంభవము లయిన యభినయములను ఈ వాగాదిప్రమాణత్రయానుసారమున దెలిసియె నాట్యసభలో ప్రయోగింపవలెను. అట్లు ప్రయోగించునాతడె నాట్యమున తత్త్వతః అభినయముల ప్రయోగించు వాడగును. ఆతడె సమ్మానము పొందును.

ఇచటి యీ ప్రఘట్టనిరూపిత మయిన దంతయు నభినయశేష భూతమితికర్తవ్యతారూపము. ఇదియంతయు పరస్పరసమ్మేలనాత్మక మయిన ప్రయోగము. అంగములుపాంగములు పరస్పరము మేలనము పొంది ప్రధానాంగములై శోభాసంపాదకములగును. ఇట్టి యీ ప్రయోగము లేకున్న నెట్టి నాట్యసిద్ధియు గలుగజాలదు. ఇదియున్న నె సర్వసిద్ధియు గలుగును. ఇట్లనుటచే సామాన్యాభినయప్రయోక్త లగు వారల నందర నెచ్చరించి ప్రబోధించి నట్లయినది. చిత్రాభినయ ప్రసంగము ననుసరించి యుదాహరణార్థముల గుర్తించుట కష్ట కార్యము. సంప్రదాయప్రవాహవిచ్ఛేదము లేకుండవలయునని యభినవ గుప్తుడును కొంతకొంత నిరూపించియు నిరూపిత మంతయు నూహా విపృద్ధికేయని యనెను. ఇట్టివాని ప్రతిపాదనమున "అపి వాచస్పతేర్వాణీ కుంఠా కిముత! మాదృశాం" అనెను. శివానుగ్రహశాలి యభినవభారతీబ్రహ్మయె యిట్లనుట దీనిప్రాశస్త్య వ్యాఖ్యానము.

# ప్రకృతివికల్పము

సామాన్యాభినయము సమానీకరణ మాపాదించునదిగా నిర్ణీతము ప్రస్తుతము నయినది. అభినయములలో నన్యోన్య ముపదేశింప దగినది యుపదేశించిన పిమ్మట అభినయించు వారలకు అభినేయమునకును సమానీకరణ ముపదేశింప వలసి యున్నది. అభినయ మభినేయద్వారమున నభినయించు వానితో బాటు సమానీకృతము కాగలదు. అభినయ మొనరించు వానికి నభినయమున కీ సమానీకరణ మనునది సామాన్యాభినయరూపము. అది యీ ప్రకృతివికల్ప ప్రస్తావములో నిరూపితము కా గలదు. ఈ యంశమును సూచించుటకు రంగప్రయోగమని ప్రయోక్తయని ప్రయోగజ్ఞతయని పూర్వ మాసూత్రితమయినది. ప్రయోజ్యస్వరూపమును ప్రయోజక స్వరూపమును చక్కగా తెలిసిన యాతడె ప్రయోగమును తెలియగలడు. "స ఏవ హి ప్రయోగం జానాతి యః ప్రయోజ్యప్రయోజకస్వరూపవిత్" కృతి, ప్రయోజ్యము, అనుకరణీయము, అనుకీర్తనీయము అనునవి నాట్యభాషలో పర్యాయములు. ప్రయోగ మొనరించు ప్రయోక్త ప్రయోజ్యసదృశుడు కావచ్చును. విసదృశుడు కావచ్చును. ఉభయాత్మకు డేని కావచ్చును. ఇందు సదృశ మనురూపము. విసదృశము విరూపము. ఉభయాత్మకము రూపానురూపము. వీని యన్నిటిలో గూడ సాదృశ్య ముపలక్షిత మగును. సాదృశ్య మున్నందుననె యానురూప్యము కలుగును. ఆనురూప్యవైరూప్యములు రెండు కూడి యుండగా రూపానురూపసిద్ధి యంటిమి. వైరూప్యము నందు నొకింత సాదృశ్యమంతర్గర్భముగా నుండుట తెలియ వచ్చును. ఇట్లు వీని యందంతట త్రైవిధ్యము సంభవించును. కాని సముద్రిక్తము సంప్రాప్త సకలలోకసంవాద మయిన యస్మాదృశ (అభినవ) బుద్ధి యిట్లు భావించుచున్నది. ప్రయోగమునందు పురుషుని యభినయమును పురుషుడు ప్రయోగించినను, యువతుల యభినయమును యువతి ప్రయోగించినను సదృశవ్యవహారము సముచితము. పురుషాభినయమును వనిత ప్రయోగించినను, వనితాభినయమును పురుషుడు ప్రయోగించినను వైసా

ము వైరూప్యము భావింప వలెను. ప్రయోక్తలగు మానవులు

సింహావదన దశవదన గజవదన హయవదనుల యభినయముల ప్రయో గించినచో నప్పటి సాదృశ్య మన్యసాదృశ్య మగును. ఇట్లనురూప విరూప రూపానురూప ప్రకృతి త్రైవిధ్యము సంగత మగుచునే యున్నది. ప్రకృతి త్రైవిధ్యము ప్రదర్శించుట యావశ్యకము.

౩౫౦. అనురూపా విరూపా చ తథా రూపానురూపిణీ
త్రిప్రకారేహ పాత్రాణాం ప్రకృతిశ్చ విభావితా
౩౫౧. నానావస్థా క్రియోపేతా భూమికా ప్రకృతిస్తథా
భృశముద్యోతయేన్నాట్యం స్వభావకరణాశ్రయం

పాత్రల ప్రకృతి యనురూపము విరూపము రూపానురూపమని మూడు విధములుగా విభావిత మయినది. నానావస్థాక్రియాసము పేత మయిన భూమిక ప్రకృతి యయినది. కాగా నది స్వభావకరణా శ్రయ మయిన నాట్యము నత్యంత ముద్యోతింపజేయును అని సర్వ మూలార్థము. పాత్రలందు రస మాహిత మగును. రసధి యగు పాత్ర బుద్ధి కలుగగా నటబుద్ధి తిరోహిత మగును. నటబుద్ధి తిరోహిత మగుట యావశ్యకము. నటబుద్ధి విగలిత మయిననే కాని యాస్వాదము కలుగదు. ప్రకృతి నటబుద్ధిని దూరీకరింపజేయును. "ప్రకర్షేణ క్రియతే సాక్షాత్కారకల్పానువ్యవసాయ గోచరత్వమీయత ఇతి ప్రకృతిః" నాట్యనిక్షిప్త మయిన రససంవేదనము ప్రకర్షముగా సాక్షాత్కార కల్ప మయిన యనువ్యవసాయమునకు గోచరీకృతమగును గావున నిది ప్రకృతి యగుచున్నది. ఇట్టిదిది సర్వసమాహారరూపముగా నుండు మొదటి యవస్థలో ప్రవిభాగరహితముగా నున్నను అనంతర ముద యించు త్రిప్రకారప్రకృతిప్రవిభాగము గలదై నాట్యమును భృశ ముద్యోతింప జేయుననుటచే జ్ఞాన ప్రయోజనమును సూచిత మగు చున్నది. నాట్యము స్వభావకరణాశ్రయము కదా! "ప్రయోజ్యస్వభావో హి నాట్యేకర్తవ్యః" ప్రయోగమున ప్రదర్శింపదగిన యనుకరణీయుని స్వభావము నాట్యమున నుద్యోతితము కావలసి యున్నది. సుకుమార స్వభావు డైన పురుషుడు ప్రయోజ్యుడై యుండగా లాలిత్యము సౌకుమార్యము నిరూపింపవలెను. అవి స్త్రీజనమున కయత్నసిద్ధములు కావున నప్పుడు స్త్రీజనమె యందులకు సిద్ధపడవలయును. వారినె నియమింపవలెను. అప్పుడు రూపానురూప మయిన ప్రకృతిని సంభా

వింప వచ్చును. ఉద్ధతపురుషుడు ప్రయోజ్యుడయినపుడు తత్ప్రయోగమునకు స్త్రీజనము తగదు. అప్పుడు పురుషుడె ప్రయోక్త యగుట యుక్తము. అది అనురూప ప్రకృతి. స్వభావసహజస్వరూప మయిన ప్రకృతిలో ననుకీర్తనము యత్నమున సంపాదింపదగి యుండును గావున నప్పుడు ప్రయోక్త యధికముగా నవధానము స్వీకరింపవలసి యుండును. అట్లు సావధానత సముచితము.

కానియిట్లని యనురూపప్రకృతియె యంతట సముచితమనిపించును గాబోలును! అట్లుగాదు. నానారూపప్రకృతి యుక్తము. అందునన ప్రకృతి నానావస్థాక్రియోపేతమని యనుట, నానాప్రకారములయిన యవస్థలతో నానాక్రియలతో ప్రకృతి కూడియుండును. విలాసలాలిత్యోద్ధత్యాదులు ధర్మ్యము లవస్థలని, సుకుమారోద్ధతాత్మకములయిన యుద్యానగమన, యుద్ధసన్నాహనాదులు క్రియలని గుర్తింప వచ్చును. ఇట్లు నానాత్మకప్రకృతియే యుక్తము. ఈ ప్రకృతి భూమికగా నుండును. పర్యాయమున ప్రకృతిస్వరూపము స్పష్టముచేయుట కీ భూమికాపద ముపయోగించును. భూమి యవష్టంభస్థానము, ధ్యానపటము నందున్న సదాశివభగవానుడు దశభుజముల నుండ వచ్చును. పంచవక్త్రముల నుండవచ్చును. ఆ సదాశివునందు ధిషణానివేశమొనర్చుటయె ముఖ్యము. అప్పు డచట తద్దేశత్వ తత్కాలత్వము లాదర్తవ్యములు కావు. తత్సిందూర హరితాలాది కృతద్రవ్యమేనియు భావింపదగినది కాదు. ఆ ద్రవ్యము కేవల మవష్టంభస్థానము. సదాశివ భావనలో నితరము సర్వమాధారమాత్ర మయి నట్లు రామాదులును కేవల మవష్టంభస్థాన మనియె భావింపవలెను. ఈ యంశమంతయు రసప్రసరములో వితతముగా నిరూపితమె యయినది. కాన— "భూమిరివ భూమికా" భూమిక భూమివలె నాధారమాత్రముగ నుండును. అరూపప్రకృతి యేమాత్రము సంభావ్యము కాజాలదు. సరూపమె సంభావ్యము. స్వరూపసంభావనమున కిది భావనీయము.

312. బహుబాహుబహుముఖా స్తథా చ వికృతాననాః
పశుశ్వాపదవక్త్రాశ్చ ఖరోష్ట్రాశ్చ గజాననాః

**౩౫౩. ఏతే చాన్యేచ బహవో నానారూపా భవంతియే**
**ఆచార్యేణ తు తే కార్యా మృత్కాష్ఠజతుచర్మభిః**

రంగప్రయోగములో ననేకవిధముల నుండువారి యనేకవిధములయిన రీతు లుండును. కొందరు బహు బాహువులతో నుందురు. కొందరు బహుముఖముల నుందురు. కొందరి ముఖములు వికృతముగా నుండును. కొందరు పశుముఖులు, కొందరు మృగముఖులు, గోముఖులు, అశ్వముఖులు, శ్వాపదవక్త్రులు, కొందరు సింహవక్త్రులు. కొందరు ఖరముఖులు, కొంద రుష్ట్రముఖులు, గజాననులు, హయవదనులు. ఇట్ల నేకదేహులు, అనేకరూపులు. ఇట్లు బహుప్రకృతులులున్నవి. వాని వాని యనుకరణాభినయములందు తత్తదాచరణము తత్తద్వదన మావశ్యకము. ఇట్టి బహ్వాకృతుల నన్నిటి నావశ్యకముగా నాచార్యుడు మృత్ - కాష్ఠ - జతుచర్మములచే నిర్మింపజేయవలయును.

౩౫౪. స్వాభావికేన రూపేణ ప్రవిశేద్రంగమండలం
ఆత్మరూపమవచ్ఛాద్య వర్ణకైర్భూషణైరపి
౩౫౫. యాదృశం యస్య యద్రూపం ప్రకృత్యా తత్ర తాదృశం
వయోవేషానురూపేణ ప్రయోజ్యం నాట్యకర్మణి

అనుకీర్తనీయులయిన రామాదుల స్వభావ సముచితమయిన రూపముచే నాత్మరూపము ననగా నటరూపము నాచ్ఛాదించికొని రంగమండలము ప్రవేశింపవలెను. మృత్కాష్ఠాదులచే బాహువక్త్రాదులనునిర్మించుకొనగా, వర్ణకములు భూషణములు కూర్పగా నటరూప మాచ్ఛాదితమగును. ఆత్మరూప ప్రచ్ఛాదనముతో రంగమండలము ప్రవేశించినప్పుడె నటుడు స్వాత్మవిస్మృతిని అనుకరణీయ తాదాత్మ్యమును పొందగలుగును. అప్పుడె భావుకుల కాస్వాద ముదయింపగలదు. అనుకరణీయ వ్యాప్తి కెట్టిరూపముకలదో తత్త త్ప్రకృత్యను సారమున నా రూపమేర్పడును. నాట్యకర్మయందు వయో వేషానురూపముగా సర్వము ప్రయుక్తము కావలెను. నాట్య కర్మానుకారములో సంతత సవష్టంభయోగము ప్రధానమగుచున్నది.

౩౫౬. యథాజీవః స్వభావం హి పరిత్యజ్యాన్యదైహికం
పరం భావం ప్రకురుతే పరభావం సమాశ్రితః
౩౫౭. ఏవం బుధః పరంభావం సోఽస్మీతి మనసా స్మరన్
తేషాం వాగంగలీలాభిశ్చేష్టాభిస్తు సమాచరేత్

అన్యదేహాగతమయిన జీవత్స్వభావమును విడనాడి పరభావము నాశ్రయించి పరమభావమునె యనుకరించుట లోకమున ప్రసిద్ధము. అట్లి నాట్యబుధుడగు నటుడు "సోఽహమస్మి" "సోఽస్మి" "సోఽహం" యని మానసమున భావించుచు వారి వారి వాగంగ లీలాత్మకము లయిన చేష్టలచే పరంభావము నాచరింపవలెను. రామాదికమయిన పరంభావమును వేషాదులచే ననుసరింపవలెనని ప్రకృతార్థ సంబంధము. "సోఽస్మి" యనెడు మానస సంభావనములో నత్యంతము తల్లయా ద్యనుసరణముండదు. అది యశక్యము. నటునకు స్వాత్మావష్టంభము వీడిపోదు. "అహం" అనెడు ప్రత్యయ ముండితీర వలెను. అపరిత్యక్తమయిన స్వాత్మావష్టంభముననె నటుడు పరభావ మనుకరించును. అది యాతని యాత్మధర్మము.

౩౫౮. సుకుమారప్రయోగో యో రాజ్ఞామామోదసంభవః
శృంగారరసమాసాద్య తన్నారీషు ప్రయోజయేత్
౩౫౯. యుద్ధోద్ధతావిద్ధకృతాః సంరంభారభటాశ్చ యే
న తే స్త్రీభిః ప్రయోక్తవ్యాః, యోక్తవ్యాః పురుషేషు తే
౩౬౦. అనుద్ధతమసంభ్రాంతం అనావిద్ధాంగ చేష్టితం
లయతాల కలాపాత ప్రమాణనియతాక్షరం
౩౬౧. సువిభక్తపదాలాప మనిష్ఠుర మకాహలం
ఈదృశం యద్భవేన్నాట్యం నారీభిశ్చ ప్రయోజయేత్

రూపానురూప ప్రకృతి యుండదగు సమయ సన్నివేశ మిందున్నది. రాజులకు నాట్యదర్శన మతులయిన సచేతసులకు విభావాది పరిపూర్ణతచే నామోదము సంధానించు సుకుమారప్రయోగ మును శృంగార మందుకాని స్త్రీలయందు నాట్యాచార్యుడు ప్రయోగ మొనరింపవలెను. లలితసుకుమారమయిన శృంగారప్రయోగము పురుషానుగతమె యగుచో నంతగా మనోహరము కాదు. సందర్శించు సహృదయులు నారీ ప్రయోక్తృచాతుర్యమునందు విభావాదికౌశలము భావింతురు. యుద్ధమున నుద్ధతులు నావిద్ధులు నగువా రొనరించు కార్యములను, సంరంభ ప్రధానములయిన యారభటాదులను స్త్రీలచే రంగమున ప్రయోగింపజేయరాదు. అట్టివానిని గతి సంరంభాదులు కలిగి సముద్ధతముగా నుండు పురుషులందేకూర్చుట సముచితముగ

నుండును. ఇట్లనుటచే పౌరుషకార్య మేదియు స్త్రీప్రయోజ్యము కారాదన్న నిషేధ మిచట నిర్దిష్టము కాదు. స్త్రీ పురుష భూమిక యగుట యున్నది. ఆ రీతియు నభివ్యాప్తమె. ఉద్ధటముగా నుండని పురుషనాట్యము స్త్రీప్రయోజ్యము కావచ్చును. ఇట్లె యసంభ్రాంత నాట్యము, ఆవిద్ధము కాని తొట్రుపాటు లేని యంగచేష్టితములు కల నాట్యము, లయ- తాల- కలా- పాతముల ప్రమాణానుసారముగా నియతాక్షరమయిన నాట్యము, సుస్పష్టముగా విభక్తముగా పదముల యాలాపము కల నాట్యము, అనిష్ఠుర మకాహాల మయిన నాట్యము. కేకలు బొబ్బలు పెడబొబ్బలు లేని నాట్యమునే స్త్రీలచే ప్రయోగింప జేయవలెను. పురుష భూమికా భినివేశమున పురుషులు ప్రయోగింప దగిన నాట్యమె యయినను ఇట్టి నాట్యమును స్త్రీలును పురుషభూమిక ధరించి ప్రయోగింపవచ్చును. ఇట్లె ప్రయోగవిదులగువారు భూమికా వినివేశమును సాధింపవలసియున్నది.

3౬౨. స్త్రియో హి స్త్రీగతో భావః పౌరుషః పురుషస్య చ
యథావయోయథావస్థమనురూపేతి సా స్మృతా
3౬3. పురుషః స్త్రీకృతం భావం రూపాత్ప్రకురుతే తు యః
రూపానురూపా సా జ్ఞేయా ప్రయోగే ప్రకృతిర్బుధైః
3౬౪. ఛందతః పౌరుషీం భూమిం స్త్రీ కుర్యాదనురూపతః
న పరస్పరచేష్టాసు కార్యౌ స్థవీరబాలిశౌ

ఇందు మొదట అనురూప ప్రకృతి లక్షణ మున్నది. స్త్రీగత మయిన భావమును స్త్రీ యనుసరింపవలెను. పురుషుడు పురుషగత మయిన భావము ననుసరింపవలెను. ఆ యనుసరణము యథావయస్క ముగా యథావస్థముగా నుండవలెను. భిన్న వయసు వారి యనుసర ణము అవస్థాభేదము కలవారి యనుసరణము శోభ నాపాదింపదు. ఆస్వాద మీయదు. వయోవస్థానుసారమున ననుసరించుట యనురూప ప్రకృతి. రూపానురూప ప్రకృతి యిట్లుండును. పురుషుడు స్త్రీ కృతము స్త్రీ గతమయిన భావమును రూప సారా నుసారమున ననుసరించు నేని యా ప్రకృతి రూపానురూపప్రకృతి యని నాట్యబుధు లంగీక రింతురు. స్త్రీ ఛందానుసారమున పురుషాశ్రయమయినభూమికననురూప రూపమున ననుసరించుట సముచితమగును. పురుషుడు స్త్రీభావమును,

స్త్రీ పురుష భావము ననుకరింపవచ్చును. అది ప్రయోక్తల యాను రూప్యమును బట్టి యుండును. ఆ రీతి యా ప్రకృతి రూపానురూప ప్రకృతి యగుట నాట్యవిదు లంగీకరింతురు. సాంకృత్యాయనీ భూమికా ధారణ మిట్టిది. ఆమె పురుషత్వ మవలంబించిన వనిత బౌద్ధపరివ్రాజిక యనురూపచ్ఛందమున పౌరుషభూమిక ధరించి రంగము ప్రవేశించినది. ఈ విధాన మంతటట తగదు.

పరస్పరచేష్టలలో స్థవిర బాలిశులను కూర్పరాదు. "సంబంధి శబ్దాః సంబంధ్యంతర మాక్షిపంతి" యని నియమ మున్నది. స్థవిర శబ్దము బాలుని గోచరింపజేయగలదు. బాలిశ శబ్ద మభిరూపుని గోచరింపజేయఁగలదు. కాగా ముసలివాడనదగిన స్థవిరుడు యువభూమి కను ధరింపరాదు. యువకుడు వృద్ధభూమికను ధరింపరాదు. నాట్య బుధుడు వారట్లొనరించుట నంగీకరింపరాదు. వారి నట్టికార్యమున నియమింపరాదు. అట్లె విరూపు డనదగిన బాలిశుడు విరూపభూమిక నె ధరించుట సముచితము. ఇట్లనుట కేవల ముపలక్షణము. ఎచట నే యంశము సుశ్లిష్టమె యుండదో దాని నచట యోజనము చేయరా దనియె పరమతాత్పర్యము. "యత్ర యత్ప్రయోజనః న శ్లిష్యతి, న స తత్ర యోజ్యః"

ఈ చెప్పినవిధమున భూమికలను తత్త త్ప్రకృత్యనుసారమున ధరించుట సముచితపక్షము. ఆ యా భూమికలను ధరించిన వారు వారి పాఠ్యప్రయోగమున ననుసరింపదగు విశేషములు కొన్ని యున్నవి. సంస్కృతభాషామయమయిన పాఠ్యప్రయోగమున పురుషులనె ప్రయో గింపవలెను. ఈ నియమము సంస్కృతప్రధానమయిన పాఠ్యప్రయోగ ముననె కాదు. సుకుమార ప్రాకృతప్రధానమయిన పాఠ్యప్రయోగ మున గూడ పురుషులనె నియమింపవలెను. స్త్రీల కంఠస్వరములు స్వాభావమధురములు. గీతప్రయోగమునందె యవి సులగ్నములగును. పురుషకంఠములు బలవంతములు. రంగపూరణమునకు తగిన గంభీర స్వరము పురుషులకె కలదు. గీతప్రయోగమునందు స్త్రీలను నియ మించుటయె యుక్తము. పురుషులును గీతభావనము చేయుదురు. కాని గేయము స్త్రీ ప్రకృతికము.

౩౬౩. యద్యపి పురుషో విద్యాత్ గీతవిధానం చ లక్షణోపేతం
మాధుర్యగుణవిహీనం శోభాం జనయేన్న తద్గీతం
౩౬౬. యత్ర స్త్రీణాం పాఠ్యాత్ గుణైర్నరాణాం చ కంఠమాధుర్యం
ప్రకృతివిపర్యయజనితౌ విజ్ఞేయౌ తావలంకారౌ

పురుషుడును లక్షణోపేతమయిన గీతవిధానమును గుర్తింప వచ్చును. గీత ప్రయోగమున సమాసక్తుడు కావచ్చును. కాని పురుష గీతము మాధుర్యగుణ విహీనము. శోభను సంపాదింపజాలదు. స్వర గాంభీర్యము వేరు. స్వరమాధుర్యము వేరు. గాంభీర్యము పాఠ్యమున కనుకూలము. మాధుర్యము గీతమున కనుకూలము. గంభీర స్వరసహిత లయిన కొందరు వనితలు పాఠ్యప్రయోగమున సమర్థలు కావచ్చును. పురుషులకును స్వగత గుణ సంపదను బట్టి కంఠ మాధుర్యమును కూడుకొనవచ్చును. ఇట్టివారు లోకమున నుండకపోరు. ఇట్టిదిది ప్రకృతి విపర్యయజనితము. తావన్మాత్రమున నది హేయము కాదు. ప్రకృతి విపర్యాసమున గలిగిన నట్టి స్థితియు నలంకారముగనె యుండును. ఇట్టిస్థితి చాల యరుదు. క్వాచిత్కముగా నుండును. అంతట సుగోచ రము కాదు.

౩౬౪. ప్రాయేణ దేవపార్థివ సేనాపతిముఖ్య పురుషభవనేషు
స్త్రీజనకృతాః ప్రయోగాః భవంతి పురుషస్వభావేన

సామాన్యముగా దేవ పార్థివ సేనాపతి ముఖ్యులయిన పురుష ప్రముఖుల భవనములందు స్త్రీజనులు పురుషస్వభావమున నాచరించు ప్రయోగములు జరుగుచుండును. ఇట్టి సన్నివేశములందు స్త్రీలకు పురుష స్వభావము ప్రయోజ్యము. అట్లు ప్రయోజ్యమును స్త్రీ లవశ్యముగా ప్రయోగింపవలసియున్నది. స్వర్గమునం దిట్టి ప్రయోగము ప్రచుర తరము. ఇంద్రసభలో లక్ష్మీస్స్వయంవర ప్రయోగ సమయమున నూర్వశి వచనక్రమము మారినట్లు కాళిదాసు సూచించియె యున్నాడు. స్వర్గమున దేవభవనమున రంభోర్వశీప్రభృతులం దిట్టి నాట్యము ప్రతిష్ఠితమని గుర్తింపనది. అట్లది ప్రతిష్ఠితమై స్వర్గనాట్యమన్న ప్రథతో నుండుటయె కాదు. అట్టివి మానవలోకమునగూడ సుప్రతిష్ఠి తము కావలెను. రాజుల యంతఃపురములందు నది ప్రచలితము కావలెను. ఈ రమ్యతను భావించి యాచార్యనటులు సముచిత

ప్రయత్నము స్వీకరించి యంగనాజనమున నీ విధానము నుపదేశింప వలెను. "ఉపదేష్టవ్యం" ఉపదేశింపవలెనని విధిమాత్రమె కాదు. ఇది యుపదేశింప శక్యము. శక్యోపదేశ మిది ప్రయోగమున నవతరింప వలెను. వత్సరాజ ప్రయోగశాలలో మాలవికకు నాట్యాచార్యుడు గణదా సుపదేశించి ప్రదర్శనము కావించినాడు.

౩౬౮. న స్వయం భూమికాభ్యాసో బుధైః కార్యస్తు నాటకే
స్త్రీషు యోజ్యః ప్రయత్నేన ప్రయోగః పురుషాశ్రయః

౩౬౯. యస్మాత్స్వభావోపగతో విలాసః స్త్రీషు విద్యతే
తస్మాత్స్వభావమధురమంగం సులభసౌష్ఠవం

పురుషులగు బుధులు బుధులగు పురుషులు నాటకమున స్వయముగా భూమికా ప్రయోగ మొనరింపరాదు. పురుషాశ్రయ ప్రయోగమును వారు ప్రయత్నపడి స్త్రీలయందే యోజనము చేయవలయును. పురుషుడును భావబుద్ధి నాశ్రయించి భూమికా న్యాస మొనరింపదగునని భావింతురేమో? అది యుక్తము కాదు. స్వభావోపగతమయిన విలాసము స్త్రీల యందుండును. పురుషులందుండదు. వారియందున్న నది ప్రకృతివిపర్యాసకృతము. క్వాచిత్కము. స్త్రీవిలాసము స్వభావ సిద్ధము కనుకనె స్వభావమధురమైన యంగమును వారలకు సులభ సౌష్ఠవము. పురుషసంబంధి లలిత వస్తువతిహృద్యముగనె ప్రతిభాసింప వచ్చును. అది సౌష్ఠవసంభృతమై యుండవచ్చును. అది యలంకార మగును. అంతమాత్రమున నది యిల్లు ప్రయోగమార్గమున ప్రవేశింప దగదు. ఇందు తెలియతగిన ప్రయోగరహస్య మొకటి కలదు.

౩౭౦. ప్రయోగో ద్వివిధశ్చైవ విజ్ఞేయో నాటకాశ్రయః
సుకుమార స్తథావిద్ధో నానాభావరసాశ్రయః

౩౭౧. నాటకం సప్రకరణం భాణో వీధ్యంక ఏవ చ
జ్ఞేయాని సుకుమారాణి మానుషై రాశ్రితాని తు

౩౭౨. సుకుమార ప్రయోగోఽయం రాజ్ఞామా మోదకారకః
శృంగార రసమాసాద్య స్త్రీణాం తత్తు ప్రయోజయేత్

౩౭౩. యుద్ధోద్ధతావిద్ధకృతా సంరంభారభటాశ్చ యే
న తే స్త్రీణాం ప్రకర్తవ్యాః కర్తవ్యాః పురుషైర్హి తే

౩౭౪. యథావిద్ధాంగహారం తు భేద్యాభేద్యాహవాత్మకం
మాయేంద్రజాల బహులం పుస్తనైపథ్య దీపితం
౩౭౫. పురుషప్రాయ సంచారమల్ప స్త్రీకమథోద్ధతం
సాత్వత్యారభటీయుక్తం నాట్యమావిద్ధసంజ్ఞితం
౩౭౬. డిమః సమవకారశ్చ వ్యాయోగేహామృగౌ తథా
ఏతాన్యావిద్ధసంజ్ఞాని విజ్ఞేయాని ప్రయోక్తృభిః

నాటకాశ్రయమయిన ప్రయోగము రెండువిధముల నున్నది. సుకుమారప్రయోగము మొదటిది. ఆవిద్ధప్రయోగము రెండవది. రూపకభేదమున నీ ప్రయోగ ద్వైవిధ్యము సంగతమగును. ఆ నియమానుసారమున తత్ప్రయోగము సముచితము. ఈ సుకుమారావిద్ధములు రెండును నానాభావరసాశ్రయములు. నాటకము ప్రకరణము భాణము వీథి అంకము అను నివి సుకుమారప్రయోగము కలవి. మానవులు వీని ననుసరించి యాశ్రయించి సుకుమారప్రయోగమును గుర్తింప జేయవలయును. ఈ సుకుమార ప్రయోగము రాజుల కామోదకారకము. సహృదయుల కందరకు ప్రమోద సంపాదకము. స్త్రీలకు సంబంధించిన శృంగారరసము నాసాదించి సుకుమారప్రయోగమును నిర్వహింపవలెను. యుద్ధోద్ధతా విద్ధకృతములు సంరంభ సమారభటములు కలవానిని స్త్రీలకు కూర్పరాదు. వానిని పురుషులె యాచరింపవలెను. ఆవిద్ధములయిన యంగహార రీతులను స్త్రీలాచరింపజాలరు. భేద్యభేద్యాత్మకములయిన యుద్ధములతో నుండువానిని స్త్రీ లొనరింపలేరు. పురుషులె యొనరింపవలెను. మాయేంద్రజాల బహులములను స్త్రీలకు కూర్పరాదు. సముద్ధతాంగహార ప్రయోగము ప్రహారప్రాయములయిన యుద్ధరీతులు మాయాప్రయోగములు పుస్త నైపథ్య దీపిత విధానములు పురుషులకె కూర్పదగియున్నవి. సాత్వత్యారభటీయుక్తమయిన నాట్య మావిద్ధమను పేరునకు తగియుండును. అందు పురుషుల సంచారము బహుళముగ నుండును. స్త్రీ లల్పముగ నుందురు. సముద్ధతముగా నుండును. డిమము సమవకారము వ్యాయోగము ఈహామృగమను నివి యావిద్ధసంజ్ఞ కలవని ప్రయోక్తలు గుర్తింపవలెను. ఇట్టి యావిద్ధముల ప్రయోగమును దేవ దానవ రాక్షసు లనుసరింపవలెను. శౌర్య వీర్య సమన్వితులయిన యుద్ధతపురుషు లొనరింపవలెను. ఇంత

వటి కుపపాదితమయిన యీ విధానమున, "సామాన్యముగా గేయము స్త్రీల ప్రకృతి యని, పురుషులకుపాఠ్యవిధి ప్రకృతి యని చెప్పినట్లయి నది. స్త్రీ పురుషుల కిట్లు గేయ పాఠ్యము లయత్నసిద్ధములగు నేని నాట్యాచార్యుడు ప్రవర్తింపజేయు గుణనికాభ్యాస వ్యాపార మున నేమి ప్రయోజనమని యాశంక కలుగవచ్చును. కాని నాట్య విదు డప్రమత్తుడై నిరంతరము తత్తదనుకూలమయిన యోగ్య ప్రయత్న మొనరింపవలెను. యోగ్యప్రక్రియ లేకపోయినచో భావరససౌష్ఠవ మేమాత్రము నుదయింపదు. ఆ యా స్వభావము లయత్నసిద్ధములయినను వానికి తగిన భావ రస సౌష్ఠవ సంపాదన మునకై నాట్యవిదుని గుణనికాభ్యాస మావశ్యకమె యగును. అందుననె

"సంగీతపరిక్లేశో నిత్యం ప్రమదాజనస్య గుణ ఏవ"

సంగీతమున పరిక్లేశము నిత్య మనుభవించుట ప్రమదాజనమునకు గుణమె యగును. నాట్యాచార్యుని శిక్షాభ్యాసపాటవమున మధురత్వ మలవడును. కలాభ్యాసవిశేషమున స్వాభావిక కర్కశత్వమును పోవచ్చును. కాన నాట్యవిదుని గుణనిక యావశ్యకము. అందుచే నాట్యాభ్యాస మపేక్షితము. తత్రోపితాన్వహానముచితము.

౩౭౭. ప్రమదా నాట్యవిలాసై ర్లభతే గాత్ కుసుమై ర్విచిత్ర లావణ్యం
కామోపచార కుశలా భవతి చ కామ్యా విశేషేణ

నాట్యవిలాసము కుసుమప్రాయము. వయోవతి వనిత నానావిధ ములగు నాట్యవిలాసములు కలదగునేని విచిత్ర లావణ్య శోభా రమ ణీయ యగును. కుసుమశోభిత పుష్పవిచిత్రయై కామోపచార కుశల యగును. కామోపచారము లొనర్ప సమర్థయగును. తదుపచారము లచే నేర్పుగా సేవ్యమానయు నగును. కావుననె యామె విశేషకామ్య కాగలదు. కమనీయ కాగలదు. ఆమె చేష్టాసర్వస్వ ముత్తమ శృంగార సూచకమై యామెకు నుత్తమత్వ మతిశయింపజేయును. ఇది యంతయు నాట్యాభ్యాసవిశేషము కావున శిక్షణ మావశ్యము. ఇది యంతయు నాట్యాచార్యుని గుణనికాతిశయము.

౩౭౮. గీతం వృత్తం తథా వాద్యం ప్రస్తారం గమనక్రియాం
శిష్యనిష్పాదనం చైవ షడాచార్యగుణాః స్మృతాః

౩౪౯. ఏతాని పంచ యోవేత్తి స ఆచార్యః ప్రకీర్తితః
ఊహాపోహా మతిశ్చైవ స్మృతిర్మేధా తథైవ చ

ఇది నాట్యాచార్య స్వరూపము. ఇది నాట్యాచార్యుని లక్షణము. "నస్వయం భూమికాన్యాసో బుద్ధైః కార్యస్తు నాటకే" అని చెప్పితిమి. నాట్యాచార్యుడు ప్రయోగ మొనర్పకపోయినచో నిక నాట్యాచార్యుడు గుర్తింపవలసినది యేమి యున్నది. ఆతడు నాట్య బుధుడగుట యేల ? అని సంశయము కలుగవచ్చును. నాట్యాచార్యున కారుగుణములుండవలెను. ఇవి యాచార్యగుణములు. ఇట్లుండుట సంప్రదాయ ప్రసిద్ధి. గీతవిదుడు కావలెను. వృత్తవిదుడు కావలెను. వాద్యవిధుల తెలిసియుండవలెను. ప్రస్తారము తాలవిధి. దాని గుర్తింప వలెను. గమనక్రియలను తెలియవలయును. శిష్యుల నిష్పాదింపవలెను. ఈ యారు నాచార్య్య గుణములు. స్వరజ్ఞుడై యంగహార క్రియా విదుడై చతుర్విధాతోద్యకుశలుడై తాలజ్ఞుడై లోకోపకారవిదుడును కావలెను. నర్తకిగమన మొనరించునపుడు క్రియాంకమున నెట్టిగతి యున్నదో చక్కఁగ గుర్తించిననె యుపచారకౌశల మాతనికి లభించును. ఈ నిరూపితవిశేషములు లేకపోయినచో నాట్యాచార్య నామమాత్ర మేని రారాదు. అది లభింపదును. ఊహాదులు నుండవలయును. ఇవి యుండి యవియున్నచో పృష్ఠబలముండును. పృష్ఠపాతులగు నూహాదులు నాట్యాచార్యు నుత్కృష్టు నొనర్పగలవు. కావుననె వానిని వేరుగా చెప్పుట యయినది. ఊహాదులు గుణములు. నాట్యాచార్యుని ప్రజ్ఞాప్రాభవముల వెలయింప జేయగలవు. ఊహ మపోహము మతి స్మృతి మేధ తెలిసినవాడె యాచార్యుడు కాగలడు. ఇందూహాదులు సాంకేతికములయినను లోకప్రసిద్ధములు. "ఊహః = అనుక్తస్యకల్పనం అపోహః = అనుక్తస్య అనుసరణం." చెప్పనిదానిని కల్పించుట యూహము. చెప్పనిదాని ననుసరించుట యపోహము. రానున్న యంశము నవగాహనము చేసికొనగలుగునది మతి. పూర్వోన్మేష రూపమయిన ప్రతిభ; ప్రతిభావికాసమునకు పూర్వసమయమునందు సమున్మేషముస్మృతి. ఉపదిష్టాంశము నావిష్కరింపజేయునది మేధ. ఈ గుణపంచకమున్నచో గురువుపదేశించినవిషయము వెంటనే

గ్రహించు శక్తి కలుగును. శిష్యుల నిష్పాదించుట పరమావశ్యకము. శిష్యాశయానుసారమున నుపదేశ్య ముపదేశించుట సంప్రదాయవిదులకు సమ్మతము కాదు. శిష్యత్వసిద్ధికి సముచిత శిక్షణ మావశ్యకము. నాట్యమనునది చేష్టా భాషాత్మకమయిన సంప్రదాయ విద్య. గురుశిష్య సంప్రదాయము సముత్సన్నప్రాయమయినచో నాట్యవిద్యా విశేషము దుర్వివేకమగును. కావుననె శిష్యనిష్పాదనమున గుణప్రఖ్యాపనోద్యమము ప్రగల్భింపగలదు.

శిష్యస్వరూపము

౩౮౦. మేధాస్మృతిః గుణశ్లాఘారాగః సంఘర్ష ఏవచ
ఉత్సాహశ్చ షడేవైతాన్ శిష్యస్యాపి గుణాన్విదుః

శిష్యునకు శిష్యత్వ మాపాదింపగల గుణము లారున్నవి. మేధ. స్మృతి, గుణశ్లాఘ, రాగము, సంఘర్షము, ఉత్సాహము అను నీయారు కలవాడె మంచి శిష్యుడుకాగలడు. ఇతరుల గుణముల శ్లాఘింపకలవాడగుట యావశ్యకము. కాకున్న కలా పాండిత్య మేర్పడదు. శిష్యునకు సహజముగా నాట్యమున రాగ ముండవలెను. అన్య ప్రయోజనమునకై నాట్యము నేర్చికొనుట నాట్యారాధనముకాదు. నాట్యము నాట్యమనియె యభ్యసింపవలెను. నాట్యశిష్యునకు సంఘర్ష ముండుటయు నావశ్యకము. నాట్యశిష్యు డొకడు వేరొక నాట్యశిష్యునితో సంఘర్ష పడవచ్చును. ఆసంఘర్ష మునం దేదో యన్యప్రయోజన చింతనము తగదు. అన్యాభిసంధితో నట్లు ప్రవర్తింపరాదు. కళామయాంశమున సంఘర్ష ముద్దీపితము చేసికొనరాదు. అనుకారములో ననుసరణములో సంఘర్షము పెట్టుకొనవచ్చును. అట్టిదె నాట్యమున సమధికమయిన ప్రతిపత్తిని కూర్పగలదు. శిష్యునకు నవ నవోత్సాహ మావశ్యకము. ఆతడు నిర్వేద పడరాదు. అప్రసన్నుడు కారాదు. తన యభ్యాసములో నాట్యారాధనమె యాతనికి సముద్దిష్టముకావలయును. ఇది యిట్టిది శిష్య గుణ సంపత్తి. ఇది శిష్యశిక్ష ఇది యంతయు సావధానముగ గుర్తించి ప్రయోగాభిజ్ఞులగు నాట్యకోవిదులు నానా భూమికా వికల్పనమును శ్రద్ధగా నొనరింపవలసియున్నది. ఈ ప్రకృతి

వికల్ప ప్రకరణార్థమంతయు ప్రయోగవిచక్షణులకు ప్రతిపాదనీయ మైనది. దీని గుర్తించిన పిమ్మట సిద్ధుల స్వరూపమును గుర్తింపవలెను. ప్రధానముగా సిద్ధులు రెండువిధములె. అయిన నందవాంతరములయిన భేదము లున్నవి. కావుననె సిద్ధులు బహు ప్రకారములు. ఈ నిరూపిత ప్రకృతి భూమి వికల్ప మవగత మయినచో హృదయాదరణీయ భావాత్మక మయిన రాగము మహనీయ నాట్యమున నుదయించును. అది యొక నాట్యమహిమ. అది కలిగి నటసచేతసులు నిత్యము రాగవంతు లగుదురు. శివీకృతులగుదురు.

## ప్రయోగసిద్ధి

నాటకాశ్రయము లయిన సిద్ధివిశేషములు కొన్ని కలవు. వాని నిక ప్రవచింపవలెను. ప్రయోగ సర్వమంతయు సిద్ధ్యర్థమె యనుట సర్వదర్శనము. ప్రయోగము సిద్ధ్యర్థముననె సంప్రతిష్ఠితమైనది. సిద్ధీచ్ఛతో సర్వసంయోజన ముండవలయుటయు నిదివరలో నిరూపితము. ఏ యే యభినయమునం దేది యేది యోజితమయిన నది యది సిద్ధి కాంక్షాకృతమె యనుట స్పష్టమె యయినది. అభినయములను ప్రసారించి సిద్ధిపర్యంతము నిరూపించితిమి. అభినయముల నుపక్రమించి నపుడు నుపాంగాభినయముల ప్రసంగముననను సిద్ధి కామనసూచితమె యయినది. అభినయముల నన్నిటిని సమానీకరించుటకై మేలనికా సంపాదనాత్మక సామాన్యాభినయ ప్రసక్తిలోఁగూడ సిద్ధియె ఫలమగుట ప్రదర్శితమయినది. వాఙ్నేపథ్యాంగసంభవములయిన యభినయము లన్నియు ప్రయోగజ్ఞుడయిన నాట్యవిదుడు సిద్ధికాముడై నాటకమును ప్రయోగింపవలెనని చిత్రాభినయ ప్రసక్తిలోఁగూడ నిరూపితమయినది. రసభావ ప్రఘట్టమునందును సిద్ధియుద్దిష్టమయినది. కాగా "సిద్ధి యేమి? ఎట్టిది?" యని జిజ్ఞాస కలుగుట ప్రస్తుత ముచితమె యగును. అదియె ప్రసక్త ప్రదర్శిత మయినది. "సిద్ధి ర్నామాసాధ్య ప్రయోజన సంపత్తిః" అసాధ్యమగు ప్రయోజనము సంపన్నమగుట సిద్ధి యనదగు ననిరి. ఆ సిద్ధి నటులకు కావలెను. సామాజికులకును కావలెను. నటసిద్ధిని జెప్పవలెనా? సామాజికసిద్ధిని నిరూపింపవలెనా? అను నాశంకా సమాధిగా ముని యిట్లనుచున్నాడు.

౩౮. సిద్ధీనాం తు ప్రవక్ష్యామి లక్షణం నాటకాశ్రయం
యస్మాత్ప్రయోగః సర్వోఽయం సిద్ధ్యర్థం సంప్రదర్శితః

నాటకాశ్రయమయిన సిద్ధుల లక్షణము చెప్పెదను. ప్రయోగము సర్వము సిద్ధ్యర్థమనుట నిరూపితమె కదా! సామాజిక సమాశ్రయమయిన సిద్ధుల లక్షణము జెప్పవలెను. నటాశ్రయమయిన సిద్ధుల లక్షణము చెప్పవలెను. కాని ప్రకృతము నాటకాశ్రయమయిన సిద్ధుల లక్షణమునె చెప్పెదునని భరతోక్తి. ఇతర మిపుడు నిరూపింపననియు తద్భావము. నాటకాశ్రయమను నిచట నాటకపదము నటపరము. "నటతీతి నటః". ఈ ప్రయోగసమయముననె సామాజికాశ్రయసిద్ధిలక్షణ మేల చెప్పరాదు ? తత్సమాధానమె యుత్తరార్ధము. తదభిప్రాయ మిట్లు సంభావ్యము. సామాజికసిద్ధ్యర్థమయిన ప్రయోగమంతయు సిద్ధిపర్యవసానముననె యుండును. ఇట్లు ప్రయోగ విశేషణభాగమునందె సామాజికసిద్ధి విశ్రాంతమగును. విశేషణభాగమునందు విశ్రాంతి యనునది మీమాంసాశాస్త్రమునందు ప్రసిద్ధముగ నున్నది. విశేషణాంశ విలీన కల్ప మయిన విషయమును పృథక్కుగా నిరూపింప నక్కర లేదు. విశేషణ విజ్ఞాన ముదయించిన పిమ్మటనే విశేష్య విజ్ఞాన ముదయించుట లోకశాస్త్రసిద్ధమై యున్నది. "నాగృహీతవిశేషణాబుద్ధిర్విశేష్యముపసంక్రామతి" యని న్యాయసూక్తి. నట ప్రయోగమునందు సామాజికసిద్ధి విశేషణావిధమున నున్నది. ముందుగా సామాజికసిద్ధి సంగృహీతసంభావితమయిననే నటప్రయోగము సుగృహీత మగును. గర్భరహస్యముగా నభివ్యక్తమగు నంశమును ప్రకృతమునందు స్ఫురింపజేసికొనగలరు. అట్టి సచేతస్సిద్ధి పునర్వాచ్యము కాదు. "దండీ పురుషః" యను వాక్యమున విశేషణమయిన దండి పదమున దండము గోచరము కాగలదు. అది మఱల వాచ్యము కాదు. విశేషణభాగ విశ్రాంతిమును మఱల చెప్పనేల ? ఇట్లే "లోహితోష్ణీషాః ఋత్విజః ప్రచరంతి" యని యాగీయ వచన మొకటి యున్నది. ఎఱ్ఱని యుష్ణీషములు (తలపాగలు) కల ఋత్విక్కు లగ్నిపరిక్రమణ మొనరించుచున్నారనుట యిందలి విశేషము. ఇందు ఋత్విక్కులకు "లోహితోష్ణీష" పదము విశేషణము. ఈ వాక్య

మున బుత్విక్ప్రచరణము విధేయమా? లౌహిత్యము విధేయమా? సోష్ణీషత్వము విధేయమా? లౌహిత్య విశిష్టోష్ణీషత్వము విధేయమా? యని మీమాంసకు లనేక విధములుగా నిందు వికల్పములు పలికినారు. ఇందు విశేషణభాగము నందు లౌహిత్యము సోష్ణీషత్వము విశ్రాంతమయినది. విశేషణవిభాగ విశ్రాంతమును చెప్పనేల? వాక్యమునం దొకటియే ముఖ్యముగా విహితమగును. ప్రకృతనాట్యకథలో నాటకాశ్రయ ("నటాశ్రయ") మయిన సిద్ధియే ముఖ్యవిధేయము. అదియె వివక్షితము. ఈ విధి విధానమున నీ యర్థము లభింపగలదు. సామాజికసిద్ధి కూడియున్ననే ప్రయోగము సప్రయోజన మగును. సామాజికాశ్రయసిద్ధి ననుసరించియే నాట్య ముదయించినది. సామాజికోద్దేశముననే నాట్యోత్పత్తి యనుట పూర్వమె స్పష్ట ప్రతిపాదితము. ఈ నాట్యవేద సమారంభ ప్రకరణ ప్రఘట్టమునందే "న వేదవ్యవహారోయం సంశ్రావ్యః సర్వజాతిషు" వేదముగా వ్యవహరింపదగిన దీని నందరకు విన్పింపరాదని నిరూపితమయినది. అది యొక యాదేశము. అది ప్రయోగదర్శి. అందుననె సామాజికసిద్ధి పూర్వమె నిదర్శితమయినది. అన్యప్రాప్తము పూర్వప్రాప్తము పునర్విధేయము కానక్కరలేదు. సామాజికసిద్ధి ప్రయోగోపయోగనాంతరీయము. నటప్రయోగమునందాసిద్ధి యపరిహార్యముగా నవశ్యముండవలసియె యున్నది. అదిలేక వేరొక సిద్ధి యుండదు. కావుననే యిందు నటసిద్ధినె చెప్పదలచితిమి. సామాజికసిద్ధి నటుల కభిసంహితమయిన ఫలప్రాప్తి స్వరూపముననె యుండును. సామాజికసిద్ధి వ్రీహ్యాత్మకము. సస్యాభివృద్ధికి సర్వనిదానమయిన వ్రీహిధాన్యము సర్వమూలము. అట్లె యీ సామాజికసిద్ధి. ఇది పూర్వస్థానముననె నిరూపితము. ఇపుడు పునర్నిరూపణమేల?

సామాజికసిద్ధి మానుషసిద్ధి యనవలెను. సామాజికుడు మానవుడు. ఆతడట్లే యాసిద్ధి నభిసంహిత మొనరించుకొనుచున్నాడు. సామాజికసిద్ధి మానుషసిద్ధి యనుట యాపాతవచనము. సామాజికుడు కేవలము మానుషసిద్ధిసంవలితుడుగనె యుండడు. ఆతని యామానవీసిద్ధి స్వస్వరూప సమాపత్తి వర్గ బ్రహ్మచారిణి యగును. నిర్విషయ

మయిన స్వకీయపరమానందావిర్భావముచే నాతని కట్టి స్వరూపసమాపత్తి కలుగును. సామాజికుని యాస్వాదములో విషయముగా నుండు గీతాదులు నాట్యాంతర్భాగమున నుపరంజకములుగ నుండుటచే నిమగ్నప్రాయములై యగును. స్వేతరమును శోభింపజేయునవై తమ స్వరూపము నావిష్కరింపజేయవు. అట్లె నటాదులుగూడ నిహ్నవము పొందుదురు. విషయసమముగనె యుందురు. నటబుద్ధి యవభాసింపదు. అది విస్మృతమె యగును. నటులం దారోపితమయిన రామాది రూపముగూడ నకించిత్కరమె యగును. రామాది ప్రత్యయమునందు దేశకాలాది నిర్యంత్రణమున్నది. అది సామాజికాస్వాదమున నుపకారి కాదు. ఆస్వాదమున నది విషయముగ నుండదు. రసాస్వాదములో దేశకాల నిర్యంత్రణ మసంభవి యని పూర్వము బహూపపాదితమయినది. ప్రకృతముకూడ సముపాత్తమయినది. ఇట్టి యీ మానవ సిద్ధ్యంశముకూడ నిరతిశయ శాంతిలో నస్తంగమిత మగును: ఇట్లె యనుట సముచితము. "స్వంస్వంనిమిత్తమాసాద్య శాంతాదుత్పద్యతే రసః" స్వస్వనియతమయిన నిమిత్తము కలుగగా రసము సర్వము శాంతము నుండి యావిర్భవించుటను రసాత్ములు తెలియజెప్పిరి. శాంతము సమస్త రసప్రకృతి. సామాజికుల మానుషసిద్ధ్యంశము శమ సిద్ధిలో పర్యవసించును. ఇట్టి వివృతమయిన సామాజికసిద్ధి శాస్త్ర రహస్యార్థము.

భట్టనాయకు డీ యంశమున నిట్లు వాకొనినాడు. "ప్రధానసిద్ధి భాగము నందు గేయములన్నియు నంగము లగును. అట్లె సర్వసిద్ధు లుపయోగించును. సిద్ధిపదవి యెట్టిదైనను సోపానపదపంక్తిరూపముగా మోక్షస్పర్శ కలదగును. ఈ సోపానపదపంక్తి మోక్షస్పర్శకలది కను కని రహస్యార్థమని ఋషులు సంభావించిరి. తాల మాన కృతమయిన శాస్త్రమున నీవిషయమును ఋషులు ప్రకటము చేసినారు. ఈ ఋషి సంభావనమె దీని ప్రాశస్త్యము నుగ్గడించును." అని రససిద్ధికి మానుష సిద్ధి సహకారి యుపకారి యగును.

సిద్ధులు రెండు. రెండవది దైవసిద్ధి. ఇది ప్రస్ఫుటము. ఇది పురుషార్థ వ్యుత్పత్తి లక్షణము. ఇదియు నిదివరలో నిరూపితము.

"ధర్మోధర్మప్రవృత్తానాం కామః కామోపసేవినాం" మొదలగు నాట్యఫలముల నిర్దేశములో నిది ప్రదర్శితమయినది. కావున సామాజికాశ్రయసిద్ధిని వేరుగా ప్రకృతము నిరూపింపవలసిన యావశ్యకత లేదు. నటాశ్రయమైన సిద్ధినే నిరూపింపవలసియున్నది. నటసిద్ధియే ప్రకృతము ప్రతిపాద్యమై యున్నది. ఆ నటసిద్ధి సమ్యక్ప్రయోగ నిష్పత్తి రూపము. నటుని ప్రయోగసిద్ధి యాస్వాదమున నుపయోగించును. ప్రయోగనిష్పత్తి లేకపోయినచో నాట్యధర్మమె యుండదు. అదిలేకున్న సిద్ధి కలుగదు. ప్రయోగనిష్పత్తి యనునది కూడ సామాన్యాభినయములోని సమ్యక్త్వమని గుర్తింపవచ్చును. చక్కగా సామాన్యాభినయము నిష్పన్నమయినచో సుప్రయోగనిష్పత్తి కలుగును. మానుషసిద్ధి నిర్వచన మొనరించుటలో నిది గూఢమయిన పరమార్థము. మనుష్యనిష్పాదితమయినది కావున మానుషము. అందును స్వతః ప్రతిభాన మాహాత్మ్యమున, పరకీయ ప్రోత్సాహనతారతమ్యమువలన సముదితమయిన ప్రతిభానప్రత్యయబలమునను అది మానుషమగుచున్నది. ప్రోత్సాహనబలమున నప్రబోధప్రబోధము ప్రసిద్ధముగనే గోచరించుచున్నది. సాగరలంఘన సమయమున నాంజనేయుని జాంబవదాదులు ప్రోత్సాహన మొనరించి దూకించిరిగదా! ప్రోత్సాహనమునందున్న విశేషము మానుషయత్నవిశేషము సూచించును. అట్టిది మానుష సిద్ధి యయినది. దీనిలో ప్రోత్సాహనము వాచికముగా నుండును. వాచికప్రోత్సాహనములోని విభాగములను సవిశేషముగా గుర్తించుటయు నావశ్యకము. అభినందనీయముగా నభినయించినపుడు సామాజికు లహో! అందురు. తద్భావభావితులయిన వారి ముఖమునుండి 'అహో!' వెలువడును. ఒకప్పుడు శోకపర్యాకులావస్థావిశేషమును సముచితముగా నభినయించినపుడును తద్భావ వైవశ్యమున జాలిపడి "కష్టం" అందురు. ఇట్టివన్నియు వచసా ప్రదర్శించు ప్రోత్సాహనములు. వచసా ప్రోత్సాహనమె కాక సాత్త్విక ప్రదర్శనమునగూడ ప్రోత్సాహనమున్నది. ఒక డొక డానందబాష్పములు కలవాడగును. మరియొకడు కన్నీరు పెట్టును. పులకితుడగును. అట్టె స్తంభించి పోవును. కంపమానుడగును. ఇట్టివన్నియు సత్త్వచేష్టలు. వీని దర్శనము మనసా భావన ఫలము. ఇట్టి యభినందన విశేష మభినందనీయమగును. శరీర

వ్యాపారమున గూడ ప్రోత్సాహనమున్నది. చేతులు త్రిప్పి మూతులు త్రిప్పి మెడలు వంచి యటు నిటు కదలి నిలబడి ప్రోత్సాహన మిచ్చు వారుందురు. ఇవి యన్నియు ననంతభేదముల నుండును. సత్త్వాదర్శన మంతగా గోచరింపదు. శరీరవ్యాపారములు స్ఫుటగోచరములు వచో వ్యాపారమునందు పరిగణనీయ ప్రభేదములు కొన్ని కలవు.

౧ మధ్యమారూప తత్ప్రరోహాత్మకము
౨ సామాన్య వైఖర్యాత్మకము
3 వైఖరీ ప్రరోహాత్మకము
౪ విశేష శబ్దాత్మకము—వైఖరీ స్వభావము
౫ ఆవేశోచిత విశేష వైఖరీ రూపము
౬ తత్ప్రబంధాత్మకము
౭ తద్విచ్ఛేదరూపము

వీని స్వరూపాలాపము నీ విధముగా గుర్తించునది. పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ రూపమున వాక్కు నాలుగు విధములు. పరావాక్కు ప్రతిభామయి. పశ్యంతి రాబోవు శాబ్దసృష్టినంతటిని చూచునది. మధ్యమ వైఖరీవాక్కున కాద్యమూలము. ఆదిస్వరము లందు మధ్యమారూప మస్పష్ట భానముతో నుండును. అందునని స్పష్టతకై మధ్యమా స్వరూపమునకు ప్రరోహాత్మకస్థితి యావశ్యకము. స్వరముల సముదీరణమున నిది స్పష్టత పొందగలదు. రెండవది సామాన్యాత్మక మయిన వైఖరి. మధ్యమా ప్రరోహాత్మకస్థితి కన్న నొకింత స్ఫుటము స్పష్టమునై ప్రోత్సాహనము సూచించును. వైఖరీ ప్రరోహా రూపమయిన మూడవ యవస్థలోకూడ శబ్దములకు నియతమయిన విశిష్టాకృతి యేర్పడదు. వైఖరీస్వభావాత్మక విశేషశబ్దాత్మక చతుర్థా వస్థలో నియతములయిన విశేషశబ్దముల గూడిన ప్రశంసా ప్రోత్సాహనములుండును. ఆవేశోచిత విశేషవైఖరిలో నాలాపసంలాపాత్మక వచోవిశేషములు సంగతము లగును. తత్ప్రబంధ మారవస్థితిలో నుండ తద్విచ్ఛేద మనంతరస్థితిలో సంక్షిప్తమగును. ఇట్లు వచసా ప్రోత్సాహనముండును.

ప్రయోగసంలగ్న మానసుడై నటు డభినయించునపుడు సహృదయ సామాజికు డంతస్సంతుష్టుడై తదావిష్కార యోగ్యమయిన స్మిత మొనరించును. ఆ స్మిత మాతనిలో నంతస్సంజల్ప స్వరూపముగా నున్న మధ్యమా వాక్కును సూచించును. సంవిత్సంబంధి యయిన సుందరస్పందము హాసవికాసానురూపమై యుండును. అభిజ్ఞులిట్లనిరి.

"స్మితం హ్యాంతస్సంజల్పరూపాం మధ్యమాం సూచయతి"

"సంవిదో హి హాసవికాసానురూపః సుందరస్పందః"

స్మితముతో సంభావించు రీతి రూపకములందు గోచరించుచునే యున్నది. పులకాదిరూపమున సాత్త్వికముండును గావున నది యేకవిధ మనుటయు సంగతము. శరీరవికారము రెండు విధములు.

౧. అభిసంధానకృత వికారము

౨. అనభిసంధిపూర్వక వికారము.

అనభిసంధిపూర్వకమయిన శరీరవికారము హఠాత్తుగా రంగశాలలోని యాసనమునుండి లేచి నిలబడుట మొదలగు వానివలన స్పష్టమగును. అభిసంధానకృతమయిన శరీరవికార మనేక విధముల నుండవచ్చును. ఒక డుత్తరీయమును పై కెగురవేయును. అది లేకున్న నట్లుగాకున్నను చేతులెత్తి యూపు లూపుసు. వ్రేళులు కదలించును. ఊర్ధ్వాంగుళీకరణాదులచే శరీరవికార మావిష్కరించుట లోకమున నున్నది. ఈ విధముగా మానుషీసిద్ధి పది విధములుగా నున్నది. వాచిక మేడు విధములు. సాత్త్విక మేక విధము. శారీరికము రెండు విధములు.

ఇట్లు దశ విధముల నున్న మానుషీసిద్ధి యచట నచట ప్రయోగౌచిత్యానుసారమున నింకను భేదములు కలదై కన్పట్టును. నటులకు గలుగు ప్రయోగసిద్ధి తమ తమ ప్రతిభాన తారతమ్యము ననుసరించి రెండువిధము లగును. ఒక్కొక నటుడు ప్రతిభాప్రతిభానము కలవాడయినను ఒక్కొక నాటి ప్రయోగమున మంద ప్రతిభుడగును. ప్రయోగసిద్ధి తలచినంత రమ్యముగా నుండకపోవచ్చును. ఒక డొకడు సంభావ్యమాన ప్రతిభా ప్రతిభానము కలవాడె యయినను విఘ్నహతుడై మందసిద్ధి యగును. ఆధ్యాత్మిక విఘ్నములు కాని యాధి

ద్వైవికములయిన విఘ్నములు కాని కలుగవచ్చును. శరీరాదిగత్తమయిన వ్యాధిరూపప్రక్షోభము వలన విఘ్నముదయింపవచ్చును. బాహ్యాభూతముల వలన గలిగిన కలకల శబ్దాదుల వలన విఘ్నములు రావచ్చును. భూకంప వాత వర్షాది విఘ్నములు కలుగవచ్చును. ఇవి దైవాపరపర్యాయములయిన యదృష్టమువలన గలుగును. అదృష్ట ప్రేరితములై సంభవించును. ఇవి పురుషవ్యాపారసంప్రాప్తములు కావు. అందుననే శబ్దము క్షోభము లేకుండుటను భరతుడు స్పష్టముగ నిర్దేశించును. అసలు మౌలికముగ విఘ్నములు లేనందువలన గూడ సిద్ధి కలుగును. భావాతిశయ సముపేతుడయిన నటుడు నిర్విఘ్నప్రయోగ సిద్ధి పొందగలడు. ఈ సర్వము నాసూత్రించుట భరతమునికి సమ్మతము. అందుననే "సిద్ధిస్తు ద్వివిధా జ్ఞేయా" యనుట. ఈ సిద్ధి రసమున నంగ మగును. నాట్యాంగ మగును. నాట్యాంగ రసాంగమయిన సిద్ధి గుణాంగము. గుణము = ప్రధానమున కంగము. ఈ ప్రయోగసిద్ధి సామాజికాశ్రయమ్మై ఫలముగా నవభాసించును.

౩౮౨. సిద్ధిస్తుద్వివిధా జ్ఞేయా వాఙ్మనోఙ్గ సముద్భవా
దైవీ చ మానుషీ చైవ నానాభావ సముత్థితా
౩౮౩. దశాంగా మానుషీ సిద్ధిః దైవీ తు ద్వివిధా స్మృతా
నానాసత్త్వాశ్రయకృతా వాఙ్నైపథ్య శరీరజా

అవసరప్రాప్తమయిన నటసిద్ధి రెండువిధములు. ఈ సిద్ధి వాక్సముద్భవము. మనస్సముద్భవము. అంగసముద్భవమని భావింపవచ్చును. ఇట్లు వాక్మానాత్మాంగ సముద్భవమయిన సిద్ధి దైవీసిద్ధి మానుషీసిద్ధి యని రెండువిధములు. సిద్ధి నానాభావసముద్భవము. నానావిధము లయిన భావములను నటుడు ప్రదర్శింపగా నీసిద్ధ్యుదయము నూహింప వచ్చును. మానుషీసిద్ధి దశాంగముగా నున్నది. దైవీసిద్ధి ద్వివిధము: నానాసత్త్వాశ్రయకృతమై వాఙ్నైపథ్యశరీరజన్యమై సిద్ధి యుండును. కావుననె వాఙ్మయీసిద్ధి, శారీరీసిద్ధి యని దైవీసిద్ధి భేదములు. సిద్ధి వాఙ్మనోంగసముద్భవ యని యనుట సర్వాభినయముల కేకీకార సంపత్తి సూచితము కాగలదు. అన్నియు మనోరూపములగుటవలన నట్టి సంపత్తి సముచితము. మానుషసిద్ధి దశాంగమనుటను కొందరభి

మానింతురు. దైవీసిద్ధి దశాంగ సహితమనుట వారల కిష్టము కాదు ఈ దశాంగతాసంబంధ మభినయవిషయమని భావించుట యుక్తము.

వాఙ్మయీసిద్ధి. దీనిలో నీ వచనములు వెలువడును. ఈ విధానములుండును. వాని సంఖ్యాన మిట్లున్నది.

౧. స్మితము ౨. అపహాసము
3. అతిహాసము ౪. సాధువాదము
౫. అహోకారము ౬. కష్టవచనము
౭. ప్రబద్ధనాదము

3౮౪. స్మితాపహాసినీ హాసా సాధ్వహో కష్టమేవ చ
ప్రబద్ధనాదా చ తథా సిద్ధిర్జ్ఞేయాథ వాఙ్మయీ

వాఙ్మయీసిద్ధి నేడు విధముల గుర్తింపవచ్చును. ఏడు విధములగు సిద్ధి శంసక విశేషములందు స్ఫురించును.

3౮౫. పులకైశ్చ సరోమాంచై రభ్యుత్థానై స్తథైవ చ
చేలదానాంగులిక్షేపైః శారీరీ సిద్ధిరిష్యతే

పులకము లుదయించుట, రోమాంచములతో నాసనములనుండి లేచుట చేల దానాంగులి క్షేపమునను వానిచే శారీరీసిద్ధి వ్యక్తమగు ననుట నాట్యవిదులకు సమ్మతము.

నటులు ప్రేక్షకులం దిట్టి సిద్ధిని సాధింపవలయును. నటాశ్రయమయిన యీ సిద్ధి నుపలక్షించి ప్రేక్షకసామాజికులు స్మితాదులచే ప్రతిగ్రహింతురు. అట్లు సమ్మోదావహమయిన సిద్ధి సామాజికులకు గోచరించినపుడు పై విధమున ప్రతిగ్రహ మొనరింపవలసియున్నది. స్మితాదు లెవ్వు డెట్లెట్టు ప్రతిగ్రాహ్యములో నిరూపింతుము. సంభావింపుడు.

3౮౬. కించిచ్ఛిష్టో రసో హాస్యో నృత్యద్భిర్యత్ర యుజ్యతే
స్మితేన స పరిగ్రాహ్యః ప్రేక్షకైర్నిత్యమేవ చ

౧. స్మితము. రంగమున నృత్య మొనరించువారు శిష్టసమ్మతమయిన కించిత్ హాస్యమును యోజనము చేసినపుడు ప్రేక్షకులు నిత్యము స్మితముతో దాని ప్రతిగ్రహింపవలెను. సామాజికులం దుదయించు స్మితలేఖ నటసిద్ధి కొక నిదర్శనము.

౩౮౪. అవిదష్టహాస్యం యత్తథావచనమేవ చ
అపహాస్యేన తద్గ్రాహ్యం ప్రేక్షకైర్నిత్యమేవ హి

౨. అపహాస్యము : నర్తకు లస్పష్టమయిన పరిమిత హాస్యము ను ప్రదర్శించినపుడు; చేష్టారూపమున హాస ముత్పాదించినపుడు తదనుకూల హాస్యవచనము ప్రయోగించినపుడును ప్రేక్షకులు నిత్యము దాని నపహాస్య విధానమున పరిగ్రహించుట సముచితము. ఈ యపహాస మర్ధహాస్యమనియు కొన్నిట నున్నది.

౩౮౫. విదూషకచ్ఛేదకృతం భవేచ్ఛిల్పకృతం చ యత్
అతిహాస్యేన తద్గ్రాహ్యం ప్రేక్షకైర్నిత్యమేవ తు

3. అతిహాస్యము : విదూషకుని ఛేదము=వచనభంగి. దాని విశేష ముదయించినపుడు ప్రేక్షకు లతిహాస్యమున దాని పరిగ్రహింప వలసి యున్నది. అట్లే శిల్పరచనాకృతమయిన చమత్కార ముదయింపజేసినపుడును ప్రేక్షకు లతిహాస్యమునె యనుసరింతురు. ఇట్లు వీరు గుర్తించుట విదూషకనటుని సిద్ధి.

౩౮౯. అహోకారస్తథా కార్యో నృణాం ప్రకృతిసంభవః
యద్ధర్మపదసంయుక్తం తథాతిశయసంభవం

౩౯౦. తత్రసాధ్వితి యద్వాక్యం ప్రయోక్తవ్యం హి సాధకైః
విస్మయావిష్టభావేషు ప్రహర్షార్థేషు చైవ హి

౪. సాధువాదము : విస్మయావేశముకల భావముల భావించి నపుడు ప్రహర్షార్థకములగు వానిని భావించినపుడును సాధకులు "సాధు! సాధు!" పలుకులు పలుకుదురు.

౩౯౧. కరుణేపి ప్రయోక్తవ్యం కష్టం శాస్త్రకృతేన తు
ప్రబద్ధనాదా చ తథా విస్మయార్థేషు నిత్యశః

౫. అహోకారము : మానవుల కిది ప్రకృతిసంభవము. రసభావ వివశు లయినపుడు వారినుండి యహోకార మయత్నముగ వెలువడును. ధర్మ నర్మ పదములతో నది కూడియుండును. భావాతిశయమున నది సంభవించును.

౬. కష్టవచనము : కరుణాసన్నివేశమునందు శాస్త్రకృతముగా "కష్టం! కష్టం" వచనము వెలువడును. భావభావితులగువారు వివశచిత్తులై సత్వసముపేతులై "కష్టం!" పలుకుదురు.

౭. ప్రబద్ధనాదము : విస్మయార్థ సన్నివేశములం దంతట నిత్యము నాదబహులములయిన వచనములు వెలువడును.

౩౯౨. సాధిక్షేపేషు వాక్యేషు ప్రస్పందితతనూరుహైః
కుతూహలోత్తరావేగైర్బహుమానేన సాధయేత్

౩౯౩. దీప్తప్రదేశం యత్కార్యం ఛేద్యభేద్యాహవాత్మకం
సవిద్రవమథోత్ఫుల్లం తథా యుద్ధనియుద్ధజం

౩౯౪. ప్రకంపితాంసశీర్షం చ సాస్రం సోత్థానమేవ చ
తత్రేక్షకైస్తు కుశలైః సాధ్యమేవం విధానతః

అభిజ్ఞులగువారు మానుషసిద్ధి నీవిధముగా గుర్తించి సాధింప వలసియున్నది. అధిక్షేప సహితము లయిన వాక్యములను నటుడు పలికినపు డాతని వాగ్విధానము సముచితముగ నున్నదని సహృదయుడు సంభావించినచో ప్రస్పందిత తనూరుహములతో (పులకములతో) బహుమానమున నభినందింపవలెను. కుతూహలాధికము లయిన యావేదములతో నా సిద్ధిని సాధింపవలెను. సంగరభూమిలో దీప్తమయిన కార్యము ప్రదర్శితమగునపుడు కుశలప్రేక్షకు లొనరింపవలసిన సిద్ధి వ్యంజన మన్యవిధమున నున్నది. దీప్తకార్యము ఛేద్య భేద్య యుద్ధ రీతులతో నుండవచ్చును. మానవాది విద్రవములతో నుండవచ్చును. సముత్ఫుల్లమై యోజోయుతముగా నుండవచ్చును. యుద్ధ నియుద్ధ జన్యమయిన యా దీప్తకార్యము నుపలక్షించి కుశలభావుకులు భుజ శీర్షముల కంపముల బొందుదురు. తల లూపుదురు. బాహువు లప్ప లింతురు. కన్నీరు పెట్టుదురు. నిలబడుదురు. వారిలో నిట్టి క్రియా విశేషము లుదయించుట నటుల సిద్ధి లక్షణము. కుశల ప్రేక్షకులలో నిట్టి విట్లు కలిగిననె సిద్ధి నూహింపవలెను. నటులు స్వయముగా సంకేతించుకొనిన వారెన్ని సిద్ధివ్యంజనముల సూచించిన నవి పరిగణనీయములు కావని కుశలప్రేక్షక పదము చెప్పును.

౩౯౫. యా భావాతిశయోపేతా సత్త్వయుక్తా తథైవ చ
సాప్రేక్షకైస్తు కర్తవ్యా దైవీసిద్ధిః ప్రయోగతః

౩౯౬. న శబ్దో యత్ర న క్షోభో న చోత్పాతనిదర్శనం
సంపూర్ణతా చ రంగస్య దైవీసిద్ధిస్తు సా స్మృతా

నటప్రయోగము ననుసరించిన దైవీసిద్ధి వేరొకటి కలదు. అందు భావాతిశయము కూడుకొని యుండును. ఏ యవయవ స్పందమయినను భావనిర్భరముగా నుండును. సత్త్వసముపేతమై యుండును. భావ్యమానసుందరమగు నిది ప్రేక్షకుల కామోదప్రదము. నాట్య సంప్రేక్షకులు దీని నిత్యము సంభావింతురు. ఈ దైవీసిద్ధిలో నాడంబర శబ్ద ముండదు. ఆస్ఫోట ముండదు. క్షోభ ముండదు. ఉత్పాతముల నిదర్శముండదు. చక్కని రంగశోభా సంపూర్ణత యుండును. ఇది దైవీసిద్ధి. దీని నభిమానించి ప్రయోగమున గోచరింపజేసికొని సామాజిక ప్రేక్షకులు సంతుష్టులగుదురు. ప్రయోగవిధానమున నీ సిద్ధిస్వభావమును గుర్తించి ప్రేక్షకులు దైవీసిద్ధిని నిత్యము గుర్తింపగలరు. అది మానుషీసిద్ధి, ఇది దైవీసిద్ధి. నటు లవధానసమేతులై వీని సంపాదనాసక్తులగుట యుక్తము.

ఘాతదోషములు.

కాని యిందు ప్రవిఘాతమాపాదించు ఘాతములున్నవి. అవి యనేక విధములు. దైవ సముత్థితములయిన ఘాతములును గలవు, కాగా

౧ దైవసముత్థ ఘాతములు ౨ ఆత్మసముత్థ ఘాతములు

౩ పరసముత్థ ఘాతములు ౪ ఔత్పాతిక ఘాతములు

అని ఘాతములు నాల్గు విధముల నున్నవి. మొదటి మూడు ఘాతము లొకవర్గము. నాల్గవది వేరొకవర్గము. ఈ నాల్గవది యొకొక్కపుడు గలుగును.

౧. దైవకృతము : వాతము వహ్ని వర్షము వనగజము సర్పము మహాసర్పము కీటములు గండుచీమలు పశువులు వీని ప్రవేశనములు మండపనిపాతమును దైవకృతములయిన ఘాతములు. వాతాదులవలన గలుగు సంక్షోభణ మిందభ్యూహ్యము. ఈ ఘాతములు కలుగగా నటుడు సిద్ధి సంపాదింపజాలడు.

౨. ఆత్మకృతము : వైవర్ణ్యము నిశ్చేష్టత విభ్రాంతి స్మృతిమోహము, అన్యవచనమయిన కావ్యవాక్యము అంగదోషము, చేతులాడకుండుట యను విహస్తత, విరుద్ధభూమికాధారణము, ఆర్తనాదము, అతిహసితము, రుదితము, విస్వరత్వము, పిపీలికా కీట పశు

రీతులు విరావములు ముకుటాభరణ నిపాతములు వాద్యవిధుల నను సరింపలేకపోవుట కావ్యవాక్యముల ప్రయోగములందలి యసామర్థ్యము మొదలగునవి యాత్మకృతము లయిన దోషములు.

3. పరకృతములు : మాత్సర్యము వలన గాని ద్వేషమునగాని నటశత్రువులగువారు కొన్ని ఘాతము లాపాదింతురు. నటోక్తముల కర్థభేద మాపాదింతురు. తాము దూషించుటకు తగినవిధముగా నర్థ మాభాషింతురు. ఇట్టి వన్నియు పరు లాపాదించు ఘాతములు. రంగ మున నటు డభినయించు నప్పు డితరులు కొందరు పక పక వికవిక నతిహసిత మొనరింతురు. క్రోశ ధ్వనులు పెట్టుదురు. విస్ఫోటితము లొనర్తురు. గంటలు మ్రోగింతురు. ఈలలు వేయుదురు. గోల చేయు దురు. గోమయము విసరుదురు. లోష్టములు వేయుదురు. దుమ్ము చిమ్ముదురు. ఇట్టివన్నియు శత్రుసంభూతములయిన ఘాతములు. ద్వేషమనునది సహజమగు నప్రీతి. మాత్సర్య మొక కార్యార్థ ముద యించును. ఇద్ద రొకే ప్రయోజన మభిలషించు వారయినప్పుడు మాలవికాగ్నిమిత్రమున గణదాస హరదత్తులకు వలె పరస్పరము మాత్సర్య ముదయించును. శత్రువు లుత్పాదించు పిపీలికా నిక్షేపమున గూడ సిద్ధి విఘాతము కలుగును. సుకుమార ప్రకృతులగు స్త్రీపాత్ర ప్రాయులకు దానివలన త్రాసము జనించును. సిద్ధి విఘాతము కలుగును.

౪. ఔత్పాతికములు : మదమత్తుల ప్రవేశము వలన నివి కలుగును. ఉన్మత్తు లొకప్పుడు ప్రవేశించి నటసిద్ధి భంగపఱుతురు. ఇట్టి వన్నియు ఔత్పాతిక ఘాతములు. ఔత్పాతికఘాతములు ననేక ములు గలవు. పశువేగ క్రియల వలన గొన్ని గలుగును. ఉన్మత్త వ్యాజమున గొంద ఱల్లరి చేయుదురు. నిస్సంకోచముగా గొందఱు సింహాదుల వేషము ధరించి రంగమునకు వచ్చి సుకుమారస్వభావు డయిన ప్రయోక్తను భయపెట్టుదురు. సామాజికుల నయిన చెదర గొట్టుదురు. మాత్సర్యము వలన నొక డున్మత్తలింగుడు నగుడు. వెకిలి తనముగా హాసముత్పాదించుటకు యత్నించి ప్రకృతప్రయోగమునకు విసంవాద మాపాదించి విఘ్నము కలుగజేయును. ఇట్టి వైపరీత్యము కలిగినప్పుడు నటప్రయోక్తలు ప్రకృతము విస్మరింతురు. ఇతరనటుల

భూమికా సముచితములయిన సత్త్వమును భాషణమును చేష్టను స్వీకరింతురు. తమ భూమికను విడనాడువారు కాగలరు. విభూమికు లగుట తూష్ణీకులగుట సర్వము సిద్ధివిఘాతము. ఆకస్మికముగ వ్యాధి కలుగ మకుటాభరణ విభ్రంశమును కలుగును. నేపథ్యభ్రంశము కలుగును.

అతిహసిత రుదిత హసితములు భావసిద్ధిని భంగపఱచ గలవు. కీట పిపీలికల పాత్రప్రసారములు సర్వాత్మనా సిద్ధివిఘాతకము లగును.

౩౯౭. విస్వరమజాతతాలం వర్ణస్వరసంపదా చ పరిహీనం
అజ్ఞాతస్థానలయం స్వరగతమేవంవిధం హన్యాత్
౩౯౮. ముకుటాభరణనిపాతః ప్రబద్ధనాదశ్చ నాశనో భవతి
పశువిశసనం తథా విస్వరమరక్త రాగం ప్రయోగేషు
౩౯౯. విషమం మానవిహీనం విమార్జనం చాకులప్రహారంచ
అవిభక్తగ్రహమోక్షం పుష్కరగతమీదృశం హంతి

స్వరగతములయిన కొన్ని దోషము లున్నవి. అవి సిద్ధినాశకములు నటుని రాగరక్తి నవి ప్రకాశింపజేయవు. ఇందు విస్వరము మొదటి దోషము. స్వరము సంహితమై యుండక విరుద్ధముగ నుండును. అది సిద్ధిపాతకము. అజాత తాలము మరి యొక దోషము. తాలగతి లేకుండుట. తాలానుసరణము లేకుండుట. తాలగమనము లేకున్న రక్తి యుండదు. వర్ణసంపద స్వరసంపద లేకుండుటయు దోషము. ఉండవలసిన వర్ణస్వరముల సంపత్తి లేకున్నచో సిద్ధి నష్టమగును. స్థాన లయ పద్ధతి తెలియకుండుటయు దోషము. స్వరస్థానము స్వరలయ రీతి తెలిసిననె సిద్ధిభంగము కలుగదు. ఇట్టి వన్నియు స్వరగతము లయిన సిద్ధిభంజకములు. రంగసంచలన సమయమున నటుల ముకుటా భరణాదులు క్రిందపడిపోవుట వేషభ్రంశము నాదబహుళముగా కేకలు బొబ్బలు పెట్టులు సిద్ధినాశనమె యగును. రంగమున పశు మారణ దారుణ చర్య ప్రయోగమును రక్తికి రానీయదు. ప్రయోగములందు స్వరహీనమయిన విధాన మసిద్ధికరము. రక్తరాగరాహిత్యము పెద్ద లోటు. అనుకూల రాగ సాహిత్యమె యుపకారి. సిద్ధికారి. వాద్య గతములయిన కతిపయ దోషములు సిద్ధివినాశకము లగును. విషమ గతి, ప్రమాణవిహీనమయిన వాద్యరీతి, యననుకూలత జనితమయిన

విమార్జనవిధానము, వ్యాకులముగా నొనరించు వాద్యప్రహారము, వాద్యములోని గ్రహమోక్షములు పట్టువిడుపులు తెలియకుండునట్లు విభాగ రహితముగా వాద్యమేళన మొనరించుట మొదలగునవి యన్నియు పుష్కరగతము లయిన దోషములు. కేవల మభినయముల సమానీకరణ మేకాక ఆతోద్యగీతములకును సమానీకరణ మావశ్యకము. ఆతోద్యగీతములును అభినయములతో సమముగా సమ్మేలనము పొంది యున్ననె సామాన్యాభినయసంపత్తి చక్కగా సంగతమగును. ఇవి యన్నియు సిద్ధి విఘాతకములగును. కావున నటనర్తకులు సావధానులగుట పరమావశ్యకము.

## కావ్య దోషములు

కావ్యదోషములు కొన్నియున్నవి. అవియు సిద్ధిభంజకములుగా ప్రసిద్ధములు. నటు డెంతగా నటనమున సిద్ధిసాధకుడయినను కావ్యదోషముల దూరీకరించుకొనకపోయినచో సిద్ధి దూరదూర మగును.

౧. పునరుక్తము    ౨. అసమాసము
౩. విభక్తిభేదము    ౪. విసంధి
౫. అపార్థము    ౬. లింగదోషము
౭. ప్రత్యక్షమోహము    ౮. పరోక్షసంమోహము
౯. ఛందోవృత్తత్యాగము    ౧౦. గురులాఘవసంకరము
౧౧. యతిభేదము

ఇవి యిట్టివన్నియు కావ్యమునకు సంబంధించిన స్థూలదోషములు. ఇవి యన్నియు ఘాతస్థానములు. కావ్య సంజాతములయిన ఘాతములకు ప్రతివిధాన మొనరింప శక్యముకాదు. వాక్యాంశమును విస్వరముగ నుచ్చరించుట గొప్పఘాతము. వ్యత్యస్తముగబలుకుటయు దుష్టము. ఇట్టివే కొన్ని విఘాతము లున్నవి.

౧. అస్థానభూషణము    ౨. అస్థానపతనము
౩. మకుటవిభ్రంశము    ౪. అనభిజ్ఞత్వము

ఇం దనభిజ్ఞత్వ మనేకవిధములు. గజాశ్వరథముల యారోహావరోహణములందలి సంప్రదాయము తెలియక చేయుట వైరస్యముత్పాదించును. ఇట్లె ఖరోష్ట్రశిబికాయానముల యారోహణాదికము

తెలియమి పరిహాస ముత్పాదించును. ప్రహరణములను కవచాదిక ములను యథావిధముగ గ్రహించకపోవుట దోషము. వాని విరుద్ధ ధారణమును దుష్టము. ముకుటభూషణముల ధరించి రంగమున ప్రవేశింపవలసిన వ్యక్తి యట్లు కావింపకుండుట విరసము. సమసమయమున రంగమున ప్రవేశింపకుండుటయు నరసము. ఇట్లు కుశలురయిన నాట్యసూరు లీ ఘాతముల గుర్తింపవలసియున్నది. రంగమున ప్రయోగము సంచలనమిచ్చును. సాగిపోవలయును. చిరప్రయోగముతో విసుగు కలుగజేయునది కారాదు.

౪౦౦. సిద్ధ్యా మిశ్రో ఘాతః సర్వగతశ్చైకదేశజో వాపి
నాట్యకుశలేన లేఖ్యా సిద్ధిర్వా స్యాద్విఘాతో వా
౪౦౧. సిద్ధిర్వా ఘాతో వా సర్వగతో వ్యక్తలక్షణో బహుశః
యస్త్వేకదివసజాతః న ప్రత్యవరోపి లేఖ్యః స్యాత్

నాట్యమున ఘాతము కలిగినను సిద్ధి యొకటి యందు కొంత విమిశ్రమై యుండును. ఆ ఘాతము సర్వగతమయినను ఏకదేశజ మయిన నందు సిద్ధియు నుండును. నాట్యకుశలుడు సిద్ధిని ఘాతమును స్పష్టముగ గుర్తింపవలెను. సిద్ధిగాని ఘాతముగాని యందరియందు నుండును. అది యనేక పర్యాయములు వ్యక్తమగును. దాని లక్షణమును సులక్షమగును. అత్యల్పముగ గలిగినను, కేవల మేకప్రయోగముననె కలిగినను దాని నుపేక్షించి యుదాసీనముగ భావింప నక్కఱ లేదు. క్వాచిత్క సిద్ధియు సహృదయ సామాజిక సముల్లిఖిత మయినచో తద్విశేషసంభావనముకలిగినదని నటులందుకై యత్నింతురు. ఘాత మొకప్పటిదె యయినను పురోభాగి ప్రేక్షక భావుకదృష్టి జేరినదని నటులా ఘాతము రానీక సావధానులగుదురు. నటుల సిద్ధ్యసిద్ధులకు సామాన్యముగ సామాజికులె హేతువులగుదురు. నాట్యవిదులు ప్రాశ్నికులు నిరంతరము యథావిధి సిద్ధిసంధాన మొనర్పవలెను. వా రట్లొనర్పగలరు. నాట్యములో నటులు దైన్యసమాశ్రయమున ప్రయోగ మొనరింతు రేని ప్రేక్షకులు దీనత్వము సమాశ్రయింతురు. నటతుష్టిలో తుష్టి పొందుదురు. శోకమున శోకము పొందుదురు.

౪౦౨. దైన్యే దీనత్వమాయాంతి తే నాట్యే ప్రేక్షకాః స్మృతాః
యే తుష్టౌ తుష్టిమాయాంతి శోకే శోకం వ్రజంతి చ

సహృదయభావకులు ప్రేక్షకులగుదురు. అట్లు కావలెను. అందు కొందరు ప్రాశ్నికులు. వీరు నాట్యము పరీక్షింతురు. సిద్ధి విఘాతముల సమీక్షింతురు. సిద్ధిలక్షణముల నుపలక్షింతురు. ప్రాశ్నికులకు నియతము లయిన స్వరూపములున్నవి. ప్రతినియతములయిన విధానము లున్నవి. సంగ్రహముగా వారి చరితసంగ్రమిట్లున్నది.

౪౦౩ చారిత్రాభిజనోపేతాః శాంతవృత్తాః కృతశ్రమాః
యశోధర్మపరాశ్చైవ మధ్యస్థ వయసాన్వితాః
౪౦౪ షడంగ నాట్యకుశలాః వృత్తజ్ఞాస్తత్వదర్శినః
దేశభాషా విధానజ్ఞాః కలాశిల్ప ప్రయోజకాః
౪౦౫ చతుర్ధాభినయోపేతా రసభావ వికల్పకాః
శబ్దచ్ఛందో విధానజ్ఞాః నానాశాస్త్ర విచక్షణాః
౪౦౬ ఏవంవిధాస్తు, కర్తవ్యాః ప్రాశ్నికా నాట్యదర్శనే

నాట్యదర్శనమునకు నియతముగ ప్రాశ్నికుల నియమింప వలయును. వీరున్ననే ప్రయోగము సఫలమగును. అందరు ప్రాశ్నికులు కాజాలరు. వారిలో గొన్ని విశిష్టలక్షణములున్నవి. ప్రాశ్నికులకు లోకసమ్మతమయిన చరిత మావశ్యకము. వారి ప్రవృత్తిలో దోషము గోచరింపరాదు. వా రభిజన సంజాతులు. సంప్రదాయానుగతమయిన విశేషము కలవారు. మనోవృత్తుల ప్రశాంతతను నిత్య మనుభవించు వారగుట యుక్తము. వ్యర్థముగ భావోద్వేగమున వివశులు కారాదు. నాట్యప్రయోగమున తదనుభవమున చిరపరిచయము కలవారు కావల యును. కృతశ్రములగువారె నటశ్రమము గుర్తింతురు. యశఃపరములు ధర్మపరులగుట సముచితము. పక్షపాతప్రవృత్తులతో గూడిన నిర్ణయము యశము కాదు. ధర్మమును కాదు. న్యాయవినిశ్చయముతోడుత వినిర్ణయమె శ్రేయము. ప్రాశ్నికులు తరుణవయస్కులు కారాదు. జరఠులు కారాదు. మధ్యస్థవయోధర్మాన్వితులై యుండవలెను. షడంగనాట్యమున కుశలత్వము కలిగి వృత్తాభిజ్ఞులై తత్త్వదృష్టులై దేశభాషాధర్మమర్మములు గుర్తించినవారు కావలెను. ఇంతమాత్రము చాలదు. కలాశిల్పవిచక్షణులై చతురాభినయముల చాతుర్యముల గుర్తింపగలవారుగా నుండవలెను. ప్రబుద్ధులు శుచిత్వముకలవారు

సమదృష్టికలవారు చతుర్విధవాద్యములు రూపస్వరూపముల పరి చయముకలవారు నేపథ్యవిధానములను రంగప్రవృత్తులను సావధాన ముగ గుర్తించినవారు కావలెను. నేపథ్యధర్మములు గుర్తించువారు రసభావవికల్పకులునగువారు నాట్యమునందలి సూక్ష్మధర్మముల నవగతము చేసికొనగలరు. శబ్దవిధానములు ఛందోవిధానములు వారికి సుపరిచితములు కావలెను. ఇట్టివారు ప్రేక్షకులుగా నుండదగుదురు. వీరు ప్రాశ్నికులుగా నుండగలుగుదురు. ఈ లక్షణసామగ్రి యంతయు భావుకులుకాదగినవారి వ్యుత్పత్తిప్రతిభాద్వైతమును వ్యక్తము చేయును. ఇట్టి వీరు రసరసనాత్మక దృష్టి కలవారని పరినిష్ఠితార్థ సమున్మేషముకల విపశ్చిద్దృష్టికలవారని యనగలము. ఇట్టిపట్ల కేవల మేకాక్షిత్వము సుందరముకాదు. దృష్టిద్వయ మావశ్యకము.

౪౦౩. అవ్యగ్రైరింద్రియైః శుద్ధ ఊహాపోహ విశారదః
త్యక్తదోషోఽనురాగీ చ స నాట్యే ప్రేక్షకః స్మృతః

నాట్యమున ప్రేక్షకునకు వ్యగ్రత తగదు. ఇంద్రియోద్వేగము కూడదు. ఇంద్రియవ్యగ్రతలేక శుద్ధాంతరంగుడగుట నటుల యదృష్టము. అట్లు శుద్ధుడగుటయ కాదు, ఊహావిశారదు డపోహాకుశలుడు కావలెను. ఆత్మదోషములు లేనివాడు. నాట్యరాగమున మెలగువాడు కావలెను. అట్టి యాతడె ప్రేక్షకుడు. కతిపయలక్షణములు మాత్ర మిచట నిరుక్తములు. ఇంక ననేకములున్నవి. వాని నభ్యూహించి తెలియవచ్చును. నాట్యవేదమునందలి పూర్వాపరఘట్ట ప్రఘట్టసారములు సహృదయలక్షణసంవేదన మందింపగలవిగనె యున్నవి. ఈ చెప్పిన లక్షణగుణములన్నియు నొక ప్రేక్షకునం దుండకపోవచ్చును. సర్వగుణములు సర్వాశ్రయములు కావు. విజ్ఞేయ మప్రమేయముగా నున్నది. పర్షద్విశేషములును సంకీర్ణములై యుండును. పరిషత్సమాసీనులయిన పారిషదులు తమ తమ యాత్మ సంవాదము కల శిల్పమును నేపథ్యమును కర్మమును చేష్టితమును సముచితముగా సంభావించునది. స్వస్వకర్మవిషయాశ్రయముగా శిల్ప నేపథ్య వాక్కర్మచేష్టితములను సమ్యక్సంవాదమున సంభావింప వలెను. కొందరు కొన్నిటిని మరికొందరు మరికొన్నిటిని పరిశీలించి

సమీక్షించిన పిమ్మట ప్రేక్షకులందరు పరస్పర సంవాదమున సమరసీకృతమయిన యంశము భావింపగలరు.

౪౦౮. నానాశీలాః ప్రకృతయః శీలే నాట్యం ప్రతిష్ఠితం
ఉత్తమాధమమధ్యానాం వృద్ధబాలిశయోషితాం
౪౦౯. తుష్యంతి తరుణాః కామే విదగ్ధాః సమయాశ్రితే
అర్థేష్వర్థపరాశ్చైవ మోక్షే చాథ విరాగిణః
౪౧౦. శూరాస్తు వీరరౌద్రేషు నియుద్ధేష్వాహవేషు చ
ధర్మాఖ్యానే పురాణేషు వృద్ధాః తుష్యంతి నిత్యశః

లోకప్రకృతు లనేకవిధముల నుందురు. వారంద రేకస్వభావమున నుండరు, భిన్న భిన్న శీలములతో వారుందురు. ఆ యా శీలము లన్నియు ప్రకృతి రమణీయములై యుండును. నాట్యము శీలమున ప్రతిష్ఠితమై యున్నది. నానాభావరససమాకులమై నాట్యము ఏకఘనమగు మహారస ముద్బోధించును. నానాశీలకీలితమయ్యు నాట్యము మహాశీల ప్రతిష్ఠమై యాత్మసంవాద మిచ్చును. మానవులుత్తమాధమమధ్యస్వభావమున నుందురు. ఒకరి శీలము వేరొకరికి రాదు. వచ్చుటయు నసంభావ్యము. వృద్ధబాలిశవనితల శీలములు వేరు వేరుగా నుండును. తరుణులు కామమున తుష్టి వహింతురు. విదగ్ధులు చతురమతులు వైదగ్ధ్యసమయాశ్రితమయిన యంశమువ సంతుష్టి వహింతురు. అర్థపరు లర్థాశ్రితాంశము నభిమానింతురు. విరాగులు మోక్షాసక్తులగుదురు. తద్ధర్మము నభిమానింతురు. శూరులు వీరరౌద్రాసక్తులు నియుద్ధాభిమానులు, ఆవాహాసక్తులు, వృద్ధులు ధర్మాఖ్యానమున్న సంతుష్టులగుదురు. నిత్యము పురాణవిద్యాభిమానమున నుందురు. అనేకు లనేక విధముల నభిలాషము కలవారగుదురు. ఎవరిని కాదన లేము. దేనిని వలదన లేము.

౪౧౧ న శక్యమధమైర్జ్ఞాతుముత్తమానాం విచేష్టితం
తత్వభావేషు సర్వేషు తుష్యంతి సతతం బుధాః
బాలా మూర్ఖాః స్త్రియశ్చైవ హాస్యనైపథ్యయోస్సదా

అధము లుత్తమవ్యక్తుల విచేష్టితార్థముల గ్రహింపజాలరు. చేష్టామాత్రము దర్శింతురు. వాఙ్మాత్ర మాకర్ణింతురు. అంతమాత్రమె

కాని తద్భావనము గుర్తింపలేరు. బుధులగు సహృదయు లట్లుకాదు. తత్త్వసహితములయిన సర్వభావములకును బుధులామోదము వహింతురు. పూర్వులు తత్త్వము తెలియమి యానందము పొందలేరు. వరు లన్నియు తెలిసి యన్నిటి యందును తోషము వహింతురు. అన్నిట ననుకూల భావవ్యంజన మున్నదని తుష్టులగుదురు. ఇది యథమోత్తములవ్యవస్థ. బాలురు మూర్ఖులు స్త్రీలు హాస్య మభిమానింతురు. వేష రమ్యత నాదరింతురు. కాంతిమేలనము వర్ణసంయోజన మిచ్చగింతురు. వారెల్లప్పుడంతమాత్రమె గుర్తింతురు. వారుత్తములచేష్టల నవగాహము చేసికొనజాలరు.

౪౧౨ యస్తుష్టే తుష్టిమాయాతి శోకే శోకముపైతి చ
క్రుద్ధః క్రోధే భయే భీతః న శ్రేష్ఠః ప్రేక్షకః స్మృతః

నాట్యమున వ్యక్తులు తుష్టికలిగి యుందురేని ప్రేక్షకులు తుష్టి పొందవలెను. శోకముపొందియుందురేని శోకము పొందవలెను. క్రోధముకలవారయినచో క్రుద్ధులు కావలెను. భయపడిన భీతులు కావలెను. ఏ భావముపొందిన నాభావముకలవారు కావలెను. అట్లు తద్భావభావితులగుట ప్రేక్షకధర్మము. భావానుకరణసమర్థుడు శ్రేష్ఠ ప్రేక్షకుడు. భావభావనమున భావితహృదయుడగు నాతడు ప్రేక్షక గుణములు కలవాడని గుర్తింపవలెను. దశరూపప్రక్రియకల నాట్య ప్రయోగమున నీవిధముగ ప్రేక్షకులను గుర్తింపవలెను.

నటులసిద్ధి సావధానముగ నిర్ణయింపవలసియున్నది. ప్రేక్షకులం ప్రాశ్నికపదమునందుండి నిర్ణయించుటలో నధికృతులు కావలెను. నటు లొకప్పుడు యశఃప్రార్థులై వివదించువారగుదురు. స్వస్వప్రశస్తి పరములై ప్రయోగ ప్రతియోగితాసక్తులగుదురు. శక్తులయిన యా సక్తుల యుక్తతా నిర్ణయమున సంఘర్షము కలుగవచ్చును. అప్పుడు దక్షులయిన ప్రేక్షకులు ప్రాశ్నికులగుదురు. వారెట్లుందురు? ఇట్లుందురు.

౪౧౩. యజ్ఞవిన్నర్తకశ్చైవ ఛందోవిచ్ఛబ్దవిత్తథా
అస్త్రవిచ్చిత్రకృద్వేశ్యా గాంధర్వో రాజసేవకః

సహృదయప్రేక్షకప్రాశ్నికు లీవిశేషములతో నుండవలెను. వైదికతాంత్రికములగు యాగములకు సంబంధించిన విశేషములు

తెలిసినవాడు కావలెను. ఆ యా సందర్భసముచితములయిన సంప్రదాయములను గుర్తింపవలెను. అంతమాత్రమున నాతనికి ప్రాశ్నికత సిద్ధింపదు. స్వయముగ నాతడు నర్తకుడు కావలెను. అనర్తకుడు నర్తకులధర్మమర్మములు గుర్తింపలేడు. "ఇట్లొనరింపవలెను. ఇట్లొనరింపరాదు" అను నర్తక విధినిషేధముల తెలిసినవె ప్రాశ్నికపీఠ మీాయవలయును. ఈతడింకను ఛందోవిదుడు శబ్దవిదుడగుట యావశ్యకము. ఛందస్సునకు రాగభావములకు కల ప్రతినియతమయిన సంబంధమును గుర్తించిననే నాట్యసహృదయత యలవడును. అస్త్రవిదుడై చిత్రకరణసమర్థుడై ప్రాశ్నికుడు కాగలడు. వేశ్యకలాభిజ్ఞ కావున ప్రాశ్నికస్థానమున నుండదగును. గాంధర్వ నిపుణుడుండదగును. రాజసేవనమున కళామయవిశేషములతో సంబంధపరిచయములుకల రాజసేవకుడును ప్రాశ్నికుడు కాగలడు. ఛందోవిజ్ఞానము శబ్దవేదన మస్త్రసంవేదనము చిత్రకరణమనునివి పాండిత్య వీరత్వ వైదగ్ధ్యములకు నిదానములై యున్నవి. అవి యున్నవా డుత్తమప్రాశ్నికుడు కాగలడు. యజ్ఞవిదుడు యజ్ఞయోగమున నుపకారి. నర్తకు డభినయమున ననుగుణుడు. ఛందోవిదుడు వృత్తబంధము లందును, పాఠ్యవిస్తరమున శబ్దవిదుడును, సౌష్ఠవసంశీలనములో ఇష్వస్త్రవిదుడును నేపథ్యమున చిత్రకరుడును కామోపచారమున వేశ్యయు స్వరకర్మలో గాంధర్వవిదుడును, ఉపచారసంపత్తిలో సేవకుడు నుపయోగించువారగుదురు. ఇట్టివీరు ప్రాశ్నికధర్మపీఠమున నుండి దృష్టాంతసహితముగా సమ్మతముగా ప్రయోగదోషములను ప్రయోగ సంగతములయిన గుణములను వివరించి నిరూపింపవలయును. నటులప్రయోగ వివాదములు సంభవించినపుడు ఆయా ప్రకృతికర్మానుసారమున ధర్మవివేచన మొనరింపవలెను. వివాదములం దశాస్త్రజ్ఞులు నియుక్తులు కారాదు.

౪౧౪. శాస్త్రజ్ఞానాద్యదా తు స్యాత్సంఘర్షః శాస్త్రసంశ్రయః
శాస్త్రప్రమాణనిర్మాణైః వ్యవహారో భవేత్తదా

ఒకప్పుడు నాట్యాచార్యులకు శాస్త్రసంశ్రయమయిన సంఘర్షము రావచ్చును. వారందరు శాస్త్రజ్ఞానముకలవారు. తమ తమ ప్రయోగదీక్షాదక్షత్వమున వా రాత్మవిశ్వాసము కలవారై సంఘర్షపడుదురు. కాళిదాసు మాళవికాగ్నిమిత్రములో హరదత్తగణదాస

నాట్యాచార్యులు కలహించిరి. అట్టి కలహావ్యవహార ముపస్థితమయి నప్పుడు శాస్త్రప్రమాణ నిర్ణాణములతో విధానము నిర్ణయింపవలెను. అప్పు డశాస్త్ర లోనరించునది లేదు.

౪౧౩. భర్తృనియోగాదన్యోన్యవిగ్రహాత్స్పర్థయాపి భరతానాం
అర్థపతాకాహేతోః సంఘర్షో నామ సంభవతి

నాట్యవిదులగువారికి సంఘర్షము విద్యాభివృద్ధిహేతువు. నాట్య సంఘర్ష మనేకవిధముల గలుగును. ఒకప్పుడు నాట్యప్రయోక్తయగు ప్రభువు నాట్యాచార్యుల రప్పించి వారివారి విశిష్టతాప్రఖ్యాపనమునకై వారిలో వారికి సంవాద వివాద రీతి సంఘర్ష మేర్పఱచవచ్చును. అది భర్తృనియోగము. అప్పుడు వారు సంఘర్షపడి తమ ప్రజ్ఞాచాతుర్యములను ప్రదర్శింతురు. ఒకప్పు డన్యోన్యకలహము సంఘర్ష హేతు వగును. ఇట్టిది మాలవికలో గలదు. నాట్యమొనరించువారొకప్పుడు నాట్యవిన్యాసవిశేషములందు తమ సంప్రదాయమె యుక్తమని తమ యాచరితమే యుక్తమని యభిమానపడి కలహింపడుదురు. అది భరతుల స్పర్థ. కొంద రర్థ పతాకా నిమిత్తమై సంఘర్ష పడుదురు. ద్రవ్యకాంక్ష వారిలోవారలకు సంఘర్షము కలుగజేయును. వారి యశోలిప్స సంఘర్షము కలుగజేయును. ఇట్టివన్నియు సంఘర్ష హేతువులు. ఇట్టిపట్టులందు పక్షపాతవిరహితముగా వ్యవహార దర్శన మొనరింపవలెను. ప్రాశ్నికులు తమ యాభిమానికవిశేషముల కలిపి వ్యవహార న్యాయభంగ మొనర్పరాదు.

౪౧౪. కృత్వా పణం పతాకాం వ్యవహారః స భవితవ్యస్తు
నత్యైరనన్యమతిభిః సుఖోపవిష్టైశ్చ శుద్ధభావైశ్చ

ప్రాశ్నికులందరు సుఖోపవిష్టులై యన్యమతులు లేనివారై పరిశుద్ధభావస్వభావులై యుండగా శాస్త్రసంశ్రయమయిన సంఘర్ష వ్యవహార మొనరింపదగును. కేవలము సంఘర్షము సత్త్వప్రదర్శనము మాత్రమె యందు ముఖ్యముకాదు. పణమేర్పఱచి పతాకము నిశ్చయించి వ్యవహారము సాగింపవలెను ప్రేక్షకు లతిసమీపమున నుపవిష్టులు కారాదు. అతిదూరాసనులు కారాదు. సిద్ధిస్థానములను గొన్నిటి నిదివరలో సంకేతించితిమి. పూర్వవిహిత సిద్ధిస్థానముల నుప

లక్షించుకొనుచు ప్రేక్షకు లుపవిష్టులు కావలెను. ద్వాదశహస్తపరిమితముగా వారి యాసనవిధాన మొనర్చుట యుక్తము. నాట్యయోగమున ప్రయోగమనుసరించి ఘాతములను గుర్తింపవలెను. దైవఘాతములున్నవి. పరఘాతములున్నవి. దైవసముత్థములను పరసముత్థములను సమీక్షించి బుధప్రాశ్నికులు విలేఖమున గుర్తింపవలెను. ఏయే నటున కేయే ఘాతము లుప్పతిల్లునో వరుసగా లిఖించి గణించుట సముచితము. నటుడనుకోకుండగనే నాట్యమున ఘాతములు కలుగును. అతడె కొన్ని ఘాతముల నబుద్ధిపూర్వకముగా తెచ్చికొనును. వీని నన్నిటిని విలేఖింపవలెను. ఒక నటునకు ఘాతము లల్పముగానుండును. సిద్ధులు బహుళముగా నుండును. మరి యొకనికి సిద్ధు లల్పములు ఘాతము లధికములుగా నుండును. అట్టియప్పుడు ప్రయోగనిర్వాహకునకు రాజునకు విషయమునంతను విశదపఱచవలెను. అపుడు పతాకప్రయోగవిజయ మెవని కీయదగునో నిశ్చయింపవలెను. వానికి పతాక నిప్పింపవలెను. రంగసభలో నభినందింపవలెను.

౪౧౭ ఘాతా యస్య త్వల్పాః సంఖ్యాతాః సిద్ధయశ్చ బహులాః స్యుః
సిద్ధ్యతిశయాత్పతాకా సమసిద్ధౌ పార్థివాజ్ఞయా జ్ఞ్యయా

ఒకానొకనటుడు లబ్ధప్రతిష్ఠుడయినను ఏదేని కారణవశమున ప్రయోగసహాయమున నప్రతిభుడై ఘాతదోషదూషితుడుకావచ్చును. దాని నా నటుడు తెలిసికొని ప్రయోగసమయమున సవ్యథాచిత్తుడును కావచ్చును. అట్టి సమయములందును ప్రయోగపరీక్ష సిద్ధినిర్ణయము సావధానముగనె జరుగునట్లు ప్రాశ్నికులు పరిశీలించుట యావశ్యకము. ప్రయోగమును పరిశీలించి- ఘాతము లల్పసంఖ్యాకములుగనె యున్నవని సంఖ్యానింతురేని సిద్ధివిశేషము లధికసంఖ్యాకములని నిశ్చయింతురేని యా నటునకు ప్రయోగపతాక సమర్పించుట సముచితము. రాజున కాయంశమును దెలియజెప్పి పతాక నీయవలెను. సిద్ధ్యతిశయము ననుసరించి పతాకనిచ్చుట సర్వసమ్మతరీతి, సమసిద్ధి యుండునేని రాజాజ్ఞానుసారమున పతాకాప్రదాపన ముచితమగును. ఇద్దరి నటుల ప్రయోగపరీక్ష ప్రసక్తమయినపుడు ఘాతసిద్ధి విశేషములను గుర్తించుచు నిర్ణయ మొనరింపవలెను. పతాకసిద్ధ్యతిశయము నను-

సరించి యుండును. సమసిద్ధిలో రాజుండ నే యున్నాడు. పార్శ్వాజ్ఞాను సారమున పతాక నీయవలెను. నరపతియు సిద్ధిసామ్య ముపలక్షించి యిద్దరియందును సమభావుడగు నేని యీ నట్లు లిద్దరికిని పతాకనిచ్చు టయె యుక్తము. అట్టివారిలో తారతమ్య మెన్నుట పక్షపాతము చూపుట సమంజసము కాదు.

౪౧౮. స్వస్థచిత్తై స్సుఖాసీనై స్సువిశిష్టై ర్గుణార్థిభిః
విమృశ్య ప్రేక్షకై ర్గ్రాహ్యం సర్వరాగవరాఙ్ముఖైః

ప్రేక్షకులు స్వస్థచిత్తులై సుఖాసీనులై విశేషవిధివిశిష్టులై గుణమునె గుర్తించు నభిలాషము కలవారై విమర్శించి తత్త్వమును గ్రహింపవలెను. సాధక బాధకములను పరిశీలించి నిర్ణయ మొనరింప వలెను. వారెవరియందు నెట్టి రాగమును జూపరాదు. ఆ విషయమున పరాఙ్ముఖులై పరిశీలింపవలెను. పక్షపాతమున ప్రవర్తించుట ప్రాశ్ని కుల కుచితము కాదు. ప్రేక్షకులు నటులందపరాగులై రాగపరాఙ్ముఖులై ప్రయోగమును పరిశీలింపవలెను. ప్రయోగసమయ సంకేత ములనె యాశ్రయించి సాధనములను దూషణములను దూషణాభాస ములను సమస్థితిని అంగమాధుర్యమును పాఠ్యమును ప్రకృతిని రసము లను వాద్యమును గానమును నేపథ్యమను వేషధారణమును ప్రయత్న పురస్సరముగా గుర్తింపవలెను. గీతవాదిత్ర తాలములు కలావిభాగము లవాంతరకలావిశేషములు నాట్యారంగములుగా నుండు రీతిని ప్రసమీక్షించి సమస్థితిని భావించి నిర్ణయించుట నాట్యమునకు శోభ సంపాదించును.

౪౧౯. అంగోపాంగసమాయుక్తం గీతతాలలయాన్వితం
గానవాద్యసమత్వం చ తద్బుధైస్సమముచ్యతే

అంగోపాంగములతో సముచితముగా కూడియుండుట, గీత తాల లయాన్వితమగుట గానవాద్యరీతులు సమానముగా నుండుట నాట్యము నందు సమస్థితియని బుధు లంగీకరింతురు. ఇట్టి సమస్థితి నుపలక్షింపక పోవుటవలన ననౌచిత్యము కలుగును. అనౌచిత్యము రసభంగ హేతువు. దేశకాలాసముచితములన్నియు ననౌచిత్యకోటిలో జేరును. దేశ కాల స్వభావ కృతమగు ననౌచిత్యము సర్వమును సిద్ధివిఘాతకమగును.

రాజు ప్రభాతమునసె సంగీతక దర్శనాదు లనుసరించినాడనుట యుస ముచితము. సిద్ధ్యనుకూలములగు సన్ని వేశములను సమాలోచన మొనరింపవలెను.

౪౨౦. యాని స్థానాని సిద్ధీనాం తైః సిద్ధిం తు ప్రకాశయేత్
హర్షాదంగ సముద్భూతాం నానారస సముత్థితాం

సిద్ధిసంపాదకము లయిన స్థానములను సావధానముగగుర్తించి వాని ననుసరించినసిద్ధిని ప్రకాశింపజేయవలెను. నానావిధములగు నంగోపాంగముల వలన నా సిద్ధి కలుగును. నానారసభావసన్ని వేశ ములవలన నాసిద్ధి యుదయించును. ఇట్లంగోపాంగ రసభావ సముత్థిత మయిన సిద్ధిని సంతోషపురస్సరముగా ప్రకాశింపజేయుట సముచితము.

## నాట్యవారములు

౪౨౧. వారకాలాస్తు విజ్ఞేయా నాట్యజ్ఞైర్వివిధాశ్రయాః
దివసశ్చైవ రాత్రిశ్చ తయోర్వారాన్నిబోధత

నాట్యవిదులు వివిధాశ్రయములయిన వారకాలములను తెలియవలెను. నాట్యవారములకు గొన్నికాలములు కొన్ని దేశములు సముచితములు. పగలు, రాత్రి వార కాల వ్యవహారమున నుండదగిన వయినను అహోరాత్రవారసంకేతములను గుర్తింపవలెను. పూర్వా హ్ణము మధ్యాహ్నము అపరాహ్ణము అను మూడును దివాసముత్థము లయిన నాట్యవారములని ప్రయోగానుసారమున పరిశీలింపవలెను. ప్రదోషసమయము అర్ధరాత్రి ప్రభాతము నను మూడు సమయములు రాత్రిసముత్థములయిన నాట్యవారములు. ఈ వారకాలములకు సంబం ధించిన విధమున రసాశ్రయ నాట్యకార్యము నెట్లాయోజన మొనరింప వలెనో సంభావనముతో గుర్తించుట యావశ్యకము. వారకాల సమాశ్రయమయిన యా విధానము నానుపూర్వితో గ్రహించునది.

౪౨౨. యచ్ఛ్రోత్రరమణీయం స్యాద్ధర్మోత్థానకృతం చ యత్
పూర్వాహ్ణే తత్ప్రయోక్తవ్యం శుద్ధం వా వికృతం తథా

౪౨౩. సత్త్వోత్థానగుణైర్యుక్తం వాద్యభూయిష్ఠమేవ చ
పుష్కలం సత్త్వయుక్తం చ అపరాహ్ణే ప్రయోజయేత్

౪౨౪. కైశికీవృత్తిసంయుక్తం శృంగారరససంశ్రయం
నృత్తవాదిత్రగీతాఢ్యం ప్రదోషే నాట్యమిష్యతే
౪౨౫. యన్నర్మహాస్యబహులం కరుణప్రాయమేవ చ
ప్రభాతకాలే తత్కార్యం నాట్యం నిద్రావినాశనం

౧. పూర్వాహ్ణప్రయోగము : శ్రోత్రరమణీయము ధర్మాభ్యుదయరూపము నగు ప్రయోగమును పూర్వాహ్ణమునందు ప్రయోగింపవలెను. శుద్ధప్రయోగమయినను మిశ్రప్రయోగమయినను పూర్వాహ్ణసమయమున ప్రయోగించుటయె యుక్తము. విషయమునకు సమయమునకు నియతసంబంధముండును.

౨. అపరాహ్ణప్రయోగము : సత్త్వసముదయ సముచితములగు గుణవిశేషములు కల ప్రయోగమును వాద్యభూయిష్ఠముగా నుండు ప్రయోగమును సత్త్వసంపదకల ప్రయోగమును అపరాహ్ణమున ప్రయోగించునది.

౩. ప్రదోషప్రయోగము : శృంగారరససంశ్రయము కైశికీవృత్తిసహితము నృత్తవాదిత్రగీత పరిపూర్ణమయిన నాట్యమును ప్రదోషసమయమున ప్రయోగింపవలెను.

౪. ప్రభాతప్రయోగము : నర్మబహుళము హాస్యప్రచురము కరుణప్రాయము నగు నాట్యమును ప్రభాతకాలమున ప్రయోగించుట సముచితము. అట్టి సమయమున నట్టి నాట్యమును ప్రయోగించుట నిద్రావినాశనము. ప్రభాతకాలమున నిద్రయేల ? ఇట్టి ప్రయోగ మా సమయమున యుక్తము.

నిషిద్ధసమయము

౪౨౬. అర్ధరాత్రే న యుంజీత న మధ్యాహ్నే తథైవ చ
సంధ్యాభోజనకాలే చ నాట్యం నైవ ప్రయోజయేత్

అర్ధరాత్రమునందు ప్రయోగ మొనరింపరాదు. మధ్యాహ్నసమయమునందును ప్రయోగము నిర్వహింపరాదు. సంధ్యాభోజనసమయమునందును నాట్యప్రయోగ మొనరింపరాదు. కాలదేశయోగ్యతలను చక్కగా సమీక్షించి బలాబలవిధిని పరీక్షించి నాట్యము ప్రయోగింపవలెనే కాని నిషిద్ధసమయములందు ప్రయోగింపరాదు.

నాట్యప్రయోగమున సభ్యసంతోషసంపాదన మావశ్యకము. సభ్య సహృదయులు దేశకాలసమయసౌకర్యమున సంతుష్టులగుదురు కాని తదభావమున సంతుష్టులు కాలేరు. ప్రయోగమునందలి విషయముతో సంవాదమును కలుగదు. సాధారణీకరణమును సంప్రాప్తము కాదు. దేశకాల సమయాది కృతము లయిన విఘ్నములు బహుళముగా నుండగా హృదయసంవాదము కలుగదు. వీతవిఘ్నప్రతీతియు గలదు. లక్ష్యమాత్రవిషయముగా గాని లక్షణమాత్రవిషయముగా గాని వస్తుమాత్రవిచారవిషయముగా గాని సామాజికవిచారముండుట రస భావోచితమయిన ప్రక్రియ కాదు. సర్వసమీకరణముతో సర్వోత్తీర్ణ మయిన సంవాదభాగ్యము సహృదయుల కుండుట పరమావశ్యకము. కావుననె భావానుకూలముగా రసానుకూలముగా నాట్యమును ప్రయోగించుట యవసరమగుచున్నది. అపుడె సహృదయసంవాదము లభించును.

౪౨౭. అథవా దేశకాలౌ చ న పరీక్ష్య ప్రయోక్తృభిః
యథైవాజ్ఞాపయేద్భర్తా తదా యోజ్యమసంశయం

పూర్వము నిరూపించిన నిషేధమునకిందపవాదమున్నది. ప్రయోగ ప్రయోజకుడయిన ప్రభువు విశేష మేదేని యుపలక్షించి నాట్యప్రయోగ మొనరింపవలసినదని యాజ్ఞాపించునేని ప్రయోక్తలు సంశయమువిడనాడి దేశకాలములను పరీక్షింపకనే నాట్యప్రయోగ మాచరింపవలెను. ఇది సమయముకాదని యిది దేశముకాదని సంశ యింపనక్కఱలేదు. తత్తద్రసప్రధానమయిన నాట్యము ఆ యా స్థలములందా యా కాలములందుచితమగును. అచటనే రస ముదయించుననుట సత్యమె యయినను ప్రయోగపరీక్షాది సమయము సంప్రాప్తమగునేని రాజనియోగమున ప్రయోగింపవలెను.

౪౨౮. తథా సముదితాశ్చైవ విజ్ఞేయా నాటకాశ్రితాః
పాత్రం ప్రయోగమృద్ధిశ్చ విజ్ఞేయాస్తు త్రయో గుణాః
౪౨౯. బుద్ధిమత్త్వం సురూపత్వంలయతాలజ్ఞతా తథా
రసభావజ్ఞతా చైవ వయస్థత్వం కుతూహలం
౪౩౦. గ్రహణం ధారణం చైవ గాత్రావైకల్యమేవ చ
నిజసాధ్వసతోత్సాహ ఇతి పాత్రగతో విధిః

౪౩౧. సువాద్యతా సుగానత్వం సుపాత్యత్వం తథైవ చ
శాస్త్రకర్మసమాయోగః ప్రయోగ ఇతి సంజ్ఞితః
౪౩౨. శుచిభూషణతా యా తు మాల్యాభరణవాససాం
విచిత్రరచనా చైవ సమృద్ధిరితి సంజ్ఞితా
౪౩౩. యదా సముదితాస్సర్వే ఏకీభూతా భవంతి హి
అలంకారాస్సకుతపాః మంతవ్యా నాటకాశ్రయాః

పాత్రము ప్రయోగము సమృద్ధి అను మూడును నాటకాశ్రయములయిన గుణములు. ఈ మూడును సముదితములై పరస్పరము సంగతములై యున్నచో ప్రయోగసిద్ధి చక్కగా కలుగును. ప్రయోగ విఘాతములు రావు.

౧ పాత్రగతమయిన విధి యిట్లుండును. రసావిష్టమై యుండునపుడె పాత్రమను సంకేత మభిమతము. బుద్ధిమత్త్వమావశ్యకము. సురూపత్వము లయ తాలాభిజ్ఞత రసభావజ్ఞత మంచివయసులో నుండుట తగిన కుతూహలముండుట పాత్రసముచితమయిన విశేషమును గ్రహింపగలుగుట, గ్రహించిన విషయవిశేషమును ధారణము చేయగలుగుట, గాత్రావైకల్యము గాభరాపడకపోవుట స్వకీయమయిన భావస్పందమున నుండగలుగుట ఉత్సాహమునను నివి పాత్రగత విధానములు. వీనిలో నే యంశము లోపించినను వాగంగ నేపథ్యరచన కలుగదు. వాగంగసత్త్వసముద్భవమయిన విశేషమును గలుగదు.

౨. ప్రయోగగతవిధి యిట్లున్నది. సువాద్యత, సుగానత్వము, సుపాత్యత్వము శాస్త్రకర్మసమాయోగము అనునవి ప్రయోగమునకు ప్రాణములు. నాట్యలోక ధర్మానుసరణము ప్రయోగమున ప్రాణము. అదియె శాస్త్రకర్మసమాయోగము.

3. సమృద్ధివిధి యిట్లున్నది. మాల్యాభరణ వసనములకు సంబంధించిన శుచిభూషణ విధానము సమృద్ధిహేతువు. అపేక్షితములయిన వన్నియు నున్ననె సమృద్ధి యున్నది. విచిత్రరచనయు సమృద్ధిశంసకము. ఇవి యనుకూలముగా నుండుట సమృద్ధి యని సంసజ్ఞితమయినది.

నాటకాశ్రయములయిన యివి యన్నియు సముదితములై యేకీభూతములై యున్నచో ప్రయోగము సుప్రయోగము కాగలదు.

నాటకాశ్రయాలంకారములన్నియు రమ్యములగును. శోభాపూర్ణత కివి యన్నియు హేతువులు. మహార్థమయిన ప్రయోగసిద్ధిలో నివి యన్నియు సంగతములగుట పరమావశ్యకము. ఇట్లిచట సిద్ధిలక్షణము నిరూపితమయినది. ఇటుపై వక్తవ్యశేషమును నిరూపింపవలసి యున్నది.

## ఆంగికాభినయము.

భావములు రసము లుదయించిన విధాన మంతయు యథాక్రమ ముగ జెప్పితిరి. మీ యనుగ్రహమున సర్వ మవగత మయినది. అయిన నింక తెలియవలసి యున్నది. అనుభావవిశేషములచే రస భావముల నభినయింపవలె నంటిరి. వాని మేము తెలియవలయును. ఆ యభినయముల దెలిసికొనినగాని యనుభావము లవగతములు కావు. మా కవి మీరు చెప్పవలయునని వ్యుత్పత్తికోవిదులు గ్రహణ సమర్థులు నయిన ఋషు లడిగిరి.

౪౩౪. నాట్యే కతివిధః కార్యస్తజ్ఞైరభినయక్రమః
కదం వాభినయోహ్యేష కతిభేదశ్చ కీర్తితః
౪౩౫. సర్వమేతద్యథాతత్వం కథయస్వ మహామునే
యోయథాభినయోయస్మిన్యోక్తవ్యఃసిద్ధిమిచ్ఛతా

నాట్యాభిజ్ఞులగువారు నాట్యమున నభినయ మెట్లొనరింపవలెను. మొదట యభినయమునకు రెండవ యభినయమునకు గల సంబంధ మేమి? నాట్యమందలి యభినయక్రమ మెన్నివిధముల నుండును? ఈ యభినయ మొనరించు టెట్లు? అం దెన్ని విధములు గలవు? మహామునీ! ఈ సర్వము మీరు మాకు యథాతత్వము నిరూపింపుడు. ఇంతవఱకు మీ రుపదేశించినది భావింపగా నవయవముల నటు నిటు కదల్పుటయె యభినయ మనిపించుట లేదు. ఆ హస్తపాదాదుల భాషలో నేదియో గూఢతత్వమున్నట్లు పొడగట్టుచున్నది. ఆ తత్వ ముపదేశింపుడు. నాట్యసిద్ధి నభిలషించువా డే యంశ మున నే యభినయ మెట్లాచరింపవలెనో నిరూపింపుడు. కేవల మభినయముల బహిరర్థమున గలుగునది లేదు. తావ న్మాత్రము సిద్ధిప్రదము కాదు. తత్వానుసంధానము సిద్ధిప్రదము.

అదియ కావలయును. ఇట్లు ఋషులడిగిరి. భరతముని మునుల యా వచనముల సాదరముగ వినెను. వారి యాస్థ గుర్తించెను. ఆస్థా శ్రద్ధలు కలవారె సహజ జిజ్ఞాసువులు. ఇక నాల్గభినయముల గుఱించి విశదముగ జెప్పుట కారంభించినాడు. ఇట్లనినాడు. మీరందరు తపోధనులు. తత్త్వమును తపమున గుర్తింతురు. కాని యది మృదూక్తులతో పాయము కాదు. స్వసంవాద సంవిద్రూపమయిన రసమార్గములో లలితరీతి యపేక్షితము. అభినయములవలన నది యున్నది. యథావిధి నే నుదహరించిన యభినయము సకలము నిరూపింతును. అభినయములు నాలుగని యంటినిగదా! వాని నిక వ్యాఖ్యానింతును. అభినయము అభినయమని యన నేల? అభినయపదవాచ్యము దేని నందించును? దేని పొందించును? అభినయ పదార్థమేమి? ఆ పదప్రవృత్తి నిమిత్తమేమి? ఇట్లభినయవిషయమున ప్రశ్న లుదయించును. వీని యుత్తరముగా నిది యాభాషింతును. "ణీఞ్" ధాతువునకు పొందించుట యని యర్థము. "అభి" యను నుపసర్గము చేరగా "అచ్" ప్రత్యయాంతరూపము "అభినయ" మనునది సిద్ధమగును. ఇట్లు దీని ధాత్వనువచనమున నవధరింపవలసియున్నది. ఇం దిది శ్లోకము,

౪౩౬. అభిపూర్వస్తు ణీఞ్ధాతు రాభిముఖ్యార్థనిర్ణయే
యస్మాత్పదార్థాన్నయతి తస్మాదభినయః స్మృతః

ఆభిముఖ్యరూపమయిన యర్థనిర్ణయమున "ణీఞ్" ధాతువు ప్రవర్తించును. ఆ ధాతు వభిపూర్వము కాగా "అభినయ" పదము నిష్పన్నమగును. అభినయము పదార్థాత్మకము లయిన యర్థములను తద్గతములయిన భావములను సహృదయుల సమాస్వాదమున కందించును. సహృదయుల హృదయము లభినయాకృష్టములై భావముల నాస్వాదించును. పదార్థాత్మకముగా నున్న భావములు స్వసంవాదమున సహృదయాస్వాద్యములై రసాత్మక సంవేదన ముల్లసింపజేయును. ఇంతటి ప్రక్రియావిశేష మాపాదించుట కభినయములు సమర్థములగును.

౪౩౭. విభావయంతియస్మాచ్చనానార్థాన్హి ప్రయోగతః
శాఖాంగోపాంగసంయుక్తాంస్తస్మాదభినయాః స్మృతాః

అభినయస్వరూపనిర్వచనములో నిదియు భావనీయము సంభావనీయము. శాఖాంగోపాంగసంయుక్తమయిన యభినయము సౌష్ఠవములో ప్రయోగప్రసారముపొంది నానార్థములను విభావింపజేయును. నానార్థములనుట మహార్థ మొక్కటి యున్నను అవాంతరములయిన నానావిధప్రయోజనములు కల రసములను సహృదయులచే విశిష్టముగా భావింపజేయునది యగుట అభినయము స్వారసికమగుచున్నది. అభినయము కేవల పదార్థాత్మకసంపత్తినిచ్చునదియె కాదు. వాక్యార్థసంవిత్తినిగూడ సంపాదింపగలదు. ఈ యభినయమునం దంగములుగా నుపాంగములుగా పరిగణింపదగిన వనేకము లున్నవి.

౪౩౮. చతుర్విధశ్చైవ భవేన్నాట్యస్యాభినయో ద్విజాః
అనేకభేదబాహుల్యం నాట్యేహ్యస్మిన్ప్రతిష్ఠితం

నాట్యమునకు సంబంధించిన యభినయము నాలుగువిధములు. నాట్యమునం దనేకభేదబాహుల్య మంతయు ప్రతిష్ఠితమై యున్నది. నాట్య మొక సముదాయాత్మకమయిన స్వరూపసంవిత్తత్త్వము. ఇది యనేకభేద సహిష్ణువు. అయినను స్వస్వరూప ప్రతిష్ఠ కలది. ఆగంతుకములుగా వచ్చువాని కన్నిటికి స్వసంవిన్మయస్వరూపమిచ్చి స్వాత్మీకరించును. అప్పుడు భేదభిన్నములుగా నుండు నవియు నట్లై యుండవు. అవి యన్నియు నాట్యమున నాట్యాయితములై లబ్ధప్రతిష్ఠము లగును.

ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్త్వికము నని యభినయము నాలుగువిధముల పరికల్పిత మయినది. ఏకార్థప్రవణమయిన యభినయ మఖండరూపమున నేకవిధమయినను భాగదృష్టి ననుసరించి నాలుగనుట యుక్తమె. అర్థసంపాదనమున గల వైచిత్ర్యము ననుసరించియు చతుర్ధాకల్పనము సంగత మగును. భావసహితముగా సాత్త్వికాభినయము పూర్వము నిరూపిత మయినది. చిత్తవృత్తిస్వభావములయిన భావముల సంబంధ మెట్లుండునదియు నిరుక్తప్రాయము. ప్రస్తుత మంగాభినయ మవసరప్రాప్తము. అంగాభినయము నిక భేదసహితముగా నిరూపింతుము. నిరూపించుటలో నంతర్గతవిశేషముల సావధానముగా గుర్తింపుడని భరతుని సూచనము.

౪౩౯. త్రివిధస్త్వాంగికో జ్ఞేయః శారీరో ముఖజస్తథా
తథాచేష్టాకృతశ్చైవ శాఖాంగోపాంగ సంయుతః

౪౪౦. శిరోహస్తకటీవక్షః పార్శ్వపాద సమన్వితః
అంగప్రత్యంగ సంయుక్తః షడంగోనాట్య సంగ్రహః

ఆంగికాభినయము మూడు విధములు. శారీరము, ముఖజము. చేష్టాకృతము నని. ఈ శారీరముఖజచేష్టాకృతములు మూడును శాఖాంగోపాంగసయుతములై ప్రతిభాసించును. అభినయభావకులిట్లు వీనిని దర్శించిరి. శిరము హస్తము కటిప్రదేశము. వక్షము, పార్శ్వము, పాదము నని షడంగములతో నాట్యసంగ్రహ మున్నది. ఒక్కొక్క దాని కంగములు ప్రత్యంగములు కలవు. అవి యన్నియు వేరు వేరు భేదములతో నున్నవి. ప్రధానభేదము లంగములు. అంగముల యంగము లుపాంగములు శిరోహస్తోరః పార్శ్వకటీపాదముల విభాగము ననుసరించి షడంగకల్పనము సంభావించునది. నేత్రభ్రూనాసాధరకపోల చిబుకము లుపాంగములు.

౪౪౧. తస్యశాఖాచ నృత్తంచ తథైవాంకుర ఏవచ
వస్తూన్యభినయస్యేహ విజ్ఞేయాని ప్రయోక్తృభిః
౪౪౨. ఆంగికస్తు భవేచ్ఛాఖా అంకురః సూచనా భవేత్
అంగహార వినిష్పన్నం నృత్తంతు కరణాశ్రయం

ఆ యభినయమునకు సంబంధించి మూ డంశములున్నవి. అవి నాట్యవస్తువులని పరిభాషాప్రసిద్ధి. శాఖ నృత్తము అంకురము నని యభినయవస్తువులు. వానిని ప్రయోగరీతి ననుసరించిన ప్రయోగదక్షు లావిధముగ గుర్తింపవలెను. అభినయవస్తువిజ్ఞానము ననుసరించి ప్రయోగకౌశలము రాణించునుగదా. ఆంగిక మనునది శాఖ. సూచన యంకురము. కరణాశ్రయమై యంగహారవినిష్పన్నమగునది నృత్త మగును. శాఖాత్మకమయిన ముఖజాభినయము నానాభావసమాశ్రయము. ముఖావయవములందు భావసర్వస్వ మిమిడి యుండును. అందు ముందుగా శిరఃకర్మను నిరూపించుట సముచితము శిరఃకర్మలు పదమూడు విధములు. వాని పేరు లిట్లున్నవి.

౧ ఆకంపితము ౨ కంపితము ౩ ధూతము
౪ విధుతము ౫ పరివాహితము ౬ ఉద్వాహితము
౭ అవధూతము ౮ అంచితము ౯ నిహంచితము
౧౦ పరావృత్తము ౧౧ ఉత్క్షిప్తము ౧౨ అధోగతము
౧ పరిలోలితము.

సాధారణముగా నామసంకేతములం దంతట సాభిప్రాయత సుప్రసిద్ధము. పూర్వమట్లె నిదర్శితమయినది. ఈ నామములందున్న భావమును దురూహము కాదు. నామనిర్దేశమె కొంతగా లక్షణ నిర్దేశము కాగలదు. అయినను స్పష్టతకై వీని లక్షణము పర్యాలోచన మొనర్పవలెను. లక్షణపర్యాలోచన సమయముననె వినియోగసమయ సంకేతమును సముచితము. ఆ యా సమయవినియోగము పొందు నా యా శిరఃకర్మాదు లుద్దిష్టసముద్దిష్టములయిన చిత్తభావములను సూచింపగలవు. ఆకంపితాదుల లక్షణవినియోగవిశేషప్రదర్శనము వలన వాని స్వరూపము స్పష్టమగును. కొన్ని కొన్ని పట్టులలో లక్షణ సామ్యము వినియోగసామ్య మవభాసించినను పూర్వోత్తరవివేకమున ననుగతి సంపాదించుట శక్యమె యగును.

౧. ఆకంపితము. ౨. కంపితము,

౪౪౩. శనైరాకంపనాదూర్ధ్వమధశ్చాకంపితం భవేత్
ద్రుతం తదేవ బహుశః కమ్పితం కమ్పితం శిరః
౪౪౪. సంజ్ఞోపలంభప్రశ్నేషు స్వభావాభాషణే తథా
నిర్దేశావాహనే చైవ భవేదాకంపితం శిరః
౪౪౫. రోషే వితర్కే విజ్ఞానే ప్రతిజ్ఞానేఽథ తర్జనే
ప్రశ్నాతిశయవాక్యేషు శిరః కంపితమిష్యతే

౧. ఆకంపితము : మీాదికి క్రిందికి మెల్లిగా శిరమును కంపింప జేయుట దీని లక్షణము. శిరమూర్ధ్వాధోభాగముల కాకంపనము కలదగుట కంపితాకంపితముల సమానమయినను శనైరాకంపన మున్నచో నాకంపితశిరఃకర్మ యగును. "ఋజుస్థితస్య చోర్ధ్వాధః క్షేపాదాకంపితం భవేత్" అని పాఠాంతరలక్షణము. శిరస్సు స్వాభావ సహజమయిన విధానమున ఋజువుగా నుండగా నా శిరము నూర్ధ్వాధోభాగములకు క్షేపణ మొనరించినచో నాకంపితమను శిరఃకర్మ యగును. అని దీని భావము. ఇట్టి పాఠాంతరములందు పదరచన భిన్నముగా నుండునే కాని భావ మభిన్నముగనె యుండును. భిన్నమగు భావమున్నప్పుడు పాఠాంతర మావశ్యక మనిపించును. ఇట్లు పాఠాంతరము లావశ్యకము లనావశ్యకములు నగును.

౨. కంపితము. ఊర్ధ్వాధఃకంపనముకల శిరమును వేగముగా బహుపర్యాయములు కంపిత మొనరించినచో నది కంపితమను శిరః కర్మ యగును.

ఆకంపిత శిరఃకర్మ నీ యీ విధానములం దుపయోగింపవలెను. సంజ్ఞ, ఉపలంభము ఒక వస్తువుయొక్క ప్రాప్తి, ప్రశ్న, స్వభావ సముచితమయిన యాభాషణము, ఒక కార్యమును నీ విట్లాచరింపవలసినదని నిర్దేశించుట, ఆవాహనము = దయతో విచ్చేయవలయునని యావాహన మొనరించుట, ఇట్టి సమయములం దాకంపిత మావశ్యక మగును. ఇది యిట్టిదని సంకేతించి యుపదేశించుటలోగూడ నిది యున్నది. సంజ్ఞోపదేశమునందు నాకంపితము కలదందురు.

కంపిత శిరఃకర్మ రోషము వితర్కము, విజ్ఞానము, ప్రతిజ్ఞానము తర్జనము లందు ప్రసక్తమగును. ఇదియె ప్రశ్నాతిశయ వాక్యములందు నుపయోగించును. అర్జనము గర్జనము వ్యాధి యమర్షణము లను వాని యందును కంపితశిరమును వినియోగింపవలె నందురు. వస్తు యథార్థతత్త్వమును తాను తెలియుట విజ్ఞానము. ఒక కార్య మాచరింపవచ్చునని తానంగీకరించుట ప్రతిజ్ఞానము. తర్జనము భయపెట్టుట బెదిరించుట. ఇట్టి భావములను సూచించుటకై కంపితకర్మ నాచరింపవలెనని భావము. కేవల కంపిత శిరఃకర్మ వలన నీ భావము లన్నియు గోచరింపవు. ఆ యా ,భావములు గోచరించుట కితర కర్మలు నావశ్యకములు. నానావిధములయిన ముఖకర్మలన్నియు గూడ యా యా భావములను స్ఫురింపజేయఁగలవు. అయినను ప్రాధాన్యము ననుసరించిన వ్యపదేశము యుక్తము కావున శిరఃకర్మకృతముగా ముఖ్యముగా నా యా భావములు గోచరించినప్పుడు శిరఃకర్మనే చెప్పవలసి యుండును. ఇట్లె యితర వినియోగము లందును పరిగ్రాహ్యము.

౩ ధుతము ౪ విధుతము

౯౯౮. శిరసో రేచనం సమ్యక్ శనైస్తత్ ధుతమిష్యతే
ద్రుతమారేచనాదేత ద్విధుతం తు భవేచ్ఛిరః

౯౯౯. అనీప్సితే విషాదే చ విస్మయే ప్రత్యయే తథా
పార్శ్వావలోకనే శూన్యే ప్రతిషేధే ధుతం శిరః

౪౪౮. శీతగ్రస్తే భయార్తే చ త్రాసితే జ్వరితే తథా
పీతమాత్రే తథా మద్యే విధుతం తు భవేచ్ఛిరః

3 ధుతము, సమ్యగ్విధానమున మెల్లగా శిరమును రేచిత మొనరించినచో ధుత మను శిరఃకర్మ యగును. రేచన మొనరించు టయె రేచితము. శిరోగ్రీవాకటీపాణిపాదముల కదలికను రేచనము రేచితము నని యందురు. ధుతము విధుతము కదల్చుట విదల్చుట యటు నిటు నడ్డముగా త్రిప్పుట, యని గుర్తింపవచ్చును. బాగుగా త్రిప్పుట సమ్యక్కుగా త్రిప్పుట. ఆ రేచనము బాగుగా గోచరింప వలెను. ఈ రేచనము "శనైః" మెల్లగా నుండుట వివక్షితము.

ధుతశిరము ననీప్సితమున నుపయోగింపవలెను. విషాదము విస్మయము విశ్వాసము లందు నుపయోగింపవలెను. పార్శ్వావలోకనమునందును శూన్యావలోకనమునందును ప్రతిషేధించుటయందును ధుత మున్నది.

౪ విధుతము. వేగవేగముగా రేచనమున్నచో విధుత శిరమగును. విశేషముగా ధుతము విధుతము ధూఞ్ ధాతువునకు కంపన మని యర్థము. శిరమునకు విశేషముగా కంపన మున్నప్పుడు విధుత మని భావము. చల్లనిగాలివలన చలివేయునప్పుడు, భయమున పీడితుడయినపుడు, ఇతరులు త్రాసపెట్టినపుడు, జ్వరితుడయినపుడు మద్యపాన మొనరించినపుడును విధుత శిరమును ప్రయోగించుట యుక్తము.

౫ పరివాహితము ౬ ఉద్వాహితము

౪౪౯. పర్యాయతః పార్శ్వగతం శిరః స్యాత్పరివాహితం
అధూతముచ్యతే తిర్యక్సకృదుద్వాహితం తు యత్
౪౫౦. సాధనే విస్మయే హర్షే స్మృతే చామర్షితే తథా
విచారే విహృతే చైవ లీలాయాం పరివాహితం

౪౫౧. గర్వేచ్ఛాదర్శనే చైవ పార్శ్వస్థోర్ధ్వనిరీక్షణే
ఉద్వాహితం తు కర్తవ్యమాత్మసంభావనాదిషు

౫. పరివాహితము : పర్యాయశః శిరము పార్శ్వగతమయినచో పరివాహితమగును. ఒకమారొక్కొకమారు శిరము ప్రక్కకు వంపుగా

నొరిగినచో పరివాహితము. ఒకమా రటు ఒరుగుట మరియొకమా రిటు ఒరుగుట యున్న నీ శిరఃకర్మ యగును. కేవల మటుగాని కేవల మిటుగాని యొరుగుట కాక అటు నిటు నొరుగుటయె వివక్షితము కావలెను. శిరము దక్షవామపార్శ్వగతమయినప్పుడె పరివాహిత మగును. ఈ భావమె పర్యాయశః పదము వలన స్పష్టమగును.

"మండలభ్రమణాచ్చాపి పరివాహితమిష్యతే
మండలభ్రమణే చైవ భవేత్తు పరివాహితం"

అనియు పాఠమున్నది. మండలాకారముగా శిరమును భ్రమింప జేసిన పరివాహితమని దీని భావము. సాధనవిస్మయ హర్షస్మృత్యమర్ష విచార విహృతలీలావిశేషములందు పరివాహిత ముచితమగునని వినియోగమున్నది. ఆ వినియోగానుకూలముగా పార్శ్వపరివర్తన ముండుటను భావించు నట సహృదయులు మండలభ్రమణము సంతగా భావింపరు. విస్మయాదిప్రదర్శనమున మండలభ్రమణ ముదాత్తముగా నుండదు. మండలభ్రమణమె సముచితముగ నుండువారి నేమియు ననము.

కార్యసాధననిర్దేశము నందు పరివాహిత మిష్టము. విస్మయానుభూతిలో నిది సంగతము. హర్షస్మృతులలో నిది యుండును. అమర్ష సహితుడై యున్న వానిలో నిది యుక్తము. విహృతమను శృంగార భావావిష్కరణమందును ప్రియానుకరణాత్మక లీలార్థమునందును పరివాహితశిరఃకర్మ యుపయుక్తముగానుండు. శిరఃకర్మాదుల వినియోగరీతులన్నియు పురుషసంబద్ధములు కావు. అన్నియు స్త్రీసంబద్ధములును గావు. వానివానిని యథాసంభవముగ గుర్తించుటయ యుక్తము.

౬. ఉద్వాహితము : ఒక పర్యాయము శిరము నడ్డముగా నవధూనన మొనర్చుట కుద్వాహితమని పేరు. అడ్డముగా తలత్రిప్పుట యని భావము. ఈ యుద్వాహితము నన్యథా లక్షించుటయు గలదు.

"సకృదుద్వాహితం చోర్ధ్వ ముద్వాహిత మితి స్మృతం"

పై భాగమున కొక పర్యాయము శిర మెగురవేయుట యుద్వాహితము. ఈ లక్షణభేదములను యథాసంగతముగా గుర్తించునది. గర్వమున్న

ఖుల ప్రదర్శించునప్పు డీ యుద్వాహిత ముండును. ప్రక్కనున్నవానిని పైగా జూచుటలో నిది యుండును. తనగొప్పదనమును తాను సంభావించునప్పుడు నీ యుద్వాహిత ముండును. ఆత్మశ్లాఘాపరు డాత్మసంభావనాసక్తు డగును గావున ఉద్వాహిత శిరఃకర్మ సముచితమగును.

## ౭ అవధూతము

౪౫.౨. యదధః సకృదాక్షిప్తమవధూతం తు తచ్ఛిరః
సందేశావాహనాలాప సంజ్ఞాదిషు తదిష్యతే

౭ అవధూతము. ఒక పర్యాయము క్రిందకు శిరము నూపుట యవధూత శిరఃకర్మ యగును. ఊపుగా శిరమును దిగువ కాక్షిప్తము చేయుట.

"ఆక్షిప్తస్రంసకృద్యత్స్యాదవధూతమిహోచ్యతే" ఊపుగా వంచి వ్రేలాడువిధమున నుంచుట యవధూతశిరమని భావాంతరము కలదు. ఈ శిరము సందేశమున నుపయుక్త మగును. ఆవాహనమున నుపయోగించును. ఆలాపసంజ్ఞాదులలో వినియోగము పొందును. తానేమేని చెప్పదలచి సమక్షమున నున్నవానిని దగ్గరకు రమ్మనుటలో, నెదిరివాని కాదేశమిచ్చుటలో నవధూత ప్రయోగము సముచితము. బాంధవావాహనాలాపసంజ్ఞాదులలో నిది యుండుననిరి.

## ౮ అంచితము

౪౫.౩. కించిత్పార్శ్వనతగ్రీవం శిరో విజ్ఞేయమంచితం
వ్యాధితే మూర్ఛితే మత్తే చింతాయాం హనుధారణే

౮ అంచితము. మెడ కొంతగా పార్శ్వభాగమునకు వంగియున్నచో నది యంచితమను శిరఃకర్మయగును. నతగ్రీవమయిన శిరమంచితశిరము. వ్యాధితుడయిన వాని యభినయమున నంచితముండును. మత్తమూర్ఛితాభినయమునం దిది యుండును. చింతాభినయములో నంచిత మావశ్యకము. చిబుకమును చేతితో ధరించి యుండునపు డంచిత మున్నది. శంకిత దుఃఖితాభినయమునందు నిది యుండునని కొందర రభిమానించిరి.

## ౯ నిహంచితము

౪౫౪. ఉత్క్షిప్తాంసావనక్తం యత్కుంచిత భ్రూలతం మనాక్
నిహంచితం తు విజ్ఞేయం స్త్రీణామేతత్ప్రయోజయేత్
౪౫౫. గర్వే మానే విలాసే చ బిబ్బోకే కిలికించితే
మోట్టాయితే కుట్టమితే స్తంభే మానే నిహంచితం

౯ నిహంచితము. స్త్రీలు మాత్రమె యీ నిహంచిత శిరఃకర్మను ప్రయోగింపవలెను. పురుషులు ప్రయోగింప జనదు. పూర్వోదితములు కేవలము స్త్రీలకను నియమము లేదు. స్త్రీలకు పురుషులకు వానిని ప్రయోగింపవచ్చును. "స్త్రీణామేతత్ప్రయోజయేత్" అనుట వలన పురుషనిషేధము వ్యక్తమయినది. బిబ్బోకకిలికించితాది వినియోగస్థానములన్నియు స్త్రీ శృంగారభావములయినందున పురుషులకందు ప్రయోగాధికారము లభింపదు. కొంచెముగా నుత్క్షిప్తమయిన భుజాగ్రమున శిరము కూడుకొనినచో భ్రూలతకుంచితమై యున్నచో నిహంచిత శిరఃకర్మ యగును. నిహంచితమను దీని నికుంచిత మని యనిరి.

"ఉత్క్షిప్తం చాంగశీర్షం చ నికుంచితశిరోధరం"
"ఉత్క్షిప్తబాహుశిఖరం నికుంచితశిరోధరం"

అంగము శిరముత్క్షిప్తమయినప్పుడు నికుంచితమని యీ పాఠభావము. నికుంచితమను పదమె కొందరి వ్యవహారమున నున్నది.

గర్వము మానము విలాసము బిబ్బోకము కిలికించితము మోట్టాయితము కుట్టమితము స్తంభము మానము నభినయించునప్పుడు నిహంచిత శిరఃకర్మ యుండును. పానవిలాసమునందును కంపమునందును నిహంచితముండు ననిరి. లలితమను శృంగారభావమున నిది యుండుననియు ననిరి. పై వినియోగవచనములలో మానము రెండు పర్యాయములు ప్రయుక్తమయినది. మొదటి మానము కోపము రెండవది యభిమానాత్మకము. విలాసాదులన్నియు స్త్రీల శృంగార భావములు. వీని లక్షణము వేరొకచో విస్తృతము.

## ౧౦. పరావృత్తము.

౪౫౬. పరావృత్తానుకరణాత్పరావృత్తమిహోచ్యతే
తత్స్యాన్ముఖాపహరణే పృష్ఠతః ప్రేక్షణాదిషు

౧౦. పరావృత్తము : తలను వెనుద్రిప్పుట ననుకరింపగా పరావృత్తమను శిరఃకర్మ యగును. ముఖాపహారణమున నిది యుపకారి. ఎదుటనున్నవానికి ముఖము చూపకుండుటకై యొనరించు ముఖాపహారణమున దీని ప్రయోగింపవలెను. పృష్ఠతః ప్రేక్షణములందు నిది యుపయోగించును. పృష్ఠప్రేక్షణము తన వెనుచూచుట. ఒక పర్యాయము వామభుజమునుండి మెడమలచి పృష్ఠము చూచుట. మరొక పర్యాయము దక్షభుజమునుండి మలగినూచుట. శ్రోణీపరిసరములందు ప్రేలాడు కేశపాశాది దర్శనమున నిది ప్రయుక్తమై రమ్య మగును. తొమ్మనిగుడ మెడమగుడ మడమ చూచుటలో నిది యుండును.

౧౧. ఉత్క్షిప్తము.

౪౫౭. ఉత్క్షిప్తం చాపి విజ్ఞేయమున్ముఖావస్థితం శిరః
ప్రాంశుదివ్యార్థయోగేషు స్యాదుత్క్షిప్తం ప్రయోగతః

౧౧ ఉత్క్షిప్తము. శిర మున్ముఖముగా నున్నచో నుత్క్షిప్తమను శిరఃకర్మ యగును. కొంచెముగా పైకి లేవనెత్తుట యుత్క్షిప్తము పొడవైన వాని జూచునపుడు, ఎత్తుగానున్న దివ్యార్థముల దర్శించునపు డుత్క్షిప్త శిరఃకర్మ ప్రయోగరమ్యముగా నుండును. సాధారణముగా నామనిర్దేశాత్మకములయిన కొన్నిపదములు నిగదవ్యాఖ్యానములుగా నుండును. ఈ పద మట్టిది.

౧౨ అధోగతము

౪౫౮. అవాఙ్ముఖస్థితం చాపి బుధాః ప్రాహురధోగతం
లజ్జాయాం చ ప్రణామే చ దుఃఖే చాధోగతం శిరః

౧౨ అధోగతము. ఇదియు నిగదవ్యాఖ్యానము. శిర మవాఙ్ముఖముగా నున్నచో నధోగతమను శిరోభేద మగును. లజ్జాభావాభినయమున ప్రణామాచరణమున దుఃఖానుభవనమున శిర మధోగతముగ నుండును. "స్తంభే చాధోగతం, దుస్తంభేఽధోగతం" అని స్తంభ దుస్తంభములలో నధోగత మభిమానించిరి.

౧౩. లోలితము.

౪౫౯. సర్వతోభ్రమణాచ్చైవ శిరో లోలితముచ్యతే
మూర్ఛావ్యాధిమదావేశగ్రహనిద్రాదిషు స్మృతం

౧౩ లోలితము : ఇదియె పరిలోలితము. అంతట భ్రమణము కల శిరము లోలిత మనదగును. ఏకసంస్థానమున శిర ముండక అంతట ననవస్థితముగా భ్రమణము పరిభ్రమణము కలది కాగా నీ పరిలోలిత శిరఃకర్మ యగును. మూర్ఛవ్యాధి మదావేశము గ్రహావేశము నిద్రావేశము లందు లోలిత శిరఃకర్మ ప్రయోగ ముండును. లోలనమున్నందున శిరము పరిలోలిత మగును. ఇట్లీ శిరఃకర్మలు నిర్దిష్టము లయినవి. శిరఃకర్మ పదునాలుగు విధములని భావించువారు ప్రాకృత మను శిరఃకర్మను గూడ నంగీకరించినారు.

ఋజుస్వభావసంస్థానం ప్రాకృతం తు స్వభావజం
మంగల్యాధ్యయనధ్యాన స్వభావ జయకర్మసు.

అని ప్రాకృతశిరఃకర్మ లక్షణము. ఋజుస్వభావస్థితితో నుండుట ప్రాకృత శిరఃకర్మ. ఇది స్వభావసహజకర్మ. ఇది మాంగలికవిధిలో నధ్యయనవిధానమున ధ్యానమునందు స్వభావసముచితముగా నుండుట యందు జయకర్మయందు ప్రయోగార్హము. ఇది పదునాల్గవ శిరఃకర్మ. ఇది మొదట నిర్దిష్టము కాదు. స్వభావసముచితముగా నిశ్చలముగా నుండుట ప్రత్యేక కర్మవ్యవహారము పొందుట కర్హము కాదు. అట్టి దానిని పరిగణింప నక్కరలేదు. అందువనె "త్రయోదశవిధం హ్యేతచ్ఛిరఃకర్మ" యనుట సంగతము.

ఈ చెప్పిన పదమూడు శిరఃకర్మ భేదములనె కాక బహ్వన్య భేదములను గూడ లోకాభినయాశ్రయమున గుర్తింపవచ్చును. వానినన్నిటిని లోక స్వభావము ననుసరించి ప్రయోక్తలు ప్రయోగింపవలసియున్నది. లోకాభినయాశ్రయములను నాట్యదర్శిదర్శనమున పరిశీలనమున ప్రయోగమునందు ప్రయోక్తలు ప్రతిపాదింతురు. ఎన్నియున్నను దృష్టి కాగినవాని స్వీకరించుట యుక్తము.

ఇంతవర కిట్లు త్రయోదశవిధ శిరఃకర్మలు నిరూపితము లయినవి. ఇటుపై దృష్టిలక్షణనిరూపణ మావశ్యకము.

### దృష్టి భేదములు.

౧. రసదృష్టులు

౧ కాంత ౨ భయానక

౩ హాస్య ౪ కరుణ
౫ అద్భుత ౬ రౌద్రి
౭ వీర ౮ బీభత్స

ఈ కాంతాదు లెనిమిది రసదృష్టులు. ఆ యా రసముల కా యా దృష్టు లనుగతములై యుండును. కాంతాది దృష్టుల నామ నిర్దేశమున నే స్వరూపసంవేదనము కలుగును. అయినను లక్షణకథనమున విశేషస్వరూప మవగత మగును. కాంతా భయానకాదులు వరుసగా శృంగార భయానకాదులకు సంబంధించి యున్నవి. ఇందీ క్రమనిర్దేశ ములో నుద్దిష్టమగు భావ మేదియు లేదు. రసము వలన రసాంత రోత్పత్తి యున్నట్లు దృష్టివలన దృష్ట్యంతరోత్పత్తి యిందు లేదు. ఈ పరిగణనములో శాంతదృష్టి పరిగణనము లేదు. పాఠాంతరమున సలక్షణముగా శాంతదృష్టి యున్నది. స్థాయిభావదృష్టులలో శమ దృష్టికి సంకేతము లేదు. లక్షణమును లేదు. ఇట్టి నిర్దేశమున నవభా సింమ భావవిశేషము రసమీమాంసలో విస్తృత మయినది. ఇక నీ రసదృష్టుల లక్షణము నిరూపింపవలెను. స్థాయిదృష్టి సంకేతము రస దృష్టిలక్షణమును సుగమ మొనరింపగలదు కావున స్థాయిదృష్టుల సంకేతించుటయు నుచితము.

స్థాయిదృష్టులు

౧ స్నిగ్ధ ౨ హృష్ట ౩ దీన ౪ క్రుద్ధ
౫ దృప్త ౬ భయాన్విత ౭ జుగుప్సిత విస్మిత

ఈ యెనిమిది స్థాయిభావములం దుండు దృష్టులు. దృష్టివిధాన ప్రసక్తిలో సామాన్యదృష్టుల నన్నిటిని సంకేతించుట యుచితము అవి భావమూలములు.

సంచారిదృష్టులు.

౧ శూన్య ౨ మలిన ౩ శ్రాంత ౪ లజ్జాన్విత
౫ గ్లాన ౬ శంకిత ౭ విషణ్ణ ౮ ముకుల
౯ కుంచిత ౧౦ అభితప్త ౧౧ జిహ్మ ౧౨ సలలిత
౧౩ వితర్కిత ౧౪ అర్ధముకుల ౧౫ విభ్రాంత ౧౬ విప్లుత
౧౭ ఆకేకర ౧౮ వికోశ ౧౯ త్రస్త ౨౦ మదిర

స్థాయిరసదృష్టులతో నివి కూడి మొత్తము ముప్పదియారు దృష్టు లయినవి. ఇవి యన్నియు నాట్యమున ప్రధానములు. వీనియందు నాట్యము ప్రతిష్ఠితమై యున్నది.

షట్త్రింశద్దృష్టయో హ్యేతాస్తాసు నాట్యం ప్రతిష్ఠితం

దృష్టిలక్షణము—రసదృష్టులు

౪౬౦. అస్యదృష్టి విధానస్య నానాభావ రసాశ్రయం
లక్షణం సంప్రవక్ష్యామి యథాకర్మ ప్రయోగతః
౪౬౧. హర్షప్రసాదజనితా కాంతాత్యర్థం సమన్మథా
సభ్రూక్షేపకటాక్షా చ శృంగారే దృష్టిరిష్యతే
౪౬౨. ప్రోద్వృత్త నిష్టబ్ధపుటా స్ఫురదుద్వృత్త తారకా
దృష్టిర్భయాన కాత్యర్థం భీతా జ్ఞేయా భయానకే
౪౬౩. క్రమాదాకుంచితపుటా సవిభ్రాంతాల్పతారకా
హాస్యా దృష్టిస్తు కర్తవ్యా కుహకాభినయం ప్రతి
౪౬౪. పతితోర్ధ్వపుటా సాస్రా మన్యుమంథర తారకా
నాసాగ్రానుగతా దృష్టిః కరుణా కరుణే రసే
౪౬౫. యా త్వాకుంచిత పక్ష్మాగ్రా సాశ్చర్యో ద్వృత్తతారకా
సౌమ్యా వికసితాంతా చ సాద్భుతా దృష్టిరద్భుతే
౪౬౬. క్రూరా రూక్షారుణోద్వృత్తా నిష్టబ్ధపుటతారకా
భ్రుకుటీ కుటిలా దృష్టి రౌద్రీ రౌద్రరసే స్మృతా
౪౬౭. దీప్తా వికసితా క్షుబ్ధా గంభీరా సమతారకా
ఉత్ఫుల్లమధ్యా దృష్టిస్తు వీరా వీరరసాశ్రయా
౪౬౮. నికుంచితపుటాపాంగా ఘూర్ణోపప్లుతతారకా
సంశ్లిష్టస్థిరపక్ష్మా చ బీభత్సా దృష్టిరిష్యతే
౪౬౯. రసజా దృష్టయో హ్యేతా విజ్ఞేయా లక్షణాన్వితాః

స్థాయిరసదృష్టులగూడి మొత్త మివి యన్నియు ముప్పదియారయినవి. ఇవి ముప్పదియారనుట న్యూనాధిక సంఖ్యానివృత్తి సూచించును. ప్రత్యభిజ్ఞాదర్శనమున నంగీకరించు షట్త్రింశత్తత్త్వములకు వీనికి సంబంధము లేకున్నను సంఖ్యాసాదృశ్యము దానిని స్మృతికి దెచ్చును. రసదృష్టి రసమయసన్నివేశసౌందర్యము నావిష్కరించును. స్థాయిదృష్టి రసీభావయోగ్యత నావిష్కరించును. ఇతరములయిన దృష్టులు భావావిష్కరణమునకు సమర్థములు. ఈ దృష్టివిధాన

మంతయు నానాభావరసాశ్రయము. చిత్తవృత్త్యాత్మకముగానున్న నానావిధములగు భావములు రసములు సంవిదుల్లాసరీతిలో నుచ్ఛ్వాన కల్పములో సంవిదున్మేషమార్గములయిన నానేంద్రియములందు స్వస్పందవైచిత్ర్య మాపాదించును. సంవిత్సూత్రబద్ధములయిన యవి సంవిదను క్రమమున ప్రస్పందమానము లగును. ఆ స్వస్పందసుందరమయిన రీతి సర్వేంద్రియములందును సర్వావయవములందును సాక్షాత్కరించును. కాని చక్షుఃప్రజ్ఞాదర్పణములో సంవిత్ప్రతిబింబనము స్ఫుటముగా నుండును. అది యంతయు దృష్టుల యదృష్టము. ఇది యంతయు ముప్పదియారు దృష్టులందు సంక్రాంతస్వరూపమగుటసహృదయవేద్యము. దృష్టులనంతములు కావచ్చును. ఇచటి పరిగణనమును భావశూన్యముకాదు. నానాభావములను నానారసములను దృష్టు లాశ్రయించి యుండును. నానాభావరసముల కీ దృష్టు లాశ్రయముగా నుండును. అను నీ భావద్వయము యథాసంభవముగా పరిగ్రాహ్యము. ఆ యా కర్మప్రయోగానుకూలముగా నా యా దృష్టుల రసభావాశ్రయత్వ మవగతమగును. కర్మప్రయోగానుసారమున దృష్టివిధానలక్షణ మిక నిరూపించుట యావశ్యకము. రసజన్యములయిన దృష్టులు వీనిలో లక్షణ సహితములై యున్నవి. శారీరప్రతిబింబనము పొందు రసార్థములకు పరిమితి యనునది యుండదు. అవి యనంత స్పందములతో నుండును. అయినను గొన్నిమాత్రము స్పష్టసంబంధమున భాసించుటచే పరిగణనము సముచితమగును. పరిగణితములలో గూడ నివి మాత్రమె తగునన్న వ్యవస్థ లేదు. ఒక్కొకచో నొక్కొక చమత్కృయాసంబంధమున నొక్కొకటి పరిగణ నార్హ మగును.

౧ కాంతదృష్టి : ఇష్టప్రాప్తివలన గలిగిన హర్షమును కాంత దృష్టి సూచింపగలదు. మనః ప్రసన్నతను సూచింప గలదు. హర్ష జన్యము ప్రసాదజన్యము నయిన దృష్టి కాంతదృష్టి. ఈ దృష్టి యత్యంతము మన్మథభావముతో గూడియుండును. భ్రూవిక్షేపములు కటాక్షములు నిందు బహుళముగా నుండును. ప్రణయహేతుకములయిన కోపామర్షములుగూడ నిది వ్యక్తము చేయును. ఇట్టి యీ కాంతదృష్టి శృంగారరససంగతమగు దృష్టియనుట

నాట్యహృదయుల కిష్టము. చిత్తగతమయిన రతి తగినవిధమున సము ల్లాసము పొందగా నా సముల్లసన సంవేదనమున కీ దృష్టి కలుగును. కాంతదృష్టి శృంగారసంగతమగుననుట కేవల దృష్టిమాత్రమున నె కాదు. తారాకర్మలు పుటకర్మలు దృష్టికనుకూలముగా నుండవలెను. శిరఃకర్మయు సంగతము కావలెను. అన్యసంబంధము నావశ్యకమగును. దృష్టికైవల్య మట్టిది కాజాలదు. ఇట్లె యన్నిట గ్రహింపవలెను.

౨. భయానక : ఇదియె భీతదృష్టి. భయానకరసమునందు భీత దృష్టి సంగత మగును. నేత్రపుటము లిందు ప్రోద్వృత్తము లగును. గిరగిర తిరుగును. నిష్టబ్ధము లగును. ఒకప్పు డట్టె నిశ్చలము లగును. నేత్రములలోని తారకలును స్ఫురించునవి యగును. ఉద్వృత్తములు= గిర్రున తిరుగునవి యగును. ఇట్లు తారాపుటకర్మలతో గూడిన దృష్టి మిక్కిలి భయము సూచించును. చకితముగా నుండును ఇట్టి దిది భీతదృష్టి.

3. హాస్యదృష్టి, కనుపుటము లిందు క్రమక్రమముగా నాకుంచి తము లగును. తారక లల్పములై విభ్రాంతము లగును. వ్యాకులము లగును. కుహకాభినయమున నిది యుపకారి. వంచన మొనరించుటలో మోసగించుటలో మాయచేయుటలో పరిహాసించుటలో నిది సహాక రించును. కపటవికృతవిధానములు హాస్యప్రాణములు కావున దృష్టిలో గూడ కపటకృత్రిమరీతు లుండును.

౪. కరుణ : కరుణరసమునందు కరుణదృష్టి యుండును. ఈ దృష్టిలో కనుల పై పుటలు పతితములు వ్రాలినవి యగును. కన్ను లస్రములగూడి యుండును. కను తారకలు దుఃఖమంథరములై యుండును. దృష్టి నాసాగ్రానుగతముగా నుండును. ఇట్లున్నదృష్టి కరుణదృష్టి. ఈ లక్షణవచనములో నీదృష్టికి నాలుగువిశేషణములు కలవు. ఇవియె కాక ఇతరములగు విశేషములను సూచించు విశేషణ ములు నుండవచ్చును. అయినను సముపాత్తములయిన విశేషణములు ముఖ్యములని గుర్తింపవలెను. ఇట్లె యన్యములందు నభ్యూహ్యము.

౫. అద్భుత : అద్భుతరసమునం దద్భుతదృష్టి యుండును. ఈ దృష్టిలో పక్ష్మాగ్రము లాకుంచితము లగును. తారక లాశ్చర్యము

కలవై యుద్వృత్తము లగును. దృష్టి సౌమ్యముగా నుండును. ప్రాంత భాగములందు వికసితమై యుండును.

౬. రౌద్ర : రౌద్రరసమునందు రౌద్రిదృష్టి సంగతము. ఇది క్రూరము రూక్షముగా నుండును. అరుణముగా నుండును. ఉద్వృత్తమగును. పుటములు తారకలును నిష్టబ్ధములై యుండును. క్రోధావేశమున నట్లె కదలక యుండును. ఈ దృష్టి భ్రుకుటీకుటిలముగా నుండును. ఆ యా రసదృష్టు లందరియం దేకవిధముగా నుండవు. వారి వారి సత్త్వభేదమున వేరు వేరుగా నుండును. రాక్షససత్త్వాల రౌద్రదృష్టి మానవసత్త్వాల కుండదు. దేవసత్త్వాల రౌద్రి వేరువిధము. సత్త్వ ప్రకృతి గుణభేదమున దృష్టి యన్యోన్యముగా నుండును.

౭. వీరదృష్టి : వీరరసాశ్రయమయిన వీరదృష్టి దీప్తమై వికసితమై యుండును. క్షుబ్ధమై యుండును. గంభీరమై యుండును. తారకలు రెండును సమముగా నుండును. ఉత్ఫుల్లమధ్యమై భాసించును. వీరరసము నందలి భేదముల ననుసరించి వీరదృష్టులందును భేదము కలుగును. ఈ దీప్తత్వాదు లాభేదసూచకములు. ఇట్లె యితర రసాశ్రయదృష్టు లందును గుర్తించునది. దృష్టిప్రసారము లన్నిటియందును సమధికోత్సాహము గోచరించును. రౌద్రరసమునకు సంబంధించిన దృష్టిలో క్రోధ మవభాసించును. ఆ యా దృష్టులకు మూలమయిన భావము నా దృష్టు లావిష్కరింపజేయుట యావశ్యకము. ప్రయోగ మొనరించు నటుడు తత్తద్భావావేశమును మనసునకు దెచ్చికొని మనోవేగమును నిగ్రహించుకొని దృష్టిసంక్రాంత మొనరించినపుడే రసదృష్టులు వెలువడును. కేవల దృష్టుల యనుకారమున రసదృష్టి వ్యవహారము రాదు. ఇట్లె యితరము లందును.

౮. బీభత్సదృష్టి : ఇందు కనుపుటము లపాంగములు కుంచితము లగును. తారకలు తిరుగును. ఉపప్లుతము లగును. చెదురుగా నుండును. కనుఱెప్పలు సంశ్లిష్టములు స్థిరములు నగును. జుగుప్సావహమయిన వస్తువును చూచినప్పుడు పక్ష్మపుటాపాంగతారకలు సంకోచము కలవయి బీభత్సరసాశ్రయమయిన బీభత్సదృష్టిని వ్యక్త మొనరింపగలవు.

హాస్యబీభత్సములందు బాహ్యములయిన దృశ్యములు చిత్తమున వికాసవికారముల నాపాదించునవి యగును. వికాసాత్మక చిత్తవృత్తి సోల్లాసముగా చేష్టానుగత మగును. వికారాత్మకవృత్తి చిత్తసంకోచము కూర్చునది యగును గావున పక్ష్మపుటాదులు వ్యాకోచము వహింపక దర్శన ప్రతిరోధమునె కూర్చునవి యగును. సర్వచేష్టలసంపత్తి మనో వ్యాపారపురస్సరమనుట యెందును విస్మరింపదగినది కాకున్నను వీనిలో నొకింత విశేషమును భావుకు లాస్వాదింపగలరు.

ఇవి యన్నియు రసజన్యదృష్టులు, వీనిని రసములందే వినియో గింపవలెను. "రసజాస్తు రసేష్వేవ" రసజన్య దృష్టులను రసమయ ప్రఘట్టాభినయ ప్రయోగములందె వినియోగించునది. ఇతరదృష్టుల కీ రసప్రఘట్టములందు ప్రయోగముండును. వీని కితరము లందుండదు.

"నాసాగ్రాసక్తానిమిషా తథాధోభాగచారిణీ
ఆకేకరపుటా చైవ శాంతా దృష్టిర్భవేదసౌ"

పాఠాంతరముగానున్న దీనిలో శాంతదృష్టి లక్షణ నిరూపణమున్నది. శాంతరసాశ్రయమయిన యీ దృష్టిలోని రీతి యనిమిషముగానుండు నాసాగ్రమునందు సంసక్త మగును. క్రిందిభాగమునకు సంచరించును. ఆకేకరపుటములతో నుండును. పుటాపాంగము లాకుంచితములై యర్థనిమేషదృష్టి కలిగి తారకలు వ్యావృత్తములయినచో నాకేకర యగునని మున్ముందులక్షణము నిరూపితమగును. ఇట్టి శాంతదృష్టి శాంతరసాశ్రయముగా నుండును. ఈ దృష్టితో దృష్టులన్నియు ముప్పదియే డగును. ఇక నిటుపై స్థాయిభావసమాశ్రయములయిన స్థాయిదృష్టులను నిరూపింపవలసియున్నది.

స్థాయిదృష్టులు

స్నిగ్ధహృష్టదీనాదు లయిన స్థాయిదృష్టులందు నుద్దిష్టమయిన క్రమమున నియతభావ మున్నదన నక్కఱలేదు. శృంగారము సర్వ ప్రాణి సులభమగుట రతి సర్వవ్యక్తుల కపరిహార్యమగుట శృంగార దృష్టిని రతిదృష్టియయిన స్నిగ్ధదృష్టిని మొదట సంకేతించుట సముచి తము కావచ్చును. ఇందుద్దిష్టమయిన క్రమము నాట్యపాఠకుల కొరకు ప్పుడు సహకారి యగును.

౪౭౦. వ్యాకోశమధ్యా మధురా స్మేరతారాభిలాషిణీ
సానందాశ్రుకృతా దృష్టిః స్నిగ్ధేయం రతిభావజా
౪౭౧. చలా హసితగర్భా చ విశత్తారా నిమేషిణీ
కించిదాకుంచితా హృష్టా దృష్టిర్హాసే ప్రకీర్తితా
౪౭౨. ఈషత్స్రస్తోత్తరపుటా కించిత్సంరబ్ధతారకా
మందసంచారిణీ దీనా సా శోకే దృష్టిరిష్యతే
౪౭౩. రూక్షా స్థిరోద్ధతపుటా నిష్టబ్ధోద్వృత్తతారకా
కుటిలభ్రుకుటిర్దృష్టిః క్రుద్ధా క్రోధే విధీయతే
౪౭౪. సంస్థితే తారకే యస్యాః స్థితా వికసితా తథా
సత్త్వముద్గిరతీ దృప్తా దృష్టిరుత్సాహసంభవా
౪౭౫. విస్ఫారితోభయపుటా భయకంపితతారకా
నిష్క్రాంతమధ్యా దృష్టిస్తు భయభావే భయాన్వితా
౪౭౬. సంకోచితపుటన్యాసా దృష్టిర్మీలితతారకా
పక్ష్మదేశాత్సముద్విగ్నా జుగుప్సాయాంజుగుప్సితా
౪౭౭. విమలోద్వృత్తతారా చ హృష్టోభయపుటాన్వితా
సమా వికసితా దృష్టిః విస్మితా విస్మయే స్మృతా

౧. రతిదృష్టి : స్నిగ్ధ ఇందు నడిమిభాగము వికసనముతో నుండును. మధురముగా నుండును. తారకలు కనుపాపలు చిరునగవుతో నుండును. అభిలాష యుక్తముగా నుండును. ఆనందాశ్రువులతో నుండు నీ దృష్టి స్నిగ్ధమై చిక్కనై మనోహరముగా నుండును.

౨. హాసదృష్టి : హృష్టచంచలము. హసితగర్భము. తారకలు కన్నులు చికిలింతలతో నుండును. కన్ను తెఱచుటలు మూయుటలిం దధికము. మాటి మాటికి రెప్పమూతల సందుల నుండి చూపులు తొంగితొంగి సాగును. ఈ దృష్టి హృష్టమై కొంచ మాకుంచితమై యుండును. చూచువారి కిది కొక్కిరించినట్లు గోచరించును.

3. శోకదృష్టి : దీన నేత్రముల పై రెప్పలు కొంతగా నీదృష్టిలో జారియుండును. తారకలు కొంత కొంతగా బెదిరి వ్యగ్రములై యుండును. మందముగా నీ దృష్టి ప్రసరించును. శోకమునందలి దృష్టి యిట్లు దీనముగా నుండును.

౪. క్రోధదృష్టి క్రుద్ధ. క్రోధమున నుండదగిన క్రుద్ధదృష్టి యిట్లుండును. కనుబొమ లింపు కుటిలములై కూడుకొనును. బొమ

ముడి సమరీతిలో నుండక చిడిముడిపాటు కూడి వక్రముగా నుండును. దృష్టిరూక్షము తీవ్రము నగును. కనుపుటములు స్థిరములుగా నున్నను తిరుగుళ్ళు పడును. తారకలు నిష్టబ్ధములగును. నిట్టపొడుచు విధమున నుండును. అయిననవి యుద్వృత్తములు గిర్రున తిరుగునవి యగును.

ఉత్సాహదృష్టి దృప్త: వీరోత్సాహమున గలుగు నీదృప్త దృష్టి. సత్త్వము స్పష్టముచేయును. అంతర్బలము వ్యక్తము చేయును. మనోబలము సూచించును. దేహదార్ఢ్యమును స్ఫురింపజేయును. ఇందు తారకలు నిలుకడకలవై యుండును. ఈ దృష్టి స్థిరముగా నుండును. వికసితమై యుండును. కన్ను విప్పారి యుండును.

౬. భయదృష్టి భయాన్విత. భయభావమున దృష్టి భయాన్వితము. ఇందు నేత్రముల యుభయపుటములు విప్పారి విస్ఫారితములై యుండును. తారకలు భయకంపితములై యుండును. భయదృష్టి నడిమిచూపులో నిలబడదు. తారకలు మధ్యభాగమున నుండక అటు నిటు చెదిరిపోవును. భయాన్వితులు నేరుగా చూడజాలరు.

౭. జుగుప్సాదృష్టి : జుగుప్సిత. జుగుప్సాభావముదయించినప్పుడు కలుగు దృష్టి జుగుప్సిత. ఇందు కనుఱెప్పలరీతి సంకోచితము మూతలు పడిన దగును. పక్ష్మపుటములు విప్పారవు. తారకలు విస్ఫారితములై యుండవు. మీలనము పొందును. ఱెప్పలల్లార్పధికముగా నుండును. ఆ పక్ష్మోద్దేశమున దృష్టి సముద్విగ్నముగా నుండును. జుగుప్సలో చిత్తసంకోచము కలుగగా పుటసంకోచమున దృష్టియు సంకోచముతో నుండుట స్వాభావికము. ఇట్టిది జుగుప్సిత.

౮. విస్మయదృష్టి : విస్మిత. విస్మయమున విస్మితదృష్టి యీ విధముగ నుండును. తారలిందు గిరగిర తిరుగునవై యుద్వృత్తములగును. విమలములుగా నుండును. కనుపుటములు రెండును హర్షము కలిగియుండును. ఒకప్పు డతికికొనినట్లున్నవే నష్టములుగా నుండును. దృష్టిసమముగా నుండును. వికసితమై యుండును.

ఈ నిరూపితములయిన యెనిమిదిదృష్టులును స్థాయిభావాశ్రయములు. వీని నిట్లై దృష్టివిదులు గుర్తించిరి. స్థాయిదృష్టులు రసదృష్టులు సామాన్యముగా నేకవిధమున నుండుటను లక్షణవాక్యము సూచించు

చునె యున్నది. అయినను రసదృష్టియని స్థాయిదృష్టియని భేదము నిర్దేశించుటయె సముచితము. స్థాయిదృష్టిలో తారాకర్మలు పుట కర్మలు బహుళముగ నుండవు. రసదృష్టిలో నవి బహుళముగా నుండును. విభావకర్మ బాహుళ్యముండుట లేకపోవుటలు రసభావ దృష్టుల వివేకహేతువులు. స్థాయిదృష్టులలో రసీభావమునకు తగిన చిక్కణధర్మ ముండదు. వలసినంత స్నిగ్ధతయు నుండదు.

సంచారి దృష్టులు.

ఇరువది సంచారిదృష్టులు కలవు. అవి యిపుడు క్రమ ప్రసంగ ప్రాప్తములు.

౪౭౮. శమతారా సమపుటా నిష్కంపా శూన్యదర్శనా
బాహ్యార్థగ్రాహిణీ క్షామా శూన్యాదృష్టిః ప్రకీర్తితా
౪౭౯. ప్రస్పందమానపక్ష్మా యా నాత్యర్థముకులైః పుటైః
మలినాంతా చ మలినా దృష్టిర్విభ్రాంతతారకా
౪౮౦. శ్రమాత్ ప్రప్లావితపుటా క్షామాంతాంచితలోచనా
సన్నా పతితతారా చ శ్రాంతా దృష్టిః ప్రకీర్తితా
౪౮౧. కించిదంచితపక్ష్మాగ్రా పతితోర్ధ్వపుటా హ్రియా
త్రపాధోగతతారా చ దృష్టిర్లజ్జాన్వితా తు సా

ఈ నాలుగు శ్లోకములందు నాలుగు దృష్టుల లక్షణము లున్నవి. ఇటుపై వరుసగా సంచారిదృష్టుల లక్షణపరిచయము నిరూపితమగును. ఈ దృష్టులకు నియతవిషయము కలదు. ఒక్కొకదృష్టి కొక్కొక విషయమున వినియోగ మిష్టము. అయిన నదియె నియతవ్యవస్థితము కాదు. అట్టిదది ప్రచురవిషయము. ఆ దృష్టి నా విధముగ నా విషయమున వినియోగించిన సహృదయు లది రమ్య మందురు. మొత్తము దృష్టులన్నియు ముప్పదియారు. ఇవి షట్త్రింశత్తత్త్వములకు సంబంధించి యుండునని సంభావించుట స్పందదర్శనప్రస్పందము. సంచారి భావములు ముప్పదిమూడని ప్రసిద్ధి. సంచారిదృష్టు లిరువది మాత్రమె యిచట నుద్దిష్టములు. ఇతరములిం దంతర్భవించునని భావము. సంఖ్యాసంగతికై సంచారిదృష్టులు ముప్పదిమూ డనవచ్చుగాని వానిలో భావనీయచమత్కారము విలక్షణశోభ యుండదని భావము. రసములు తొమ్మిదయినను రసదృష్టు లెనిమిదియని, స్థాయిభావములు

తొమ్మిదియయినను స్థాయిదృష్టు లెనిమిదియని సంఖ్యానియతి యున్నది. అందను క్తము లచమత్కారులు గతార్థములని వేరుగా నిరూపితములు కాలేదు. ఇట్లె యీ సంచారిదృష్టులందును సంభావింప దగును. రసదృష్టులు రసములందే యుండును. స్థాయిదృష్టులు స్థాయు లందే యుండును. సంచారిదృష్టులు సంచారులందే యుండును కాని సముచితసమయమున స్థాయిరసములందు నివి యుండవచ్చును. భావ సహజములయిన సంచారదృష్టులు భావనియతములుగనె యుండుట చోద్యముకాదు. "రసజాస్తు రసేష్వేవ స్థాయిషు స్థాయిదృష్టయః" అని భరతు డనగలడు.

శూన్యదృష్టి, మలినదృష్టి, శాంతదృష్టి, లజ్జాన్వితదృష్టి యని నాల్గిందు లక్షితము లయినవి.

౧. శూన్యదృష్టి : ఇందు కనుపాపలు కనుపుటములు ఎగుడు దిగుడుగా నుండవు. సమముగా నుండును. దృష్టికంపరహితమై యుండును. దృష్టిలో లక్ష్యమేమియు నుండదు. శూన్యదర్శనము, బాహ్యార్థముల నీ దృష్టి యేమియు గ్రహింపదు. ఈ దృష్టి క్షామమై నిరుత్సాహముగా నుండును. ఇట్టిదిది శూన్యదృష్టి.

చిత్తమున చింతకూడియున్నప్పుడు శూన్యదృష్టి యా చింతను సూచించును. చింతాసూచకములగు దృష్టులింకను కలవు. కాని వానిలో శూన్యదృష్టి గణనీయము. చింతాది సంచారిభావములందు శూన్యాదిదృష్టుల వినియోగ మూహించి కేవల మా దృష్టు లా భావ ములందే నియతములని భావింపజనదు. అందవి వ్యాప్తినియతములు కావు. ఇతరభావములకు నివి సాధారణములు కాగలవు. అయినను నియతవినియోగకథనము ప్రాధాన్యమును సూచించును. ఇట్లె యితర విషయములందును గ్రహించునది.

౨. మలినదృష్టి : ఇందు పక్ష్మములు కనురెప్పలు కదలు చుండును. కనుపుటములు మిగుల ముకులములై యుండవు. నేత్రాంత ములు మలినములుగా నుండును. కనుతారకలు విభ్రాంతములై తిరుగు చుండును. విస్తృతములు నగును. నిర్వేదము కలిగినపుడు వివర్ణత

కలిగినప్పుడు నీ దృష్టి యుండును. మనసులోని సాలోచనత నిది విలోలవిభ్రాంతలోచనత్వమున సూచనము చేయును.

౩ శ్రాంతదృష్టిః : ఈ దృష్టిలో శ్రాంతి గోచరించును. శ్రమ విశేషమున పక్ష్మపుటములు మ్లానమ్లానములై యుండును. కావుననె యిందు పుటములు ప్రమ్లాపితము లగుననుట. ఈ దృష్టి క్షామ క్షామమై యుండును. లోచనాంచలములు మాత్రము కొంతగా నంచితములై యుండును. కృశించిన యీదృష్టిలో తారలు దిగజారి యుండును. తారలు చలప్రచలములుగా నుండవు. మందకోడిగా నుండుట గుర్తింపనగును. ఇట్టి యీ శ్రాంతదృష్టి శ్రమవలన నార్తి కలిగినప్పుడు స్వేద ముదయించినప్పుడు ప్రయోగింపదగును.

౪ లజ్జాన్వితదృష్టి : ఇందు పక్ష్మాగ్రములు కొంచె మంచిత ములై యుండును. దిగువభాగమునను వంగినటులు వ్రాలినటు లుండును. లజ్జావశమున కనుల పై రెప్ప లప్పళించుకొని యుండక దిగజారినటు లుండును. తారకలును త్రపావశమున నధోగతము లగును. ఇది లజ్జాన్వితదృష్టి ఇది లజ్జాభావమున వినియోగము పొందును. లజ్జావినియోగమున నిది లలితముగ నుండును.

౪౮౨. మ్లానభ్రూపుటపక్ష్మా యా శిథిలా మందచారిణీ
క్రమప్రవిష్ట తారా చ గ్లానా దృష్టిస్తు సా స్మృతా
౪౮౩. కించిచ్చలా స్థిరా కించిదుద్గతా తిర్యగాయతా
మూఢా చకితతారా చ శంకితా దృష్టిరిష్యతే
౪౮౪. విషాదవిస్తీర్ణపుటా పర్యస్తాన్తా నిమేషిణీ
కించిన్నిష్టబ్ధతారా చ కార్యా దృష్టిర్విషాదినీ
౪౮౫. స్ఫురదాశ్లిష్టపక్ష్మాగ్రా ముకులోర్ధ్వపుటాంచితా
సుఖోన్మీలితతారా చ ముకులా దృష్టిరిష్యతే

ఈ నాలుగు కారికలలో నాలుగు దృష్టుల లక్షణవివేకమున్నది. వీనిచేనగు వినియోగము, వీని వినియోగము పొందువాని విశేషమును యథాసంగతముగా నిచట నిరూపింపవలసియున్నది.

౧ గ్లానదృష్టి : ఇందు కనుబొమలు కనుపుటములు కనురెప్పలు మ్లానములై వాడియున్నట్లగపడును. ఈ దృష్టి శిథిలశిథిలమై మంద మందముగ సంచరించునదై యుండును. కను తారలు కూడ క్రమ

ప్రవేశమునను సంచలించును. నేరుగా సూటిగా చొచ్చుకొనవు. మార్గాయాసాదుల వలని శ్రమములవలన మానవులకు గల్గు గ్లాని నిమిత్తముగా నీ దృష్టి యుండును. అపస్మారమున నీ దృష్టి వినియోగము పొందును. వ్యాధిలో నిది సంగతమగును. గ్లాని కలిగినప్పు డిది కలుగుననుట సహజము. అపస్మార వ్యాధి గ్లానులలో దృష్టిప్రసారము నకు మన ముత్సుకంపడదు. అప్పటి దృష్టి గ్లానదృష్టి హృదయము నందలి యా యా భావమున నిది కలుగును. అట్లు కలుగునిది యా యా భావము సూచించును. పై నిరూపిత విశేషములతో నీ గ్లానదృష్టి నభినయింపవలయుట యుచటి భావము. ఇట్లే యితరములందును నిగ్రాహ్యము.

౬. శంకితదృష్టి : శంక యుదయించినపుడు భావమునందు స్థిరత యుండనటులె శంకితదృష్టి యందును స్థైర్య ముండదు. కించిచ్చలముగా నుండును. ఒకింత స్థిరముగా నుండును. ఒకప్పు డుద్గతము నేరుగా సూటిగా నెదురుగా సాగును. ఒకప్పుడడ్డముగా నాయతముగా ప్రస రించును. ఒకప్పుడు తారలు నిష్టబ్ధములై మూఢముగా నుండుటయు నొకప్పుడు చకితములై చెదురుతనమున నుండుటయు నిందు సహజము. దృష్టివిశేషములన్నియు తారాపుటకర్మల విశేషవిశేషితములై యుండుట యన్నిట నవిశేషము. శంకలో శంకితదృష్టి వినియుక్తమగు ననుట పునరుపపాద్యము కానక్కరలేదు.

౭. విషాదినిదృష్టి : విషాదమున పుటములు విస్తీర్ణములగును. ప్రాంతభాగములు పర్యస్తములగును. నిమేషము లుండును. తారలు కొంతగా నిష్టబ్ధములగును. ఇట్టి దిది విషాదిని దృష్టి విషాదోదయమున నీ దృష్టి నిరూపింపవలెను. "విషాదార్థే విషాదినీ" విషాదము సూచించు నభినయనమున నిది యావశ్యకమగును.

౮. ముకులదృష్టి : ఈ దృష్టిలో సగము సగము పక్ష్మభాగ ములు స్ఫురణము కలిగియుండుట, సమాశ్లిష్టములై యుండుట గోచర మగును. ఊర్ధ్వపుటములు ముకులనము పొంది యున్నట్లుండును. తారలు సుఖోన్మీలనముతో నుండును. కన్ను తెఱచుట సుందరముగ నుండును. నిద్రాస్వప్నసుఖార్థములలో ముకులదృష్టి వినియోగము

సముచితముగా నుండును. నిద్రవచ్చునప్పుడు కనుమూతలుండును. మానవుడు మధురస్వప్నమున నున్నప్పుడు కనుమూత రమ్యముగ నుండును. సుఖార్థసన్నివేశములో ముకులదృష్టి మోహానము.

౪౮౬. ఆనికుంచితపక్ష్మాగ్రా పుటైరాకుంచితైస్తథా
సన్నా కుంచితతారా చ కుంచితా దృష్టిరిష్యతే
౪౮౭. మందాయమానతారా యా పుటైః ప్రచలితైస్తథా
సంతాపోపప్లుతా దృష్టిరభితప్తా తు సర్వథా
౪౮౮. లంబితా కుంచితపుటా శనైస్తిర్యఙ్నిరీక్షితైః
నిగూఢా గూఢతారా చ జిహ్మా దృష్టిరుదాహృతా
౪౮౯. మధురా కుంచితాంతా చ సభ్రూక్షేపా చ సస్మితా
సమన్మథవికారా చ దృష్టిస్సా లలితా స్మృతా

ఈ కారికాచతుష్టయములో కుంచితదృష్టి అభితప్తదృష్టి జిహ్మదృష్టి లలితదృష్టి యని నాలుగు దృష్టివిశేషము లున్నవి. ఇరువది దృష్టులలో నియతమయిన క్రమసంభావన మక్కఱగాదు. రసదృష్టులలో స్థాయిదృష్టులలో రసస్థాయి నియతమయిన క్రమసంభావన మున్నది. ఈ యిరువది సంచారిదృష్టులయినను సంచారినియతమయిన క్రమసంభావనము లేదు. సంచారిసంఖ్యానియతమయిన రీతి యీ వింశతికమున లేనట్లు విశదమె. అయినను నిర్దిష్ట క్రమానుసారమున నొక భావక్రమ మాకర్షించి భావభావులు భావింతురు. అట్టివారి యీ భావమునకు సర్వదృష్టి సంగతములయిన దృష్టిక్రియ లుపయోగించురీతియు నన్వేష్యమగుట యుక్తము.

౯. కుంచితదృష్టి : కనుపుటము లాకుంచితములగుట, పక్ష్మాగ్రములును నికుంచితములగుట, తారకలును కుంచితములై యుండుట, దృష్టి సముల్లాసముతో నుండక సన్న మనసన్నమై యుండుట కుంచితదృష్టిస్వరూపము. అసూయితుల విషయమున నీ కుంచితదృష్టి ప్రసారముండును. అనిష్టుల జూచినపుడు నీ దృష్టి కలుగును. దుష్ప్రేక్షము చూడవలసివచ్చిన నిదియ. అక్షివ్యథావ్యాకులితులదృష్టి కుంచితమె యగును.

౧౦. అభితప్తదృష్టి : వ్యథలో నిది కలుగును. ఇందు తారాసంచారము మందమందముగా నుండును. కనుపుటములు ప్రచలితము

లగును. ఈ దృష్టి పరితాప సంప్లుతముగా నుండును. వ్యథా పరితాపములం దీదృష్టి యుక్తము. చింతాభావమున నీదృష్టి వినియోగ మిష్టము. నిర్వేదము నభితప్త సూచించును. అభిఘాతములో నభితాపములో నభితప్తదృష్టి వినియోగ మిష్టము.

౧౧. జిహ్మదృష్టి : ఇది లంబితమలసముగా ప్రసరించును. ఇందు పుటములు కుంచితము లగును. మెలమెల్లగా నెడగా పెడగా నిందు నిరీక్షణము లుండును. ఈ దృష్టి నిగూఢము తారలు గూఢములు. నిశితముగా వక్రముగా నుండు జిహ్మదృష్టిభావము వెంటనే సుబుద్ధము కాదు. అసూయలో జడతలో నలసతలో నీ దృష్టికి వినియోగ మున్నది. అసూయజడత యలసత మూడును మూడు విధములు. జిహ్మదృష్టి యొకటి మూట వినియోగము పొందునది యైనను ఆ యా ప్రకరణరీతినీతుల ననుసరించి దృష్టివివేకము సంపాదింపవచ్చును. ఇట్లె యున్నిట గుర్తింపవచ్చును.

౧౨. లలితదృష్టి : ఈ దృష్టి మధురము. ముచ్చటగా నుండును. ప్రాంతభాగములు కుంచితములై యుండును. కనుబొమ లెగురవేయుట లిందున్నవి. చిరునగవుల కలయిక లిందున్నవి. కన్నుల చికిలింతలె యిందలి స్మితసాహిత్యమును సూచింపగలవు. ఇందు మన్మథవికారము లున్నవి. మనోగతమయిన ప్రేమకాంక్షావిశేషము నిది సూచించును. అయిన నిది ధృతిలో హర్షములో వినియోగము పొందును. స్మిత మున్నదని భావమున్నదని లలితదృష్టి యంతట శృంగారగంధి కాదు. ఈ యంశమును వినియోగ విషయమె సూచించును.

౪౯౦. వితర్కోద్వర్తితపుటా తథైవోత్ఫుల్లతారకా
అధోముఖవికారా చ దృష్టిరేషా వితర్కితా

౪౯౧. అర్ధవ్యాకోశపక్ష్మా చ హ్లాదార్ధముకులైః పుటైః
స్మృతార్ధముకులా దృష్టిః కించిల్లులితతారకా

౪౯౨. అనవస్థితతారా చ విభ్రాంతాకులదర్శనా
విస్తీర్ణోత్ఫుల్లనేత్రా చ విభ్రాంతా దృష్టిరిష్యతే

౪౯౩. పుటౌ ప్రస్ఫురితౌ యస్యా నిష్టబ్ధౌ పతితౌ పునః
విప్లుతోద్వృత్తతారా చ దృష్టిరేషా తు విప్లుతా

వీనిలో "వితర్కిత, అర్థముకుల, విభ్రాంత విప్లుత" అను నామ కేతము కల నాలుగు దృష్టులున్నవి. దృష్టుల నామసంకేతము లన్నియు సామాన్యముగా సార్థకములు. నామనిర్దేశములె వినియోగాంశమును సూచింపగలవు. కొన్ని స్వరూపనిర్దేశ మొనరించుచున్నవి.

౧౩. వితర్కితదృష్టి : సందేహమున నానాకల్పనము లొనరించుట వితర్కము. వితర్కము వలన కనుపుటము లుద్వర్తితము లగును. తారక లుత్ఫుల్లము లగును. దృష్టి యధోగతమై వికారముతో విచారముతో నుండును. ఇట్టిదిది వితర్కితదృష్టి. "స్మృతా తర్కే-చతర్కితా" యనునది దీని వినియోగవచనము. నానావిధముగా నభ్యూహించునప్పుడు సంకల్పవికల్పములు మనములో పాదుకొనినప్పుడు నానావిధములయిన యూహాపోహము లుదయించినప్పు డీ వితర్కిత దృష్టి ప్రసరించును. దృష్టిలోని పుటోద్వర్తనము తారకాసంఫుల్లిత యధోగతి యనవస్థానము సూచించి తర్కవితర్కముల గోచరింప జేయగలవు.

౧౪. అర్థముకులదృష్టి : దీనిలో పక్ష్మములు సగము సగము వికాసము పొందును. కనుపుటములును హ్లాదవశమున ముకులితము లగును. తారకలు కొంచెము కొంచెము లులితములగును. ముకుల నేత్రములం దంతఃస్మిత మవభాసించును. గంధస్పర్శసుఖాదు లాహ్లాద మొదవింపగా నీ యర్ధముకుల కలుగును. గంధాదుల యనుభూతి వలన గలిగిన సుఖపారవశ్యమున కనులరమూతలు పడుట సహజము కదా ?

౧౫. విభ్రాంతదృష్టి : భ్రాంతచిత్తుడయిన మానవున కీ దృష్టి కలుగును. నేత్రము లుత్ఫుల్లములగును. విస్తీర్ణము లగును. తారలు నిలుకడగా నుండవు. అనవస్థితములై యస్తవ్యస్తము లగును. దృష్టి భ్రమ వ్యాకులమగును. చెదురుతనము బెదరుపాటు ఈ దృష్టిధర్మములు ఇప్పు డిట్లయినది. ఇంకనేమగునో ? యని దృష్టి శంకాతంకములు కలదగును. విభ్రాంతదృష్టి కావేగమునందు సంభ్రమమునందు విభ్రమమునందును వినియోగ మున్నది. ఆవేగసంభ్రమముల కొకింత రూపభేదము గుర్తింపవలెను. చిత్తమునకు గలుగు తొందరపా టావే

గము. ఆవేగ ముదయింపగా గలుగు త్వరాయితప్రకృతిచే జనించు శారీరమయిన తొందరపాటు సంభ్రమము. మనోమోహా మొకరీతి విభ్రమము. ఈ మూటను క్రియాభేదముల గూడిన విభ్రాంతదృష్టి యుండును.

౧౬. విప్లుతదృష్టి : ఈ దృష్టిలో కనులపుటములు ప్రస్ఫురితము లగును. సవిశేషముగా స్తబ్ధము లగును. పతితములు నగును. స్ఫురణము స్తబ్ధత పతనములు మఱల మఱల గలుగుచుండును. తారకలు విప్లుతము లుద్వృత్తము లగును. చాపలమున విప్లుత ముపకారి. ఉన్మాదమున సహకారి. దుఃఖమున సహచారి. ఆర్తిలో మరణములో దీని వినియోగ మున్నది. చాపలోన్మాదదుఃఖార్తి మరణాదులలో వినియోగమున విప్లుతదృష్టి వాని వాని యతిశయ వికారముల సూచించును.

౪౯౪. ఆకుంచితపుటాపాంగా సంగతార్ధనిమేషిణీ
ముహుర్వ్యావృత్తతారా చ దృష్టిరాకేకరా స్మృతా
౪౯౫. వికోసితోభయపుటా ప్రోత్ఫుల్లా చానిమేషిణీ
అనవస్థితతారా చ వికోశా దృష్టిరుచ్యతే
౪౯౬. త్రాసోద్వృత్తపుటా యా తు త్రాసోత్కంపితతారకా
సంత్రాసోత్ఫుల్లమధ్యా చ త్రస్తా దృష్టిరుదాహృతా
౪౯౭. వ్యాఘూర్ణమానమధ్యా యా క్షామాంతాంచితలోచనా
దృష్టిర్వికసితాపాంగా మదిరా తరుణే మదే
౪౯౮. కించిదాకుంచితపుటా హ్యనవస్థితతారకా
తథా చలితపక్ష్మా చ దృష్టిర్మధ్యమదే భవేత్
౪౯౯. ననిమేషానిమేషా చ కించిద్దర్శితతారకా
అధోభాగచరీ దృష్టిరధమే తు మదే స్మృతా

ఈ శ్లోకషట్కమందు దృష్టిచతుష్క మున్నది. ఆకేకరాదృష్టి వికోశదృష్టి త్రస్తదృష్టి మదిరాదృష్టి యనునవి వరుసగా వీనిలో నిరూపితములు. తరుణ మధ్య మాధమ మదనిమిత్తకముగా మదిరా దృష్టి మూడు విధములగును గావున తుది మూడుకారికలు మదిరా దృష్టి నిరూపకములు.

౧౭. ఆకేకరాదృష్టి : ఈ దృష్టిలో కనుపుటములు కనుకొలకు లాకుంచితము లగును. అరమూతలతో కనులు సంగతము లగును.

తారలు మరల మరల వ్యావృత్తము లగును. దురాలోకమున నాకేకర యుపకారి. విచ్ఛేదప్రేక్షితమునందు నిది యుపకరించును. ఆగి యాగి చూచుటకీ యతమూతి లుండవలెను. చూచుటకు వలని పడని వానిని చూచుటకీ వంపు చూ పుపకారి.

౧౮. వికోశదృష్టి : కనుపుటములు రెండును కోశములు విడివడి యుండుట, దృష్టి చాల సంఫుల్లమై యుండుట, నిర్నిమేషముగా నుండుట, కనుతార లనవస్థితములై యుండుట వికోశదృష్టి యందలి విశేషములు. ఇది యొకవిధముగ విస్ఫారిన దృష్టి. ఈ దృష్టి విబోధము గర్వము అమర్షము ఉగ్రత మతి యనెడు భావముల సూచించును. ఆ యా భావముల నభినయింపవలసియుండగా నీ వికోశదృష్టి కావలయును.

౧౯. త్రస్తదృష్టి : ఇందు కనుపుటములు భయమువలన తిరుగుళ్ళు పొందును. తారకలు కంపోత్కంపములు కలవగును. దృష్టి మధ్యభాగములు సంత్రాసమున నుత్ఫుల్లములై యుబ్బెత్తుగా నుండును. ఇట్టిదృష్టి త్రస్తదృష్టి. "త్రస్తా త్రాసే" యనినట్లు భయమున నీ దృష్టి యుపకారి. భయము నభినయించుటకీ దృష్టి యావశ్యకము.

౨౦. మదిరాదృష్టి : ఇందు కనుమధ్యము లాఘూర్ణితము లగును. నేత్రాంతములు క్షామక్షామములుగా నుండును. అయిన నాదృష్టి సమంచితమగును. అపాంగములు వికసితము లగును. ఇట్టిదిది మదిరాదృష్టి. మధ్యమదకృతమయినవిశేషము మూఁడువిధముల నుండును. తరుణమదము, మధ్యమదము, అధమమదము నని. తరుణమదకృతమయిన మదిరాదృష్టి నిరూపితము. "మదిరాచ మదేష్వితి" యనినట్లు మదకృత సన్నివేశములలో మదిరాదృష్టి యుపకారి. ఈ దృష్టి విశేషములతో నా యా మదముల నభినయింపవచ్చును.

మధ్యమమదమున మదిరాదృష్టి యిట్లుండును. కనుపుటములు కొంతగా నాకుంచితము లగును. తారకలు కొంతగా లులితములగును. దృష్టి సంచారము నియతముగ నుండదు. ఆకుంచితపుటము లులిత తారకము అనవస్థితసంచారమయిన యీ దృష్టి రెండవ మదిరాదృష్టి. ఇవియు మదాభినయమున నుపయోగించుననుట స్పష్టము.

అధమమదమున మదిరాదృష్టి యిట్లుండును. ఈ దృష్టి యొక ప్పుడు సనిమేషముగ నుండును. ఒకప్పు డనిమేషముగ నుండును. ఒక ప్పుడు కొంతగా తారకలు గోచరించును. క్రిందుచూపులతో నుండును. ఇది యధమదృష్టి. ప్రకృతిభేదము ననుసరించి దృష్టిభేదము నూహింప వలెను.

ఇప్పటి కీ విధముగా నిచట ముప్పదియారుదృష్టులు లక్షితము లయినవి. వీని వినియోగమును నిదర్శితమయినది. రసములందు రస దృష్టులు స్థాయిభావములందు స్థాయిదృష్టులు సంచారులందు సంచారి దృష్టులు నియతములై యున్నవి. ఇక నిటుపై రసదృష్టులయు భావ దృష్టులయు తారా- పుట- భ్రూకర్మలను నిరూపింతుము.

## తారాకర్మ

### తారాకర్మలు తొమ్మిదివిధములు

౧ భ్రమణము ౨ వలనము ౩ పాతము

౪ చలనము ౫ సంప్రవేశనము ౬ వివర్తనము

౭ సముద్వృత్తము ౮ నిష్క్రామము ౯ ప్రాకృతము

ఈ తొమ్మిదికర్మలకు తారాకర్మలని పేరు. వీని స్ఫుటలక్షణ సంపత్తి యిట్లున్నది.

౫౦౦. పుటాన్తర్మండలావృత్తిస్తారయోర్భ్రమణం స్మృతం
వలనం గమనం త్ర్యశ్రం పాతనం స్రస్తతా తథా
౫౦౧. చలనం కంపనం జ్ఞేయం ప్రవేశోన్తః ప్రవేశనం
వివర్తనం కటాక్షస్తు సముద్వృత్తం సమున్నతిః
౫౦౨. నిష్క్రామో నిర్గమః ప్రోక్తః ప్రాకృతం తు స్వభావజం

౧. భ్రమణము : కనుతారలు కనుపుటముల లో భాగమున మండలాకారమున ప్రవర్తించుట భ్రమణమగును. వీర రౌద్ర రసము లందు భ్రమణమునకు వినియోగమున్నది.

౨. వలనము : ముక్కోణముగా దృష్టిసంచారముండుటకు వలనమని సంజ్ఞ. ఇదియు వీరరౌద్రములం దుపకరించును.

౩. పాతము : దృష్టిజారుట, దిగువకుసాగుట, పాతమగును. పాతమె పాతనము. "పాతనం కరుణే కార్యం" కరుణరసవిషయమున పాతన మావశ్యకమని గుర్తించునది.

౪. చలనము : తార లటు నిటు కంపించుట చలన మగును. చలనమునె సంచలనమని యందురు. ఇది భయానకమున నుండదగును. అం దనవస్థితముగా తారలుండుట ప్రసిద్ధము. ఇదియె చలనకర్మ.

౫. సంప్రవేశనము : కనుగ్రుడ్లు లోనికి ప్రవేశించుట సంప్రవేశన మయినది. హాస్యబీభత్సములలో నీ కర్మ యావశ్యకము.

౬. వివర్తనము : కటాక్షదృష్టి యుండుట వివర్తనమయినది. దృష్టిసారించి యప్పళించుట. శృంగారలజ్జాప్రసక్తిలో నీ వివర్తన ముపకారి.

౭. సముద్వృత్తము : తారలు సమున్నతములగుట సముద్వృత్త మయినది. వీరరౌద్రములం దిది యుపకారి యగును.

౮. నిష్క్రామము : సారించిన కనుతార మఱల నిర్గమించుట నిష్క్రామ మనెడు కర్మ యయినది. వీరరౌద్రములలో నిష్క్రామ మన్న తారాకర్మ యుపకరించును.

౯. ప్రాకృతము : స్వభావజన్యమయిన తారాకర్మ ప్రాకృత మయినది. పైని నిరూపించిన రసభావములలో కాక శేష భావములందు ప్రాకృతకర్మ సహకరించి యుపకరించును.

ఇప్పటికిట్లు నిరూపించిన తారాకర్మ యంతయు లోకక్రియా శ్రయమై స్వభావసిద్ధముగనె యున్నది. ఇది గుర్తించి రసములలో భావములలో తారాకర్మలను యోజనము చేయవలయును. "స్వభావ సిద్ధమేవైతత్కర్మ లోకక్రియాశ్రయం" లోకాశ్రయముగా వీని స్వరూపవిజ్ఞానము స్పష్టమగును కాని సంస్కారసాపేక్ష యుండును. స్వభావసిద్ధమనుట సత్యమయినను స్వభావ మాకస్మికముగ రాదు. సంస్కార బలముననె విశిష్టముగా స్వభావము రాణించును. ఈ ప్రసక్తి యందే దర్శనప్రకారములను నిరూపింతుము.

## దర్శనభేదములు

దర్శనప్రకారము లెనిమిది కలవు.

| | | |
|---|---|---|
| ౧ సమము | ౨ సాచి | ౩ అనువృత్తము |
| ౪ ఆలోకితము | ౫ విలోకితము | ౬ ప్రలోకితము |
| ౭ ఉల్లోకితము | ౮ అవలోకితము. | |

ఈ దర్శనవిధి సర్వభావరసాశ్రయము. ఒకేదృష్టి ఒకేభావము నకు ఒకేరసమునకు నియతము కాదు. కాని రసభావముల విషయ మున దృష్టి యనియతమును కాదు. హృదయగతమయిన స్ఫురణ మది యట్లియాగక బహిఃప్రసారణము పొందునప్పుడు నానాదర్శన స్వభావము పొందును. వివిధరీతులలో నది హృద్భావమును గోచ రింపజేయును. సమసాచ్యనువృత్తాదులన్నియు నేకరసమున సంగత ములు కావచ్చును. ఏకీభావమునను గావచ్చును. సమయసందర్భ కౌశలమున నాయారసభావముల నివి వినియోగము పొందును. కావు నని విశిష్య వినియోగ మిచట నిరూపితమగుటలేదు.

౫౦౩. సమతారం చ సౌమ్యం చ యద్దృష్టం తత్సమం స్మృతం
పక్ష్మాన్తర్గతతారం యత్త్ర్యస్రం సాచీకృతం తు తత్
౫౦౪. రూపనిర్వర్ణనాయుక్తమనువృత్తమితి స్మృతం
సహసా దర్శనం యత్స్యాత్ తదాలోకితముచ్యతే
౫౦౫ విలోకితం పృష్ఠతస్తు పార్శ్వాభ్యాం తు ప్రలోకితం
ఊర్ధ్వముల్లోకితం జ్ఞేయమవలోకితమప్యథ
౫౦౬ ఇత్యేషదర్శనవిధిః సర్వభావరసాశ్రయః

౧. సమము : తారలు సమముగా నుండునట్లు సౌమ్యభావమున చూచుట సమదృష్టి. ఇందు తన ప్రసన్నత గోచరించును. నిర్వికార ముగా తన భావస్థితి స్ఫురించును. ఎదుటనున్నవారి భావము నవక్ర ముగా యథాస్థితముగా గుర్తించు నేర్పు కలిగియుండును. సమదర్శన ములో భావముల యొడుదుడుకు లుండవు.

౨. సాచి : ఈ దర్శనమునకె సాచీకృతమనియు పేరు. ఈ దృష్టిలో తారలు పక్ష్మాంతర్గతములుగా నుండును. త్ర్యస్రమయిన చూపుండును. ముబ్బంగుల చూపు మూడుభావముల సూచింపదు. ఒకే భావగతమయిన మూడు విధములను సూచించును. ఇందు లజ్జ గోచరింపవచ్చును. ఆలోచనము భావస్వీకృతి భాసించును.

3. అనువృత్తము : రూపనిర్వర్ణనముతో గూడిన దృష్టికి అను వృత్తమని పేరు. ఈ అనువృత్తిలో భావానువృత్తియు గూడియున్నది. రూపనిర్వర్ణనమునకై యటునిటు దృష్టిచలనము వలనము పొందును.

౪. ఆలోకితము : సహసా దర్శించుట కాలోకితమని పేరు. భావగతమయిన వేగక్రియ కిది నిదర్శనము. ఉబలాట ముద్వేగము దీని వెనుక నుండును.

౫. విలోకితము : వెనుకకు తిరిగిచూచుట విలోకితము. చూడ నుత్సుకం పడియు నటుపోవువ్యక్తి యిటుగా గ్రీవావలనమున కటిసం వలనమునగాని వక్షఃపరివర్తనమునగాని చూచుట విలోకితమున కనుగతము.

౬. ప్రలోకితము : పార్శ్వభాగములతో జూచుట ప్రలోకితము. కనుపార్శ్వముల జూచుటయె కాక ఆ పార్శ్వమున కీ పార్శ్వమునకు మాటిమాటికి దృష్టి సారించుచుంట ప్రలోకితము. తనభావగత యస్థిరత, యితరుల భావమనముల నాకర్షించి యుద్దీపింపజేయుట ప్రలోకితార్థము.

౭. ఉల్లోకితము : కనుబొమ లెగురబెట్టి పైకి పైపైకి చూచుట యుల్లోకితము. ఇం దాలోచనమున్నది. ఆవేగగ్రసన మున్నది. ఆశ్చర్యమున్నది.

౮. అవలోకితము : ఇదియు నుల్లోకితమువలె నుండును. ఉల్లోకితమున పరిమితమె లక్ష్యము. అవలోకితమున నంతకన్న విశాల వలయ మున్నది.

ఇట్టి యష్టవిధి దర్శనవిధి. ఇది సర్వభావరసాశ్రియమయిన తారాగత రీతి. ఈ దర్శనవిధి ననుసరించిన పుటకర్మ యున్నది. పుట కర్మ తొమ్మిదివిధములు. వాని పేరు లిట్లున్నవి.

పుటకర్మ

| | | |
|---|---|---|
| ౧ ఉన్మేషము | ౨ నిమేషము | ౩ ప్రసృతము |
| ౪ కుంచితము | ౫ సమము | ౬ వివర్తితము |
| ౭ సస్ఫురితము | ౮ పిహితము | ౯ వితాడితము. |

వీని లక్షణము లిట్లున్నవి.

౧౦౩. విశ్లేషః పుటయోర్యస్తు స ఉన్మేషః ప్రకీర్తితః
సమాగమో నిమేషః స్యాదాయామః ప్రసృతం భవేత్

౧౦౮. ఆకుంచితం కుంచితం స్యాత్సమం స్వాభావికం స్మృతం

౫౦౯. వివర్తితం సముద్వృత్తం స్ఫురితం స్పందితం తథా
స్థగితం పిహితం ప్రోక్తం ఆహతం తు వితాలితం

౧. ఉన్మేషము : కనుపుటముల విశ్లేషమునకు ఉన్మేషమని పేరు. పుటములు విడిబడి విస్ఫారితములై దూరదూరమున్నప్పు డున్మేషమయినది. క్రోధమునం దున్మేష ముపకారి.

౨. నిమేషము : కనుపుటముల సమాగమము నిమేషము, పుటములు దూరదూరముండక దగ్గరదగ్గరచేరుట నిమేషమయినది. ఇదియు క్రోధానుకారములో నుపకారి.

౩. ప్రసృతము : పుటముల యాయామముప్రసృతమగును. పుటములు విప్పారకుండగనె దైర్ఘ్యము కలవయినపుడు ప్రసృతమన్న పేరు కలుగును. విస్మయ హర్ష వీరము లందు ప్రసృత ముపకారి.

౪. కుంచితము : ఆకుంచితములయిన పుటములుండుట పుటము లప్పళించుట కుంచితము. అనిష్టదర్శనమున అనిష్టములయిన గంధరస స్పర్శములందు కుంచిత ముపకరించును.

౫. సమము : స్వాభావికరీతి సమము. శృంగారమునందు సమ కర్మ యుపయుక్త మగును.

౬. వివర్తితము : కనుపుటములు బాగుగా త్రిప్పుట కూడి యున్నప్పుడు వివర్తితకర్మ యయినది క్రోధమునందు వివర్తిత మావశ్యకము.

౭. సస్ఫురితము : స్ఫురితమె సస్ఫురితము. పుటములు స్పందము కలవయినప్పుడు స్ఫురితసంజ్ఞ కలుగును. ఈర్ష్యాభావ మభినయించు నప్పుడు స్ఫురితకర్మ యుండును.

౮. పిహితము : పుటములు స్థగితములగుట మూతలుపడుట పిహితమయినది. సుప్తములో మూర్ఛితములో వాయువువీచునప్పుడు ఉష్ణతకూడినప్పుడు ధూమవ్యాప్తిలో వర్షాపాతములో అంజనకృత మయిన యార్తిలో నేత్రరోగమున పిహితకర్మ యున్నది. కనుపుట ములతో స్థగనమెయిట వివక్షితము, అరచేతిమూతలు తగవు.

౯. వితాలితము : కనుపుటము లాహతములగుటకు వితాలిత మని పేరు. పుటము లల్లార్చుట పుటములు దిగజారి టపటపలాడుట

వితాలితరూపము. కొందరు దీని విలాసితమనినారు. అభిఘాతోదయమున వితాలితమున్నది.

ఇప్పటికిది యంతయు తారకాపుటములవిధానము. రసభావములందు వీని వినియోగవిధానము కూడ సూచితమయినది. ఏతత్కార్యానుగతమయిన భ్రూకర్మ నిక నిరూపింతుము. ఇది యేడువిధములు.

భ్రూకర్మ

౧ ఉత్క్షేపము ౨ పాతనము ౩ భ్రుకుటి

౪ చతురము ౫ కుంచితము ౬ రేచితము

౭ సహజము.

వీనిలక్షణము రసభావప్రయోజనము ఈ విధమున నున్నది.

౫౧౦. భ్రువోరున్నతిరుత్క్షేపః సమమేకైకశోపివా
అనేనైవ క్రమేణైవ పాతనం స్యాదధోముఖం

౫౧౧. భ్రువోర్మూల సముత్క్షేపాద్భ్రుకుటీ పరికీర్తితా
చతురం కించిదుచ్ఛ్వాసాన్మధురాయతతా భ్రువోః

౫౧౨. ఏకస్యా హి ద్వయోర్వాపి మృదుభంగస్తు కుంచితం
ఏకస్యా ఏవ లలితాదుత్క్షేపాద్రేచితం భ్రువః

౫౧౩. సహజాతం తు సహజం కర్మ స్వాభావికం స్మృతం

కనుబొమ్మలను రెండింటిని పైకెత్తుట "యుత్క్షేపము." రెండు బొమలను సమకాలమున నెత్తవచ్చును. ఇట్టి దొకరీతి ఒకటొకటిగా నెత్తుటయు నిందు సమ్మతము. ఇట్లె యధోముఖముగ బొమలను దింపుట "పాతన" మయినది. భ్రూమూలముల పైకెత్తుటను "భ్రుకుటి" యందురు. కనుబొమలు కొంతగా నుచ్ఛ్వాసము పొందుటవలన మధురముగా నాయతముగా నుండుటను చతుర రచన యనిరి. "కుంచిత" మనెడు భ్రూకర్మలో నొకబొమ కాని రెండు బొమలు గాని మృదుభంగముకలిగి యుండును. ఒకే కనుబొమను లలితముగా వలితముగా నుత్క్షేపింప జేయుట "రేచిత" కర్మ యయినది. సహజాతమయిన స్వాభావికమయిన భ్రూకర్మను "సహజ" భ్రూకర్మ యందురు. వీని రసభావ ప్రయోజనమును రమ్యముగ నున్నది. ఏక భ్రూసముత్క్షేపమునకు భ్రూద్వయ సముత్క్షేపమునకును ప్రతినియతమయిన భావమున్నది.

౫౧౪. కోపే వితర్కే హేలాయాం లీలాదౌ సహజే తథా
దర్శనే శ్రవణే చైవ భ్రువమేకాం సముత్క్షిపేత్

కోపవితర్క—హేలా భావములను సూచింపవలసియున్నప్పుడు, సహజమయిన లీలాదులను గోచరింపజేయవలసియున్నప్పుడు దర్శనమున శ్రవణమున నొక భ్రూ సముత్క్షేపము సముచితము. విస్మయహర్ష రోషములలో రెండుబొమల నెగురవేయుట యున్నది. అసూయ కలుగగా జుగుప్స యుదయింపగా హాసములో నాఘ్రాణించుటలో పాతన కర్మ యుపకరించును. దీప్తములయిన క్రోధస్థానములలో "భ్రుకుటి" యను భ్రూకర్మ యావశ్యకము. భ్రుకుటి సర్వకర్మల సామాన్యవాచకముగా నుపయుక్త మగుచున్నను దీప్తములగువానియందె భ్రుకుటి యనుట గమనింపదగినది. భ్రూకర్మ భ్రుకుటి విశిష్టమయిన శిష్టకర్మ.

౫౧౫. శృంగారే లలితే సౌమ్యే సుఖస్పర్శే ప్రబోధనే
ఏవంవిధేషు భావేషు చతురం తు ప్రయోజయేత్

చతురభ్రూకర్మ వినియోగమున కొక విశిష్టత యున్నది. ఆ కర్మ చతురము. కావుననె యది చతురము. శృంగారమునందు లలిత విధానమునందు సౌమ్యమయిన రీతిలో సుఖస్పర్శములో ప్రబోధనములో నింక నిట్టి భావములలో చతుర భ్రూకర్మను ప్రయోగింపవలయును. లలితశృంగారమున సౌమ్యసుఖస్పర్శయున్నప్పుడు విలాస విధానమున నీ చతురకర్మ యుపకరించునన్న భావమును ఇందసులభము కాదు. నానావస్థాంతరాత్మకమయిన స్త్రీపురుషుల సంలాపము నందును చతురకర్మ కావలయుననుట కర్మవిదుల కాంక్ష. "కుంచిత" కర్మకు నికుంచితకర్మయనియు పేరు. మోట్టాయితము కుట్టమితము కిలకించితము అను స్త్రీల శృంగారభావములందు కుంచితభ్రూకర్మ వలయును. "నృత్తయోజ్యంతు రేచితం" నృత్తమునందు రేచితకర్మ నుపయోగింపవలసియున్నది. "స్వాభావిక" మను పేరు కల భ్రూకర్మను అనావిద్ధ భావములందు ప్రయోగింపవలెను. అవికృతములుగా నుండు సహజ భావము లందిది యుపకారి. ఇట్టిది యంతయు భ్రూకర్మ.

## నాసాకర్మలు.

ఇక నాసాకర్మ నిరూపింపవలెను. నాసాకర్మ లారుతెఱవు. వాని పేర్లిట్లున్నవి. సాధారణముగా నా యా కర్మసంకేతములుగా నున్న

నామవిశేషము లన్నియు లక్ష్యనామములుగ నుండి లక్షణభావమును స్వగతవిశేషముననె సూచింపగలవు. అయినను కించిన్నిర్దేశమున సూచించుట యొకానొక యాపేక్షికమయిన యంశమును స్పష్టము చేయుటకె యని భావింపవలసి యున్నది. అంతట నిర్దిష్టమాత్రమే తల్లక్షణము కాదు. నిర్దిష్టాంశము లక్షణపరిధికి సూచకము. ఇట్లె సర్వము నిగ్రాహ్యము.

౧ నత ౨ మంద ౩ వికృష్ట

౪ సోచ్ఛ్వాస ౫ వికూణిత ౬ స్వాభావిక

వీని లక్షణ వినియోగము లీ విధమున నున్నవి. నిర్దిష్టమాత్రమె లక్షణశరీరము కానట్లు ప్రదర్శితమాత్రమె వినియోగరీతి కాదు. దానివలె నిదియు నుపలక్షకము.

౫౧౬. నతా ముహుఃశ్లిష్టపుటా మందా తు నిభృతా స్మృతా
వికృష్టా ఫుల్లితపుటా సోచ్ఛ్వాసాకృష్టమారుతా
వికూణీలా సంకుచితా సమా స్వాభావికీ స్మృ॥

ముకుపుటములు మాటిమాటికి శ్లిష్టములై యున్నచో "నత" నాసిక యని పేరు. మదోత్కంపముతో కూడుకొనిన స్త్రీల యను రోధప్రసక్తిలో అప్పటినిశ్వాసమున నీ నతనాస యుపకారి ఈ యర్థమున నె వినియోగవాక్య మిట్లున్నది.

౫౧౭. మందోత్కంప సమాయుక్తే నారీణా మనురోధనే
నిశ్వాసే చ నతాకార్యా నాసికా నాట్యయోక్తృభిః

"మంద" నాసిక నిభృతముగ నుండును. నిర్వేదాత్యౌత్సుక్య చింతాభావములలో శోకమున మందనాసిక యుండును. "వికృష్ట" నాస ఫుల్లితపుట. ముకుపుటము లందు విప్పారి యుండును. నాసా రంధ్రములు స్ఫుటగోచరము లగును. తీవ్రగంధమున నీ నికృష్ట యున్నది. శ్వాసరోషభయాదులలో దీని వినియోగముండును. "సోచ్ఛ్వాస" నాసిక మారుతమాకర్షించును. బాగుగా గాలిపీల్చును. అట్లె విచుచును. రౌద్రమున వీరమున ఇష్టఘ్రాణమున మధురగంధమున ఉచ్ఛ్వాసవిధానమున నీ సోచ్ఛ్వాసనాసికను ప్రయోగించుట నాట్యవిధి "వికూణిత" నాస సంకుచితముగ నుండును. జుగుప్సలో

ననూయితములో నిది యుపకారి. "స్వాభావిక" నాసిక సమముగా నుండును. వినియోగమున సూచింపని శేషభావముల నన్నిట స్వాభావికనాసిక యుండుట యుక్తమని నాట్యవిదులనిరి.

గండకర్మ.

గండ మారువిధములు. వాని పేరు లిట్లున్నవి.

| | | |
|---|---|---|
| ౧ క్షామము | ౨ ఫుల్లము | 3 ఘూర్ణము |
| ౪ కంపితము | ౫ కుంచితము | ౬ సమము |

వీని లక్షణవినియోగము లీ రీతి నున్నవి.

౫౧౮. క్షామం చావనతం జ్ఞేయం ఫుల్లం వికసితం భవేత్
వితతం ఘూర్ణమిత్యుక్తం కంపితం స్ఫురితం భవేత్
౫౧౯. స్యాత్కుంచితం సంకుచితం సమం ప్రాకృతముచ్యతే
క్షామం దుఃఖేషు కర్తవ్యం ప్రహర్షే ఫుల్లమేవ చ
౫౨౦. ఘూర్ణముత్సాహగర్వేషు రోషహర్షేషు కంపితం
కుంచితం చ సరోమాంచం స్పర్శే శీతే భయే జ్వరే
౫౨౧. ప్రాకృతం శేషభావేషు గండకర్మ భవేదితి

అటునిటుగానున్న యీ లక్షణ వినియోగములను ఏకయోగమున నిట్లు గుర్తించునది.

౧. క్షామము : అవనతముగా నున్న కపోలము క్షామగండము. దుఃఖసమయములందు క్షామగండ మున్నది. క్షామము కృశించి యుండుట. "క్షామక్షామకపోలమాననం" అని కవికులగురువు వచనము. విరహబాధావ్యధితశకుంతల క్షామకపోల యయినది.

౨. ఫుల్లము : వికసితకపోలము ఫుల్లగండ మయినది. ప్రహర్షమున ఫుల్లగండమునకు వినియోగ మున్నది. ఫుల్లకపోలవనితలు కన్పడుచునే యుందురు.

3. ఘూర్ణము : వితతము విస్తృతమయిన కపోలమునకు ఘూర్ణగండ మనిపేరు. ఉత్సాహ నిమిత్తకములయిన గర్వములందు ఘూర్ణగండ ముపకారి.

౪. కంపితము : స్ఫురితస్ఫురితమయిన కపోలమును కంపితగండ మనవలెను. రోషహర్షములలో కంపితగండ మున్నది. రోష

నిమిత్తకములయిన భావములందును హర్షనిమిత్తములయిన భావములకును ఇది వినియుక్తమగునని భావము. కంప మిటు నుండును. ఇటు నుండును.

౫. కుంచితము : సంకోచము కూడిన కపోలము కుంచిత మగును. ఏదేని స్పర్శ కలిగినప్పుడు శీతస్పర్శలో భయములో జ్వరములో రోమాంచ సహితమయిన కపోలము కుంచితకపోలమై యుపకరించునది యగును.

౬. సమము : సమగండమనునది ప్రాకృతకపోలము. సహజముగా నుండు కపోలము శేష భావముల నన్నిట ప్రాకృతమయిన సమగండమె వినియోగము పొందును. ఇట్లిది యంతయు గండకర్మ. ఇక అధర కర్మలు ప్రసంగ ప్రాప్తములు.

అధరకర్మలు.

౧ వివర్తనము ౨ కంపనము ౩ విసర్గము

౪ వినిగూహనము ౫ సందష్టకము ౬ సముద్గము

వీని లక్షణము వినియోగ మీ విధమున గుర్తించునది.

౫౨. వికూణనం వివర్తస్తు వేపనం కంపనం స్మృతం
వినిష్క్రామో విసర్గస్తు ప్రవేశో వినిగూహనం
౫౩. సందష్టకం ద్విజైర్దష్టం సముద్గః సహజోన్నతిః
అసూయావేదనావజ్ఞాహాస్యాదిషు వివర్తనం
౫౪. కంపనం వేదనాశీతభయరోషజవాదిషు
స్త్రీణాం విలాసే బిబ్బోకే విసర్గో రంజనే తథా
౫౫. వినిగూహనమాయాసే సందష్టం క్రోధకర్మసు
సముద్గస్త్వనుకంపాయాం చుంబనే చాభినందనే

క్రింది పెదవి కధరమని పేరు. "వివర్తనము" అను అధరకర్మను "వివర్త"మనియు నందురు. అసూయకలిగినప్పుడు, వేదనజనించినప్పుడు, ఒకరిని తిరస్కరించునప్పుడు పరిహసించునప్పుడు వివర్తన ముపకరించును. వికూణన మొనరించుట వివర్తము, అరుణాధర మెదురుగా నుంటకాక లోనికి మడిచియుంచుటను వికూణనమని భావింప వచ్చును. సంక్రాంతవక్రీకరణముగా దీనిని తలచవచ్చును. అధరాకృతిని బహిఃస్ఫుటము కానీయక కొంత లోనికి బిగించి

వినియోగ సౌకర్యానుసారమున ఎడపెడబిగింపు లగింపు కలుగునట్లు చేయుట అప్పు డధరము వంకరటింకరగా నుండవచ్చును. అట్లుండగా నవజ్ఞయో హాస్యమో సందర్భసముచితముగ గోచరించును. రెండవ యధరకర్మ కంపనము. వేపనమంట కంపనము ఉన్నట్లుండి కదలుట. అటునిటు కదలుట, సవ్యాపసవ్యవిధానంచలనము. వేదనలో శీతములో భయములో రోషములో వేగములో కంపనము కల యధరము వినియుక్తమగును. క్రింది దవడకదలుట యధర వేపనము కాదు. అదురుపాటు కల యధరమునసె యీ కంపముదయించి గోచరించును. అప్పుడే వేదనాదులు గోచరించును. మూడవది "విసర్గము." వినిష్క్రామము విసర్గము. బయటికి స్ఫుటారుణముగా గోచరించు అధరము లోనికి నిష్క్రమించునట్లు చేయుట వినిష్క్రామము. రసనతో నధరమాకర్షించి తనకుతానే యాస్వాదారంభ మొనరించుట, ఉత్తరోష్ఠముతో నధరోష్ఠమును లోనికి నొక్కుట విసర్గమగును. స్త్రీలవిలాపమున బిబ్బోకమున నిది యుపకారి. విలాస బిబ్బోకములు వనితల శృంగారభావములు. వానిసూచనమున నిది సహకరించును. "విసర్గఃసురతేస్మృతః" సురతప్రక్రియలో విసర్గముండు నని వినియోగమున్నది. అధరాస్వాద మింతమధురమంజులమని భావించునప్పుడు విసర్గాత్మకమయిన యధరకర్మ యుండును. "వినిగూహనము" నాల్గవది. ప్రవేశము వినిగూహనమని లక్షణము. స్ఫుటావభాసమున నున్న యధరము అంతఃప్రవేశము పొందుట వినిగూహన మయినది. ఇది విలాస బిబ్బోకములందును అట్టి రంజనమునను వినియుక్తమగును. వినిగూహన మాయాసవిధానమున గూడ నున్నది. ఈ యాయాసమరతకృతము సురతకృతము కావచ్చును. ఇం దధరమంతఃప్రవేశమునసె విశ్రాంతమగును. కేవల మా యా భావములనె కాక ఇతరములను గూడ నివి సూచించుననుట పూర్వము నిరూపితమయినది. ఆ యా కర్మ లా యా భావముల రసముల వినియోగము పొందుటలో కేవలము స్వమాత్రవైశిష్ట్యమె కారణము కాదు. అందన్యవిధానములు కూడ సహకరించును. అప్పుడె వినియోగ వినిశ్చయమును విశదమగును. "సందష్టకము" అయిదవది. తన పై

మునిపన్నులతో తనకు తానె యధరమునొక్కుట సందష్టకము. క్రోధ కర్మలలో సందష్టకము సహకరించును. ఈ క్రోధము శృంగారకృతము అశృంగారకృతము కావచ్చును. "సముద్గము" ఆరవది సహజోన్నతి సముద్గము. లోనిభావము స్ఫుటాస్ఫుటమగునప్పుడు అంతస్సంజల్ప ముగానున్నప్పు డధర ముబ్బెత్తుగా లావణ్యారుణ్యసూచకముగా నుండును. అది సముచితమయిన యుద్గతి. సహితమయిన గతి. ఇట్టి సముద్గ మనుకంపలో నుపకారి చుంబనమున సహకారి. అభినందనమున నానందకారి. అతికంపమున నంగధూననములో గూడ నిది వినియో గము పొందును. ఇట్టివి యోష్ఠకర్మలు. ఇక చిబుకకర్మలు చెప్పెదము.

చిబుకకర్మ.

చిబుకకర్మ లారు కలవు. చిబుకమనునది చిరుగడ్డము. ఈ చిబుక కర్మల నామములు లక్షణములు వినియోగము లీ విధమున నున్నవి.

| | | |
|---|---|---|
| ౧ కుట్టనము | ౨ ఖండనము | ౩ భిన్నము |
| ౪ చుక్కితము | ౫ లేహితము | ౬ సమము |

చిబుకము పేరున కేవల చిబుకము లక్షితము కాదు. అది రమ్యమును కాదు. దంతక్రియాదష్టమయిన చిబుకమె యిందు లక్షిత మగును. ఉపభోగక్రియలో అధరచుంబన కపోలచుంబనములవలె చిబుకచుంబనము శాస్త్రీయముగా నున్నది. అధరచుంబనమున కివి సాధనములు. ఈ సాధనసిద్ధి యున్నచో నధరచుంబనాధికారము కలుగును. "దష్టంచదంతక్రియయాచిబుకంత్విహలక్ష్యతే".

౫.౨౬. కుట్టనం దంతసంఘర్షః సంఫోటః ఖండనం ముహుః
భిన్నం తు గాఢసంశ్లేషశ్చుక్కితం దూరవిచ్యుతిః
౫.౨౭. లేహనం జిహ్వయా లేహః కించిచ్ఛ్లేషః సమం భవేత్

౧ కుట్టనము : దంతములతో నొకింతగా సంఘర్ష మొదవించుట కుట్టనము. "భయశీతజ్వరక్రోధగ్రస్తానాంకుట్టనంభవేత్" భయాదులు కూడుకొనిన వారలకు కుట్టనముండును. అధరముననె యీ కుట్టన ముండును. అట్లుండగా చిబుకమునం దా క్రియావిక్రియలు గోచరింప నవి చిబుక కర్మ లగుచున్నవి. భయాదిగ్రస్తు లగువారు వారి యధర మున నిట్లు దంతసంఘర్ష మొనరింపగా కుట్టన మయినది.

౨. ఖండనము : సంఫోటము ఖండనమని లక్షణము. పటుక్కున కొఱుకుట యన్న భావ మిందు గోచరించును. సంఫోటమె సంభేద మనియు నున్నది. పటుక్కున కొఱుకుటయు నొకతూరి కాక మఱల మఱల నట్లొనరించుట వివక్షితము. అప్పుడె ఖండనము. జపములో నధ్యయనములో సల్లాపములో భక్ష్యయోగములో నీ ఖండనము వినియుక్తమగును.

3. భిన్నము : గాఢసంశ్లేషము భిన్నము. గాఢముగా బిగువుగా సంశ్లిష్టమగుట పట్టుకలదగుట భిన్నమగును. వ్యాధి భయ శీత వ్యాయామ రుదిత మరణ విషయములలో నిది యుపకరించును. ఇట్టి సమయములందు దంతములతో నట్లు దశన మొనరింపవలెనని భావము. పూర్వము నిర్దేశించిన యధరకర్మలు అధరమాత్రకర్మలు. ఇవి దంతాధర సంశ్లేషకర్మలు.

౪. చుక్కితము : ఈ చుక్కితమె చికితము చుక్షితము అక్షితము అను నామములతో గూడ నున్నది. దూరవిచ్యుతి చుక్కితము. దూరముగా నధరము జారవేయుట. పై దంతపంక్తిని లోనధరమూలమున జేర్చి అధరము ముడుతపడునట్లు చేయుట- వెల్లకిల విరువుడు కలుగునట్లు చేయుట యని యూహింపవచ్చును. జృంభణములో నీ చుక్కితము వినియుక్తమగునని భరతోక్తి యున్నది. "జృంభణే చుక్కితం కార్యం" దీని సంగతి పట్టి గ్రహించునది.

౫. లేహితము : లేహితమె లేహము లేహనమును నాలుకజాపి అధరముపై నటు నిటు నంతట నాస్వాదించుట లేహితము. భావలౌల్యములో నీ లేహన ముపకారి. భావగతముగా చాపలమున్నప్పు డిది జరుగును. నా కిట్లు కావలెనని నీ కిట్లొనర్తునని యపటుభావులు తలచినప్పు డిది జరుగును.

౬. సమము : కొంతగా కొద్దిగా దంతములతో నధరమును శ్లేషింపజేయుట సమము. స్వభావ భావములలో నిది యుపకారి. స్వభావభావరూపములయిన క్రోధకర్మలలో సందష్టరూపమునగూడ నీ సమము వినియోగము పొందును.

ఇట్టిది యంతయు చిబుకక్రియ. దంతమధరము జిహ్వా యను మూడిటి కరణ విధానమున నీ చిబుకక్రియారూప మేర్పడినది.

"ఇతి దంతోష్ఠజిహ్వానాం కరణాచ్చిబుకక్రియా" అన్న భరతోక్తి యిందు నిదానము. కేవల చిబుకమున నీ క్రియాకౌశలము వ్యక్తము కాదు. రసనాధరము లిం దిట్లావశ్యకము లయినవి. ఇక ముఖకర్మ ప్రసంగప్రాప్తము.

ముఖకర్మ

ముఖకర్మ లారు కలవు. వీని లక్షణ వినియోగము లీ విధమున విశిష్య తెలియదగియున్నవి. ముఖకర్మల పేరు లిట్లున్నవి.

౧ వినివృత్తము ౨ విధుతము ౩ నిర్భుగ్నము

౪ భుగ్నము ౫ వివృతము ౬ ఉద్వాహి

వీని లక్షణవచనము లిట్లు సంకేతితములు.

౫౨౭. వ్యావృత్తం వినివృత్తం స్యాత్ విధుతం తిర్యగాయతం
అవాఙ్ముఖత్వం నిర్భుగ్నం వ్యాభుగ్నం కించిదాయతం
౫౨౮. విశ్లిష్టోష్ఠం చ వివృతముద్వాహ్యుత్క్షిప్తమేవ చ

వీని వినియోగ ప్రక్రియ లిట్లున్నవి.

౫౩౦. వినివృత్తమసూయాయా మీర్ష్యాకోపకృతేషు చ
అవజ్ఞా విహృతాదౌ చ స్త్రీణాం కార్యం ప్రయోక్తృభిః
విధుతం వారణేచైవ నైవ మిత్యేవమాదిషు
౫౩౧. నిర్భుగ్నం చాపి విజ్ఞేయం గంభీరాలోకనాదిషు
భుగ్నం లజ్జాన్వితే యోజ్యం యతీనాం తు స్వభావతః
౫౩౨. నిర్వేదౌత్సుక్యచింతాసు తథా వినయమంత్రణే
వివృతం చాపి విజ్ఞేయం హాస్యశోకభయాదిషు
౫౩౩. స్త్రీణాముద్వాహిలీలాయాం గర్వే గచ్ఛత్యనాదరే
ఏవంనామేతి కార్యం చ కోపవాక్యే విచక్షణైః

౧. వినివృత్తము : లక్షణవినియోగములు దూరదూరమున్నను భావనసౌకర్యమున కొకచో నిరూపించుట సముచితము. ముఖమటు త్రిప్పుట వినివృత్తము. మాలతి మాధవుని చూచునప్పుడు – వినివృత్త వృంతశత్రపత్రనిభమయినముఖము – కలదయినది. గ్రీవావలనముతో బాగుగా ముఖమును వెనుకకు మలచిచూచుట వినివృత్త మయినది.

వినివృత్త ముఖము అసూయలో, ఈర్ష్యలో, ఈర్ష్యాకృతములయిన కోపకార్యములలో, తిరస్కారముతో విసురుపాటుతో విహరించుటలో స్త్రీలవిషయమున నుపకరించును. ప్రయోగవిదులు వినివృత్తమును స్త్రీలకే నిరూపించిరి. వారట్లయి సుందరతను స్ఫురింపజేయుదురు. పురుషుల కిది యిది కాదు.

౨. విధుతము : అడ్డముగా పొడవుగా ముఖముంట విధుతము. అంసాగ్రమునకు ముఖమును మలచి పైకెగురవేయుట విధుత మయినది. అసూయాకోపాదులలో నిది వినియోగము పొందుటయె కాక నివారణములో గూడ నిది వినియుక్త మగును. "ఇట్లొనరింపరాదు" అనుటలో నిట్టివానిలో గూడ విధుత వినియోగ మున్నది.

3. నిర్భుగ్నము : అవాఙ్ముఖముగా నుండుట నిర్భుగ్నము. ముఖమును దిగువకు దింపుట. తలవంపులో మెడవంపులో నీ మొగము వంపు సొంపుగా నుండును. గంభీరావలోకనము మొదలగు వానిలో నిది సహకారి. గ్రీవాకర్మలు శిరఃకర్మానుగము లగుటను భరతుడు మున్ముందు సూచించును. సర్వకర్మలు సర్వవిశేషముల ననుగమించుచునె యుండును. గ్రీవా ముఖ శిరఃకర్మ లనుగతములై దృష్టి సృష్టి సేయగలవు. ఇట్లె యితరములును పరస్పరసంగతములై రమ్యతా నిదానములు.

౪. భుగ్నము : వ్యాభుగ్నమనియు దీనిపేరు. కించిదాయతము వ్యాభుగ్నము. కొంత పొడవుగా నుండుట. లజ్జాన్వితముఖమునం దీ భుగ్నకర్మ నాయోజనము చేయవలయును. యతుల కిది స్వాభావసిద్ధముగ నుండును. ఇంకను నిర్వేదము - ఔత్సుక్యము- చింతాఖ్యభావములలో వినయమున మంత్రణములో వినిమంత్రణములో భుగ్నకర్మ వినియోగ ముండును.

౫. వివృతము : ఓష్ఠము. విశ్లిష్టముగా నుండుట. తెఱచిన పెదవితో నుండుట వివృతము. హాస్యశోకభయాదులలో వివృతవినియోగమున్నది. నోరు తెఱచి హాస్య మాస్వాదింతురు. అట్లె, శోక

పడుదురు. బెదిరినవారు నోరు తెఱతురు. "ముఖం వ్యాదాయ స్వపితి" యని ప్రయోగము స్వాపమునగూడ వివృతమున్నది.

౬. ఉద్వాహి : ఆక్షిప్తముగా నుండుట ఉత్క్షిప్తముగా నుండుటయు నుద్వాహికర్మ యగును. ఎదురుగా ముఖము పైకెత్తుట. ఇది స్త్రీలకు కలదు. వారి విలాసములో నిది స్ఫుటమగును. గర్వమున నున్నప్పుడు, అనాదరమున నున్నప్పు డుద్వాహి యుండును. "దీని నిట్లొనరించితివా ?" యనుటలో కోపవాక్యములో విచక్షణులు దీని వినియోగము భావించిరి.

ఇప్పటి కివి యిట్లు ముఖకర్మలు ముఖమున నొక్క యుపదేశ సూక్తి యున్నది. అది యిట్లున్నది.

౯౩౪. సమసాచీ కృతాద్యుక్తం యచ్చ దృష్టి వికల్పనం
తజ్జ్ఞస్తదనుసారేణ కార్యం తదనుగం ముఖం

దృష్టి వికల్పనముగా దర్శనకర్మలను నిర్దేశించునప్పుడు సమము సాచీకృతము అనువృత్తము మొదలగు నవి నిరూపితము లయినవి. ఇంకను నానాదృష్టులు ప్రతిపాదితము లయినవి. తత్ప్రసక్తిలో నింకను తారాకర్మలు పుటకర్మలు నిర్దిష్టము లయినవి. తద్విదులగువారు తదనుసారమున ముఖమును తదనుగతముగా నిర్దేశింపవలెను. ముఖ కర్మముఖకర్మగా రూపముపొందదు. దృష్టికర్మానుసారముగా ముఖ కర్మకు రూపసిద్ధి యున్నది. అట్లెయివి యిచట నిర్దిష్టము లయినవి. అభినయకర్మలలో నంతట పరస్పరసంసర్గమున్నది. అందును విశిష్ట సంసర్గ మిచట నున్నది. దీని గుర్తించి నిరూపించుట యావశ్యకమని యీ యుపదేశము.

ఇక క్రమప్రసక్తిలో గ్రీవాకర్మలు చెప్పుట సముచితము. అయినను ముఖప్రకరణమున ముఖరాగము చెప్పవలసి వచ్చినది. ఇక ముఖ రాగము నిరూపింతుము.

## ముఖరాగము

ముఖరాగము నాలుగు విధములు, భావరసాశ్రయమయిన ముఖరాగమును భావరసోపేతముగా ప్రయోగించుట యావశ్యకము.

ముఖరాగమున్ననె యభినయమునకు శోభయున్నది. ముఖరాగము సరిగా లేనప్పుడు అభినయ మెంత రమ్యమైనను శోభింపదు. ముఖరాగ ముఖప్రశంసకై తద్భేద తల్లక్షణ తద్వినియోగములను తెలియవలెను. తద్భేద నామము లిట్లున్నవి.

| | |
|---|---|
| ౧ స్వాభావికము | ౨ ప్రసన్నము |
| 3 రక్తము | ౪ శ్యామము |

ఈ నాలుగును స్వనామ స్పష్టములు. ఇవి తత్తదర్థసంశ్రయములై శోభాసంపాదకము లయినవి.

౩3౩. స్వాభావికస్తు కర్తవ్యః స్వభావాభినయాశ్రయః
మధ్యస్థాదిషు భావేషు ముఖరాగః ప్రకీర్తితః
౩3౬. ప్రసన్నస్త్వద్భుతే కార్యో హాస్యశృంగారయో స్తథా
వీరరౌద్రమదాద్యేషు రక్తః స్యాత్కరుణే తథా
౩3౭. భయానకే సబీభత్సే శ్యామం సంజాయతే ముఖం
ఏవం భావరసార్థేషు ముఖరాగం ప్రయోజయేత్

౧. స్వాభావికము : స్వభావాభినయమునకు స్వాభావికమయిన ముఖరాగ ముచితము. అభినయోల్లేఖములో నంతట నాట్యధర్మి లోకధర్మి యున్నది. స్వభావాభినయము లోకధర్మి ననుసరించును. ఇట్టియప్పుడు లోకసహజ రాగయోగమె సముచితము. ఇందు నాట్యధర్మి మేళన మావశ్యకము కాదు. స్వాభావికమె సముచితము.

౨. ప్రసన్నము : మధ్యస్థములయిన భావములలో ప్రసన్న ముఖరాగ ముచితము. ప్రసన్నమద్భుతములో వీర శృంగారములలో నిరూపితము కావలెను. స్వాభావికమొకవంక రక్తశ్యామము లొకవంక కాగా ప్రసన్న మా రెండిటి మధ్యగతము. లోకధర్మికి నాట్యధర్మికి మధ్యగతములుగా నుండు భావములలో నిది సంగతమనుట సంగతము. ప్రసన్నముఖరాగము ప్రశాంతభావసూచకముగా నుండును.

3. ౪. రక్తము : శ్యామము. వీరరౌద్రమదాదులలో కరుణము నందును రక్తముఖరాగ ముపకారి. భయానకమున బీభత్సమున ముఖము శ్యామముగ నుండును. ఇట్లు భావరసార్థములలో ముఖరాగ మును ప్రయోగింపవలసియున్నది.

ముఖరాగమున కసాధారణమయిన ప్రాధాన్యమున్నది. అది యిట్లు నిగ్రాహ్యాము.

౩౩౮. శాఖాంగోపాంగ సంయుక్త కృతోప్యభినయః శుభః
ముఖరాగవిహీనస్తు నైవశోభాన్వితో భవేత్
౩౩౯. శరీరాభినయోఽల్పోపి ముఖరాగ సమన్వితః
ద్విగుణాం లభతే శోభాం రాత్రావివ నిశాకరః

అంగోపాంగసంయుతమయిన యభినయ మెంత శుభముగా నొనర్చినను అది ముఖరాగవిహీనమయినచో శోభాన్వితము కాదు. ముఖరాగ మాహార్యమునం బొకరీతి. ఆహార్యము నాట్యమున బహిరంగము కాదు. ఆహార్యమంత రంగము. ముఖరాగమట్టిది. ప్రేక్షకుల కాకస్మికముగ చక్షుఃప్రీతి నిచ్చి సాధారణ్య మాపాదించుట కిది సమర్థము. రంగమున నటుని చూడగనె ముఖలగ్నదృష్టులగు సామాజికులకు ముఖరాగము ప్రవణత నాపాదించును. ముఖరాగ ముపేక్షింపరాదు. తత్సముచిత సమావేశ మావశ్యకము. సముచిత ముఖరాగ సమన్వితము సమంచితమయిన శారీరాభినయ మల్పమయినను ద్విగుణశోభ పొందును. నిశలో నిశాకరుడు శోభాధికుడగును. ముఖరాగమున నభినయము శోభితమగును. ముఖరాగమున్నప్పుడు శారీరాభినయములు శోభించుటయె కాదు. ముఖాభినయములకును శోభయున్నది. ముఖమున నయన మయనముకద! నయనమున నాట్యప్రతిష్ఠ యున్నది. నయనాభినయమును ముఖరాగాంచితమయిననె సమర్థమగుననుట యిందున్నది.

౩౪౦. నయనాభినయోపి స్యాత్ నానాభావరసస్ఫుటః
ముఖరాగాన్వితో యస్మాత్ "నాట్యమత్ర ప్రతిష్ఠితం"
౩౪౧. యథా నేత్రం ప్రసర్పేత ముఖభ్రూదృష్టిసంయుతం
తథా భావరసోపేతం ముఖరాగం ప్రయోజయేత్

ముఖరాగ సమన్విత మయినప్పుడె నయనాభినయము నానా భావరసస్ఫుట మగును. నయనరీతు లనేకములు. అవి తల్లక్షణ సమంచితములుగా నున్నను స్ఫుటముగా గోచరించుటకు స్వస్వనియత భావరసములను భాసింపజేయుటకు ముఖరాగ మావశ్యక మగుచున్నది. ముఖమున వ్యాపించిన దృష్టి కన్ను నన్వేషించి యచట

విశ్రాంతమగును. కన్నులో కన్ను కలిసిన నె కలిపిన నె కమనీయత యున్నది. ఇన్ని దృష్టులు తారాపుటాదికర్మలు ముఖరాగమున్నది గదా యని కన్నెత్తి కదలినవి. ఇందిది యుక్తి "నాట్య మత్ర ప్రతిష్ఠితం". నాట్యము నయనప్రతిష్ఠము, నయనము ముఖరాగ ప్రతిష్ఠము. ముఖభ్రూదృష్టిసంయుతమయిన నేత్ర మెట్టులు ప్రసరించునో సరిచూచుకొని గురిచూచుకొని ముఖరాగమును భావరసోపేతముగ ప్రయోగింపవలెను. ఇది యిట్లు భావరసాశ్రయమయిన ముఖరాగము.

ఇక గ్రీవాకర్మలు చెప్పెదము గ్రీవ నవవిధ.

| | | |
|---|---|---|
| ౧ సమ | ౨ నత | ౩ ఉన్నత |
| ౪ త్ర్యశ్ర | ౫ రేచిత | ౬ కుంచిత |
| ౭ అంచిత | ౮ వలిత | ౯ వివృత |

వీని లక్షణ వినియోగము లిట్లున్నవి.

౫౪౨. సమా స్వాభావికీ ధ్యానస్వభావ జపకర్మసు
నతానతాస్యా ఽలంకారే బద్ధే కంఠావలంబనే
౫౪౩. ఉన్నతాభ్యున్నతముఖీ గ్రీవా చోర్ధ్వాది దర్శనే
త్ర్యశ్ర పార్శ్వగతా జ్ఞేయా స్కంధభారే చ దుఃఖితే
౫౪౪. రేచితా విధుతా భ్రాంతాభావే మథనన్నృత్తయోః
కుంచితాకుంచితా మూర్ధ్ని భారితే గలరక్షణే
౫౪౫. అంచితాపసృతోద్బద్ధ కేశకర్షోర్ధ్వ దర్శనే
పార్శ్వోన్ముఖీ స్యాద్వలితా గ్రీవాభంగే చ వీక్షితే
వివృత్తాభిముఖీభూతా స్వస్థానాభిముఖాదిషు

ఈ ప్రకరణారంభమున నుపక్రమించిన నేత్రభ్రూనాసాధర కపోలచిబుకరూపమయిన ఉపాంగముల స్వరూపకథనము సమాప్తకల్ప మయినది. అందు గ్రీవాకర్మ సూచితము కాదు. అయిన నిచట నిరూపించుట యుక్తము. పూర్వ ముపాంగముల జెప్పుటలో లక్షణవాక్య ములు వినియోగవాక్యములు వేరువేరుగా నున్నవి. ఇందు రెండును మిశ్రములై యున్నవి.

౧. సమగ్రీవ : స్వాభావికమయిన గ్రీవాకర్మ. ధ్యానస్వభావజప కర్మలలో నిది వినియోగము పొందును.

౨. నత : ముఖము వంచియుండుటలో నిది యున్నది. అలం కారమువందు బద్ధవిధానమునందు కంఠావలంబమున నిది వినియుక్త మగును.

౩. ఉన్నత : అభ్యున్నతమయిన ముఖముతో నుండు గ్రీవాకర్మ ఉన్నత మను పేరు కలది. ఊర్ధ్వాదిదర్శనములో నిది సహకారి.

౪. త్ర్యశ్ర : పార్శ్వగతమయిన గ్రీవావిధానమునకు త్ర్యశ్రమని పేరు. స్కంధభారములో మతిఖిలవిధానములో నిది యుపకారి.

౫. రేచితము : భ్రాంతవిధానమున మెడను విదల్చుట రేచితము. గ్రీవారేచనము లను కర్మలలో నీ రేచితమున్నది. భావసూచనములో మథనములో నృత్తములో నీ రేచిత గ్రీవాకర్మ యుపకరించును.

౬. కుంచితము : ఆకుంచితమయిన గ్రీవ కుంచితకర్మ కలదగును. తలపై బరువున్నప్పుడు గ్రీవారక్షణమున నిది యుపకారి.

౭. అంచితము : అంచితమను గ్రీవాకర్మ అపసరణములో ఉద్బంధములో కేశకర్షణములో ఊర్ధ్వదర్శనములో నుపయుక్తమగును.

౮. వలితము : పార్శ్వమున కున్ముఖముగానుండు గ్రీవ వలితకర్మ కలదగును. ఈ వలితగ్రీవ గ్రీవాభంగములో మెడవంపుతో చూచుటలో నుపకరించును.

౯. వివృత్తము : గ్రీవావలనముతో నిది యున్నది. స్వస్థానాభిముఖములయిన కర్మసంకేతముల విధానములో నిది యుపకరించును.

గ్రీవాకర్మలన్నియు శిరఃకర్మానుగాములై యుండును. లోకభావప్రయోజనకముగా నుండు గ్రీవారీతి యనేకవిధముల నుండును. ఇందు సముచితములయిన కొన్నిమాత్రము నిరూపితములయినవి. ఈ ప్రఘట్టములో నిది నిగమనము.

౫౪౬. గ్రీవాకర్మాణి సర్వాణి శిరఃకర్మానుగాని హి
శిరసః కర్మణా కర్మ గ్రీవాయాః సంప్రవర్తతే

పూర్వము శిరఃకర్మలు నిరూపితములయినవి. శిరఃకర్మలు గ్రీవాకర్మలు సామాన్యముగా నేకరూపములు. కావుననె గ్రీవాకర్మలు శిరఃకర్మల ననుసరించి యుండుననుట సంగతము. శిరఃకర్మ ముఖ్యముగా గ్రీవాకర్మ ప్రసరించును. అయినను పృథగ్రీతిలో విశేషము సంభావ్యము. సర్వాభినయకర్మలలో సాంకర్యము గోచరింపవచ్చును. అది తత్సమయ సంగతము కాగలదు. ఇట్లిచట శీర్షోపాంగసమాశ్రయమయిన లక్షణము నిరూపించితిమి.

## ఉపాంగాభినయము

శిష్యుల యనుసంధానమును క్షణక్షణ మభివృద్ధిచేయుట పరమావశ్యకము. తదనుసంధానవృద్ధి శ్రద్ధాతిశయ మాపాదించును. ఇంతవఱకు నిరూపితమయిన ప్రాక్తనార్థములో శిరోనేత్రాదుల లక్షణ సంయుక్తమయిన కర్మ విశదముగ ననతిరిక్తముగ నున్నది. ఇచట కర్మ యనునది యభినేయమని భావము. ఈ యర్థ మిట్లున్నది.

౫౪౭. ఏవమేతచ్ఛిరో నేత్రభ్రూ నాసోష్ఠకపోలజం
కర్మ లక్షణసంయుక్తము పాంగానాం మయోదితం

భరతుడనుచున్నాడు. అప్పుడప్పుడు తన్నుతానుగా తానే నిర్దేశించుకొనుటవలన శ్రోతృపాఠకులు సావధాను లగుదురు. భరతుడది తలచి యిట్లనుచున్నాడు. ఆంగికాభినయమున శిరఃప్రభృతు లుపాంగములు. ఆ యుపాంగముల లక్షణసంయుక్తమయిన మభినేయ కర్మ నిట్లు చెప్పితిని. ఇట్లనుట ప్రాక్తనార్థముపసంహృతమని భావము. ఇట్లనుటచే విషయాంతరమునం దనుసంధానాసక్తి కలుగును.

ఇక హస్తాదుల నాట్యప్రయోజనకమయిన యభినయమును నిరూపింప వలెను. "యథా యేనాభినేయంచగదతో మేనిబోధత." హస్తాదిపాదాంతముల యభినయ మిక నిరూపింతును. ఏ యభినయము నే యవయవములచే నభినయింపవలెనో ? ఎట్లభినయింపవలెనో ప్రతిపాదింతునని భరతు డనినాడు. అట్లాతడనుట వివక్షితప్రతిపాద్య మహత్త సూచితమగును.

౫౪౮. హస్తోరః పార్శ్వజఠరకటీజంఘోరుపాదతః
లక్షణం సంప్రవక్ష్యామి వినియోగం చ తత్త్వతః

హస్తాదిపాదాంతావయవముల యభినయము నాట్యస్వరూప మునకు నిరూపకము.

| | |
|---|---|
| ౧ హస్తము | ౨ ఉరము |
| ౩ పార్శ్వము | ౪ జఠరము |
| ౫ కటి | ౬ జంఘము |
| ౭ ఊరువు | ౮ పాదము |

ఇట్టి వీని నియమమున తత్త్వార్థ మనుసంధించుచు లక్షణము వినియోగము యథాన్యాయముగ నుపపాదింపవలసి యున్నది. "వినియుజ్యతే అనేనేతి వినియోగః" "వినియుజ్యతే అస్మిన్నితి వినియోగః" అని వినియోగశబ్దార్థము రెండువిధముల నున్నది. వినియోగసాధనము వినియోగమగును. నాట్యోద్దేశమున వినియుక్తమగుట ముఖ్యము కావున నిదియు నిట సూచితము. "ఇంద్రోత్సనములో నిది. వర్షధారా నిరూపణమున నిది. "ఇట్లు సూచితమయినప్పుడు ఆ యా విశేషములందు సముచితముగా నుండదగిన వినియోగము స్పష్టమగును. తత్తన్నిరూపణార్థమై తత్తదభినయము వినియోగపదవాచ్యమగును. "చలితాంగులికముగా నిట్లొనర్పవలయును" అను విధానమున సూచితమయినప్పుడు తత్సమయమున నాచరింపదగు విశేష ముద్బోధితమగును. కర్తవ్యములందలి కరణీయములందలి ప్రకారరూపముగానుండు కార్య మితికర్తవ్యతాత్మకముగా సూచితమగును. అంగోపాంగములచే నిర్వాహ్యమగు అభినయక్రియాకలాపము ముఖ్యనాట్యసంపూర్ణతాసిద్ధిలో సహకరించును. అట్లు సహకారి కార్యక్రియాకలాపము ఇతికర్తవ్యతాత్మకము. అభినయమునకు సంబంధించిన యితికర్తవ్యత రెండువిధముల నుండును. మొదటిది లోకధర్మి. రెండవది నాట్యధర్మి.

లోకధర్మి : రెండువిధములుగా నున్నది. అనుభావము చిత్తవృత్తిసమర్పకముగా నున్నప్పుడు మొదటి లోకధర్మిని గుర్తింపవచ్చును. గర్వాత్మకమయిన చిత్తవృత్తిని సూచించుటలో లలాటప్రదేశ మోరగా నెత్తుటను అభిజ్ఞులు సూచింతురు. ఇట్టిపట్ల చేష్టాత్మకమయిన యనుభావము చిత్తవృత్తి సూచకమగుట స్పష్టము. రెండవ లోకధర్మి కేవల బాహ్యావయవరూపము. పద్మకోశముపట్టుట బాహ్యావయవసన్నివేశమాత్రముగనె యున్నప్పు డిదియె వ్యవహారము.

నాట్యధర్మియు రెండువిధములుగా నున్నది. అలౌకికశోభాహేతువుగా నొక నాట్యధర్మి యుండును. ఏకాంశమున లౌకికశోభాజనకముగా రెండవ నాట్యధర్మి యుండును.

౧. ప్రథమ మిట్లుండును. నాట్యోపయోగమున కైశికీ మూలభూతము. తత్సంపాదనమునకు సముచితముగా నీలౌకికశోభాహేతువు లగునవి కొన్ని యున్నవి. ఆవేష్టితము మొదలయిన నాలుగుకరణము లిట్టివి.

౨. ద్వితీయ మిట్టిది. ఇది యొక యంశమున లోక మనుసరించును. ఒక హస్తము నొక విధముగా నుంచగా లోకోపజీవనము గోచరించును. నిర్దేశింప వలనుపడని యొకవిషయము నిర్దేశింపదలచిన మానవుడు "అది యిట్టిదని, అది యట్టిదని, ఇట్లున్నదని" యవసరాపేక్షముగా సూచించును. చతురు లది భావించి యవసరమున ప్రయోగింతురు. జనాంతికమను సంజ్ఞకల నాటకభాషలో నిట్లె గుర్తింపవచ్చును. కాగా నీ సార మిట్లు గుర్తింపగలము. నాట్యాదర్శి యనునది నటసమయమాత్రరూపముగ నుండును. నటసమయమనునది యొక నియతమయిన శాస్త్రీయసంకేతము. అది కొంత సూచించును. అందు కొంత భావమున్నది. అకించిత్కరమయిన సమయము కల్పించుటలో నేమియు ప్రయోజనముండదు. ఇందలి సమయమునకు కొంత ప్రయోజనమున్నది.

ఇందు ముందుగా హస్తము లిరువదినాలుగు సూచితములగును. వాని నామములు సాభిప్రాయములు.

| | | |
|---|---|---|
| ౧ పతాకము | ౨ త్రిపతాకము | ౩ కర్తరీముఖము |
| ౪ అర్ధచంద్రము | ౫ అరాళము | ౬ శుకతుండము |
| ౭ ముష్టి | ౮ శిఖరము | ౯ కపిత్థము |
| ౧౦ ఖటకాముఖము | ౧౧ సూచి | ౧౨ పద్మకోశము |
| ౧౩ సర్పశిరము | ౧౪ మృగశీర్షము | ౧౫ కాంగూలకము |
| ౧౬ అలపద్మము | ౧౭ చతురము | ౧౮ భ్రమరము |
| ౧౯ హంసము | ౨౦ హంసపక్షము | ౨౧ సందంశము |
| ౨౨ ముకులము | ౨౩ ఊర్ణనాభము | ౨౪ తామ్రచూడము |

ఈ యిరువదినాలుగును అసంయుతహస్తములు. ఈ హస్తనామముల నుద్దేశించి చెప్పుటయు నుపదేశరూపము. ఇందు పతాకము మొదటనుండుట దాని ప్రాధాన్యము వ్యక్తమగును. త్రిపతాకము

కర్తరీముఖము పతాకహస్తప్రకారములె. ఈ యంశసూచనమె వీని క్రమానుపూర్విలో సంహితాకార్యముగ నున్నది. వరుసగా పఠించు టలో శబ్దగతమయిన ధ్యాన మీ యూహను కలిగించును. అంతరాళ ములో గోచరించు వాని క్రమమున గూడ ఈ శబ్దబద్ధమయిన బుద్ధి విధానబలముతోడనె భాసించును. ఇట్లె వీనినన్నిటిని గుర్తింపవలెను. హస్తసదృశమయిన హస్తాంతరమును స్వీకరించుటకై హంసపక్షము సందశము నెన్వెంటనె యున్నవి. ఇచట సందంశశబ్దము దగ్గర వేరొక సందంశపదమును కూర్చుకొని భావింపగా నొక విశిష్టార్థము గోచ రించును. కోహలు డొక హస్త మంగీకరించెను. అంగుష్ఠము మధ్య మాగ్రము సంబంధించుటగా తర్జని సంబంధించియున్నప్పు డా హస్తస్వరూపము స్పష్టము కాగలదు. శూన్యాభినయములో భాస్వరవిద్యుదాదుల యభినయ విషయమున నది వినియుక్త మగును. ఇట్లది నృత్తాచార్యప్రవాహసిద్ధముగా నున్నది. ఇట్టి హస్తముకూడ నిచట సంగతము కావచ్చును. ఇట్లె హస్తాంతర ములను గూడ నుత్ప్రేక్షింపవచ్చును. ఈదృశములన్నియు నసంయు తములు నగును. వలసినచో సంయుతకరణ మొనర్చుట నిర్దిష్టము కాగలదు. ఒక్కొకచో సంయుతకరణ ముపదిష్టము కాకపోవచ్చును. అయినను ప్రయోగయోగమున హస్తద్వయప్రయోగ ముండనే యుండును. చూడుడు! పరుడొకడు హారము హరించునప్పుడు భయ మున పరాఙ్ముఖముగా పతాకాద్వయమును అంసాదిప్రదేశములం దుంచి ప్రయోగింపవలసియున్నది. 'ఇట్లె ప్రతాపనాదులలోగూడ కలదు. ఈ రీతి నంతట నుత్ప్రేక్షింపదగును. అభినేయవిశేషములందు పతాకాదులను రెండుమూడుపర్యాయము లొకే సమయమున ప్రయోగింపవలసియున్నప్పుడు యుతత్వమున్నది. ఛేదాభినయ మొన రింపవలసియున్నప్పుడు కపిత్థహస్తమునకధఃస్థలముగా పతాకముండును. ఇట్టి రీతి యంతయు చిత్రాభినయము నందున్నది. ఇవి యన్నియు సంయుతములె యగును. కేవల మింతియె కాదు. పతాకాదుల ప్రయోగమున చూత నొకప్పుడు సంయుతత్వమున్నది.

సంయుతహస్తములు పదమూడు కలవు. వాని పేరు లీ విధమున నున్నవి.

| | | |
|---|---|---|
| ౧ అంజలి | ౨ కపోతము | ౩ కర్కటము |
| ౪ స్వస్తికము | ౫ ఖటకావర్ధమానము | ౬ ఉత్సంగము |
| ౭ నిషధము | ౮ దోలము | ౯ పుష్పపుటము |
| ౧౦ మకరము | ౧౧ గజదంతము | ౧౨ అవహిత్థము |
| ౧౩ వర్ధమానము. | | |

ఈ పదమూడును సంయుతములుగనె యుండును. సంయుతతా వ్యతిరేకముగా నివి యుండవు. అట్లున్నచో స్వార్థగమకములు కావు. ఇటుపై నృత్తహస్తములను జెప్పవలయును. ఈ యభినయహస్తములకు ఛిద్రచ్ఛాదనమునకై యేకవర్తనానుప్రవేశ మావశ్యకము. అప్పుడవి యలాతచక్రప్రతిమములై గోచరించును. అలాతము కొరివి, దానిని చక్రాకారముగా త్రిప్పునప్పుడు ఏకరూపము గోచరించును. భ్రమణవేగమున వ్యవధానము భాసింపదు. అట్లే సంయుతహస్తముల నేకవర్తనమున ప్రయోగించినచో నంతరాళవ్యవధాన ముండదు. అప్పుడు సర్వమేకవిధమున నుండి యఖండత గోచరించును. ఈ రీతిని నృత్తహస్తము లుద్బోధింపగలవు.

ఇంకను నృత్తహస్తోపదేశములో వేరొక భావమున్నది. వేరు వేరుగానున్న ఈ హస్తప్రయోగములందు మసృణవర్తనము ఉద్ధత వర్తనమను స్వరూపభేదమున్నది. ఉభయాత్మకముగా నుండు నిది ఏకవాక్యార్థవిశ్రాంతితో నుండుటను నృత్తహస్తములు ప్రఖ్యాపనము చేయఁగలవు. భిన్నభిన్నములుగా నుండు వానిలో నేకప్రవణత లేకున్నచో రమ్యత యుండదు.

మరియొక భావమున్నది. నృత్త మేదోవిధమున నిరూపితమగుటలో విశేష మేమియు నుండదు. దానిస్వాభావికమయిన స్వరూప రమ్యత స్పష్ట మొనరింపవలెను. ఈ నృత్తహస్తోపదేశమం దుపకారి.

భావాంతరముకూడ కలదు. చేటికలు నృత్త మొనరించుచున్నారని యొకచో నుండును. అప్పటి నృత్తాదివిషయమయిన "సూచాంకురము" మొదలగువానిలో నీ హస్తముల యుపయోగ మెట్లున్నదో సూచించుటయు నావశ్యకము.

ఇట్టి చతుర్భావరీతి సముద్బోధకముగా నృత్తహస్తములను నిర్దేశించుట సముచితము. ఇవి యన్నియు సంయుతాసంయుత రూపోపజీవనమున నున్నవి. కావున వీని నేకైకముగా గూడ ప్రయోగింపవచ్చును. వీని నంద రంగీకరింతురు. ఎవరయిన వీని నంగీకరింపక పోరు. ఏ యే కర్మలలో వీని కభిధేయత కలదో గుర్తించుట యావశ్యకము. యథాలక్షణము యథాకర్మ వీని నిర్దేశింపవలయును. వీని పేర్లిట్లున్నవి.

| | |
|---|---|
| ౧ చతురశ్ర | ౨ ఉద్వృత్త |
| ౩ తలముఖ | ౪ స్వస్తిక |
| ౫ విప్రకీర్ణ | ౬ అరాలఖటకాముఖ |
| ౭ ఆవిద్ధవక్ర | ౮ సూచీముఖ |
| ౯ రేచిత | ౧౦ అర్ధరేచిత |
| ౧౧ ఉత్తానవంచిత | ౧౨ పల్లవ |
| ౧౩ నితంబ | ౧౪ కేశబంధ |
| ౧౫ లతాహస్త | ౧౬ కరిహస్త |
| ౧౭ పక్షవంచితక | ౧౮ పక్షప్రద్యోతక |
| ౧౯ గరుడపక్ష | ౨౦ దండపక్ష |
| ౨౧ ఊర్ధ్వమండల | ౨౨ పార్శ్వమండల |
| ౨౩ ఉరోమండల | ౨౪ ఉరఃపార్శ్వార్ధమండల |
| ౨౫ ముష్టికస్వస్తిక | ౨౬ నలినీపద్మకోశ |
| ౨౭ ఉల్బణ | ౨౮ లలిత |
| ౨౯ వలిత | |

ఇప్పటి కిట్లు నిర్దిష్టములయిన హస్తములసంఖ్య అరువదినాలుగు "చతుష్షష్టికరాహ్యేతే". అసంయుతము లిరువదినాలుగు. సంయుతములు పదమూడు. నృత్తహస్తము లిరువదితొమ్మిది. మొత్త మివి చతుష్షష్టికి రెండధికమయినవి. అయినను నృత్తహస్తములందా రెండిటిని తగ్గించుకొని యరువదినాలుగని సంఖ్యానించుట యుక్తము కావచ్చును. యథౌచిత్య మా రెండిటిన్యూనత భావించునది. ఉద్దేశానుసారమున పతాకాదుల లక్షణవినియోగములు ప్రదర్శితము లగును.

### ౧. పతాకాహస్తము.

౨౪౯. ప్రసారితాః సమాః సర్వా యద్యంగుల్యో భవంతి హి
కుంచితశ్చ తథాంగుష్ఠః స పతాక ఇతి స్మృతః

ఇది పతాకహస్తము : పతాకాకారమున నుండు గావున నిది పతాక యయినది. ఈ హస్తమున నంగుళులన్నియు సమముగా ప్రసారితములై యుండవలెను. అంగుష్ఠము కుంచితముగా నుండవలెను. ఇట్లున్న పతాక యగునని సామాన్యార్థము. సమముగా నుండి ప్రకృతిస్థములై యుండవలెనని యర్థము. "ప్రసారితాగ్రాః" అనియు నిట పాఠమున్నది. ప్రసారితములగుట ప్రధానములుగా నుండుట. అంగుళి యంగుళి సహితమై యవిరళముగా నుండుట యావశ్యకము. పాదము కుంచితమగుట ముందు నిర్దిష్ట మగును. తల్లక్షణోపజీవనమున నంగుష్ఠ సన్నివేశ మొనరింపవలెనని భావము. ఈ హస్తము పతాకాకారమున నుండును గావున పతాకను గూడ దీననె యభినయింప వలెను. ఇట్లె యితర హస్తములందును నామనిర్వచనానుసారమున వినియోగమును ప్రదర్శింపవలెను. ఈ హస్తమునకు స్థానభేదమున స్వరూపభేదమున వినియోగవిశేషమున్నది. అది సర్వమిట ప్రస్తుతము.

౨౫౦. విష ప్రహారపాతే ప్రతాపనే నోదనే ప్రహర్షే చ
గర్వేఽప్యహమితి తద్వైజ్ఞైర్లలాటదేశోత్థితః కార్యః

౨౫౧. విషోఽగ్నివర్షధారానిరూపణే పుష్పవృష్టిపతనే చ
సంయుతకరణః కార్యః ప్రవిదరలచలితాంగులిర్హస్తః

పతాకహస్తవినియోగము వివిధరీతుల నున్నది. స్థానభేద విన్యాసమున వినియోగ భేదమున్నది. స్వరూపభేదవిన్యాసమునను వినియోగ భేదమున్నది. ఒకప్పుడు ప్రవిరలచలితాంగుళిగా నొకప్పుడు పతాకహస్తముండును. అట్లుండుటలో నేకదేశవికార మున్నది. అయినను తత్త్వప్రత్యభిజ్ఞాన ముండును. అప్పుడు పూర్వక్రియాకోటి పరక్రియాకోటి రెండును మూలసమాశ్రయణముననె యుండును గావున పతాకాత్వముండనే యున్నది. ఇట్లె యితరహస్తములందును గ్రహించునది.

ప్రహారపాతన మొనరింపవలసియున్నప్పుడు, ఇతరు డొనరించునప్పుడు పతాకవినియోగ మున్నది. ప్రతాపనమున పతాకమున్నది.

శీతశమనమునకై యగ్నిస్పర్శగ్రహణము ప్రతాపనము. రాజుల ప్రతాపమును ప్రతాపనము. శత్రుహృదయమునకు మ్లానత నాపాదించు ప్రసిద్ధవిశేషమున పతాకమున్నది. విద్ధసాలభంజికలో చంద్రుని వెన్నెలను హస్తచ్ఛత్రమున నిరోధించుట "హస్తచ్ఛత్ర నిరుద్ధమహాసః" వర్ణితమయినది. అట్టి నిరోధములోగూడ పతాకముండును. ఇట్లె నోదనములో వినియోగమున్నది. పరుడు ప్రేరణమొనరించునప్పుడు తద్వారణమునకై పతాకము. తానె యితరుని ప్రేరణమొనరించునప్పుడు పతాకముండును. ఇట్లె ప్రహర్షమున గర్వమున పతాక ప్రయోగ మావశ్యకము. ఈ నిర్దేశించిన వినియోగవిధులలో హస్తమును లలాటదేశోత్థిత మొనరింపవలెను. హస్తప్రయోగ మెఱిగిన వారు లోకప్రసిద్ధి ననుసరించి స్వయముగ నుత్ప్రేక్షించి కూర్పగలరు. నాట్యాచార్యప్రవాహమును గూడ ఇందనుసరింపవలయును. వారు సంప్రదాయమున ననేకరీతులను భద్రపఱచియుందురు. ఊర్ధ్వముగా అధోముఖముగా పార్శ్వగతముగా సమ్ముఖముగా పరాఙ్ముఖముగా ఉత్తానముగా త్ర్యశ్రముగా చంచలముగా అచంచలముగా ఇంక ననేక విధముల నాట్యప్రవాహమున్నది. దాని గుర్తింపవలెను.

ప్రహారమున హృదయలగ్నతలమై ఈషత్కంపమానముగా నుండుట, ప్రహర్షమున రోమాంచసమ్ముఖమై యుద్గతమగుట ఇందు గుర్తింపవలెను. గర్వమున నెన్నియో రీతులు కలవు. అస్మదర్థమున గల వానిని గుర్తింపవలెను. "నేను- నేనుకూడా- నాకున్నూ- నాచేగూడ- నాలోగూడ-" అనునట్టి వానిలో గర్వాగర్భమయిన ప్రయోగ ముండును. ఒక పార్శ్వమునుండి తన పార్శ్వమునకు వచ్చునప్పుడు లలాటాభిముఖముగా ఊర్ధ్వముగా పతాకహస్తముండును.

అగ్నివర్షధారానిరూపణమున పుష్పవృష్టిపతనమున పతాక హస్తమును సంయుతకరణ మొనరించి వ్రేళ్ళధికముగా కదులునట్లు చేయవలయును. కారికలోని 'ఏష' యను పదము "ఏతదర్థనిరూపణమునందు" అను నర్థము బోధించును. ఇట్టి స్థలములందు విభక్తియతంత్రము. పుష్పవృష్టి పద మప్రసిద్ధమయిన పాంసువృష్టిని రక్తవృష్టిని ఇంకను వృష్ట్యంతరములను సూచించును. హస్తములు రెండును

పతాకాకృతి నుండుటయె యిందు సంయుతకరణ మొనరించుట. లోకోచితమయిన చలనక్రియ సంయుతాసంయుతసంబంధముతో నుండును. కావున అగ్నిజ్వాలలో నూర్ధ్వగమనము, జలధారలలో నధోగమనము నుండును. పుష్పవృష్టిలో నూర్ధ్వముఖహస్తమావశ్యకము. శిరోదేశమున నధోముఖముగానున్న హస్తము క్రమముగా చలాంగులియై యధోగమనము కలదగుట యిచట సంగృహీతమగును.

ఇచట సంయుతహస్తసంబంధమున్నందున నృత్తహస్తలక్షణమగు టను స్వస్తికముకూడ సంభావింపదగి యున్నది. స్వస్తికవిచ్యుతికరణమున ననుసరించి కొన్నికొన్ని కార్యక్రియలు పతాకాహస్తసాధ్యములుగా నున్నవి. సమ్ముఖముగా నున్న పతాకాహస్తములను మణిబంధస్థానమున నుంచి బాహుపరిభ్రమణవిధానమున తన పార్శ్వమునందు విడుచుట ఒకవిధముగా స్వస్తికవిచ్యుతి. ఈ విధానముతో సరస్సులో నున్న పుష్పప్రకరమును తృణపర్ణములను, భూమియందు బలితండుల వైచిత్ర్యన్యాయమున పిచ్ఛిలముగా విరచితములయినవాని నయింపవలెను. ఇది లోకాంశోపజీవనముకల నాట్యధర్మి. స్వస్తికవిచ్యుతికరణముననె యధోముఖపతాకహస్తమున మఱికొన్నిటి నయింపవచ్చును. స్వస్తికము విచ్యుతి,విచ్యుతిపూర్వకమయిన స్వస్తికము—అను విన్యాసక్రమమున నీ క్రియ లుండును. సంవృతవివృతము దీనిచే నభినయింపవచ్చును. సగము సంవృతము సగము వివృతముగానున్న సంవృతవివృతమగును. క్రిందికిపడుచు రక్షింపదగినదానిని విచ్యుతిపూర్వకముగా వెంటనే స్వస్తికసమాచరణమున నభినయింపవలెను. అట్లె ఛన్న–నిబిడ– గోప్యములను అభినయింపదగును. నిబిడము స్పష్టముగా నుండునది. గోప్య మితరులుచూడకుండునట్లు దాచినది. ఏవంరూపమును స్వస్తికాచరణముతో సాధింపదగును. అట్లె అపాల్య మప్రచ్ఛన్నమనతినిబిడ మగోప్యమున గూడ నభినయింపవలెను.

౩౩౨, అస్యైవ చాంగులిభిస్త్వధోముఖప్రస్థితోత్థితచలాభిః
వాయూర్మివేగవేలాకోళభశ్చామశ్చ కర్తవ్యః

పతాకహస్తమున నంగుళుల నధోముఖముగ సాగినవిధమున పైకిలేచినవిధమున చలమానము లగునట్లు చేసి వాయుకంపనమును

తరంగసంచలనమును వేగక్రియను వేలాక్షోభమును జలప్రవాహమును అభినయింపవలెను.

రేచకకరణ మనుసరించిన విశేషములు కల వినియోగములును గలవు. స్వసన్నివేశమునుండి స్వస్థానమునుండి గడచిపోవు క్రియ యున్నప్పుడు రేచకకరణ మూహింపవలెను. రేచకకరణము ననుసరించి యిట్లు అభినయింపవలెను.

౫౫౩. ఉత్సాహనం బహు తథా మహాజనప్రాంశుపుష్కరప్రహతం
పక్షోత్క్షేపాభినయం రేచకకరణేన కుర్వీత
౫౫౪. పరిమృష్టతలస్థేన తు ధౌతం మృదితం ప్రమృష్టపిష్టే చ
పునరేవ శైలధారణముత్పాటనమేవ చాభినయేత్

యథాయోగముగా నితరుని ఉత్సాహపెట్టుట, ఉత్సాహమున సంప్రేరణము, ఉత్సాహజననము, మహాజనాభినయనము ఉన్నతము పుష్కరప్రహాణనము పక్షుల పక్షసముత్క్షేపాభినయము రేచకకరణమున నొనర్పవలెను. ఆ యా విధానమునకు తగినట్లుగా విరలాంగుళిప్రక్షేపమున పార్శ్వాంతరమునుండి తన పార్శ్వాగమనమున నభినయింపవలెను. ఉన్నతము నూర్ధ్వగతవిన్యాసమున, పుష్కరవిధినధఃపాతనవిన్యాసమున నభినయించుట కలదు. పక్షోత్క్షేపమును కటిక్షేత్రమెత్తుట పైకి చాలనముచేయుటలతో నభినయింపవలెను. ఆ యా విధులకు తగిన విధమున పతాక ప్రసారముండును.

అభినవోపాధ్యాయులు అభినయశబ్దమున వైచిత్ర్యమును గుఱించి యిట్లనిరి. అభి = ఆభిముఖ్యము, న = నిషేధము, య = వివక్షితార్థము. కాగా స్వపార్శ్వమున కున్ముఖమయిన దేశగమనము కాక వేరువిధమున ఆభిముఖ్యమిచ్చుట యని యస్పష్టార్థము. పార్శ్వక్షేత్రమునందు రేచనపూర్వకముగా నధోముఖోత్తాన పరివర్తనమున వివక్షితార్థము నభినయింపవలెను.

పరిమృష్టతలమునందున్న రెండవ పతాకాహస్తమున క్షాలనము మర్దనము మార్జనము పేషణము తద్విశిష్టమయిన ద్రవ్య మభినయములం దవభాసింపజేయదగును. పర్వతోద్ధారణము, శైలశిలోత్పాటనము, వరదానమభయదానము పతాకముననె యభినయింపవలెను.

ఇట్లి దశ శత సహస్రనామ సంకేతము కలవాని గూడ ప్రదర్శింప వచ్చును. పతాకవినియోగమున కివియె విషయములగుట కాదు. ఇంకనుండవచ్చును. తన బుద్ధివివేకమున కీర్తి తోడుచేసికొని యా యా యితికర్తవ్యతను భావించి ప్రయోగింపజనును. ఈ పతాక స్త్రీలకు పురుషుల కుభయులకు నభినయమున నున్నవారలకు ప్రయోగింపవచ్చును. శబ్దార్థముసర్వము ప్రయోగింపదగియుండగా విశిష్టేతి కర్తవ్యత కల యర్థమును ప్రయోగింపవలెను.

౨ త్రిపతాక

౫౫౫. పతాకే తు యదా వక్రానామికా త్వంగులిర్భవేత్
త్రిపతాకస్సవిజ్ఞేయః- కర్మ చాస్య నిబోధత

పతాకహస్తమునందున్న యనామిక వక్రముగానుండగా మిగులుబ్రేళులు పతాకలోవలెనె యున్నప్పుడు త్రిపతాకమను హస్తమగును. అంగుళిత్రయము పతాకములోవలె నుండుటచే నిది త్రిపతాక. త్రిత్వ మభినేయమగుటవలన నిది త్రిపతాక. త్రిపతాకకర్మ విశిష్టముగా నున్నది. కావుననె "కర్మచాస్యనిబోధత!" దీనికర్మ వినియోగము గుర్తింపుడని భరతుడనెను. నాటకములం దనేకవిధముల కర్మనిర్దేశములున్నవి. వానియం దీ త్రిపాతకము వినియోగము పొందును.

"ఆర్యే! ఇత స్తావత్ —అవతర త్వాయుష్మాన్-
మా కార్షీః! - యావత్ప్రవిశామి-

ఇట్టి వచనములు నాటకము లందున్నవి.

౫౫౬. అవాహన మవతరణం విసర్జనం వారణం ప్రవేశశ్చ
ఉన్నామనం ప్రణామో నిదర్శనం వివిధవచనం చ
౫౫౭. మంగల్యద్రవ్యాణాం స్పర్శః శిరసోధ సన్నివేశశ్చ
ఉష్ణీష మకుట ధారణ నాసాస్య శ్రోత్ర సంవరణం

ఈ కారికాద్వయములో నిరూపితములయిన యావాహనాదులు త్రిపతాకహస్త కర్మలు. వీనిని త్రిపతాకమున నభినయింపవలెను. "ఆర్యే, ఇతస్తావత్" ఆర్యా! ఇటుగా విచ్చేయుడు!" అను నాటక కర్మలో నావాహన మొనరించునప్పుడు త్రిపతాక ముపయుక్త

మగును. తర్జనీమధ్యమాంగుళులను పరాఙ్ముఖముగ జేసి యాకుంచన మొనరింపగా నీ యాహ్వానము గోచరించును. (౨) అవతరణము రథాదులనుండి దిగుట, "అవతర త్వాయుష్మాన్" "ఆయుష్మాన్ దిగ వచ్చును" అనుటలో రథమునుండి యవతరణము సూచించునప్పుడు పై భాగము (ఉత్తర) నుండి పార్శ్వాంతరమునకు సారించు త్రిపతాక మావశ్యకము. (౩) విసర్జనము అనాదరకృతమయిన విడుదల త్రిపతాక మధస్తలముగా నుంచి వెలి కంగుళిద్వయము విడిచినచో విసర్జనము విస్పష్టమగును. (౪) వారణము నివారణము. ఒక కార్యమునుండి మాన్పుట. "మా కార్షీః!" "ఇట్లొనరింపవలదు!" ఇట్లనుటలో ప్రాఙ్ముఖముగా నంగుళిద్వయము కదిలించుటవలన వారణకార్య వినియోగము స్పష్టమగును. (౫) ప్రవేశము ప్రవేశనము. నాటకము నందు నటుడు రంగస్థలమున "యావత్ప్రవిశామి" "ఇదిగో! ప్రవే శింతును" అనునప్పుడు త్రిపతాకమును పార్శ్వతలమునుండి తన ముందు ప్రదేశమునకు సాచవలెను. అప్పుడు తన ప్రవేశము సూచితమగును. (౬) ఉన్నామనము చిబుగడ్డమును చిబుకమును లాలనమున పైకెత్తుట. ఇందు రెండు వ్రేళులతో చిబుకలాలనము చూపవలెను. (౭) ప్రణా మము ప్రణమనము నమస్కారము. త్రిపతాకము శిరముననుంచి పార్శ్వమునజేర్చి ప్రణామము సమర్పించుటవలన నీ వినియోగము విశదము. (౮) నిదర్శనము – ఉపమానోపమేయ భావము – దీనిని కొంత విరళముగా నున్న త్రిపతాకములోని యంగుళిద్వయమున సూచించునది. (౯) వివిధవచనము. వివిధమయినవచనము విచిత్ర మయిన వచనము. ఇది యగునా? అది యగునా? ఇదియె యగునా?" అను రీతి వచనము. దీని నంగుళియముగ నమనోన్నమనములచే నభిన యించునది. వచనమనునది భాషణము నగును. తత్సూచనమునకై యుత్తానముగా (వెల్లకిల) నుంచిన త్రిపతాకమును ముఖస్థానమున కెత్తవలెను. (౧౦) మంగల్యద్రవ్యములకర్మ పూర్ణకుంభాదులు మంగళార్థములయిన ద్రవ్యములు. వాని నంగుళిద్వయ మధో ముఖముగ నుంచి యభినయింప వచ్చును. అట్లె ద్రవ్యాదుల స్పర్శము (౧౧) సన్నివేశము : సన్నివేశనము సంబంధము అనా

మికతో సంబంధింపచేసి యభినయించుట. (౧౨) ఉష్ణీషమకుట ధారణము- పాగ కిరీటము ధరించుట, తలపై సమ్ముఖముగా మండలాకారమున త్రిపతాక ముంచినచో నుష్ణీషధారణ మభినయించుట యగును. శిరమున నధోముఖముగా నూర్ధ్వదేశమునకు భ్రమించునట్లుండు హస్తము మకుటధారణము సూచించును. (౧౩) నాసాస్యశ్రోత్రసంవరణము. ముక్కు చెవి ముఖము మూయుట. దుర్వాసన వెలువడుటను సూచించుటకై నాసాపుటములను మూయుట, అనిష్టవచనానిష్టశబ్దములందు అంగుళీద్వయమున ఆచ్ఛాదన మొనరించి యభినయింపవలెను. ఈ త్రిపతాకముననె యధోముఖముగా ప్రస్థితోత్థితములై కదలు వ్రేళులతో నింకనయింపవచ్చును. ముకుటాదుల నభినయించినట్లు రాజాదుల గూడ నభినయింపవచ్చును. ఏ యే హస్తమున నేది యేది యభినయింపవలెనని యవ్యభిచరితముగ నియతముగ ననేకపర్యాయములు నిర్దిష్టమగునో దానిని ఒక్కొకచో స్పష్టముగా నిర్దేశింపకపోయినను తత్కార్మ యనియె యభినయింపవలెను. ముకుటధారణాభినయమున రేచితము కల రాజాంశము పతాకసంబంధముతో కూడి యుండుననుట స్పష్టము. అంగుళీద్వయము నిత్యాశ్లిష్టముగ నెయుండుట గుర్తించునది. త్రిపతాకన్యస్తముగనె దీని గ్రహింపవలెను. ఈ రీతులలో నన్వాచయకృతముగా నంగుల్యంతరముకూడ అధోముఖముగ నుండుటను భరతు డనుమోదించును. ప్రస్థానోత్థానములలో నధోముఖముగ రెండువ్రేళులు కదలుట యిందుండును.

౫౫౮. లఘుఖగపతనస్రోతో భుజగభ్రమరాదికా న్కుర్యాత్
అశ్రుప్రమార్జనం తిలకవిరచనం రోచనాలభనకం చ

చటకాదిపక్షుల లఘుప్రపాతమును లఘుప్రవాహమును భుజగప్రసారమును భ్రమరమక్షికాదులసంచారమును త్రిపతాకముననె యభినయింపవలెను. కటీక్షేత్రమున లఘుచాలనము చూపి ఖగపాతమును, క్రమముగా నూర్ధ్వాధోగమనమున తిర్యగ్గమనమున లఘుప్రవాహమును, అగ్రగమనమున లఘుసర్పముల నభినయింపవలెను. భ్రమరమక్షికాదులకు పక్షులన్న ప్రసిద్ధిలేదు కావున వానిని వేరుగా

చెప్పుట సంగతము. భ్రమరాద్యభినయమునందు కటీక్షేత్రనియతి లేదు. వీనిక్షేత్రము యథేష్టముండును.

అశ్రుప్రమార్జనమును త్రిపతాకక్రియ. స్వస్థానమునుండి యధోగమనమున సాగు అనామికతో కన్నీటిని జార్చుట నభినయింపవచ్చును. అనామికతో నశ్రుప్రమార్జనము లోకప్రసిద్ధము. తిలకవిరచనము వేరొకక్రియ. రోచనముతో చందనముతో తిలకము రచింతురు. వీనిని త్రిపతాకతో నభినయించునది. ఇందు క్రియాఫలములకు సమానాభినయమున్నది. ఇట్లే యితరస్థలములందును తుల్యాభినయ మూహించునది. కానని పతనమువలె పతితమును కర్తరీముఖమగుట నూహించునది. మంగల్యతిలకాదులచే రోచనాచందనముకూడ స్వీకృతమగుటను కొందరు సూచింతురు. రోచనమున నరుణరుచి లక్షితమగును. అనామికాద్వయసంఘట్టమున దాని నభినయింపవలెను. ఆలంభనమను నది శరీరస్పర్శనము. ఇందతిగౌరవమతిస్నేహాదులచే ననామికతో స్పృశించుట యుక్తము. అలకరచనమునకై స్థానాంతరనయనముకూడ రూపకములం దుపనిబద్ధమయినది. త్రిపతాకానామికచే అలకస్పర్శన మొనరించుట సముచితము. అలకస్పర్శనమె కాక అలికస్పర్శనము అలికదర్శనము కూడ ఇచట త్రిపతాకకార్యములు. అలికము లలాటము. "త్రిపతాకా నామికయా స్పర్శన మలకస్య కర్తవ్యం" అనుటలో అలికాలక దర్శనస్పర్శనముల గుర్తించుకొనవచ్చును.

గురువుల పాదాభివందనములో త్రిపతాకములను స్వస్తికములుగా నొనర్పవలెను. ఉద్వాహదర్శనమున అన్యోన్య మగ్రభాగములను సంశ్లిష్ట మొనర్పవలెను. రాజదర్శనసమయమున త్రిపతాకములను విచ్యుతములనుగా చలితములనుగా కంపమానావస్థములనుగా ఘటింపవలెను. గ్రహదర్శన సమయమున నడ్డముగా స్వస్తికసంబద్ధములనుగా నొనర్పవలెను. తపస్విదర్శనమున నూర్ధ్వపరాఙ్ముఖములుగా నుండుట యుక్తము. ద్వారదర్శనమున పరస్పరాభిముఖములుగా నుండుట యావశ్యకము. బడబాలనమున సంగ్రామమున మకరదర్శనమున త్రిపతాకములను ముఖమునఁజేర్చి యెదుట ఉత్తానాధోముఖములనుగా కూర్పవలెను. ఈ విధముగనె నాట్యమున నాట్యవిచక్షణు

లగువారు వానర- ప్లవన- తరంగ- పవన- వనితల నభినయింప వలెను. బాలేందుదర్శనమున సంముఖమునందు అంగుష్ఠమును ప్రసార మొనరించుట యుక్తము. మానవుల ప్రయాణము సూచించునపుడు త్రిపతాకము పరాఙ్ముఖముగా నుండును. ఇట్టిదియంతయు ప్రయోక్తలు సావధానముగ గుర్తింపవలెను.

3. కర్తరీముఖము.

౫౫౯. త్రిపతాకే యథా హస్తే భవేత్ పృష్ఠావలోకినీ
తర్జనీ మధ్యమాయాశ్చ తదాసా కర్తరీముఖః

త్రిపతాక హస్తమునందు తర్జని మధ్యమాంగులి పృష్ఠమును చూచునదిగా ఉన్నపుడు "కర్తరీముఖము" అను హస్తమగును. త్రిపతాకములో తర్జనీ మధ్యమాంగులులు సంశ్లిష్టములై యుండును. ఇందట్లుండవు. రెండును విడివిడిగా అసంశ్లిష్టము లగును. కర్తరి యందు ఇట్టి రూపమునె సాధింతురు. అట్లే ఇందది అభినీతమగును.

రూపకరచనలో మార్గప్రదర్శన మొనరించునపుడు "ఇత ఇతః" ఇటు ఇటు అని సూచించుట కలదు. అపుడు కర్తరీముఖమును అధోముఖముగనే యుంచి అభినయింపవలెను. చరణరచన మొనరించునపుడు కర్తరీముఖ మిట్లే యుండును. కస్తూరికాది పరిమళ రస ద్రవ్యములతో పత్రభంగాదుల నాచరింతురు. అలక్తకమున రంజన మొనరింతురు. కుంకుమాదిద్రవ్యములచే రంగమొనరింతురు. రంగరచనములో హృదయరంజనమున్నది. చతుష్కోష్ఠమునందు రంగభంగ ముండును. ఇట్లే తిలకాదిరచనమును ప్రసిద్ధము. ఇట్లు రచన రంజన రంగణములు అధోముఖ కర్తరీముఖముననే అభినయింప తగియున్నవి. తర్జనీముఖము వెనుకకు వెళ్ళిన యనంతరమె మధ్యమాపృష్ఠము చూచుట సంగతమగును. అధోగమనము పృష్ఠావలోకనము పునః పునః క్రియలై చలనము గోచరింపజేయును. ఈ సూచనమునకే "అధోముఖే నైవ" "ఏవ" కారము కలదు. ఊర్ధ్వముఖ కర్తరీముఖమున దష్టము శృంగము - వేఖము సూచింపవలెను. దష్టమనునది దంశనము. తత్సమానమగు కర్తనాదికమేని కావచ్చును. నాసికనుండి కర్ణాంతము వఱకు ఊర్ధ్వముఖముగా కర్తరీముఖమును ప్రయోగింపగా

దంశనము గోచరించును. శృంగమును హస్తద్వయసన్నివేశమున కర్తరీ ముఖము చూపి అభినయింపవలెను. లేఖమనునది పత్రకావిధానము. దాని వాచనమునందు ఊర్ధ్వముఖమె యుపకారి. ఈ యర్థమె ఈ కారికలో నిట్లు నిర్వాచిత మగుచున్నది.

౫౬౦. "పథిచరణ రచన రంజన రంగణ కరణా న్యధోముఖే నైవ
ఊర్ధ్వముఖేన తు కుర్యాత్ దష్టం శృంగం చ లేఖంచ"

ఈ హస్తము సంయుతకరణము కావచ్చును. అసంయుతమును కావచ్చును. అట్లే అభిజ్ఞులు ప్రయోగింతురు. కర్తరీముఖ హస్తము లోని అంగులీముఖమున పతన మరణ వ్యతిక్రమాదులను సూచింప వచ్చును. అంగులీరచనము ఖేదనముతో నలనముతో కూడి యుండ వలె నన్నది ఇందలి సంగతి. పతనము మరణము వ్యతిక్రమ మనెడు అపరాధము ఈ విధానమున సూచితములు కాగలవు. పరాఙ్ముఖ మయినది విపర్యస్తమగునది పరివృత్తము అను వ్యవహారమున నున్నది. అట్లే వితర్కితము నిక్షేపణము దీనిచే సూచ్యములు. ఇందలి అంగులి ముఖమునందు ఖేదన వలితములను కూర్పవలెను. మధ్యమాంగులి వెనుకకేగి తర్జనీపృష్ఠముచూచునది అగుటయు, అందుండి కదలి స్వరూపసంస్థానమున నుండుటయు ఇందలి విధానము. యథాయోగ ముగ రెండు మూడు పర్యాయములు సంఘాతముగనో విగృహీత ముగనో విపర్యస్తముగనో దీనిని ప్రయోగింపవలయును. ఈ యర్థ మంతయు నిట్లు నిరుక్త మగుచున్నది.

౫౬౧. "పతన మరణ వ్యతిక్రమ పరివృత్త వితర్కితం తథా న్యస్తం
భిన్నవలితేన కుర్యాత్ కర్తర్యాస్యాంగులిముఖేన"

సంయుతాసంయుతముగ దీనిని బట్టి రురు, చమర, మహిష విషయములందును సుర గజ వృష విషయములందును గోపుర శైల శిఖరము లందును దీని ప్రయోగింపవచ్చునని ప్రయోగవిదులు తలంచు చున్నారు. ఇట్లు వివిధవిధానములందు కర్తరీముఖము వినియోగము పొందుచున్నది.

## ౪. అర్ధచంద్రము.

అర్ధచంద్రమను దీని పేరు నామసంకేతమునసే లబ్ధస్వరూపము. సార్థకము. ప్రఖ్యాతమును. దీనిలో అంగుష్ఠము ధనువువలె వినత

మగును. మిగులు నాలుగు వ్రేళులును బొటనవ్రేలితో పాటు ధనురా కారమున వంగి యుండును. అంగులీచతుష్టయము శ్లిష్టమగుటగాని నిలచియుండుటగాని యిందు తగదు. ఈ యర్థముకల దీని లక్షణ మీ విధమున నున్నది.

౩౬౨. యస్యాంగుల్యస్తు వినతాః సహాంగుష్ఠేన చాపవత్
సోఽర్ధచంద్ర ఇతి ఖ్యాతః కరః కర్మాస్య వక్ష్యతే

అంగుష్ఠము కుంచిత మగుట, అంగుళులు ధనుర్వక్రములగుట అన్నియు సంహతములుగా నుండుట అర్ధచంద్రహస్తమని విస్పష్ట మయిన యర్థము. అన్వర్థబలమున లభించిన- భావాను- సారమున ఈ యర్ధచంద్ర హస్తకర్మ విశేషములును సవిశేషముగా నున్నవి. వాని నిటుపై నిల్లు గుర్తింపవచ్చును.

బాలతరుశశిలేఖకంబుకలశవలయములు అర్ధచంద్రమున నభిన యింప తగియున్నవి. ఊర్ధ్వము గమించు అర్ధచంద్రమున బాలతరువుల నభినయింపవచ్చును. ఉపర్యుపరి ఉత్తానముగా నున్నచో అర్ధేందు వాకృతి సిద్ధమగును. శశిలేఖయు దీని నిట్లే అభినేయము. లేఖా మాత్రమె ఇందభినేయము. పదమట్లున్నదని చంద్రార్ధభాగ మభిన యింపవలదు. తర్జనీ విన్యాసమును విశిష్టముగ నుంచినచో శశిలేఖాభి నయము సంగతమగును. విశిష్టతర్జనీరూప మనునది తర్జనివిశ్లిష్టముగా నుండుట. మధ్యమాదులతో కలియక ధనుర్వక్రముగనే తర్జని యుండగా శశిలేఖ స్ఫురించును. కంబువనునది శంఖము. దానికూడ దీననే అభినేయము చేయవచ్చును. కంబుగ్రహణము కర్కటమున వేరుగా జెప్పుదుము. దాని నిచటగ్రహింపనక్కరలేదు. కలశాభి నయము ప్రసిద్ధమే. ప్రకోష్ఠాంతరసమ్ముఖముగ నర్ధచంద్రము నుంచి నచో వలయాభినయము సంగతమగును. వలయము ముంజేతిధరిం తురు. ముంజేతిదగ్గరగా నర్ధచంద్రము కూర్పు వలయమునే గోచ రింపజేయును. ఇట్లె నిర్ఘాటనము, ఆయస్తము, మధ్యోపమ్యము, పీనము అర్ధచంద్రమున నభినయింపవచ్చును. నిర్ఘాటనమనునది బలా త్కారమున నిష్కాసన మొనరించుట. అర్ధచంద్రప్రయోగమున వెడలుగొట్టుట గ్రంధముల ప్రసిద్ధముగనే యున్నది. మెడపై చేయి

వైచి నెట్టివేయుట అర్ధచంద్రకరక్రియ. ఆయస్తమనునది అటవీఘో షణమని కొందరనుట యుక్తము కాదు. ఆయస్తము ఖేదము. పరాఙ్ముఖముగనుండి గండభ్రూవిభ్రమమున అర్ధచంద్రముంచి ఖేద మభినయింపవలెను. మధ్యౌపమ్యము మధ్యభాగమునకు తగినవిధమున ఉపాదీయమానమగు ఔపమ్యము. కాగా మధ్యగతయిన కార్శ్యమును సూచింపవలసియున్నప్పుడు అర్ధచంద్రముపట్టి మధ్యమింతగా నిట్లున్నది అని యభినయింపవలెను. అట్లె పీనరమయినను మధ్యమును అర్ధచంద్రముననె సూచింపవచ్చును. కాని రెండర్ధచంద్రముల నభినయించినగాని పీనమధ్యము భాసింపదు. "మధ్యౌపమ్యంచ పీనంచ" అను భరతోక్తిలో చకారము అర్ధచంద్రద్వయముచే సూచించును. పీనమును పానముగా భావించి పానపాత్ర లయిన చషకాదులను కొంద రిందు భావించిరి. అర్ధచంద్రపరిమితముగ చషక కంఠము పట్టి పేయము పానముచేయుట సూచింపవచ్చును.

౧౬౩. రశనా జఘన కటీనాం ఆనన తలపత్ర కుండలాదీనాం
కర్తవ్యే నారీణాం అభినయయోగేఽర్ధచంద్రేణ"

అర్ధచంద్రహస్తమునకు ఇట్లన్యవిధమయిన వినియోగమును కలదు. స్త్రీల రశనా జఘవాదులను దీనిచే నభినయింపవచ్చును. రశన కింకిణీజాలములతోకూడి స్త్రీకటిసూత్రమయిన పటుసూత్రము. జఘనము నితంబాగ్రభాగము. పార్శ్వభాగమునకు "కటి" అని పేరు. ఆననతలమున మకరికాపత్రభంగములు అర్ధచంద్రసూచ్యములు తల పత్రమనునది స్త్రీల యాభరణవిశేషములలో నొకటి. ఇది అర్ధచంద్రాకృతి నుండునని అర్ధచంద్ర వినియోగమున సంగ్రహము. పత్రమును దంతపత్రముగను భావింపవచ్చును. కేశాలంకరణసాధనమయిన "దువ్వెన" అనదగు దంతపత్రము అర్ధచంద్రాకృతి నుండుట ప్రాక్తన శిల్పచిత్రములందు గోచరమగుచునే యున్నది. నలినీదలఘేని పత్రము కావచ్చును. కర్ణాలంకారము కుండలము దీనిచే నభినేయము. నాట్యాచార్యప్రవాహప్రసిద్ధముగ వానివాని యభినయవిన్యాసములో ఆకృతి విచ్ఛిత్తి విశేషము గుర్తింపవలెను. కుండలాదిశబ్దమున మృణాళాదులును సంగ్రాహ్యములు వీని వీని యభినయయోగము యథాయోగ

ముగా ఆ యా స్థానవిన్యాసముతో ప్రదర్శింపవచ్చును. పార్శ్వద్వయ యోగమునను పార్శ్వద్వయాంతములో ఒక్కొక అధస్తలవిన్యాసమునను ఒక టొకటి కూర్చి చేర్చి యభినయింపవలెను. ఇట్టి వన్నియు సంప్రదాయపరంపరావిచ్ఛేదములేని విశిష్టవిధులలో స్పష్టముగనే గోచరించును.

### ౫. అరాళము.

౫౬౪. "అద్యా ధనుర్నతా కార్యా కుంచితోఽగుంష్ఠక స్తథా
శేషా భిన్నోర్ధ్వవలితాహ్యరాళేఽంగుళయః కరే"

అరాళలక్షణహస్త మిందున్నది. మొదటిదయిన తర్జని వ్రేలు ధనుర్నతమై యుండవలయును. మధ్యమ అనామిక కనిష్ఠ ఈ మూడు వ్రేళులను తర్జనీ పృష్ఠమున సమీపములో నుండవలయును. అంగుష్ఠము కుంచితమై యుండుట ఆవశ్యకము. మధ్యమాదిత్రయము కొంతగా వలితమై యుండుటయు అరాళహస్తమునకు స్వరూపమిచ్చును. అరాళపదము కుటిలార్థమున నున్నది. అరాళపక్ష్మ అరాళక్వంతల ఇట్టి ప్రయోగములలో అరాళశబ్దము వక్రార్థముననే యున్నది. ఈ అరాళహస్తము ననుసరించి స్థైర్యమును ఉత్సాహమును కాంతిని ధైర్యమును గగనగతమయిన గాంభీర్యమును సూచింపవచ్చును. స్వస్తి, భద్రం, పుణ్యాహం మొదలుగా గల ఆశీర్వాదములును అరాళహస్త సూచ్యములు. హితపర్యాయములయిన సుఖభావములు దీనిచే నభినేయములు.

౫౬౫. ఏతేన పునః స్త్రీణాం కేశానాం సంగ్రహస్తథోత్కృష్టః
సర్వాంగికం తథైవ చ నిర్వర్ణనమాత్మనః కార్యమ్"

౫౬౬. కౌతుకవివాహయోగః ప్రదక్షిణేనైవ సంప్రయోగం చ
అంగుల్యగ్ర స్వస్తిక యోగాత్పరిమండలేనైవ

౫౬౭. త్రిపతాకహస్తజాని తు పూర్వం యాన్యభిహితాని కర్మాణి
తాని త్వరాలయోగాత్ స్త్రీభిః సమ్యక్ప్రయోజ్యాని"

ఇంక నిట్టి వినియోగమున్నది. ఈ అరాళహస్తమును హృదయమున పార్శ్వమున అగ్రభాగమున కూర్చుటతో కొన్ని వినియోగములను సాధింపవచ్చును. ఒక్కొకచో స్థైర్యముతో చాంచలముతో భ్రమణ

ముతో ఆగమముతో యథాయోగము ప్రయోగము చూచునది ఈ యంశములందు ఇట్లరాళమున అభినేయము గుర్తించునది. స్త్రీల కేశ సంగ్రహము దీని కర్మ. సంగ్రహము బంధనము. కేశపాశరచనములో చిత్రవిన్యాసమున కేశముల ముడివేయుటలో నిది యుండును. అంతియే కాక కేశములను కీర్ణవికీర్ణములుగా నొనర్చుటకును ఇది యావశ్యకము. పద్యమున పునః పదమున్నది. దాని యర్థ మిట్లున్నది. రెండు మూడు పర్యాయములు అంతరాళమున నరాళము పట్టి గమన భ్రమణాదు లొనరింపవలెను. సర్వాంగ నిర్వర్ణనము కలుగు విధమున అరాళము పట్టవలెను. ఒక పార్శ్వమునుండి పార్శ్వాంతరమునకు అరాళము కూర్చుట, ద్వితీయ పార్శ్వమునుండి స్వ పార్శ్వమునకై అరాళము చేర్చుట ఇందావశ్యకము. కౌతుకయోగము అరాళహస్తమున ప్రయోజ్యము. కౌతుకమనునది వివాహమునకు పూర్వము జరుగు వధూవరుల యాచారము. అది యంతర్వివాహముగా ప్రసిద్ధము. అగ్ని సాక్షిగా నుండునపుడు జరుగునది వివాహము. వివాహయోగ మును అరాళకర్మ. రెండుచేతులనున్న అంగుల్యగ్రములను స్వస్తికా కారమున కూర్చి ప్రదక్షిణదిశానుసారమున పరిమండలముతో దీనిని కూర్చునది. ప్రదక్షిణదిక్క్రముగనే అరాళ భ్రమణము చూపి కౌతుకవివాహయోగము నభినయింపవలెను. సంప్రయోగ శబ్దమున చెప్పదగిన సంశ్లేషము వ్రేళులయగ్రభాగమునకు స్వస్తికయోగముననే గుర్తింపవచ్చును. ఇట్లే దేవతావిషయమయిన ప్రదక్షిణము, వర్తులాకారమయిన పరిమండలము జనసమూహము భూతలమున రచించిన పుష్పప్రకరాది నిరచనమును ఇట్లే యభినయింప వలెను. పార్శ్వాంతరమునుండి స్వపార్శ్వమునకు పట్టిన పరిమండలాకృతి అరాళమున నభినయింపవలెను. ఆహ్వాన మొనరించునపుడు అంగుళు లను జార్చియు, నివారణ మొనరించునపుడు వెలికి వ్రేళులను వ్రేలా ర్చియు అభినయింపవలెను. నిశ్శేషముగా పరిచ్ఛేదము వర్తనము సూచింపవలసియుండగా అరాళ ముపకారము. తృణాదులను పెక లించుటగాని, క్రొత్తసృష్టి చూపుటగాని దీననే సాధ్యము. సంబంధము లేని మాటలను పలుకుటలో వెలికి అంగులివిక్షేప మొనరించి అరాళము

ప్రయోగింపవలెను. గంధాఘ్రాణములో, శుభసన్నివేశములో నిది యుపకారి. త్రిపతాకహస్తకర్మలుగా పూర్వము చెప్పిన పానిని ఈ అరాళహస్తయోగనము స్త్రీలు చక్కగా ప్రయోగింపతగును. ఆవాహనము, అవతరణము, మొదలయిన యభినేయములు "ప్రయోగాంగ యుక్తి ననుసరించి సంపత్తి సరిచూచుకొని స్త్రీలు ప్రయోగింప వలెను" అనుట త్రిపతాక స్థానమున పురుషున కరాళము తగదని సూచించినట్లయినది. స్త్రీలకు త్రిపతాక మిందు నిషిద్ధము కాదు. త్రిపతాకకర్మలను స్త్రీలు అరాళము పట్టి ప్రయోగించినచో రమ్యముగా నుండును.

## ౬. శుకతుండము.

౧౬౮. "అరాళస్య యదా వక్రా అనామికా త్వంగుళిర్భవేత్
శుకతుండస్తు న కరః కర్మ చాస్య నిబోధత"
౧౬౯. ఏతేన త్వభినేయం నాహం న త్వం న కృత్యమితి చార్థే
ఆవాహనే విసర్గే ధిగితి వచనే చ సావజ్ఞమ్

ఈ కారికాద్వయములో శుకతుండ లక్షణకర్మ లున్నవి. ఈ శుకతుండము అరాళహస్తసాపేక్షమై కనబడును. కొన్నిటిలో పూర్వాపూర్వము ఉత్తరోత్తరమున రూప మిచ్చుట కలదు. కొన్నిటిలో అట్టిది యుండకపోవచ్చును. అరాళములోకన్న దీనిలో కొంత విశేష మున్నది. అరాళములోని అనామికాంగుళి వక్రముగానున్నచో శుక తుండహస్తమగును. కేవల మనామికయే వక్రముగా నుండుట కాక తర్జనికూడ వక్రముగా నుండుట ఇందావశ్యకము. లక్షణవచనములో "శుకతుండస్తు" లో నున్న "తు" కారము అప్యర్థమున ప్రవర్తించి తర్జనికి కూడ వక్రిమను చెప్పుచున్నది. ఈ శుకతుండ కర్మ రెండవ కారికలో నున్నది. శుకతుండకరమును బట్టి నాహం, నత్వం, నకృత్యం, నేను కాదు, నీవు కావు, ఇది కాదు, ఇట్టి నిషేధార్థము అభినయింప వలెను. ఎల్లపుడు నిషేధమె దీని పని కాదు. అర్థమునకూడ ఇది వినియోగము పొందును. అర్థమనునది అర్థనము. యాచనమని అర్థము. ఒక రొకటి యాచించునపుడు కలుగు ఈర్ష్యా ప్రణయ కలహాదులలో శుకతుండాభినయ మున్నది. ఆవాహనములో విసర్గములో అవజ్ఞ కూడి

యున్నప్పుడు శుకతుండ ప్రయోగముండును. అవజ్ఞాసహితములయిన ఆవాహనవిసర్గములలో అయిదు వ్రేళులను విదలించి క్షేపమొనర్చుటయె ప్రయోగయుక్తి ననుసరించి రెండుమూడుపర్యాయము లొనరించుటయు యిందున్నది. "ధిక్" అను పదములో నిందార్థముతో ననుపాదేయమును సూచించునపుడు శుకతుండాభినయముండును. "బాలవధపాతకదూషితుడు వానితో నేమిలే" అను సావజ్ఞవచనములో నిది యుపయోగించును.

## ౭. ముష్టి.

౩౭౦. "అంగుల్యో యస్య హస్తస్య తలమధ్యేఽగ్రసంస్థితాః
తాసాముపరిచాంగుష్ఠః స ముష్టిరితి సంజ్ఞితః"

కరతలమధ్యమునందు హస్తాంగుళులు నాలుగును బాగుగా కూడుకొని యున్నచో వానిపై అంగుష్ఠముండగా "ముష్టి" యనెడు హస్తమయినది. చేతివ్రేళులు తలమధ్యముననే సంహతములు కావలెను. కాని అంగుష్ఠమూలమున చేరుటకాదు. ఈ యర్థముననే "తలమధ్యే" అని స్పష్టముగా నున్నది. అగ్రసంస్థితము లనుట వ్రేళుల చివరి భాగములు గట్టిగా కూడుకొని గోపనముతో నుండవలెను. వీనిపైనుండు అంగుష్ఠము మధ్యమాంగులిదేశమును గట్టిగా నొక్కిపట్టునది కావలెను. ఇది "ముష్టి" సంజ్ఞితమని లోకమున ప్రసిద్ధము.

౩౭౧. "పిష ప్రహారే వ్యాయామే నిర్గమే పీడనే తథా
సంవాహనేఽసియష్టీనాం దండకుంతగ్రహే తథా"

ముష్టివినియోగము దీనిలో నున్నది. ప్రహారాదులలో నిది వినియోగము పొందును. యుద్ధమునందు ప్రతిమల్లుని ప్రకోష్ఠము పట్టుటలో నిది యావశ్యకము. ఖడ్గయుద్ధమున నపేక్షితము. కేవలమసియష్టియే లక్షణమున సూచితమయినను ఛురికాయుద్ధముకూడ గ్రాహ్యము. దండకుంతములను పట్టి యుద్ధమొనరించుటలోకూడ ముష్టిపట్టు కలదు. లక్షణములోని పీడనపదము పాలు పితుకునపుడు పశువుల స్తనగ్రహణమునందును ప్రసిద్ధము. సంవాహనము మృత్పీడనము ఉండ లొనరించుటకై పాకముపట్టిన మన్ను గట్టిగా పిసుకునపుడు ఈ ముష్టి యుపకారి. ఇందు సూచితము లయినవేకాకసంవాహన వారణ మార్జనములలో గూడ ముష్టిప్రయోగమున్నది.

## ౮ శిఖరహస్తము

౩౭౨. "అస్యైవ చ యదా ముష్టేః ఊర్ధ్వోఽంగుష్ఠః ప్రయుజ్యతే
హస్తః స శిఖరో నామ తదా జ్ఞేయః ప్రయోక్తృభిః
౩౭౩. రశ్మికుశాంకుశధనుషాం తోమరశక్తిప్రమోక్షణే చైవ
అధరోష్ఠపాదరంజన మలకస్యోత్క్షేపణే చైవ

ఇందు శిఖరలక్షణ మున్నది. ముష్టి యను నీ హస్తమున కూర్ధ్వముగా నంగుష్ఠము ప్రయోగించినచో నది శిఖరమను హస్తమగును. రశ్మి=ప్రగ్రహము కుశలు అంకుశము ధనువుల గ్రహించుటలో తోమరమోక్షణమున శక్తివిమోక్షణమున దీని ననుసరింపవలెను. అధరోష్ఠరంజనమున పాదరంజనమున నిది యపేక్షితము. అలకల యుత్క్షేపణమున నుపకారి. ప్రయోగానుసారమున గండతలము నుండి పైభాగమున కలకల నెత్తుటలో నీ హస్తమున్నది. అలకల కుటిలీకరణమున కిది కావలెను. ముష్టినిరూపణాధికారమునందును ముష్టిపదము గ్రహించుటయాయా కర్మలలో దృఢపీడనాదిక మావశ్యకముగ ప్రయోగవిదులు గుర్తింతురని సూచించుటకు గావలెను.

## ౯. కపిత్థము.

౩౭౪. అస్యైవ శిఖరాఖ్యస్య ద్వ్యంగుష్ఠక నిపీడితా
యదా ప్రదేశినీ వక్రా స కపిత్థస్తదా స్మృతః

కపిత్థనామోల్లేఖము పూర్వములందు వలె సప్రయోజనము. శిఖరహస్తమున నంగుష్ఠము తర్జని యను రెండు వ్రేళుల నిపీడనమున ప్రదేశిని వక్రమై యుండునేని కపిత్థహస్తమగును. కపిత్థాకారమున నిందు వ్రేళులుండును. ఈ హస్తమున ఖడ్గచాపచక్రతోమరాదులను కుంతగదాశక్తివజ్రవర్గముల నభినయింప జనును. సుకృతసత్యసూచకముగా ఛోటికాప్రయోగమును దీనిచే సంగత మగును.

## ౧౦. ఖటకాముఖము.

౩౭౫. ఉత్క్షిప్తవక్రా తు యదానామికా సకనీయసీ
అస్యైవ తు కపిత్థస్య తదాసౌ ఖటకాముఖః

ఇందనామిక వ్రేలుత్క్షిప్తమై కనీయసి సహితముగా వక్రముగా నుండును. కపిత్థహస్తమిూవిశేషమున నుండగా ఖటకాముఖమగును.

కపిత్థనామోచ్చారణమున నందలి శరాకర్షణకార్యసత్యపథ్యాదులలో దీని ప్రయోగవినియోగ మభ్యూహింపవచ్చును. లక్షణవచనము లుండుటచే నొకటి విశేషమును వేరొకటి యవధారణమును నిరూపించునని గుర్తించునది. దీని వినియోగవిధిరూపము లీవిధముగ నున్నవి. ఆయా విధివినియోగములలో ననామికాకనిష్ఠికలకు కొంతగా విరలత్వ ముండును. ఎడముండును. 'సకనీయసీ' యనుచోట సహయోగమున విశ్లేషశంక తగదు. 'ఖట కాంక్షాయాం' అను ధాతువు కలదు. ఈ ప్రవృత్తిపాసార్థులం దది వర్తించును. ఖటకుని యాముఖమున నిది నిరూపిత మగును కావున ఖటకాముఖ మగును. హోత్రహవ్యఛత్రము లందు ఖటకాముఖ ముపయోగించును. యాగోపకరణమయిన స్రుగాదికమునకు హోత్రమని పేరు. హోత్రసముత్థానమున నిది యుండును. ఆజ్యాదిహవిస్సుల యాముఖమున నున్నది. ఛత్రగ్రహణమున నుపకారి. గతిశోధమునకై వల్గాదిప్రగ్రహముల యాకర్షణమున నుపకరించును. తాలవృంతాదివ్యజనకాకర్షణమున సహకారి. సమ్ముఖమున నాదర్శధారణ మొనరించుటలో నుపయుక్తమగును. తాలవృంతాదిఖండనమందు వ్యజనవ్యాపారమునందు కుంకుమపేషణమున మృగమదాదులను హస్తద్వయమున విభాగించుటలో ఖటకాముఖ మపేక్షితము. పరివృత్తపాదస్థితికి తగిన దీర్ఘవృత్తచక్రక్రమణములో ఆయతదండకాష్ఠాదిగ్రహణములో నుపయోగియగును. దీనిచే ముక్తాప్రాలంబసంగ్రహము స్రగ్దామపుష్పమాలాగ్రహణము వస్త్రాలంబన మొనరింపవచ్చును. మంథనావకర్షణము శరావకర్షణము పుష్పాపచయము ప్రహ్లాదకార్యము అంకుశాకర్షణము రజ్జ్వాకర్షణము స్త్రీదర్శనము ఖటకాముఖకార్యములు. వస్త్రాకర్షణము వివాహమున నున్నది. స్త్రీల ప్రణయకోపసమయ ప్రయాణకాలమున నుండును. కేలివశమున కేశాకర్షణమున గూడ ఈ హస్తమె. ఉత్తరీయాలంబనమున స్త్రీ ప్రదర్శనము నందును ఖటకాముఖ మావశ్యకము. ఇట్లనేకరమ్య ప్రధానకార్యములందిది వ్యాపృతమై యున్నది.

### ౧౧. సూచీముఖము

౫౬౬. ఖటకాఖ్యే యదా హస్తే తర్జనీ సంప్రసారితా
హస్తస్సూచీముఖో నామ తదా జ్ఞేయః ప్రయోక్తృభిః

౬౭౭. అన్య వివిధాన్ప్రయోగాన్వక్ష్యామి సమాసతః ప్రదేశిన్యాః
ఊర్ధ్వనత లోలకమ్పిత విజృంభితో ద్వాహితచలాయాః

ఈ సూచీముఖము యొక్క ముఖము సూచ్యాకారముగ నుండును. నిరూపితఖటకాముఖహస్తమునందు తర్జని ప్రసారితమై యున్నచో సూచీముఖమను హస్తమగునని ప్రయోక్తలు గుర్తించునది. సూచీముఖమునకు సంబంధించిన ప్రదేశిని యంగుళి యొక్క వివిధములగు ప్రయోగము లనేకములు కలవు. వాని నన్నిటి సంఖ్యానించుట శక్యము కాదు. సంక్షేపముగా గొన్నిటిమాత్ర మిందు నిరూపింతుము. నిరూపితానుసారమున ననిరూపితములను ప్రయోక్తలు గుర్తింపగలరు. ఈ హస్తమునందలి ప్రదేశిని యూర్ధ్వభాగమున నతము=వంగినదిగానుండును. నతాధోముఖముగానుండునని భావము. పార్శ్వాంతరమునకు ప్రసరించునదై లోలముగా నుండును. అచటనే కంపితముగ నుండును. అచట స్పందమానత యుక్తము. విజృంభిత మగును. కుంచితము ప్రసారితము నగును. ఉద్వాహిత మూర్ధ్వము గమనమొనరించునదిగా నుండును. అభినయమునకై చలమానమై యుండును. చక్రతటిత్పతాకాదులు దీనిచే నిర్దేశ్యములగును. చక్రమనుట కర్మోపకరణమయిన యాయుధము. రథాంగము. బండిచక్రము. రాష్ట్రజనమును చక్రము. చక్రాభినయమునం దూర్ధ్వముఖమై పార్శ్వగతమై పార్శ్వాంతరమున భ్రమించునదై యంగులి యుండు నట్లొనరింపవలెను. విద్యుదభినయమునం దూర్ధ్వముఖమై గతాగతము లొనరింపవలెను. ఇట్లె యితరములందును యథోచితముగ గ్రహింపవలెను. మంజరి లత తత్సూచనమున నిది యుపకారి. కర్ణపూరమను కర్ణచూలికాసూచనము యుక్తము. కుటిలగతులు కల మీనాదులు నిర్దేశ్యములు. భద్రం! శోభనం!అను సాధువాదములు నిర్దేశ్యములు. బాలసర్పములు బలియువధూమదీపము వల్లీలతాశిఖండములు దీనిచే సూచనీయములగును. కుటిలగతిపదమునసె బాలసర్పములును సూచితములగును గాని మీనములకన్న గతివైలక్షణ్యముండునుగావున వేరుగాచెప్పుట యుక్తము. వల్లీలతామంజరీవిశేషము లన్నియు నేకరూపములయినను అవాంతరభేద ముత్ప్రేక్షింపవలెను. అలాబుప్రభృతు

లకు వల్లి యని, ద్రాక్షాప్రభృతులకు లత యని, చూతాదులకు మంజరి యని సంకేతము గుర్తింపదగును. కుమారకుల కాకపక్షములకు శిఖండములని పేరు. వాని సూచనమును దీనిచే నగును. పాతమను పరి పతనము వక్రత్వము వర్తులత్వముల నూర్ధ్వాలోలితాంగులిచే నిర్దేశింప దగును. ఊర్ధ్వాలోలితత్వము ప్రయోగవృత్తి ననుసరించి వైచిత్ర్యమున విభజింపవలెను. నక్షత్రములు నాసిక యేకత్వసంఖ్య యితరుని తర్జనము చేయుట యనెడు దండము లగుడమనెడు యష్టి దీనిచే సూచనీయ ములు. నక్షత్రసూచనమున తర్జని యూర్ధ్వముగ నుండుట యావశ్య కము. దంష్ట్రిలను కోరలు గల రాక్షసుల నభినయించునపుడు, దంష్ట్రిలు కలవారను ప్రసిద్ధి లేకున్న నట్టి రాక్షసు నభినయించు నప్పుడు ప్రదేశిని వంగినదై యాస్యయోగము కలదగుట యుక్తము. "ఆస్యే యోగో భాగః ఆస్యయోగః" ఆస్యము నందలి భాగమాస్య యోగము. ఇది సృక్కను చెలివల కన్న విలక్షణము. అంగులి తద్భాగసంబద్ధము కావలెను. దంష్ట్రాకారముగా సమ్ముఖతలమున నంగులి యోజన మొనరింపవలెను. మండలగతమయిన యంగులీ విశేషమున నూర్ధ్వాధోముఖముగా ప్రసరించిన యంగులీవిశేషమున ప్రత్యక్షముగ గోచరించు లోకమును నప్రత్యక్షమయినను స్మర్యమాణ మగు లోకము సర్వమును గ్రహింపదగును. ఇదుగో! యని పురోనిర్దేశమున అదుగో! యని కర్ణక్షేత్రమునందు పరావృత్తి నిర్దేశమున సూచింపవలెను. లోకమునుండి స్మరణాత్మకమయిన యభినయ మనుసరింప దగును. ఈ ప్రదేశిని యొకప్పు డున్నతమై ఒకప్పు డూర్ధ్వము ప్రసరించునదై యుండును. దివససూచనమున విపరీతముగా నధస్తలప్రణత మగుటయు వేరొకట ప్రోత్తానతలోన్నత మగుటయు గలదు. ఉదయాస్తమయములను సూచించునప్పుడు సంయుతకరణముగా పరస్పరశ్లిష్టమై పార్శ్వమునుండి పార్శ్వ సంవరణము కలది యగును. కావున వాక్యనిరూపణావసరమున మరల మరల పలుకుటలో కుంచితవిజృంభితమై యంగులి యుండును. మొదట కుంచితమై పిమ్మట విజృంభిత మగును. ప్రసారితమగును. సమ్ముఖము నని కార్యవిచారణ మొనర్చుటలో నంగులి యుత్సారితముగా నభినీత

మగును. ఇతరులు వాక్యము నిరూపించు సందర్భమున నాసక్తిగా వినుటలో వక్రమగుటయు, వలదని పలుకుమని యనుటలో ప్రసారిత ముత్కంపిత ముత్తానమగుటయు కలదు. కుంతల కుండలాంగద గండాశ్రయసంశ్రయ మయిన యభినయమున రోషదర్శనమున స్వేద రూపణమునను ప్రదేశిని ప్రకమ్పిత మొనర్పవలెను. రోషస్వేదసమయ ములందు లలాటపట్టమున స్వేదమపహరించునదై ప్రసాంతముగనుండ వలెను. కేశసంస్కారాభినయమునందు గండాశ్రయ పత్రభంగాది రచనమునందు నా క్షేత్రమున నంగులి ప్రసరించును. నేనిట్టివాడ నన్న యహంకారాభినయమున లలాటగతత్వమును, ప్రత్యక్షముగా నున్న శత్రువు నిర్దేశించుటలో నగ్రనతముగా నుండుటయు, పరోక్షముగా నున్న శత్రువు ననుసంధానించుటలో రణపూర్వసంరంభవిశేషరూప మున నంగులి నిరూపింపదగును. సంరంభపూర్వమయిన పూర్వకృత క్రోధమునందు "ఇది యేమి?" యను నిర్దేశమునందు కర్ణకండూయన మందును నీ యంగులి కార్యమున్నది. "సంయుక్తా సంయోగే విశ్లేషితా వియోగే తు" అను నియమమున, సంయోగాభినయమున సంయుక్తమై వియోగాభినయమున వియుక్తమై యుండుట యుక్తము. కలహమునందు స్వస్తికయుక్తమై బంధమునందు పరస్పరోత్పీడితమై యుండును. దివానిశావసానములను అభిముఖపరాఙ్ముఖముగా విశ్లిష్ట ముగా నుండు హస్తములచే ప్రయోగింపవలెను. వామభాగము సోము నకు దక్షిణభాగము సూర్యునకు నియతము. అగ్రభాగము దక్షిణ పార్శ్వము ప్రసరించుటలతో నిశావసానము సూచింపదగును. ఏకతాల మాత్రాంతరముగా విశ్లిష్టములగుట వివక్షితము. సంపూర్ణచంద్రమండ లమును పరిమండలభ్రమణమున నిర్దేశింపవలెను. హరనయనప్రయోగ మును లలాటవిన్యాసమున చూపవలెను. హరమహాదేవుని తృతీయ నయన ప్రదర్శనాభినయనమున ప్రదేశిని యంగులిని లలాటమున కూర్పవలెను. ఇట్లే శక్రాభినయన ప్రసంగమున లలాటమునందె యుత్తానముగా తిరశ్చీనముగా నంగులికూర్పవలెను. అంగులీ విన్యాసమె ప్రధానము. లోకమున కొందరు మహేశ్వరశక్రాభినయ ఖటకాముఖమధ్యమాప్రయోగమున సూచించుట యలాక్షణికమనియె

భావింపవలెను. "హారనయనే చ లలాటే శక్రస్య చ తిర్యగుత్తానా" యను వచనసంభావన మావశ్యకము. లలాటపట్టశిష్టమై యధో ముఖమై శంభునిరూపణమును ఉత్తానమై తిర్యక్స్థితమై శక్రాభినయ మును కొందరు సూచించుటలో గూడ సూచీముఖమునందలి ప్రదేశి నియె యుపయోగించుట నభ్యూహింపవలెను. ఇట్లు సూచీముఖము బహుప్రచరాభినయములలో సంగతప్రచలితమై యున్నది. ఖటకాముఖసూచీముఖములకు గల ప్రాధాన్య మితరముల విశిష్టత నపహరింపదు.

## ౧౨. పద్మకోశము.

౫౭౮. యత్రాంగుల్యస్తువిరలాఃసహాంగుష్ఠేనకుంచితాః
ఊర్ధ్వాహ్యసంగతాగ్రాశ్చసభవేత్పద్మ కోశకః

వ్రేళులు విరలముగా నుండి యంగుష్ఠములో కుంచితములై యసంగతాగ్రభాగముగా నూర్ధ్వముగా నుండునేని యది పద్మకోశక మను హస్తమగును. "పద్మస్యేవకోశోఽభ్యంతరం వినతం యస్య" పద్మమునకువలె నభ్యంతరకోశము వినతముగా నుండుటచే నిది పద్మకోశ మనదగి యున్నది. బిల్వకపిత్థఫలముల గ్రహణము నారీకుచ దర్శనము పద్మకోశస్వరూపము. "గృహ్యాతేఽనేనేతిగ్రహణ మభి నయః- కుచౌ దృశ్యతేఅనేనేతికుచదర్శనం పద్మకోశః" గ్రహణ మనుట యభినయమని యర్థము. ఈ హస్తమున నారీకుచము లోచన గోచరమగును గావున కుచదర్శనము పద్మకోశము. బింబకపిత్థఫల గ్రహణమున నంగులు లగ్రపర్వమున నతికుంచితము లగును. ఈ పద్మ కోశమున బహుజాతి బీజపూరకమును మాంసఖండమును ప్రయోగింప వచ్చును. క్రవ్యాదుల యామిషలాభమున నామిషగ్రహణమున పద్మకోశమే నిర్దేశ్యము. "లభిరత్రగ్రహణే" ఆమిషము లభింపగా తద్గ్రహణమున నిది నిర్దేశ్యమని కొందరి భావము. దేవార్చన బలిహరణమున (బలిదానమున) వైచిత్ర్యప్రాపణమున సముద్గక ప్రదర్శనమున, గవాదుల కగ్రపిండదానమున, భోజనమున కన్నపు ముద్ద పెట్టునపుడు, మృతున కన్నపిండ మర్పించునప్పుడు, దేవోత్సవా దిసమయములలో నన్నబలి నందించునపుడు నాందీముఖశ్రాద్ధాదుల లోని బలహరణమున యజ్ఞసూత్రము నపసవ్యముగా మార్చవలసిన

యవసరము లేనప్పుడు పర్యగ్రపిండదానమున పద్మకోశము ప్రయోగింపవలెను. పుష్పప్రకరప్రయోగమున పద్మకోశమును ద్విత్రివికీర్ణాగ్రముగా నుండునట్లొనర్పవలెను. వికసిత కమలోత్పలాభినయ మొనరింపవలసియున్నప్పుడు మణిబంధనమునందు విశ్లిష్టములు ప్రవిరళములు చలితములు నయిన యంగులు లుండునట్లు కరముల వివర్తన మొనరింపవలసియుండును.

### ౧౩. సర్పశిరసము.

౫౪౯. అంగుల్యస్సంహతాస్సర్వాః సహాంగుష్ఠేనయస్యచ
తథానిమ్నతలశ్చైవ సతుసర్పశిరాఃకరః

అంగుష్ఠముతో కూడ సర్వాంగులులు సంహతములు శ్లిష్టములయినచో నభిముఖమయిన హస్తమధ్యతలము నిమ్నమై యున్నచో సర్పశిరసము సర్పశీర్షమను హస్తమగును. సర్వాంగుళులు సంహతములై యుండుటచే సర్పశిరస్తుల్యముగానుండుటచే నీ నామము సంగతమగును; సలిలప్రదానమున దీని వినియోగము కలదు. దేవతలకు జలతర్పణమిచ్చుటలో నిది యుపయోగించును. దానప్రతిగ్రహమునకై సలిలమిచ్చునప్పుడు గ్రహించువాని యభినయమున నిది యున్నది. సర్పగతి నభినయించునప్పు డధోముఖముగా నీ హస్త ముంచవలెను. తోయోపసేచనరూపమయిన కుంకుమచందనాది సేచనక్రియలో నిది యుండును. మల్లయుద్ధమున నూరువాహోద్వాస్ఫోటనమున నీ హస్త ప్రయోగమున్నది. ఇట్లే కరికుంభాస్ఫాలనాదులందును దీని నాయోజన మొనర్పవలెను.

### ౧౪. మృగశీర్షకము.

౫౫౦. అధోముఖీనాం సర్వాసామంగులీనాం సమాగమః
కనిష్ఠాంగుష్ఠకావూర్ధ్వౌ సభవేన్మృగశీర్షకః

కనిష్ఠికాంగులి యంగుష్ఠమూర్ధ్వముగా నుండుటయు మిగిలిన సర్వాంగులు లధోముఖములై యుండుటయు మృగశీర్షహస్తలక్షణము. మృగమునకు వలె శృంగములు శిరస్థములై యుండుటచే నీ పేరు సంగతము. ఇది యిచట కలదని ప్రత్యక్షాధికరణ నిర్దేశ మొనర్చుటలో, ఇది యిప్పుడని వర్తమానకాల నిర్దేశమొనర్చుటలో, ఇది

యున్నదని యభ్యుపగ మాభినయములో, ఇది యుండునన్న సంభవాభి నయమునందును మృగశీర్షకమునకు వినియోగ మున్నది. ఇప్పుడిది యనుటలో మృగశీర్ష ముపకారి. వర్తమానకాల నిర్దేశమున నిది గతార్థమయినను సాభినయసూచీముఖమున బాధ కలుగకుండుటకై యిది యిట్లుపాత్తము. ఇంతవరకీ మృగశీర్ష మిట్లధోముఖము. శక్తి సముల్లాసనమునం దక్షపాతమునం దూర్ధ్వముగా నుండవలెను. గండాదు లందలి స్వేదమార్జనాభినయమున నభిముఖతలమున నూర్ధ్వముఖ మగును. హర్షవశమున గలుగు దుఃఖోపచారమున స్త్రీల చేష్టాలం కారమగు కుట్టమితమున్నది. ఆ కుట్టమితమున నభిముఖతలమై బాహ్యవికీర్ణాంగులియై పరిచలితరూపమున హస్తప్రయోగ ముండును.

౧౫. కాంగులము.

౫౮౧. త్రేతాగ్నిసంస్థితామధ్యా తర్జన్యంగుష్ఠకాయదా
కాంగులేఽనామికా వక్రాతథాచోర్ధ్వాకనీయసీ

మధ్యమ తర్జని యంగుష్ఠమను మూడు వ్రేళులు ఆహవనీయ గార్హపత్య దక్షిణాగ్నులను త్రేతాగ్నుల వలె సంస్థానము కలవయి నచో కాంగులహస్త మగును. ఇందు మధ్యాతర్జనులు విరలములై యుండగా నగ్రగమయిన యంగుష్ఠము శ్లిష్టముగ నుండును. అనామిక వక్రమై యుండును. కనీయసి యూర్ధ్వముగ నుండును. కంగువన ప్రియంగువు. దాని నాకర్షించునది కాంగులము. కంగూచ్చయనమందు హస్తముండురీతి యిందుండును. కాంగులము వృశ్చికమని కొందరనిరి. ఈ కాంగులమున తరుణఫలరూపణ మొనరింపదగును. లఘురూప ముగా నుండు ముక్తాఫలము బదరము మొదలగు పరిమితఫలములను మృత్పిండగ్రాసరూపములను కాంగులహస్తముచే ప్రదర్శింపదగును. అంగుష్ఠము తర్జనీమధ్యమాంగులుల సన్నిధిలో ఘటపరిమాణసూచక ముగా విన్యస్తమగును. రోషజన్యములయిన స్త్రీవచనములను హస్తాంగులిక్షేపములతో ప్రదర్శింపదగును. దీనిచే మరకతవైదూ ర్యాది ప్రదర్శన మొనరింపవచ్చును. పుష్పముల ప్రదర్శన మొనరింప దగును. బిడాలపదమును గ్రాహ్యమగును, ఇట్లు దీని వినియోగము గురించునది.

## ౧౬. అలపల్లవము

౫౮౨. ఆవర్తితాః కరతలే యస్యాంగుల్యో భవంతిహి
పార్శ్వగత వికీర్ణాశ్చ స భవే దలపల్లవః

కరతలమునందు కరాంగులులు కనిష్ఠాదిక్రమమున వర్తనాపరివర్తనమున నావర్తితములగునేని పార్శ్వగతములై వికీర్ణములు నగునేని యలపల్లవమను హస్తమగును. దీనికే యలపద్మకమనియు పేరు గలదు. "ఇయర్తీత్యరఃచలచలత్పల్లవాకారత్వాదలపల్లవః" గతి కలది యరము. చలమని భావము. చలత్పల్లవాకారమున నుండును గావున అలపల్లవము. ప్రతిషేధాభినయ మొనరించుటకై యిది యుపయోగించును. "నీ వెవరివాడవు, లేదులే" యను మిథ్యాధిక్షేపార్థమం దలపల్లవమును వినియోగింపవలెను. శూన్యవచనమున నిదియుపయుక్తమగును. "తచ్ఛాస్త్ర మసత్ప్రయుక్తం" తచ్ఛాస్త్రమసచ్ఛాస్త్రమని నిరూపితమనుటలో దీని వినియోగము కలదు. ఇంకను స్త్రీల యాత్మోపన్యాసము దీనిచే నొనర్పదగును. స్త్రీలకు విస్మయాభినయ ముపన్యసించునప్పు డిది యుపకారి. విస్మయాపాదకమై యిది రాణించును.

## ౧౭. చతురము.

౫౮౩. తిస్రః ప్రసారితా యత్రతథాచోర్ధ్వా కనీయసీ
తాసాం మధ్యేస్థితేఽంగుష్ఠః సకరశ్చతురఃస్మృతః

తర్జని మధ్యమ యనామికలు మూడును ప్రసారితములై యుండగా, కనీయసి యూర్ధ్వముగా నుండగా, వానిలో మధ్యమాంగులి సమక్షమున నంగుష్ఠమున్నచో నా హస్తము చతురహస్తమగును. కారికలో మధ్యే యనుట మధ్యమాంగులి మధ్యమని యర్థము. నాలుగు వ్రేళ్లు లంగుష్ఠశ్లిష్టములై యుండున్నందున నిది చతురము, చతురశబ్ద మచ్ప్రత్యయాకారాంతము. నయవినయనియమములలో నిపుణబాలాతురసత్త్వకైతవార్థములలో వాక్యయుక్తపథ్యసత్యప్రశమములలో నిది ప్రయోజ్యమగును. సత్త్వకైతవాద్యభినయములందు ముఖరాగభేదమున భేద ముండును. కించిన్మండలకృతమయిన యొక హస్తమున వికృతవిచారితచరిత మభినయింపవచ్చును. వితర్కిత

మభినయింపవచ్చును. లజ్జిత మభినయింపవచ్చును. వికృతప్రకార మొక హస్తమున జేయునది. ఆవేశానావేశములందు రెండుహస్తములచే నొనరింపవలెను. నయనము లభినేయము లయినప్పుడుపమానోపమేయభావముండగా పద్మదలాదికము ప్రదర్శిత మగునపు డొక హస్తము తగదు. ఈ యేకాకితానిషేధము భరతసమ్మతము. హారిణకర్ణనిర్దేశమును సంయుతకరణచతురహస్తమున నొనర్చునది. పరగతములయిన లీలలను రతివిశేషములను దీప్తినిస్మృతిబుద్ధులను ప్రతర్కాత్మకవిభావనమునూహాపోహాత్మక విభావనమును చతురహస్తమున ప్రయోగించునది. దృష్టివ్యాపారాభినయమున కర్తరీముఖమె యుక్తము. సంజ్ఞామాత్రమయిన ప్రణయము విచారణ మభినయించునది. మైత్రీరూపమయిన సంగతము నన్యోన్యమగ్రశ్లేషముకల హస్తమున నభినయించునది. శౌచ మభినయించునది. చాతుర్యము, హృద్యమాధుర్యము, శకారాదివచనగతమయిన దాక్షిణ్యము మార్దవ మభినయింపదగును. అనుకూల్యరూపమయిన దాక్షిణ్యమును మృదుత్వము నంగుష్ఠమధ్యమాదర్శనమున నభినయింపవలెను. స్వభావమను శీలము ప్రశ్నము వార్తాయుక్తి ప్రదర్శింపదగును. నేపథ్యరూపమయిన వేషము గణికాస్థానమయిన వేశము ప్రదర్శనీయము. మృదుశాద్వలము ప్రదర్శనీయము. విభవావిభవములు సురతము గుణాగుణములు యౌవనము గృహము గృహిణి నానావర్ణములు చతురహస్తమున ప్రయోగించునది. పార్శ్వాత్పార్శ్వాగమనమున విభవమును, అభిగమనమున నవిభవమును నభినయింపవలెను. ఇట్లె యితరములందు నూహ్యము. సంయుత హస్తములతో సమ్ముఖస్వస్తికమున భార్య నభినయించునది. ఈ విధముగనె యితరము లభ్యూహ్యములు. వక్షఃప్రభృతి శిరోన్త మొక క్షేత్రవిశేషము. సంయుతాసంయుతత్వములు చంచలత్వస్థిరత్వములు సమ్ముఖపరాఙ్ముఖోత్తానాధోముఖత్వ్యశ్రత్వాదికము యథాయోగముగా నుత్ప్రేక్షించి యభినయవిశేష మాచరించునది. నానావర్ణ ప్రదర్శనమున నొక విశేషమున్నది.

సితమూర్ధ్వేన తు కుర్యా ద్రక్తం పీతంచ మండలకృతేన
పరిమృదితేన తు నీలం వర్ణాంశ్చతురేణ హస్తేన॥

ఊర్ధ్వచతురహస్తమున సితివర్ణమును మండలకృతచతురమున రక్తపీతవర్ణములను పరిమృదితహస్తమున నీలవర్ణము నభినయించునది ఆ యా హస్తవిశిష్టవిన్యాసమునకు సా యా వినియోగవిశేషమున కాంతరమయిన సంబంధము కలదు. ఇది భరతవిద్యానిపుణసమున్నేయము. ఇట్లే యితరములును.

## ౧౮. భ్రమరకరము

౩౮౪. మధ్యమాంగుష్ఠ సందంశోవక్రాచైవ ప్రదేశినీ
ఊర్ధ్వమన్యే ప్రకీర్ణేచ ద్వ్యంగుల్యౌ భ్రమరేకరే

మధ్యమాంగుష్ఠముల కగ్రిసంయోగమున్నచో (సందంశోఽగ్ర సంయోగః) ప్రదేశిని వక్రమైయున్నచో నితరము లూర్ధ్వప్రసారము పొందియుండగా నంగులీద్వయము ప్రకీర్ణమై యుండునేని భ్రమరహస్తమగును. భ్రమరాకృతి యుండుటచే భ్రమరము. భ్రమరకరమున పద్మోత్పలకుముదగ్రహణ మొనర్పవచ్చును. దీర్ఘవృంతములుకల పుష్పముల గ్రహణవిధియు శక్యమగును. కర్ణపూరాభినయమును సంగతమగును. నిర్భర్త్సనాదులను ప్రదర్శింపవలసియుండునేని భ్రిమరకరము విచ్యుతము సశబ్దము కావలెను. బాలాలాపమునందును శీఘ్రతాలము నందును విశ్వాసనమునందు నిది యుపయుక్తమగును.

## ౧౯. హంసవక్త్రిము

౩౮౫. తర్జనీమధ్య మాంగుష్ఠా స్త్రేతాగ్నిస్థా నిరంతరాః
భవేయుర్హంసవక్త్రస్య శేషే ద్వే సంప్రసారితే

తర్జనీమధ్యమాంగుష్ఠములు త్రేతాగ్నుల యాకారమున నున్నవై నిరంతరము లగునేని మిగులు రెండువ్రేళులు సంప్రసారితము లగునేని హంసవక్త్రిమగును. తత్తదాకారవైశిష్ట్యమున నామాచిత్యము సుగ్రహము. కించిత్ప్రస్పందితాగ్రభాగముగ నుండు నీ హస్తమున శ్లక్ష్ణమల్పము శిథిలము లాఘవము నిస్సారమభినయించుట యుక్తము. మృదుత్వయోగమున నిదియుపకారి. శ్లక్ష్ణత్వాల్పత్వ పరమని గుర్తింపవలెను. ప్రస్పందన మర్దనమధన విధూనన క్షేపణా ఖ్యావర్తాపసరణాదిరూపము యథాయోగముగా యుక్త్యనుసారమున యోజనీయమగును.

## ౨౦. హంసపక్షము

౫౮౬. సమాః ప్రసారితాస్తిస్రస్తథా చోర్ధ్వా కనీయసీ
అంగుష్ఠః కుంచితశ్చైవ హంసపక్ష ఇతిస్మృతః

అంగుష్ఠము కుంచితము కనీయసి యూర్ధ్వగము మిగిలిన త్రయము సమముగ ప్రసారితమయినచో హంసపక్షమనదగును. మూడు ప్రసారితములగుటలో పరిశ్లిష్టములై మూలవినతములుగా నుండవలె నని భావము. నివాపసలిల మీవలసియుండగా ధర్మార్థ ముదకదాన మున హంసపక్ష ముపయోగి. హనుధారణరూపమయిన గండసంశ్రయ మందు నిది యుండును. బ్రాహ్మణుల ప్రతిగ్రహాచమన భోజనార్థ కార్యములం దిగి కార్యము. ఆలింగనమున మహాస్తంభాభినయమున నిది సంయుతకరణముగ నుండును. రోమహర్షణమునందు బాహు ద్వయమండలీకరణమున ద్వితీయస్కంధమునుండి స్కంధాంతరగమ నాత్మకముగా నిది యావశ్యకము. పరోక్షమున ప్రియజనస్పర్శ యున్నచో ద్వితీయహస్తస్వస్తికమున గూర్పదగును. అనులేపనరూప మయిన యంగసమాలంబనార్థస్పర్శమున హంసపక్షము యోజ నీయము. సంవాహనమున నిది యోజనీయము. స్త్రీలస్తనాన్తర స్థితితో నుండు విభ్రమవిశేషములును యథారసముగా నిరూపింపదగి యున్నవి. శృంగారహాస్యాద్భుతాదులందును కరుణాదులందును వ్యభి చారిభావవిశేషయోగమున నిది యంతయు సంభావితమె యగును. దుఃఖము కలిగినచో హనుధారణముండును. అప్పుడు హంసపక్ష మావశ్యకము. రసములందుండు భావానుభావములు దృష్టివిశేష రోమాంచాదులు ప్రసిద్ధములు. వానిచే నుపబృంహితమై స్ఫుటీకృత మగుట యిందున్నది. రసభావోపబృంహితరీతి సందంశహస్తమున నిరూపితమగును. అది మధ్యమున పరిభాషిత మయినందున సర్వహస్త విశేషమున కగునని యభ్యూహింపదగును.

## ౨౧. సందంశము.

౫౮౭. తర్జన్యంగుష్ఠసందంశస్త్వరాలస్య యదా భవేత్
అభుగ్నతలమధ్యస్థః స సందంశ ఇతి స్మృతః
౫౮౮. సందంశస్త్రివిధో జ్ఞేయస్త్వగ్రజో ముఖజస్తథా
తథా పార్శ్వగతశ్చైవ రసభావోపబృంహితః

అరాలహస్తమునకు సంబంధించి, తర్జన్యంగుష్ఠసందంశ ముండు నేని మధ్యతలమాభుగ్నమై యున్నచో నది సందంశహస్తమగును. ఈ సందంశము మూడు విధములు. అగ్రజసందంశము ముఖజసందంశము పార్శ్వగతసందంశము నని. ఇట్టి యీ సందంశవిశేషము లన్నియు రసభావోపబృంహితములై యుండును. చిన్నచిన్నవయిన పుష్పముల యపచయ మొనరించి గ్రథన మొనరించుటలో నగ్రసందంశ మపేక్షితము. తృణపర్ణకేశసూత్రముల గ్రహణమున నుపకారి. శల్యములయిన కంటకాదుల యవయవగ్రహణమున ప్రకర్షణమున నగ్రసందంశమె యుండును. వృంతములనుండి పుష్పోద్ధరణమును వర్తిశలాకాదిపూరణము, రోషమున ధిక్ ధిక్ అను వచనము అనునవి ముఖసందంశమునకు సంబంధించిన కర్మలు, యజ్ఞోపవీతధారణమునందు ముక్తాదుల వేధనమునందు ధనుర్గుణాకర్షణమునందు సూక్ష్మబాణలక్ష్యమునందు, యోగమున, ధ్యానమున, అల్పమున సంవృతకరణముగా నీ సందంశహస్తముపయోగింపవలెను. ధనుర్గుణాకర్షణమున సంవృతకరణత్వము కేవలము సంశ్లేషణమునకె కాదు. హస్తద్వయమున కాధారమాత్రముగ కూడ నగును. పేలవకుత్సాసూయా సదోషవచనములందు వామహస్తముచే కించిద్వివర్తితాగ్రముగ హస్తము కూర్చినచో నది పార్శ్వసందంశమగును. ఆలేఖ్యరచనము నేత్రరంజనము వితర్కము వృంతరచనము ప్రవాలరచనము అలక్తక నిష్పీడనము లందు స్త్రీలీ సందంశహస్తమును కూర్పవలెను. గండతల బాహుశిఖరాదులందు పత్రభంగకరణమున నిది యున్నది. పత్రచ్ఛేద్యముగా నలంకృతమయిన పల్లవమును లలాటాదులందు కూర్చినప్పుడు దాని యుపసంశ్లేషణ మునకై యీ హస్తము రచింపవలెను. ఈ ప్రయోగము స్త్రీలోనర్పవలెనని యనుటచే నా యీ వినియోగవిధులందున్న సౌకుమార్యము వ్యక్తమగును.

౨౨. ముకులము.

౫౮. సమాగతాగ్రాస్సహితా యస్యాంగుల్యో భవంతి హి
ఊర్ధ్వా హంసముఖస్యైవ స భవేన్ముకులః కరః

ముకులాకారమగుటవలన ముకులము. హంసముఖమునకు వలె నంగులులన్నియు సంహితములై సమాగతాగ్రములగు నేని ముకుల

హ స్తమగును. ఇందు వ్రేళ్లు లూర్ధ్వములై యుండుట వివక్షితము. దేవార్చనాది ప్రారంభమునందు ముకులవ్యాపారావేశముండగా పద్మ కోశమువలె నుండుటను కొందరనిరి. పద్మోత్పల ముకులరూపణమున నిది యున్నది. విటచుంబనమున నీ ముకులము యుక్తము. వికుత్సిత వ్యాపారమున ముకులము విప్రకీర్ణముగా నుండును. విటచుంబన వివరణ మిట్లుండును. స్వాభిప్రాయమావిష్కరించుటకై యువతుల సన్నిధానమున విటులు తమహస్తమునె ముకులిత మొనరించి చుంబన మొనరించుట విటచుంబనము. వేరొకవిధము. విటులు వనితల కుచ చిబుకాది స్థానముల నంగులిపంచకముతో సమముగా సశబ్దముగా "ప్చుమ్ ప్చుమ్"గా చుంబించుట విట చుంబనము. ఆ యా స్థానము లందు నఖస్పర్శనము కామసూత్రములందు కలదు. దాని నాచ్ఛురితక మందురు. ఇంక నీ ముకులము భోజనమున, కంకణరూపముగా హిరణ్యా మభినయించునప్పుడు, అంగులీయకాదులమోచనమున, పంచసంఖ్యా పరిగణనమున, ముఖసంకోచమున, ప్రదానమున, శీఘ్రవిధిలో, ముకులిత కుసుమములం దిది యుక్తమని తద్విదులు ప్రయోగింపవలెను. తద్విదు లనుట సముచితమగు నితికర్తవ్యత సూచితము.

౨౩. ఊర్ణనాభము

౫౮౦. పద్మకోశస్య హస్తస్య హ్యంగుల్యః కుంచితా యదా
ఊర్ణనాభః స విజ్ఞేయః కేశచౌర్య గ్రహాదిషు

పద్మకోశహస్తమున కగు నంగులులు కుంచితములగు నేని యూర్ణనాభమను హస్తమగుట తెలియదగియున్నది. ఇది కేశచౌర్య గ్రహాదులలో నుపయోగించుననుట వినియోగవచనము. ఊర్ణ నాభి జాలకారమగు క్రిమి సాలెపురుగు. ఈగ మొదలగువానిని గ్రహించుటలో నిట్టి కరణసన్నివేశముండును. ఊర్ణనాభిశబ్దమునకు మత్వర్థీయమున 'అచ్' ప్రత్యయము కలుగగా ఊర్ణనాభమగును. కేశముల గ్రహణమున కిది యగును. ఇతరులు చూతురన్న శంకచే దొంగతనమున లాఘవముగా హరించుట కిది యగును. చిబుకక్షేత్ర మున నుంచిన సింహవ్యాఘ్రాదిస్వస్తికమున వీని నభినయింపవలెను. సింహవ్యాఘ్రాదులు స్వస్తికమున నున్నవై కూర్చొనుటలో కరరుహ ములు వెలికిపట్టి యుండును. కావున సింహవ్యాఘ్రాదుల

యభినయము. సందూర్ణనాథ మున్నది. ఇట్లు శిరః కండూయనమున కుష్ఠవ్యాధినిరూపణమున ప్రస్తరగ్రహణమున నిది యుపయోగించును. ప్రస్తరమనునది పాషాణము. రాయి. నికషపాషాణ మనికొందఱనిరి. దర్భచ్ఛట యని కొందఱు తలచిరి.

౨౪. తామ్రచూడము

౯౯౧. మధ్యమాంగుష్ఠ సందంశో వక్రాచైవ ప్రదేశినీ
శేషే తలస్థే కర్తవ్యే తామ్రచూల కరేంగులీ

చూడాముక్తకుక్కుటాకారమున నుండును గావున తామ్రచూడము తామ్రచూలము నగును. మధ్యమాంగులి యంగుష్ఠము సందంశముతో నుండుట, ప్రదేశిని వక్రముగా నుండుట మిగులు వ్రేళులు రెండును తలస్థములై యుండుట తామ్రచూడలక్షణము. నిర్ఘర్షణాదులలో నిది విచ్యుతము కావలెను. సశబ్దముగా నుండవలెను. కాలమానమునననుసరించు తాలవిధానమున, విశ్వాసనమున, శీఘ్రార్థమున, బాలాదుల యాహ్వాన మొనరించుటకగు సంజ్ఞితమున నిది వినియోగము పొందును. కలా కాష్ఠా నిమేష క్షణములందును బాలాలాపనిమంత్రణమందు నీకరమునె యుపయోగింపవలెను. కొందరీ తామ్రచూడమునకు రక్షణాంతరము పఠించిరి.

"అంగుల్యస్సంయుతా వక్రా ఉపర్యంగుష్ఠపీడితాః
ప్రసారితా కనిష్ఠా చ తామ్రచూడకరః స్మృతః

వ్రేళులు సంయుతములై వక్రములై యుపర్యంగుష్ఠపీడితములై యుండుట, కనిష్ఠాంగులి ప్రసారిత మగుట తామ్రచూడకరలక్షణము. ప్రసారితకనిష్ఠమయిన ముష్టియే యిది యగును. శతము సహస్రము లక్షసంఖ్య యభినయింపదగును. క్షిప్రముక్తాంగులీవిన్యాసమున స్ఫులింగములను జలబిందువులను సూచింపదగును.

ఈ నిరూపించిన యిరువది నాలుగు హస్తము లసంయుతహస్తములు. ఇవి యసంయుతహస్తములె యగును. అసంయుతహస్తము లన్నియేయని కాదు. కోహలాదు లన్యహస్తముల గూడ నిర్దేశించిరి. ఈ యసంయుతములె వక్ష్యమాణసంయుతహస్తములకు నిదానములు.

## సంయుతహస్తములు.

సంయుతహస్తము లసంయుతహస్తములనుండియే యుత్పన్నము లగును. అసంయుతహస్తములను సంయుతములై యన్యసంశ్లేషము వలన సంయుతహస్తము లగును. ఇట్లుత్పన్నములగు సంయుతహస్తములను స్వయముగా నభ్యూహించి తెలిసికొనవచ్చును. మా వచన మపేక్షింపకయు నుత్ప్రేక్షించి గుర్తింపవచ్చును. తథాహి. కూర్పరము వఱకు ప్రసరించు త్రిపతాకమున తత్పార్శ్వమునందున్న ఖటకాముఖమున స్త్రీల యభినయము శక్యము. కర్ణాంతము ప్రసరించిన ఖటకాముఖమున వామహస్తము నందలి కపిత్థముష్ట్యంతరమున బాణమోక్ష మభినయింపవచ్చును. ఇట్టి విషయములు చిత్రాభినయప్రసక్తిలో సంభావ్యములు, అచట నవి ప్రతిజాగరితము లయినవి. ఇట్లుత్ప్రేక్షించి గుర్తింపవచ్చును. అయినను వక్ష్యమాణ సంయుతహస్తవిశేషముల గుర్తించుట సముచితము.

సంయుతహస్తములు పదమూడు కలవని సూచితమయినది. వానిలో మొదట అంజలి యను సంయుతహస్తము నిర్దిష్టమగును. ఇట్లిది ప్రథమమగుటలోని భావము దేవతాగుర్వాదుల యభివాదన వినియోగము పొందుటవలన విశదమగును.

### ౧. అంజలి.

౪౯౨. పతాకాభ్యాం తు హస్తాభ్యాం సంశ్లేషాదంజలిః స్మృతః
దేవతానాం గురూణాం చ మిత్రాణాం చాభివాదనే

రెండుపతాకహస్తముల సంశ్లేషమున్నచో నంజలి యను సంయుతహస్తమగును. ఇతరహస్తముల సంబంధము కూడ నిందుండవచ్చును గాని నామాంతరము గలుగదు. కొందరు రెండు సూచీముఖముల సంబంధము నభినయింతురు. అట్టి స్థలములందు నామాంతర ముండవచ్చునని 'తు' భావము. లక్షణమునందు 'స్మృతః' యనుట లోకమునందు నిది ప్రసిద్ధమె యని సూచించుట కగును. "ప్రాంజలిః పుష్పకేతుః" ఇత్యాదు లభ్యూహ్యములు, సంశ్లేషముండవలయునని సమ్యగ్గ్రహణమున దగ్గర దగ్గరగా సర్వాంగుళులకు శ్లేష మావశ్యక మని భాసించును. దేవతాగురుమిత్రుల యభినందనాపేక్షమున విని

యోగము ప్రసిద్ధమై యున్నది. ఈ వందనమున వక్షోవక్త్రశిరస్సు లను మూడుస్థానము లున్నవి.

౨౮౩. దేవతానాం శిరస్థస్తు గురూణా మాస్యసంస్థితః
వక్షస్థశ్చైవ మిత్రాణాం స్త్రీణామనియతో భవేత్

దేవతాభివాదన మొనరించునపు డంజలిహస్తమును శిరమున గూర్పవలెను. గురువందనసమయమున నంజలి యాస్యగతము కావలెను. మిత్రుల వందనమున వక్షఃస్థమై యుండును. ఈ విధానము పురుషులొనరించు వందనవిషయముననె యని గుర్తించునది. స్త్రీల యభివాదనవిధి యనియతము. అనియతమనుట యనియతమనుట కాదు. ఔచిత్యానుసారమున నటునిటు నాచరింపవచ్చునని భావము.

౨. కపోతకము

౨౮౪. ఉభాభ్యామపి హస్తాభ్యామన్యోన్యం పార్శ్వసంగ్రహాత్
హస్తః కపోతకో నామ కర్మ చాస్య నిబోధత

అన్యోన్యము పార్శ్వసంగ్రహామునునందు రెండు హస్తముల సంశ్లేష మున్నచో కపోతకమను హస్తమగును. రుచ్యానుసారమున నాధారాధేయభావప్రతిపత్తికై లక్షణమున "ఉభాభ్యాం" అని సంఖ్యా పదోపాదానమున్నది. "కంపతే ఇతి కపోతః, భీరుఃపక్షీ తత్ప్రకృతిరన్యోపి కపోతః," కంపించునది కపోతము. భీరువయిన పక్షి కపోతము. పావురము. అట్టి ప్రకృతికల యితరుడును కపోతపదవాచ్యుడగును. ఈకపోతహస్తము నామౌచిత్యముననె భీతవిషయముగా నుండుట స్పష్టము. రామాభ్యుదయనాటకమున ప్రథమాంకమునందు వటువు భీతుడు. ఆతనికప్పుడు కపోతహస్త ముచితము. కుచాభినయమునం దిదియే ప్రధానము. హస్తము వక్షస్థ్సమగుట యిచట సంబద్ధమగును. భీతాభినయమునందు కంపితాభినయమందు నిది యున్నది. వినయాభ్యుపగమమున ప్రణామరచనమునందు గురువుతో సంభాషించుటయందును శీతబాధయందును భయాభినయమందును స్త్రీలు కంపితహస్తమును వక్షోగతముగ గూర్పవలెను. ఇచటి స్త్రీలధమస్త్రీలని భావము. మధ్యమోత్తమ వనిత లింతగా భయకంపితలు కారు. వినయగ్రహణాదులలో కట్టనాదులు నిందు స్వీకార్యములు. ఈ కపోతహస్తమే కూర్మాకారముగా

నుండును. గావున కూర్మక మనియు లోకమున ప్రసిద్ధ మయినది. ఈ కపోతహస్త మంగులిపరిఘృష్యమాణావయవములు కలదై ఖిన్నుల వాక్యాభినయమునందు వినియోగము పొందును. ఈ కార్యమున నింతె మాత్రమె యనుటలో, ఇప్పుడిది యొనరింపగాదనుటలో కపోతప్రయోగ మున్నది.

### 3. కర్కటము.

౯౯. అంగుల్యో యస్య హస్తస్య హ్యన్యోన్యాన్తరనిస్సృతాః
స కర్కట ఇతి జ్ఞేయః కరః కర్మ చ వక్ష్యతే

చేతి వ్రేళ్ళన్యోన్యమంతరముల నుండి వెలువడియున్నచో నది కర్కటహస్తమగును. రెండెండ్రకాయలు (కర్కటములు) అన్యోన్య మెదురుగా నుండి కోరలుసాచియున్న విధమున వ్రేళులున్నచో కర్కట మగును. మదనకృతమయిన యంగమోటన మొనరింపవలసి యున్న ప్పుడు కర్కటప్రయోగ మావశ్యకము. అగ్రభాగమున పార్శ్వభాగ మున నూర్ధ్వభాగమున భుజయుగమునకు పరాఙ్ముఖాంగులి యగు నట్లు కర్కటము ప్రయోగింపవలెను. నిద్రనుండి లేచినవాని యావు లింత ననుకరించునపుడు, బృహద్దేహాభినయమున కర్కటప్రయోగ మున్నది. బృహదుదరుని యుదరక్షేత్రమున సమ్ముఖతలముగా నీ హస్త ముండును. హనుధారణ శంఖగ్రహణములందు నిది యోజ్యము. అంగులిపృష్ఠమున హనుదేశముంచుట హనుధారణమునను, కించిత్సం కుచితాన్యోన్యాభిముఖాంగులిగా నుండుట వరిగ్రాహ్యము. అభినే యార్థపరమార్థము గుర్తించిన వారభినయమున ననుసంధాన మొనర్ప దింపశక్తు లగుదురు.

### ౪. స్వస్తికము.

౧౦౦. మణిబంధనవిన్యస్తావరాలౌ స్త్రీప్రయోజితౌ
ఉత్తానౌ వామపార్శ్వస్థౌ స్వస్తికః పరికీర్తితః

అరాలహస్తములు మణిబంధనవిన్యస్తములై యుత్తానములై వామపార్శ్వగతములై యున్నచో స్వస్తికమగును. ఈ స్వస్తికహస్త ములను స్త్రీలు ప్రయోగింపవలెను. శుద్ధముగా స్వస్తికపదము ప్రయోగించినచో నిట్టి సన్నివేశమునె యా ప్రదేశములందు భావింప

వలెను. చిత్రాభినయాదులలో నర్థప్రకరణాదివశమున నిద్ది యున్నవిధమున గూడ ప్రవర్తితము కావచ్చును. పతాకాహస్తయోగమున గూడ స్వస్తికమున్నది, అయినను మణిబంధవిన్యస్తత్వ మనునది యనుయాయిరూపము. పతాకస్వస్తికకర్మలను స్త్రీలిస్వస్తికమునసె యాచరింపవలెను. స్వస్తికార్థలక్షణ సమాకృతి కలదగుటచే నిది స్వస్తికమనుట సంగతము. ఈ స్వస్తికముచే దిశలను మేఘములను వనగగనసముద్రములను ఋతువులను భూమిని సమూహమును నభినయింప వచ్చును.

### ౫. ఖటకావర్ధమానకము.

౧౯౭. ఖటకః ఖటకే న్యస్తః ఖటకావర్ధమానకః
శృంగారార్థేషు యోక్తవ్యః ప్రణామకరణే తథా

ఖటకమును ఖటకమున గూర్చినచో ఖటకావర్ధమానకమగును. కొందరు ఖటకద్వయ మన్యోన్యాభిముఖమయినచో ఖటకావర్ధమానక మనిరి. ఖటకమంతట బహిర్యోగముననుండును గావున నీనామ ముచితము. శృంగారప్రయోజనము లయిన తాంబూలగ్రహణాదులలో నిది యుండును. "ఖటకావర్ధమానం తు కృత్వా విటగతిం వ్రజేత్" అవస్థాభేదమున గతినిరూపణ మావశ్యకము కావున విటావస్థలో ఖటకావర్ధమానానుసారమున గతి యుండును. కావున శృంగారార్థము లందిది యోజనీయము. అట్లే యట్టిప్రయోజనమున్న నే దేవీప్రసాదనమయిన ప్రణామకరణమునందు నిది యున్నది. కుముదోత్పలకుందము లందును శంఖధారణమున నిది ప్రయోజ్యమని కొందరి భావము. ఛత్రధారణమున గూడ నిది యోజనీయము.

### ౬. ఉత్సంగము

౧౯౮. అరాలే తు విపర్యస్తావుత్తానౌ వర్ధమానకౌ
ఉత్సంగ ఇతి విజ్ఞేయః స్పర్శస్య గ్రహణే కరః

అరాలహస్తములు విపర్యస్తములై స్వస్తికరూపమున నుండుటయు, నుత్తానములై సమ్ముఖములయి యుండుటయు, వర్ధమానకములుగా వినతములై యుండుటయు నుత్సంగలక్షణము. కావున ప్రకోష్ఠములు స్వస్తికముగా నుండుట లక్షితమగును. స్వస్తికమె దక్షిణపార్శ్వ

స్థముగా నుండుటయని కొందరు భావించిరి. అధోనఖత్వమని కొందరనిరి. కూర్పరములను స్వస్తికాకారముగా కూర్చి ప్రవేశముక్తమయిన కక్షమునుండి వెలుపలగా నంగులున్నచో పృష్ఠము హస్తములకు బహిర్ముఖము కాగా విపర్యస్తత సంగతమగునని భావించుట యుక్తతరము. ఉత్సంగగ్రహణయోగ్యత్వ మున్నందున నుత్సంగమయినది. పరోక్షమయిన స్పర్శమును గ్రహించు నభినయమున నుత్సంగ ముపకరించును. నిష్పేషకృతమున గోసామర్ష కృతమున వినియుక్తమగును. నిష్పేషమనుట పీడనము. పీడనమున నొనరించునది యతిప్రయత్నసాధ్యమని భావము. "ఏషోఽస్మి తే దృఢనిపీడనబాహుయంత్రి" యనునది రోషకరణమున గ్రాహ్యము. విదూషకాదుల వలన గలిగిన విప్రియము హేతువుగా పరిసాదనమంగీకరింపక పోవుటలో దీనినుపయోగింప వలెను. సింహావలోకితమున నిది యుండునని కొందరభిమానించిరి. స్త్రీల యీర్ష్యాకృతము నందపేక్షితమనుట ప్రసిద్ధము.

## ౭. నిషధము

౫౯౯. ముకులం తు యదా హస్తం కపిత్థః పరివేష్టయేత్
స మన్తవ్యస్తదా హస్తో నిషధో నామ నామతః

కపిత్థహస్తము ముకులహస్తమును పరివేష్టించునేని యది నిషధమను హస్తమగునని గుర్తింపవలెను. కపిత్థహస్తమున పరివేష్ట్యమానమగు ముకులహస్త మభ్యంతరమున నిమగ్నమై యుండుట నిషధహస్తరూపమని భావము. నిపీడితనిషధహస్తమున సంగ్రహ పరిగ్రహములను ధారణసమయసత్యవచనములను సంక్షేపమును సంక్షిప్తము నభినయింపవలెను. సంగ్రహము శాస్త్రార్థాదులను లెస్సగా గ్రహించుట, సంక్షేపము తాత్పర్యము "సమ్యక్ క్షిప్తం క్వచిత్స్థాపితం సంక్షిప్తం" బాగుగా నుంచిన, యొకచో స్థాపితమయిన వస్తువు సంక్షిప్తము.

శిఖరహస్తము మృగశీర్ష హస్తమున పీడితమయినచో నిషధహస్తమని కొందరనిరి. ఇది భయార్తుని యభినయమున యుక్తము.

"గృహీత్వా వామహస్తేన కూర్పరాభ్యంతరే భుజం
దక్షిణం చాపి వామస్య కూర్పరాభ్యంతరే న్యసేత్

సచాపి దక్షిణో హస్తః సమ్యఙ్ముష్టికృతో భవేత్
ఇత్యేవ నిషధో హస్తః ....................

మరియొక లక్షణ మిట్లున్నది. వామహస్తమున భుజమును కూర్పరా భ్యంతరమున పట్టి, దక్షిణభుజమును వామకూర్పరాభ్యంతరమున కూర్పవలెను. దక్షిణహస్తము బాగుగా పిడికిలి పట్టినది కావలెను. ఇది నిషధహస్తము. ఇట్టి హస్తమున ధైర్యమదగర్వసౌష్ఠవౌత్సుక్య మాటోపములను, అభిమానావష్టంభ స్తంభధైర్యాదులను నిరూపింప వలెను. ఈ నిషధహస్తనిరూపణమున భావభేదములు పాఠభేదములు కలిగినవి.

జ్ఞేయో వై నిషధో నామ హంసపక్షౌ పరాఙ్ముఖౌ

హంసపక్ష హస్తములు పరాఙ్ముఖములుగా నున్నచో నిషధ హస్తము. జాలవాయయనాదుల యభిఘట్టనమున దీని ప్రయోగింప దగును.

౮. దోలము

౭౦౦. అంసౌ ప్రశిథిలౌ ముక్తౌ పతాకౌ తు ప్రలంబితౌ
యదా భవేతాం కరణే స దోల ఇతి సంజ్ఞితః

భుజములు శిథిలములై జారిపోయినట్లుండగా, పతాకహస్తాంగు ళులు విడిపోగా భుజములు వ్రేలాడు నట్లుండు నేని దోలమను సంజ్ఞకల సంయుతహస్త మగును. హస్తములు బాగుగా లంబమానము లయి నందున నె స్కంధములకు శైథిల్యము కలుగును. అవి యుద్వృత్తము లగును. పతాకాంగుళుల కవష్టంభ ముండదు. కరణక్రియలలో నంగుళి శైథిల్యముండును గావున భుజములు వ్రేలాడునవి యగును. దోలా కారమున నుండుటచే దోల. సంభ్రమ విషాదమూర్ఛితమదాభిఘాతా వేగములను వ్యాధిప్లుతశస్త్రక్షతముల నభినయనవ్యాపారమున కూడి యున్నట్లొనర్పవలసియుండగా నీ దోలహస్త మనుసరింపవలెను. ఆ యా యంశ మభినేయ మయినప్పుడు పార్శ్వమునుండి పార్శ్వాంతర గమనము నిపతనము స్తబ్ధత్వము మొదలయిన యితిక ర్తవ్యత యంతయు నిందు సూచిత మగును. దీని వినియోగమునందలి యభి

ఘాతమనునది యంతేట నగ్న్యాదికృతమయిన వ్యసనజన్యమగు దోష మని పరిగ్రహింపవలెను.

## ౯. పుష్పపుటము

౨౦౧. యస్తు సర్పశిరాః ప్రోక్తస్తస్యాంగులినిరంతరః
ద్వితీయః పార్శ్వసంశ్లిష్టః స తు పుష్పపుటః స్మృతః

పూర్వము నిరూపించిన సర్పశీర్షహస్తమునకు సమముగా నంగులినిరంతరమయిన రెండవహస్తము పార్శ్వసంశ్లిష్టమై యున్నచో నది పుష్పపుటహస్తమగును. సర్పశిరసముగా నుండు రెండుహస్తములు సంముఖముగ నుండరాదు. పార్శ్వమునందే యుండవలయును. ఇట్టి హస్తపుటమున పుష్పగ్రహణ మొనరించుట యుక్తము. ధాన్యఫలపుష్పసదృశము లయిన నానావిధములగు యుక్తకార్యము లన్నియు పుష్పపుటగ్రాహ్యము లగును. జలానయన మపనయనము పుష్పపుటమున నే యుక్తము.

## ౧౦. మకరము.

౨౦౨. పతాకౌ తు యదా హస్తావూర్ధ్వాంగుష్ఠావధోముఖౌ
ఉపర్యుపరి విన్యస్తౌ తదాసౌ మకరః స్మృతః

పతాకహస్తములు రెండు నూర్ధ్వాంగుష్ఠములై యధోముఖములై యుపర్యుపరి విన్యస్తము లయినచో నా హస్తము మకరహస్తమగును. ఈ హస్తమున సింహవ్యాలద్వీపిప్రదర్శన మొనరింపవచ్చును. నక్రమకరమత్స్యప్రదర్శన మొనరింపవచ్చును. అగ్రపార్శ్వాదులందు స్థితచలనాద్యర్థవశమున క్రవ్యాదాభినయ మొనర్పవచ్చును. తత్తదర్థయోగమున నాయా విశేషాంశములు ప్రయోజ్యములు కాదగును.

## ౧౧. గజదంతము.

౨౦౩. కూర్పరాంసోచితౌ హస్తౌ యదాస్తాం సర్పశీర్షకౌ
గజదన్తస్స తు కరః కర్మ చాస్య నిబోధత

సర్పశీర్షకహస్తములు కూర్పరాంసోచితములై యుండునేని యది గజదంతమను కరమగును. కూర్పరాంసశబ్దమున నుభయసామీప్యము తదంతరాళము సంగృహీత మగును. పూర్వదక్షిణభాగమున నాకుంచితములు తత్థాసనసంవేష్టనపరములు నగును. వామబాహుపు

నందు దక్షిణము దక్షిణబాహువునందు వామహస్తమును స్తంభా కారమున వేష్టితమై యున్న దంతాకృతిసంబంధములో నున్నందున గజదంతమగును. ఈ హస్తము వధూవరుల వివాహస్థాన నయన మందును అతిభారవహనమునందును స్తంభగ్రహణమునందును శైల శిలోత్పాటనమునందును గతాగతవిధానమున నుపయోగించుచునని గుర్తించునది.

౧౨. అవహిత్థము.

౬౧౪. శుకతుండౌ కరౌ కృత్వా వక్షస్యభిముఖాంచితౌ
శనైరధోముఖావిద్ధౌ సోఽవహిత్థ ఇతి స్మృతః

శుకతుండహస్తములను వక్షమునందభిముఖముగా నుంచి రొమ్మునట్లొనర్చునది. నెమ్మదిగా నధోముఖావిద్ధముల జేయునది. అధోముఖము పొందునట్లొనర్చునది. ఇట్లొనర్పగా నది యవహిత్థ మగును. అవహిత్థ (లజ్జ) సూచక మయినందున నిది యవహిత్థమగును. ఇట్లొనర్చినచో స్వీయాశయము భిన్నము కాదు. గోపిత మగును. దీనిని దౌర్బల్య నిశ్వసితములందును గాత్రదర్శన మందును తనుత్వమున నుత్కంఠితమున నభినయయోగానుసారమున ప్రదర్శింపదగును. అభి నయయోగార్థమును పూర్వమునందువలె గుర్తించునది.

౧౩. వర్ధమానము

౬౧౫. జ్ఞేయో వై వర్ధమానస్తు హంసపక్షౌ పరాఙ్ముఖౌ
జాలవాతాయనాదీనాం ప్రయోక్తవ్యో విఘాటనే

హంసపక్షములు పరాఙ్ముఖములై యుండునేని వర్ధమానమగును. దీనిని జాలవాతాయనాదుల విఘాటనమున ప్రయోగించునది. దీనిలో హస్తము లన్యోన్యము స్వస్తికములవలె నున్నవైనను లక్ష్యమున నన్యోన్యనికటవర్తులుగనే యుండును. స్వస్తికత లేనివై కేవలము పరాఙ్ముఖములై పరస్పరచలనమున విస్తారయోగము పొందునవి యగునుగావున వర్ధమానత్వ మున్నది. వక్షఃకవాటాది విఘటనము నందును వర్ధమానమును ప్రయోగింపవచ్చును. సంగ్రహాపర్యగ్రహో ద్ధారణము సమయము సత్యవచనము సంక్షేపము సంక్షిప్తము వర్ధ మానమున నభినయింపదగి యున్నది.

ఇట్లీవిధముగా సంక్షేపము ననుసరించి యసంయుత హస్తములు సంయుతహస్తములు నిరూపితము లయినవి. సంక్షేపముగా నివి యన్నియు నభినేయవిషయమున నిరూపితము లయినవి. కావున నితర స్థలములందు నిరూపించిన యభినేయముల కన్న నితరములగు నభినేయములసాధించుట శక్యమేయగును. అట్లే యన్యస్థల నిరూపితార్థమున కన్న వేరయిన యర్థాంతరమునందు నభినయముల సాధించుట యుక్తమే యగును. ఆభిముఖ్యము సంపాదించుటకే యీ యర్థ మనేకరీతిగా నుండుట కాదు. తదర్థభావనమున నిది యదృష్టార్థమనియు నిశ్చయించునది. అభినయకరములను సమగ్రముగా జెప్పుట శక్యము కాదు. కరణముల పరిగణన మశక్యమని యష్టోత్తరశతము చెప్పుట యయినది. అంగహారముల పరిగణనమున సాధ్యముకాదని ముప్పది రెండు మాత్రము చెప్పుట యయినది. అసంయుతసంయుతహస్తము లిన్నిమాత్రమె చెప్పుట యయినది. అభినయకరముల నింకను పరిగణింప వచ్చును. ఈ యర్థములందె కాక యితరార్థములందును వీని విని యోగింప వచ్చును. అట్టివాని నర్థవశమున సాధించి గుర్తించునది.

"అభినయకరాస్తు యే త్విహ తేఽన్యత్రాప్యర్థతః కార్యాః" అయిన నీ యర్థమున నివి చమత్కారులగుట కరణాంగహారములవలె సముపాదేయములుగా నిరుక్తములు నిరూపితములయినవి.

౧౦౭. ఆకృత్యా చేష్టయా చిహ్నైర్జాత్యా విజ్ఞాయ వస్తుతః
స్వయం వితర్క్య కర్తవ్యం హస్తాభినయనం బుధైః
౧౦౮. నాస్తి కశ్చిదహస్తస్తు నాట్యేఽర్థోఽభినయం ప్రతి
యస్య యద్దృశ్యతే రూపం బహుశస్తన్మయోదితం
౧౦౯. అన్యే చాప్యర్థసంయుక్తా లౌకికా యే కరాస్త్విహ
ఛందతస్తే ప్రయోక్తవ్యా రసభావవిచేష్టితైః
౧౧౦. దేశం కాలం ప్రయోగం చాప్యర్థయుక్తిమవేక్ష్య చ
హస్తాహ్యేతే ప్రయోక్తవ్యా నృణాం స్త్రీణాం విశేషః

నాట్యబుధులగువారాకృతివిశేషము ననుసరించి చేష్టాచిహ్నా జాతులననుసరించి స్వయముగా వితర్కించి వస్తుత్తత్వమును గుర్తించి హస్తాభినయన మొనరింపవలెను. స్వయం సముత్ప్రేక్షితము లయిన హస్తాభినయములు నిరూపితహస్తాభినయోదాత్తతకు భంజకములుగా

నుండరాదు. సుందరములయినను సముదాత్తముగనె యుండవలెను. అభినయాభిధానాంతర మభినయాంతరనిరూపణ మావశ్యకమయినను నాట్యోపయోగి విభాగానుసారముగనె విభాగముల నెన్నవలయును. నాట్యమునం దభినయోద్దేశమున నహస్తమయిన యర్థ మేదియు నుండదు. దీని కే రూపము గోచరమయినదో యది యంతయు బహుధా నిరూపితము ప్రపంచితము నయినది. ఈ నిరూపితాభినయ ముల సాంకర్యమున ప్రయోగ మిట్లు ప్రతిజ్ఞాతమయినది. అనుక్తాభి నయసంగ్రహముకూడ నావశ్యకమె. అర్థసంయుక్తములయిన లౌకికము లగు కరములను రసభావవిచేష్టితములతో ఛందోనుసారమున బ్రయోగించునది. "అర్థోఽభినయసామర్థ్యం శోభాతిశయః" అర్థ మనునది యభినయసామర్థ్యము శోభాతిశయము. ఛందోనుసారమనుట నాట్యాచార్యేచ్ఛా ప్రవాహానుసారముగా నని భావము. రసభావ విచేష్టితములు. రసములు స్థాయిభావములు. భావములు సంచారి భావములు. స్థాయి సంచారి సూచకములగు విచిత్రములగు చేష్టితము లనేకములు కలవు. అవి సాత్త్వికోపాంగములు. ఇట్టి రసభావ విచేష్టిత ములతో లౌకికములగు కరములను ప్రయోగింపవలెను. ఇట్లు లోక ధర్మ ప్రదర్శనమున నీ యభినయముల ప్రదర్శనము ప్రసిద్ధోదాహరణ మాత్రమని ప్రఖ్యాపన మొనర్పవలెను. క్షేత్రవిశేషమయిన దేశమును సుకుమారోద్ధత రూపకవిశేషమును కాలమును ముఖ్యగౌణలాక్షణిక వ్యంగ్యాదిభేదమున నున్న యర్థముయొక్క యుపపత్తిని చక్కగా విచారించి పురుషులకు స్త్రీలకు నీ యభినయహస్తములను ప్రయోగింప వలెను. పురుషులకన్న స్త్రీల విషయమున విశేషసమీక్ష యపేక్షి తము. కావుననె యుత్తములకు హస్తాభినయ మతిస్వల్పప్రచారముగా నుండుట గుర్తింపవలెను. ఉత్తములు సత్త్వావష్టంభముననె సర్వము ప్రయోగింపగలరు. యథోక్తగ్రహణసామర్థ్యము కల స్త్రీలవిషయ మున సావధానత యుక్తము.

౬౧౦. సర్వేషామేవహస్తానాం యానికర్మాణి సంతివై
తాన్యహం సంప్రవక్ష్యామి రసభావకృతాని తు

నిరూపించిన హస్తకర్మల కన్నిటికిని రసభావకృతములయిన కర్మలుకలవు. వానిని నిరూపింపవలసియున్నది. స్థాయి సంచార భేద

మున తత్తద్విభావభేదవశేమున హస్తకర్మలను చెప్పవలసి యున్నది. ఖటకాముఖ హస్తమున విదూషకుని కేశాకర్షణ మొనరింపవచ్చును. అరాళహస్తమున ప్రియురాలినాకర్షించుట యున్నది. క్రీడలోకాని కలహమునందుకాని ముష్టిహస్తమున పట్టుట నూహించి తెలియునది. ఈ కర్మ లన్నియు నిరువది కలవు.

| | | |
|---|---|---|
| ౧ ఉత్కర్షణము | ౨ వికర్షణము | ౩ వ్యాకర్షణము |
| ౪ పరిగ్రహము | ౫ నిగ్రహము | ౬ ఆహ్వానము |
| ౭ తోదనము | ౮ సంశ్లేషము | ౯ వియోగము |
| ౧౦ రక్షణము | ౧౧ మోక్షణము | ౧౨ విక్షేపము |
| ౧౩ ధూననము | ౧౪ విసర్గము | ౧౫ తర్జనము |
| ౧౬ ఛేదనము | ౧౭ భేదనము | ౧౮ స్ఫోటనము |
| ౧౯ మోటనము | ౨౦ తాడనము. | |

వీనిలో కొన్నిటియర్థముల నిట్లు గుర్తించునది. పరిగ్రహము మండలగ్రహణము. నిగ్రహము వినాశనము. తోదనము తాడనము. విక్షేపము సావజ్ఞముగా త్యజించుట. ధూననము కంపనము. విసర్గము సాదరత్యాగము. స్ఫోటనము వికాసనము. మోటనము సంకోచనము. ఈ ఇరువదియేకాక ప్రకారభేదము లింకను కలవు. ఇవి యన్నియు రసభావకృతములు. నాట్యతత్త్వ సమాశ్రయమయిన హస్తప్రచారము ఉత్తానమని పార్శ్వగమని అధోముఖమని మూడు విధములు.

౬౧౧. సర్వే హస్తప్రచారాశ్చ ప్రయోగేషు యథావిధి
నేత్రభ్రూముఖ రాగాద్యైః కర్తవ్యా వ్యంజితా బుధైః
౬౧౨. కరణం కర్మస్థానం ప్రచారం యుక్తిం క్రియాంచ సమవేక్ష్య
హస్తాభినయః కార్యః తజ్ఞైః ర్లోకోపచారేణ

రసభావకృతములయిన కర్మలనుట నిం దాసూచితమగును. సర్వవిధమగు హస్తప్రచారములు నాట్య ప్రయోగములందు నేత్ర భ్రూ ముఖ రాగాదులచే వ్యంజితము లగునట్లుగా నిరూపింపవలెను. హస్తప్రచారమనునది ఊర్ధ్వోర్ధ్వ్యస్త పార్శ్వ అధోముఖాది రూపముగా నుండును. హస్తాభినయానమునందు ప్రవృత్తి మొదలగునవి, హస్తముల

ననుసరించి యుండును. "యతో హస్తః తతో దృష్టిః" ప్రత్యేకాభినయనమునందు తద్విపర్యయముగా నుండును. లోకోపచారమునాశ్రయించి నాట్యవిదులు హస్తాభినయ మొనరించుటలో కరణ కర్మ స్థాన ప్రచార యుక్తి క్రియా సమీక్షణ మావశ్యకము. ఆవేష్టితాది కరణ పరిశీలనము ఆవశ్యకము. తానాచరింపతగిన విధేయకర్మపరిశీలనము ముఖ్యము. లలాటాది క్షేత్రమును ఉత్తానాది సన్నివేశస్థితిని స్థానమందురు. స్వల్పబహులాదికము ప్రచారము. ముఖ్యగౌణాదుల యుపపత్తి యుక్తియగును. "గౌ రయం బ్రాహ్మణః." "ఈ బ్రాహ్మణుడు గోవు" అనునట్టి స్థలమున మృగార్థము గవార్థము అభినీతము కాదు. హరిణాభినయముకాని కర్తరీముఖ మృగశీర్షక ప్రాయముగా గవార్థము కాని ప్రయోగింపజనదు. మౌర్ఖ్యాభినయమే యిందు ముఖ్యము. ఇందు చతురహస్తము శుకతుండము శిఖరము నిషధము ప్రయుక్తమగుట యుక్తము. విశేషణ విశేష్యభావాది విచారముకూడ యుక్తియగును. సపులకస్వేదోద్గమోత్కంప మైన రత్నావళిలోని వనిత నభినయించునప్పుడు వృత్తిపదార్థములనన్నిటిని అభినయింప వలసియుండును. తద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి యున్నచోట వృత్తి పదార్థాన్యపదార్థముల నభినయింపవలసి యుండును. ఉపలక్షణ విముక్తమయిన స్థలమునందు వృత్తిపదార్థమే అభినయింప తగియుండును. అట్టి వానిలో కూడ ఉపలక్షణత్వమున్నదని గోచరింపచేయుటకై అన్యపదార్థములతో పాటు వృత్తిపదార్థముకూడ అభినయ యోగ్యమగును. ఇదియంతయు ననావేశముగా నుండవలెనని యుపాధ్యాయులనిరి. క్రియయనునది మూడువిధములు. విధిరూపము నిషేధరూపము, అనుభయ రూపము. "పొమ్ము" - "గచ్ఛ" అను విధిలో ప్రత్యయార్థమునే ముఖ్యముగా నభినయింపవలెను. "మా గచ్ఛ" "పోవలదు" అను నిషేధమున అర్థమే అభినయింపతగినది. అనుభయ రూపమునందు ప్రకృత్యర్థమునే అభినయింపవలెను. "అవతరత్వార్యః" "మీరవతరింపుడు" అనుటలో విధిలేదు. ప్రకృత్యర్థము మాత్రమే ప్రదర్శనీయము. "అవతరతు" పదమునందున్న "లోట్" ప్రత్యయము స్వాభిప్రాయమునుమాత్రమే ప్రకాశింపచేయును. కాన నప్రధానము.

ప్రకృత్యర్థమే అభినేయము. ఇట్టిదిదియంతయు లోకోపచారమున నాచరింపతగినదని వ్యాపకమైన హేతువుగా నున్నది.

౬౧౩. ఉత్తమానాం కరాః కార్యా లలాటక్షేత్రచారిణః
వక్షస్థాశ్చైవ మధ్యానా మధమానా మధోముఖః

ఇందు స్థానవిభాగ మున్నది. ఉత్తముల కరములు లలాటమున సంచరింపవలెను. మధ్యముల కరములు వక్షోగతములు కావలెను. అధముల హస్తము లధోగతము లగును. ఉత్తమునందు సన్నికృష్టములు మధ్యమునందు మధ్యగతములు అధమునందు విప్రకృష్టములు అని కొందరు తలచిరి. లలాటాది శబ్దము లుపలక్షణార్థములని వారి భావము. ఆయా క్షేత్రములలో వర్తనా నివేశ పూర్వకముగ ఉత్తమ మధ్యమాధములయిన రాజామాత్య విదూషకాదులు యథోచితముగ నా యా యభినయస్థానములం దభినయముల నొనర్తురు. కావున ఇట్లర్థము నిర్ణయింపవచ్చును. దేవగురు నృపాదులయిన యుత్తములు లలాటక్షేత్రమున సంచరించు అంజల్యాది హస్తములతో నుందురు. వారి నట్లు నిర్దేశింపవలెను. మధ్యములు వక్షః క్షేత్రచరములయిన చతురాది హస్తములతో నిర్దిష్టులగుదురు. అధములు అధః క్షేత్ర చరములయిన శుకతుండాది హస్తములలో నిరూపితులగుదురు కావున అధమున కయినను చంద్రతారాది దర్శనమున లలాటక్షేత్ర చరములుగనె హస్తములుండుట విరుద్ధము కాదు అని వారనిరి. ఇది యుక్తతరమని మా యుపాధ్యాయు లందురు. చతురహస్తము అరాళ హస్తము మొదలగునవి నృత్తగాంభీర్య శౌర్యాది విరుద్ధవిషయములుగ నుండును. వారి విభాగార్థమై ఇట్లు చెప్పుట యుక్తము. ధాన్యాదులయిన ఉత్తమార్థముల యభినయములో లలాటక్షేత్ర సంచారముండుట మొదలగు విధమున పైవచనముల కర్థము చెప్పనది యని.

౬౧౪. జ్యేష్ఠే స్వల్పప్రచారాః స్యుర్మధ్యే కుర్వీత మధ్యమైః
అధమేషు ప్రకీర్ణాశ్చ హస్తాః కార్యాః ప్రయోక్తృభిః
౬౧౫. లక్షణవ్యంజితాహస్తాః కార్యాస్తూత్తమమధ్యమైః
లోకక్రియా స్వభావేన నీచైరప్యర్థ సంశ్రయాః

అభినయగతముగ విశేషాంతరము కలదు. ప్రయోగశ్రేష్ఠములు లయిన నాటకాదులలో చతుర్వర్గోపాయోపదేశము స్పష్టముగా నున్నది. అవి ప్రత్యక్షతా ప్రాధాన్యము కలవి కావున వానియందు హస్తాభినయము స్వల్పముగ నుండును. భాణకాదులు రంజనాఫలము లయినందున మధ్యమములు. వానియందు హస్తముల ప్రచారము మధ్యమముగా నుండవలెను. ఆకాశభాషితాదులు వానిలో ప్రధానములై యుండును కావున హస్తప్రచార మట్లపేక్షితము. షిద్గకము మొదలైన నృత్తకావ్యము లధమములు. వానియందు కాల తాల లయ ప్రాధాన్యముండును. ఈ అధమములందు హస్తప్రచారములను ప్రకీర్ణము లగునట్లు ప్రయోక్తలు ప్రయోగింపవలెనని, కొందరు ప్రయోగవిదులనిరి. ఈ భావము అవ్యవస్థితమయినందున యుక్తము కాదు. నాటకమునందును హస్తప్రచారములకు సంచార మధికము గనే యున్నది. పరగతమయిన విశేష ణ్యమభినేయముగా నున్నప్పుడుత్తమపాత్ర ప్రధానమునే ముఖ్యముగా భావించి అందే యభినయ మొనరింపవలెను. విశేషణాంశమునందు అంతగా అభినయ మొనరింప నక్కఱలేదు. ఈ అభిప్రాయమును కొందరంగీకరింపరు. నాట్యము నందు మీమాంసాన్యాయమపేక్షితమని వారి తలంపు. "నాగృహీత విశేషణా బుద్ధిః విశేష్య ముపసంక్రామతి." విశేషణమును గుర్తింపని బుద్ధి విశేష్యాంశమునందు సంక్రమింపదని మీమాంసాన్యాయము. దీని ననుసరించి 'గృహీతవిశేషణా విశేషధీః' విశేష్యవిషయమయిన విశేషబుద్ధి విశేషణాంశమును సంగ్రహించి యుండును అని తదర్థము. కావున ప్రధానాంశమునందువలె విశేషణాంశమునందును హస్తాభినయ మావశ్యకమని తలంతురు. పదార్థసముదాయము ఒక యభినయమున శక్యమగునా? చలస్వభావములయిన యనేకములచే శక్యమగునా? "యాస్రష్టుః సృష్టిరాద్యా" అను శాకుంతల నాందీపద్యమున ఒకడే యుత్తముడు జలహుతాశనాభినయమును ప్రయోగింపవలసియున్నది. చలస్వభావుడయినందున అధము డనేకవిధముల నొనరించును. మధ్యముడు మధ్యమముగా ప్రచారముచేయును. కావున ఉత్తమునం దీ హస్తవర్తనము స్వల్పమగునా? ఇది యంతయు శోభావిచ్యుతికారి

మైనందున నాదరపాత్రము కాదు. అభినేయములు పరిమితమగు సూచనము చేయువారు స్ఫుటముగనే యర్థ మవగమింపచేయగలరు. అర్థప్రకరణాదులా స్థలమున సుఖముగా సహాయ మొనరించునవియు యగును. "ఆనంతర్యార్థ జాతవ్యవచ్ఛేదకత్వం హి క్లేశః" సమనంతర మునందున్న యర్థములకు వ్యవధానము కల్పించుట యనునది క్లేశము. ఉత్తమప్రకృతి కల వారలయందు హస్తము లావిధముగా నుండును. అధములు యథావచన ముగా నిరూపిత మనుసరింతురు. అభినేయము నందు ప్రకీర్ణ భూయస్త్వమును సందేహించు వాని కభినయాయత్తముగా నుత్కర్షణము వికర్షణ ముండుననుట కొందర భిమానింతురు. మఱికొంద ఱిట్లందురు. ప్రచారము త్రిధా యని పంచధా యని నిరూపిత మగును. అందుత్తమునకు ఫలీభూతముగా నుత్థానాదికమయిన ప్రచార మేకరస ముగ నుండును. అధమునకు ప్రచార మతిసంకీర్ణముగ నుండును. అని, కాని యిందిది యుక్తతమముగ గోచరించును. జ్యేష్ఠాభినయము నందు ప్రత్యక్ష వర్తమానాత్మస్థవిషయమున హస్తవ్యాపార మల్పము. "హృదయ! సమాశ్వసిహి!" "తన్వీ మేఘజలార్ద్రపల్లవతయా ధౌతా ధరేవా శ్రుభిః" అనువానిలో నిది స్పష్టము. ఇందు సాత్త్వికాభినయ భూయస్త్వమున్నందున జ్యేష్ఠత్వమున్నది. అప్రత్యక్ష భావిభూత పరస్థరూపమునందు సాత్త్వికమున కవకాశము లేదు. అందావేశము లేకపోవుటయె హేతువు. కావున నందభినయ మధమము. "సత్త్వ హీనోఽధమః స్మృతః." అందు హస్తములు విప్రకీర్ణములు విక్షిప్త ములు బహులతమములు నగును. తాపసవత్సరాజమునందు కుంజరకుడు పరస్థము వృత్తము నయిన యుద్ధము వర్ణించును. వేణీసంహారమున సుందరకుడు పరస్థవృత్తయుద్ధవర్ణనము చేయును. అది యనావేశ మయినందున నధమము. ఏతద్వ్యతిరిక్తమునందు హస్తప్రయోగము మధ్యమము. రత్నావలిలో విదూషకుడు ప్రత్యక్షముగ గోచరించు నుద్యానాదుల వర్ణించుటలో మధ్యమప్రయోగ మున్నది. ఆ వర్ణన మవస్థావేశము కలుగజేయును గావున నట్టి దయినది.

ఉత్తమ మధ్యములు లక్షణవ్యంజితములయిన హస్తముల ప్రయోగింపవలెను. వర్తనాక్రమములతో కూడిన లక్షణమే సౌష్ఠవయుకల

కల లక్షణము. అట్లు లక్షణ లక్షితములనె వారనుసరింపవలెను: సౌష్ఠవ హీనము లయినవి యధముల కుండును. నీచమూపవృలును లోకక్రియా స్వభావము ననుసరించి అర్ధసంశ్రయములయిన విశేష ములను అనుసరింపతగును.

"అథవాన్యాదృశం ప్రాప్య ప్రయోగం కాల మేవచ
విపరీతా శ్రయాః హస్తాః ప్రయోక్తవ్యా బుధైర్నవా"

కొందరీ విధముగా నందురు. ఏ లక్షణ మెవరికి నిరూపితమో వారు వేరువిధమున నపరిపూర్ణాశ్లిష్టాకృతులై స్వాభినయహీనములైన విశేషముల ననుసరింపరాదు. అన్యాదృశమయిన ప్రయోగమును కాలముననుసరించి విపరీతాశ్రయములైన హస్తములను ప్రయోగింప రాదు. భయజుగుప్సాది ప్రయోగమునందు శీతకాలాది యోగమున వైపరీత్యముండరాదు. అవహిత్థాదులలో సౌష్ఠవము లేకున్నను సౌష్ఠవముండుటయు వైపరీత్యము. హస్తవైకల్యాధానము యుక్తము కాదు. ఇట్లే హస్తాభినయవర్జనావసరములు పరిశీలింప తగియున్నవి. విషణ్ణుడు మూర్ఛితుడు లజ్జితుడు జుగుప్సాశోకపీడితుడు హస్తాభినయ మొనరింప తగదు. గ్లానిపొందిన వ్యక్తి స్వప్నమునొందువాడు విహ స్తుడు మద్యమత్తుడు ప్రమాదప్రమత్తుడు నిశ్చేష్టుడు జడుడు తంద్రితుడు వ్యాధిగ్రస్తుడు జ్వరార్తుడు భయార్తుడు శీతబాధా విప్లుతుడు చింతాగతుడు తపోనిష్ఠుడు హిమవర్షహాతురు బద్ధుడు జలప్లవసంస్థితుడు స్వప్నాయితుడు సంభ్రాంతుడు హస్తాభినయ మొనరింపరాదు. ఇట్లనుటచే సర్వవిధహస్తాభినయములు నిషిద్ధములని తలచనక్కర లేదు. సత్వ సమాశ్రితములయిన యభినయములను కూర్పవచ్చును. ఇట్లనుట నిషిద్ధాంశమునకు ప్రతిపసవము. అంతరచిత్తవృత్తిని సూచనముచేయు హస్తములను వారలకు కూర్పవచ్చును. కపోతకము భయము సూచించునట్లు కర్కటకము మదనవిజృంభము గోచరింపచేయునట్లు దోల శోకము స్ఫురింపచేయునట్లు శుకతుండ మీర్ష్య నావేదించునట్లు సత్వాశ్రయము అయిన హస్తములను వారలకు ప్రయోగింపవచ్చును. సాత్వికమువలె ననుభావమును భావముకావున వారలకు సాత్వికమె నిరూపింపతగినది. బాహ్యద్రవ్యగుణాదిగమకము లగునవి వారలకు

కూర్పరాదు. నానార్థరసభావకములయిన కాకువిశేషములును పైవార లకు కూర్పజనదు. "న హస్తాభినయః కార్యః." ఇట్టి హస్తాభినయ మొనరింపరాదు. అను నిషేధమున్నను "కార్యః సత్త్వసమాశ్రయః" సత్త్వాశ్రయ మొనరింపతగునని నిరూపించుట వలన సత్త్వయుక్తము లయిన హస్తముల ప్రయోగ మావశ్యకమని సూచితమగును.

౭౧౬. యత్ర వ్యగ్రా వుభౌ హస్తౌ తత్ర దృష్టి విలోకనైః
వాచికాభినయం కుర్యాత్ విరామై రర్థ దర్శకైః

కొందరియం దెట్టిహస్తమును ప్రయోగింపరాదు. ఆ యంశ మిచట నిరూపితమయినది. రెండుహస్తములు వ్యగ్రములై యుండునేని హస్తాభినయము యుక్తముకాదు. సారథి రెండుచేతులతో పగ్గములను పట్టుటలో వ్యగ్రుడై యుండునేని యాతడు హస్తాభినయము ప్రయో గింప జనదు. ఆ యా దృష్టివిలోకనములతో చిత్తవృత్తి సూచనము చేయు ముఖరాగాదులతో తనభావము స్ఫుట మొనరింప తగును. అర్థదర్శకములయిన విరామములతో వాచికాభినయ మొనరింపవలెను, నాట్యన్యస్తసమాశ్రయమయిన అంగప్రచారము మూడు విధముల నున్నది. ఉత్తానము పార్శ్వగతము అధోముఖము నని. కొందరు హస్తప్రచారము లయిదు కలవనిరి. ఉత్తానము వర్తులము త్ర్యశ్రము స్థితము అధోముఖము నని. ఇట్టీవిధముగా నానాభినయ సంశ్రయము లయిన కరములు కలవు. జిహ్వాభినయమునందు ఆస్యక్షేత్రగతముగ త్రిపతాక ముండును. ధనురభినయమందు పార్శ్వగతముగ ముష్టి యున్నది. సముద్రాభినయమునందు లలాటక్షేత్రగతముగ అధోముఖ ముండును. భట్టోద్భటు డుత్తానము అధస్తలము త్ర్యశ్రము అగ్రగము అధోముఖము నని పంచప్రచారముల నంగీకరించెను. అధస్తలమం దధోముఖము ఉత్తానమం దగ్రగము అంతర్భూతమే యయినది. త్ర్యశ్రమనునది, త్రిపార్శ్వగతమే. సమవిషమ త్ర్యశ్రతాది భేదము లవాంతరముగా కల్గుగాని త్రైవిధ్యమే యుక్తము. రసనిష్పాదనమే అభినయవస్తువయినందున కరణ సంచయము లయిన యంగహారములు కరణలక్షణము కరణానుభావము నిరూపితమయినది. ఇందలి స్థానక భేదములను చారీభేదములను వాని స్థలమున పరిశీలింపదగును.

హస్తప్రసంగమున నృత్తహస్తములను చెప్పవలసి యున్నది. అభినయ మొనరించువాడును వానిని తెలియివలెను. నృత్తాభినయమున లతాహస్తము లున్నవి. హస్త్యభినయనమున కరిహస్తమున్నది. ఇట్లే చతురశ్రాదులకును ప్రయోగవశమున విశేషమును పరిశీలింపవలెను. ఇటుపై నృత్తసమాశ్రయములయిన కరములను నిరూపింపవలసియున్నది. కరణాత్మకమయిన నృత్తములకివి యాశ్రయములుగా నుండును గావున కరణహేతువులగును. అభినయహస్తములను చెప్పిన పిమ్మట వెంటనే నృత్తహస్తముల పరిగణనము అభినయహస్తములుగా కూడ వీనికి గణన యోగ్యత కలదని సూచించుటకే యగును.

## నృత్తహస్తములు

నృత్తమునందు జీవితము చాతురశ్ర్యమూలమయినందున తన్నిమిత్తము లయిన చతురశ్రములను నిరూపించుట యుక్తము. చతురశ్రము మొదలయిన నృత్తహస్తముల నామసంకేత మిదివరలో నిరూపితమయినది. వాని లక్షణసంకేత మిచట నిర్దేశించుట యుక్తము.

౧. చతురశ్ర : ఖటకాముఖహస్తము లురఃప్రదేశమున కష్టాంగుల దూరముగ నున్నవై ప్రాఙ్ముఖములై సమానకూర్పరాంసములుగా నుండుట చతురశ్రలక్షణము. పరస్పరమష్టాంగులాంతరముగా నున్నందున చాతురశ్ర్యము కలుగుట యభ్యూహ్యము కాగలదు. ప్రాఙ్ముఖములనుట ప్రయోక్త యత్సంముఖుడై యుండునో హస్తములు తత్సంముఖములె కావలెనని భావము. కాని యవి ప్రయోక్తృసంముఖములు కారాదు. కూర్పరము లంసములు తులాధారణ విధమున నవైషమ్యముతో నుండుటయే సమానత అంగచాతురశ్ర్యమిచ్చుటచే నివి చతురశ్రము లనదగి యున్నవి. ఈ యభినయమాకర్షణ విశేషముతో నుండును.

౨. ఉద్వృత్త : హంసపక్షకృతములయిన హస్తములు తాలవృంతమువలె వ్యావృత్తములై యుండునేని యుద్వృత్తము లగును. ఇందొక హస్త ముత్తానమగుట మరి యొకటి యధోముఖమై వక్షస్థానమునకు తిరుగుట యుండుమ. ఆ వర్తనకాలమున నూర్ధ్వమునకు

వర్తమానములగుటచే నుద్వృత్తములయినవి. తాలవృంతకములనియు నామాంతరము.

౩. తలముఖ : చతురశ్రమునందున్న హస్తములు హంసపక్షకృతములై తిర్యక్ప్రసృతము లభిముఖము లయినచో తలముఖములగును. వ్యావృత్తమగుట యుద్వృత్తమగుట యిందున్నది. పరిసమాప్తికాలమున స్వస్వపార్శ్వస్థములై త్ర్యశ్రస్థితికలిగి హంసపక్షములె యగును. అన్యోన్యము సంముఖతలముగా నుండును గావున తలముఖములు నగును.

౪. స్వస్తిక : ౫. విప్రకీర్ణ : తలముఖహస్తములె మణిబంధాంతమున స్వస్తికాకృతిగా నున్నచో స్వస్తికము లగును. విశేషముగా వేగముగ చ్యుతము లయినచో విప్రకీర్ణక హస్తము లగును. ఈ స్వస్తిక విప్రకీర్ణములు రెండును పూర్వావృత్తనృత్తహస్తముల యుపజీవనమున నుండుట స్పష్టము.

౬. అరాలఖటక : అలపల్లవరీతిలో నున్న పద్మకోశహస్తము, అరాలఖటకాముఖములు కూడియుండగా నరాలఖటకహస్త మగును. దీని రూపవిధి యిట్లున్నది. మొదట స్వస్తికముగా పతాకము కూర్పవలెను. అలపల్లవముచే గుర్తింపదగిన వ్యావర్తితకరణవర్తనమున పరివర్తనమున నూర్ధ్వముఖమున పద్మకోశములనుగా నొనరించి వెంటనే నలినీపద్మకోశములచే నొక యరాలమును ఒక ఖటకమును చాతరశ్ర్యసంస్థానమున నొనర్పవలెను. అప్పు డరాలఖటక మగును. మొదట నరాలములు పిమ్మట ఖటకములని కొందరి భావ. మణిబంధాంతమున నరాలములు కూర్చి విడువగా నరాలఖటకమని కొందరు తలచినలక్షణము.

౭. ఆవిద్ధవక్ర : భుజాంసకూర్పరాగ్రములచే కరములు కుటిలావర్తితములు పరాఙ్ముఖతలావిద్ధములు నయినచో నావిద్ధవక్రకము లగును. భుజాంసకూర్పరాగ్రములనుట నిట్లు గుర్తించునది. అంసములచే కూర్పరాగ్రములచే భుజాగ్రములచే నుపలక్షితమయిన కరమును కుటిలముగా సవిలాసముగ జేసి యావర్తన మొనరించుట అధోముఖతలములగుట దీని రూపము.

౮. సూచీముఖ : హస్తములను సర్పశిరసముల జేయునది. మధ్యమాంగుష్ఠములను తిర్యక్ప్రసారితముఖములనుగా జేయువది. అప్పు డది సూచీముఖ మగును. సర్పశీర్షములు స్వస్తికము లందుండగా నంగుష్ఠములు మధ్యప్రసారితములుకాగా సూచీముఖ రూపమని కొందరనిరి.

౯. రేచిత : హంసపక్షములు ద్రుతభ్రమణముకలవై రేచితము లయినచో నుత్తానతలములు ప్రసారితము లయినచో రేచితమగును. రేచితములనె యర్ధరేచితము లందురు. ద్రుతములు భ్రాంతములు అవి కృతములయిన హంసపక్షములు రేచితములగునని, ప్రసారితోత్తాన తలములుగా నున్నచో వికృతములును రేచితము లగునని కొందరనిరి. హంసపక్షములు రేచితములై రేచితసంజ్ఞకలవగుననుట యుక్తమె యగును.

౧౦. అర్ధరేచిత : వామహస్తము చతురశ్రము సవ్యహస్తము రేచితము కాగా నర్ధరేచిత మగును. రేచితమునందే యర్ధరేచితమును లభించుచుండగా పునర్వచనము చతరశ్రతాస్థితిని సూచించుటక కావలెను. ఈ సూచనమున నృత్తహస్తాంతరములందును పర్యాయ ప్రయోగము సూచితమగును.

౧౧. ఉత్తానవంచిత : త్రిపతాకహస్తములు అంసకపోలలలాట ములం దన్యతమ క్షేత్రమున నున్నవై యంచనక్రియతో గూడుకొను నేని, యన్యోన్యాభిముఖములై యర్ధతిరశ్చీనములగు నేని యంసములకు కూర్పరములకు కించిచ్చలనము కలుగును. అంచనవమయమున నుత్తా నత్వముండునుగావున మణల నంచనమున నుద్గమనక్రియ కలుగును. అప్పు డది యుత్తానవంచితము లగును.

౧౨. పల్లవము : ౧౩. నితంబము.

పతాకములు మణిబంధనముక్తములు కాగా పల్లవము లగును. ఊర్ధ్వావ్యావర్తిత కరణమున బాహువులనుచాచి పరివర్తత క్రియతో పతాకహస్తములు స్వస్తికాకృతికలవయినపుడు పల్లవము లగును. పల్లవాకారము కలవగుటచే పల్లవములు. నితంబరూపమిట్లుండును. పతాకహస్తములు బాహుశీర్షమునుండి స్రస్తాంతములయిన నితం

బములగును. పతాకములు బాహుశీర్షము = స్కంధక్షేత్రమునుండి విచిత్రముగా నుత్తానత్వాధోముఖత్వపర్యాయమున వినిష్క్రాంతము లగుట యని భావము. నితంబమను నామముచే నితంబక్షేత్ర మాక్షిప్త మగును. నితంబములు పర్యాయమున వర్తనము కలవగును.

౧౮. కేశబంధ : పతాకములు మొదట పార్శ్వమునుండి పార్శ్వపరివర్తనమున వెలువడి శిరమును పొందినవై కేశదేశమునుండి విచిత్రముగా వినిష్క్రాంతములై పార్శ్వమునుపొంది మఱల కేశదేశమును పర్యాయగతాగతవిధానమున నుండునేని కేశబంధ మగును. కేశసంబంధమున కేశబంధములను పేరుగలవయినవి. శోభాతిశయము కలవి కావున నాచార్యసమ్మతములని ప్రసిద్ధి.

౧౯. లతాఖ్య : పతాకములు తిర్యక్ప్రసారితములై పార్శ్వాస్థితము లయినచో లతాహస్తమగును. దీనిలో కొందరు త్రిపతాకప్రయోగమును తలచిరి. నృత్తాభినయనమునం దిది సుందరమని నాట్యవిద్భావము.

౨౦. కరిహస్త : సమున్నతమయిన లతాహస్తము పార్శ్వమునుండి పార్శ్వమునకు విలోలితమైనచో త్రిపతాకము కర్ణదేశమున నున్నచో కరిహస్త మగును. చతురశ్రములో వలె సజాతీయములకె యిందారంభ ముండును. నృత్తాభ్యాసవ్యపదేశము ననుసరించి ఖటకాముఖమునందువలె విజాతీయారంభమును యుక్త మగును. కరిహస్తాకారమున నుండుటచే కరిహస్తనామము సంగతము.

౨౧. పక్షవంచిత : ౨౨. పక్షప్రద్యోతక : త్రిపతాకాహస్తములను కటిశీర్షమునందు కూర్చినచో పక్షవంచిత మగును, పక్షము లంచితములై యుండుట సమీక్ష్యము. ఆ హస్తములే పరావృత్తము లయినచో పక్షప్రద్యోతకములు. వీని వ్యామిశ్రణమున ప్రయోగశోభయు కలుగును.

౨౩. గరుడపక్ష : పతాకము లధోముఖతలావిద్ధములయినచో గరుడపక్షము లగును. అధోముఖములై నితంబమున ప్రసరించి వేగముగా నూర్ధ్వగమన మొనరించునవి యగుట వివక్షితము. గరుడ

భుజాకారము గోచరించునుగావున లింగవాక్యప్రామాణ్యమననుస రించి కరణయోగ్యత విశదమగును..

౧౯. దండపక్ష : హంసపక్షకృతములయిన హస్తములు వ్యావృత్తములు పరివర్తితము లయినచో భుజములు ప్రసారితము లయినచో దండపక్షమగును. ఒక హంసపక్షమునకు వ్యావర్తన ముండగా విలాసముగా పార్శ్వమునుండి వక్షోనికటనమునకు వర్తన ముండుటయు నా సమకాలమునందే రెండవహంసపక్షమునకు భుజ ప్రసారణపర్యంతము వర్తనముండుటయు నింపుండును. మఱల రెండు భుజములు ప్రసారితములై వ్యావర్తిత పరివర్తితములై యుండును. ఇందు భుజము దండమువలె నుండుటచే నిది దండపక్షము రెండుభుజ ముల కొకపర్యాయమె ప్రసారణ ముండవలెనని వ్యావర్తనపరివర్తన ములు క్రమముగా నుండవలెనని కొందరు తలచిరి.

౨౦. ఊర్ధ్వమండల : ౨౧. పార్శ్వమండల : హస్తములు వక్షోదేశమునుండి వ్యావర్తనము పొందినవై లలాటదేశమున పార్శ్వ గమన మొనరించి మండలాకృతిగా ప్రసారితములయినచో ఊర్ధ్వమం డలమగును. అవియే పార్శ్వవిన్యస్తములయినచో పార్శ్వమండల మగును. ఊర్ధ్వమండలముగానున్న హస్తములె పార్శ్వగతములై పతాకాకారమున పరస్పరసమ్ముఖములుగా నుండునేని పార్శ్వమండల సంజ్ఞకలవగుట వివక్షితము.

౨౨. ఉరోమండల : ఒక హస్త ముద్వేష్టితమై మరియొకటి యపవేష్టితమై యురఃస్థానమునుండి భ్రమితము లయినచో నురో మండల మగును. ఉరమునుండి భ్రమితములగుటలో నొకహస్తమున కాగమనము వేరొకహస్తమునకు గమనము వర్తనమున నుండును. ఉరఃస్థానమునందే హస్తముల వర్తనమును కొందరు తలచిరి. ఊర్ధ్వ పార్శ్వోరోమండల హస్తములందు హంసపక్షముల వర్తనమును కొందరు భావించిరి.

౨౩. ఉరఃపార్శ్వార్ధమండల : అలపల్లవకహస్తమరాల హస్తము వక్షఃక్షేత్రమున సగము వర్తన మొనరించి పార్శ్వావర్తనము

క[illegible]దయినచో నురఃపార్శ్వార్థమండల మగును. వక్షోదేశమునుండి యుత్తానమయిన హస్తము అలపల్లవమునకు స్థానమిచ్చుటకై వ్యావర్తితమై యుండును. ఆ సమయమునందె పార్శ్వప్రసారిత భుజమయిన రెండవహస్తము తర్జన్యాదుల యుద్వేష్టనసన్నివేశము కలదై వక్షోదేశమున వ్యాపించును. వక్షఃస్థలమునందు నగ మొక హస్తమును పార్శ్వమునందు రెండవహస్తమును మండలముగా గతాగత క్రమ మొనరించును గావున నా నామము యుక్తము.

౨౩. ముష్టికస్వస్తిక : హస్తములు మణిబంధాంతమున కుంచితము లంచితములునై ఖటకాముఖము లయినచో ముష్టికస్వస్తికము లగును. ఒక హస్త మరాలవర్తనమున కుంచితమగుటయు, మరి యొకటి యలపల్లవ వర్తనమున నంచితమును కావలెను. ఈ వర్తనానంతరము ఖటకాముఖములచే స్వస్తికము కూర్పవలెను. ఇట్లు పరంపరగా స్వస్తికము ముష్టిప్రభవము కావున నామసంగతి యుక్తము. ముష్టిశిఖరకపిత్థ ఖటకములలో నేవేని ప్రయుక్తములు కావచ్చునని యనుజ్ఞానము కలదు. ఇట్లె కొందరు సంభావించిరి,

౨౪. నలినీపద్మకోశ : పద్మకోశహస్తములు వ్యావృత్త పరివర్తితములుకాగా నలినీపద్మకోశ మగును. పద్మకోశ హస్తములు సమ్ముఖములగుట మణిబంధశ్లిష్టములగుట యిందలిరూపము. కరములను స్వస్తికమున కూర్చి పరివర్తనమున నన్యోన్యము పరాఙ్ముఖముగా కూర్చుట విమ్మట పద్మకోశము సంధించుట యిందలి రూపము, నలినీలతపై యనేక కమలములుండుట సంభవమే కావున నీ పేరు యుక్తమె.

౨౫. ఉల్బణ ౨౬, లలిత ౨౭, వలిత : అలపల్లవహస్తముల యగ్రభాగముల నుద్వేష్టితమొనరించి యూర్ధ్వప్రసారమున నావిద్ధములగున ట్లొనర్చినచో నుల్బణ మగును. వక్షోదేశమునుండి యుద్వేష్టన ప్రధానములయిన హస్తము లూర్ధ్వస్కంధమున ప్రసారితములగుటయు, స్కంధాభిముఖముగా చలదంగుళీకములయినయలపల్లవములుండుటయు నుల్బణరూపము. హర్షపరవశమయిన చిత్తవృత్తిని సూచించునవి యగుట నుల్బణము. అలపల్లవములు శిరోదేశమున వర్తనముకలవి కాగా లలితములగును. చాతురశ్ర్యమునకలాలిత్య సంపాదకములు

కావున లలితనామము యుక్తము. లతాహస్తములు కూర్పరస్థాన మున స్వస్తికములుగా నున్నచో వలితమగును. బాహువుల వలన మున్నందున వలితము. ఈ విధముగా వర్తనాంతరములు పరిగ్రాహ్య ములు. సంయుతాసంయుతముల సంకలనమున నేవంప్రకారవర్తనాం తరము లనేకములు సంభవించును. వాని నర్థక్రియానుసారముగ గుర్తింపవలెను. నృత్తహస్తము లనుకరణములందు విశేషముగా ప్రయోగింపవలెను. "కరణేతుప్రయోక్తవ్యానృత్తహస్తావిశేషతః" ప్రయోగవిదు లర్థాభినయమునందు పతాకాదులను ప్రయోగింప వలెను. అర్థవశమున వీని ప్రయోగమునందు సంకరమును సంభవిం చును. నాట్యమునందుగాని నృత్తమునందుగాని ప్రాధాన్యము ననుస రించి సంజ్ఞ యుండును. వియుతసంయుతములయిన యీ నృత్తహస్తము లన్నియు నిట్లు నామౌచిత్యమున నిరూపితములయినవి.

హస్తకరణములు

౬౧౭. అతః పరం ప్రవక్ష్యామి కరాన్ కరణసంశ్రయాన్
సర్వేషామేవ హస్తానాం నాట్యహస్త నిదేశిభిః
విజ్ఞాతవ్యం ప్రయత్నేన కరణం తు చతుర్విధమ్

ఇక కరణసంశ్రయములయిన కరములను నిరూపింతుము. నాట్యహస్తనిదేశము గుర్తించిన వా రందరును సర్వవిధనాట్యహస్త ములకు కరణము నాలుగువిధముల నుండునని సావధానముగా గుర్తింప వలెను. ఈ నిరూపితము లయిన కరభేదములన్నియు కరణసంశ్రయ ములు. కరణాసక్తములు. కరణాసక్తత్వ మిందు విశేషభాగము, అదియె సంశ్రియమాణమగుకరణము. ఆ కరణమునె ఫలరూపముగా నిందు ప్రవచింపవలసియున్నది. కరములు నిరూపితములయినందున వాని నిక నిరూపింపనక్కఱలేదు. తదాశ్రయకరణములనె నిరూపింప వలెను. "లోహితోష్ణీషా ఋత్విజః ప్రచరంతి" లోహితోష్ణీషములు కల ఋత్విజులు సంచరించుచున్నారను వాక్యమున విధేయమేమి? యని మీమాంసించి యిట్లనిరి. ఇందు ఋత్విక్ప్రచరణము విధేయమా? ఉష్ణీషత్వము విధేయమా? లౌహిత్యము విధేయమా? లోహితత్వ విశిష్టోష్ణీషత్వము విధేయమా? యని వికల్పపక్షములు. ఎచట నయి

నను వాక్యాంతరాప్రాప్తమె విధేయము కావున. ఋత్విగ్వ్రచరణము వాక్యాంతరప్రాప్తమయినప్పుడు లోహితోష్ణీషత్వమె విధేయము కావలెను. లౌహిత్యవిశిష్టోష్ణీషత్వవిధానము విశిష్టవిధికావున ఉష్ణీషత్వమును ప్రాప్తమయినచో లౌహిత్య మాత్రము విధేయమని మీమాంసకుల నిర్ణయము. అట్లే ప్రకృతముకరములకు ప్రాప్తియున్నదికావున విశేషణభాగరూపమయిన కరణమె ఫలతః ప్రవచింపదగియున్నదని సారాంశము. విధిక్రియ విభక్తిరూపపదార్థవిధానపరమను న్యాయమునను కరణము కరణములు నిరూపింపదగియున్నవి. "క్రియతే సంపాద్యతే ఇతి కరణం" క్రియమాణము సంపాద్యమానము కరణమగును. కరణ మభినయవిశేషమును సంపాదించును. అంగులితులనక్రియావిశేషమున నభినయవిశేషము నిరూపితమగును కావున కరణ మగును. కనిష్ఠికాద్యావర్తనము నలపల్లవము సిద్ధమగును. వర్తనసమాప్తినిరాకాంక్షముగనున్నచో రూపయోగ్యత కలుగును. విపరీతవర్తనముండునేని వర్తనమునకు పరిసమాప్తి యుండదుకావున క్రియాంతర మాకాంక్షిత మగును. ఇట్టిదానినె యంగతత్త్వవిదులు అంగత్రోటనమని వ్యవహరించిరి. ఆ యా హస్తములందు తర్జన్యాదులకు కుంచనముండును. అరాలమునందువలె వానియందు క్రియకల్గును. శుకతుండచతురమృగశీర్షకాదులలో నిది స్పష్టము. ఇట్లె యితరములందు నభ్యూహ్యము. సర్వవర్తనములందును పతాకము కార్యకరణముగా సాధారణ్యముతో నుండును గావున సర్వప్రకృతి యనదగియున్నది. అట్టి ప్రాధాన్యమున్నందుననె పతాక యని వ్యపదేశము పొందినది. ఇందు నాట్యశబ్దమున నభినయనహస్తములును నృత్తశబ్దమున నృత్తహస్తములును సూచితములగును.

హస్తకరణము చతుర్విధము. ఆవేష్టితము ఉద్వేష్టితము వ్యావర్తితము పరివర్తితము నని, వాని లక్షణరూపము లిట్లున్నవి.

౭౧౮. ఆవేష్ట్యంతే యదాంగుల్యస్తర్జన్యాద్యా యథాక్రమం
అభ్యంతరేణ కరణం తదావేష్టితముచ్యతే

౭౧౯. ఉద్వేష్ట్యంతే యదాంగుల్యస్తర్జ న్యాద్యాబహిర్ముఖం
క్రమశః కరణంవిప్రా స్తదుద్వేష్టితముచ్యతే

౭౨౦. ఆవర్త్యంతే కనిష్ఠాద్యా అంగుల్యోఽభ్యంతరేణతు
యథాక్రమేణ కరణం తద్వ్యావర్తిత ముచ్యతే.
౭౨౧. ఉద్వర్త్యంతే కనిష్ఠాద్యా బాహ్యతః క్రమశోయదా
అంగుల్యః కరణం విప్రాస్తదుక్తంపరివర్తితం
౭౨౨. నృత్తేఽభినయయోగే చ పాణిభిర్వర్తనాశ్రయైః
ముఖభ్రూనేత్రయుక్తానికరణాని ప్రయోజయేత్

తర్జని మొదలుగాగల వ్రేళులు క్రమనియమానుసారమున నావేష్టితములగునేని యభ్యంతరవిధానమున నిది యావేష్టితమను హస్తకరణ మగును. అభ్యంతరమనుట-తలసంముఖరూపమున బాహ్యాపార్శ్వమునుండి దేహమున వక్షఃక్షేత్ర పర్యంతవ్యాప్తియుండుట యని భావము. విపరీతముగా నుండుట బహిర్ముఖము తలసంముఖముగా నుండుట యభ్యంతరవిధి. వక్షఃక్షేత్రమునుండి బహిర్గమనము బాహ్యారీతి. ౨. తర్జన్యాదికములయిన వ్రేళులు బహిర్ముఖముగా నుద్వేష్టితములగునేని యది యుద్వేష్టితమను హస్తకరణమగును. ౩. కనిష్ఠాద్యంగులు లభ్యంతరక్రమవిధానమున నావర్తితములగునేని యది వ్యావర్తితమను హస్తకరణమగును. బాహ్యాక్రమవిధానమున కనిష్ఠికాదు లుద్వర్తితము లగునేని యది పరివర్తితమను హస్తకరణమగును. ఇట్లు నృత్తమునందును అభినయయోగము ననువర్తనాశ్రయములయిన పాణికర్మలచే ముఖభ్రూనేత్రయుక్తములయిన కరణములను ప్రయోగింపవలెను. ఇట్లనుటచే నీ యర్థము విశదమగును. ఈ నిరూపితములయిన యావేష్టితాదులచే నేమి ప్రయోజనము కలుగును? అని యాశంక కలుగునేని యీ యర్థ మనుసంధానింపవలెను. ఈ యావేష్టితాదులన్నియు సాధకతమములయిన కరణములు. నృత్తమునందును నాట్యమునందును కరణములను ప్రయోగింపవలెను. నృత్తనాట్యహస్తరూపములయిన పాణి విధానములన్నియు పూర్వపశ్చాద్భావులుగా జన్యజనకవిధానమున నుండు వర్తనములను గలుగజేయుచున్నవి. అట్లు పాణికర్మలు ప్రధానములయినవి. అయిన నవి ముఖభ్రూనేత్రయుక్తములు కావలెను. పాణివర్తన మే దిశగా నుండునో ముఖాదు లా దిశగా ననుధావనము కలవి కావలెను. నేత్రభ్రూముఖరాగములన్నియు నీ పాణికర్మలచే వ్యంజితము లగును. కావున నీ కరణముల ప్రక్రియ యభినయములందు పూరణార్థముగా నుండును.

అంగుళిక్రియ బాహులగ్నము కావున బాహుప్రకారములను నిర్దేశింపవలెను.

౧. తిర్యక్ - పార్శ్వగతిచే తిర్యక్కుగా నుండుట.
౨. ఊర్ధ్వ - శిరమునకు పైగా సంచార ముండుట.
౩. అధోముఖ - భూమి నాలింగనము చేసికొనిన రీతి.
౪. అంచిత - వక్షోదేశమున వెలువడి శిరఃక్షేత్రము చేరుట.
౫. అపవిద్ధ - ప్రతిఘాతము పొంది మరలుట
౬. మండలగతి - సర్వతోభ్రమణమున మండలాకృతి
౭. స్వస్తికము - బాహువులు స్వస్తికాకృతి నుండుట
౮. పృష్ఠానుహారి - తన శరీర పృష్ఠభాగము ననుసరించుట
౯. ఉద్వేష్టిత - మణిబంధనవర్తనమున నిష్క్రమణము
౧౦. ప్రసారిత - ఎదుట ననుధావనము కలదగుట

ఈ పదియు బాహుప్రకారములు. ఇవి కరణగతములుగా నుండును. నాల్గుకరణములందు ద్రుతమధ్యవిలంబితాదివైచిత్ర్యమున బాహుపర్యాయమునను యోజనావిశేషమున నన్నియు నియుక్తము లగునేని ఘాతవర్తనాదిశతసహస్రములెన్నియేని వీనియందే యంతర్భవింపగలవు. బాహుప్రకారములు నలుబది యని శతసంఖ్యాకములని యనుట మిథ్యయే. అందుననే "కరణగతా విజ్ఞేయా నర్తకైర్నిత్యం" అని భరతు డనెను. నర్తకులీ కరణగతవిశేషముల నవశ్యము నిత్యము గుర్తింపవలెను ఇంతకన్న వ్యతిరిక్తప్రయోజన మేమియు లేవందున వీని నెల్ల గుర్తింపవలెను. ఇట్లు హస్తకరణవిధి సంక్షిప్తముగా నిరూపితమయినది. ఇక నిటుపై హృదయోదర పార్శ్వకర్మలను నిరూపింపవలసి యున్నది.

హృదయాదికర్మలు

౧. ఉరఃకర్మలు - ఆభుగ్నము నిర్భుగ్నము ప్రకంపితము ఉద్వాహితము సమము అను నివి యయిదు హృదయకర్మలు.

౨. పార్శ్వకర్మలు - నత సమున్నత ప్రసారిత వివర్తిత అపసృతములు పార్శ్వకర్మలు.

౩. జఠరకర్మలు - క్షామ స్వల్ప పూర్ణ భేదమున నుదర (జఠర) కర్మలు మూడు విధములు. కొందరు క్షామ ఖల్ల సమ పూర్ణ భేదమున నాల్గు విధము లనిరి.

౪. కటీకర్మలు- ఛిన్న నివృత్త రేచిత కంపిత ఉద్వాహిత యని కటీకర్మ యయిదు విధములు.

౫. ఊరుకర్మలు- కంపన వలన స్తంభన ఉద్వర్తన వివర్తన భేదమున నూరుకర్మ లయిదు.

౬. జంఘాకర్మలు:- ఆవర్తిత నత క్షిప్త ఉద్వాహిత పరివృత్త భేదమున నయిదు విధములు.

౭. పాదకర్మలు- ఉద్ఘట్టిత సమ అగ్రతల సంచర అంచిత కుంచిత భేదమున నయిదు.

ఇక వీని స్వరూపలక్షణ వినియోగములను నివేదింతుము.

౬౨౩. నిమ్నమున్నత పృష్ఠం చ వ్యాభుగ్నాంసం శ్లథం క్వచిత్
ఆభుగ్నం తదురో జ్ఞేయం కర్మచాస్య నిబోధత

౬౨౪. స్తబ్ధంచ నిమ్నపృష్ఠంచ నిర్భుగ్నాంసం సమున్నతం
ఉరో నిర్భుగ్న మేతద్ధి కర్మచాస్య నిబోధత

౬౨౫. ఊర్ధ్వాక్షేపైరురో యత్ర నిరంతరకృతైః కృతం
ప్రకంపితంచ తజ్జ్ఞేయమురో నాట్యప్రయోక్తృభిః

౬౨౬. ఉద్వాహితంతూర్ధ్వకృతమురో జ్ఞేయం ప్రయోక్తృభిః
సర్వైరేవాంగవిన్యాసై శ్చతురశ్రకృతైః కృతం
ఉరఃసమంతు విజ్ఞేయం స్పష్టం సౌష్ఠవసంయుతం

౧ ఆభుగ్నము- నిమ్నము ససంకోచముగా నుండును. ఉన్నత పృష్ఠముగా నుండును. అంసములు వ్యాభుగ్నములు దిగువభాగము నకు పడిపోవునట్లుండును. శ్లథము శిథిలమై నిరవష్టంభముగా నుండును. ఒక్కొకచో నాభుగ్నహృదయము మధ్యమధ్యలో నిమ్నముగా నుండును. ఇట్టి యాభుగ్నహృదయకర్మ లీ విధముగ నుండును. సంభ్రమవిషాదమూర్ఛాశోకభయవ్యాధి హృదయశల్యాభినయములం దీయురము ప్రయోగము పొందును. శీతస్పర్శముకల వర్షమునందును శీతములేకున్నను దుర్దినసమయమందును మార్గభ్రమణమునందును లజ్జాన్వితమందు నిది ప్రయోజ్యము. ఇట్టివన్నియు నర్థవశమున ప్రయోజ్యములు కావలెను.

౨ నిర్భుగ్నము: స్తబ్ధము నిమ్నపృష్ఠము నిర్భుగ్నాంసము సమున్నతము నయిన ఉరము నిర్భుగ్నమగును. బాగుగా భుజములు వంగిపోయినట్లుండును. దీనివినియోగకర్మ యిట్లున్నది. స్తంభము మాన గ్రహణము విస్మయదృష్టము సత్యవచనము నేను నేనన్న దర్పవచనము గర్వాతిశయములందు నిర్భుగ్నము ప్రయోగింపవలెను. దీర్ఘ విశ్వసిత ములందు జృంభణ మోటన బిబ్బోకము లందును స్త్రీలకీ యుదర మును ప్రయోగమున ప్రదర్శింపవలెను.

3 ప్రకంపితము: నిరంతరము పై కెగురుటలతో కూడిన ఉరము ప్రకంపితమగును. నవ్వునపుడు రోదించునపుడు హృదయప్రకంప ముండును. శ్రమభయశ్వాసకాస దుఃఖములందు హిక్కాప్రయోగము నందు అర్ధయోగమున నాట్యజ్ఞులు దీని ప్రయోగింపవలెను.

౪. ఉద్వాహితము :- ఊర్ధ్వకృతముగా నుచ్చైస్తుగా నుండు హృదయ ముద్వాహిత మగును. దీర్ఘోచ్ఛ్వాసము నందు ఉన్నతా లోకమునందు జృంభణాదులందును దీని ప్రయోగించుట సముచితము.

౫. సమము :- చతురశ్రములతో కూడుకొనిన సర్వాంగ విన్యాసము కలిగిన యురము సమమగును. ఇది స్వస్థమై సౌష్ఠవ సహితముగా నుండును. ఇట్లీ యయిదును ఉరఃకర్మలకు సంబధించిన వికల్పనము. ఇటుపై పార్శ్వకర్మలను నిరూపింపవలెను. పార్శ్వకర్మ లయిదు కలవు.

౬౨౭. కటీ భవేత్తు వ్యాభుగ్నా పార్శ్వమాభుగ్నమేవ చ
తథైవాపసృతాంసం చ కించిత్పార్శ్వనతం స్మృతం
౬౨౮. నతస్యైవాపరం పార్శ్వం విపరీతంతు యుక్తితః
కటీపార్శ్వభుజాంసైశ్చాభ్యున్నతైరున్నతం భవేత్
౬౨౯. ఆయామనాదుభయతః పార్శ్వయోః స్యాత్ప్రసారితం
పరివర్తాత్త్రికస్యాపి వివర్తిత మిహేష్యతే
నివర్తనావనయనాద్పనేదపసృతం పునః

౧. నతము:- కటీభాగము వ్యాభుగ్నమగును. పార్శ్వభాగ మాభుగ్నమగును. కొంతిగా భుజము లపసృతము లగును. ఇట్టి పార్శ్వము నత మన దగును. ఉపసర్పమునందు నతపార్శ్వము నుప యోగింపవలెను.

౨. సమున్నతము:- నతపార్శ్వమునకు సంబంధించిన యితర పార్శ్వము విపరీతముగానున్నచో కటిపార్శ్వ భుజాంసము లున్నతములై యున్నచో సమున్నత మనుపార్శ్వ మగును. దీని నపసర్పణమునందు ప్రయోగింపవలెను.

౩. ప్రసారితము:- పార్శ్వము లటునిటు నాయామనముతో నున్నచో ప్రసారితమను పార్శ్వమగును. ప్రహర్షాదులలో ప్రసారిత మును ప్రయోగింపవచ్చును.

౪. వివర్తితము:- త్రికపరివర్తమున్నచో వివర్తితమగును. దీనిని పరివృత్తాభినయమునందు ప్రయోగింపవలెను.

౫. అపసృతము:- నివర్తనము మానినచో నపసృతమను పార్శ్వ మగును. అర్థవశము ననుసరించి వినివృత్తరీతిలో నపసృతమును ప్రయోగించునది. ఇవి యన్నియు పార్శ్వకర్మలు, జఠరకర్మల నిక చెప్పవలెను. ఇది మూడు విధములని నాల్గువిధములని యనిరి.

జఠరకర్మలు

క్షామమను జఠరము సూక్ష్మముగా నుండును. స్వల్పజఠరము వంగియుండును. పూర్ణజఠర మాధ్మాతమై నిండుగా నుండును. హాస్యమునందు క్షామమును ప్రయోగింపవలెను. రుదితనిశ్వాసజృంభ ణములందును క్షామజఠరము యుక్తము. వ్యాధితునందు తపశ్శ్రాంతు నందు క్షుధార్తునందు స్వల్పజఠరము ప్రయోగింపదగును. పూర్ణ జఠరము ఉచ్ఛ్వసితునందును స్థూలవ్యక్తియందును, వ్యాధితునందును అతిభోజన మొనరించిన వాని యందును వినియోగము పొందును. కొందరు ఛామ ఖల్ల సమ పూర్ణ భేదమున జఠరము నాల్గు విధము లనిరి. ఇది యంతయు నుదరకర్మ. ఇక కటీకర్మ నిరూపింపవలెను. నాట్యమునందును నృత్తమునందును కటీకర్మ పంచవిధము.

కటీకర్మలు

౬౩౦. కటీమధ్యస్య వలనాచ్ఛిన్నా సంపరికీర్తితా
పరాఙ్ముఖస్యాభిముఖీ నివృత్తాస్యా న్నివర్తితా
౬౩౧. సర్వతో భ్రమణాచ్చాపి విజ్ఞేయా రేచితాకటీ
తిర్యగ్గతాగతా క్షిప్రం కటీజ్ఞేయా ప్రకంపితా
నితంబ పార్శ్వోద్వహనాత్ శనైరుద్వాహితాకటీ

౧ భిన్న : మధ్యవలనముతో నుండునేని కటి మధ్యకటియగును. వ్యాయామ సంభ్రాంతి వ్యావృత్త ప్రేక్షణాదులలో భిన్నకటి ప్రయోగము పొందును.

౨ నివృత్త : పరాఙ్ముఖున కభిముఖముగానుండి నివర్తితమయినచో నివృత్తకటి యగును. నివృత్తకటి వర్తనవిధానములం దుపయోగించును.

3 రేచిత : సర్వతో భ్రమణమున్నచో రేచితకటి యగును. ఇది భ్రమణాదులలో నుపయోగించును.

౪ కంపిత : వేగవేగముగా నడ్డముగా గతాగతములు కలదయినచో ప్రకంపితకటి యగును. కుబ్జవామన నీచజనుల గమనమునందు ప్రకంపితకటి నిరూపింపవలెను.

౫. ఉద్వాహిత :- నితంబపార్శ్వమును నెమ్మదిగా నుద్వాహనమొనరించుటవలన కటి యుద్వాహితకటి యగును. ఈ యుద్వాహితమును స్థూలకాయులందు ప్రయోగింపవలెను. స్త్రీల లీలాగతములందును దీని నాయోజింపవలెను. ఇటుపై అయిదువిధములగు నూరుకర్మలను నిరూపింపవలెను.

ఊరుకర్మలు

౬౩౨. నమనోన్నమనాత్ పార్ష్ణేః ముహుఃస్యాదూరుకంపనం
గచ్ఛేదభ్యంతరం జాను యత్తు తద్వలనం స్మృతం
౬౩౩. స్తంభనంచాత్ర విజ్ఞేయ మపవిద్ధ క్రియాత్మకం
వలితావిద్ధకరణా దుద్వృత్తన మితీరితం
పార్ష్ణిరభ్యంతరం గచ్ఛేద్యత్ర తత్తు నివర్తనం

౧. కంపనము : ఊరువునకు సంబంధించిన పార్ష్ణి భాగములకు మాటిమాటికి నమనోన్నమనములున్నచో కంపనమను నూరుకర్మయగును. అధమపాత్రలయొక్క గతులలో వారి భయమునందును కంపనకర్మను కూర్పవలెను.

౨. వలనము : జానుభాగ మభ్యంతరము పొందునేని వలనకర్మయగును. స్త్రీలస్వైరపరిక్రమములో నిది యుపయోగించును.

౩. స్తంభనము :- ఈ యూరుకర్మ అపవిద్ధక్రియతో నుండును. సాధ్వసమునందు విషాదమునందు స్తంభనకర్మ సంప్రయోగముండును.

౪. ఉద్వర్తనము:- వలితావిద్ధకరణమువలన నుద్వర్తనకర్మ కలదు. దీనిని వ్యాయామమునందు తాండవమునందు ప్రయోగింపవలెనని పండితులనిరి.

౫. వివర్తనము :- దీనికే నివర్తనమనియు పేరు. పార్శ్వభాగము అభ్యంతరము పొందునేని నివర్తనకర్మయగును. సంభ్రమాదులతో పరిక్రమమొనరించునపుడు వివర్తనకర్మ ప్రయోగమొనరింపవలెను. ఇట్టి యూరుకర్మ విశేషములను యథాదర్శనముగా ప్రయోక్తలు ప్రయోగమున గమనింపవలెను. ఇంకను నాట్యసుందరలోకము నుండియు నూరుకర్మలను గుర్తింపవచ్చును. ఇక జంఘాకర్మలను నిరూపింపవలసియున్నది. అవి యయిదు విధములు.

జంఘాకర్మలు.

౬౩౪. వామో దక్షిణ పార్శ్వేన దక్షిణాచ్చాపి వామతః
పాదో యత్ర వ్రజేద్విప్రాః తదావర్తిత ముచ్యతే
౬౩౫. జానునః కుంచనాచ్చైవ నతం జ్ఞేయం ప్రయోక్తృభిః
విక్షేపాచ్చాపి జంఘాయాః క్షిప్తమిత్యభిధీయతే
౬౩౬. ఉద్వాహితం చ విజ్ఞేయమూర్ధ్వ ముద్వాహనా దిహ
ప్రతీపనయనం యత్తు పరివృత్తం తదుచ్యతే

౧. ఆవర్తితము : వామ పాదము దక్షిణ పార్శ్వమున సంచరించుటయు దక్షిణమునుండి వామమునకు సంచరించుటయు నున్నచో నది యావర్తిత జంఘాకర్మ యగును. జంఘా స్వస్తిక యోగమున ఆవర్తితమగునని కొందరు తలచిరి. విదూషకుని పరిక్రమమునందు ఆవర్తిత కర్మ ప్రయోగ మొనరింపవలెను.

౨. నతము : జానుకుంచనమువలన నతకర్మ కల్గును. దీనిని స్థానాసన గతాదులలో నుపయోగించునది.

౩. క్షిప్తము : జంఘావిక్షేపమున క్షిప్తకర్మ కలుగును. దీనిని వ్యాయామ యోగము లందును తాండవము నందును ప్రయోగింపవలెను.

౮. ఉద్వాహితము : జంఘాభాగమును ఊర్ధ్వప్రదేశమున నుద్వాహన మొనరించినచో నుద్వాహిత కర్మ యగును. ఆవిద్ధ గమన మూలం దుద్వాహితము యుక్తము.

౯. పరివృత్తము : జంఘా భాగమునకు ప్రతీపగమనమున్నచో పరివృత్తకర్మ యగును. దీనిని తాండవాదులలో ప్రయోగింపవలెనని ప్రయోగవిదులు నిరూపింతురు. ఇవి జంఘా కర్మలు. ఇక పాదకర్మలను నిరూపింపవలసి యున్నది. అవియు నయిదు కలవు.

పాదకర్మలు.

౨౩౬. స్థిత్వా పాదతలాగ్రేణ పార్ష్ణి ర్భూమౌ నిపాత్యతే
యస్య పాదస్య కరణే భవే దుద్ఘట్టి తస్తు నః
౨౩౮. స్వభావరచితే భూమౌ సంస్థానశ్చ యో భవేత్
సమ పాదః సవిజ్ఞేయః స్వభావాభినయాశ్రయః
౨౩౯. ఉత్క్షిప్తాత్ భవే త్పార్ష్ణిః ప్రసృతాంగుష్ఠక స్తథా
అంగుల్యశ్చాంచితా స్సర్వాః పాదేగ్రతల నంచలే
౨౪౦. పార్ష్ణి ర్యస్య స్థితా భూమౌ పాదమగ్రతలం తథా
అంగుల్యశ్చాంచితాస్సర్వాఃసపాదోంచితఉచ్యతే
౨౪౧. ఉత్క్షిప్తాయస్యపార్ష్ణిః స్యాదంగుల్యఃకుంచితాస్తథా
తదాకుంచిత మధ్యశ్చ సపాదః కుంచిత స్మృతః

౧. ఉద్ఘట్టిత : పాదతలాగ్రమువనుండి పార్ష్ణిభాగమును భూమి యందుంచినచో నట్టి పాదకరణమునందు ఉద్ఘట్టిత పాదకర్మ యగును. ఈ ఉద్ఘట్టితమును ఉద్ఘట్టిత కరణములలో ననుకరణమున కయిన ప్రయోగమును సంపాదించి ద్రుతమధ్యమ ప్రచారమును సకృత్తుగా గాని అసకృత్తుగాగాని ప్రయోగించునది.

౨. సమము : స్వభావరచితము భూమియందు సమస్థానముగా నుండుట సమపాదకర్మ యగును. ఇది స్వభావాభినయమును ఆశ్ర యించినదై యున్నది. నానాకరణ సంశ్రయ మయిన స్వభావాభి నయమునందు స్థిరముగానున్నను నాట్యవిధి విదులు పాద రేచితము నందు దీనిని చలితముగా ప్రయోగింపవలెను. పాదాభ్యంతరమునందు

పార్ష్ణి భాగము కూడుకొని త్ర్యశ్రపాద ముదయించునని యది స్థాన కాదులలో ప్రయోగింప తగినదని కొందరు భావించిరి.

3. అగ్రతలము : పార్ష్ణి భాగ ముత్క్షిప్తమగుట. అంగుష్ఠము ప్రసారముపొందుట మిగులు వ్రేళులన్నియు నంచితములై యుండుట అగ్రతలసంచరమను పాదకర్మయగును. దీనిని తోదన నికుట్టన నిశుంభన భూమితాడన భ్రమణములందు ప్రయోగింపవలెను. ఆ సమయమున పాదవిక్షేపము వివిధ రేచకములు గమనమున కూడి యుండును.

౪. అంచితము : పార్ష్ణి భూమియందుండగా పాదమగ్రతలముగా నుండగా అంగుళులన్నియు నంచితములై యుండగా అంచితమను పాదకర్మ యగును. పాదాగ్రస్థితసంచారమునందు వర్తితమునందు ఉద్వర్తితమునందు పాదాహతము నందు నానాభ్రమరకములందును దీని నుపయోగింపవలెను.

౫. కుంచితము : పార్ష్ణి పైకెత్తుగానుండుట వ్రేళులు కుంచితములగుట పాదమధ్య మాకుంచితమగుటయున్నచో కుంచితకర్మ యగును; దీని నుదాత్తగమనమునం దుపయోగింతురు. వర్తితోద్వర్తితమునం దనుసరింతురు. అతిక్రాంత క్రమణమున దీని ప్రయోగింతురు. కొందరు సూచీపాదమునుకూడ పరిగణించిరి. నృత్తమునందును నూపురకరణము నందును దాని ప్రయోగము కీర్తితమైనది.

౬౪౨. పా జంఘోరుకరణం సమం కార్యం ప్రయోక్తృభిః
పాదస్య కరణే సర్వం జంఘోరుకృత మిష్యతే
౬౪3. యథా పాదః ప్రవర్తేత్ తథైవోరుః ప్రవర్తతే
తయోః సమానకరణాత్ పాదచారీం ప్రయోజయేత్

పాదము జంఘ ఊరువు అను వీనిని ప్రయోక్తలు సమముగా నిరూపింపవలెను. పాదకరణమునందు జంఘాకరణ మూరుకరణ మంతయు సంగతమై యున్నది. పాద మెట్లు ప్రవర్తించునో యూరు వట్లే ప్రవర్తించును. ఆ రెండిటి సమానకరణము వలన పాదచారిని ప్రయోగింపవలసి యున్నది. ఇట్లీవిధముగా అంగాభినయము నిరూపిత మైనది. వర్తనాశ్రయములయిన వినియోగప్రయోగములను గుర్తింప వచ్చును. కొందరు ప్రయోగము ననుసరించి యనుకరణార్థము

ప్రయోగింతురు. శిక్షకార్యశ్యాదులలో పురాధిక్షిప్రభృతుల ప్రయోగ మిట్టి యున్నది. కావున నాట్యవిషయమయిన వినియోగము నిరూపిత మయినది. కట్యూరుజంఘాపాదకర్మలన్నియు నితరములతో వ్యామిశ్రణము పొంది పరవైచిత్ర్యము కల వగును. సముదితస్వరూప మున నివి ప్రయుక్తములయినచో చారీగతులు మండలగతులు నగును. కట్యాదిసముదాయమండలభేదమున గతి నిష్పన్నమగును. అట్టి కట్యాది పాదాంతకర్మ లనుసరించియే చారీవిధానములు గలుగును. కావున వేరుగా వినియోగము నిరూపింపనక్కఱ లేదు. చారీమండల విధాన ములు వీని వైచిత్ర్యోదాహరణ ప్రదర్శనపరములు. వాని నా ప్రఘట్ట మున నిరూపింతుము.

గతిప్రచారము.

శ్రుత్యంత విశ్రాంతవిధిర్యా గతిః పరమాత్మనః
తాం మహానన్దసన్దోహత త్త్వమూర్తిం స్తుమః సదా

ఆంగికాభినయము రసభావనియతముగా తత్తద్విభాగాను సార మున వినియోగము కలదగుట స్పష్టము. నిరూపితమును. అయిన నాంగికముల పరస్పర మిశ్రణమున నొక ప్రత్యేకత కలుగవచ్చును. అట్టి పృథగ్రూపమున పృథగ్వినియోగమును నిరూపణీయమె. అందున నె శిష్యహిత ప్రతిపన్నుడయిన ముని దిశాదర్శన మొనరింప దలచెను. వ్యాయామ విధానములు చారీవిధానములు నన్యోన్య సమ్మిలన యోగ్యములె. వానికి సంహతి ననుసరించిన సంబంధమున మిశ్రీభావము కలిగినప్పుడు స్పష్టనిరూపితము కామన్నను మండలకల్పనము నిరూ పింప శక్యమగును. అంగికమిశ్రణమునందు రసభావ సముచితమయిన విభాగ వినియోగము విభాగశః నిరూపించుట యుచట మునిసమ్మత ము యునది. శిరః ప్రభృతి పాదాంత మంగాంగ సంభేయము లయిన నానాకర్మలు నిరూపితములె. తన్మేలన బలమున దేహాసన్నివేశమున విశేష ముదయించును. గతిలో స్థితిలో ప్రకారసంపద కలుగును. అట్టి నానాప్రకార విధానములకు వినియోగము ప్రకటించుట యావశ్యకము. చారీమండలప్రసంగ మందుగా చిత్తవృత్తి స్వభావము కాదు. వాని నిరూపణము కన్న గతివినియోగ ప్రదర్శనమె యుక్తమని ముని

సంభావించెను. గతి యనునది ప్రకృతి ననుసరించి యుండును. ర
నవలంబించి యుండును. అవస్థానుసారమున నుండును. దేశకాలాపేక్ష
మున నుండును. అట్లు గతిని నిరూపింప వలసి యున్నదని భరతభావము.
పురుష పురుష నియతముగా గతి నిరూపిత మగుటలో నిట్టి భావమునె
గ్రహింపవలసి యున్నది. గతి ప్రక్రియ మొదట నిర్దిష్ట మగును. ఇది
ప్రకృతి స్థితిగతి. "అతః పరం ప్రవక్ష్యామి గతీస్తు ప్రకృతిస్థితాః"
ఇటుపై ప్రకృతిస్థితగతి ప్రకారముల నిరూపింతునని యనుటలో గతి
నిరూపింతు నని ప్రకృతిస్థితగతి నిరూపింతునని భావము గ్రాహ్యము.
మధ్యమున్న తు శబ్దము యావచ్ఛబ్ద పర్యాయ వాచి యయినను
క్రమార్థమున కాకాక్షివలె నుభయతో ధావనమున గతి భావమును
ద్యోతిత మొనరించుచున్నది. రంగ ప్రవిష్టునకె గతివిధాన మనుట యుక్తము.
అప్రవిష్టునకు గతి యేమి? కావున ప్రయోగోపక్రమము ప్రవేశోప
క్రమము సూచింప వలసి యున్నది.

౬౪౪. తత్రోపవహనం కృత్వా భాండవాద్య పురస్కృతం
యథామార్గ రసోపేతం ప్రకృతీనాం ప్రవేశనే

౬౪౫. ధ్రువాయాం సంప్రవృత్తాయాం పటే చైవాపకర్షితే
కార్యః ప్రవేశః పాత్రాణాం నానార్థరససంభవః

భాండవాద్యపురస్కృత మయిన యుపవహన మొనరించిన
పిమ్మట, యథామార్గరసోపేతముగా ప్రకృతి ప్రవేశమయిన పిమ్మట,
ధ్రువాగానము ప్రవృత్తమయిన పిమ్మట, పట మాకర్షించిన పిమ్మట
నానార్థరససంభవ మయిన పాత్రప్రవేశ మొనరింప దగునని సూత్రార్థము.
రంగానుసారాలాపమున కుపవహన మని పేరు. ఇట్లు రంగానుసారి
క్రమాలాప మయిన యనంతరము సముచితముగా ధ్రువాప్రవృత్తి
యుండును. ఈ యాలాపము భాండవాద్య పురస్కృతముగా నుండ
వలెను. నానార్థరససంభవ మయిన పాత్రప్రవేశ మొనర్చుటకు పూర్వ
మాలాపము ప్రకృతి ప్రవేశము ధ్రువాప్రవృత్తి యను మూడు
నావశ్యకములు, ఇది యిటు రూపత్రయయుక్తము. ఈ మూడును
క్రియావిశేషణములు. తంత్రీభాండము వాద్యమానమగు పుష్కర
వాద్యము. ప్రకృతి ప్రవేశము యథామార్గరసోపేత మగుట యుక్తము.

ఇందు మార్గమనునది దేశము. స్థాయిచిత్తవృత్తి రసము. ఏ యే గృహోద్యాన నిర్దేశముకల దేశము కలదో, యే యే రత్యాదిచిత్త వృత్తివిశేషము కలదో యా యా దేశవిశేష మా యా చిత్తవృత్తి విశేషము కూడియుండునట్లుగా నని భావము. ధ్రువారీతియు నుత్త మాది ప్రకృతి కలవారి స్వభావసముచితాకారమున నుండుట యుక్తము. ఉత్తమాదిప్రకృతుల యొక్క బుద్ధ్యావేశప్రవేశములకు తగిన విధమున ధ్రువారీతి యుండుట యుక్తము. ధ్రువారీతులలో హంసాద్యుపమానముఖమున ప్రకృతివిశేషము నిబంధింప వలెను. చిత్తవృత్తివిశేషమును కూర్పవలెను. ఉద్యానాదివిశేషము నవశ్యము కూర్పవలెను. ఇట్లు ధ్రువాగానము ప్రవర్తించిన యనంతరము పటాప కర్షము యుక్తము. అట్లు యవనిక యపసారితము కాగా "నేపథ్య గృహమునుండి యీతడు వచ్చినా"డని సామాజికులకు భావ ముద యించును. అంతవఱ కచటనున్న నటి మరలి పోవును. ఆ సమయమున నటి యుపోహనము కలది యగును. ఇచట మధ్యలయవిధానమున ప్రయోగవలనాదిక ముండునని కోహలాదు లనిరి. ధ్రువాప్రవేశము నందు శుష్కాక్షరగాన మొనరింపవలెనని ప్రవేశమునందె సముచితస్థాన కము సముచితదృష్టి సముచితముఖరాగాదిక మావశ్యకమని గుర్తింప వలెను. ఇట్లొనర్చినచో సామాజికులకు ముఖ్యరసవ్యాప్తి యుదయిం చును. ప్రగీత మాలింపగనే సమగ్రతత్త్వసంవేదనమును గలుగును. గీయమాన గీతమునందలి గ్రామరాగాగ్రగతైకగమకాకర్ణనమున సమగ్రగ్రామతత్త్వము గోచరమగును.

"యథామార్గ రసోపేతం" అనుటను కొందరు యథామార్గ కలో పేతం" అని పఠించిరి. చిత్రాదిమార్గములందు కొన్ని కలాపాతము లుండును. ద్విమాత్రచతుర్మాత్రాష్టమాత్రా విధానములు గ్రామము లందవభాసించును. వాద్యాక్షరగతములుగా నుండు కలామాత్రాదు లును గుర్తింపవలసి యున్నవి. ధ్రువాగానము లేకున్నను పాత్ర ప్రవేశ ముండుటయు నిరూపితము కాగలదు. అయిన నిది సంభవమాత్రాభి ధానమని గుర్తించునది. ఉత్తమ మధ్యమపాత్ర ప్రకృతి ప్రస్తావమున నిట్లు చెప్పుటయు యుక్తమగును. ఉత్తమ మధ్యములకు సంబంధించిన

ధ్రువారీతులు ప్రవేశవిధానములును సంగృహీతములై యగును. అందొకటి సమవిధమున నుండుటయు మరియొకటి పక్ష పక్షమున నుండుటయు కలదు. నాట్యవిదుడు ప్రకృత్యనుసారమున గతిప్రయోగ మొనరింపవలసి యున్నది. పాత్రప్రవేశానంతరము గతి యున్నది. తత్ప్రకారము లున్నవి. అవి యన్నియు నానార్థ రస సంభవములు. నానా ప్రయోజనములు కల రసమువలన సంభవించునవి. నానార్థ సంభవము లగునవి రససంభవము లగునవి యని తత్తత్సమయ భావ పురస్సరముగ గుర్తింపవలెను. ఈ యర్థమిదివరలో నిరూపితము.

రంగమునందు ప్రవేశించు వ్యక్తి వైష్ణవస్థానక మవలంబింప వలెను. సమున్నతముగా సమముగా నురముంచి బాహు శీర్షములను ప్రసన్నము లగునట్లుగనె సరిచూచుకొనుచు సమస్థితిలో నుంచవలెను. మయూరాంచితమస్తకముగా గ్రీవా ప్రదేశ ముండవలెను. స్వస్థ మయూరమునకువలె సురూపమగు శిరముండుట యుక్తము. వక్షోదేశ మునకు చిబుకము చతురంగుల వ్యవధానమున నుంచి ప్రవేశింపవలెను. హస్తములు కటినాభితటస్థితములై యుండుటయే యుక్తము. దక్షిణ హస్తము నాభిగతము. వామము కటితటగతము. పాదముల యంతర మును నియతముగా నుండును. ఇది స్థితస్థానకమునందే యుక్తము. పాదముల యంతరము సమముగానుండుట వివక్షితము. ఖటకా ముఖము అర్ధచంద్రము ననునవి హస్తవిన్యాసములందు స్ఫురించును. ఉపవిష్ట స్థానకమునందు విధ్యంతరములున్నవి. ఏసలమున నే స్థానక లక్షణము సూచితమగునో అదియే అచట అనుసరణీయము. స్థానకా నంతరము నందు గత్యనుసరణము సముచితము.

౬౪౬. పాదోత్క్షేపస్తు కర్తవ్యః స్వప్రమాణ వినిర్మితః
చతుస్తాలో ద్వితాలశ్చాప్యేకతాల స్తథైవ చ
౬౪౭. చతుస్తాలస్తు దేవానాం పార్థివానాం తథైవ చ
ద్వితాలశ్చైవ మధ్యానాం తాలః స్త్రీనీచలింగినాం
౬౪౮. చతుష్కలోథ ద్వికలస్తథా హ్యేకకలః పునః
చతుష్కలో హ్యుత్తమానాం మధ్యానాం ద్వికలో భవేత్
౬౪౯. తథా చైకకలః పాతో నీచానాం సంప్రకీర్తితః
స్థితం మధ్యం ద్రుతం చైవ సమవేక్ష్య లయం బుధః
యథాప్రకృతి నాట్యజ్ఞో గతిమేవం ప్రయోజయేత్

తమ తమ ప్రమాణ వినిర్ణీతమైన పాదోత్క్షేప మొనరించుట యుక్తము. ఆ యుత్క్షేపము దేశకాలపరిచ్ఛేదముతో నుండుటయు యుక్తము. చతుస్తాలము, ద్వితాలము, ఏకతాలము నని వ్యవధాన రీతులలోని పరిచ్ఛేదవిశేషములు. ఆ యావ్యక్తులకు తమ తమ కర ప్రమాణ మనుసరించి తాలవిధిని గుర్తించునది. తాలము అనునది ప్రసారిత హస్తమున మధ్యమాంగుష్ఠాంతర ప్రదేశము. దీనినే జాన అని వ్యవహరింతురు. దేవతలకు చతుస్తాల ప్రమాణము. పార్థివులకు ప్రభువులకును చతుస్తాలమే. ప్రయోగజాతమంతయు స్థాయిస్థానమగు ఉత్తమ ప్రకృతియందు విశ్రమించునది యగును. కావుననే ఉత్తమ ప్రకృత్యనుసారమున చతుస్తాల విధానము నిర్దేశించుట యుక్తము. "చతుస్తాలస్తు దేవానాం" అను స్థలమున నున్న 'తు' శబ్దము అప్యర్థమగును. "చతుస్తాలోపి దేవానాం" దేవవ్యక్తులకు చతుస్తాల విధానము కూడ నుండును అనెడుభావము లభించును కావున ఒకప్పుడు దేవపార్థివులకు చతుస్తాలగతియే కాక అన్యథాగతియు నుండవచ్చును. పార్థివుల గతివిధానమున 'తథైవ చ' యుండుటచే ఇట్లర్థము లభించును. రాజుల కొకప్పుడు దేవసదృశగతి సంభవింప వచ్చును సంభవింపక పోవచ్చును. అయినను ఈ అసంభవ సంభావ నము నపసారణ మొనరించుటకే 'తథైవ చ' యున్నది. రాజులగు వారవశ్యము దేవవిధాన మవలంబించి తీరవలెను. గతియందది స్ఫుట గోచరము కావలెను. అని భావము. మధ్యములకు ద్వితాలము స్త్రీనీచలింగిజనులకు ఏకతాలవిధియు సంగతము. లింగిజనులు స్త్రీ సాహచర్యమున నీచసాహచర్యమున అధములని గుర్తించునది. వారు బయటికి దేవలింగములతో ధర్మలింగములతో గోచరింతురు కావున వారి యధమత్వమును కొందరు సంభావించక పోవచ్చును. నాట్యధర్మి విధానమునననుసరించి యథాశోభముగా నుండుట యుక్తము. ఇంతవర కీచెప్పినది దేశనియమవిధానము. గతివిధిలో కాలనియమము కూడ కలదు. ఇది యౌత్సర్గికము. సామాన్యముగా నిట్లుండుననుటయే దీని భావము. కాలనియమమునందు చతుష్కల ద్వికలైకకలవిధు లున్నవి. ఉత్తములకు చతుష్కలము. మధ్యములకు ద్వికలము. నీచాధములకు ఏకకలము నయిన పాతముచితము. పాదోత్క్షేపముతో పాదపతన

మనునది ఉత్తములకు నాలుగు కలాకాలవిభాగములతో నుండును. మధ్యమాధములకు తదర్ధక్రమమున నుండును. ఇట్టిది పరిభాషిత మగుటయంతయు నుత్సర్గవిధానము. "నిమేషాః పంచ మాత్రా స్యాత్" అయిదునిమేషము లొక మాత్రాకాలము. కలాసామాన్య లక్షణమువలన లబ్ధమయిన విధానము. ఇది ధ్రువకమార్గమునందంతట కలదు. ఉత్తముల విధానమునందు చతుష్కలపాదపాత ముచితము. ఇట్లు చెప్పుట ధ్రువకమానము ననుసరించిన విశేషరీతి. ఉత్తమపరిగ్రహమున ద్విపదీరీతిని కోహలు డిట్లు నిరూపించెను. ఉత్తములద్విపదీ రీతి చదుర్గురుసమన్వితమై యుండును. వారి యుత్క్షేపనిపాతములతో పాదద్వయము సంగత మగును. ప్రక్కన ధ్రువాగీతి ద్విపదీభాగమున ప్రసరించునపుడు పాదమున పాదపాతము ప్రసరించును. అప్పటి ధ్రువకమునందు నాలుగుకల లుండును. ఇచటి కలాకాలము గీతిసంకేతము ననుసరించి యుండునదియే కాని స్వరకాలము కాదు. ఇది యొక వ్యంజనకాలము. ఇట్టి యీ విధానము సమనంతరగ్రహణమునందు విశ్రాంతిసముచితముగా నుండదు గావున దుష్కరప్రయోగముగా నుండును. స్థానచేష్టావిశ్రాంతి ప్రక్లుప్తికొఱకై మధ్యగతముగా విరామ రూపమయిన యొకమాత్రాకాలమును లక్ష్యవిదులు ప్రకల్పించిరి. ఆ విధానముననుసరించి కలాకాలమునందు సంకేతములు గోచరించును. ఇచట చిత్రమార్గమున చతుష్కలపాదపతన మనువది న్యాయము కావచ్చును. కాని యిది లక్ష్యలక్షణశోభాబాహ్య మగుటచే అపేక్షితము కాదు. స్థితం మధ్యం ద్రుతం అనుట లయకాలనియమవిధానము. ఇందు స్థిత మనునది విలంబితమునకు సంజ్ఞ. ద్రుతమధ్యవిలంబిత లయ విధులను బుధుడు సమీక్షించి ప్రకృత్యనుసారమున ప్రయోగ మొనర్పవలెను. ప్రకృతిభేదవిభాగము ననుసరించియే సర్వ మొనరింపవలెను. ధైర్యస్థైర్య విలంబితలయమధ్యలయ సమ్మతమయిన సంవేదన మంతయు యథార్థ ధైర్యగాంభీర్యాదికృతము కావచ్చును. మిథ్యా ధైర్యాదికృతము కావచ్చును. గౌణధైర్యాదికృతమును కావచ్చును. ఎట్లున్నను ప్రకృత్యనుసారమున నుండుటయే యుక్తము.

౬౩౦. స్థైర్యోపపన్నా గతిరుత్తమానాం
మధ్యాగతి ర్మధ్యమసమ్మతానాం
ద్రుతా గతిశ్చ ప్రచురాధమానాం
లయత్రయం సత్త్వవశేన యోజ్యం

ఉత్తముల గతి స్థైర్యోపపన్నమగును. మధ్యమగతి మధ్యకాలగతి యగును. అధములగతి విలంబితగతి యగును. ఇట్లు లయత్రయము సత్త్వవశమున సంయోజింప తగినదై యున్నది. ఈ విధముగా ఉత్తమ మధ్యమాధమ సత్త్వ వశమున నుండునేకాని జాతికాలాది కృతముగా నుండును. విదూషకుడు ద్విజుడే యగును. కాని ఆతడుత్తమ సత్త్వ ప్రకృతి కాడు. ఉత్తమ ఘోషణము కొఱకే జాత్యాదికము సంకేతించుట కలదు. ఉత్తము డన్యథా భావమున మారిపోయినచో ఉత్తమత్వము గోచరము కాక పోవచ్చును. లోక ప్రసిద్ధమయిన సత్త్వస్థితి యిందును గ్రాహ్యము. అవయవ భేదము ప్రకృతిసిద్ధముగా నుండదు. ఉత్తమత్వాదిక మవయవముల ననుసరించి యుండదు. సత్త్వవశమున కలిగిన చిత్తవృత్తి భేదమున నది యుండును. కావుననే సత్త్వబలమున లయత్రయము యోజనీయము. సత్త్వమనునది చిత్తవృత్తి కావున సంగ్రామాదులు సంప్రాప్తమయినచో నుత్తమునకు ద్రుతగతి యుండును. శోకాదులలో నధమునకును విలంబితరీతి యుండును. గత్యుపయోగి ధ్రువాగీతిలో వీనిననుసరించుట ముఖ్యమగు విధి. కలాతాల లయరీతిలో నిదియే విధి యని భరతుడు స్పష్టమొనరించెను. తాలవిధి గత్యనుసారియై యుండును. కలాసహితమయిన తాల లయము కలాతాలలయము. ధ్రువాతాలమునందు కలావిధి లయ విధియు గత్యనుసారముగనె యుండును. ఈ రీతి ననుసరించియే భంగోప భంగ విభంగ విషయమున భట్టలోల్లట గోపాలాదులు చిరంతన సమ్మతమయిన ధ్రువాతాల వినియోగమును దూషించిరి. ఈ యంశమును ధ్రువా పరిశీలనమున పరిశీలించెదము. ఇటుపై గతి ప్రచార ప్రయోగమును నిరూపింప వలసి యున్నది.

నిరూపితమయిన దేశకాల నియమము గతి ప్రచారానుకూలముగా భావింపవలసి యున్నది. గతి ప్రచారమనుట గతులందలి ప్రచారము. వైచిత్ర్యము. ఉత్తమగతిలో కటీ సమముగా జానువుండ

వలెను. యుద్ధచారీ ప్రయోగములందు విశేషమున్నది. మంథరగతిలో చతుస్తాలముగా నుండుట స్వాభావగతిలో త్రితాలముగ నుండుట కలదు. దీప్తగతిలో పంచతాల ప్రమాణముగా నుండుటయు విరుద్ధము కాదు. ఆ గతి ప్రచార ఘటన మిట్లుండును. వాద్యాన్వితములయిన సలలితపాద విన్యాసములు కల పార్శ్వక్రాంతములతో రంగకోణో న్ముఖముగా నయిదడుగులు వేయవలెను. పార్శ్వ క్రాంత విధానము కుంచిత పాదము నెత్తి పార్శ్వస్థానములో నుంచుట ఉద్ఘట్టిత పాద ముతో నుండుట యగును. రంగ కోణోన్ముఖముగా గమనమునందు పూర్వోత్తరము ఉత్తర పశ్చిమముగా గమనమొనరించుట ఒక కోణమున కున్ముఖముగా నడచి పరివర్తనమున ద్వితీయకోణాభి ముఖ ముగా నడువవలయును. పిమ్మట భాండోన్ముఖముగా నడచునది. ఈ గమనమునందు బ్రహ్మస్థానమును మాత్ర ముల్లంఘింపరాదు. ఇట్లిరు వది యొకటి యడుగులు సంచరించునది. పంచపదీగమన మనునది సామాన్యము.

౬౫౧. రంగే వికృష్టే భరతేన కార్యో గతాగతః పాదగతి ప్రచారః
త్ర్యశ్రస్త్రికోణే చతురశ్రరంగే గతిప్రచార ఏశ్చతురశ్రఏవ

వికృష్టమగు రంగమునందు భరతవిద్యాయోని సంబంధముకల నాట్యవిదుడు గతాగతములచే నిట్లు పాదగతి ప్రచార మొనరించుట యుక్తము. త్రికోణరంగమునందు గతిప్రచారమును త్ర్యశ్రముగనే యుండును. చతురశ్ర రంగమునందు చతురశ్రముగ నుండును. పరిమిత దిక్కునందు పంచపది యుండును. ఒకే స్థానమునందు రెండు పాద విక్షేపములను కూర్పవలెను. వికృష్ట రంగములో భూయో భూయః ప్రకారమున పంచపది యుండును. ఈ విషయమునందు పాదరీతి వివిధ ప్రమాణములతో నున్నది. కొన్నిట ద్విలయ ప్రధానము. ద్విభంగ ముఖ్యము. చతుర్భంగమే ప్రధానము. ఇది యంతయు సమగతి ప్రచారము. సమపదసహితుడై గతి ప్రచార మొనరించుటలో లయా శ్రయ కల్పము సముచితము. ఆ లయాశ్రయరీతి చతుష్కలముగా ద్వికలముగా ఏకకలముగా నుండవచ్చును. మిశ్రగతిలో మాత్రము కొంత విశేష మున్నది. మధ్యమ నీచులతో పరివారితుడయి ఉత్త

ముడు సంచరింప వలసి యున్నచో చతుష్కాలముగా కాని తదర్ధముగా గాని సంచరించునది. దేవాది పరివారితుడై యుత్తముడు సంచరించు నపుడు తదాశ్రయముననె గతిప్రచార ముండును. ఉత్తమ పాద పాతములో మధ్యమునకు రెండుపాతములును నీచున కొక్క పాత మును నుండును.

౬౨౨. దైత్యాదానవ యక్షాణాం నృపపన్నగ రక్షసాం
చతుస్తాల ప్రమాణేన కర్తవ్యాథ గతిర్బుధైః
౬౨3. దివౌకసాం తు సర్వేషాం మధ్యమా గతిరిష్యతే
తత్రాపి చోద్ధతా యే తు తేషాం దేవైః సమా గతిః

దైత్యాదానవయక్షప్రాణులకు నృపపన్నగరక్షోజనులకు చతుస్తాలప్రమాణమున నాట్యవిదులు గతిని నిరూపింపవలెను. ద్యులోకము నందు వసించు దేవదూతాదుల కందరకు మధ్యమగతి యుక్తము. దివౌకసులలో కొందరుద్ధతులుందురు. మాతలి ప్రభృతు లుద్ధతులు. వారలకేని దేవతలతో సమముగా గతి నిబంధించుట యుచితము. రాజులు మానవులు కదా !. వారలకు దేవగతి యెట్లు కుదురును. ఈ యంశము విచారింప తగియున్నది. దేవగతి రాజులకేల యుండదు ?

౬౨౪. అథ దివ్యాః ప్రకృతయో దివ్యమానుష్య ఏవచ
మానుష్య ఇతి విజ్ఞేయా నాట్యవృత్తిక్రియాం ప్రతి
౬౨౫. దేవానాం ప్రకృతిర్దివ్యా రాజ్ఞాం వై దివ్యమానుషీ
యా త్వన్యా లోకవిదితా మానుషీసా ప్రకీర్తితా
౬౨౬. దేవాంశజాస్తు రాజానో వేదాధ్యాత్మమ కీర్తితాః
ఏవం దేవానుకరణే దోషో హ్యత్ర న విద్యతే

నాట్యవృత్తిక్రియాశ్రయముగా మూడువిధములగు ప్రకృతు లున్నవి. దివ్యప్రకృతి యొకటి దివ్యమానుషప్రకృతి మరియొకటి. మానుషప్రకృతి మూడవది. దేవతలప్రకృతి దివ్యప్రకృతి యని రాజుల ప్రకృతి దివ్యమానుషప్రకృతి యని లోకము తెలిసికొనిన ప్రకృతి మూడవదియైన మానుషప్రకృతియని నిర్ణీతమైయున్నది. రాజులు దేవాంశజులు. లోకపాలాంశవినిర్మాణము కలవారు. వేదములందును అధ్యాత్మశాస్త్రములయిన వేదాంతములందును రాజులప్రాధాన్యము నిరూపితమై యున్నది. ఉత్తమవిద్యావిశేషములు రాజవిద్యా రాజ

గుహ్యాం అని సంకీర్తితము లయినవి. రాజులకు దేవానుకరణమున అల్పత్వము లేదు. రాజులు దేవానుకరణ మొనరింపవచ్చును. దేవానుకరణమున నెట్టి దోషమును లేదు. ఈ చతుష్కలవిధాసీమిత మయిన గతిప్రకారము స్వచ్ఛందగమనము ననుసరించి యున్నది. ఇది స్వస్థగతి. స్వభావసహజమైనగతి సంభ్రమోత్పాతరోషములలో ప్రత్యేకముగా ప్రమాణము విహితమగుట లేదు. సంభ్రమ మావేగము. ఉత్పాత మిందున్మాదాదికము. సంభ్రమాదులలో ఈ చెప్పిన ప్రమాణము లేదు. సర్వప్రకృతులకును అవస్థాంతర సంశ్రయముగా ఉత్తమాధమ మధ్యగతి నిరూపితము కావచ్చును. ప్రయోక్త లిట్లు నిబంధింప వచ్చును. చతురర్ధకలము కూర్పవచ్చును. తదర్ధకలమేని కూర్పవచ్చును. అవస్థాంతరము ననుసరించి గతివిచేష్టిత మిట్లుండ వచ్చును. అవస్థాంతర సంశ్రయముగా నుత్తమునకు చతురర్ధముగా ద్వికల ముండునని మధ్యమున కేకకల ముండునని నీచునకర్ధకలమే యుండునని యన నక్కరలేదు. అవస్థాంతరబలము వలన సర్వప్రకృతుల గతియు కలాలయ తాలాశ్రితముగ నుండును. జ్యేష్ఠజనునందు చతుష్కల విధానము మధ్యమునందు ద్వికల విధానము నుండును. ఉత్తమునందు ద్వికల పద్ధతి యున్నచో మధ్యమునందేక కల గతి యుండును. మధ్యమునందు కలికమే యుండునేని నీచులందర్ధకల ముండును. అర్ధార్ధ హీనముగా జడులకు కూర్పవలెను. నీచులందర్ధకల ముండవలెనని కలాతుర్యభాగమును భరతముని సూచించుటచే లక్షణవిదులు ద్రుతము వృత్తాకారమని యనుచున్నారు. ఈ చెప్పిన విధానమున పంచమాంశము శ్వాసాది విశ్రాంతి పూర్వక మగును. ద్రుతము చతుర్విధముని నుండుటయే యుక్తము. కొన్ని సమయములందు చతుష్కల రీతికన్న అధికముకూడ కలదు. జ్వరార్తునియందు క్షుధార్తునియందు తపఃశ్రాంతునియందు భయాన్వితునందును అధికలముగా పాదపాత ప్రచార ముండును. భయాన్వితున కూరుస్తంభ ముండును. కాకున్నచో వాతనికి త్వరిత త్వరగతి యున్నది. ఇట్లే విస్మయమునందు అవహిత్థమునందు ఔత్సుక్యసమన్వితరీతి యుండును, శృంగారమున శోకమున,

స్వాచ్ఛంద గమనమున స్థితలయమయిన అధికల పాతము నిరూపించుటయే యుక్తము. విస్మయమువలన నొక్కొ-కడు స్తంభితుడు కావచ్చును. అవహిత్థమనునది యాకార గోపనము. అట్టివారు కృతక ధైర్యులు. కృతకము సుశ్లిష్టమొనరింప శక్యముకాదు. అవహిత్థా వికృతిలో ఆధిక్యమే కల్గును. అందునన కుశలజనులు కృతకమని యందురు. అట్లె యౌత్సుక్య సమన్వితుని యందును గుర్తింపవలెను. శృంగారమనుట శృంగారభేదమగు విప్రలంభము. విప్రలంభమునం దధికలపాతముండును. ప్లుతములో కాని విరూపములో కాని స్వరూపాధిక్యము కలుగవచ్చును. ఆ సంఖ్యాధిక్యమున షట్క-ల మష్టకల మగుట కలదు. అట్టి పాదపాతమప్పట నుండును. ఈ షట్క-లాష్టకల పాదపాతరీతి అంతట యుక్తము కాదు. ఇది స్త్రీజనమునకు ఖేదన మగును. స్వాచ్ఛందగమనమునంగు చతుష్క-లాధికముగా పాత ముండును. చింతాన్వితు నందలి గతి చతుష్క-లాగతిగనె కూర్పవలెను. చతురశ్రైక కల గతి నిరూపణమును స్పష్టముగా భరతుడు సంకేతించుటచే సప్తకలపాతము నిషేధించినట్లూహింపవచ్చును అట్లే త్రికలపంచకలాదులును నుండవు. ఉత్క్షేపణనిపాతములు పరిమాణముతో నున్నవై గోచరించును. కావున విషమముల యోగము సంగతము కాదు. తాలవిత్సామ్య ముపనిషద్భూతమగుట విస్పష్టము.

ఈ సంకేతించిన వారివిషయమున వికలగతిప్రయోగముయుక్తము. అస్వస్థకామితము కలవానియందు, భయవిత్రాసితునందు హర్షావేగ సహితకార్యమునందు అనిష్టశ్రవణమున క్షేపమున నద్భుతదర్శనమున ఆత్యయిక కార్యమునందు దుఃఖితునియందు శత్రుమార్గణమున అపరాధానుసరణమున శ్వాపదానుగతియందు వికలగతియే యుక్తము. ఈ నిరూపించిన వారిలో షట్క-లాధికమాన మేనియు నుండవచ్చును. తపశ్శాంతుల పరిక్రమమునం దుల్లసనలయ ముండును కావున నతి విలంబితరీతి యుండునని కోహలాదు లనిరి. సర్వస్థలములందు కలాధిక్యముండుటయే కాదు కలాన్యూనతయు కలదు. ఈ చెప్పిన అస్వస్థకామితాదులలో వికలగతియే యున్నది. ప్రచ్ఛన్నకామితునందు త్వరాతిశయము స్పష్టము. బాంధవాదుల యనిష్టము వినినవాడు

ద్రుతగమన మొనరించును. ఆత్యాయికకార్యము శీఘ్రసంపాదనప్రయోజనము కలది. అది యభిరుచితము కాకున్నను నవశ్యకర్తవ్య మగును. త్వరాకృతము, త్వరాన్వితము సుకార్య మభిరుచితకార్య మగుట ఇందు విశేషము. ఈ చెప్పిన వాని ననుసరించి సర్వము గుర్తింప శక్య మగును. కాని కవినటవ్యుత్పాదనమునకై ఈ ప్రపంచన మావశ్యక మయినది. అపరాద్ధానుసరణ మనునది యిట్లుండును. శత్రువునకు సంబంధించిన యపరాధ మభినేయ మగునపుడు వికలరీతి యావశ్యకము. గుర్వాదుల కపరాధ మొనరించి వారికోపమున దూరమేగినవా డపరాద్ధుడు. ఈ నిరూపితులందు ఇట్టివారియందును మదాదులందును వికలగతిని నిరూపింపవలెనని సంగతి నూహించునది. వికలరీతి యనుట నియతకల లేదనుట. అర్ధకల, తుర్యకల యుండుటయేకాక త్రిభాగ షట్భాగాదులును నుండవచ్చును. ఇచట నిరూపించినవన్నియు విషమ భాగవిషయములు. నాగానందములోని శేఖరకుని వృత్తగతిలో ఖండక ప్రయోగమునందును వికలవిషమపాత మున్నది. వాని కందు సామ్యము లేదు. కలాసామ్యముండుట న్యూనాధికతా నిరూపణమున సమవిషమకలాభాగముల భంగాభిధానమున గురులఘుద్రుతప్లుతముల స్వీకారమున వైచిత్ర్య మనేకవిధముల నున్నది. భంగములు పండ్రెండు కలవు. ఉపభంగము లారున్నవి. విభంగములు కొన్నియున్నవి. భంగోపభంగవిభంగముల ప్రకారప్రస్తారములచే సంగృహీతములయిన భంగలయవ్యవస్థలు లక్ష్యసిద్ధములై యున్నవి. ప్రతిపాద్యాక్షరరూపముగా తదర్ధాది రూపముగా ధారాబంధాదివిషయాఘాతమార్గమున ప్రసిద్ధమయిన వ్యవస్థ యంతయు స్ఫుటముగ నిదర్శితమయినది. ఇట్లుగా కలా పరిమాణ నియమాభిధాన మంతయు గజస్నానమే యగును కాని యది యట్లు కాకుండవలెనని ముని సూచింపదలచెను.

౬౯౭. ఉత్తమానాం గతిర్యా తు న తాం మధ్యేషు యోజయేత్
యా గతిర్మధ్యమానాం తు న తాం నీచేషు యోజయేత్

ఉత్తములకు సంబంధించిన గతివిధానమును మధ్యములందు యోజనము చేయరాదు. మధ్యములకు సంబంధించిన గతిరీతిని నీచు లందు యోజనము చేయరాదు. నిదర్శితమయిన [illegible]మున

నియమము విప్లుతమే యయినది. కలాధిక్యమునందు త్తమునకు షట్కల రీతి యుండునేని మధ్యమునకు చతుష్కలత అధమునకు ద్వికలత యుండుటయే యుక్తము. న్యూనకలగతి చెప్పినప్పు డుత్తమునకు కల యొకటి యుండునేని మధ్యమున కర్ధకలయు అధమునకు కలాతుల్య భాగమును నియతమే యయినది కావున విప్లవమేమికలదు? ఈ కారి కాద్యోత్య మయిన భావమును నిట్లే యున్నది. ఉత్తమునకు చతుష్కలరీతి యున్నదని మధ్యమాధములకు చతుష్కలరీతి చెప్పుట లేదు. నీచున కేకకల యున్నదని మధ్యమోత్తముల కొకే కల నిరూ పించుట లేదు. ఆ యా విధమున నిరూపించుటయు తగదు. కావుననే యుత్తమగతి మధ్యములకు మధ్యములది నీచునకు లేదని నిషిద్ధ మయినది. ఈ నియతగతి ననుసరించినచో కలాపరిమాణ నియమాభి ధానము గజస్నానీ భూతము కానేకాదు.

ఇట్లు ప్రకృతి భేదమున గతినిరూపితము రసవిషయమున గూడ గతినిరూపణ మావశ్యము. మొదటగా పురుషార్థోపయోగి రసవిషయ ములయిన పరిక్రమ విధానములను నిరూపించుట యుక్తము. వీనిలో ప్రీతినిదర్శనమేకాక వృత్త్యుత్తిదర్శనమును కలదు. సర్వజన సులభమయి నందున శృంగారము ప్రధానము. శృంగారవిషయముగ గతిరీతి యిట్లుండును.

౬౫౮. గతిః శృంగారిణీ కార్యా స్వస్థకామిత సంభవా
దూతీదర్శనమార్గస్తు ప్రవిశేత్ రంగమండలం
౬౫౯. సూచయా చాప్యభినయం కుర్యా దర్థసమాశ్రయం
ప్రచ్ఛన్నకామితే చైవ గతిం భూయో విబోధత

శృంగారవిధానమునందు స్వస్థకామితము ప్రచ్ఛన్నకామితము- నని రెండు విభాగము లున్నవి. స్వస్థకామిత మప్రచ్ఛన్నకామితము. శృంగారమునందలి గతి స్వస్థకామితిసంగతమై హృద్యముగా నుండును. దూతి మార్గము చూపుచుండగా నాయకుడు రంగమండలము ప్రవేశించు నది. సూచావిధానము ననుసరించి యర్థసమాశ్రయముగా నభినయ మొనర్పవలయును. హృద్యవస్త్రములు గంధధూపములు చూర్ణవిశేష ములు భూషావిశేషము సంపాదించును గావున అట్టివానిచే నాతడు భూషితుడగుట యుక్తము. నానాపుష్పసుగంధములుకల మాలలచే

నలంకృతుడయి సలలితపాదవిన్యాసములతో అతిక్రాంతస్థితవిన్యాసము లతో నాతడు గమన మొనరింపవలెను. వెన్వెంటనె నాతడంతయు నడువరాదు. కొంత నడువవలెను; కొంత యాగవలెను. లయతాళ వశానుగతములైన విధానములతో సౌష్ఠవసంయుక్తములయిన పద విన్యాసములతో నాతడు గమన మొనరింపవలెను. ఆతని హస్తము లును పాదానుగములై యుండుట సముచితము. హృద్యపదార్థము పర్యాలోచన మొనరించుట సాతిశయముగా చమత్కారి యైనది. చర్వితచర్వణముగా నేయంశమును పరిత్యజింపక శృంగారమునందు సూచావిధి ననుసరింపవలెను. యుద్ధవీరాదులలో నిట్లు కాదు. ప్రధా నానుసంధానమె యందుచితము. తన్మధ్యపతితములైన కార్యాంతరము లేవియు నందు పర్యాలోచనీయములు కావు. అట్టి పర్యాలోచన మున్నచో శత్రుసేనాగతులలో ఆచార్యుడుకలడని మాతులుడున్నా డని భ్రాతృజనము స్వజనముకలదని యనిపించును. అట్లనిపించుట యుద్ధ వీరున కుచితముకాదు. అర్థసమాశ్రయముగా నభినయముండవలయు ననుటలో నిదియే యర్థము. నృత్తములందలి యితరసూచ్యములను పరిహరించుట యిందలి భావమని యయుక్తార్థము చెప్పనక్కరలేదు. సూచారీతి యెన్నడు నిరర్థకము కానేకాదు. అట్లయినచో నది సూచయే కాదు. అప్రచ్ఛన్నకామితమునందలి సవిలాససౌష్ఠవవిధా నము లిట్లున్నవి. ప్రచ్ఛన్నకామితమునందలి విధానమును వేరుగా గుర్తింప వలసియున్నది. నాయకుడు రహస్యముగా కామితము కల వాడగుట నీశృంగారమునందును. వత్సరాజు సాగరిక యందనురా గముకలవాడగుట ప్రచ్ఛన్నకామితమగును. రావణుడు సీతయందను రాగము కలవాడై గమనమొనరించుటయు ప్రచ్ఛన్నకామితమే కాని అందు కొంతవిశేషమున్నది. పరిజనమును విడనాడి శిథిలస్రస్తదేహుడై దూతీసహాయమాత్రమున నాయకుడు గమన మారంభింపవలెను. దీపమార్పియే సంచరింపవలెను. మిక్కిలి భూషణవిభూషితుడు కాకూడదు. వేలాతుల్యవస్త్రుడై యుండుట యిందలి రీతి. చంద్రా లోకమునందు సితవస్త్రావగుంఠితుడై ఘనసారపరాగపుంజమంజు గాత్రుడై ముక్తాప్రాయప్రచురాభరణుడై యుండుట యుక్తము.

నిశ్శబ్దమందపాదములతో దూతిని వెంటబెట్టుకొని నెమ్మదిగా ప్రచ్ఛన్న కాముడు సంచరింపవలెను. క్షణక్షణము శబ్దము శంకించువాడై పర్యుత్సుకుడై అవలోకతత్పరుడై వేపమానశరీరుడై శంకితచిత్తుడై ప్రస్ఖలత్పదుడై యాతడు సంచరించును. ఈతని గతియందంతట మిశ్ర ప్రయోగము గోచరించును. ఇట్టి కామివిషయమునే కోహలాదులు సుభద్రమను పేరుకల ధ్రువాతాలముగా కీర్తించిరి. విప్రలంభశృంగారమునందు శృంగారగతి కరుణవ్యామిశ్రమై యుండును. వ్యభిచారి భావవిశేషములతో సంవాదియై యుండును. విషయాభిలాష ప్రాణమైన శృగారమందు గతి యంతయు నీచెప్పిన విధమున నున్నది.

నానారసములందును గతివిశేషములు కలవు. రౌద్రరసమునందు దైత్యరక్షోగణముల గతి విశేషములను నిరూపించుటయు యుక్తము.

> ౬౬౦. ఏక ఏవ రసస్తేషాం స్థాయీ రౌద్రో ద్విజోత్తమాః
> నేపథ్య రౌద్రో విజ్ఞేయ స్త్వంగ రౌద్రస్తథైవ చ
> ౬౬౧. తథా స్వభావ జశ్చైవ త్రిధా రౌద్రః ప్రకల్పితః
> గతి రేవం ప్రకర్తవ్యాః తేషాం యేచాపి తద్విధాః

దైత్యరక్షోగుణముల వారికి రౌద్రరసమొక్కటియే స్థాయిగా నుండును. దైత్యాదులకు క్రోధము లేకున్నను రౌద్రత యుండును. ఈ యంశము రసనిరూపణమున నిరూపితమె. తదనుసరణమునకై మరల నిరూపించుటయు యుక్తము. రక్షోదానవాదుల కొరకే రసముండుట ప్రసిద్ధమే. వారి యా రౌద్రము మూడువిధములు. నేపథ్యరౌద్రము అంగరౌద్రము స్వభావజరౌద్రము నని యా భేదములు. నేపథ్యజ రౌద్రమునందు రుధిరక్లిన్నదేహాత రుధిరార్ద్రముఖత్వము పిశితహస్తత యుండును. నెత్తురుత్రాగి నెత్తురు పూత పూసికొని మాంసపుముద్దలు చేతితో పట్టి వచ్చువాని వేషము నేపథ్య రౌద్రవేషము. అంగ రౌద్రమునందు బహు బాహువులు బహు ముఖములు నానా ప్రహరణములు స్థూలము ప్రాంశువయిన దేహము కూడి యుండును. స్వభావజ రౌద్రమున్నప్పుడు రక్తాక్షుడు పింగకేశుడు నీలదేహుడు వికృతస్వరుడు రూక్ష స్వభావుడు నిర్భర్త్సన పరాయణుడగును. ఆతని పాదపాతములు చతుస్తాలాంతరములతో నుత్క్షిప్తములై యుండును. ఈతని పాదపాతము నందలి తాలపదము కాలమానమునే

చెప్పను కాని దేశమానము నిరూపింపదని యుపాధ్యాయులనిరి. ఎంతటి కాలమున పాదోత్క్షేపముండునో అంతటి కాలమున పాదపతనముండదు. న్యూనకాల ప్రమాణముననే పాద పాతముండును. ఇట్టిరీతి ననుసరించి చూడగా ప్రకృతి సంధి సంరంభము కూడ నుండును. కావున రక్షో దానవాదులకు విషమగతి చెప్పినట్లయినది. రౌద్రాది రసములందు విషమగతి యుండునన్న భావమున నర్తనకోత్ఫుల్లకాదులు నుండునని కోహలకాదు లనిరి. రక్షోదానవుల కిట్టిగతి నిరూపింపవలెను. తద్విదులైన భీమసేనాదులకును యుద్ధవీరమునం దీగతియే యుక్తమని సూచితమగుచున్నది.

బీభత్సాభినయమునందు గతి నిట్లు ప్రయోగింపవలెను. అహృద్యమగు భూమి శ్మశానరణకశ్మలమై యుండును గావున అచటి సంచారమున పాదములు ఉపర్యుపరి పతితములు కావలెను. ఒక్కొక్కచో నాసన్నపతితములై ఒక్కొక్కచో వికృష్టపతితములై ఏలకా క్రీడిత విధానములతో పదము లుండును. రౌద్రప్రాణమయిన ఉగ్రతా వివక్షలో పురుషార్థ ప్రాణముగానుండు బీభత్సాశ్రయమయిన గతి నిరూపించుట యావశ్యకము కాన నిదియు నిచట ప్రసక్తము. పాద పాతానుకూలముగనె హస్తవిన్యాసము లిందుండును. రసగతులన్నింటి యందును పాదానుగముగా హస్తచాలముండుట ప్రసిద్ధము.

వీరము నందు పదవిక్షేప మీ విధమున నుండును.

౬౬౨. ధృత ప్రచారాధిష్ఠానా నానాచారీ సమాకులా
పార్శ్వ క్రాంతైర్ద్రుతా విద్ధైః సూచీవిద్ధైస్తథైవచ
౬౬౩. కలాకాల గతైః పాదై రావేగే యోజయేత్‌గతిం
ఉత్తమానామయం ప్రాయః ప్రోక్తో గతి పరిక్రమః

వీరమున పదవిక్షేపము విస్తరముగా క్షేపముతో నుండును. క్షేపమని యనుట స్పందితావస్పందితములకు నుపలక్షణము. అందు కలా కాల మర్ధకలాకాలము ప్రయోగింప జనును. కావుననే యిది యుల్లాసనికమన్న తాళగతిగలది యని యనిరి. గంతవ్య దేశమునందు శీఘ్రప్రచార మిందు కలదు. నానాచారీ విధానము లిందు సమాకులముగా నుండును. పార్శ్వ క్రాంతములు ద్రుతావిద్ధములు సూచీవిద్ధములు నిందు ప్రవేశము పొందును. కలా కాల గతములయిన పాదము

లతో గతియోజన మొనర్పవలెను. ఆవేగమునం దిట్టిగతియే యుపకారి. పాద పాతములిందు మూడుండుట యుచితము. కలా కాల సన్నిధానమున తాలగతి గతియే లఘుపాతనముతో నుండును. ఇట్లును నుండవచ్చును. లఘుపాతమొకటి యుండుటయు రెండనో్యన్య ద్రుత హీతములును నిందు సంగతము లగును.

౬౬౪. ఉత్తమానామయం ప్రాయః ప్రోక్తో గతి పరిక్రమః
మధ్యానామధమానాం చ గతిం వక్ష్యామ్యహం పునః

ఈ చెప్పిన గతి పరిక్రమమంతయు ఉత్తమ ప్రకృతికల వ్యక్తులకు నిర్దిష్టము. బీభత్సమే యుత్తమవిషయము కదా! వీరము త్తమవిషయ మనుటయేమి? యని శంకించు వాని నిట్లనవలెను. "కేనైతదుపదిష్టం భవతః" దీనిని నీకెవరుపదేశించిరి? బీభత్స ముత్తములందు కూర్చినచో నది యుక్తమగును. పురుషార్థ సాధనము నగును. తదుచితముగా నిరూపితము లయిన రసవిషయ వ్యభిచారి భావముల సంబంధ మున్నచో బీభత్సముత్తములం దుండును. సముదాత్తము లయిన భావముల సంబంధముండుట వీరమున నున్నది. అట్టిది యుత్తమ సంచారము. మధ్యముల కధములకును గతి పరిక్రమ మింతకన్న వేరుగా నుండును. మధ్యములకు విస్మయమున హర్షమున నావేగమున ఇట్టి వ్యభిచార్యంతరము లందును పదక్రమ ముత్క్షిప్తముగా నుండును. ఇటునటు వ్యాకులప్రాయమై లఘుద్రుత బహులమై పరిక్రమముండును. విస్మయము వ్యభిచారి భావముగా నున్నప్పుడే యిట్టి విక్షిప్తగతి. విస్మయము స్థాయి భావమై అద్భుత రసరూప మయినపుడు వేరుగా నుండును. ఉత్తములకు నద్భుతమునందు పూర్వ నిరూపిత మయిన స్వచ్ఛందగతి యుండును. మధ్యములకు హాస్యము ననుసరించి పద విక్రమ మిట్లుండును. వేరొక పద విక్రమమును వారలకు యోజనము చేయవచ్చును. హాస్య విషయమున స్మితాద్యతిహసిత పర్యంతము నిరూపించుటలో ఉత్తములకు స్వస్థగతి మధ్యముల కపహసితాతి హసితములు, విక్షిప్తగతి యుండును. హాస్యము ననుసరించిన విదూషక గతిలో నన్యవిధానము లుండును. ద్రుతహాస్య యోగ్య గతి వానిగతి.

కరుణమునందలి గతి స్థితపదములతో నుండును. విలంబిత పదములతో నుండునని భావము. ఆయతోత్సృష్ట మయిన గతి వారి యప్పటి గతి. కొంతగా స్తోకగతి సూచితమయినను నిదియు గ్రాహ్యము. బాష్పాంబురుద్ధనయనుడై సన్నగాత్రుడై చేతులెత్తుచు జారవిడుచుచు సంచరింపవలెను. సస్వనరోదనముతో గమన మొనర్పవలెను. క్రొత్తగా నప్రియము వినినచో సరోదనగమనమె యుక్తము. ఇట్టివిధానము స్త్రీలకు నీచసత్త్వులకు తగియుండును. కరుణములం దుత్తములపరిక్రమము స్త్రీనీచవిలక్షణము. వారలకు సధైర్యసంచారము, బాష్పసంగతముకాని పరిక్రమ ముచితము. దీర్ఘములగు నిశ్వాసములు, దైవోపలంభము సూచించుపైచూపులు వారల కుండును. ఈ విధానములలో మిక్కిలి సౌష్ఠవము కూర్పరాదు. అట్టి ప్రమాణమేని కూర్పజనదు. సర్వథా ప్రమాణము లేక పోలేదుగాని యనియంత్రితపాతముగా నుండుటయే ఇందు ప్రమాణము. కావున విలంబితలయముతో నొకప్పుడు ద్రుతలయవిధానముతో నుండుటను కోహలుడు నిరూపించెను. మధ్యమవ్యక్తులకును తత్తద్విధాన మనుసరించి, సత్త్వసముచితముగా గతియోజనము చేయవలెను. వారురఃపాతముతో నుందురు. గుండెలు బాదుకుందురు. హతోత్సాహు లగుదురు. శోకవ్యామూఢచేతను లగుదురు. ఇష్టబంధువినిపాతము వినినచో నత్యంత ముత్క్షిప్తములు కాని పరిమితోత్క్షిప్తము లయిన గతిపరిశ్రమములతో వారి విధానము కూర్పదగును. కరుణప్రసంగమున ప్రహారగతియు నిచట యుక్తము. గాఢప్రహారము కల్గినచో శిథిలాంగములతో శిథిలభుజములతో పరిక్రమముండును. శరీరము ఘూర్ణిత మగును. చూర్ణపదగతి యుండును. శీతాభిభూతులకు వర్షాభిద్రుతులకు స్త్రీనీచప్రకృత్యాశ్రయముగా ఇట్టి గతిని ప్రయోక్తలు నిరూపింపవలెను. గాత్రములను పిండీకరించుకొని చేతులను వక్షముపై నిక్షేపించుకొని గజగజ లాడుచు పొట్టిపొట్టిగ కుంచించుకొని పోవుచు దంతోష్ఠస్ఫురణములతో చిబుకప్రకంపనములతో శీతాభినయగతి యుండును. వర్షాసమయమున లోకప్రసిద్ధమయిన గతి యిందునుండును.

భయానకమునందు గతిని విచక్షణు లిట్లు ప్రయోగింపదగును. స్త్రీలు కాపురుషులు సత్త్వవర్జితులయిన ఇతరులు భయానకగతి కలవారగుదురు. కొందరు కులాదుల యౌచిత్యమున నుత్తములే యగుదురు కాని సత్త్వవర్జితులయినందున నన్యులగుదురు. భయచకితు లగుదురు. విరాటపుత్రుడు త్తరుడిందు గుర్తింపదగినవాడు. ఇట్టివారల గతిప్రక్రమ మిట్లుండును. నేత్రములు విచలములు విస్ఫారితములు నగును. శిరము విధుత మగును. దృష్టి భయసంయుక్త మగును. పార్శ్వవిలోక మధిక మగును. ద్రుతగమన ముండును. కపోతకహస్తధారణముండును. శరీరము ప్రవేపనము పొందును. పెదవు లెండిపోవును. తొట్రుపడుచు వారు గమనము చేయుదురు. వారి వికృతసత్త్వము వారి వికృత రవము గుర్తించి వారి గమన మట్లే నిరూపింపవలెను. మధ్యమధ్యలో కొంత ధైర్య ముదయించినట్లు గురులఘు పాదపాదములు కూర్పవలెను. స్త్రీలకు నిట్లే కూర్చునది. వారి పాదపాతములు ఒకచో నాసన్న పతితములు మరియొకచో వికృష్టపతితములు వేరొకట నేలకాక్రీడితములు నగును. పైపై పాదపాతములు పదము లెత్తియెత్తి వేయుటలు వీనిలో నుండగా భీతవిభీతులగు వీరి హస్తసంచారములును పాద పాతానుకూలముగనే యుండును.

శాంతరసమున గతిప్రచారము నిరూపింపవలసి యున్నది. సత్త్వ ప్రాధాన్య ముండుటచే నది ప్రయోగసౌకర్యము కలుగచేయును. వణిక్ప్రభృతుల కంతస్సంస్కార మున్నప్పుడు శాంతగతి ప్రయోగ రమ్యత నాపాదించును. "వీరప్రశాంతా వణిజః" అని సూక్తి. యతి ప్రభృతులు శాంతరసప్రధానులు. వణిజులకు యతులకు నాటకాది ప్రసక్తి యున్నచో వారి గతిసంచార మిట్లుండును.

౬౬౩. వణిజాం సచివానాం చ గతిః కార్యా స్వభావజా
న నిష్టబ్ధం న చ స్తబ్ధం న చాపి పరివాహితం

౬౬౬. కృతాః గాత్రం తథా గచ్ఛేత్ తేన చైవ క్రమేణ తు
యతీనాం శ్రమణానాం చ యేచాన్యే తపసి స్థితాః

౬౬౫. తేషాం కార్యా గతిర్యే తు నైష్ఠికం వ్రతమాస్థితాః
అలోలచక్షుశ్చ భవేద్యుగమాత్ర నిరీక్షణః

౭౭౮. ఉపస్థితస్మృతిశ్చైవ గాత్రం సర్వం విధాయ చ
అచంచలమనాశ్చైవ యథావల్లింగమాశ్రితః
౭౭౯. వినీతవేషశ్చ భవేత్ కాషాయవసనస్తథా
ప్రసన్నం వదనం కృత్వా ప్రయోగస్య వశానుగం
౭౮౦. అనిషణ్ణేన గాత్రేణ గతిం గచ్ఛేదో వ్యతిక్రమాత్
ఉత్తమానాం భవేదేషా లింగినా యేమహావ్రతాః
విభిరేవ విపర్యస్తై ర్గుణైరన్యేషు యోజయేత్

వణిజులకు సచివులకు స్వభావసహజమైనగతి నిబంధింప తగును. స్వభావ సహజ మనుట యనావిష్టరూప స్వరూపమును చెప్పును. అతిక్రాంత పదములతో ద్వితాలాంతర గమనముతో వారి విధాన ముండును. యతులకు శ్రమణులకు తపోనిష్ఠులైన వారలకును గతిక్రమ మిట్లే యుండును. నైష్ఠికవ్రత మవలంబించిన వారలకును నిదియే గమనము. నైష్ఠికులనుట బ్రహ్మచర్యమునుండియే మహావ్రత మవలం బించిన వారని భావము. అనిషణ్ణముగా అస్తబ్ధముగా అపరివాహిత ముగా గాత్రస్థితి నుంచికొని యీ క్రమమున నె వారు గమింపవలెను. అలోలనేత్రులై యుగమాత్ర నిరీక్షణులై వారుందురు. వారల స్మృతి నిత్యముపస్థితమై యుండును. ఝుటితి సంస్కార ప్రబోధ ప్రభవ మగు స్మృతి వారి యధీనము. యుగనిరీక్షణులనుట నాలుగు హస్తముల దూరము వారు నిరీక్షింతురు. అచంచలమనస్కులై యథావల్లింగము నాశ్రయించినవారై వినీతవేషులై కాషాయవసనులై వారు సంచ రింతురు. ప్రయోగవశానుగముగ ప్రసన్న వదనముతో వారి స్వభా వము స్పష్టమగును. శాంతు లయినందున వారి హృదయము నియమ్య మగును. నిర్జనవిషయమునందు వారలకు గతిచార ప్రచారములు నిత్య నిరూపణ పరములై యుండుట గుర్తింప వలెను. ఉత్తములకు యతులకు జడభస్మ కౌపీనలింగ ధారులకు నిట్టిగతి నిరూపణము సముచితము. ఈ నిరూపించిన గుణములు విపర్యస్తములై యున్నను నామమాత్ర వృత్తి వ్యవహారములతో నుండు వారలకును యథోచిత ముగా వీని నిబంధనమును పర్యాలోచనము చేయవలెను. ఈ చెప్పిన గతి విపర్యాసమును వారలకు నిరూపింపదగును. చంచలనేత్రము, చంచలచిత్తము నిరూపింపవచ్చును. వ్రతానుగత మయిన యవస్థా

నిరూపణము సముచితము. ఆగమములలో నున్మత్తాది వ్రతము-
లున్నవి. తత్తదుచితముగా గతి నిరూపింప వచ్చును. "కార్యా పాశు-
పతానాం చ గతిరుద్ధతగామినీ" పరమేశ్వర వ్రతధారులగు పాశుపత
వ్రతధారులకు అత్యుదాత్తగతి సముచితము. విభ్రాంతగతి యుదాత్త
గతి నిభృతగతి తత్తదుచితముగా నిరూపించునది. పరమయోగ్య-
వస్థలో నాకులదర్శన ప్రతిపన్నులగు పాశుపతవ్రతులు కొందరున్మత్త
వ్రతు లగుటయు కలదు. అట్టివారి యందుద్భ్రాంతగతి యిట్లుగా
రసాంతర సంగతి నిరూపిత మయినది. రసానుసారి గతి నిరీక్షణమున
సావధాను లగుట సముచితము.

దేశానుసారమున గతిప్రచారము కలదు. అంధకారగమనము
నందు గ్రుడ్డివాడై గమన మొనరించుటయందును భూవిసర్పితము-
లతో మార్గాన్వేషణపరములయిన హస్తపాదసంచారములతో గతి
యుండుడు. రథగతుని గతి చూర్ణపదములతో నుండును. సమపాద
స్థానకమున రథగతి ననుసరింపవలెను. రథగతి యనుట రథసహాయ-
మున వేరొక దేశమునకు గతి యొనర్చుట రథవిశిష్టమగు గతియేని ఇట్లే
యగును. ధనువు కూబరము యుగంధరము ప్రతోదకము ప్రేషణము
ప్రగ్రహము వల్గ రథ్యములగు వాహనములు రథగతి కలవానికి నియ-
తములు. ఆతని సూతుడు ప్రతోదప్రగ్రహకులుడై యుండుటయు
శాకుంతలమున కాళిదాసు నిరూపించెను. ప్రకృతి విభాగౌచిత్యమున
విచిత్రములగు తురగ బలీవర్ద ఖరోష్ట్రకములును రథగతిలో కూర్చ
వలెను. తురగాదుల లిఖితచిత్రములను సూతుని హస్తములం దుంచ
వలెను. రంగమండలమునందు చూర్ణపదములతో గమనము నిరూ-
పణీయము. రథగతి కల వ్యక్తి రథ్యామండలమునందే గతిక్రియ నాచ-
రించును. కావున సర్వమాచిత్రమును రథాకృతిగా నిర్మింపవలెను.
అట్టిగి అనుగతపదమాత్రముగనే యుండును. అప్పుడు రథగమనము-
సామాజికుల కవభాసించును.

౮౭౧. విమానస్థస్య కర్తవ్యా హ్యేషైవ వందనీ గతిః
ఆరోఢుముద్వహేద్గాత్రం కించిత్స్యాదున్ముఖస్థితం

విమానగతునకు నిట్టి స్యందనగతియే నిరూపణీయము. దివ్య-
ప్రకృతి యగువాడు గగనచారియై పుష్పకాది విమానములతో సంచ

రించును. వానికిట్టి రథగతి యుక్తము. ఆరోహణ మొనర్చుటకై తన దేహము నూర్ధ్వమునకు ప్రసరింప చేయువలయును. ఉన్ముఖస్థితి ననుసరింపవలెను. ఈ స్థితికి వైపరీత్యమున నవరోహణము నిరూపించునది.

౬౭౨. అధోవలోకనైశ్చైవ మండలావర్తనేన చ
అకాశగమనే చైవ కర్తవ్యా నాట్యయోక్తృభిః
౬౭౩. వ్యోమ్నశ్చావతరేద్యస్తు తస్యైతాం కారయేద్గతిమ్
ఋజ్వాయతోన్నతనతైః కుటిలావర్తితైరథ
౬౭౪. భ్రశ్యతశ్చ తథాకాశా దపవిద్ధభుజా గతిః
వికీర్ణవసనా చైవ తథా భూగతలోచనా

విమానప్రసంగమున నాకాశగతి చెప్పవలసి యున్నది. అధోవలోకనము మండలావర్తనము ఆకాశగమనమున కూర్చవలెను. సమపాదస్థితి చూర్ణపదరీతి ఆకాశముననుండి యవతరణమున నిరూపింప తగును. ఋజ్వాయతములు ఉన్నతనతములు కుటిలావర్తితములు అపవిద్ధభుజరీతి ఆకాశమునుండి పడునపుడు ప్రయోగింపవలెను. ఆ సమయమున వసనము వికీర్ణమగుట లోచనములు భూగతములై యుండుట కలదు. మండలావర్తనగతిని పరివర్తులగతి యని కొందరనిరి. ఆకాశచారీ మండల రీతులను పునఃపునరావర్తన మొనరించినపుడిట్టిగతి యుండునని యస్మదుపాధ్యాయులనిరి. ఉన్నతనతము లనుట ఉత్క్షేపకాలమునం దున్నతములు పాతనకాలమునందు నతములని భావము. అబుద్ధిపూర్వకముగా నాకాశమునుండి పడునపుడు భుజములు త్వరిత డోలాకార పాతములతో నుండును.

ప్రాసాదద్రుమశైలము లందు నదీనిమ్నోన్నత స్థలములందు ఆరోహణ మవతరణ మర్థవశమున కూర్చవలెను. అతిక్రాంత పదములతో ప్రాసాదారోహణము ప్రసిద్ధము. సోపాన పంక్తులలో గాత్రోద్వహనములో పాదన్యాస ముండుటయు ప్రసిద్ధము. అట్లే యవతరణము కూడనని గుర్తించునది. ప్రాసాదావతరణమునందు ప్రతారము కేవలప్రాయము. జలమధ్యమునందు గతి జలప్రమాణాపేక్షముగా నుండును. జలమల్పముగ నున్నచో వసనోత్కర్షముచితము అధికముగా నున్నచో పాణి వికర్షణము లావశ్యకము. పాణిగతమయిన విచిత్రకర్షణము పాణివికర్షణ మగును. పతాకము సర్పశీర్షకము మొద

లగు వానితో నుపలక్షితమయిన గతిసంబంధ మిందూహింపవలెను. అబుద్ధిపూర్వకముగ జల ప్రవాహమున కొట్టుకొనిపోవునాతడు వారి వికర్షణములతో నొక్కొక్క బాహువును సారించుచు నీదుకొనుచు పోవలెను. ఇందు వదనధూననము, సర్వాంగాకులత్వము తిర్యక్ప్రసారము కూడియుండును. అస్వాతంత్ర్యమున నివి కలుగును. బుద్ధిపూర్వకమయిన జలప్రతరణము వేరు. అబుద్ధి పూర్వకముగా ప్రవాహమున కొట్టుకొనిపోవుట వేరు. ప్రాసాదారోహణమునందును కొండలనెక్కుటయందును, ఇట్లే నభ్యూహింపదగును. చూర్ణపదగతితో నాగతి యుంకును. వృక్ష ప్రాసాదాదికము రంగస్థలమునందు రథచిత్రపటాది న్యాయమునను దర్శింపనక్కరలేదు. సంజ్ఞామాత్రమున నివి యిన్నియు కర్తవ్యములు కాగలవు. సరిదవతరణము ఇట్లే యగును. అంకుశగ్రహణమున నాగమును ఖలీనగ్రహణమున హయమును ప్రగ్రహగ్రహణమున యానమును నిర్దేశింప వచ్చును. ఇట్లే యితరములందును నభ్యూహింప తగును. రంగమున చిత్రపటాదులు లేకున్నను రథగమనాద్యభినయము యుక్తము కాదు. సౌకర్యము ననుసరించి యదియు నుండుగావుత. వైశాఖస్థానమున నశ్వగతి నిరూపించునది. స్వస్తికసంయుత పాదములతో సర్పగతి ప్రదర్శనీయము.

అవస్థాభేదమున గతినిరూపణమావశ్యకము. విటుని గతి లలితవిభ్రమముగా నుండును. ఆకుంచితపదములతో నుండును. పదానుగములైన హస్తములు స్వసౌష్ఠవముతో నుండును. కాంచుకీయగతి వయోవస్థావిశేషమున నుండుట యుక్తము. అవృద్ధుడగు కంచుకీయునకు గతి యిట్లుండును. స్థైర్యసహితములయిన బుజుపాదములవిన్యాసము తన యంగములను సముద్వహన మొనరించుచున్నట్లుగా పంకలగ్నుడయిన విధమున యత్నాకర్షణముతో గమన ముండును. వృద్ధకంచుకి కంపితదేహుడై కట్టపై నాధారపడి మందముగా పదక్రమమొనరించుచు గతి యొనరించును. కృశకంచుకియు మందపరిక్రమముతో నుండును. వ్యాధిగ్రస్త జ్వరార్త తపఃశ్రాంతక్షుధాన్వితులు క్షామోదరులై విష్కంభనకృతప్రాణులై ఆధారయష్టియందు దేహము నిడుకొని గమనమొనరింతురు. క్షామకరకపోలత దీననేత్రత గాత్రకంప

నము క్లేశనము వారి గతిలో నుండును. దూరాధ్వగతుని గతి మంద పరిక్రమములో నుండును గాత్రవికూణనము, సంకోచనము జానువిమర్ద నము గతిలో నుండును. స్థూలకాయుడు మహాకాయుడగు వానికి స్వేదము ఖేదము కలుగ చేయును. శ్రమస్వేదాభిభూతుడు తగినట్లు సంచరించును. మత్తునిగతి యున్మత్తునిగతి గుర్తింపతగియున్నది. తరుణ మధ్యమ మదమునందు ఘూర్ణమానులై మత్తు లపసర్పణ మొనరింతురు. విఘూర్ణిత శరీరులై తొట్రుపాటులతో నుందురు. ఉన్మత్తులు అనియతక్రమముననె గమన మొనరింతురు. పిచ్చివాడు స్ఫుటిత కేశుడై రజోధ్వస్తశరీరుడై అనిమిత్తభాషి బహుభాషియునై యుండును. అక స్మాత్తుగా పాడును. నలుగురిలో నుండడు. నృత్య మొనరించును. సంతుష్టుడై కన్పడును. వాద్యవాదన మనుకరించును. వేగముగా పరు గెత్తును. నిలబడును. చతికిలబడును. పడుకొనును. వీధులలో నని యతముగా సంచరించును. ఉన్మత్తునకు ఖంజగతి యుక్తము. ఒకప్పుడు పంగుగతియు నుండును.

౬౭౫. విదూషకస్యాపి గతిర్హాస్యత్రయ విభూషితా
అంగకావ్య కృతం హాస్యం హాస్యం నేపథ్యజం స్మృతం
౬౭౬. కావ్యహాస్యం తు విజ్ఞేయమసంబద్ధప్రభాషణైః
అనర్థకై ర్వికారైశ్చ తథా చాశ్లీలభాషణైః
౬౭౭. చీర చర్మ మషీ భస్మ గైరికాద్యైస్తుమండితః
యస్తాదృశో భవేద్విప్రా హాస్యో నేపథ్యజస్తు సః

విదూషకుని గతి మూడు హాస్యములతో నుండును. అంగహాస్యము కావ్యహాస్యము నేపథ్యజహాస్యము. దంతురుడగుట బట్టతలతో నుండుట పొట్టివాడగుట మరుగుజ్జగుట వికృతాననుడగుట అంగ హాస్యము. ఇట్లు రంగమున పాత్రవిశేషప్రవేశమున్నచో అంగహాస్యము స్పష్టమగును. కొంగవలెనడచుట ఉల్లోకితవిలోకితములతోనుండుట అత్యాయతపదములతో సంచరించుట అంగహాస్యమగును. ఇట్టివాని రంగప్రవేశము హాస్యజనక మగుటచే నాట్యమునందే రసముకలదు కాని లోకమునందు రసము లేదని యనినట్లయినది. కావ్యహాస్య మసంబద్ధ ప్రభాషణములతో నుండును. అనర్థకవికారములతో నుండును. అశ్లీలభాషణములతో నుండును. అశ్లీలమనుట "అశ్రియ

మశోభాం కాతీతి రేఫస్స్యలత్వం" అశోభను కలుగచేయునది యశ్లీల మగును. చీరచర్మమషీభస్మములు కూడుకొని గైరికాదివర్ణధాతువులు కలుపుకొని వాని లేపనములతో మండితుడైన వానికి నేపథ్యజహాస్య ముండును. ఇది ఆహార్యవేషకృత మయిన విశేషము. ఇట్లు త్రిప్రకార మయిన హాస్యము నాశ్రయించి నానావస్థాంతరాత్మకమయిన గతి ప్రచారమును కూర్పవలెను. ఒకచో నొకప్రకారము మరియొకచో రెండువిధానములు వేరొకస్థలమున సర్వవిధానములు విదూషకున కుండును. విదూషకుడు స్వామిప్రకృతి ననుసరించి రాజామాత్యశ్రేష్ఠి ప్రకృతిభావమును చిత్తవృత్తిని తెలిసికొని తద్విభావానుసారముగా గతిప్రచారము కలవాడు కావలెను. స్వభావసహజమయిన కుటిల దండమును వామహస్తమున పట్టి దక్షిణహస్తమున చాతుర్యము చూపుచు నాతడు గతిప్రచారము చేయును. లయతాలవశానుగతముగ శిరమును పాదమును హస్తమును పర్యాయక్రమమున వంచుచు నెత్తుచు నాతడు ప్రవర్తించును. విదూషకుని స్వభావసహజగతి ఇట్లే యుండును. ప్రకృతకార్యమునం దావేశము లేకున్నచో నాతడు ఒక ప్రవృత్తి నవలంబించును. వికారజన్యమయిన గతి వానిలో వేరొకటి యుండును. వాని కాహార మలాభలాభముగ లభించెనేని స్తబ్ధగతి యుండును. ఇది యాతని గర్వాత్మకవికారము. విదూషకునకు భయా దులే కలిగినచో వేగముగనె పలాయన మొనరించును. నీచులకు చేటాదులకును అధములని ప్రసిద్ధులయిన వారికిని వికృతగతి ప్రచారము యుక్తముగనుండును.

౬౭౮. శకారస్యాపి కర్తవ్యా గతిశ్చంచలదేహికా
గతౌ నమేత చేటానాం దృష్టిశ్చాప్య విచారిణీ
౬౭౯. సగర్వితా చూర్ణపదా శకారస్య గతిర్భవేత్
జాత్యా నిచేషు యోక్తవ్యా విలోకనపరా గతిః

ఇందు శకారగతి యున్నది. శకార బహులమగు భాషాభాషణ మొనరించువాడు శకారుడు. శకారోపలక్షిత శకాది జనపదములందు నివసించువాడు శకారుడని కొందరనిరి. హీనాశయుడు దుష్టభావు డున్నతి పదమున నధిరోపితుడై శకారుడగునని కొందరనిరి. శకారున కపశబ్దఘటన మధికము. ధర్మవిధూతి యాతనిధర్మము. ఆతని స్వార్థ

ప్రతీతి కలన చెప్పెడిదేమి? ప్రతిజ్ఞా చాణక్యమునందు భీమమహాకవి రాజైనను వింధ్యకేతువును శకారుడని బహుపర్యాయము లనెను. వస్త్రాభరణ సంస్పర్శాలోకన గర్వయోగ మీతనిలో స్పష్టము. శకారు డార్యదేశ జాతివాడని ఏమియు ప్రసిద్ధిలేదు. మ్లేచ్ఛజాతులం దీతడు చేరడు. ఇచట శకారు డిట్టివాడే యనుట స్పష్టము. శకారునిగతి చంచలదేహముతో నుండును. దేహము నటునిటు నూపికొనుచు నడచును. నడచుచు నమస్కరించును. దృష్టి కపటముగా నుండును. స్వప్రయోజనవిచారముతో నెల్లపుడు చూచును. వస్త్రాభరణముల స్పృశించుకొనుచు తన్ను తాను చూచుకొనుచు నవయవముల వికార విక్షేపములతో నడచును. వస్త్రమాల్యాభరణములను జార్చు కొనుచు నడచును. శకారగతి సగర్వితగతి. జాతినీచులగు వారిని పరిశీలించి శ్రద్ధగా చూచుచు నీతడు గతి ప్రచార మొనరించును.

లోకస్పర్శ దూరులయి స్వాంగ వినిగూహన మొనరించు కొనుచు పులింద శబరాదులు సంచరింతురు. మ్లేచ్ఛజాతులు నిట్టివారే. వారలకు దేశానురూపముగ గతి విశేషము నిరూపింపవలెను. పశు పక్షి శ్వాపదములకు స్వస్వజాతి సహజ స్వభావమున గతి యుండును. నాట్య ప్రయోగ మొనరించువారు సింహర్క్ష వానర గతిని కూడ నిబంధింపవలెను. ప్రభవిష్ణువగు విష్ణువు నరసింహాతనువుతో గతిసంచార మొనరించెను. జాంబవత్సుగ్రీవాంగద హనూమత్ప్రాయు లగువారల కును గతి యిట్లే యుండును. ఒక హస్తము జానువునందుంచి మరి యొకటి వక్షము నందుంచి కాని దిక్కులన్ని చూచుచు పంచతాలాం తరప్రమాణముగా విక్రమగతి ప్రదర్శింపవలసి యున్నది. నియుద్ధ సమయము నందును రంగావతరణమునందును సింహాదుల కీ గతి ప్రయోగము యుక్తము. ఇంక నితరములకును కార్యావసరమున గతిస్థానములను యోజనము చేయునది. వాహనార్థ ప్రయోగములందు గాని రంగావతరణము లందుగాని గతి ప్రచారముల నభ్యూహించునది.

౬౮౦. ఏవ మేతాః ప్రయోక్తవ్యా నరాణాం గతయో బుధైః
వోక్తా యా యా మయా హ్యత్ర గ్రాహ్యాస్తాశ్చ లోకతః

ఈ విధముగా నున్న మానవులగతి ప్రచారములను బుధులు రంగములందు ప్రయోగింపజనును. ఇందు నిరూపించిన గతివిధానము

లును సూచనాసారముగ కొన్నిమాత్రమే యున్నవి. ఇందు నిరూపిం పని గతిక్రమము లనేకము లుండును. ఏ యే గతులను నిరూపింప లేదో యా యా గతులను లోకమునుండి గ్రహింపవలెను. పరిష్కృత స్వభావులయిన లోకజనులలో నాట్యప్రయోగార్హ్యము లయిన కొన్ని గతిసంచారము లుండును. వానిని పరిష్కృతమతులయిన ప్రయో క్తలు సావధానముగా గుర్తించి నిబంధింప వచ్చును. ఇకనిటుపై స్త్రీల గతి విచేష్టితము నిరూపింప వలసి యున్నది.

గమనములందు సంభాషణములందును స్త్రీలకు స్థానము నిరూ పింపవలెను. ఆయత మవహిత్థ మశ్వక్రాంతములు స్త్రీల స్థానములు.

౭౮౧. ప్రసన్నమాననమురః సమం యత్ర సమున్నతం
లతానితంబగౌ హస్తౌ స్థానం జ్ఞేయం తదాయతం
౭౮౨. పాణిర్లతాఖ్యో యత్రైక స్తదన్యస్తు నితంబగః
అవహిత్థం సమాఖ్యాతం స్థానమాగమభూషణైః

వామపాదము స్వభావ సముచితమై సమముగా విరచితమగునేని ఆననము ప్రసన్నమై యురము సమము సమున్నతమై హస్తములు లతాయితములై నితంబగతము లగునేని యాయతస్థానమగును. ఇట్టి స్థానక లక్షణ కథనములో భావభేదములును కలవు. చింతావహిత్థలలో నీ యాయతము నుపయోగింపవలెను. రంగావతరణారంభ మొనరించి పుష్పాంజలి విసర్జనము చేసి తర్జనీమోటన మొనరించుచు మన్మథేర్ష్యా సముద్భవమయిన కోప మనుకరింప వలెను. నిషేధగర్వ గాంభీర్య మానముల నవలంబింపవలెను. దిగంతర నిరూపణ మొనర్పవలెను. అవహిత్థమున కీ విధముగా స్వరూప మున్నది. వామహస్తము సమమై మరియొకటి త్ర్యశ్రముగా పక్షస్థితమై వామకటి సమున్నతమయినచో అవహిత్థ మగును. త్ర్యశ్రముగా నొకహస్తము విచలితమై మరియొకటి సమముగా నపసృతమై త్రికమున్నతమై యుండుటయు నిందున్నది. లతగా వ్రేలాడు హస్తమొకటియు నితంబగతముగా మరియొక హస్తమును నున్నచో నాట్యాగమ భూషితులు అవహిత్థమని సమా మ్నాన మొనరించిరి. భర్తృమార్గావలోకనము నందును విలాసలీలా బిబ్బోక శృంగారాత్మ నిరూపణమునందును అవహిత్థ స్థానము ప్రయోగింప తగియున్నది. స్వభావజ సల్లాపము నందు నిశ్చయము

నందు పరితోషవితర్క లజ్జితములందును దీని నుపయోగింపవలెను. అశ్వాక్రాంత మీా విధముగా నున్నది. ఒకపాదము సమస్థితమగుటయు మరి యొక్కటి అగ్రతలమున నుండుటయు నశ్వాక్రాంతమగును. ఇది సూచీవిద్ధము కావచ్చును కాకపోవచ్చును. స్ఖలితము ఘూర్ణితము గలితాంబర ధారణము కుసుమస్తబకాదానము పరిరక్షణము విత్రా సనము తరు శాఖావలంబనము దీనిలో నుండును.

ఉ॥3. స్థానకం తావదేవ స్యాత్ యావచ్చేష్టా ప్రవర్తతే
భగ్నం చ స్థానకం నృత్తే చారీ చేత్ సముపస్థితా

చేష్ట ప్రవర్తించు నంతవఱకే స్థానక ముండును. నృత్తమునందు చారీగతి యారంభము కాగానే స్థానకము భగ్న మగును. ఇట్లు స్త్రీలకు స్థానవిధి యున్నది. స్త్రీలకు ప్రకృతిసంస్థిత మయిన గతియు కలదు. అవహిత్థస్థాన మవలంబించి అధోముఖముగా నుండి ఖటకా ముఖసవ్యహస్తమును నాభిప్రదేశమునందుంచి దక్షిణపాదమును వామ పాద బాహ్యపార్శ్వమునందుంచ వలెను. ఆ సమకాలమునందే దక్షిణ భుజపార్శ్వమును వంచి నితంబమునందు కూర్పవలెను. ఇట్టివిధానము లవలంబించుచు నయిదడుగులు గమనము చేయవలయును.

ఉ॥4. యో విధిః పురుషాణాం తు రంగపీఠపరిక్రమే
స ఏవ ప్రమదానాం వై కర్తవ్యో నాట్యయోక్తృభిః

రంగపీఠ పరిక్రమమునందు పురుషులకు విధింపబడినవిధియే స్త్రీలకును నాట్యయోక్తలు యోజనము చేయవలెను. రసప్రకృతి దేశకాలాపేక్షముగా పురుషులకు నిరూపితమయిన గతి విలాసరూప ప్రకారానువిద్ధమై స్త్రీలకును వివక్షిత మగును. దిక్కాలపరిమాణము లేనపుడు శోభోదాత్తరీతి వలసినవుడు విశేష మున్నది.

ఉ॥5. షట్కలం తు న కర్తవ్యం తథాష్టకలమేవ చ
పాదన్య పతనం తజ్జ్ఞైః ఖేదనం తద్భవేత్ స్త్రియాః

పురుషులకు పాదపాతమునందు షట్కలాష్టకలరీతు లుండ వచ్చును, స్త్రీపాదపతనమున షట్కలాష్టకలపాతములు ఖేదనము కలుగచేయును కావున యుక్తములుకావు. చతుష్కలాభ్యధికముగ స్త్రీలకు మానవిధి లేదు. ఇందష్టకలగ్రహణ మొనరించుట తదధికమగు

మానము పురుషులందును లేదని సూచితమగును. షట్కలానిషేధమే అష్టకలానిషేధమును సూచించుచుండగా మరల అష్టకలానిషేధము వలన ఈ భావమే సూచితమగును. ఈ చెప్పిన గతియంతయు యౌవనవతులయిన వనితలకు నిరూపింప తగియున్నది. మధ్యమవయసులో స్థానీయవనితలకు వేరొకగతి యున్నది. అవహిత్థస్థానము ననుసరించి వామహస్తము కటీతటమున నుంచి నాభిస్తనాంతరమున దక్షహస్తముత్తాన మొనరింపవలెను.

> ౬౬. న నిషణ్ణం న చ స్తబ్ధం న చాపి పరివాహితం
> కృత్వా గాత్రం తతో గచ్ఛేత్ తేనైవేహ క్రమేణ తు
> ౬౭. ప్రేష్యాణామపి కర్తవ్యా గతి రుద్భ్రాంత గామినీ
> అర్ధనారీగతిః కార్యా స్త్రీపుంసాంభ్యాం విమిశ్రితా
> ౬౮. ఉదాత్త లలితై ర్గాత్రైః పాదైర్లీలా సమన్వితైః
> యా పూర్వమేవాభిహితా హ్యుత్తమానాం గతిర్మయా

స్థానీయస్త్రీగతి నిషణ్ణరీతిలో నుండదు. స్తబ్ధరీతిలో నుండదు. పరివాహితముగను నుండదు. తగినవిధమున గాత్రమును సర్దుకొని గమన మొనరింపవలెను. ప్రేష్యవనితలగతి ఉద్భ్రాంతగమనముతో సమదధికారముగ నుండును. ఉన్నమితగాత్రములతో నుండును. ఆవిద్ధ భుజవిక్రమముతో నుండును. వర్తనాబహులమై క్షత్రియవిక్రమము సూచించునదై యుండును. స్త్రీపుంస విమిశ్రితమయిన అర్ధనారీగతియు నిట్లేయుండును. అర్ధనారి యనుట నపుంసకలక్షణము కల తృతీయ ప్రకృతి. ఉదాత్తలలిత గాత్రములతో లీలాసమన్విత పాదములతో నర్ధనారీగమన మున్నది. పురుషగతమైన యుదాత్తతయు యోషిద్గతమయిన లాలిత్యమును వీరిలో నుండును. పూర్వము నిరూపితమయిన యుత్తములగతి యుత్తమగతి. స్త్రీలకు కాపురుషులకును తదర్ధారము యోజన మొనరింపవలెను. మధ్యమోత్తమనీచజనుల గతిచేష్టితము నుదాత్తమధ్యమోత్తమ నీచస్త్రీలకు తత్కర్మకరవనితలకు నిరూపింప వచ్చును. లలితపదవిక్రమములు స్త్రీలకు కూర్చుట సుందరము.

> ౬౯. బాలానామపి కర్తవ్యా స్వచ్ఛంద పదవిక్రమా
> న తస్యాః సౌష్ఠవం కార్యం ప్రమాణం న ప్రయోక్తృభిః

స్వచ్ఛందపదవిక్రమము బాలికలకు నిరూపింపతగును. ఉత్తమాదివిభాగ ముద్భిన్నము కానపుడు సర్వగ్రాహక మయిన విధాన మిట్లే

యుండును. ఇట్టి బాలికాగతిలో సౌష్ఠవ మక్కరలేదు. ప్రయోక్తల ప్రమాణమును పరిశీలింపనక్కరలేదు. నపుంసక మనునామమున తృతీయ ప్రకృతి యున్నది. అందు నరస్వభావమును విడనాడి నారీగతి నిరూపింపవలెను.

౬౯౦. విపర్యయః ప్రయోక్తవ్యః పురుష స్త్రీ నపుంసకైః
స్వభావ మాత్మన స్త్యక్త్వా తద్భావగమనాదిహ
౬౯౧. వ్యాజేన క్రీడయా వాపి తథా భూయశ్చ వంచనాత్
స్త్రీ పుంసః ప్రకృతిం కుర్యాత్ స్త్రీభావం పురుషోపి చ
౬౯౨. ధైర్యోదార్యేణ సత్వేన బుద్ధ్యా తద్వచ్చ కర్మణా
స్త్రీ పుమాంసం త్వభినయే ద్వేషవాక్య విచేష్టితైః
౬౯౩. స్త్రీ వేష భాషితైర్యుక్తః ప్రేక్షితాప్రేక్షితైస్తథా
మృదుసన్నగతిశ్చైవ పుమాన్ స్త్రీభావమాచరేత్

స్త్రీపురుషనపుంసకులు విపర్యయముగా కూడ ప్రయోగ మొనరింప వలెను. అప్పు డాత్మస్వభావమును విడనాడి తద్భావగమనమును పొందుట యుండును. విపర్యయపరిగ్రహమునందు కొంత విశిష్టార్థ మున్నది. ఎవరేరూపము గ్రహింతురో వారికాగతియే నియతమై యుండును. వ్యాజక్రీడావంచనములు విపర్యయపరిగ్రహ కారణములు. ఏదియేని యొక కార్యము సాధించుటకై వ్యాజ మవలంబించి వేషవిపర్యయ మొనరించుకొనుట కలదు. విదూషకుడు సంకేతస్థానమున చేటికా వస్త్రధారణ మొనరించుట యిట్టిదే యగును. క్రీడ కూడ హేతువు. నాయికల కభీష్టమైన జనుల యాకృతి స్వీకరించుట యిందలి తత్త్వము. అట్లే భూయోవంచనమున కూడ స్త్రీప్రకృతి విడనాడి పుంప్రకృతి స్వీకరించుట. పురుషుడు తన ప్రకృతిని విడిచి స్త్రీభావము స్వీకరించుట యున్నది. విదూషకుని వంచన మొనరించుటకై చేటకుడు స్త్రీవేష ధారణ మొనరించుట ప్రసిద్ధముగనె యున్నది. ఇంకను కొన్ని కారణము లిట్టివి కలవు. స్త్రీగాని పురుషుడుగాని నపుంసకవేషధారణ మొనరించును. వాడు వారి వేషము నేని ధారణము చేయుటయు విపర్యయము. ఈ విపర్యయమునందు గతివిపర్యయ ప్రసంగమున వ్యభిచారిభావాభినయవిపర్యయ ముండును. సాత్త్వికాభినయ విపర్యయముండును. ఉపాంగాభినయ విపర్యయము నుండును. స్త్రీప్రకృతి వేషవాక్యవిచేష్టితములతో

ధైర్యౌదార్య సత్వబుద్ధి కర్మానుసరణమున పురుష ప్రకృతి నభినయింప వచ్చును. ఇందు ధైర్యౌదార్యములు సామాన్యాభినయమున నిరూపితములు. వీనిచే సర్వభావము లుపలక్షితములగును. సత్త్వమనుట సాత్త్వికభావము. బుద్ధియనుట స్థాయిభావము. కర్మయనుట స్థానకాది విషయము. వేష మాహార్యప్రకారము. వాక్యము వాచికగత సంస్కృతాదిప్రయోగము. చేష్టిత మంతరాలస్థానమునందు త్రిపతాకాదిధారణము. విపర్యయ మనుసరించుటలో నింకను విశేషములు కలవు. పురుషుడు స్త్రీవేషభాషితములు కలవాడై ప్రేక్షితాప్రేక్షితములను మృదుసన్నగతివిధానములను మందగతిరీతులను అవలంబించి స్త్రీభావ మాచరింపవలెను. జాతిహీను లయిన స్త్రీలు కొందరున్నారు. వారు పులింద శబరాంగనలు. వారి వేషానుకరణమున తజ్జాతిసదృశ మయిన గతి ననుసరింప వలెను. వ్రతస్థలు తపస్థలు లింగస్థలు స్వస్థలు నైన స్త్రీల కంతట సమపాతప్రయోగము యుక్తము. ఉద్ధతములయిన యంగహారములను అట్టి చారీమండలములను నాట్యప్రయోగవిదులు స్త్రీలకు కూర్పరాదు. తమ తమ స్థానకము లందున్నప్పుడు స్త్రీలకు పురుషులకు నానాభావసమాయుక్తమగు శయనాశ్రయ మయిన యాసనవిధిని ఉపవేశనవిధానమును కూర్పవలెను. స్థానకములందున్నప్పుడు పూర్వపశ్చాద్భావివిశేషణముల ననుసరించి యాసనవిధి కూర్పవలెను. గతిప్రక్రమములో శయనమును పూర్వపశ్చాద్భావిగా నుండును. వైశాఖస్థానకోచిత మయిన విస్తీర్ణాంతములగుసుందర పాదముల నుంచుటయు యుక్తము. ఇందంచితపాదలక్షణయోగ ముండదు. పురుషుడుస్వస్థుడై యున్నచో నాసనపీఠికాదులం దుపవేశనమున త్రిక మున్నత మగును. హస్తములును కట్యూరు విన్యస్తములై కర్కటరూపములై యుపదేశనమున నుండును. చింతాసహితుడై యుపదేశన మొనరించునపుడు ఒకపాదము ప్రసారితమగుట మరియొకటి యాసనాశ్రితముగా నుండుట శిరము పార్శ్వానతమగుట యుక్తము. శోకోపవేశనమునందు హస్తములు చిబుకోపాశ్రితములు శిరము బాహుశీర్షాశ్రితము నగును. అతని యింద్రియమనములు సంప్రణష్టములై యుండును. మూర్ఛా మద శ్రమ గ్లాని విషాదములందు

శిథిలబాహువులను చాచి అపాశ్రయాశ్రయముగనే యుపవేశింప వలెను. వ్యాధిత క్రీడిత నిద్రితుల యుపవేశనమునందు పాదజానువులు కలిసి యుండునట్లు పిండీకృతసర్వదేహుఁడై యుపవేశింపవలెను. ధ్యానమునందు నిట్లే యుండును. అంగములు పిండితము లగుట యను నది సముత్కటముగా నుండును. జానుభాగము లు విరళముగా నుండు నట్లుత్కలికస్థానమవలంబించి యుపవేశింపవలెను. పితృనివాపమునందు జప్యవిధానమునందు సంధ్యావందనమునందును ఆచమనమునందును సముచితములయిన యుపవేశనములను స్వీకరించునది. శ్రాద్ధములందలి యుపవేశనము పితృతర్పణమునందు ప్రతిగ్రహమునకై పరులకు సలిల దానమిచ్చుటలో సలిలప్రతిగ్రహమునందు నియతోపవేశనములు కలవు. వీనిలో విష్కంభితవిధానము యుక్తము. విస్తారితమగు నొక జానువును భూమి యందుంచుటయు మరియొకటి ప్రసారితమగుటయును ఇందలి రూపము. ప్రియాప్రసాదనమునందు హోమాదివిధానములలో జానువులను భూమియందుంచి యధోముఖావస్థానమున నుండుటయు దేవాభిగమనమునందు రుషితప్రసాదనమున మృతులను చూచినపుడు కలిగిన తీవ్రశోకాక్రందనములందు నక్క మొదలగు కుసత్వములు భయపెట్టినపుడు నీచులు యాచనమొనరించునపుడు హోమయజ్ఞ క్రియాసమయమున విష్కంభిత జానునిపతన మావశ్యకము. మునినియ మమునందును సముచితాసనవిధానము కలదు.

౬౯౪. తథాసనవిధిః కార్యో వివిధో నాటకాశ్రయః
స్త్రీణాం చ పురుషాణాం చ బాహ్యశ్చాభ్యంతరస్తథా

స్త్రీలకు పురుషులకు నాటకాశ్రయమయిన బాహ్యాభ్యంతర వివిధాసన విధి విధింప తగియున్నది. దేవనృపతులకు సింహాసనము పురోధసామాత్యులకు వేత్రాసనము సముచితము. ఆసనకాల సన్నివేశ ప్రసంగముననె తదధికరణ విధియు నున్నది. ఆభ్యంతరము నృపతి యాసనము. అది రాజోచితము. బాహ్యము బాహ్యాగతుని యాసనము. అది సర్వజన విషయము. సేనాని యువరాజులకు ముండాసనము. బ్రాహ్మణునకు కాష్ఠాసనము. దీనికే పీఠక మని పేరు. రాజకుమారులకు కుథాసనము. రాజసభా ప్రవేశమున నిట్టి యాసన విధానము యుక్తము.

స్త్రీల ఆసనవిధి నిరూపింప దగినది. రాజ్ఞీపదమునందున్న దేవీపదవాచ్య లయిన రాజవంశ్య వనితలకు సింహాసన ముచితము. ముండాసనమును యుక్తము. సేనాపతి ప్రభృతుల పుత్రికలు రాజపరిణీతలై భోగినీపద వాచ్య లగుదురు. వారలకు వస్త్రచర్మ కుథాసనములు యుక్తము. పురోహితసామాత్య భార్యలకు వేత్రాసన మర్పింప దగును. వేత్రలతాకృత మయిన యాసనము, వేత్రాసనము. బ్రాహ్మణీ తాపసీ స్త్రీలకు పట్టాసన ముచితము. వేశ్యలకు మసూరకాసనము. దీనినే మయూరకాసన మనియు నందురు. ఇది వస్తుశూన్యక మయిన యాసనము. మసూరకము వేశ్య కుచితము. ఇతర స్త్రీలకు భూమ్యాసనమే యుచితము. నరపతి సన్నిధానమునందు తత్తదుచితముగా నాసన విధి యాభ్యంతర విధి అని చెప్పఁదగియున్నది. ఆసన విధానము నందు బాహ్యవిధియు కలదు. స్వగృహవార్తలలో నిష్టానుసారమున నాసన ముండ వచ్చును. సేనాపతి యమాత్య గృహమున కేగినను వారి సంపదుచితమయిన యాసన ముచితము.

౧౯౫. నియమస్థో మునీనాం చ భవేదాసనజో విధిః
లింగినామాసన విధిః కార్యో వ్రత సమాశ్రయః
౧౯౬. బ్రుసీ ముండాసన ప్రాయం వేత్రాసన మథాపి వా
హోమే యజ్ఞక్రియాయాం చ పిత్ర్యర్థే చ ప్రయోజయేత్
౧౯౭. స్థానీయా యేచ పురుషాః కులవిద్యా సమన్వితాః
తేషామాసన సత్కారః కర్తవ్య ఇహ పార్థివైః
౧౯౮. సమే సమాసనం దద్యాత్ మధ్యమే మధ్యమాసనం
అతిరిక్తేఽతిరిక్తం చ హీనే భూమ్యాసనం భవేత్
౧౯౯. ఉపాధ్యాయస్య నృపతేః గురూణాం చాగ్రతో బుధైః
భూమ్యాసనం తథా కార్యం అథవా కాష్ఠ మాసనం
౨౦౦. నౌ నాగ రథ యానేషు భూమి కాష్ఠాసనేషు చ
సహాసనం న కుర్వీత గురూపాధ్యాయ పార్థివైః

మునుల యాసనవిధానము నియమగతమై యుండును. ఒకని కంగవిస్తరమే యాసనము. మరియొకనికి మృగాజిన మాసనము. శాక్యమునులకు బ్రుసి యాసనము. శైవులకు ముండాసనము. తపసులకు వేత్రవల్కల డింభకాసనములు తగును. వ్రతసమాశ్రయ మయిన యట్టి యాసనవిధి యుక్తము. హోమములో, యజ్ఞకర్మలో

పితృకర్మలో నియమస్థమయిన యాసనమే యుక్తము. కులవిద్యా సమన్వితులైన స్థానీయ వృద్ధ పురుషులు కొందరుందురు. వారికి సమీపమున నవస్థ దృష్టాదృష్టోపయోగిగా నుండును. వారి యాసనవిధి పార్థివు లనుసరించుటలో ఆసన సత్కారముగా నుండవలెను. సమునకు సమాసనము. మధ్యమునకు మధ్యమాసనము. అతిరిక్తున కతిరిక్తము. హీనునకు భూమ్యాసన ముచితము. ఉపాధ్యాయ నృపతి గురువుల యగ్రభాగమున భూమ్యాసనమును కాని కాష్ఠాసనమును కాని నాట్యవిదులు నిర్ణయింపవలసి యున్నది. రాజునకు స్వసమానజాతి విద్యావిశేషములు కలవాడు సముడగును. మధ్య మాసనము రాజాసనము కన్న కొంత తక్కువగా నుండును. హీనునకు భూమియందే కూర్చొనుటను రాజు నిర్దేశించుటయే ఆసన సత్కారము. నౌనాగరథ యానములందు గురూపాధ్యాయ పార్థివులకు భూమి కాష్ఠాసనము లందు సహాసనము దూష్యము కాదు. దీర్ఘము భరసహమునైన యొకే యాసనము పర్యంకమని కాష్ఠాసనమని వ్యవహారము. కాని కేవలము కాష్ఠమయము కానక్కరలేదు.

శయనకర్మలో నొక విశేష మున్నది. ఆకుంచితము, సమము, ప్రసారితము, వివర్తనము, ఉద్వాహితము, నతము శయనకర్మలో నున్నవి. ఆకుంచితాంగములతో జానువులను శయ్యావిద్ధ మొనరించి యుండుట యాకుంచితము. ఇది శీతార్తులకు యుక్తము. ఉత్తానిత ముఖముగ ముక్తకరముగ శయనించుట సమశయనము. ఒక భుజము దిండుగానొనర్చి జానువులను చాచి యుండుట ప్రసారిత శయనము. ఇది సుఖసుప్తునకు సముచితము. అధోముఖముగా శయనించుట వివర్తితము. శస్త్రక్షత మృతులకు మత్తోన్మత్తులకు వివర్తిత శయనము యుక్తము. అంసముపై శిరముంచి మోచేతినానించి శయనించుట యుద్వాహితము. ప్రభువు లీలారీతిలో వచనక్రమములో నిది యుక్తము. జంఘలను కొంతసాచి యుంచి చేతుల నానించి శయనించుట నతమను శయనము. ఆలస్య శ్రమ ఖేదములందు నతశయనము యుక్తము. ఆకుంచిత శయనములో శరీరమునకు కొంత కుటిలీ కరణము కలుగును. బాహు మధ్య భాగమును ప్రక్కనుంచి యొత్తిగిలి పడుకొనినపుడు దేహ మూర్ధ్వ

ముగా నుండుట యుండును. ఇట్టి శయనవిధులు వినియోగ విశేషము ననుసరించి పరిశీలింప తగినవి. ఇట్లే గతిప్రచారము నిరూపిత మైనది. ఇది యంతయు నితరముల కుపలక్షణము. ఇందు నిరూపింపని గతిప్రచారము సర్వవశమున గుర్తింపవలసి యున్నది. రంగ ప్రవేశ విధి మొదలుగా గతి పరిక్రమమునందలి విశేషములు రసభావసముచితము లయిన గతి సంచారములు విశిష్టవ్యక్తుల గతి ప్రక్రమములు, రథ విమానగతులు, భూజలాకాశ గమనములు విటవిదూషకాది గమన విశేషములు శకారగతి స్త్రీగతి విధి విశదముగా నిరూపితమైనది. తత్తత్సముచితమయిన యాసనవిధి శయనవిధి నిరూపితమయినది. వీని యనుసారమున పరిష్కృతములగు నితరవిధానములను నాట్యవిదులు గుర్తింపవలెను.

కక్ష్యావిభాగము

దేహస్య బాహ్యాంభ్యంతర భేదికక్ష్యా
విభాగ ధర్మీ వివిధాం ప్రవృత్తిం
ఆసూత్రయ న్దోషవిశుద్ధిదక్ష
క్రమోఽర్కదృష్టిర్జయతాద్వ్యపాంకః

అభినయానంతరము వృత్తిప్రవృత్తు లుద్దిష్టము లయినవి. సర్వాంతమున రంగమునందు కక్ష్యయు సూచిత మయినది. కావున చతుర్విధాభినయానంతరము కక్ష్యాప్రయోగవిధి నిరూపణీయము. అయినను ప్రత్యభినయమునందు నీ యితికర్తవ్యత యింతగా నుపయోగించును గావున దీని నిచట నిరూపించుట యావశ్యకమె యగును. ఆ యంశము నిరూపింపక పోయినచో సర్వమాంగికమె చెప్పినట్లగును. కావునసె కక్ష్యావిభాగ మిచట చెప్పవలసి యున్నది. ఉద్దేశప్రారంభమున నాంగికముండగా సామాన్యాభిధానమున నిదియు నుక్తప్రాయమే కావున వేరుగా నుద్దేశించుట యావశ్యకము కాకపోవును. అయినను ప్రత్యేకముగ నుద్దేశించినచో గౌరవదోషము కలుగును. కక్ష్యావిభాగ మపృథగ్రూపమని యనుటకు పూర్వోతనులు నిరూపించిన క్రమోల్లంఘనమను హేతువు యుక్తముగ లేదు. ఆ హేతు వసిద్ధము విరుద్ధమును. కక్ష్యావిధి ప్రత్యేకప్రసంగముగా సంప్రాప్త మయినది. మీమాంసా

శాస్త్రసమ్మత మయిన యీ క్రమ మపదార్థము కావున నర్థప్రమాణ కము కాదు. ముఖ్యశ్రౌతపదార్థమును బాధించునది యగును గావున యుక్తము కాదు. వాక్యప్రమాణమును శ్రుతి బాధించును. శ్రుతి ముఖ్యప్రమాణము. కావున క్రమోల్లంఘనహేతువు యుక్తము కాదని భట్టలోల్లటు డనుట ప్రకృతము యుక్తమె కాగలదు. అందు విరోధము లేదు. క్రమ మనునది గతిరూపప్రయోగ హేతువు కాగలదు. దాని యవసరముననె దాని జెప్పుట యుక్తము. ఆ విధముగా నది యభినయాంగ మగును. కాగా నిందు దేశత్రయమును నిరూపింప వలెను. అందుననె మొదట కక్ష్యాభిధాన మున్నది. గంతవ్యదేశా శ్రయమున గతి నిరూపణీయము. జలస్థలాదులున్న బహుతర సమవిష మాది స్వభేదసహితము దేశము. కావ్యార్థమాత్రమున దేశమిందు సంభవించును గాని ప్రయోగస్థానమున సంభవింప నేరదు. ఈ యసం భవపరిహారమునకై కక్ష్యానిరూపణ మావశ్యకము. పరిక్రమమునందు గతిప్రచారమునందు నుపయోగించు స్థానవిశేషములను వాని సమ్యగ్వి భాగములను నిరూపింప వలె ననుట యుక్తము. ఇట్టిదిది యంతయు నీ ప్రకరణసంగతి. దీని ధారణానంతర మీ ప్రకరణార్థభావనము యుక్తము.

౩౦౧. యే తు పూర్వం మయా ప్రోక్తాస్త్రయో వై నాట్యమండపాః
తేషాం విభాగం విజ్ఞాయ తతః కక్ష్యాం ప్రయోజయేత్
౩౦౨. యే నేపథ్య గృహద్వారే మయా పూర్వం ప్రకీర్తితే
తయోర్భాండస్య విన్యాసో మధ్యే కార్యః ప్రయోక్తృభిః
౩౦౩. కక్ష్యా విభాగో నిర్దేశ్యో రంగపీఠ పరిక్రమాత్
పరిక్రమేణ రంగస్య హ్యన్యా కక్ష్యా భవేదిహ
౩౦౪. కక్ష్యా విభాగే జ్ఞేయాని గృహాణి నగరాణి చ
ఉద్యానారామ సరితస్త్వాశ్రమా అటవీ తథా

పూర్వభాగములో మూడు నాట్య మండపములు నిరూపితము లయినవి. వాని విభాగము గుర్తించి కక్ష్యా ప్రయోగ మొనరింప వలెను. ప్రత్యేక ప్రత్యేకముగా నా మండపముల కన్నిటికిని కక్ష్యా విభాగము పరిశీలింప వలెను. ప్రతి మండపమునకును విశిష్టభాగ

మున్నది. అది యంతరంగ పీఠాత్మకము. ఆ భాగమును విభాగ దృష్టితో చక్కగా గుర్తించి కక్ష్యాగత్యుపయోగియగు స్థాన విశేషమును నిరూపింప వలెను. విభాగముతో సంబంధము కూర్పవలెను. నాట్యదేశానుసారమున ప్రకోష్ఠమును విడువగా మిగిలిన దేశము చాతురశ్రీయము అదియె నల్పదరముగా నుండి యుపకరించునది యగును. కావున వామ దక్షిణ భాగములందు కుతపవిన్యాసమును శిష్టమునందు కక్ష్యావిభాగమును భావింపవలెను.

రంగమున విభాగ మెట్టిది ? అది యిట్టిది. నేపథ్య గృహమున రెండుద్వారము లుండుట యిదివరలో నిరూపితము. ప్రయోక్తలా ద్వారముల మధ్యభాగములందు భాండవిన్యాస మొనరింప వలెను. తతాతోద్య సహిత మయిన త్రిపుష్కరమునకు భాండ మని పేరు. ఆ భాండవిన్యాస ప్రదేశమును విడనాడి కక్ష్యావిభాగ మొనరింప వలెను. భాండస్థానమును విడువగా శేషమయిన రంగపీఠ దేశమందు నిష్క్రమణమునకు ప్రవేశమునకు గతి సంచారమునకు నుపయోగించు స్థాన విభాగమును నిర్దేశింప వలెను. దానిని ప్రేక్షకావధిగా సంక్రమింప జేయవలసి యున్నది. అందు రంగ పరిక్రమమునకు తగిన కక్ష్యయొకటి కల్గును. "పరిక్రామమంత్యానేనేతి పరిక్రామః చార్యాది సన్నివేశః" దీని ననుసరించి రంగనటులు పరిక్రమింతురు కావున నిది పరిక్రామము పరిక్రమము నగును. చారీమండల సన్నివేశములకు సముచితముగా నిది యుండుట పరిగ్రాహ్యము. రంగదేశ మొకటియె యయినను స్థానభేదమున పరిక్రమ భేదము కలుగును. కావున ప్రాసాద పర్వతాది రూపత్వము నిందే కల్గును. భాండవాద్య వినిర్ముక్త మయిన ప్రదేశమున క్రమవిశేష స్థానభేదమున సంకోచక్లుప్తి కలుగదా? యని సందేహింప జనదు. అట్లు సంకోచక్లుప్తి కలుగదు. కక్ష్యావిభాగమునందే గృహములు నగరము లుద్యానారామనదీవిభాగము లాశ్రమము లటవీ విభాగములు గుర్తింపవచ్చును. విశిష్టమగు శిష్టదేశమున స్థానాంతరములను కల్పింపవలెను. ఇట్లు కల్పింప దగినవానిని కవిజనస్మరణమునకై యుపలక్షణముగ నిరూపించుట యుక్తమె. కక్ష్యావిభాగమునందు సర్వాసర్వాంతసహాను సాగశములను సమకాదికి

మయిన త్రైలోక్యమును సర్వవర్షములను సప్తద్వీపములను వివిధ పర్వతములను లోకాలోకములను రసాతలమును దైత్యానాగాలయము లను వారి గృహములను వారి భవనములను సర్వవిశేషములను గుర్తింపవచ్చును. ఇందు గృహాదులు పృథివీస్వర్గపాతాలభేదమున పునఃపునరుదాహృతము లయినవి. సర్వసంగ్రహమునకై సచరాచర త్రైలోక్య మనుట పర్యాప్త మయినను వర్ణనోద్దేశము స్మరణార్థమని గుర్తించునది.

౫౦౫. నగరే వా వనే వాపి వర్షే వా పర్వతేపి వా
యత్ర వార్తా ప్రవర్తేత తత్ర కక్ష్యాం ప్రయోజయేత్

౫౦౬. బాహ్యం వా మధ్యమం వాపి తథైవాభ్యంతరం పునః
దూరం వా సన్నికృష్టం వా దేశం తు పరికల్పయేత్

౫౦౭. పూర్వం ప్రవిష్టా యే రంగం జ్ఞేయాస్తేఽభ్యంతరా బుధైః
పశ్చాత్ప్రవిష్టా విజ్ఞేయా కక్ష్యాభాగే తు బాహ్యతః

౫౦౮. తేషాం తు దర్శనేచ్ఛుర్యః ప్రవిశేద్రంగమండలం
దక్షిణాభిముఖః సోఽథ కుర్యాదాత్మనివేదనం

౫౦౯. యతోముఖం భవేద్భాండద్వారం నేపథ్యకన్య చ
సా మన్తవ్యా తు దిక్పూర్వా నాట్యయోగేవ నిత్యశః

౫౧౦. విప్రాక్రమేద్యశ్చ్యశ్చ తస్మాద్ద్వైన తేనైవ తథావ్రజేత్
యతస్తస్య కృతం తేన పురుషేణ నివేదనం

సర్వజనులు త్రైలోక్యవర్తులు. ప్రయోగమునందు స్థానభేద మున సంభవించునది యేమి? తత్సంభూతమగు విశేష మేమేని యుండునా? ఇట్టి యాశంకానివారకముగా నీ విషయమును భావించు నది. నగర వన వర్ష పర్వతములలో నెచ్చటెచ్చట వార్త ప్రవర్తిం చునో వృత్తాంత మితివృత్త బలాయాతమై ప్రకర్షమున భావనీయము కాగలదో యందుచిత మయిన దేశవిభాగమును ప్రవర్తింప జేయ వలయును. రంగపీఠమునందు దాని మాత్రమె ప్రదర్శింప వలెను. సర్వము ప్రదర్శింప నక్కఱలేదు. రంగపీఠమునందు బాహ్యముకాని మధ్యమము కాని యాభ్యంతరము కాని దూరము కాని సన్నికృష్టము కాని సర్వదేశమును సంభావించి కల్పింప వలెను. బాహ్య మధ్య మాభ్యంతర భాగ త్రితయముండగా నొక భాగమున దేశాదికము

కల్పించి యచటనే దూరాదిభేదమును కల్పింప వలెను. భూయస్త్వాల్పత్వాది భిన్నమయిన పరిక్రమమున సర్వము ప్రకల్పింపవలెను. రంగమునందు బాహ్యాది భేదము నిట్లు గుర్తింప వచ్చును. రంగమున పూర్వప్రవిష్టు లభ్యంతరగతులు. ప్రధాన భూతులై మొదట ప్రవేశింతురేని వారాభ్యంతరులు. వారధిష్ఠించిన దేశవిశేష మభ్యంతరకక్ష్య. ప్రధానుడు మొదట ప్రవేశించి ప్రధానస్థానమున నుండును. అనంతర ప్రవిష్టులకు బాహ్యకక్ష్య నియతము. మొదట ప్రవేశించిన వానిననుసరించి స్థానవిశేషమున ప్రవర్తించువాని దేశము మధ్యమ కక్ష్య యగును. ఇచటి సారాంశ మిట్లున్నది. పూర్వ ప్రవిష్టునకు స్వస్థానము నందే యితివృత్తోచిత గృహోద్యానాది విభాగ ముండును. పశ్చాత్ప్రవిష్టునకు పూర్వ ప్రవిష్టునితో సంమిలనము కలుగ నంతవఱకు నిరీక్షానిమిత్తమై మధ్యమ కక్ష్య యందే గతిపరిక్రమాదిక ముండును. తత్సంమేలనమునకై సంమిలితు లయిన వారలకు కక్ష్యా విభాగము వేరుగా నగును. రంగమునందు బాహ్యాభ్యంతర కక్ష్యలం దున్నవారిని దర్శింపదలచు వ్యక్తి రంగమండలము ప్రవేశించునది. దక్షిణాభిముఖుడై యాతడాత్మ నివేదన మొనరించునది. పూర్వము ప్రవేశించిన వాని దక్షిణభాగము వీక్షించుచు నుండునది. ప్రేక్షకున కాతడు పరాఙ్ముఖుడై యుండుట యిందుండును. ఇట్టి రీతియందు కొన్ని పరిసరములలో విపరీత రీతియు నున్నది. ప్రధానముగ నుత్తరాభిముఖముగ నుండుటయు దక్షిణ దిశలో నుండి యాత్మనివేదన మొనరించుటయు సంగతము. నేపథ్య గృహమునకు సంబంధించిన భాండద్వార మే దిశగ నుండునో యది పూర్వదిశ యని నాట్యయోగమున నిత్యము గుర్తింప వలసి యున్నది. ఆత్మనివేదన మొనరించుటకు పురుషు డే ద్వారమున ప్రవేశించెనో యా ద్వారముననే మఱల నిర్గమింప వలెను. ప్రధానపురుషు డెటు నిష్క్రమించునో యా మార్గముననె నిష్క్రమింప వలెను. కార్యవశమున రంగమునుండి నిష్క్రమించిన వ్యక్తి మఱల నా ద్వారముననె ప్రవేశింప వలెను. ఏ మార్గమున ప్రవేశించెనో యా మార్గముననె నిష్క్రమింప వలెను. అతడెటునుండివచ్చి నివేదించెనో యటుగనే పోవలెను. కార్యవశమున

నిష్క్రమించిన నా గృహము ప్రవేశించునేని యెటు వచ్చెనో వచ్చిన మార్గముననె పోవలెను. కార్యవశమున ప్రధానపురుషు డన్యునితో పోవలసియున్నచో నటుపోయి మఱల నాతడొక్కడే ప్రవేశింపవలెను. తత్సహితుడై కాని ప్రవేశించునది. అట్లు ప్రవేశించువారలకు కక్ష్యాభేదముండుట యుచితము. వేరొక కక్ష్య నచట నిర్దేశింపవలెను. రంగ పరిక్రమమున నన్య కక్ష్య యుండవలెను. సమానులతో సహితుడై పరిక్రమించుటయు నీచులతో పరివారితుడై పరిక్రమించుటయు నుచితము. అగ్రగతిలో ప్రేమణికల నిర్దేశించుటయు యుక్తము. బహు పరిక్రమము లుండునేని సంచార భూమి విశ్రృష్టముగా నుండవలెను. రంగము మధ్యమ మయినను సన్నికృష్ట మయినను వారి గతి పరిక్రమ మిట్లే యుండవలెను. ఈ నిరూపించిన నికల్పముల మధ్యత్వాల్పత్వములు కేవల మల్పత్వ బహుత్వకృతములు కావు. ఇందు పరిక్రమ వైచిత్ర్యముకూడ కలదు. నాట్యమునందు దివ్య పరిక్రమముండును. అదివ్యపరిక్రమ ముండును. వాని ననుసరించిన చిత్రతయు కలదు.

౪౧౧. నగరే వా వనే వాపి పర్వతే సాగరేపి వా
దివ్యానాం గమనం కార్యం వర్షే ద్వీపేపి వా పునః
౪౧౨. ఆకాశేన విమానేన మాయయావ్యథవా పునః
వివిధాభిః క్రియాభిర్వా నానార్థాభిః ప్రయోగతః

నగరమున గాని వనమున గాని పర్వతమున గాని సాగరమున గాని భారతాదివర్షమునందు గాని ద్వీపమునందుగాని దివ్యులకు గమనము నిబంధింపవచ్చును. నాట్యప్రయోగమునందు దేవయోనులనదగు దివ్యవ్యక్తుల గమన మున్నది. పిశాచాదిబ్రహ్మాంతముగా నుండువారు దివ్యులు. వారు నగరాదివిషయములకు ద్వీపాదివిషయములకు రావలసి యుండునేని యాకాశగమనమున వచ్చుట నిబంధింపవలయును. విమానమున వచ్చుట యుండవలయును. విమానగామి వాహనమున వచ్చుట యుండవలయులు. అదర్శరూపమాయచే గాని వారు వచ్చుట కూర్పవలెను. ప్రయోగరమ్యత ననుసరించి నానాప్రయోజనాపాదకములయిన వివిధక్రియావిశేషముల ననుసరించి వారిరాక యుండును. బలాదాహరణము మొదలగునవి వారి వివిధప్రయోజనకము లయిన క్రియలు. వారందులకై యట్లువచ్చుట కూర్పవలెసి

యుండును. దివ్యవ్యక్తు లీ విధముగా వచ్చుటలో నీ ప్రకారములె కాక అన్యప్రకారములును గలవు.

౩౧౩. నాటకే చ్ఛన్నవేషాణాం దివ్యానాం భూమిసంచరః
మానుషైః కారణాదేషాం యదా భవతి దర్శనం
౩౧౪. దివ్యానాం ఛందగమనం సర్వవర్షేషు కీర్తితం
భారతే మానుషాణాం తు గమనం సంవిధీయతే

నాటకమునందు ఛన్నవేషు లయిన దివ్యవ్యక్తులకు భూమిసంచారము నిరూపింపవలెను. వరప్రసాదనాద్యనుగ్రహ నిమిత్తముగా దివ్యులు ఛన్నస్వరూపు లయినను మానవులకు గోచరింతురు. కావున నిచట వేషమనునది యాపాద మామస్తకము సంపూర్ణముగా సంఛన్నరూపత కాదు. పాదముల నంతట మోపి భూతలమున సంచరించుట కనువైన రూపముండుట వివక్షితము కాదు. వారు వరానుగ్రహము ప్రదర్శించునప్పుడు మానవులు దర్శింపవచ్చును. అప్పుడు నాటకమున ప్రయోగమునందు వారలకును భూమిసంచరము యుక్తమగును. "సంచరత్యస్మిన్ భూమిరేవ సంచరః". ఈ నాటకమున నట్లు సంచరింతురు గావున ఆ భూమియే సంచరము. నిమిత్తము ననుసరించి మానవులు దివ్యుల రూపమును దర్శింపగలరు. ఇట్టి సంచారము దివ్యులకు సామాన్యకల్పము. సర్వవర్షములందును వారలకట్టి ఛందగమనమున్నది. భారతవర్షమున గాని హైమమునగాని హరివర్షమునగాని యిలావృతవర్షమునగాని రమ్యమయిన కింపురుషవర్షమునగాని యుత్తర కురుభూములందుగాని వారు సంచరింతురు. మానవులకు మాత్రము భారతవర్షమునందు మాత్రమె గమనము విహితము. పురాణములందిది సామాన్యవిధిగా నున్నది. మానవుల కిలావృతాదులలో సంచారము విహితమగుట లేదు. మానవుడే దేని కార్యవశమున దూరదేశమునకేగవలసి యున్నట్లుగా నాటకమున నిరూపితమగునేని యంకచ్ఛేదమొనరించి యుత్తరాంకప్రవేశకము నందారీతిని సూచింపవలెను. దినమంతయు గమన మొనరింపగా వారలకు కార్యలాభమును నిర్దేశింపవలెను. కార్యలాభము కలుగగా నంకచ్ఛేదము విహితమగును. నాటకమునందు క్షణము ముహూర్తము యామము దినము సర్వమొక యంకమున బీజార్థవశానుగతముగా నుండునట్లొనరింపవలెను. మాస

సంచారము గాని సంవత్సరసంచారము గాని యంక చ్ఛేదమున నిరూప ణీయము. సంవత్సరాధికమయిన సంచారమును నాటకమున నంక సమాశ్రయముగ నిబంధింపరాదు. ఇట్లే భారతవర్షము నందు కక్ష్యా విభాగ మొనర్పవలెను. ఇట్టిది మానుషగతి. దివ్యగతి నిట్లు గుర్తించునది.

## దివ్యగతి

హిమవత్పృష్ఠమునందున్న పర్వతో త్తమ మయిన కైలాసము నందు యక్షులు గుహ్యకులు ధనదానుచరులు రక్షోభూత పిశాచా దులు నుందురు. వారందరు హైమవతులు. ఇట్లనుట హిమవత్పర్వతము నందు వారలకు బాహుల్యమున గతి యుండునని కార్యవశమున నితరములందును సంచరింతురని భావము. హేమకూటమునం దప్సరో గణ సహితులై గంధర్వులు సంచరింతురు. నిషధపర్వతము నందు శేషవాసుకితక్షకాది నాగజాతులవారు నివసింతురు. మహామేరువు నందు ముప్పదిమూడు దేవగణముల వారు నివసింతురు. వైడూర్య మయమయిన నీలపర్వతమునందు సిద్ధులు బ్రహ్మర్షులు సంచరింతురు. దైత్యదానవులకు శ్వేతపర్వతము సంచారభూమి. శృంగవంతము నాశ్రయించి పితరు లుందురు. ఇట్టి శ్రేష్ఠపర్వతములన్నియు దివ్యా వాసములుగా నున్నవి. పిశాచాది బ్రహ్మాన్తమున్న వారందరు దివ్యా వాసులు. వారి వారి సంచార స్థలముల నిట్లు సంకేతించుట యంతయు కవిశిక్షాదీక్ష కొఱకని గుర్తింప వలెను. కవులు తమ తమ నాటక నిబంధనములందు దివ్యసంచారము నిరూపింప వలసి యున్నప్పు డీ స్థలసంకేతముల గుర్తించి నిరూపింప వలెను. నాట్యప్రయోక్తలును ప్రయోగములందు రంగకల్పన మొనరించు నపుడు కక్ష్యావిభాగము సంకేతించు నప్పుడును సావధానముగా దీనిని గుర్తించుట యావశ్యక మని స్పష్టము.

> ౭౧౩. తేషాం కక్ష్యావిభాగశ్చ జంబూద్వీపే భవేదయం
> తేషాం న చేష్టితం కార్యం స్వైః స్వైః కర్మపరాక్రమైః
> ౭౧౪. పరిచ్ఛేద విశేషస్తు తేషాం మానుష లోకవత్
> సర్వే భావాస్తు దేవానాం కార్యా మానుష సంశ్రయాః

౭౧౭. తేషాం త్వనిమిషత్వం యత్తన్న కార్యం ప్రయోక్తృభిః
ఇహ భావారసాశ్చైవ దృష్ట్యామేవ ప్రతిష్ఠితాః
౭౧౮. దృష్ట్యా హి సూచితో భావః పశ్చాదంగైర్విభావ్యతే
ఏవం కక్ష్యావిభాగస్తు మయా ప్రోక్తో ద్విజోత్తమాః

వర్షాన్తరము లందును దివ్యపర్వతములు కలవు. వానియందును తత్సముచిత మయిన గమన మొనరింప శక్యమె యగును. జంబూద్వీపమునందువలె దివ్యులకును కక్ష్యావిభాగ స్థానవిశేషా పలక్షిత మయిన గతి యుక్తమె యగును. "చకార ఇవార్థే" జంబూద్వీపమునందు కక్ష్యావిభాగ మొనరించిన విధముననె యితరద్వీపము లందు నొనర్ప దగునని భావము. వారి వారి చేష్టితము స్వస్వకర్మ పరాక్రమములతో నుండ నక్కఱలేదు. వారి వారి పరిచ్ఛేదవిశేషము తదీయ పరిచారము నంతట నిరూపింపదగదు. మానుషలోకమునకు సంబంధించిన విధముననె నిరూపింపవలెను. దివ్యులకు సంబంధించిన దూర వ్యవహితాది విషయమయిన జ్ఞానమును ప్రదర్శింపరాదు. అట్లు ప్రదర్శన మావశ్యకము కాదు. అయినచో నిక యెట్లు ? వారి సర్వ భావమును మానుషగతముగనె నిబంధింపవలెను. మానుషలోకము నందువలెనె కూర్పవలెను. మానవలోకమునందు దివ్యుల కంశావతరణ మున్నది. రామాదులంశావతార స్వరూపులు. మానవ లోకమున వారవతరించినప్పుడు నాయకులయిన వారల కుత్కృష్టము సాతిశయ మయిన మానుష్యోచితమగు చరితమె యున్నది. అట్లె దివ్యభావ బహువృత్తులకును నిరూపింపదగును. దేవతల సర్వభావములను మానుష సంశ్రయములుగనె నిరూపింప వలెను. దేవులకు ప్రసిద్ధ మయిన యనిమిషత్వమును ప్రయోక్తలు కూర్పజనదు. ఱెప్పపాటు లేకపోవుటను వారలకు కూర్ప నక్కఱలేదు. అట్లు కూర్చుట యుక్త మును గాదు. నాట్యమునందు వ్యభిచారి భావములు రసస్థాయి భావములును దృష్టియందే ప్రతిష్ఠితములై యున్నవి. మొదట దృష్టిచే సూచితమయిన భావమె యనంతర మంగములచే విభావిత మగును. దృష్టిసూచిత సూచాభినయమె విభావాది శేష విశేష యుక్త మయినచో స్ఫుటము కాగలదు. "తేషాం న చేష్టితం కార్యం" వారి చేష్టితము నిరూపింపరాదను పూర్వ వచనముననె యీ యర్థము

సాధ్యమగుటచే ప్రధాన మగుటచే నిట్లు మతల చెప్పవలసి యున్నది. ఈ విధముగా నిట్లు కక్ష్యా విభాగము నిరూపిత మయినది. "మయా ప్రోక్తో ద్విజోత్తమాః! ద్విజోత్తములు శ్రోతలు బోద్ధవ్యులు భరతుడువక్త. వక్తృబోద్ధవ్య విశేషమున లభించు నర్థమిందు నున్నది.

ప్రవృత్తిలక్షణము

ప్రథమ ముద్దేశము యుక్తము. ఉద్దేశము సర్వోపకారి. మొదట సంగ్రహముగా జెప్పుట యనంతరము సర్వము నిరూపించుట గ్రంథ ప్రక్రియ. ఈ ప్రఘట్టమున నీవిధముగా కక్ష్యావిభాగము సూచితమయి నను చారీపరిక్రమ ప్రసంగమున గతిప్రసంగానంతరము నిరూపితమయి నది. ప్రస్తుత ముద్దిష్ట మయిన యాంగికోపయోగి ధర్మ్యాదిత్రయ మును నిరూపింపవలసి యున్నది. ఈ సందర్భమున వృత్తుల నిరూపిం చుట యావశ్యకము. ఈ యంశము వృత్తినిరూపణమున నిరూపితము. ధర్మము పూర్వోద్దిష్ట మయినను కక్ష్యావిభాగమున ప్రతిపాదించిన దేశభేదాభిధానప్రసంగమున దేశవిభాగ ప్రతిపన్నము లయిన ప్రవృత్తు లాక్షిప్తము లయినవి. రంగమున పాత్రప్రవేశమున్నని కక్ష్యావిభాగ మనుట యుక్తమె. ఉత్తరద్వారమున దాక్షిణాత్యులు ఆవంతీప్రకృ తులు ప్రవేశింతురని, ఇతరులు సవ్యమార్గమున ప్రవేశింతురని సూచిత మగు ప్రవృత్తివిభాగము ప్రవేశకభేదము నాక్షిప్త మొనర్పగలదు. అదియు తత్స్థానసముచితము. ఇదియు తదుపయోగి కావున కక్ష్యా విభాగానంతరము ప్రవృత్తులను జెప్పుట యుచితమె యగునని భరతుడు భావమున భావించి ప్రవృత్తిలక్షణ ముపక్రమించుట యుక్తము.

౮౧౯. పునశ్చైవ ప్రవక్ష్యామి ప్రవృత్తీనాం తు లక్షణం
చతుర్విధా ప్రవృత్తిశ్చ ప్రోక్తా నాట్యప్రయోక్తృభిః
అవంతీ దాక్షిణాత్యా చ పాంచాలీ చాంధ్రమాగధీ

నాట్యప్రయోక్తలు నాట్యమున ప్రవృత్తి నాల్గు విధముల నున్నదనిరి. ఆవంతి, దాక్షిణాత్య, పాంచాలి, ఆన్ధ్రమాగధి యని. ఇందిది మీమాంసింపదగి యున్నది. ప్రవృత్తి యని యనుట యేల? అది నాల్గువిధములె యని యనుటయు నేల? పృధివిలో నానాదేశ కృతము లయిన యాచారవిశేషములు కలవు. దేశకృతాచారములు

కలవు. భాషాకృతము లయిన యాచారములును సవిశేషముగ
గలవు. దేశవిశేషగతము లయిన వేషభాషాచార వైచిత్ర్యప్రసిద్ధియె
ప్రవృత్తి యగును. దేశాద్యాచారములను వార్తావిశేషములను
ఖ్యాపనము నివేదనము చేయునదియె వృత్తి. అదియె ప్రవృత్తి. ఇట్టి
విషయమున యోజన మొనర్పదగును. దేశమున దేశమున వేషాదు
లున్నవి. నైపథ్యమున్నది. భాష యున్నది. ఆచార మున్నది.
లోకశాస్త్రవ్యవహారమున్నది. వార్త యున్నది. కృషిపాశుపాల్యాది
జీవిక యున్నది. వాని నిరూపించునది ప్రవృత్తి. ఈ ప్రవృత్తి పృథి
వ్యాదిసర్వలోకవిద్యాప్రసిద్ధి నాపాదించును. ఇట్టి యిది వాని నిశ్శేష
ముగా నవగమింపజేయును. కాన ప్రవృత్తిశబ్దము నిశ్శేషవేదనమున
ప్రవర్తించును. "అస్త్యేషా భువనే ప్రవృత్తిరభవద్రామేణ రామస్య
యత్" ఇత్యాదులందు ప్రవృత్తిపదము నివేదనము నందున్నది. ఇట్లు
ప్రవృత్తిపదార్థము స్పష్ట మయినను ఇట్లడుగ వచ్చును. సంఖ్యాప్రశ్న
మునందీ భావము భావనీయము. పృథివిలో నానాదేశములు కలవు.
అవి నాలుగే యగునా? దేశకృతముగా ప్రవృత్తి కలుగుననుచో
ప్రవృత్తి చతుర్విధమనుట యుపపన్న మగునా? దేశములు నాలుగే
కాదు కదా: ప్రవృత్తులు నాల్గనుట కుదురునా? దేశము లనేకము
లుండగా నాలుగు దేశముల ప్రసిద్ధిననుసరించి నాలుగు ప్రవృత్తుల
పరిగ్రహించుటయు అభ్యధికదేశముల ననుసరించిన యభ్యధికప్రవృ
త్తుల పరిత్యజించుటయు యుక్తమగునా? "సమానలక్షణత్వాత్
ప్రయోగ ఇత్యుచ్యతే మహద్భిః", ప్రవృత్తులకన్నిటికి సమానలక్షణ
ప్రయోగమె సముచితము. లక్షణము సమానముగా నుండగా ప్రయో
గము తదుచితముగనె యుండవలయునని మహాత్ములందురు. కాని
యొకటి నిగ్రాహ్యము. లోకము నానాదేశవేషభాషాచారముగా
నున్నది. సత్యమె. సమానలక్షణసంపద కలిగి యుండుటలో నాలుగు
వేరు వేరు ప్రవృత్తులు కలవు. ఈ ప్రవృత్తిచతుష్టయమున సర్వప్రయో
గము సంగత మగును. ఇంతకన్న నతిరిక్తముగా నెట్టి వ్యవహారము
నెవరు భావింపరు. లోభక్రోధమోహాదులచే సాధారణీకృతము
లయిన జగద్భావములు పారిమిత్యము కలవగుట ప్రసిద్ధము. అట్లే

ప్రకృతము నందును పరిశీలింప దగును. చతుస్సాధారణప్రయోగ కాని
మయిన వేరొక వ్యవహారము గోచరము కాదు. ఈ యంశ మిందివరలో
నిరూపితమె. 'విస్మరణశీలో భవాన్ న స్మర్యతే' విస్మరణశీలునకు
ప్రతిబోధ మొనర్చిస్మృతిసంపాదించు టేల ? విస్మరణశీలునకు స్మృతి
కలుగ జేయు టొప్పదేమి ? పూర్వము పూర్వరంగప్రసంగమున 'అవన్తి
పాంచాల దాక్షిణాత్యాంధ్రమాగధ విధానముల పూర్వరంగమాపా
దిత మయినది. పూర్వరంగప్రయోగము గర్భాధానీయస్థానీయ
మనియు నిరూపితము. ఈ సర్వమభ్యుపగమ్యవాద మగుట ప్రకృత
సమాధానమున సంభావింపవలెను. వృత్తులకు సమానలక్షణప్రయోగ
ముండుట తథ్యమె. లోకము నానా దేశ వేష భాషాచారమగుట
లోకానుమతముగా వృత్తిసంశ్రిత మయిన నాట్యము భారతి ఆరభటి
సాత్వతి కైశికి యని చతుర్విధమగుట నిరూపితమయినది. అభ్యుపగమ
దేశాదిశబ్దమున ప్రవృత్త్యభిధానము యుక్తసంగతమగును. నాట్యము
వృత్తిసంశ్రితము. వృత్తుల నాశ్రయించి యది చతుర్విధ మయినది.
ప్రవృత్తి ప్రత్యేకముగా స్వసంకేతాభ్యుపగతము కాదు. లోకాను
గుణానుసారముననె యది యున్నది. లోకము దక్షిణాపథమని పూర్వ
దేశమని పశ్చిమదేశమని యుత్తరభూమియని చతుర్విధముగా విభక్తమై
యున్నది. ఇది నిర్నిబంధనము కాదు. వృత్తిసంశ్రితము లయిన
నాట్యప్రయోగము లున్నందున నా యా దేశము లభిహితము లయి
నవి. ఆ యా దేశములనుండియె ప్రవృత్తిచతుష్టయ మభినిర్వృత్త
మయినది. ప్రయోగమును నిష్పాదిత మయినది.

ఇందు దాక్షిణాత్యులు బహునృత్తగీతవాద్యములతో నున్నారు.
వారు కైశికీప్రాయులు చతురమధురలలితాంగాభినయములు కలవారు.
దాక్షిణాత్యులు శృంగారప్రచురముగా నుందురు గావున వారియందు
కైశికి సంభవించును. పశ్చిమదేశముల వారావంతీపదసంగృహీతులు.
ఆవంతీవృత్తి ధర్మప్రాధాన్యమున నుండును. కావున వారలందు
సాత్వతి సంగతమై యున్నది. ప్రాచ్యదేశీయులలో ఘటాటోపవాక్యా
డంబరప్రాధాన్య మున్నది. కావున భారతీ ప్రయోగము ఆరభటీ
ప్రయోగము కలదు. ఉత్తరభూమి ప్రధానముగ భారత్యారభటీ
ప్రయోగము కలదయినను కైశికీలేశ ముండుటచే ప్రవృత్తిసహిష్ణువుగా

నున్నది. "ప్రయోగ స్త్వల్పగీతార్థః ఆవిద్ధగతివిక్రమః" ఇందు గీతార్థ మనుటచే తత్ప్రయోజనస్వరూప మయిన నృత్తవాద్యాదికము నుండును. ఇట్లీవిధముగా చిత్తవృత్తి భేదసాదృశ్య మున్నందున లోక మున చతుర్ధావిభాగము సంగతమగును. ఆ చతుర్విధత్వమె యిచట నిరూపితమయినది. లోకానుమతవ్యవహారమున నాట్యము చతుర్విధ మని భారత్యారభటీసాత్వతీకైశికీరూపమున వృత్తి నిరూపితమయినది.

ఇట్లీవృత్తి చతుర్విధమె యని యిట్టి సంక్షేప మాదరించు టేల? అట్లు సంక్షేపమాదరించుటయె యుక్తము. ఈ చిత్రవిచిత్రలోక మంతయు చిత్రవిచిత్రాకార బహువిధభాషాచార విచారాది యుక్తము. ఇట్టి లోకస్వభావము ప్రతిపదము నిరూపింపశక్య మగునా? ఎవరట్లు వక్తుంశక్తు లగుదురు. ఎవరట్లు శిక్షాచాతుర్యమున గ్రహింప సమర్థు లగుదురు? ఎవరభ్యసించుట కేని యభిలాషపడుదురు? ఎవరు ప్రయోగించుట కుత్సుకంపడుదురు? ఎవరు చూచుట కుల్లసంపడుదురు? నాట్యమంతయు చిత్తవృత్తిప్రధాన మయినందున నా చిత్తవృత్తినిరూ పణమె న్యాయము. ఈ యంశమునే భారత్యారభటీసాత్వతీకైశికీ వ్యాహారము స్పష్ట మొనరించును. ప్రయోగమునందలి వాగంగ చేష్టావిధానములం దభినిర్వృత్త మయినందుననె లోకప్రసిద్ధమగుట సర్వలోకప్రసిద్ధము. కావుననె లోకప్రసిద్ధమయిన భారత్యాదిచతుష్ట యము ననుసరించి బ్రహ్మ ప్రయోగ ముత్పాదించెను. ఈ నాలుగు వృత్తుల ననుసరించిన ప్రయోగావలంబనమున దృష్టాంతరధర్మ మాశ్ర యించి యీ వృత్తిగ్రంథము నిట్లు చిరంతనులు వ్యాఖ్యానించిరి. ఇంతకు వేరుగా నిరూపించుట యుక్తము కాదని దూషణమును నిరూపితమయినది. చిరంతనులయిన రాహులకాదుల భావము నీవిధ ముగ నభ్యూహింపదగును. తత్తన్నిమిత్తానుసారముగ లోకమున వృత్తులున్నవి. వృత్తులు నాలుగువిధములుగా నుండుట ప్రవృత్తులకు నిదాన మయినది. అట్టి ప్రవృత్తుల చతుష్టయత్వమాత్రమున నిది దృష్టాంతము కావచ్చును. ఇట్లీ దృష్టాంతధర్మమును రాహులాదులు వ్యాఖ్యానించుట యంతయు గజస్నానీయమై యలూనవిశీర్ణముగా నున్నది. "ఆస్తాం తావత్."

దాక్షిణాత్యులు కైశికీప్రాయులు కైశికి ప్రచురముగా వారియం దుండును. ఇతరములు నప్రచురముగ నుండుగావుత. "కేశైః నిర్వృత్తం కైశికం" కేశకలాపములచే నభినిర్వృత్తమగుటచే కైశిక మగుననుట సముచితవ్యుత్పత్తియే కాని యది నిమిత్తమాత్రము. ఈ యంశము వృత్తినిరూపణాధ్యాయమున విశదముగనె నిరూపిత మయినది.

దక్షిణసముద్రమునకు వింధ్యపర్వతమునకు మధ్యనున్న దేశములకు దాక్షిణాత్యదేశములని పేరు. విన్ధ్యహిమాచలములకు మధ్యగతము లయిన దేశములకు ఉత్తరదేశములని వ్యవహారము. ఇట్టి వ్యవహారముననె దేశభేదము సిద్ధమయినను ప్రతిపదపాఠ మొనరించుట యొకవిధముగా నావశ్యకము. తదంతరాలములం దనేకవిషయవిభాగ ములు కలవు. అట్టి వన్నియు సంకేతింపదగినవి కావు. ఇందు పర్వత పరిసరవిషయములను కచ్ఛపరిసరవిషయములను మ్లేచ్ఛవిషయములను విడనాడి పరిగణింపవలెను. తన్నిషేధమున ప్రసిద్ధిననుసరించి దేశోప సంగ్రహణ మొనరించుట యావశ్యకము. కవులు తదర్థమై యిట్టి ప్రతిపాఠ మంగీకరింతురు. దేశనామసంకీర్తనసమయమున నిట్లే గుర్తింపవలెను.

౩౨౦. మహేంద్రో మలయః సహ్యో మేకలః పాలమంజరః
ఏతేషు సంశ్రితా దేశాస్తే జ్ఞేయాదక్షిణాపథాః
౩౨౧. కోసలాస్తోసలాశ్చైవ కలింగా యవనాః ఖసాః
ద్రమిడాంధ్రమహారాష్ట్రా వైణ్ణా వై వానవాసజాః
౩౨౨. దక్షిణస్య సముద్రస్య తథా వింధ్యస్య చాంతరే
యే దేశాస్తేషు యుంజీత దాక్షిణాత్యాం తు నిత్యశః

మహేంద్రము మలయము సహ్యము మేకలము పాలమంజరము ననునవి దక్షిణాపథమునందున్న పర్వతవిశేషములు. ఆ పర్వతపరిసర ప్రదేశముల నాశ్రయించి యున్న దేశములు దక్షిణాపథములని ప్రసిద్ధి కలిగి యున్నవి. ఈ పరిసరములందే పర్వతకచ్ఛాదిమ్లేచ్ఛావాసము లుండవచ్చును. వాని నిషేధమిందు నిగ్రాహ్యము. ఈ పర్వతసీమ లందు ప్రసిద్ధములయిన దేశముల నామసంకేత మీ విధముననున్నది.

కోసలము తోసలము కలింగయవన ఖసములు ద్రవిడాంధ్రమహారాష్ట్రములు వైణ్ణములు వానవాసజములు ననునవి వింధ్యపర్వతమునకు దక్షిణసముద్రమునకు నంతరమున నున్నవి. కృష్ణా పినాకినీ నదీతీరవాసిదేశములకు వైణ్ణము లని పేరు. ఈ దేశములందు నిత్యము దాక్షిణాత్యావృత్తివ్యవహార మొనర్ప వలెను. ఈ దేశములవారి విషయమున కైశికీవృత్తి వ్యవహారము యుక్తమని భావము. నిత్యమిట్టి వ్యవహారమె వీరలకు యుక్తమనుటలో నొక ప్రత్యేకతయు గలదు. "అనాదిరయం దేశభేదేన చిత్తవృత్తిక్రమః. దృష్టో హి వస్త్రాభరణాత్మనా దేశభేదోచితః స్వభావభేదః" దేశభేదమున చిత్తవృత్తిక్రమను ముండుననుట యనాదివ్యవహారము. వస్త్రాభరణాదిపధానమున దేశభేదోచితమయిన స్వభావభేద మంతట గోచరమగుచునే యున్నది.

ఆవంతికము విదిశాభూములు సౌరాష్ట్రములు మాలవములు సైంధవసౌవీరానర్తములు దాశార్ణములు త్రిపురాపరిసరములు మార్తికావతములు మృత్తికావతీ పురపరిసర విషయములు అను దేశములందుండువారు నిత్య మావంతీప్రవృత్తి కలిగి యుందురు. సాత్వతీవృత్తిని కైశికీవృత్తిని గూడ వీరాశ్రయించి యుందురు. ప్రయోక్త లీ విషయమును గుర్తించి నాట్యమున వీరలకు వీని ప్రయోగ మానూత్రింపదగును. వీరలలో బాహుల్యమున నావంతి యుండుననుట యుక్తము. ఆవంతి యున్నచో నితరము లుండవని తాత్పర్యము కారాదు. అట్లే దాక్షిణులు కైశికీ ప్రియు లయినను నాట్యప్రయోగౌచిత్యమున నితరములగూడ గూర్పవచ్చును. యే దేశా దాక్షిణాత్యాస్తు వృత్తిమారభటీం శ్రితాః" దాక్షిణాత్య దేశము లారభటీవృత్తి నాశ్రయించి యుందు ననుటయు సంగత మగును.

అంగ వంగ కలింగదేశములు వత్సదేశములు ఓఢ్రమాగధములు పౌండ్రనేపాలకములు అచటనున్న యంతర్గిర బహిర్గిర ప్రదేశములు ప్లవంగమ మలద మల్లవర్తక దేశములు బ్రహ్మోత్తరము మొదలగు ప్రదేశములు భార్గవ మార్గవములు ప్రాగ్జ్యోతిషములు పులింద వైదేహములు తామ్రలిప్తములు ప్రాంగ ప్రావృతములు నను దేశములన్నియు ఓఢ్రమాగధీవ్యవహారమున నుండును.

**౮.౨౩. అన్యేపి దేశాః ప్రాచ్యా యే పురాణే సంప్రకీర్తితాః**
**తేషు ప్రయుజ్యతే హ్యేషా ప్రవృత్తిశ్చోఢ్రమాగధీ**

పురాణము లందింకను కొన్ని ప్రాచ్యదేశములు సంప్రకీర్తితము లయినవి. అట్లు పురాణోక్త దేశవాసులకీ యోఢ్రమాగధీవృత్తి వ్యవహారము యుక్తమగును. ఈ యోఢ్రమాగధి యనుట యవంతి ప్రాగ్జ్యోతిష కామరూపీయవృత్తి యని భావము. వారలకది యుండ రాదేమి? వీరలకిది యుండరాదేమి? యని ప్రమాణదూరముగ శుష్కతర్కమున నాసూచన మొనరింపదగదు. పురాణకీర్తనము సూచించుట యాగమ పూర్వకత్వము నిర్దేశించుట కగును. పాంచాల శౌరసేన కాశ్మీర హాస్తినాపుర పరిసరములవారు బాహ్లీక శాకల మద్ర కౌశీనరులు హిమవత్సంశ్రితులు గంగానది యుత్తరదిశ నాశ్రయించి యుండువారు నచటి జనపదాశ్రితులు పాంచాల మధ్యమా ప్రవృత్తి వ్యవహారమున నుందురు. పాంచాల మధ్యమావ్యవహారమున నుండుటను బట్టి సాత్వతి యారభటి సంగతమగును. ఇచట యీ పరిగణనములో నరట్ట కదరక ఖస ప్రభృతి తురుష్క వర్గములు సంక్లుప్తములు కాలేదు. వారందరు మధ్యమా ప్రవిష్టు లయినను వ్యవహారబహిష్కృతులయి స్వకంఠ పఠితులు కాలేదు.

౮.౨౪. ప్రయోగస్త్వల్ప గీతార్థ ఆవిద్ధగతి విక్రమః
ద్విధా క్రియా భవత్యాసాం రంగపీఠ పరిక్రమే

౮.౨౫. ప్రదక్షిణ ప్రవేశా చ తథా చైవాప్రదక్షిణా
అవంతీ దాక్షిణాత్యా చ ప్రదక్షిణ పరిక్రమే

౮.౨౬. అపసవ్య ప్రవేశా తు పాంచాలీ చోఢ్రమాగధీ
అవంత్యాం దాక్షిణాత్యాయాం పార్శ్వద్వారమథోత్తరం
పాంచాల్యాం ఓఢ్రమాగధ్యాం యోజ్యం ద్వారం తు దక్షిణం

ప్రాగ్దేశీయులకు రంగపీఠ పరిక్రమమునందు కొన్ని విశేషములు కలవు. వారి ప్రయోగము బహుగీతములతో నుండదు. లేశతః కైశికీ ప్రయోగము ననుసరించును. అందుననే యల్పగీతార్థము తత్ప్రయోగ మనిరి. ఇంకను వారి ప్రయోగమునందు గతి విక్రమ మావిద్ధరీతితో నుండును. ఇంకను రంగ పరిక్రమములో వారి క్రియాప్రవృత్తి రెండు విధముల నుండును. ప్రదక్షిణ ప్రవేశముగా నొకటియు నప్రదక్షిణ

ప్రవేశముగా మరియొకటియు నుండును. ఆవంతి దాక్షిణాత్య యనునవి ప్రదక్షిణ పరిక్రమముతో నుండును. పాంచాలి ఓఢ్రమాగధి యను రెండును అపసవ్య ప్రవేశముతో నుండును. ఆవంతీ వృత్తిలో దాక్షిణాత్య వృత్తిలో పార్శ్వద్వార ముత్తరదిశగా నుండును. పాంచాలిలో ఓఢ్రమాగధిలో దక్షిణముగా ద్వార మాయోజనము చేయుట యుక్తము. ప్రాగ్దేశీయులకు దక్షిణముగా సముద్రనికటమునందు ఉఢ్ర దేశము కలదు. అది సీమారూపముగా నున్నది. ఉత్తరమున మాగధము లున్నవి. ప్రాగ్దేశ మీ యుభయ మధ్యవర్తి యైనందున ఓఢ్రమాగధి వ్యవహారము పొందినది. ఓఢ్ర కలింగులకు రెండిటి యుపజీవన ముండునన్న భావమున వృత్తిద్వయ మధ్యమున పరిగణించుట ప్రదక్షిణ పరిక్రమమున పార్శ్వద్వార మేర్పరచుటలో దక్షిణోత్తర వ్యతిరేకముగా పరిక్రమణ స్థానము లేదు. కావున రెండు ప్రవృత్తులను సన్నిహిత సంబంధముండుటచే ఏక విధముగా కలిపి ప్రయోగము నిర్దేశించుట యుక్తమే యయినది. రంగపీఠ పరిక్రమములో దక్షిణ భాగమునందున్న వ్యక్తి ఉత్తర ద్వారమున ప్రవేశించి పశ్చిమదిశలో పరిక్రమించి ఆ పిమ్మట దక్షిణదిశలో పూర్వదిశలో ఉత్తరదిశలో పరిక్రమింపవలెను. అట్లు పరిక్రమించి యీ దిశయందే ఆత్మనివేదన మొనర్పవలెను. దక్షిణాభిముఖుడై నివేదన మొనర్చుట నిర్దిష్టమైనది. మొదట నుత్తర దిశలో పరిక్రమించి వరుసగా పూర్వ దక్షిణ పశ్చిమ దిశా పరిక్రమణమున ఉత్తర ద్వారమున చేరి నిష్క్రమించుట యుక్తము. ఆవంతీదాక్షిణాత్యములు ప్రదక్షిణ పరిక్రమములతో నుండుట ప్రసిద్ధము. పాంచాలి ఓఢ్రమాగధి అపసవ్య ప్రవేశమున నుండును. ఆవంతిలో దాక్షిణాత్యలో పార్శ్వద్వార ముత్తరముగా నుండుటయు పాంచాలిలో నోఢ్రమాగధిలో దక్షిణముగా నుండుటయు కలదు. ఓఢ్రపదమున్న స్థలమున ఆంధ్ర పదప్రవేశమును పాఠాంతరము సూచించినది. పాంచాలీ విధానము దీని విపర్యయములో నుండుట ప్రసిద్ధమే. దక్షిణ ద్వారమున ప్రవేశము ప్రదక్షిణ పరిక్రమణమున నిష్క్రమణము సముచితము. ఇంకను కొన్ని నియతములయిన విశేషములు కలవు. వాని నిట్లు గ్రహించునది.

౭౨౭. ఏకీభూతాః పునస్త్వేతాః ప్రయోక్తవ్యాః ప్రయోక్తృభిః –
పర్షదం దేశకాలౌ చాప్యర్థయుక్తిమవేక్ష్య చ
౭౨౮. యేషు దేశేషు యా కార్యా ప్రవృత్తిః పరికీర్తితా
తద్వృత్తికాని రూపాణి తేషు తజ్ఞః ప్రయోజయేత్
౭౨౯. ఏకీభూతాం పునస్త్వేతాః నాటకాదౌ భవంతి హి
అవేక్ష్య వృత్తిబాహుల్యం తత్తత్కర్మ సమాచరేత్

ఇట్లే నిరూపితములయిన ప్రవృత్తిధర్మము లిట్లు వేరువేరుగా నున్నను వీనిని సమ్మిశ్రముగా నిరూపించుటయు సముచితమె. ప్రయోగ వైచిత్ర్యముభావించు ప్రయోక్తలు కార్యవశమున వీని నేక మొనర్చి ప్రయోగింపవచ్చును. ప్రవృత్తిమిశ్రణ మంగాంగిభావసంబంధమున నుండునట్లు పరిశీలింపవలెను. కైశికి ప్రధానముగా నుండగా నితరము లంగములుగ నుండునట్లు నిరూపింపవచ్చును. ఇట్లె యితరము లందును నిగ్రాహ్యము, వీనికి సాంకర్యము సముచితము కాదు. సంగతమును కాదు. ఏకీభూతముగా వీని నిరూపించుటలో నొక యుక్తి యున్నది. ఆ యుక్తి ననుసరించి మిశ్రణ మాపాదించుటయె యుక్తము. పార్షద నియమానుసారమున నిట్లొనరింపవచ్చును. నాటకప్రయోగపరిషత్తు నందు ప్రాశ్నికత్వకృతముగగాని స్వామిత్వకృతముగగాని ప్రాధాన్య ముండును. దేశకాలకృతమయిన ప్రాధాన్యముండును. అట్లే ప్రయోజనకృతప్రాధాన్య ముండును. బహుతరపాత్రపరీక్షయొనరింపగా తదను భవాయాతము తత్సముచితము నయిన వైచిత్ర్యకృతముగా నొక విశిష్టప్రాధాన్య మవభాసించును. తదనుసారమున ప్రకృతము సమీక్షించి ప్రవత్తులకు సంకరము నిరూపింపవచ్చును. అప్పుడవియన్నియు నేకీభూతములై గోచరించును. వాని యా యేకీభవనమునం దొకటి ప్రధానము కాగా నితరములు ప్రధానానుయాయులై శోభాసంపాద కము లగును. నాట్యప్రయోక్తలో పరిక్రమోపయోగ మీ విధముగ నున్నది ప్రవృత్తులకు ప్రత్యేకవిషయమునందును పరిక్రమోపయోగ మున్నది. దాని నిట్లు సంభావించునది ఏ దేశమునం దే ప్రవృత్తి యుక్తమో యా దేశమునం దా ప్రవృత్తి నిరూపించుట యుక్తము. అట్లు ప్రయోగించుటనె ప్రయోగవిదులు పరికీర్తించినారు. ఆ యా దేశములందు తత్ప్రవృత్తికములయిన రూపకములనే ప్రయోగవిదుడు

ప్రయోగింపవలెను. కాశ్మీరికుడు నాయకుడుగా నుండు దేశమునందు శృంగారరసముజ్జ్వలమయిన జ్యేష్ఠాకనిష్ఠానాయికా ప్రయుక్తమగు నాటికను ప్రయోగించుట సముచితముగా నుండదు. నాటిక కైశికీ ప్రధానము. కావున దాక్షిణాత్యునకు సముచితము. తత్తద్దేశాను సారమున తత్తదౌచిత్య మనుసంధానించుట యుక్తము. తచ్చేష్టితాను వర్తనము యుక్తము. ఎచటనేని తత్సముచిత తచ్చేష్టిత వ్యావర్తన మున్నచో ప్రతీతివిఘాతము కలుగును. రసమయత్వమును సిద్ధము కాదు. "రసాశ్చ నాట్యస్య ప్రాణాః. వృత్యప్రత్తిరపి వా పరేవ భవేత్" అసత్యతాశంకా చ సమూలఘాతం విహన్యాదేవ ప్రయోగం" నాట్యమునకు రసములు ప్రాణములు. వృత్యప్రత్తియు నాట్యమున పరాసంపద. ఏ మాత్రమేని యసత్యతాశంక నాట్యమును సమూల ఘాతను హతమొనరించును. కావున "తద్వృత్తికానిరూపాణి" రూపకము లన్నియు నా యా దేశప్రతినియతములయిన వృత్తులతో నుండును. ఏ యే దేశములం దే వృత్తి ప్రకారము నియతనిరూపిత మయినదో యా వృత్తి యా రూపకములం దుండవలెను. నాటకాదు లలో నన్యతమములయిన రూపకములం దది యుండును. తద్వృత్తి రూపము తద్రూపములందుండుట యుచితము. తద్దేశగతనాయక ప్రాధాన్యమున తద్రూపమును కవి నిరూపింపవలెను. నాట్యశబ్దవాచ్య మయిన ప్రయోగమున కాశ్రయమయిన నాటక మట్లే యుండవల యును. నాటకాదులలో నీ కైశిక్యాదివృత్తు లేకీభూతములై యుండుచో వృత్తిబాహుల్యము సమీక్షించి యా యా కర్మ నాచ రింపవలసియున్నది.

ఇచట నాటకశబ్దము రూపకవిశేషవాచి కాదు. ఇది యిచట నాట్యవాచకము. 'హాస్యస్థానాని యాని స్యుఃకార్యోత్పన్నాని నాటకే' నాటకమునందు ప్రయోజనవశమున నుత్పన్నములయిన హాస్యస్థానము లను నర్ధసంపదకల కారికాఖండమున నాటకపదమునకు గల యర్థమె యిచట నిరూపింపదగిన యర్థము. నాటక మున్నయన మొనరించు నన్నప్పుడు నాట్యము ప్రేక్షకులను స్వాత్మసందేశమున నుత్తేజితుల నొనర్చుట చెప్పకొనవలెను. ఇంకను నాట్యము వృత్యప్రత్త్యాధానమున

తద్భావానుప్రవేశమున సహృదయసామాజికుల ను త్తేజితుల జేయును. అట్లే తద్భావానుప్రవేశమున ప్రయోక్తల నుత్సేతుల నొనరించునని భావము. నాటకపదమును కృతిపరముగా నన్వయించుకొందుమేని యభినయ ప్రయోగానుకూలముగా గాత్రవిక్షేపము నిది యాసూత్రిత మొనర్చి యుద్బోధించునని భావింపవచ్చును. కొందరు నాటకపదము నిట్లు వ్యుత్పాదింతురు. నాటకపదము కాఠకపదము వంటిది. కఠపద మున కాఠకము సిద్ధమయినట్లు నటపదమున నాటకము సిద్ధమయినది. కఠచరణమున కాఠకము. నటచరణమున నాటకము. శ్లాఘ్యమగు నటకర్మ నాటకమని భావార్థము. శ్లాఘాస్పదకర్మశీలురయిన నటుల గోత్రచరణసంబంధమున నాటకపదము వ్యుత్పన్నమయినది.

వృత్తులనేకములు కలిసియుండునేని వానిలో నొకవృత్తిని బాహుల్యమున నిరూపించుట యుక్తము. ఇతరముల నంగభావహాని లేకుండునట్లు వర్ణింపవలెను. ఒకటి ప్రధానముకాగా నితరము లంగము లగును. అంగములుగా నుండునవి యన్నియు బహులముగా నుండు నంగిప్రవృత్తిని పోషించునవియై యుండవలెను. ఇట్లు వీనిని నిరూపించుట బుద్ధిమత్తకల కవి సంధానచాతుర్యమునకు నిదర్శనము.

౩౦. ప్రయోగో ద్వివిధశ్చైవ విజ్ఞేయో నాటకాశ్రయః
సుకుమారస్తథావిద్ధో నాట్యయుక్తిసమాశ్రయః

నాటకాశ్రయమయిన ప్రయోగము రెండు విధములు. సుకుమారప్రయోగము, ఆవిద్ధప్రయోగము నని. ఈ రెండు ప్రయోగములును నాట్యయుక్తిసమాశ్రయములు. తత్తత్సమయసముచితమయిన నాట్యయోగమున సుకుమారావిద్ధస్వరూపము లేర్పడును. ఆవిద్ధప్రయోగమునందీ ధర్మములున్నవి. ఇది యావిద్ధాంగహారము. "అంగానాం హారో హారణం యత్ర" అభినయమునందా యా యవయవముల హారణాహారణము లుత్కటస్వభావమున నుండును. ఇది ఛేద్యభేద్యాహవాత్మకముగ నుండును. ఛేదభేదప్రధానములయిన సంగ్రామము లుండును. ఛేద్యభేద్యాహవమిందు ముఖ్యము. "ఆహ్వాయంతే పరస్పరం వీరా యత్ర" ఆహవమునందు వీరులు పరస్పర ఘాహ్వాన మొనరింతురు. ఇంకను మాయామంత్రౌషధాదికృతమయిన

రూపపరివర్తనాదికము ముఖ్యము. హస్తలాఘవసాదృశ్యాదికృత మయిన యింద్రజాల మిందుండును. పుస్తనైపథ్యములతో నిది కూడి యుండును. ద్రుమ్యృణ్మయాకృత్యాదు లిం దావశ్యకములు. ఇట్టిదె పుస్తనైపథ్యము. ఇందు పురుషు లనేకు లుందురు. స్త్రీ లల్పముగ నుందురు. సాత్వత్యారభటీప్రాయముగనుండు నీ నాట్య మావిద్ధ ప్రయోగరూపముగ నుండును. రూపకములలో డిమము సమవకారము వ్యాయోగ మీహామృగమనునవి యావిద్ధసంజ్ఞకల ప్రయోగముతో నుండునని ప్రయోక్తలు గుర్తించుట యుక్తము. దేవదానవరాక్షసు లతో దీనిప్రయోగము నిరూపించునది. శౌర్యవీర్యబలాన్వితులయిన యుద్ధతపురుషులచేగాని దీని ప్రయోగము నిర్వహించునది. శౌర్య మభీరుత్వము, వీర్య ముత్సాహము, బలము కాయధర్మమయిన పరా క్రమము, ఇవి కలవా రావిద్ధప్రయోగము మొనర్పగలరు. రూపకము లలో నాటకము ప్రకరణము భాణము వీధి యంకము అనునవి సుకు మారప్రయోగములు, మానవులందివి ప్రయోగార్హములు. ఇట్లనుట బాహుల్యాపేక్షమయిన సూక్తి. అమానవప్రయోగమున గూడ నివి సంగతములు. డిమాదిచతుష్టయ మావిద్ధప్రయోగమని నాటకాది పంచకము సుకుమారప్రయోగమని గుర్తించుట యుక్తము.

౭౩౧. అథ బాహ్యప్రయోగే తు ప్రేక్షాగృహ వివర్జితే
విదిక్ష్వపి భవేద్రంగం కదాచిద్భర్తు రాజ్ఞయా
౭౩౨. పృష్ఠే కృత్వా కుతపం నాట్యం యుక్తే యతోముఖం భరతః
సా పూర్వా మంతవ్యా ప్రయోగ కాలేన నాట్యజ్ఞః

సకల ప్రయోగ నిర్వాహకుడగు ప్రభువు ప్రయోజనముద్దేశించి బాహ్యప్రయోగ మాదేశింపవచ్చును. బాహ్య ప్రయోగమునందు ప్రేక్షాగృహముండదు. అట్టి బాహ్య ప్రయోగమునందు రంగము విదిక్కులందును కూర్పదగును. నాట్యప్రయోగమునకు సంబంధించిన కుతపమును పృష్ఠమున కూర్చి భరతు డే ముఖముగ నుండునో యది పూర్వదిశయని గుర్తింపవలెను. ప్రయోగకాల నియమానుసారమున నాట్యజ్ఞులగు వా రట్లు గుర్తించుట యుక్తము. దిగ్భాండ వినిశ్చితము లయిన రంగద్వారము లారుండును. నాట్యప్రయోగమున ప్రవేశ

మొనర్చు నప్పుడు ప్రాచీప్రతీచీ దిక్కులందు ప్రవేశ మాపాదింప వచ్చును. రంగమునం దభియుక్తమయిన విధాన మతిక్రమింప వలసి వచ్చునేని విదిశా ప్రయోగమున ప్రమాణాతిక్రమమున నుండవలసి వచ్చునేని మృదంగ భాండవాద్య యుక్తమయిన ద్వారమును ప్రాచీ దిశాభాగమును మనసా నిశ్చిత మొనరించుకొనుట యుక్తభావనము.

833. వయోఽనురూపః ప్రథమం తు వేషో
వేషానురూపశ్చ గతి ప్రచారః
గతిప్రచారానుగతం చ పాఠ్యం
పాఠ్యానురూపోఽభినయశ్చ కార్యః

నాట్యప్రయోగమునం దీ విధా విశేషములను భద్రముగా గుర్తింపవలెను. మొదట వయోనురూపముగా వేషముండుట యావశ్యకము. వేషానురూపముగా గతిప్రచార ముండవలెను. గతిప్రచారానుగతముగా పాఠ్యముండుట యావశ్యకము. పాఠ్యానురూపముగా నభినయముండుటయు నావశ్యకము. వయః ప్రకృత్యనుసారమున నాహార్యముండుటయు తదనురూపముగా నాంగికముండుటయు తదనుగతముగా వాచికమగు పాఠ్య ముండుటయు తదనురూపముగా సాత్త్వికాభినయముండుటయు నాట్యశిష్ట వచనము.

ధర్మి నిరూపణము.

కక్ష్యా యాధార మంతరంగోపకారులు. అట్టి యుపకారిత్వ మున నె కక్ష్యాధార నిరూపణ మొనర్చుట యయినది. ఆ ప్రసంగ మున నె కక్ష్యోక్తమయిన వృత్తిభేదము నుపపాదిత మయినది. ఈ పట్టున ధర్మనిరూపణ మావశ్యకము. లోకధర్మి నాట్యధర్మి యను ధర్మిద్వయము లోకస్వభావము ననువర్తించి యుండునది యగుట భావనీయము. జనపదవాసి యగు జనము లోకము. అట్టి లోకము ప్రవృత్తిక్రమమున ప్రపంచిత మయినది. తత్ప్రసంగమున నె ధర్మి సంభావన మావశ్యక మయినది. అట్టి ధర్మివిధాన మాంగిక శేషముగా నిరూపింపదగి యున్నది. ఆంగిక శేషరూపముగా నది నిరూపణీయము కాగా తత్ప్రసంగమున వాచికాహార్యాది విషయములును ప్రతిపాద నీయములు. అవియు తుల్యలక్షణ సంబంధము కలవగుటచే నవసర

నిరూపణీయములు. అట్టి ధర్మి రెండు విధముల నున్నది. లోకధర్మి నాట్యధర్మి యని. యద్యపి; లౌకికధర్మవ్యతిరేకముగా నాట్యమునందు వేరొక ధర్మము లేదు. లోకధర్మమె నాట్యము నందున్నది. అయినను నాట్యధర్మి యని వేరుగా నిరూపించుటమె సముచితము. ఈ నాట్య ధర్మి కవినటవ్యాపారము నందు వైచిత్ర్య మాధానించునదిగా నున్నది. నాట్యధర్మి లోకాగత ప్రక్రియాక్రమము కలదయినను రంజనాధిక్య ప్రాధాన్యమున నుండును. అట్టి ప్రాధాన్యమును నాట్యధర్మి కాపాదించుటయుయుక్తము. అందిట్టిరంజనాతిశయము ప్రధానముగనుండుటలో కవినటవ్యాపారమున వైచిత్ర్యమున్నదని యంగీకరింప వలెను. ఇట్టి వైచిత్ర్యసద్భావముననె ధర్మిప్రాణము స్పష్టమగును.

ధర్మి రెండు విధముల నుండునని యిదివరలో నుద్దిష్ట మయినది. రసభావాది సంగ్రహవిభాగానసరమున ధర్మీద్వయము సంకేతిత మయినది. లౌకిక ధర్మి నాట్యధర్మి యని యా ధర్మీవిశేషములు, వాని లక్షణవచన మావశ్యకము. లౌకికధర్మమె ధర్మీద్వయమునకు మూల భూతము. నాట్యధర్మమునందలి వైచిత్ర్యోల్లేఖ్యాలేఖ్యమునకు లోక ధర్మము భిత్తిస్థానము. కావున నట్టి లోకధర్మీ నిరూపణము సమయ సముచితముగా నున్నది.

## లోకధర్మి

८३४. స్వభావభావోపగతం శుద్ధం తు వికృతం తథా
లోకవార్తా క్రియోపేత మంగలీలా వివర్జితం

८३५. స్వభావాభినయోపేతం నానాస్త్రీ పురుషాశ్రయం
యదీదృశం భవేన్నాట్యం లోకధర్మీ తు సా స్మృతా

ఒకధర్మి లోకవిషయముగా నుండును. మరియొకటి నటవిషయ ముగా నుండును. లోకధర్మి స్వభావభావోపగతము. మానవులకు స్వభావతః సహజసిద్ధమయిన స్థాయివ్యభిచార్యాదిభావము స్వభావ భావము. లోకధర్మీనాట్యము సహజములయినస్థాయివ్యభిచార్యాది భావములతో నుండును. ఇది శుద్ధము వికృతము నని రెండు విధములు. అధికృతమై యుండు నేని శుద్ధమగును. స్వవికల్పితములతో వ్యామిశ్రిత మగునేని వికృతమగును. శుద్ధమె వికల్పమిశ్రమై వికృతమగును. ఈ

నాట్యము లోకవార్తాక్రియోపేతము. లోకవార్త లోకప్రసిద్ధి. లోకప్రసిద్ధ్యనుగతము లయిన క్రియావ్యవహారములకు వృత్తాంతమని సంజ్ఞ. అట్టి వృత్తాంతయుక్తముగా నటనీయకార్యముండుట లోకధర్మి యగును. లోకధర్మికిని ఆ ధర్మికల నాట్యమునకు నభేదోపచారమున సామానాధికరణ్యము సంగతమగును. కావున లోకధర్మినాట్యమను వ్యవహారము యుక్తము. ఈ లోకధర్మినాట్యములో సంగలీలావిశేషము లుండవు. వలనవర్తనాదికము లుండవు. ఇది సర్వము స్వభావాభినయముతో నుండును. స్వభావసహజములయిన బలపతనప్రహారనాదావసరవివాదాదులలోవలె పతాకాదిహస్తవిన్యాసపురస్సరమయిన యభినయమె యుండును. ఈ నాట్యము నానాస్త్రీపురుషోపేతము. స్త్రీలు పురుషు లనేకవిధముల నుందురు. స్త్రీవ్యక్తి ప్రయోగమున ప్రయోజ్య యగునేని స్త్రీ వ్యక్తియె ప్రయోక్త్రి కావలెను. పురుషుడు ప్రయోజ్యుడగునేని పురుషుడె ప్రయోక్త కావలెను. ఇందు సహజ చేష్టితములె యుండునుగాని యభ్యస్తచేష్టితములుండవు. నాట్య మీవిధముగ నుండునేని లోకధర్మి యగును. లోకధర్మవ్యపదేశమున నిది లోకధర్మి యయినది. సముదాయాత్మకమయిన కావ్యమునం దీ యంశమేకదేశభూతముగా నున్నందున నిది లోకధర్మియగును.

ఇచటి భావ మిట్లుండును. కవి యథావృత్త వస్తుమాత్రమునె వర్ణింపగా నటుడును ప్రయోగించునప్పు డందు స్వబుద్ధికృతమగు రంజనా వైచిత్ర్య మేమియు నుండదు. అంద ట్లనుప్రవేశము పొందునట్టి కావ్యభాగము కాని ప్రయోగ భాగము కాని లోకధర్మాశ్రయముగనె యుండును. అది లోకధర్మి యగును. అర్థాభినయనమునందు కొన్ని కొన్ని సహకారి రూపమునగాని యితికర్తవ్యతా రూపమునగాని ప్రవేశము పొందవచ్చును. కావ్యనాట్యములందు లోకానుసారిత్వము కాని వైచిత్ర్యయోగిత్వము కాని ధర్మముగ నుండును. ఇది యిచటి యభిసంధి. ఇట్లు దీని విస్తరించి భావ ముద్భావ మొనర్చుట యేల? "ఆసాంతావత్"

నాట్యధర్మి.

౩౩౬. అతివాక్యక్రియోపేత మతిసత్త్వాతిభావకం
లీలాంగహారాభినయం నాట్యలక్షణ లక్షితం

౩౩౭. స్వరాలంకార సంయుక్త మస్వస్థపురుషాశ్రయం
యదీదృశం భవేన్నాట్యం నాట్యధర్మీ తు సా స్మృతా

౩౩౮. లోకే యదభియోజ్యం చ పదమత్రోపయుజ్యతే
మూర్తిమత్సాభిలాషం చ నాట్యధర్మీ తు సా స్మృతా

౩౩౯. అనన్యోక్తం చ యద్వాక్యం న శృణ్వంతి పరస్పరం
అనుక్తం శ్రూయతే యచ్చ నాట్యధర్మీ తు సా స్మృతా

౩౪౦. శైలయానవిమానాని చర్మవర్మాయుధధ్వజాః
మూర్తిమంతః ప్రయుజ్యంతే నాట్యధర్మీ తు సా స్మృతా

౩౪౧. యా గమ్యా ప్రమదా భూత్వా గమ్యా భూమిషు యుజ్యతే
గమ్యా భూమిష్వగమ్యా వా నాట్యధర్మీ తు సా స్మృతా

౩౪౨. లలితైరంగవిన్యాసైః తథోత్క్షిప్తపదక్రమైః
నృత్యతే గమ్యతే చాపి నాట్యధర్మీ తు సా స్మృతా

౩౪౩. యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖక్రియాత్మకః
సోఽంగాభినయసంయుక్తో నాట్యధర్మీ ప్రకీర్తితా

౩౪౪. యశ్చేతిహాసవేదార్థో బ్రహ్మణా సముదాహృతః
దివ్యమానుషరత్యర్థం నాట్యధర్మీ తు సా స్మృతా

౩౪౫. యశ్చ కక్ష్యావిభాగోఽయం నానావిధిసమాశ్రితః
రంగపీఠగతః ప్రోక్తో నాట్యధర్మీ తు సా భవేత్

౩౪౬. నాట్యధర్మీ ప్రవృత్తం హి సదా నాట్యం ప్రయోజయేత్
న హ్యంగాభినయాత్కించిదృతే రాగః ప్రవర్తతే

౩౪౭. సర్వస్య సహజో భావః సర్వో హ్యభినయోఽర్థతః
అంగాలంకారచేష్టా తు నాట్యధర్మీ ప్రకీర్తితా

నాట్యధర్మి లక్షణ మీ కారికాద్వాదశిలో నున్నది. లక్షణ స్వరూపమును చెప్పి చెప్పి "నాట్యధర్మీ తు సాస్మృతా- సాభవేత్- ప్రకీర్తితా" యనుచు నాట్యధర్మిపదము పదిపర్యాయములు పలుకుట నాట్యధర్మిస్వరూపగౌరవము వ్యక్తమగును. ఈ నాట్యధర్మిస్వరూపము నందు ప్రధానముగా పదునారు విషయములు కలవు. వాని వివేచన మీ విధముగ గుర్తింపవచ్చును.

౧. అతివాక్య క్రియోపేతమయిన నాట్యరీతి యుండుట నాట్యధర్మి లక్షణము. ఇతిహాసాది ప్రసిద్ధమయిన వాక్య మతిక్రమించి యంతకన్న వేరుగా సముచితము రంజకము నయిన యితివృత్త కల్పన

మొనరించుట కలదు. అట్టి కల్పనాత్మిక యయిన క్రియ యతివాక్య క్రియ. రాజశేఖరు డీ విధముగ నతివాక్యక్రియాసాహిత్యము నిరూపించి నాడు. రాక్షసుడు దశరథవేషమున రామనిర్వాసన మొనరించుట తత్త్వకల్పనముగా నందున్నది. ఇది నాట్యధర్మి. వస్తురసనాయకోచిత ముగ ప్రసిద్ధ వాక్యాతిక్రమ మొనరింపవచ్చును. సిద్ధరస ప్రఖ్యము లయిన రామాయణాదులందు కథాశ్రయ మయిన స్వేచ్ఛ నాయో జనము చేయరాదు. స్వేచ్ఛ కూర్చుట యావశ్యకమయినచో నతి వాక్య క్రియ యావశ్యక మగు నేని యది రసవిరోధిని కారాదు. రంజ కముగ నది యుండవలెను. ఇట్లె యితరములందు నభ్యూహ్యము.

౨. అతిసత్త్వాతిభావకముగా నుండుటయు నాట్య ధర్మి స్వభావము. స్వభావ సహజమయిన చిత్తవృత్తి నతిక్రమించి యా భావసత్త్వమున కతిరిక్తముగా నుండు కవికల్పిత చిత్తవృత్త్యంతరమును కూర్చుట నాట్యధర్మి యగును. విదూషకుడు స్వభావచపలుడు. ఆతని చిత్తవృత్తి యస్థిరము. అట్టి వాని చిత్తవృత్త్యతిక్రమమున నన్యచిత్త ప్రవృత్తి నిబంధనము నాట్యధర్మి యగును. రత్నావలిలో విదూషకు డయిన వసంతకుడు మంత్రిసముచిత గాంభీర్య మవహిత్థము కలవాడుగ గోచరించును. వత్సరాజు వాని నట్లు తత్సమయమున సంభావించును. ఇట్లె స్వభావ భాషిత మతిక్రమించి యన్యభాషిత మనుసరించుటయు నాట్యధర్మి. తాపసవత్సరాజమునందు మహాదేవి స్వభావసముచిత మయిన ప్రాకృతముకన్న వేరుగా సంస్కృత మనుసరించును. దృశ్య కావ్య మిట్లుండుట కావ్యగత నాట్య ధర్మి. నటగతమయిన నాట్యధర్మి నాట్యలక్షణ లక్షితముగ నుండును.

3. లీలాంగహారాభినయముతో నాట్యముండుట నాట్యధర్మి విశేషము. శోభాప్రధానములయిన లీలావిశేషములు మనోహరము లయిన యంగహారములు తదుపలక్షితము లయిన కరణాదులు నిందుండును. లీలాంగహార ప్రధానము లయిన యభినయము లిందుండును.

౪. నాట్యలక్షణలక్షితముగా నుండుటయు నాట్యధర్మి స్వభా వము. ఇది నటగతమయిన ధర్మి. నృత్తనృత్యముల ప్రక్రియా విశేష ములు నటవిద్యలు. వాని సంబంధ మావశ్యకమనుట వీని భావము.

౫. స్వరాలంకార సంయుక్తమగుట మరి యొక సంపద. సంఖ్యానమున నివి స్వస్వరూపముతో నుండునవి యయినను విశిష్టముగ నివి యన్నియు నఖండ నాట్యధర్మి స్వభావము నావిష్కరించునవియె యగును. స్వరాలంకార ములతో నుండు నాట్యము శోభావహము.

౬. అస్వస్థ పురుషాశ్రయ మగుటయు దీని లక్షణము. ఇందు పురుషుడు స్వరూపమున నుండడు. స్త్రీబలము నాశ్రయించి యుండును. ప్రయోజ్యపురుషుడు స్వరూపస్థుడు కాడు. ఆతడు స్త్రీప్రయోజ్యుడగును. అట్లగుట నాట్యధర్మి. నాట్య మీ విధమున నుండు నేసి నాట్యధర్మి యగునని పెద్దలు పరంపరగా పలుకుచున్నారు. అంతియే కాని యిది కేవలము స్వసంకేత సంభావనా మాత్రము కాదు. ఇది స్వసమయమాత్ర నిష్ఠము కాదు. ఇది సముచితముగా సంభావ్యమాన సద్భావమె కావున ప్రమితమె యగును. ఇది సహృదయ సంభావ్యమానమగుచు రంజనోపయోగి యగును. వస్తూపయోగియు నగును. కేవల మింతమాత్రమె కాదు. ఆసన్నుడయిన వాని వచనము వినకుండుటయు నితరు లేమాత్రము వినని వచనము వినుటయు లోకమున నెప్పుడు నుండదు. అట్టిది యీ కావ్యనాట్య తంత్రమునం దె యుండును. తత్సౌందర్య సంపాదనమునకై యిది యిం దున్నీతమగును. అస్మదుపాధ్యాయులీ విధముగ నీ విషయ మాసూత్రించిరి.

"యదత్రాస్తి న తత్రాస్య కవేర్వర్ణనమర్హతి
యన్న సంభవి తత్ర స్యాత్సంభవ్యత్ర తు ధర్మతః"

ఈ లోకమున నేది కలదో యది కవి వర్ణనమున కర్హము కాదు. ఏది లోకమున సంభవించునది కాదో యది కావ్యమున ధర్మానుసారమున సంభవించునది యగును. లోకగతము వేరు. కవి లోకగతము వేరు. లోకమున సంభవింపనిది కావ్యమున సంభవించును. కావ్యసంభవము లోకాసంభవము కావచ్చును. లోకము వేరు. కావ్యము వేరు. సౌమనస్యమిందు నియమ హేతువు. ఇట్టి యీ నాట్యధర్మి వ్యాపకముగ నున్నది. ఇట్టి యీ నాట్యధర్మవ్యాపకత్వ

మును బహుళోదాహరణనిదర్శనదిశననుసరించి దర్శించుట యుక్తము, ఇది నాట్యధర్మిస్వరూపము ప్రఖ్యాపన మొనర్చును.

౭. లోకమునం దభియోజ్యమగు పదమిందు మూర్తిసహితమై సాభిలాషమై ప్రయుక్తమగును. క్రియాపదములందు సంబంధయోగ్యమగు పదము మూర్తమై ప్రయుక్తమగుట సాభిలాషముగా ప్రయోగము పొందుట యిందలి రూపము, లోకమున గూడ కలాశిల్పకల్పనాకలితమై యుండునది మూర్తిసంపాదనమున నిందు ప్రయుక్తమగును. మాయాపుష్పకరూపమున నిట్లున్నది, "తతః ప్రవిశతి బ్రహ్మశాపః" అంతట బ్రహ్మశాపము ప్రవేశించుచున్నది. ఇందభియోజ్యమయిన ప్రవేశాత్మకక్రియాస్వరూపమున నన్వయము పొందునదిగా బ్రహ్మశాపమున్నది, బ్రహ్మశాప మమూర్తము, అది మూర్తమై ప్రవేశించుట నాట్యధర్మి.

౮. సమీపమునందున్న వారు పలికిన పలుకు వినకుండుటయు ననుక్తము వినుటయు నాట్యధర్మిలో నుండును. పరస్పర మాసన్నోక్తము వినకుండుట, అనుక్తములగు జనాంతికాపవారితకముల వినుటయు నిందు గలదు. అనుక్తమయిన యాకాశభాషితము వినుటయు నిందుండును.

౯. శైలయానవిమానములు చర్మవర్మాయుధధ్వజములు మూర్తిమంతములై ప్రయుక్తములగునేని నాట్యధర్మి యగును. అట్టివి దేహముకలవై ప్రయుక్తము లగును. దారువస్త్రచిత్రాదిరూపముగా నుండు చర్మవర్మాదులకు రంగమున ప్రవేశముండుట నాట్యధర్మి యయినది.

౧౦. అగమ్యయగు వనిత గమ్యవనితగా భూమికాస్వీకారమున నిరూపిత యయినచో, గమ్యవనిత యగమ్యవనితగ నిరూపిత యయినచో నాట్యధర్మి యగును.

౧౧. లలితములగు నంగవిన్యాసములతో సముత్క్షిప్త పదక్రమములతో నృత్యగమనము నిరూపితమయినచో నాట్యధర్మి యగును. ఆవేష్టితము మొదలయిన చతుర్విధకరణోపగృహీతములగు వర్తనాప్రవర్తితములయిన లలితాంగవిన్యాసములచే గలుగు శోభ నాట్యధర్మి

యందు కలదు. గతిప్రచారమునందు చతుస్తాలప్రమాణముగా నుండు నట్టి యుక్తి ప్తపదక్రమము లుండుట చతుష్కలత్వాదివిశేషములతో నుండు కాలవిభాగముల సంబంధము నిందుండును. ఇట్టి యంగవిన్యాసములతో పదక్రమములతో నృత్యమొనరించునట్లు గమనమొనరించునట్లును నృత్తసదృశమయిన విశాఖగతి యుండుట నాట్యధర్మి యగును.

౧౨. నాట్యమంతయు నాట్యధర్మి ప్రాణితమై యుండును. లోకమునకు సంబంధించిన సుఖ దుఃఖ క్రియాత్మకమగు స్వభావమంగాభినయ సంయుక్తమై నాట్యధర్మి యగును. లోకస్వభావమంతయు నంగము లయిన యాతోద్యాదులతో నభినయములతో కూడుకొనునది కావలయును. లోకస్వభావమె తదుపేతమై నాట్యధర్మి యగును.

౧౩. నాట్యధర్మి సర్వాభినయ ప్రకారసారముగ నున్నది. ప్రసంగోపయోగమున నాట్యధర్మి యిట్టి దగుటయు నిరూపణీయము. బ్రహ్మయుదాహరించిన యితిహాసవేదార్థ మంతయు దివ్యమానుషరత్యర్థముగా నుండుటచే నిది నాట్యధర్మియని ప్రఖ్యాత మయినది. నాట్యవేద నిరూపితార్థము సర్వమును నాట్యధర్మియె యయినది.

౧౪. నాట్యధర్మి సర్వత్రవ్యాపకముగా నున్నది. నానావిధి సమాశ్రితమయిన రంగపీఠ గతముగా నిరూపితమయిన కక్ష్యావిభాగమంతయు నాట్యధర్మియె యగును. నాట్యమును నాట్యధర్మి ప్రవృత్తమగునట్లుగనె ప్రయోగింపవలెను. నాట్యధర్మి ప్రవృత్తమయిన గతియె యంతటనున్నది. అంగాభినయము లేకున్నచో నట్టి రాగమును నాట్యమున గలుగదు. అంతట గీతాతోద్యాది నాట్యాంగము లావశ్యకములు. సముచితము లయిన యభినయములు నావశ్యకములు. ఇవియె యంతట నాట్యరాగముత్పాదింపగలవు. నాట్యరాగమనునది సామాజికప్రీతి అంగాభినయసంపద యంతయు సామాజికప్రీతి నిదానము. నాట్యధర్మివలననె యిది సిద్ధమగును.

౧౫. నాట్యధర్మియే యంతట వ్యాపకమయినచో లోకస్వభావ భావిని యయిన లోకధర్మి ప్రయోజన మేమి యున్న దనిపించును. కాని యీ యంశ మిచట భావనీయము. భావము సర్వప్రాణికిని

సహజము. అభినయమంతయు నర్ధవశమున నుండును. అంగాలంకార చేష్ట సర్వము నాట్యధర్మియే యగును. కవిగత వాగలంకారనిష్ఠకాని నాట్యగత వాగలంకారనిష్ఠకాని సర్వము నాట్యధర్మిరూపమై సర్వ విశేషములకు ప్రాణరూపముగ నున్నది. అభినయవిశేషమంతయు నర్థాపేక్షముగనె యుండును. సర్వాభినయసంపద యర్థాపేక్షముగనె ప్రవర్తించుననుట సర్వసంగతము. కావున లోకధర్మలక్షణమయిన సహజభావము సర్వప్రాణిసంబంధియై యుండునుగావున నది భిత్తిస్థానీయము. అదియె సర్వమున కాధారము. సహజసంవాదికర్మయయిన నాట్యధర్మి కదియె యాధారభిత్తి. కావున లోకస్వభావ భావిని యయిన లోకధర్మి ప్రయోజనమును గలదు. ఇందున్న అంగాలంకారచేష్టలను నవి వర్తనారూపములయిన యంగకర్మలు గుణాలంకారలక్షణములు చేష్టాలంకారములునని గుర్తించునది.

౧౬. ఒక డొక భూమిక ధరించి తదంతరమున నన్యభూమికా ధర్మమును కౌశలమున గాని యేకస్వభావమున గాని నిర్వహించునేని యది నాట్యధర్మి యగును. నాట్యధర్మిస్వరూపవిశేషము లీవిధముగ నున్నవి. నాట్యతత్త్వజ్ఞులగువారు కక్ష్యావిభాగమును నాట్యధర్మిని యుక్తివిధానములను స్పష్టముగా దెలియవలయును. చక్కగా దెలిసికొని తత్త్వానుగతముగా ప్రయోగింపవలెను. ఇచట ధర్మి నాట్యధర్మి. అదియె ప్రధానము కావున లోకధర్మి యందే మగ్నస్వభావముకావున దానినె తెలిసి నిరూపింపవలెను. యుక్తివిశేషములనునవి ప్రవృత్తులు ధర్మాద్యాదులన్నియు నుపకరణభూతములు. వాని యల్పబాహుల్యావిర చితిక్రమానుసంధానమున యోజన మొనర్చుట యుక్తము. ఈ యర్థము నీ ప్రఘట్టారంభార్థములో సంగతమొనరించుకొని భావించునది.

౪౪౦. ఉక్తో మయేహాభినయో యథావత్
శాఖాకృతో యస్తు కృతోఽంగహారైః
పునశ్చ వాక్యాభినయం యథావత్
వక్ష్యే స్వరవ్యంజన వర్ణయుక్తం

భావి ప్రకరణార్థ మిందు దాసూత్రిత మయినది. ఇంతింత నిరూపించిన నాట్యవిద్భరతుడు శిష్యవ్యుత్పాదనమునకై యుల్లూప్యసంహార

వచనము నిర్దేశించుచున్నాడు. యథాశాస్త్రముగా నభినయము నిర్దే శించితిని. శాఖాకృత మంగహారకృత మంతయు నిరూపించితిని. ఇక స్వరవ్యంజన వర్ణయుక్తమయిన వాక్యాభినయము నిరూపింతును. భరతు డిట్లనుట యాతని యాత్మజ్ఞానోత్కర్షణము వ్యుత్పత్తి గోచ రించును. శిష్యులకు నవి యావశ్యకములని నిర్దేశించినట్లయినది. ఇందు కరవర్తనాత్మకమయిన శాఖానృత్తము అంగహారమును నిదాన పక్ష ముగా నిర్దిష్ట మయినది. ఇంక నివి సంభావనలో నుండదగియున్నవి. భావనిరూపణ ప్రఘట్టమున సాత్త్విక ప్రసంగమురాగా నంకురాభినయ మభిహిత మయినది. అదియు నిచట ననుసంధింపదగి యున్నది. ఇంకను వక్తవ్యాంశము సామాన్యాభినయ ప్రసంగమున నిరూపిత మయినది. అదియు నిచట సంభావనీయము. ఆ యా సందర్భ సముచితముగా నిరూపితములయిన యాంగికాభినయము లన్నియు నిం దుపసంహృత సంభావితములు కావలెను. ఈ విధముగా సర్వాభినయ సంహారమిచట సమాకృష్టమగును. ఇక వాక్యాభినయ నిరూపణము ప్రసంగ సంప్రాప్తము. "వాక్యమేవాభినయః తత్త్వతః ధర్మి" వాక్యమె యభి నయము. తత్త్వతః అదియే నాట్యధర్మి. తత్తత్ప్రసంగసంగతి ననుస రించి వాక్యాభినయమును పరిమితముగా నిరూపితమయినను అక్షరస ముదాయస్వరూపముగా వాక్యాభినయము నిరూపించుట యావశ్యకమె యగును. ఇదివరలో నిరూపితమయిన వాక్యాభినయమున యథావ ద్రూపమున నభినయించుట యుక్తము. ఇట్లు కథ్యాంకచిత్రతల లక్షణ మభినవభారతీసారముగా నిరూపిత మయినది. కథ్యావృత్తి ధర్మ్యాభి ధాన మిట్లు సంభావనీయము.

## వాచికాభినయము

ఆంగికాభినయము నిరూపించిన పిమ్మట వాచికాభినయము నిరూపించుట యుక్తము. వాచికాభినయమునకు సంబంధించిన భేద ములు నాట్యానుప్రాణకములు. వాచిక మాంగికమునకు విషయసమర్పక మగుటచే ప్రాణకల్పము, కావున వాచికము ప్రస్తుతము లక్షణీయమైన ది. వాగభినయమనుట "వాగేవాభినయః" వాక్కే యభినయమని యర్థము. వాగభినయమె వాచికాభినయము. వాగభినయవిషయము

రసప్రసక్తిలో సూచిత మయినది. అట్లు సూచితమయినవాగభినయము మెయిందు నిరూపిత మగును. తత్త్వానుసారమున నిది యిందు నిరూపిత మగునుగావున వాగభినయాభిధాన మిందు ప్రధానమయినది. వాగభినయలక్షణము స్వరవ్యంజనసంభవముగా నిచట ప్రతిపాదితమగును.

౪౮౯. వాచి యత్నస్తు కర్తవ్యో నాట్యస్యైషా తనుః స్మృతా
అఙ్గనైపథ్యసత్త్వాని వాక్యార్థం వ్యంజయంతి హి

వాచికాభినయమున కభిధానప్రాధాన్య మున్నందున దాని నిరూపించుటలో హేతువును కలదు. అది యీ కారికలో నున్నది. వాక్కునందు యత్న మొనరింపవలెను. అది నాట్యమునకు తను వని యనిరి. అంగనైపథ్యసత్త్వములు వాక్యార్థమును వ్యంజన మొనరింపగలవు. అంగాదులచే వాక్యార్థము వ్యంజిత మగును. కవి కావ్యనిర్మాణకాలమున వాక్కునందు యత్న మొనరింపవలెను. నటుడు ప్రయోగకాలమున వాచికమునందు యత్న మొనరింపవలెను. ఇట్లు కవినటులకు వాచికయత్నస్వీకార మత్యంత మావశ్యకము. కవినటులనుటచే సచేతసులును స్వీకార్యులు. ఈ వాక్కు నాట్యమునకు శరీరము. సకలప్రయోగమున కిది భిత్తిభూతము. సకలాతోద్యగీతాభినయముల కిది యనుగ్రాహకము. స్వయ మభినయరూపము. ప్రయోగమూలమగుట వాద్యాద్యనుగ్రాహకమగుట స్వయమభినయరూపమగుటచే నిది నాట్యతను వయినది. ఈ యంశము నిదివరలో నుపాంగాభినయారంభమున మేము నిరూపించితిమి.

(అంగాభినయారంభాభినవభారతి యుపలబ్ధము కానందున నా భావ మజ్ఞాతము)

## రసము : శబ్దవాచ్యత

చిత్తవృత్తి విషయమున శబ్ద మంతరంగము కాదని యది బహిరంగమె యని కొంద రనిరి. అది యుక్తము కాదు. శబ్దము చిత్తవృత్తి కంతరంగమె యగును. చిత్తవృత్తి ప్రతిపాదకము నగును. చిత్తవృత్తి రూపము లయిన రసాదులు శబ్దవాచ్యములు కాజాలవని యొక నిరుక్తి యున్నది. వ్యతిరేకాభావ మందు హేతువని వారందురు. విభావాదు లున్నచో రసముండును. విభావాదులు లేకున్నచో రసముండదు. ఇట్లు స్వశబ్దమున్నచో రసమున్నది. స్వశబ్దము లేకున్నచో రసము లేదు. ఉన్నచో నుండుట యన్వయమని లేకున్నచో లేకుండుట

వ్యతిరేకమని న్యాయసరణి. స్వశబ్దము లేకపోయినచో రస ముండ దనుట ప్రకృతము సంగతము కాదు. శృంగారాది స్వశబ్దము లేక పోయినను రస ప్రతీతి యున్నది. వ్యతిరేకవ్యాప్తి లేనందున రసాదులు శబ్దవాచ్యములు కావు. అని వారి భావము. కాని యీ వ్యతిరేకా భావ మనునది యంతట సిద్ధము కాదు. శబ్దము లన్నియు వ్యతిరేకా భావమును సాధింపవు. ఇచట వ్యతిరేకా భావమను హేతు వసిద్ధము. అభినయచతుష్టయసామాన్య మంతయు ప్రతీతిస్ఫుటత యుండగా నంతట వ్యాపించునని రసభావ ప్రఘట్ట ప్రకరణమున నిరూపించితిమి. ఆహార్యాంగిక వాచికసాత్త్వికము లన్నియు స్ఫుటప్రతీతిలో బహి రంతర్వ్యాప్తములై సర్వత్ర గోచరించుట నిరూపితచరమె. అభినయ చతుష్టయమునందు వాచికాభినయమును చేరియున్నది. ఆ యా శబ్దానుసంధానమున గూడ ప్రతీతి స్ఫుటత యుండుట ప్రసిద్ధము. కావున చిత్తవృత్తి విషయమున శబ్దములకు బహిరంగత్వము చెప్పుట యసంగతము.

ఈ విషయవిస్తరణమునకై మరియొక యాశంకాసమాధాన మును భావనమునకుగా నిరూపించుట యావశ్యకము. కొందరిట్లందురు. వాచకము లయిన శృంగారాదిశబ్దములు లేకపోయినను శృంగారాది రసప్రతిపత్తి యుండును గావున వ్యతిరేకాభావము సంగతమగును. దీని నిట్లుదాహరణమున భావించునది.

పరిణత శరకాండా పాండురా గండపాలీ
హిమసమయ నిమీలత్పుండరీకాయమానం
నయనమధరబింబం శ్వాసవిశ్రాంతితాంతం
తవ సుతను తనోతి ప్రాణితం మన్మథస్య

ఓ సుతనూ! నీ గండపాలి పరిణతశరకాండపాండుర మయినది. నీ నేత్రము హిమసమయమున ముకుళించు పుండరీక మయినది. నీ యధరము శ్వాసవిశ్రాంతితాంత మయినది. ఈ నీ రీతి మన్మథునకు ప్రాణిత మిచ్చుచున్నది. ఈ శ్లోకమున శృంగారప్రతీతి యున్నది. స్వశబ్దము లేదు. స్వశబ్దాభావమున గూడ రసప్రతీతి యున్నది కదా! అని.

ఇదియు యుక్తము కాదు. ఇట్లయినచో వృశ్చికాదులకు వలె రసప్రతీతిలో నిమిత్తాన్తరమును గలదని యనవలసి యుండును. ఇట్లనగా నిమిత్తాన్తరమును సువచమె యగును. సామాన్యముగా నుండు వృశ్చికము వేరని గోమయజన్యమయిన వృశ్చికము వేరని వృశ్చికము నుండి జన్మించిన వృశ్చికము వేరని యనరు. ఏ వృశ్చికమయిన నొకవిధమె. వాని వలన గలుగు బాధయు నేకవిధము. వృశ్చిక గోమయజన్యవృశ్చిక వృశ్చికప్రభవవృశ్చికములకు భేద మున్నదనుట సమ్మత మయినచో నిచట గూడ నట్టిభేదము సమ్మతము. శృంగారశబ్దమువలన గలుగు రసప్రతీతికన్న నితరమువలన గలుగు రసప్రతీతి వేరుగా నుండునని యనవలెను. ఇతరమువలన గలుగు ప్రతీతి స్వశబ్దమువలన గలుగు ప్రతీతి యొకటికాదు. ఆ ప్రతీతి యెట్టిదో యీ ప్రతీతి యట్టిది కాదు. కాని శృంగారశబ్దము వలన తత్ప్రతీతి కలుగకపోదు. ప్రతీతియే కలుగ దనినచో "శృంగార హాస్య కరుణ" యను కారికాశ్లోకము కాకవాశిత దేశీయమె యగును. కాకవాశితస్థాన మనాదరపాత్రము. ఇదియు తత్సదృశమగును. స్వాపమయోద్దేశమున ప్రవర్తించు శబ్దము స్వనియతసంకేతానుసారమున ప్రతిపాద్యమును ప్రతిపాదించును. సాధ్యము సాధించును. రూపింపవలసిన దాని నిరూపించును. దాని నెవరు ప్రతిహత మొనరింతురు? అది యట్టిది కాజాలదను బిభీషిక యేమి? ఇంకనిది భావింపుము. "శృంగారాయతే హాసతి కరుణాయతే" మొదలగు శబ్దములు కలవు. ఆ శబ్దములు స్వశబ్దనీయమున శబ్దనధర్మము కలవిగనె లోకమున ప్రసిద్ధముగ నున్నది. అచట స్వప్రతిపాద్య ప్రతిపాదనమున నా శబ్దముల సామర్థ్యమును శంకింపనవసరము లేదు. ఇట్టీ యంశము నవశ్యముగ నంగీకరింపవలెను. అంగీకరింపక పోయినచో కొన్నిట కొన్నిపదముల యను వాద మఫలమె యగును. ఆ యా శబ్దముల కా యా రూపస్పర్శ లేకపోయినచో తదనుభావసమాకర్షణ మయుక్తమె యగును. కృష్ణుడు మాగధులను జయించి మధురానగరమునుండి కృష్ణుడు ద్వారవతీనగరమునకు పోయిన పిమ్మట తత్ప్రత్యాగమన ప్రత్యాశాశూన్య యయిన రాధ యిట్లున్నది.

యాతే ద్వారవతీం తదా మధురిపౌ తద్దత్తకంపానతాం
కాలిందీతటరూఢ వంజులలతామాలింగ్య సోత్కంఠయా
తద్గీతం గురుబాష్పగద్గదగలత్తారస్వరం రాధయా
యేనాంతర్జలచారిభిర్జలచరై రప్యుత్క ముత్కూజితం

శ్రీకృష్ణుడు ద్వారవతీ నగరమునకు పోగా నుత్కంఠిత యయిన రాధ వణుకుచు, వంగిన యమునానదీ తటీసంజాతలత నాలింగనము చేసికొని బాష్పగద్గదముగా తారస్వరముతో నట్లుగా వాపోయినది. అది విని యంతర్జలచారి జలచరములు నుత్కములై యున్ననములై యుత్కూజన మొనరించినవి. శబ్దమునకు శబ్దన సామర్థ్యము లేదన్నచో నిందు "సోత్కంఠయా, ఉత్కం" అను పదముల యనువాదము విఫలమె యగును. తత్పదములకు తద్రూపస్పర్శ లేకున్న తదనుభావ సమాకర్షణము నయుక్తమె యగును. వృశ్చికభేద ప్రతీతివలె స్థాయి ప్రతీతి వేరుగను వ్యభిచారి ప్రతీతి వేరుగను భాసించునని భేద ప్రతీతి యుండునన్నచో కతిపయస్థలములం దనుభావ ప్రత్యయము కూడ లభింపదు. రస మెట్లు భాసించును?

యాన్త్యా తయా వలితకంధరమాననం త
దావృత్తవృన్తశతపత్రనిభం వహన్త్యా
దిగ్ధోఽమృతేన చ విషేణ చ పక్ష్మలాక్ష్యా
గాఢం నిఖాత ఇవ మే హృదయే కటాక్షః

తొడిమ త్రిప్పిన పద్మమువలె నున్న వలితకంధరముఖమును వహించి వెడలుచు నా మాలతి సుధాసిక్తము విషాక్తమయిన యొక కటాక్షమును గాఢముగా నా హృదయమున నాటవేసినది. ఇందు రసప్రత్యయ మెట్లు కలుగును? అనుభావ ప్రత్యయము కూడ దుర్లభీభూతమయినది. కా కథా రసస్య? ఇందలి వలితావృత్తదిగ్ధనిఖాతాదు లన్నియు కటాక్షమున జీవభూతములు వానికి క్రియావిషయమున ప్రతిపత్తి లేదు. "లీనేవ ప్రతిబింబితేవ లిఖితేవ" యను మాలతీ మాధవగతపద్యమునందు నిదియే వార్త. ఇందును స్థాయిప్రతీతికి విభావప్రతీతికి భేదప్రతిభానమె సమ్మతమయినచో తదితరప్రతీతి కలుగుట యెట్లు? రసప్రతీతి యుదయించుట యెట్లు? ఇదియె విధముగ

నితరములందును సమీక్షింపవలసి యున్నది. సహృదయహృదయ సాగరసముచ్ఛలద్రాకామృగాంక ప్రతిబింబప్రతిమము లయిన కావ్యములలో జీవితభూతము లయిన హాసాదులు శబ్దాస్పృష్టము లయినందువలన ప్రతీతిదుర్ఘటమె యగును.

ఏకస్మిన్ శయనే పరాఙ్ముఖతయా వీతోత్తరం తామ్యతోః
అన్యోన్యం హృదయస్థితేఽప్యనునయే సంరక్షతోర్గౌరవం
దంపత్యోశ్శనకైరపాంగవలనాన్మిశ్రీభవచ్చక్షుషోః
భగ్నో మానకలిః సహాసరభసవ్యావృత్తకంఠగ్రహం

ఉత్తిష్ఠంత్యా రతాంతే భరమురగపతౌ పాణినైకేన కృత్వా
ధృత్వా చాన్యేన వాసో విగలితకబరీభారమంసే వహంత్యాః
భూయస్తత్కాలకాంతిద్విగుణితసురతప్రీతినా శౌరిణా వః
శయ్యామాలింగ్య నీతం వపురలసలసద్బాహు లక్ష్మ్యాః పునాతు

అవిలపయోధరాగ్రం లవలీదలపాండురాననచ్ఛాయం
కతిచిదహాని వపురభూత్కేవలమలసేక్షణం తస్యాః

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోపి జంతుః
తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాంతరసౌహృదాని

నిద్రానిమీలితదృశో మదమంథరాయాః
నాప్యర్థవంతి న చ తాని నిరర్థకాని
అద్యాపి మే మృగదృశో మధురాణి తస్యా
స్తాన్యక్షరాణి హృదయే కిమపి ధ్వనంతి

వివృణ్వతీ శైలసుతాపి భావమంగైః స్ఫురద్బాలకదంబకల్పైః
సాచీకృతా చారుతరేణ తస్థౌ ముఖేన పర్యస్తవిలోచనేన

దంపతు లొకే ప్రక్కపై పరాఙ్ముఖులై మాటలులేక వ్యథపడుచు శయనించి యున్నారు. అన్యోన్య మనునయింప వలెనని హృదయమున నున్నను బింకముతో నున్నారు. ఇట్లుండియు మెల్లగా నపాంగములతో చూచుకొనునప్పుడు కన్నులు కలిసినవి. కోపము

బింకము పట్టుదల పోయినది. అభిముఖముగా తిరిగి మెడలు వాటు వేసికొని నవ్వుకొనినారు. దీనిలో "సహాసరభసవ్యావృత్తకంఠగ్రహా" మ్మను స్థలమున హాసము శబ్దాస్పృష్టమయినచో తగిన విభావాను గ్రహామును లేనందున ప్రతీతము కాకపోవలెను. హాసపదమున్నను హాస ప్రత్యయము కలుగదనినచో వీతరాగతవలె బకకాకక్రీడాకల్పనమె యగును. నవదంపతుల రాగలీలావిలాసమని యనిపింపదు.

(శ్రీ) లక్ష్మి శేషశయ్యనుండి రతాంతమున లేచునప్పు డొక హస్తమున భారమును శేషునిపై మోపినది. వేరొక హస్తమున వస్త్రమును పట్టినది. విలులితకబరీభారము నంసమున వహించినది. ఆ సమయమున లక్ష్మీదేవి కాంతి ద్విగుణిత రతిప్రీతికల నారాయణుడు మఱల శయ్యకు తార్చినాడు. అప్పటి యలసలసద్బాహు వయిన లక్ష్మి శరీరము రక్షించుగావుత. ఇది వేణీనాందీపద్యము. దీనిలో "అలసల సద్బాహు" ఆలస్యము సూచించు అలసపద మున్నది. అది యున్న నది సూచితము కాదేని యదియు కాపేయకల్పమె యగును.

ఆ యూర్వశి పయోధరాగ్రము పంకిలముగా నున్నది. ముఖ కాంతి లవలీదలపాండురముగ నున్నది. దృష్టి యలసముగా నున్నది. కొన్నిదినములు మాత్ర మామె దేహమీవిధముగ నున్నది. ఇందలి యలసేక్షణ మాలస్యసూచకమె కదా!

సుఖభాజనుడును రమ్యములను చూచి మధురశబ్దములను విని పర్యుత్సుకు డగుట కలదు. అది యబోధపూర్వము స్మరించుట. జననాన్తరసౌహృదములు భావస్థిరములై యుండునుకదా! దీనిలో పర్యుత్సుకపదమున నౌత్సుక్యప్రతిభాన మనుభవ సిద్ధము. అది శబ్దా స్పృష్ట మనవలెనా?

నిద్రానిమీలితనయన మదమంథర యయిన యామెయొక్క, అర్థవంతములు కాని నిరర్థకములును కాని మధురాక్షరములు నా హృదయమున నేమో ధ్వనించుచున్నది. ఇందలి నిద్రాస్థితి నిద్రాశబ్దా స్పృష్టము కాదు. మదాగమము మదశబ్దాస్పృష్టమును కాదు.

పార్వతియు బాలకదంబకల్పములయిన యంగములచే భావము విశదమొనర్చునదై లోచనములు త్రిప్పిన ముఖముతో నడ్డము తిరిగి

యన్లి యుండెను. ఇందు "భావం వివృణ్వతీ" యనుట యభిలాషా గమ సూచకము. ఆ యా విభావసంపాద్య స్వభావము కల యీ బహూదాహరణములలో శబ్దాస్పర్శము సంభావించినచో నిస్సారత చెప్పినట్లగును.

ఇందీవిధముగా శబ్దాస్పర్శవాదు లనవచ్చును. సిద్ధస్వభావము లగు వానికె పదములచే నభిధానముండును. సాధ్యస్వభావము లగు వానిని పదములు నిరూపింపవు. పూర్వసిద్ధములగు నంశములను పదములు ప్రతిపాదింప వచ్చును. అని, ఇట్లనుటచే క్రియాస్వరూపమునందు సిద్ధాంశమని సాధ్యాంశమని రెండు ధర్మముల నంగీకరించినట్లగును. వీనిలో నొకధర్మము ననుసరించి స్వపక్షపోషణ మొనర్చుకొనుటలో నౌచిత్య మేమి? "ధర్మద్వయవతి ధర్మిణి క ఏషోఽన్యతర ధర్మపక్షపాతః?" ధర్మి ధర్మద్వయముతో నుండగా నొకధర్మమునందే పక్షపాతము వహించుట యుక్తమగునా? కాని సిద్ధతాధర్మ మనునది యుండదు. అట్టిదల్లున్నచో నెన్నడు కూలదర్శనము కలుగనె కలుగదు. కొన్నిట సిద్ధస్వభావమున్నదని తలచుట యది యారోపితస్వభావము. అది గౌణీప్రతిపత్తి. సిద్ధమగు నంశమునేని శృంగారాది శబ్దము స్పృశింపగలదు. శృంగారాది శబ్దస్పృష్టమె తత్ప్రతీతి కలుగగలదు. వక్త యయిన సర్వవ్యక్తియు కవియగుట యుండదు. లక్షణ లక్ష్యమాణ ప్రబంధబంధురమగు కావ్య నిర్మాతృత్వమె కవిత్వము. చిత్తవృత్తి ప్రతిపాదకత్వమె కవిత్వము కాదు. కవిత్వాకృతి కావ్యమున శబ్దస్పర్శ యుండక పోవుటేమి? శృంగారాది శబ్దముల వలన గలుగు ప్రతీతి ప్రతీతి కాదందురేని ప్రసిద్ధసంకేతస్మృతియె యందు వ్యవధానము కావలెను. ఇంతకన్న వేరొకవ్యవధాన మందు లేదు. వితతలక్షణ పౌర్వాపర్యవిపాకము సంకేతమునం దుండుటను గ్రహించినచో శృంగారాది శబ్దముల వలన కేవలము ప్రథమ ప్రతీతియె కాక ప్రముఖ ప్రతీతియు గలుగును. కాగా నిందన్వయవ్యాప్తియు నున్నదని నిశ్చయింప దగును. "తత్సత్వే తత్సత్వమన్వయః" స్వశబ్దమున్నప్పుడు ప్రతీతియుండుట కలదు. కావున అన్వయాభావము ప్రత్యుక్తము. విభావాదులవలన రసప్రతీతి కలుగుటలో గూడ నొక విశేషమున్నది.

కేవల విభావాదుల వలన రసాదులు కలుగవు. పూర్ణ కావ్య ప్రక్రియా పరిగతి యున్నగాని రసభావాదుల ప్రతీతి కలుగదు. సంపూర్ణ కావ్య ప్రక్రియా సర్వ స్వసంబంధ మున్న నె విభావాదుల వలన రసప్రత్యయము కలుగును. కావ్య ప్రక్రియా సంబంధము సరిగ లేకపోయినచో విభావాదులున్నను రసప్రత్యయ ముండదు.

ఉద్యానే తు స్థితావేతావన్యోన్యం దదతౌ దృశం
మధ్యేభువం లిఖంతౌ చ ప్రాప్య సంగమసంగతౌ

వారిద్దరుద్యానమున నున్నారు. అన్యోన్యము దృష్టి వేసికొని నారు. మధ్యభూమి గీకుచున్నారు. సంగము కలిగియు నసంగతు లయినారు దీనిలో స్త్రీపురుషులు విభావమని యన్యోన్యదర్శన మను భావమని భూలేఖము చింతాఖ్యవ్యభిచారభావమని సంగము కలిగి యుండుట స్థాయిభావమని యసంగతులగుట విప్రలంభశృంగారమని యనవలసి యున్నది. కాని యిట్లు విభావాదులున్నను విప్రలంభ శృంగారప్రతీతి యున్నదనుట సహృదయసమ్మతము కాదు. కావున కావ్యప్రక్రియాపూర్ణత లేకపోయినచో రసప్రతీతి యుండదనుట సమ్మతము. విభావాదులున్న నిట్టి స్థలములందు రసప్రతీతి లేనందున నన్వయాభావ మనునది యంతట సమానమే. కేవలశృంగారాదిస్వశబ్దము లున్నను రసప్రత్యయ ముండకపోవచ్చును. పూర్ణ కావ్యప్రక్రియా పరిగతి యున్నచో స్వశబ్దము రసాదిప్రత్యయము కలుగజేయగలదు. కేవలవిభావాదులున్నను రసప్రత్యయము కలుగుటలేదు. పూర్ణ కావ్య ప్రక్రియాసంబంధ ముండగా నవి రసప్రత్యయము కలుగజేయుచున్నవి. రసోద్దేశపరశ్లోకములం దభినవోపాధ్యాయులు కావ్యకౌతుకమున నిరూపించిన యంశము నట్లు గ్రహింపవలదు. ఆ నిరూపితమున కన్యార్థతయు తగదు. ఈ నిరూపితాంశమును జతపఱచి గ్రహించుట యుక్తము.

ఇట్లు రసప్రత్యయమునందు స్వశబ్దముపయోగియని నిశ్చయించి నచో— "విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః"—యను రససూత్రమున శబ్దమును గూడ నిరూపింపవలయును గదా! అట్లు నిరూపింపలేదేమి? యని కొందరాశంకింతురు. ఇచట కూడ నిట్లా

శంకించినచో నిది యనవలసి వచ్చుచున్నది. "ఉత్సంగసంగిని బాలకే తదన్వేషణమ్" బాలుడొడిలో నుండగనే వాని నన్వేషించుట యయినదని, రతిహాసాదిభావములను నిర్వేదాదిభావములను నిరూపించుటలో స్వశబ్దమును నిరూపితమై. భావోపాదానమునందు స్వశబ్దోపాదానమును సూచితమయినను స్వశబ్దోపాదాన మావశ్యకమెయనుట యొడిలోని పిల్లవాని నన్వేషించుట యగును. భావోపాదానమున నిది స్వీకృతము కాదా యేమి? వాగంగసత్త్వకృతమై భావ మనుభవింప జేయు నని పూర్వనిరూపితాంశమునందును స్వశబ్ద ముపాత్తమయినట్లు భావింపవలెను. "యదయమనుభావయతి వాగంగసత్త్వకృతః"యను స్థలమున 'వాక్' పదము నావృత్తి యొనర్చి స్వశబ్దము కలదని గుర్తింప వచ్చును. వేరొకవిధమున గూడ స్వశబ్దమును గుర్తింపవచ్చును. "వాగంగసత్త్వకృత" యనుచోట "వాక్ అంగసత్త్వకృతః" అని భేదమొనరించినచో స్వశబ్దము స్పష్టసంగృహీతమై యగును. అప్పుడిట్లర్థము లభించును. అంగసత్త్వాభినయములందు వాక్కున్నచో నవి ముఖ్యార్థము నభివ్యంజన మొనర్పగలవు. వాక్సహితములగు నవి స్వార్థవ్యంజనసమర్థములు కాగలవు. వాక్కు తా నొక్కటియు వ్యంజన మొనరింపగలదు. వాగంగసత్త్వాత్మాత్మకముగ వ్యంజన మొనరింపగలదని భావము. 'వాగంగసత్త్వకృత' యను సమాస యోగమున నీ యర్థసిద్ధి యున్నది. ఈ యర్థమును భరతదేశికులు భావించి 'అంగనైపథ్యసత్త్వాని వాక్యార్థం వ్యంజయంతి' యనిరి. ఆంగికము ఆహార్యము సాత్త్వికము అను మూడును వాచాభూషితము లయినచో వాక్యార్థవ్యంజనసమర్థములు కాగలవని తద్భావము. అట్టి యీ వాక్కు ప్రయోగ మాపాదించునదియై సర్వముఖ్యముగ నుండుటచే 'నాట్యస్యైషా తనుః స్మృతా' యనుటయు 'వాచి యత్నస్తు కర్తవ్యః' యనుటయు యుక్తముగ నున్నది.

౩౧౦. వాఙ్మయానీహ శాస్త్రాణి వాఙ్నిష్ఠాని తథైవ చ
తస్మాద్వాచః పరం నాస్తి వాగ్ఘి సర్వస్య కారణం

శాస్త్రము లన్నియు వాఙ్మయములు. అన్నియు వాఙ్నిష్ఠములు. కావున వాక్కునకు వేరుగా లేదు. వాక్కే సర్వమునకు కారణము.

అని కారికాసూత్రార్థము. దీనిలో శ్రీభారతీ భగవతీ స్వరూపము నిరూపితమని శ్రీమదభినవ గుప్తులు - "సైవేయముపయోగినీ కింతు చతుర్గోపాయభూతా పరమపురుషార్థస్వభావా విశ్వకారణభూతా భగవతీ భారతీ" - యని యనుట వాగ్దేవీ మహాభావము సూచిత మగుచున్నది. మహాసరస్వతీ రసమయ సామ్రాజ్యమునందు శాస్త్రము లన్నియు వాఙ్మయములు వాఙ్నిష్ఠములు. ఇవి యన్నియు వాగ్రూప ములు. ఫలరూపమగు వాక్కునందే శాస్త్రములకు నిష్ఠ - స్థితి యున్నది. "వాచి ఫలరూపాయాం నిష్ఠా యేషాం"

సర్వశాస్త్రములకు వాక్కు రూపము. వాక్కు ఫలము. వాగ్దేవి ననుసరించి వాగ్దేవిని సాక్షాత్కరించుకొనుటయె సాధకుని సంవేదనము. వాక్కు విశ్వకారణము. వాక్కు పరమ పురుషార్థ స్వరూపము. వైఖరీ మధ్యమా పశ్యంతీ పరా స్వభావము. ఇందలి పశ్యంతీ భావము శబ్దబ్రహ్మము. తదుపాయ మీ వాక్కు. ఇచట ప్రత్యభిజ్ఞాశాస్త్ర పరమార్థమును సంబంధింప జేసికొని భావింపవలెను. విశ్వగోచరములగు సర్వభావ పదార్థములకును స్వభావస్థితియను సత్త్వము కలదు. సత్తాసంబంధ మయిన నిజలక్షణసంపదచే నవి యర్థక్రియాకారులగును. ఇట్టి యీ భావపదార్థములకు సత్త్వప్రధాన మయిన బోధతారూపమగు స్వభావము కలదు. పారమైశ్వర్య రూప మయిన స్వాతంత్ర్యమున నీ బోధము ప్రత్యవమర్శాత్మకముగ నుండును. అట్టి యీ ప్రత్యవమర్శమె జడముల కన్న వైలక్షణ్య మిచ్చును. ఇట్లీ యంశము సువిభక్తముగా నున్నదని యస్మ (అభినవ) త్పరమ గురు పాదులు ప్రత్యభిజ్ఞా శాస్త్రము నందు నిరూపించిరి. మేమును (అభినవ) తద్వివరణమునందును భేదవాదవిదారణమునందును వివేచన మొన రించితిమి. వాక్కె సర్వమున కవభాసకము. అదియె సకలనిర్వాహకము. పరమార్థతః వాగవభాసనమె మహానిర్వాణము. ఈ యంశమె యిట్లున్నది. "వాగ్ఘి సర్వస్య కారణం" అనుట యుక్తము. "వాగేవ విశ్వా భువనాని" యని శ్రుతి యున్నది. భావభజనీయులగు భర్తృహరి ప్రభృతులును శబ్దవివర్త ధర్మమును ప్రసాదన మొనరించిరి. ఆ

యంశము నిచట ననుసరింపవలెను. వాక్కు సర్వాకారము కావున నాట్యమున కితివృత్తము శరీరమని యనుట విరుద్ధముకాదు. ఇదియు వాఙ్మయమె కదా!

౩౩౧. నామాఖ్యాత నిపాతోప సర్గతద్ధిత సమాసనిర్వర్త్యః
సంధివిభక్తినియుక్తో విజ్ఞేయో వాచికాభినయః

౩౩౨. ఆగమనామాఖ్యాతోపసర్గతద్ధితనిపాతసంధియుతః
సవచనవిభక్త్యుపగ్రహానిర్వర్త్యో వాచికాభినయః

శాస్త్రాంతరప్రసిద్ధములగు కొన్ని విషయములు రసాంగముగా నుండును. వానిని కవిశిక్షార్థమె నిరూపించుట యావశ్యకము. కవికే కాక నటునకును స్థలవిశేషమున నభినేయమునందు విశ్రాంతి సంపాదించు నవిగా నున్నవి. కావున కవినటులు వీని నితికర్తవ్యతారూపమున గ్రహింపవలసి యున్నదని యుపదేశరూపముగ నిరూపించుట యుక్తము. ఈ నిరూపింపబోవు ఆగమనామాఖ్యాతాదు లర్థద్వారమునను రూపసౌందర్యమున నుభయథా సంబంధించునవి కాగలవు. క్షుభితమని క్షుబ్ధమని ప్రయోగించుటవలన ప్రతీతివైచిత్ర్య మున్నది. అర్థభేదమున్నను స్వరూపసౌందర్యము సార్వత్రికము. విషయభేదమున నొకశబ్దము ప్రయోగింపవలసియుండగా మరియొకటి దుర్భణము. రసానుకూలముగా హృద్యప్రయోగ ముచితము. అశ్రవ దుశ్శ్రవ పదముల నుపయోగించుట యుక్తముకాదు. వ్యాకరణశాస్త్రసమ్మతము లయిన యాగమాలు వైకల్పికములుగా నుండునేని సందర్భసౌందర్యానుకూలముగనె ప్రయోగించునది. ఈ యాగమవిధిచే నాదేశపక్షమును సూచితమె. ఆదేశమును వైకల్పికమగునేని సౌందర్యౌచిత్యమును సమీక్షించునది. కొన్ని స్థలములందు వ్యాకరణకార్యముల యసత్త్వపక్షమె యుక్తము. ముగ్ధాశబ్దస్థానమున మూఢాశబ్దము ప్రయోగార్హముకాదు.

ఆచ్ఛిద్య ప్రియతః కదంబకుసుమం యస్యారిదారైర్నవం
యాత్రాభంగవిధాయినో జలముచాం కాలస్య చిహ్నం మహః
హృష్యద్భిః పరిచుంబితం నయనయోర్న్యస్తం హృది స్థాపితం
సీమంతే నిహితం కథంచన తతః కర్ణావతంసీకృతం

ఈ శ్లోకమునందు వ్యాకరణకార్యము లౌచిత్యానుగుణముగ నున్నవని భావింపవలెను. రాజా! నీ శత్రువనితలు యాత్రాభంగ మొనరించు వర్షాకాలపు చిహ్నమయిన నవకదంబకుసుమమును ప్రేమతో గ్రహించి సంతసంపడి ముద్దుపెట్టుకొనినారు. నేత్రములం దుంచుకొనినారు. హృదయమునందు కూర్చినారు. సీమంతమునందు కూర్చినారు. ఎల్లెని కర్ణావతంస మొనరించుకొనినారు.

ఈ నిరూపితము లయిన భావములను సమాలోచన మొనరించు కొనుచు వాచికాభినయ నిరూపణ పరమము లయిన పై కారికా విషయములను గుర్తింప వలెను.

| | | |
|---|---|---|
| ౧ నామము | ౨ ఆఖ్యాతము | ౩ నిపాతము |
| ౪ ఉపసర్గ | ౫ తద్ధితము | ౬ సమాసము |
| ౭ సంధి | ౮ విభక్తి | — |

అను నీ యష్టకమున నామాది నిర్వర్త్యము సంధి విభక్తిని యుక్తమునై వాచికాభినయ ముండుటను గుర్తింపవలెను. అభినవ భారతీ సమ్మత మయిన పాఠముగా నిర్దేశించిన కారికాను సారమున నిట్లు గుర్తింప వలెను.

| | | |
|---|---|---|
| ౧ ఆగమము | ౨ నామము | ౩ ఆఖ్యాతము |
| ౪ ఉపసర్గము | ౫ తద్ధితము | ౬ నిపాతము |
| ౭ సంధి | ౮ వచనము | ౯ విభక్తి |
| ౧౦ ఉపగ్రహము | — | — |

అను నీ దశకము వాచికాభినయమును నిర్వర్తింప జేయును. ఈ యంశము నిట్లు పరిగ్రహించునది. ౧. నామ. మదనరిపు పదము శివపర్యాయ మయినను తదీయ శృంగార వర్ణనము నందు ప్రయోగార్హముకాదు. ౨. ఆఖ్యాతము. ఆఖ్యాతమనునది క్రియాపదము. వైచిత్ర్య మాపాదించునట్టి యాఖ్యాతమె యుచితము.

స్మరసి! స్మర! మేఖలాగుణైః
ఉత గోత్రస్ఖలితేషు బంధనం
చ్యుతకేసర దూషితేక్షణా
న్యవతంసోత్పల తాడనాని వా

స్మరదేవా! గోత్రస్ఖలితములు కలుగగా మేఖలత్రాటితో బంధించుటను స్మరింతువా? రాలిన పుష్పాడి కన్నుల బడునట్లు కర్ణోత్పలతాడనములనయిన స్మరింతువా? దీనిలో స్మరసి యను నాఖ్యాతము వర్తమానకాలమున నున్నది. ఇట్లు చెప్పుట మన్మథసాక్షాత్కారణమును సూచించును. ఎదుట నున్నట్లు పట్టి యుపాలంభించురీతి మన్మథు డుపాలంభవిషయముగా నుండుట భాసింపగా "ఇందు నీవే సాక్షి. నే నసత్యము ప్రకటించుటలేదు." అను భావము భాసించును. ఇట్టి భావభానమె లేకపోయినచో "స్మృతవానితి మేఖలాగుణైః" అని యుండెడిది. అప్పుడీ భావమాధుర్యము కలుగదు.

3. ఉపసర్గము— ఉపసర్గమున ప్రకృత్యార్థసంబంధము భాసించును. ఉపసర్గములచే కర్మప్రవచనీయములు నుపలక్షితము లగును. తద్ధిత ప్రత్యయములు నుపలక్షితములగును.

అస్మై ర్నిస్త్రావన్ముహురుపచితై ర్దృష్టి రాలుప్యతే మే
క్రూర స్తస్మిన్నపి న సహతే సంగమం నౌ కృతాంతః

నీ యాలేఖ్యము చిత్రించి నీ పాదములపై నేనుపడి యున్నట్లుగా చిత్రింపదలచి నప్పుడు మఱలమఱల నుపచితములయిన బాష్పములు నా దృష్టి కవరోధము కల్పించినవి. క్రూరదైవ మా చిత్రమునగూడ మన సంగమము సహింపదు కదా! ఇందు ఉపచిత పదగతమయిన యుపసర్గ మధికార్థప్రదము.

మీమాంసతే హృదయమాత్మన ఏవ బాలా
నామ్నాపి మానకలనాం సహతే న జాతు

ఆ బాల తన హృదయము నె మీమాంసించును. పేరున కయిన మానకలనమును ఒకప్పుడేని సహింపదు. ఇచట హృదయపదమె హృదయగ్రాహి. ఇచట చిత్తపదము చేతోమోద మీయదు. 'మీమాంసతే' యను సుబ్ధాతుప్రత్యయపదమున్ను వైచిత్ర్యము సంపాదించును. ఇట్లె తల్ ప్రత్యయాంతములు కృత్ప్రత్యయాంతములు సమయౌచిత్యము ననుసరించి ప్రయుక్తము లయినచో వైచిత్ర్యమభ్యూహించునది. గౌరవభయమున నన్నిటి నుదహరించుటలేదు. స్త్రీప్రత్యయప్రయోగము వలన ప్రయోగవైచిత్రి నిట్లు భావించునది.

"అధ్యాసీనః స వైదగ్ధీం" వైదగ్ధీప్రక్రియ నధిష్ఠించినవాడని యనుట లో కర్మసంబంధమాత్రమున కృతిత లేదు. 'వైదగ్ధీం' అను స్త్రీ ప్రత్యయము సౌభాగ్యాతిశయమును గోచరింపజేయుట యనుభవ సిద్ధము. తద్ధితప్రత్యయకృత మయిన చమత్కార మిట్లున్నది.

"తాంబూలీనాం దలైస్తత్ర రచితాపానభూమయః
నారికేరాసవం యోధాః శాత్రవం చ పపుర్యశః

రఘుమహారాజు వీరసైనికులు తాంబూలీదలములచే పానగోష్ఠీ ప్రదేశములను నిర్మాణము చేసి యందు నారికేలాసవము త్రావిరి. శాత్రవయశమును త్రావిరి. దీనిలో "శత్రూణాం" అని షష్ఠీవిభక్తి లేదు. 'శాత్రవం' అని తద్ధిత ప్రత్యయము కలదు. ఈ తద్ధితవృత్తిచే నేకార్థీ భావాన్వయము లభించును. త్రాగుడు కలవానికి ముద్దయు నావశ్యకము. ఆ వీరయోధులు తద్గ్రాసీకృత మయిన యశమును గూడ స్వయంగ్రాహ మొనరించిరని భావము. నిపాతము కొన్నిస్థలములం దర్థవిశేషమున కగును.

స్నిగ్ధశ్యామలకాంతిలిప్తవియతో వేల్లద్వలాకా ఘనా
వాతాః శీకరిణః పయోదసుహృదామానందకేకాః కలాః
కామం సంతు దృఢం కఠోరహృదయో రామోస్మి సర్వంసహే
వైదేహీ తు కథం భవిష్యతి హా హా హా దేవి! ధీరా భవ!

దీనిలో హా హా హా నిపాత సన్నివేశము సుందరము. వర్షానిలములు విశేషించి నిరంకుశములు వీచుచుండ నీ ప్రదేశ మత్యంతము భయంకరము. ఇంకనిచట కిరాతులేల? సముచితము లయిన విభావాదుల సంయోజనమున నేకార్థీభావ మవభాసింపగా నందీ నిపాతార్థము వైచిత్ర్యవిశేష మాపాదించును. సమాసము విచిత్రతానిదాన మగుట యిట్లున్నది. "మధ్యే గంగాయమునమమునా" యను స్థలమున "మధ్యే గంగాయమునయోః" అని యనలేదు. ఇందవ్యయీభావ సమాసము సౌందర్యావహము. ఇట్లే సమాసాంతరము లందును నిరూపింపదగును.

౪. సంధి ద్వివిధము. నైరంతర్యరూపము. రూపశ్లేషరూపము ననిభవ తోయ పదముల నైరంతర్యోచ్చారణమున భవతోయరూపము

కలుగును. భవతోయ పదవిపర్యయోచ్చారణమున తోయభవ రూప సిద్ధిలో నిష్టసిద్ధి లేదు. అసిధారాదిపదములందు రూపశ్లేషకృతమయిన సంధి యున్నది. ఈ రూపశ్లేషసంధిస్థలములో బీభత్సార్థము అశ్లీలన రూపార్థమును గోచరించును. అసిరాపదమునందస్థి యున్నది. "సూత్రం బ్రాహ్మముర:స్థలే" యను స్థలమున సూత్రం బ్రాహ్మం పదములు ద్విశ్రుతి కలిగి యున్నవి. ఆ రెండుపదములకు సంగము లేదు. ఇట్టి స్థలములం దేకపదవత్ప్రత్యయము కలుగదు. బ్రహ్మసూత్ర మను నప్పు డుత్తర సంక్రాంతి యనుస్వానమునకు గలదు. అట్లే దానిని విన్పింప జేయవలయును. ఇట్టివానియం దేకపదవద్భావముండును. విభక్తివిశేషములును వైచిత్ర్య మాపాదింపగలవు. "విభక్తయః సుప్తిఙ్ వచనాని, తైః కారకశక్తయః లిఙాద్యుపగ్రహాశ్చ ఉప లక్ష్యంతే" సుప్తిఙ్వచనము లన్నియు విభక్తిగ్రాహ్యములు. వీనిచే కారకశక్తులు లిఙాద్యుపగ్రహములు నుపలక్షితము లగును. ఉదా;

'పాండిమ్ని మగ్నం వపుః'

పాండిమలో వపువు = శరీరము మగ్నమయిన దనుటచే శరీరమునకె మజ్జన కర్తృత్వము గోచరించును. పాండిమ్ని యని సప్తమి విభక్తి యుండుటచే నది యాధారమగుట గద=రోగస్థానీయ మగుట ద్యోతితమై మిక్కిలి రంజన మిచ్చుచున్నది. "పాండు స్వభావం వపుః" అనినచో నిట్టి భావము లభింపదు. ఇట్లే కారకాంత రములందును నిరూపింపదగును. పైవాక్యముకల పద్య మిట్లున్నది.

దాహోమ్భః ప్రసృతింపచః ప్రచయవాన్బాష్పః ప్రణాలోచితః
శ్వాసాః కంపితదీపవర్తిలతికాః పాండిమ్ని మగ్నం వపుః
కించాన్యత్కథయామి రాత్రిమఖిలాం త్వన్మార్గవాతాయనే
హస్తచ్ఛత్రనిరుద్ధచంద్రమహాసస్తస్యాః స్థితిర్వర్తతే

ఆమె తనూదాహ ముదకప్రసార ముడుకెత్తించినది. బాష్ప మధికమై కాలువజాలు కట్టినది. శ్వాసములు దీపపు వత్తులను కదిలించు చున్నవి. వపువు పాండిమలో మగ్న మయినది. ఇంక నొకటి చెప్పుదునా ? ఆ యమ్మ రాత్రియంతయు నీ మార్గవాతాయనమునం దుండి చంద్రాతపమును హస్తచ్ఛత్రమున నిరోధించుచున్నది. ఇట్లామె స్థితియున్నది. ఇది విద్ధసాలభంజికాగతమయిన నాయికావిరహపద్యము.

వచనము విచిత్రత నాపాదించుట యీ పద్యమున నున్నది.

కర్తా ద్యూతచ్ఛలానాం జతుమయశరణోద్దీపనః సోఽభిమానీ
కృష్ణాకేశోత్తరీయవ్యపనయనపటుః పాండవా యస్య దాసాః
రాజా దుశ్శాసనాదేర్గురురనుజశతస్యాంగరాజస్య మిత్రం
క్వాస్తే దుర్యోధనోఽసౌ కథయత న రుషా ద్రష్టుమభ్యాగతాః స్మః

దీనిలో 'పాండవా యస్య దాసాః' అనునది ప్రకృతలక్ష్యము. పాండవు లందరును దాసులె. వేరువేరుగా గూడ వారు దాసులె యని పాండవపదగత మయిన బహువచనమున విశదమగును. "త్వం హి రామస్య దారాః" నీవు రాముని దారవు. అని సంస్కృతమున ననుటలో నొక ప్రత్యేకత కలదు. సంస్కృతమునందు దారశబ్దము నిత్యబహువచనము. పుంలింగము. సీతాదేవి నుద్దేశించి 'త్వం' నీవు అనుట స్త్రీలింగ మేకవచనము కదా! ఇట్టి త్వం పదమున కట్టి దార పదముతో నన్వయము నిరూపించుట విచిత్రతావిశేష మాపాదించును ఇట్లే "కీర్తిస్తవ శ్వేతా" నీ కీర్తి శ్వేత యనుట రుచిరము. కాని "శ్వేతం యశస్తవ" నీ యశము తెల్లన యనుట రుచిరము కాదు. కీర్తిశబ్దగత మయిన స్త్రీలింగస్వారస్యము వలన భావసౌందర్యము కలుగును. యశము నపుంసక లింగము. ఈ సౌందర్య మందు లేదు. ఈ విధముగనె కొన్ని స్థలములం దుపగ్రహాకృతమయిన వైచిత్ర్య మవభాసించును. ఉపగ్రహమనునది విశేష్యానుప్రయుక్తమగు విశేషణము. తత్స్వభావకృతమయిన సౌందర్యము పాఠ్యమునకు రమ్యత నాపాదించును. భవభూతి పద్యము.

అలసలలిత ముగ్ధాన్యధ్వ సంపాత ఖేదాత్
అశిథిల పరిరంభై ర్దత్త సంవాహనాని
పరిమృదిత మృణాలీ కోమలాన్యంగకాని
త్వమురసి మమ కృత్వా యత్ర నిద్రామవాప్తా

దీనిలో సంగకములకు విశేషణములుగా నున్నవన్నియు స్వభావసుకుమార సూత్రసందానితములై శోభావహములుగా నున్నవి.

కేలీకందలితస్య విభ్రమమధోర్ధుర్యం వపుస్తే దృశౌ
భంగీభంగుర కామకార్ముకమిదం భ్రూనర్మకర్మక్రమః
ఆపాతేపి వికారకారణమహో వక్త్రాంబుజన్మాసవః
సత్యం సుందరి వేధసస్త్రిజగతీసారం త్వమేకాకృతిః

ఓ తరుణీ! నీ సర్వసుందర శరీరము కేలీకందల విలాసము. నీ దృష్టి నీ భౄమల నర్మ కర్మ క్రమము కామధనుర్భంగీ రమ్యము. నీ యధరమధు వింతయయినను వికారకారణము. సుందరి! నీవాక్కు తేనె బ్రహ్మ సృష్టిసారమనుట సత్యము. ఈ హాస్యము సర్వమనోహరము. ఈ విధముగ నె క్రియానియుక్తమగు ధాతువైచిత్ర్యమును రమణీయ ముగ నుండును. 'గ్రస్తం' అని 'గ్రసితి' ప్రయోగించినపుడు స్వదన మాత్రము నందె గ్రసితి పారిభాషిత మయినను గ్రాసాతిశయసంరంభ మవభాసించును. ఇట్టి విశేషముల నన్నిటి నుపజీవ్యములుగ గుర్తించి యానందవర్ధనాచార్యుడు ధ్వన్యాలోకమునం దీ విధముగ నిరూపించెను.

"సుప్తిఙ్వచన సంబంధై స్తథా కారక శక్తిభిః
కృత్తద్ధిత సమాసైశ్చ ద్యోత్యోఽలక్ష్యక్రమః క్వచిత్"

ధ్వని యాత్మ యగు రసాదిక మలక్ష్య క్రమము. ఆ రసాదికము సుబ్విశేషములచే తిఙ్విశేషములచే వచనవిశేషములచే సంబంధ విశేష ములచే కారకశక్తులచే కృద్విశేషములచే తద్ధితవిశేషములచే సమాస ములచే నవభాసించును. 'చ' శబ్దముచే సుప్రయుక్తము లయిన నిపాతోపసర్గకాలాదులచే గూడ రసాదికము ద్యోత్యమగును. అని, వక్రోక్తి జీవితకారు డయిన రాజానకకుంతకుడును వీనిని సుబాదివక్రత యని పరిభాషించెను. ఏవం విధముగా నున్న కవితావాచిక శబ్దనిష్ఠ మయిన వ్యవహారము దశాంగనిరుక్తమై యున్నది. దీనిని విశకలితముగా విభజించి గుర్తించుట యుక్తము. కవినటులు వీని యుచ్చారణమున స్థానకరణా దిజ్ఞానము కలవారగుటయు సముచితము. ఇది యంతయు గాఢ శిథిల మసృణ పరుషాది గుమ్ఫవిశేష విభాగమున కుపకరించును. కవులిట్టి విభాగము గుర్తింపవలెనని యిది సముపదిష్టమయినది. నటున కును సమ్యగుచ్చారణోపదేశమున కీ వర్ణశః ప్రతిపాదన ముపకరించును. సముచితమయిన యుచ్చారణ సౌష్ఠవము కల నటుడు వర్ణసావర్ణ్యము ననుసరించి ప్రబంధ సౌందర్యజ్ఞానమును పొందగలుగుటకై యిది యావశ్యకము. వాచికాభినయము గుర్తించుట కీ ప్రఘట్ట పరమార్థ పరిజ్ఞాన మపేక్షితము.

## పాఠ్యవిభాగము

సంస్కృతపాఠ్యమని ప్రాకృతపాఠ్యమని పాఠ్యము ద్వివిధముగా నుండునని నాట్యవిదులనిరి. యథాక్రమముగా నాపాఠ్యముల విభాగ స్వరూపముల నిర్దేశించుట యుక్తము. వ్యంజన-స్వర-సంధి-విభక్తి-నామ-ఆఖ్యాత-ఉపసర్గ-నిపాత-తద్ధిత-సమాసవిధానములతో సంస్కృత పాఠ్య ముండును. దీని ప్రయోగవిధానము నీవిధముగా గుర్తింపవలెను.

౫౩. అకారాద్యాః స్వరా జ్ఞేయా ఔకారాన్తాశ్చతుర్దశ
హకారాన్తాని కాదీని వ్యంజనాని విదుర్బుధాః

అకారాదు లౌకారాన్తము లయిన స్వరములు పదునాలుగు కలవు. కాదులు హకారాన్తము లయిన వ్యంజనములు కలవు. అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అనునవి స్వరములు పదునాలుగు. క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ల వ, శ ష స హ, అనునవి వ్యంజనవర్గములు.

౫౪. అష్టౌ స్థానాని వర్ణానామురః కంఠశ్శిరస్తథా
జిహ్వామూలం చ దన్తాశ్చ నాసికోష్ఠౌ చ తాలు చ

సర్వవర్ణములకును నియతముగా నెనిమిది స్థానములు కలవు. ఉరము కంఠము శిరము జిహ్వామూలము దన్తములు నాసిక ఓష్ఠము తాలువు అను నీ యెనిమిది స్థానము లందభివ్యక్తము లగు నాయా వర్ణములకు స్థాన నియమము ననుసరించిన సంకేతము ప్రసిద్ధమై యున్నది.

౧. కంఠ్యములు : అ కు హ విసర్జనీయములు కంఠ్యములు. అ-యనుట దీర్ఘమునకు నుపలక్షణము. క ఖ గ ఘ ఙ యను కాదు లయిదు వర్ణములకు 'కు' యని సంజ్ఞ. ఇట్లె చు టు తు పు లు గ్రాహ్యములు. విసర్జనీయము విసర్గము. ఈ నిర్దిష్టము లయిన వర్ణములు కంఠ్యములు. కంఠసంభవములు. వక్ష్యమాణ తాలవ్యాదుల నిట్లె గుర్తింప వలెను.

౨. తాలవ్యములు : ఇ చు య శ వర్ణములు తాలవ్యములు, చ ఛ జ ఝ ఞ లు చు సంజ్ఞకములు, 'శాద్వర్ణః' యను నియమమున శవర్ణ మని యనవలెను. చకారాదులకు వలె కారప్రత్యయాంతముగ బలుకరాదు.

౩. మూర్ధన్యములు : ఋ టు ర ష లు మూర్ధన్యములు. ముఖములో నంగిలి దగ్గరగా నూర్ధ్వభాగమున గట్టిగానుండు ప్రదేశము నకు మూర్ధమని పేరు. ఋ టు ర ష లచట నభివ్యక్తము లగును.

౪. దంత్యములు : ౡ తు ల స లు దంత్యములు. దంతభవములు దంత్యములు. దంతపదమున దంతమూలప్రదేశము వివక్షితము. భగ్నదంతునకు వీనియుచ్చారణ ముపపన్నము కాదు.

౫. ఓష్ఠ్యములు : ఉ పూపధ్మానీయములు లోష్ఠ్యములు. ప ఫ వర్ణములకు పూర్వమున్న విసర్గమున కుపధ్మానీయ మని క ఖ వర్ణములకు పూర్వమున్న విసర్గమునకు జిహ్వామూలీయ మని వ్యవహారము. ఏ ఐ కంఠ తాలవ్యములు. ఓ ఔ కంఠోష్ఠ్యములు. వ కారము దంతోష్ఠ్యము. జ ఞ ణ న మ లనునాసికములు. విసర్జనీయ మౌరస్యమని కొందరనిరి. అవర్ణము సర్వముఖస్థానమని కొందరు పలికిరి. ఈ నిరూపితములన్నియు వర్ణోత్పత్తి స్థానములు. స్థానసంకేత మీ విధముగా శ్లోకబద్ధమై యున్నది.

౫౫౫. క ఖ గ ఘ ఙాః కంఠస్థాస్తాలుస్థానాస్తు చ ఛ జ ఝ ఞాః
ట ఠ డ ఢ ణా మూర్ధన్యాః త థ ద ధ నాశ్చైవ దంతస్థాః

౫౫౬. ప ఫ బ భ మాస్త్వోష్ఠ్యాః స్యుర్దంత్యా ౢ ల సా అహౌ చ కంఠస్థా
తాలవ్యా ఇ చు య శాః స్యుః ఋ టు ర షా మూర్ధ్ని స్థితా జ్ఞేయాః

వీని యర్థము నిగదవ్యాఖ్యానము. వ్యాకరణశాస్త్రమునందాయా వర్ణములకు స్థానప్రయత్నవిశేషములు విభజ్య నిరూపితములయినవి. వర్ణోచ్చారణమునందాభ్యంతరప్రయత్నములు బాహ్యప్రయత్నములు గలవు. స్పృష్ట సంవృత వివృత ప్రయత్నములను ముని నిర్దేశించెను. పదునొకండు బాహ్యప్రయత్నములు కలవని వ్యాకర్తలు నిర్దేశించిరి. అవి యాంతరతమ్యపరీక్షలో నుపయోగించునని వారనిరి. అంతటి సూక్ష్మపరీక్షణ మావశ్యకమయినను నాట్యప్రయోగమున నవి యంతగా నుపయోగించునవి కాకపోవచ్చునని భరతుడు ఘోషాఘోష యత్నములను నిరూపించెను.

౫౫౭. ద్వౌ ద్వౌ వర్ణౌ తు తు వర్గాద్యౌ శషసాశ్చత్రయోఽపరే
అఘోషా ఘోషవన్తస్తు తతోఽన్యే పరికీర్తితాః

౭౫౮. వర్గే వర్గే సమాఖ్యాతౌ ద్వౌ వర్ణౌ ప్రాగవస్థితౌ
అఘోషా ఇతి యే త్వన్యే నఘోషాః సంప్రకీర్తితాః
౭౫౯. ఏతే ఘోషాఘోషాః కంఠ్యౌష్ఠ్యా దంత్యజిహ్వానాసిక్యాః
ఊష్మాణస్తాలవ్యా విసర్జనీయాశ్చ బోద్ధవ్యాః
౭౬౦. గఘజ జఝఞ డఢణ దధన బభమ యరలవా మతా ఘోషాః
కఖ చఛ టఠ తథ పఫ శషసా ఇతి వర్గేష్వఘోషాః స్యుః

ఆ యా వర్గము లందున్న మొదటి రెండు, రెండు వర్ణములు అనగా క ఖ చ ఛ ట ఠ త థ ప ఫ లు, శ ష స లు మూడువర్ణములు అఘోషప్రయత్నము కలవని గ్రాహ్యము. ఇవి కాక శేషవర్ణములు ఘోషప్రయత్నము కలవి యని పరిగ్రాహ్యము. వర్గవర్గము నందును మొదట నున్న రెండు రెండు వర్గము లఘోషయత్నము కలవి కాగా మిగిలిన వన్నియు సఘోషవర్ణము లగును. ఉదాహరణ కారికాపూర్వార్థమునం దిది స్పష్టము. ఇట్లు కంఠ్యాదులు ఘోషాఘోషయత్నవిశిష్టములై యున్నవని పరిగ్రహింపదగును. వ్యాకరణ శాస్త్ర ప్రసిద్ధము లయిన సంజ్ఞావ్యవహారములు భరతసమ్మతములై నిర్దిష్టము లయినవి. పాఠ్యసంప్రయోగమునందు వీని నన్నిటిని సావధానముగ సంధారణము చేయవలెను.

శబ్దప్రయోగ విషయమున స్వరూపమును సావధానముగ సమీక్షింప వలెను. ఏ వర్ణమున కేవర్ణముతో స్థానము సమముగ నుండునో యా వర్ణము సవర్ణ సంజ్ఞ కలది యని సంకేతము కలదు. "తుల్యాస్య ప్రయత్నం సవర్ణం" అని వ్యాకరణ సూత్రము. ఈ నిర్దిష్టములయిన పదునాలుగు స్వరములందు మొదటి పది స్వరములు సమానములు. వానిలో మొదటి స్వరము హ్రస్వమని పరస్వరము దీర్ఘమని గుర్తింప వలెను.

౭౬౧. ఇత్థం వ్యంజనయోగైః స్వరైశ్చ సాఖ్యాతనామపదవిహితైః
కావ్య నిబంధాశ్చ స్యు ర్ధాతు నిపాతోపసర్గైస్తు

ఇట్లు స్వరములు వ్యంజనయోగము కలవై యాఖ్యాత నామ పదవిహితములై ధాతునిపాతోపసర్గ సహితములై కావ్యనిబంధము లందు కూడి యుండును. పాఠ్యయోగ శిక్షితుడయిన కవి కావ్య బంధము సముచిత బంధముతో నుండునట్లు ప్రసమీక్షించుట యుక్తము

ఇట్లు సంక్షిప్తముగా శబ్దలక్షణము నిర్దిష్టమయినది. ప్రకరణవశమున దీనిని విశద మొనరించుట యావశ్యకము.

ఆఖ్యాతాదులు

మొదట వాచికాభినయ స్వరూపోపక్రమములో ఆగమ నామాఖ్యాతోపసర్గాదులు సంకేతితములు లయినవి. కవితా వాచిక శబ్దనిష్ఠ వ్యవహారము దశాంగ సంగత మనియు నిర్దిష్టమయినది. పాఠాంతర ప్రక్రియానుసారమున నామాఖ్యాతనిపాతోప సర్గాదు లెనిమిది పరిగణితము లయినవి. ఇది యంతయు శబ్దలక్షణ విధానము. ఇందు విభాగబుద్ధితో గ్రహింపదగిన నామాఖ్యాతోపసర్గాదుల స్వరూపలక్షణావిష్కరణ మవసరప్రాప్తము. ఇట్టి ప్రకరణసంగతి ననుసరించిన స్వరూప వ్యాఖ్యానము యుక్తము. ఈ నిరూపితలక్షణ వివేకము అర్వాచీనుల పరిష్కారములతో కొంత సంవదించునది కాకున్నను భావబలసంపాదక మయినందున భావకులకు భావనాగ్రాహ్య మగును.

వాచికాభినయ సంక్రాంతమయిన సంస్కృతపాఠ్యము సప్త విభక్తిసంగతమై షట్కారకసంయుతమై యున్నది. ఆఖ్యాతస్వరూప మయిన వాచికపాఠ్యము ప్రథితసాధ్యముగా నుండుట ముఖ్యము. ఏవం విధభావసంధితో నాఖ్యాతోపసర్గాదుల లక్షణనివేదనము యుక్తము.

౭౬౨. తత్రాహుః సప్తవిధం షట్కారకసంయుతం ప్రథితసాధ్యం
వచనం నామసమేతం పురుషవిభక్తం తదాఖ్యాతం

౭౬౩. ప్రాతిపదికార్థయుక్తా ధాత్వర్థానుపసృజంతి యే స్వార్థే
ఉపసర్గాహ్యుద్దిష్టాస్తస్మా త్సంస్కారతస్తస్మిన్

౭౬౪. ప్రాతిపదికార్థయోగా ద్ధాతుచ్ఛందో నిరుక్తయుక్త్యా చ
యస్మాన్నిపతంతి పదే తస్మాత్ప్రోక్తా నిపాతాస్తు

౭౬౫. ప్రత్యయవిభాగజనితాః ప్రకర్ష సంయోగ సత్త్వవచనైశ్చ
యస్మాత్పూరయతేఽర్థాన్ ప్రత్యయ ఉక్తస్తతస్తస్మాత్

౭౬౬. లోకే ప్రకృతిప్రత్యయ విభాగసంయోగసత్త్వవచనేషు
తాంస్తాన్ పూర్యంతేఽర్థాస్తేషు హి తద్ధితస్తస్మాత్

౭౬౭. ఏకస్య బహూనాం వా ధాతోర్లింగస్య వా పదానాం వా
యస్మా ద్విభజన్త్యర్థాన్విభక్తయః కీర్తితాస్తస్మాత్

౩౬౮. విశిష్టాస్తు స్వరా యత్ర వ్యంజనం వాపి యోగతః
సంధీయతే పదే యస్మాత్తస్మాత్సంధిః ప్రకీర్తితః
౩౬౯. లుప్తవిభక్తిర్నామ్నామేకార్థం సంహర్సమాసోఽపి
తత్పురుషాది స్తద్జ్ఞైర్నిర్దిష్ట షడ్విధో విప్రాః

ఈ కారికలందాఖ్యాతాదుల స్వరూపాఖ్యాన మున్నది. ఆఖ్యాతము క్రియాకృతరూపము. క్రియాకృతస్వరూపమునందు కరిష్యమాణ క్రియారూపముండును. క్రియమాణ క్రియారూపముండును. యథాభూతార్థ క్రియారూపముండును. వీనినే భవిష్యత్క్రియార్థ వర్తమాన క్రియార్థ భూతక్రియార్థ సంకేతములతో వ్యవహరించుట కలదు. ఈ క్రియలు గమాగమాత్మకములై పూర్వాపరీభూతావయవ రూపములై యుండును. ఇట్టివివి యధ్యక్షపరోక్షభూతములుగా నుండుట ప్రసిద్ధము. ఆఖ్యాత మిట్టి క్రియాసహితముగ నుండును. ప్రధితసాధ్యమగుటయు నాఖ్యాతలక్షణము. "ప్రధితః సాధ్యోఽర్థో వాచ్యత్వేన యస్య" సాధ్యార్థము ప్రధితమై యుండవలెను. వాచ్యముగా నా యర్థము స్పష్టముగ నుండవలెనని భావము. నామార్థ సంబంధము కలిగి స్పష్టార్థ ప్రతిపాదకమై యాఖ్యాత ముండును. ఉత్తమ మధ్యమ ప్రథమ పురుష విభక్తమై విశకలితముగ నర్థబోధకము కావలెను.

ఉపసర్గతత్త్వ మీా విధమున నున్నది. ఉపసర్గములు ప్రాతిపదికార్థములో కూడుకొనినవై స్వార్థమునందు ధాత్వర్థమున కుపరంజన మిచ్చి యర్థనిర్ణాయకము లగును. ఉపసర్గశబ్దార్థ వివేచనమున కభినవ భారతి యిట్లు నిరూపించుచున్నది. "ధాత్వర్థానుపసృజన్తి = ఉపరాగేణాన్యాదృశాన్ కుర్వంతి। తేనోపకారేణ ప్రాతిపదికార్థస్య యుక్తసంబంధేన ప్రకరోతీతి హి శబ్దః। ప్రకర్ష ప్రాతిపదికార్థోపరాగేణ వా ధాత్వర్థం విచిత్రం కరోతి। యద్వా తు స్వార్థే ధాత్వర్థానుపసృజన్తి అతః ఉపసర్గాన్ ప్రాతిపదికార్థే చ యుక్త్వా ఉపసర్గాః" ప్రాద్యుపసర్గములు ధాత్వర్థమున కుపరంజనమిచ్చి యుపసర్జనమిచ్చి యర్థవిశేషము నభివ్యంజన మొనరింపగలవు. ఉపసర్గసంబంధము వలన ధాత్వర్థ మన్యాదృశమగును. వాని నన్యాదృశము మొనరించు శక్తి

యుపసర్గములగు కలదు. ఇట్టి యుపస్కృతిచే ప్రాతిపదికార్థమునకు యుక్తసంబంధమున ప్రకర్షము కలుగును. అట్టి ప్రకర్షాపాదక ముపసర్గ మని భావము. వేరొక విధమునగూడ ఉపసర్గత్త్వము నిరూపింప వచ్చును. ఉపసర్గము ప్రకర్షకల ప్రాతిపదికార్థము యొక్క యుపరాగ మున ధాత్వర్థమును విచిత్ర మొనరింప గలదు. ఇట్లుపసర్గము ధాత్వర్థ వైచిత్ర్యాపాదకము. ఇంక నుపసర్గములు స్వార్థమునందు ధాత్వర్థముల నుపసృక్తములనుగా జేయును. స్వోపసృక్తము లయిన ప్రాతిపదికార్థము లందును ధాత్వర్థములను కూడుకొనునట్లు చేయగలవు. "ప్రాచార్యః, ప్రాన్తేవాసీ" పదములు ప్రాతిపదికార్థయుక్తిచే ప్రకృష్టత నుద్బో ధించునవిగా నున్నవి. ప్రపచతి, ప్రపఠతి పదములు ధాతుయుక్తి ననుసరించి ప్రకర్షద్యోతకములుగా నున్నవి. ఆ యా యుక్త్యాశ్రయ ములుగా నున్ననే వీని రమ్యత స్పష్టమగును. అయుక్త్యాశ్రయమున పాదపూరణార్థములై రమ్యముగ నుండవు. ప్రకర్షద్యోతనము లేక పోయినచో నివి శోభావహములు కాజాలవు. అట్టి ద్యోతనమున్నచో వాక్యమలంకృతము కాగలదు. "మిలతి న ఖలుయస్యాః" అను స్థల మున ఖలు శబ్దము ప్రయాసమకృతార్థమగుటను వ్యక్తము చేయు చున్నది. ప్రాతిపదికార్థయోగమున స్వార్థమునందు ధాత్వర్థము నాయోజన మొనరించు నుప సర్గలయొక్క సంస్కారము రమ్యము.

నిపాతల స్వరూప మిట్లున్నది. 'చాదయోఽసత్త్వే' యని వ్యాకరణసూత్రము. అద్రవ్యవాచకములయిన చాదులు నిపాతములు. అట్టినిపాతములు ప్రాతిపదికార్థయోగము వలన ధాతుచ్ఛందోనిరుక్త యుక్తి ననుసరించియు పదమునందు నిపాతము పొందియుండును గావున నిపాతములన్న సంజ్ఞ కలవయినవి. ద్యోతితార్థమును గూడ నిపాత ములు కొన్ని స్థలములందు స్ఫుటీకరించుట కలదు. ఛందస్సంబంధమున గూడ నిపాతములు పదనిపాతము పొందినవై యర్థద్యోతన మొనరింప గలవు. "అహో బతాసి స్పృహణీయవీర్యః" ఈ పద్యపాదము నందున్న నిపాతములు ప్రాతిపదికార్థోపనిపాతములు పొందినవై విశిష్టార్థజ్ఞాప కము లగుచున్నవి. ప్రత్యయ మనునది ప్రకృతిప్రత్యయవిభాగమున గోచరమయినదై ప్రకర్షసంయోగమున భాసించును. సత్త్వము

తత్త్వము నిరూపించును. విభక్తి కారకపూరణ మొనరించును. తద్ధిత ములు ప్రకృతిప్రత్యయ విభాగసంయోగసత్త్వవచనములందు సముచి తము లయిన యర్థములను పూరించునవి యగును. "తస్మై ప్రాతిపది కార్థాయ హితః స్వప్రాతిపదికార్థం చ యస్య వా స్వాత్మీకురుతే యతః ప్రత్యయాది విభాగావయవః" తస్మై హితః తద్ధితః, ప్రాతిపదికార్థము నకు హితమగునది కావున తద్ధితము స్వాత్మీకరించు కొనును. ప్రాతిపది కార్థమునకై స్వస్వరూపార్పణము చేయును. ప్రకృతిప్రత్యయాది విభాగావయవములు కలవై కావ్యమునందు సంప్రయోగప్రయోజన మును తద్ధితములు సంపాదింపగలవు. చాన్ద్రీజ్యోత్స్న యనుట సంపూర్ణ చంద్రప్రకృతిగత మయిన విశిష్టతను సూచించును. మూల కారికలో నున్న ప్రకృతి, ప్రత్యయము, విభాగము, సంయోగము, సత్త్వము, వచనము అనునవి యున్నియు నైన్ద్రాదివ్యాకరణములందు సూచితములయిన సాంకేతిక విశేషములు. విభక్తులు ఏకత్వవిశిష్టమగు దాని యర్థమును బహుత్వవిశిష్టములగు దాని యర్థమును విభజించి నిరూపింపగలవు. ధాతుగత లింగగత పదగత విశేషములను విశద మొనర్పగలవు. "ఏకస్య బహూనాం" యని యనుట ద్విత్వవిశిష్టమునకు నుపలక్షణము. సమాప్తిప్రాప్తమయిన యొక పదముయొక్క యర్థము నేని విభక్తి విభజ్య ప్రదర్శించును. ద్విత్వవిశిష్టార్థము వివేచించును. ప్రాప్తసమాప్తికము లయిన బహుపదముల యర్థమును నిరూపించును. ఈ విభక్తిప్రత్యయము ధాతుసంబంధియై యుండుటయు లింగ సంబంధియై యుండుటయు నున్నది. సంధియనునది విశిష్టస్వరముల విశిష్టవ్యంజనముల సంబంధసూచకమై సంధానము సంపాదించును. సంధి వర్ణపదక్రమసిద్ధమై పదైకయోగమునను వర్ణయోగమునను సంధానము కూర్చును. అనేకపదము లేకపదముగా సంధానముపొందుట సమాసము. సమాసములో కూర్పుపొందిన పదముల విభక్తులు లోపించును. అందున్న నామపదములు నియతప్రత్యేకార్థము కల వయినను నేకార్థసమన్వయము పొంది యుండును. సమాసము తత్పురుషాదిభేదములు ననేకవిధములు నున్నది. ఇట్టి యీ విశేషము లీ సకలవాదిశాస్త్రములందు విశదముగా నిరూపితము లయినవి.

చూర్ణ పదాదులు.

వీస్తృత వ్యంజనార్థయుక్తము లయిన యీ శబ్దవిధానములతో పదబంధములను నిబద్ధబంధములను చూర్ణబంధములను నిరూపింప వలెను. పదబంధమని యనుట యేకపదమని భావము. పదబంధమున పదసంహితను భావింపనక్కఱలేదు. "విభక్త్యంతం పదం జ్ఞేయం" విభక్తికలది పదము. సుబంతము పదము. తిజంతము పదము. నిబద్ధ బంధము లనునవి ఛందోవిధి ననుసరించి బద్ధములైన పద్యబంధములు. ఇవి సంఘట్టనాత్మకములు. నిబద్ధముగు పదసమూహము చూర్ణము. పరిమితవక్తవ్య మయిన చూర్ణపద లక్షణమును ఇతరలక్షణము నిట్లు గుర్తించునది.

౪౩౦. అనిబద్ధపదం ఛందస్తథా చానియతాక్షరం
అర్థాపేక్ష్యక్షరన్యూతం జ్ఞేయం చూర్ణపదం బుధైః
౪౩౧. నిబద్ధాక్షరసంయుక్తం యతిచ్ఛేదసమన్వితం
నిబద్ధం తు పదం జ్ఞేయం ప్రమాణనియతాత్మకం
౪౩౨. ఏవం నానార్థసంయుక్తైః పాదైర్వర్ణవిభూషితైః
చతుర్భిస్తు భవేద్యుక్తం ఛందో వృత్తాభిధానవత్

౧ చూర్ణపద లక్షణ మిట్లుండును. ఇది యనిబద్ధ పదము. అనియతాక్షరము అర్థాపేక్ష్యక్షర యుక్తము. చూర్ణపదమునందు యతివిరామ ముండదు. అక్షరసంఖ్యానియమ ముండదు. గురులఘు నివేశనియమ ముండదు. యథేష్ట గురులాఘవముతో నుండును. శృంగారవీరాద్యర్థాపేక్షము లయిన యక్షరములు పరిమితముగగాని యపరిమితముగ గాని యుండును. అసమాస సంఘటనము కాని ససమాస సంఘటనము కాని యుండును. ఇట్లుండుట కేవలము పఠన కర్మానుకూలము. దీనికే గద్య మని వ్యవహారము కలదు.

౨ నిబద్ధపదలక్షణ మిట్లుండును. ఇది నిబద్ధాక్షరములతో నుండును. యతిచ్ఛేద సమన్వితమై యుండును. ప్రమాణనియతాత్మక ముగ నుండును. యతినియమ మున్నది. అక్షరసంఖ్యానియమ మున్నది. గురులఘు నివేశనియమ మున్నది. నానార్థ సంయుక్తములు వర్ణవిభూ షితము లయిన నాలుగు పాదములతో నది కూడియుండును. ఇట్లుండు నీ నిబద్ధపదము పద్యసంజ్ఞతో నున్నది. ఛందోవృత్తము పేరుతో నిది యుండును.

## ఛందోవిచితి.

నియతపాదములతోఁ గూడుకొనిన యివి యిరువదియారు ఛందోవిశేషములతో నున్నవి. ఛందోవృత్తము సమవృత్తమని యర్థసమవృత్తమని విషమవృత్తమని సంగ్రహముగా త్రివిధముగా నున్నది. నానావృత్త వినిష్పన్నమయిన యీ ఛందము శబ్దమునకు శరీరమని ప్రఖ్యాత మయినది. "నానావృత్త వినిష్పన్నా శబ్దస్యైషా తనుః స్మృతా" పద్యము ప్రమాణనియతమనుట సంగతవచనము. ఇందు ప్రమాణమనునది శ్రోత్రేంద్రియము. శ్రోత్రేంద్రియనియత మయిన యాత్మ యిందున్నది. కావున నిది శ్రవ్యమని భావము. పద్యము పాదములందు నియతమై యుండును. గద్యము నిగదనీయమయినను విశేష సంజ్ఞతో వ్యపదేశము కలదయినది.

౪౪౩. ఛందోహీనో న శబ్దోఽస్తి న చ్ఛందశ్శబ్దవర్జితం
ఏవం తూభయసంయోగో నాట్యస్యోద్ద్యోతకః స్మృతః

ఛందోహీనమగు శబ్దములేదు. శబ్దవర్జితమగు ఛందముండదు. ఈ రెండిటి సంయోగమె నాట్యమున కుద్ద్యోతకమని సంభావించిరి. వివిధవర్ణాలంకారములు కల నాల్గు పాదములతోఁ సంబంధము కల ఛందము లిరువదియారు కలవు. ఏకాక్షరము మొదలు కొని షడ్వింశత్యక్షరపర్యంతము ఉక్తాఛందము మొదలు ఉత్కృతిచ్ఛందము వఱకు ఛందస్సుల గణన మున్నది. పాదచతుష్టయమునందు సమాన లక్షణసంబంధమున్నచో సమవృత్తమని, అతుల్యలక్షణమున్నచో విషమవృత్తమని, ప్రథమతృతీయములు ద్వితీయచతుర్థములు సమలక్షణములతో నున్నచో నర్ధసమవృత్తమని సంజ్ఞావ్యవహారమున్నది. ఈ ఛందముల పేరుల నిట్లు గుర్తించునది.

### అక్షరసంఖ్య — ఛందోనామ

| | | | |
|---|---|---|---|
| ౧ ఉక్తము | ౨ అత్యుక్తము | ౩ మధ్యము | ౪ ప్రతిష్ఠ |
| ౫ సుప్రతిష్ఠ | ౬ గాయత్రి | ౭ ఉష్ణిక్ | ౮ అనుష్టుభ్ |
| ౯ బృహతి | ౧౦ పంక్తి | ౧౧ త్రిష్టుభ్ | ౧౨ జగతి |
| ౧౩ అతిజగతి | ౧౪ శక్వరి | ౧౫ అతిశక్వరి | ౧౬ అష్టి |
| ౧౭ అత్యష్టి | ౧౮ ధృతి | ౧౯ అతిధృతి | ౨౦ కృతి |
| ౨౧ ప్రకృతి | ౨౨ ఆకృతి | ౨౩ వికృతి | ౨౪ సంకృతి |
| ౨౫ అభికృతి | ౨౬ ఉత్కృతి | — | — |

ఇరువదియారక్షరముల కన్న నధికాక్షరములతో నుండు ఛందమునకు మాలావృత్తమని పేరు. ఈ ఛందోభేదము లన్నియు ప్రస్తారయోగమున గలుగును. "ప్రస్తారే యోగో యుక్తిః" ప్రస్తారమున నుండు సంబంధమున నివి గలుగును. ఇట్లు ప్రస్తారభేదమున గలుగు వృత్తము లసంఖ్యేయప్రమాణములతో నున్నవి. షడక్షరనియమముకల గాయత్రీఛందఃప్రభృతిగా ప్రమాణము సంకేతించుట గుర్తించుట యుక్తము. గాయత్రీసమారంభముగనె ప్రయోగార్హత యున్నది. ఉక్త్యాదు లశ్రవములయినందున వాని పరిగణన మసుందరము. సర్వచ్ఛందములు ప్రయోగజన్యములుగా భాసించుట సామాన్యముగా నుండదు. అన్నిటిని ప్రయోగమున ప్రదర్శించుట యుక్తముకాదు. శక్యము కాదు. అన్నియు లక్ష్యస్థితములు కాజాలవు. వేదమునవలె నివి యవభాసించును. గాయత్రీప్రభృతిగా ప్రమాణమిట్లున్నది. ఏ ఛందమునం దే విధముగ వృత్తములు కలుగునో యీ పట్టిక సూచించును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౬ | గాయత్రి | ౬౪ | ౭ | ఉష్ణిక్ | ౧౨౮ |
| ౮ | అనుష్టుప్ | ౨౫౬ | ౯ | బృహతి | ౫౧౨ |
| ౧౦ | పంక్తి | ౧౦౨౪ | ౧౧ | త్రిష్టుప్ | ౨౦౪౮ |
| ౧౨ | జగతి | ౪౦౯౬ | ౧౩ | అతిజగతి | ౮౧౯౨ |
| ౧౪ | శక్వరి | ౧౬౩౮౪ | ౧౫ | అతిశక్వరి | ౩౨౭౬౮ |
| ౧౬ | అష్టి | ౬౫౫౩౬ | ౧౭ | అత్యష్టి | ౧౩౧౦౭౨ |
| ౧౮ | ధృతి | ౨౬౨౧౪౪ | ౧౯ | అతిధృతి | ౫౨౪౨౮౮ |
| ౨౦ | కృతి | ౧౦౪౮౫౭౬ | ౨౧ | ప్రకృతి | ౨౦౯౭౧౫౨ |
| ౨౨ | ఆకృతి | ౪౧౯౪౩౦౪ | ౨౩ | వికృతి | ౮౩౮౮౬౦౮ |
| ౨౪ | సంకృతి | ౧౬౭౭౭౨౧౬ | ౨౫ | అభికృతి | ౩౩౫౫౪౪౩౨ |
| ౨౬ | ఉత్కృతి | ౬౭౧౦౮౮౬౪ | | | |

వృత్తసంఖ్యా విచక్షణులు వీని నీ విధముగా నిర్దేశింపవలెను. సర్వచ్ఛందములలో సంజాతము లయిన వృత్తముల నన్నిటిని పరిగణించినచో; ౧ ౩, ౪ ౨, ౧ ౭, ౭ ౨ ౬

నీ సంఖ్య సిద్ధమగును. వృత్తసంఖ్యా విచక్షణు లగువా రుక్త్యాద్యుత్కృతి సంజాతము లయిన వృత్తముల నీ వికల్పానుసారమున

నిర్దేశించుట యుక్తము. గణనాయుక్తి ననుసరించి సమవృత్తము లన్నియు నిట్లు విశిష్టము లయినవి.

## గణనియతి

సర్వచ్ఛందములకును మూడు మూడక్షరములతో వృత్తము నిర్దేశింపవలెను. ఈ యక్షరత్రయమునకు త్రికమని గణమని వ్యవహార మున పేరులున్నవి. ఇట్టి త్రికము లెనిమిది కలవు. త్రికమను నంశము మూడక్షరములతో నుండును. సర్వవృత్తములందును నిత్యము గురులఘ్వక్షరకృతముగా వ్యవహారమున్నది. గురులఘు సంకేతము ప్రసిద్ధము.

౭౭౪. గురుపూర్వో భ కారః స్యాన్మకారన్య గురుత్రయం
జకారో గురుమధ్యస్తు సకారోన్తగురుస్తథా
౭౭౫. లఘుమధ్యస్తు రేఫః స్యాత్తకారోన్తలఘుస్తథా
లఘుపూర్వో యకారస్తు నకారస్తు లఘుత్రయం

| | | | |
|---|---|---|---|
| ऽ।। | భకారము గురుపూర్వము | ऽऽऽ | మకారము గురుత్రయము |
| ।ऽ। | జకారము గురుమధ్యము | ।।ऽ | సకారము అన్తగురువు |
| ऽ।ऽ | రగణము లఘుమధ్యము | ऽऽ। | తకారము అన్తలఘువు |
| ।ऽऽ | యకారము లఘుపూర్వము | ।।। | నకారము లఘుత్రయము |

ఈ యెనిమిది త్రికములు బ్రహ్మసంభవములు. వేద సంభూత ములు. ఛందోమానానుసారమున వీనినుండి జాతులు వెలువడినవి. గాయత్రీ ప్రభృతికముగా వీనికి ప్రమాణ ప్రవృత్తి యున్నది. గాయత్రీ పూర్వాతనములకు సామాన్యముగా ప్రయోగసంపద యుండదు. గాయత్రిలో రెండు త్రికము లుండును. బృహతిలో మూడు త్రిక ములు కలవు. జగతి చతుస్త్రిక అతిశక్వరి పంచత్రిక ధృతి షట్త్రిక. ప్రకృతిలో నేడు త్రికములు. సంకృతిలో నెనిమిది త్రికములు. ఒకటి రెండక్షరము లధికముగా శిష్టములను గుర్తించునది. షట్ప్రత్యయము లన్న ప్రసిద్ధి పొందిన ఛందః ప్రక్రియాది శేషముల వలన సిద్ధములయిన యర్థములను ముని భరతు డిందు నిర్దేశించినాడు. త్రిక సంకేత నిర్దేశ మున జయదేవు డిట్లు సూత్రము నిరూపించినాడు.

"సర్వాదిమధ్యాన్తగ్లౌ త్రికా మ్నౌ భ్యౌ జ్రౌ స్తౌ —

సర్వగము మ. సర్వలము న. ఆదిగము భ. ఆదిలము య. మధ్యగ జ. మధ్యల ర. అంతగ స. అంతల త. వృత్తము త్రికోప లక్షిత మయినను త్రికసంఖ్యానముననె ఛందఃపూరణ ముండదు. ఇతరములం దొకటి రెండక్షరము లధికముగా నుండుట సుగ్రహమె. కావున గురులఘురూపముననె త్రికబీజములను నిర్దేశింపవలెను. స్వరాట్- విరాట్- భురుక్- నివృత్ అనునవి వేదమునందున్న కొన్ని ఛందోవిధానములు. అవి కావ్యమున సంభవింపవు. కావ్యము లందు నివి కలవని కొందరనిరి. పాదములందు నియతములయిన గురు లఘ్వక్షరములకన్న నధికముగా నక్షరము లున్నచో స్వరాట్టని సంకేతము. హీనాక్షర మయినచో విరాట్టని సంకేతము. మూడు పాదము లొకవిధముగను ఒకపాదము వేరొకవిధముగ నున్నచో భురుక్కగును. పాదత్రయ మొకవిధముగా నుండగా వేరొకపాద మక్షరన్యూనమయినచో నివృత్తగును. ఇట్టివిశేషములు శ్రుతులలో సంగతములై కనిపించుచున్నవి. అయిన నిచటనిరూపించుట యనా వశ్యకము కాదు. వేదవాక్యసదృశ వాక్యనిర్మాణ మొనరింపవలసి యున్న స్థలమున నిది యుపయోగించును. అభిజ్ఞానశాకుంతలమునం దిట్టి రచనముండుట యభ్యూహ్యము.

## సంపదాదులు.

ఛందములకు సంబంధించిన సంపదాదులు కొన్ని కలవు. ఆ సంపదాదుల నిర్దేశించుట యుక్తము.

౪౪౬. సమ్పద్విరామ పాదశ్చ దేవతాస్థాన మక్షరం
వర్ణః స్వరో విధిర్వృత్తమితి ఛందోగతో విధిః

౪౪౭. నైవాతిరిక్తం హీనం వా యత్ర సంపద్యతేఽక్షరం
విధానే ఛందసామేషా సంపదిత్యభిసంజ్ఞితా

౪౪౮. యత్రార్ధస్య సమాప్తిః స్యాత్స విరామ ఇతి స్మృతః
పాదశ్చ పద్యతేర్ధాతోశ్చతుర్భాగః ప్రకీర్తితః

౪౪౯. అగ్న్యాదిదైవతం ప్రోక్తం స్థానం ద్వివిధ ముచ్యతే
శరీరాశ్రయసంభూతం దిగాశ్రయమథాపి వా

౪౫౦. హ్రస్వం దీర్ఘం ప్లుతం చైవ త్రివిధం చాక్షరం స్మృతం
శ్వేతాదయస్తథా వర్ణా విజ్ఞేయాశ్ఛందసామిహ

౫౮౧. తారశ్చైవ హి మన్ద్రశ్చ మధ్యమశ్చ త్రిధా స్వరః
విధిగ్గణకృతశ్చైవ తథా చార్థకృతోపి చ
౫౮౨. వృత్తమర్థసమం చైవ సమం విషమమేవ చ
సర్వేషామేవ వృత్తానాం తద్జ్ఞై ర్జ్ఞేయా గణాస్త్రికాః

సంపత్, విరామము, పాదము, దేవత, స్థానము, అక్షరము, వర్ణము, స్వరము, విధి, వృత్తము అను నీ దశకము ఛందోగతమయిన విధి. వీని స్వరూప మిట్లున్నది. ఛందోవిధానమున నక్షర మతిరిక్తము హీనము కాకున్నచో సంపదభిసంజ్ఞ కలుగును. అర్థమునకు సమాప్తి యుండు నేని యది విరామసంజ్ఞ కలదగును. ఇచటి యర్థసమాప్తి యనునది యవాంతర రూపార్థమునకు ఛందోలక్షణ సిద్ధమయిన యతి యని గుర్తింపవలెను. అట్టి యర్థవిరామమె విరామము. అట్టి విరామా భావము రుచిరము కాదు.

జంభారాతీభకుంభోద్భవమిహ దధతః సాంద్రసిందూరరేణుం
రక్తాః సిక్తా ఇవౌఘైరుదయగిరితటీధాతుధారాద్రవస్య
ఆయాంత్యా తుల్యకాలం కమలవనరుచేవారుణా వో విభూత్యై
భూయాసుర్భాసయంతో భువనమభినవా భానవో భానవీయాః

ఈ పద్యమునందు "ఆయాంత్యా తుల్యకాలం" లక్షణ యతి సంగతముగా నున్నది. "జమ్భారాతీభకుంభోద్భవం" లక్షణయతి యుక్తముగ లేదు. ఉచ్ఛబ్దమున నర్థసమాప్తి లేదు. గమనార్థక మయిన పద్ ధాతువు వలన పాదపదము వ్యుత్పన్నమయినది. పద్యము నందలి నాల్గవభాగమునకు పాదమని పేరు. చతుర్భాగాత్మకమయిన పాదముయొక్క యంతమునందు విరామాత్మకచ్ఛేదముండుట యావశ్యము. అట్లు యతివిరామము లేకపోయినచో దుఃశ్రవ మగును. ప్రయోగ మొనరించు నాతడు పాదపాద మంకుర మొనరించుచు పఠించునప్పుడు మధ్యలో విశ్రామముండుట యుక్తము.

తాంబూలవల్లీ పరిణద్ధ పూగాస్వేలాలతాలింగిత చందనాసు
తమాలపత్రాస్తరణాసు రంతుం ప్రసీద శశ్వన్మలయస్థలీషు

కాళిదాసరఘువంశగతమయిన యీ శ్లోకమున ప్రథమపాదాంతమునందు యతివిరామము లేదు. విశ్రాంతి యుండు నేని వృత్తభంగ మర్థభంగము కలుగును. ద్వితీయచతుర్థపాదముల చివరనున్న లఘు విచ్ఛానుసారమున గురువగుట భట్టశంక కాదు లామోదించిరి. అది

శ్రావ్యమె కావున సంగతము కాగలదు. పద్యచతుర్భాగాంతమున విరామముండుట యుక్తము.

ఛందోధిష్ఠానముగా నగ్న్యాదిదైవత ముండును. అధిష్ఠాత్రి దేవత యిందు దేవత. స్థానము శరీరాశ్రయ సంభూతమని దిగాశ్రయమని ద్వివిధముగ నున్నది. ఛందశ్శరీరము నాశ్రయించి స్థానముండుటను కాత్యాయనాదులును భావించిరి. వీరుని భుజదండముల వర్ణనమున స్రగ్ధరావృత్తము, నాయికా వర్ణనమున వసంతతిలకాదికము, ప్రాచ్యులలో శార్దూలలీల, దక్షిణమున మందాక్రాంత యుక్తమగును. ఇట్లి యితరము లందును పరిగ్రాహ్యము. అక్షరము హ్రస్వదీర్ఘప్లుత భేదమున త్రివిధము నాట్యప్రయోగమునందు ప్లుతమునకును ప్రయోగముండును. పద్యగతమయిన స్వరము నూది పలుకుటలో ప్లుతధర్మము కూర్పవలెను. ప్రయోక్త పఠించునప్పుడు దీర్ఘముగా పఠింప వలెను. త్రిమాత్రముగా నుచ్చరింపవలెను. ఛందములకు శ్వేతాదివర్ణములు కలవు. ప్రాతిశాఖ్యాదులలో వివిధవర్ణములు నిర్దిష్టము లయినవి. వాని యుపయోగ మంతగా కానరాదు. తార మంద్ర మధ్యమ రూపముగా స్వరము మూడు విధములు. ధ్రువా విధానమునం దీ విషయము విశదము కాగలదు. విధి గణకృత మర్థకృతమని రెండువిధముల నున్నది. వృత్త మర్ధసమము సమము విషమము నని మూడువిధములు.

౪౮౩. సర్వేషామేవ వృత్తానాం తజ్జ్ఞైర్జ్ఞేయా గణాస్త్రికాః

దివ్యో దివ్యేతరశ్చైవ దివ్యమానుష ఏవ చ

సర్వవృత్తములకు సంబంధించి మూడు విధముల గణముల విభాగమున్నది. దివ్యగణము దివ్యమానుష గణము నని. గాయత్రి ఉష్ణిక్ అనుష్టుప్ బృహతిపంక్తి త్రిష్టుప్ జగతి అను నేడును దివ్యగణము. ఇది ప్రథమగణము. స్తోత్రశాస్త్రములందు ఈ సప్తచ్ఛందస్సులకె బాహుల్యమున నిదర్శన మున్నది. దేవస్తుత్యాదులలో దేవతలు వక్తలుగా నుండగా నీ గణము నిర్దిష్ట మయినది. అతిజగతి, శక్వరి అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి అను నేడును దివ్యేతర మయిన ద్వితీయగణము. మానవులు వక్తలై యుండగా సామాన్యముగా నీ గణవ్యవహారమున్నది. కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి,

సంకృతి, అభికృతి, ఉత్కృతి అను నేడును దివ్యమానుష గణము. ఇది తృతీయగణము. దివ్యమానుషు లయిన రామాదులు నరపతులు వక్తలుగా నుండగా నీ తృతీయగణ వ్యవహార మున్నది.

ఈ ఛందముల కన్నిటికి ప్రస్తారవిధి సంశ్రయమయిన లక్షణము కలదు. నష్ట ముద్దిష్టము ప్రస్తార మక్షరనిర్దిష్టము మాత్రోక్త మను విధానములు కలవు. వాని లక్షణవిశేషము లితరగ్రంథములందు విశదముగ నున్నవి. ఆర్యాచ్ఛందములకు చతుర్మాత్రాప్రస్తారము గీతకాదులకు పంచమాత్రము వైతాలీయము పురస్కరించుకొని షణ్మాత్రవ్యవహారము కలదు. మ్యాదక్షరములు కల త్రికములు లఘు గుర్వక్షరాన్వితములు, మాత్రాగణవిభాగము గురులఘ్వక్షరాశ్రయ ముగా నుండును. ఈ నిరూపితములయిన ఛందములను పరిశీలించి వీనిని నాట్యమునందు యథోచితముగ ప్రయోగింపవలెను. ఈ వ్యాకృతవిభాగానుసారముగా లక్ష్యములందు నివేశింపజేసి కవి యుప నిబంధించుట యుక్తము.

వృత్తవర్తనము

వృత్తములన్నియు శ్రోత్రరసాయనములు. ఛందఃప్రభవము లయిన వృత్తముల వర్తనము నిరూపించుట యావశ్యకము. ఛందో వృత్తము పరశివుని వాఙ్మయరూపము. అక్షరనివేశన మావశ్యక మగుట యిదివరలో నిరూపితము. అక్షరసన్నివేశమున కొన్నిట శ్రవ్యతాకృతమయిన విశేషమున్నది. వృత్తవర్తనముల నన్నిటను శ్రవ్యతా కృతమయిన విచ్ఛిత్తికలదు. అట్టి శ్రవ్యతాకృతమయిన ప్రవిభాగము నిరూపించుటకై వృత్తవర్తనోపక్రమ మావశ్యకము.

౫౮౪. ఛందాస్యేవం హి యానీహ మయోక్తాని ద్విజోత్తమాః
వృత్తాని తేషు నాట్యేస్మిన్ప్రయోజ్యాని నిబోధత

ద్విజోత్తమాః! యని సంబోధించి పలుకుట సావధానతా సూచకము. పూర్వప్రఘట్టమున ఛందోవిశేషములు నిరూపితము లయినవి. ఆ ఛందములందు వృత్తములు కలవు. అవి సంఖ్యాతము లయినవి. ఆ వృత్తముల నీనాట్యమునందు ప్రయోగింపవలెను. వాని కెల్లు ప్రయోగయోగ్యత కలదు. పదమూడుకోట్లకు పైగానున్న వృత్తముల నన్నిటిని నామసంకేతమున నిర్దేశించుట శక్యముకాదు.

నాట్యప్రయోగయోగ్యములయిన ఛందోవృత్తముల నిరూపణ నిబోధన మావశ్యము. గురులఘునియమవిశేషమున శ్రవ్యత కలుగును. "శ్రవ్యతా వర్తతే యేషు తాని వృత్తాని. అధికరణే క్తః" శ్రవ్యత యున్నందున నివి వృత్తము లనదగియున్నవి. అధికరణార్ధమందు క్త ప్రత్యయము రాగా 'వృత్త' పదము నిష్పన్నమయినది. వృత్తములందు శ్రావ్యార్ధసంపద యున్నది.

వృత్తలక్షణ నిరూపణము వర్ణత్రికసంబంధము కల మకారాది గణములతో నుండుటయు, గురులఘు నియమముతో నుండుటయు కలదు. అత్యంతప్రాచీనులు గురులఘు సంఖ్యానముననె లక్షణము చెప్పిరి. కాని, త్రికములతో నిరూపింపలేదు. ఎట్లు నిరూపించినను లక్షణసిద్ధి యేకవిధమె యయినను ప్రస్తారవిధి సమాశ్రయ మయిన రీతి గురులఘు సంఖ్యానరీతిని సూచన మొనరించుట స్పష్టము. త్రిక సంఖ్యానమున లాఘవమున్న దనుట యవిస్మార్యము. భరతమునికృత మన్న వ్యవహారమున కొందరు మకారాది త్రికములతో లక్షణము స్వీకరించిరి. అటు నిటు పాఠము గోచరించుటచే మధ్యే మధ్యే చింతనమునకై యన్నిటి నిరూపణ మావశ్యకమని యభినవభావము.

"గాయత్రీత ఆరభ్య ప్రయోగార్హా తా" గాయత్రీ సమారంభముగా ఛందములకు ప్రయోగార్హత కలదని నిరూపితము.

౩౧౫. ఆద్యే పునరంత్యే ద్వే ద్వే గురుణీ చేత్
సా స్యాత్తనుమధ్యా గాయత్రీ సముత్థా
౩౧౬. లఘుగణ ఆదౌ భవతి చతుష్కః
గురుయుగమంత్యే మకర కశీర్షా
౩౧౭. ఏకమాత్రం షట్కే స్యాత్ ద్వితీయం పాదే
ఖ్యాతరూపా వృత్తే మాలినీ సా నామ్నా
౩౧౮. ద్వితీయం పంచమం చైవ లఘు యత్ర ప్రతిష్ఠితం
శేషాణి చ గురూణి స్యుర్మాలతీనామ సా
౩౧౯. ద్వితీయం చ చతుర్థం చ పంచమం చ యదా లఘు
యస్యాస్సప్తాక్షరే పాదే జ్ఞేయా సా తూద్ధతా యథా

ఈ యయిదు నయిదువృత్తముల లక్షణములు. వీనిలో క్రమనుగా తనుమధ్యా- మకరశీర్ష- మాలిని- మాలతి ఉద్ధత, యను వృత్తపంచక మున్నది. వీని లక్ష్యములను ముని సూచించినాడు. ఈ

ప్రఘట్టమున నేబదికి పైగా వృత్తముల లక్షణములు లక్ష్యములు నున్నవి. ఇందలివృత్తనామములన్నియు ప్రసిద్ధములని ఖ్యాతరూపము లని శ్లాఘనీయములని వృత్తవిదులు భావింతురు. లక్షణనిరూపణ రూప మునినిర్దేశించుటకై యీ యంశము నిచట నుల్లిఖితము లయినవి. లక్షణము లన్నియు గురులఘుసంకేతములతో నున్నవి. కొన్ని మాత్రికములతో నున్నవి. ఇందు నిరూపితము లయిన వృత్తనామ ముల నర్వాచీను లన్యనామములతో వ్యవహరించిరి. ఇందలి నామ ముల సంకేతసౌందర్యము గుర్తించుట యుక్తము.

భ్రమరమాల- సిద్ధలేఖ- మత్తచేష్టిత- విద్యున్మాల- చిత్త విలాసిత- మధుకరి- ఉత్పలమాల- శిఖసారిణి- దోధక- మోటక- ఇంద్రవజ్ర- ఉపేంద్రవజ్ర- రథోద్ధత- స్వాగత- శాలిని- తోటక- కుముదప్రభ- కుముదనిభ- చంద్రలేఖ- ప్రమితాక్షర- వంశస్థ- హరిణ ప్లుత- కామదత్త- అప్రమేయ- పద్మిని- పుటవృత్త- ప్రభావతి- ప్రహర్షిణి- మత్తమయూర- వసంత తిలక- అసంబాధ- శరభ- నాంది ముఖి- మత్తేభలలిత- ప్రవరలలిత- శిఖరిణి- వృషభచేష్టిత- హరిణి- శ్రీధర- వంశపత్రపతిత- విలంబితగతి- చిత్రలేఖ- శార్దూలవిక్రీడిత- సువదన- స్రగ్ధర- మద్రక- అశ్వలలిత- మేఘమాల- క్రౌంచపాది- భుజంగవిజృంభిత- నామములతో నున్న వృత్తము లిందున్నవి. వీని గమనము శ్రుతిరమ్యమని నాట్యప్రయోగసముచితమని గుర్తింప వలెను. ఇంకను శ్రవణసుభగములయిన వృత్తములుండును. అవి శ్రవ్యకావ్యసముచితములు కావచ్చును. నాట్యకావ్యసముచితములు కాకపోవచ్చును. స్వరశ్రుతుల యారోహావరోహరీతి ఛందోవృత్తములం దనుగతమై యున్నప్పుడు నాట్యకావ్యప్రయోగము రమ్యముగ నుండును. శ్రవ్యకావ్యములందును సర్వవృత్తములు ప్రయోజ్యములు కాజాలవు. స్వభావరమ్యములయిన కతిపయవృత్తముల కట్టి యోగ్యత యున్నది. మహాకవులు కావ్యములం దట్టివానినె నిరూపించిరి. ముని నిరూపించిన నానావృత్తోదాహరణములు వనితావిశేషనిరూపణ పరములై యున్నవి. వాని యన్నిటియం దనుగతముగా నొక సుందర భావసూత్ర ముండుటను భావుకులు గుర్తింపవచ్చును. ఆ యా

వృత్తముల నానౌచిత్యము కూడియున్నట్లుదాహరణము లుజ్జ్వల శృంగారముతో నున్నవి. సమ్యగ్భావనము భావుకత్వమునకు నిదర్శనము.

ఈ సంకేతిత వృత్తములు సమవృత్తములు. నాలుగు పాదములు సమానలక్షణ సంబంధముతో నుండును. విషమార్ధ సమవృత్తముల లక్షణ మింతకన్న విలక్షణము. వాని సంఖ్యాన మసంఖ్యేయము.

౪౯౦. యత్ర పాదాస్తు విషమా నానావృత్తసముద్భవాః
గ్రథితాః పాదయోగేన తద్వృత్తం విషమం స్మృతం
౪౯౧. ద్వౌ సమౌ ద్వౌ చ విషమౌ వృత్తేఽర్ధవిషమే తథా
సర్వపాదైశ్చ విషమైర్వృత్తం విషమముచ్యతే
౪౯౨. పాదే సిద్ధే సమం సిద్ధం విషమం సార్వపాదికం
ద్వయోవర్ధసమం విద్యాదేష భేదస్తు పాదశః

నానావృత్త సముద్భవము లయిన పాదములు పాదపాదయోగమున విషమములుగా గ్రథితము లగునేని విషమ విన్యాస మగును. అర్ధవిషమ వృత్తమునందు రెండుపాదములు సమానలక్షణ సంబంధముతో నుండును. మిగులు రెండుపాదములు విషమములుగా నుండును. పాదము లన్నియు విషమములుగా నుండునేని విషమవృత్తమగును. రెండుపాదములు సమముగా నుండుట యనగా ప్రథమ తృతీయ పాదములు సమముగా నుండుట యని భావము. ద్వితీయ చతుర్థములుగాని యట్లుండవలయు నని భావము. రెండు విషమముగా నుండుట ప్రథమ ద్వితీయములు తృతీయచతుర్థములు విషమములుగా నుండుట యని భావము. ఇది వీప్సాగర్భమయిన వచనము. వృత్తమున పాదము సిద్ధమయిన సమమని సార్వపాదికమయిన సిద్ధత యుండునేని విషమమని రెండుపాదముల కట్టిరీతి యున్నచో నర్ధసమ మని పాదశః భేదమును గుర్తించునది. పాదవిభాగాత్మకమయిన భేదము ననుసరించి సమవృత్త వికల్పన మిట్లు భావించునది. సమవృత్త వికల్పన మనుట సమవృత్తములందు వికల్పితము లయిన చిత్రములగు భేదములు. విషమవృత్తముల లక్షణము త్రికగణములతో నిరూపితమయినది. ఈ విభాగమునందు పథ్యావృత్తము చపల విపుల నిరూపితము లయినవి. పథ్యా ప్రవృత్తిలో వివిధయోగము లుండుటయు సూచితము. ఈ ప్రసంగముననె వక్త్ర-వానవాసిక-కేతుమతి-అపరవక్త్ర-

పుష్పితాగ్ర-ఉద్గత-లలిత యనువృత్త లక్షణమును సూత్రితమయినది. ఇట్లు వీనిసంకేతము నాటకాదులందుపయోగి.

వృత్తప్రయోగము

౭౬౩. విషమేతాని వృత్తాని సమాని విషమాణి చ
నాటకాద్యేషు కావ్యేషు ప్రయోక్తవ్యాని సూరిభిః
౭౬౪. సంత్యన్యాన్యపి వృత్తాని యాన్యుక్తానీహ పిండశః
న చ తాని ప్రయోజ్యాని హతశోభాని తాని హి
౭౬౫. యాన్యత్ర ప్రతిషిద్ధాని గీతకే తాని యోజయేత్
ధ్రువాయోగే తు వక్ష్యామి తేషామేవ వికల్పనం

ఇట్టి సమవిషమవృత్తములను నాటకాదికావ్యములందు ఛందస్సూరులు వృత్తసూరులు ప్రయోగింపవలెను. తత్తత్సమయసముచిత తత్తద్వృత్తాయోజనము వలన రమ్యత నాధానించునది. 'విషమాణి చ లోని 'చ' కార మర్థసమప్రయోగమును సూచించును. నాటకాదులయిన దృశ్యకావ్యములందాయోజింప దగిన వృత్తములను, శ్రవ్యకావ్యములందాయోజింపదగిన వృత్తములను ప్రయోగరమ్యతానుకూలముగా సమయౌచిత్యము ననుసరించి సమీక్ష యొనరించి ప్రయోగింపవలెను. ఇట్టి సమీక్ష సూరిసాధ్యమని సూరిపదప్రయోగభావము. దృశ్యప్రయోజ్యములు. శ్రవ్యప్రయోజ్యములు కావని శ్రవ్యప్రయోజ్యములు దృశ్యప్రయోజ్యములు గారాదని మేమనుటలేదు. శ్రవ్యప్రయోజ్యములు కొన్ని దృశ్యప్రయోగార్హములు కావు. ఎట్టివట్లు కావో వాని గుర్తించుటలో సహృదయులె ప్రమాణము. పిండశః ప్రోక్తములయిన వృత్తములలో వేరువేరు వృత్తములు కలవు. వాని నన్నిటిని నాటకాదులందు ప్రయోగింపరాదు. ఆ వృత్తములు హతశోభము లగుటయె హేతువు. నాటకాదికావ్యములందవి ప్రతిషిద్ధములు. కాని గీతకములందు వానిని ప్రయోగింపవచ్చును. హతశోభములయినచో నవి ప్రయోజ్యము లెట్లగును? ఒకచో ప్రతిషిద్ధములకు మరియొకచో ప్రయోజ్యత కలుగునా? కలుగును. గీతకావ్యములందట్టివానికి ప్రయోజ్యత కలుగును. గీతము పాఠ్యమానము కాదు. గీతము గీయమానము. కావున గీతములందు వృత్తగతమయిన శ్రవ్యత యపేక్షితము కాదు. కేవలము తాలయోజనార్థమయిన మాత్రాసామ్యము వర్ణసామ్యమందవశ్యకర్తవ్యము. ఇట్టి నియమమె ఛానియం

డాశ్రితమగును. ధ్రువాయోగమునందు వాని వికల్పనమంతయు నిరూపితము కాగలదు. గీతకములం దుపయుక్తములగు వృత్తముల లోని స్వరముల యారోహావరోహకృతముగా స్వరశ్రుతిసందోహకృతముగా రక్తిప్రాధాన్యమపేక్షిత మగును. ఇందు తాలలయకల్పము నుపయోగియగును. కాకుస్వరసంయోజన వైశిష్ట్యము సహకారి యగును. అందుననె గీతికములం దట్టివానికి ప్రయోగము యుక్త మనుట యుక్తము.

వృత్తలక్షణ నిరూపణానంతరము పంచవిధార్యా నిరూపణము ప్రసంగప్రాప్త మయినందున ముని పథ్య, విపుల, చపల, ముఖచపల, జఘనచపల యను నార్యావృత్తముల స్వరూపలక్షణోదాహరణముల నిరూపించెను. తత్ప్రసంగముననె యార్యాభేదముల యతిమాత్రా వికల్పనమును వికల్పగుణసంశ్రయ మయిన లక్షణ నియమమును ప్రతిపాదించెను. ప్రస్తారయోగము ననుసరించి యార్యాబాహుల్య మును ప్రదర్శించుట నాసూత్రించెను.

౮౯౬. వృత్తైరేవం తు వివిధైర్నానాచ్ఛందస్సముద్భవైః
కావ్యబంధాస్తు కర్తవ్యాః షట్త్రింశల్లక్షణాన్వితాః

ఇందు ప్రకరణార్థోపసంహార మున్నది. భావివిషయ మాసూత్రించుట యున్నది. నానాచ్ఛందస్సముత్పన్నము లయిన వివిధవృత్తముల సమాశ్రయణమున కావ్యబంధములను షట్త్రింశల్లక్షణాన్వితముగ నొనర్పవలెను. ఇట్లే వివిధవృత్త పరిజ్ఞానము సంపాదింపవలయుట ప్రకరణోపసంహారము. లక్షణాన్వితముగా కావ్యబంధ నిర్మాణము భావ్యర్థాసూత్రణము.

"కావ్యబంధాస్తు కర్తవ్యాః షట్త్రింశల్లక్షణాన్వితాః"

యనుటలో నీ భావము గూఢముగ నున్నది. ప్రాసాదకుడ్యాదికము నిర్మింపవలసి యుండునేని మొదటగా తగిన భూమి సిద్ధపఱుపవలెను. అట్లె కావ్యము నిర్మింపవలసి యుండగా భూమికల్పముగా శబ్దచ్ఛందోవిధి యున్నది. క్షేత్ర పరిగ్రహముగా వృత్త సమాశ్రయ మున్నది. దీని నిట్లు యుక్తముగా విరచన మొనరించుచు భిత్తిస్థానీయముగా లక్షణయోజన మొనర్పవలెను. చిత్రకర్మ ప్రతిమముగా నలంకారగుణ నివేశన మొనరింపవలెను. గవాక్షవాతాయ

నాది దేశీయముగా దశరూపక విభాగము నిరూపింప వలెను. ఉపయోగ నిరూపణా ప్రఖ్యముగా కాక్వాదివృత్తి ప్రదర్శింప వలెను. ఈ విధముగా వాచనికాభినయ స్వరూప ప్రతిపాదన మావశ్యకముగ నున్నది. ఇందు వృత్తిలక్షణ విధాన మీ విధమున సూచితమయినది.

క్రమప్రతిభాసనము

పరిపక్వ ప్రజ్ఞుడయిన కవికి రూపకవిరచన కాలమున క్రమ ప్రతిభాసన ముండదు. అయిన నపోద్ధార ధీవృత్తి ననుసరించి క్రమ ప్రతిభాన ముండుట కల్పితమగునని కొందరనిరి. ఉపాధ్యాయులిట్లనిరి. ప్రబంధ రచనమున కొఱకు విశిష్టమగు యుక్త్యాభ్యాస మావశ్యకము. తన్నివృత్తి ప్రబంధాభ్యాసము. తత్సంపత్తి యభినయార్థ నిర్వర్తనము, తదభినయోపారోహణము నగును. ఇదియె క్రమము క్రమప్రతిభాసము నని ఉపాధ్యాయులె యిట్లందురు.

"మహాకవీనాం పదవీముపాత్తా మారురుక్షతాం
నాసంస్పృశ్య పదస్పర్శాన్ సంపత్సోపానపద్ధతిః"

సముపాత్తమయిన మహాకవుల కవితాపదవి నారోహింప దలచిన వారలకు వారి పదస్పర్శ లేకపోయినచో సంపత్సోపానపద్ధతి లభింపదు. కావున క్రమానుసరణ మావశ్యకము. క్రమోల్లంఘన మొనరించినచో నాటకాది విరచనమునందు "మహాంతః ప్రమాదాపభ్రంశా భవంతి" మహా ప్రమాదములు కలుగును. అపభ్రంశములు కలుగును. అట్టివి రాకుండుటకై క్రమానుసంధాన మావశ్యకము. "న హి సర్వో వాల్మీకిర్వ్యాసః కాలిదాసో భట్టేందురాజో వా" అందరు వాల్మీకులు కారు. అందరు వ్యాసులు కారు. కాలిదాసులు కారు. భట్టేందు రాజులును కారు. అందరు శ్రీమదభినవగుప్తులును కారు. వారలకును ప్రాగ్జన్మసముపార్జితక్రమాభ్యాసము వలన సంస్కారపాటవము సముదితమయినది. దానివలననె కులప్రతిభంగజ్ఞానాతిశయ ముదయించినది. కావుననె వారట్టివా రయినారు. గుప్తార్థప్రకటక్రియాస్వరూప రూపశోభ కల వాచనికాభినయతత్త్వ మిట్లు ప్రతిపాదిత మయినది. సర్వపదార్థములను ప్రతిభాసింపజేయుచు సంవ్యవహార హేతువగు నీ తత్త్వమునకు సంబంధించిన పరిజ్ఞానము కవినట సహృదయులకందఱ కావశ్యకము.

## లక్షణాలంకారము

కావ్యలక్షణముల వివేచన మిచట ప్రక్రాంతమగును. కావ్యలక్షణములు ముప్పదియారు కలవు. "కావ్యబంధాః షట్త్రింశల్లక్షణాన్వితాః కర్తవ్యాః" యని చోదనాసూక్తి, గుణాలంకారములు రీతివృత్తులననునవి కావ్యములందు ప్రసిద్ధమార్గము. ఈ కావ్యలక్షణములు ప్రసిద్ధములుకావు. లోకమున మానవులకు లక్షణగుణాలంకార వ్యవహారము యుక్తసంగతమై యున్నది. కావ్యమున కట్లు లక్షణగుణాలంకార వ్యవహారము యుక్తసంగతము కాగు. లోకమానవునకు శరీరమని చైతన్యమని భేదము కలదు. శరీరమున శోభకై కూర్చుకటకాదు లాశరీరముకన్నను భేదము కలవై ప్రసిద్ధముగా గోచరించుచునే యున్నవి. కావ్యమున కట్టి విభాగ మగణితము. కావ్యవిరచన కాలమున భేదభానము లేదు. కావ్యప్రతిపత్తి కాలమునను భేదభానము లేదు. కావ్యధర్మ ప్రాపక సత్తాసమయమున గూడ భేదముల పరిగణనము చేయుట లేదు. కాగా కావ్యలక్షణములని కావ్యగుణములని కావ్యాలంకారములని విభాగ మొనర్చుట యెట్లుసంగతము?. కావ్యాదర్శకర్త యగు దండియు "కావ్యశోభాకరాన్ధర్మానలంకారాన్ప్రచక్షతే" కావ్యశోభాసంపాదకములగు ధర్మము లలంకారములని యందురని యని గుణధర్మమునె యలంకారములకు నభిమానించెను. ప్రసాదాదిగుణములు కావ్యశోభాకర ధర్మములనియే సంభావించెను. ఇట్లు దండి యభిమానించుటచే గుణాలంకారములకు భేదము సంభవింపదని యాతడు సూచించి నట్లయినది. కావున లక్షణములు గుణములు అలంకారములు అనువానిని వేరు వేరుగా గుర్తించుటకాని లక్షణము నిర్దేశించుటగాని కుదురునా? లోకపురుషునకు లక్షణములని గుణములని యలంకారములని విభాగలక్షణములు సంగతములు కావచ్చును. కావ్యమున నెట్లు సంగతములగును? అని యీ విషయమున నొక యాశంక యుదయించును.

సత్యమేతత్ : అయిన నీ యంశముపర్యాలోచనము చేయవలయును. కవులు కావ్యముల రచించుచున్నారు. వివేచకులు వాఙ్మయ వివేచన మొనరించుచున్నారు. కావ్యవిరచనసమర్థులయిన కవుల సామర్థ్యమును సమర్థింపవలసి యున్నది. వివేచనవివేకులయిన వివేచకుల వివేచనసామర్థ్యమును సమర్థింపవలసి యున్నది, ఇట్లు విరచన వివేచన సామర్థ్య సమర్థనమునకై కాల్పనికమయిన విభాగము నయినను అంగీకరించి యాశ్రయింపవలెను. అప్పు డొకవిధముగా లక్షణ గుణాలంకారవివేకము మనసున కందును. కాల్పనికవిభాగాశ్రయణమున కల్పనలో కతిపయవిప్రతిపత్తులను కతిపయవిమర్శకులు పలుకవచ్చును. ఆ విప్రతిపత్తుల రీతినీతి యీవిధముగ నుండును.

కొంద రిట్లందురు :- గుణము లాత్మధర్మములు. చిన్మయాత్మ యయిన శృంగారాది రసమున గుణము లుండును. గుణసంబంధమున శృంగారాదిక మవభాసించును. రసమునకు గుణమునకు నియతసంబంధ మున్నది. అలంకారమున కట్లు సంబంధము లేదు. అలంకారము పృథక్సిద్ధము. అలంకారము నియతముగా రసమునకు సంబంధించి యుండదు. అలంకారము శరీరనిష్ఠముగా నుండును. లక్షణము శరీర నిష్ఠముగా నున్నను అపృథక్సిద్ధముగా నుండును. అలంకారము లక్షణము రెండును శరీరమునకు సౌందర్యము సంపాదింపగలవు. రెండును శరీర నిష్ఠములె యైనందున శరీరసౌందర్యసంపాదకము లగుచున్నవి. శరీర సౌందర్యము సిద్ధరూపము సాధ్యరూపము నని రెండువిధములు. 'ఈమె శ్యామ' యనుట సిద్ధరూపసౌందర్యము సూచించును. "ఈమె మద మన్థరగామిని" యనుట సాధ్యరూపసౌందర్యము సూచించును. లక్షణ మనునది యిట్టిది. ఇది యలంకారములచే నలంకృత మగును. కావ్య మలంకారయుక్త మయినను లక్షణములు లేకున్నచో శోభింపదు. "శ్యామా విశాలాక్షీ" యనుటలో అక్షిగతమయిన విశాలత్వము సిద్ధరూపమునె చెప్పును. "శ్యామా మత్తమాతంగగామినీ" యనుటలో సాధ్యమగు గమనసౌందర్యము గోచరించును. స్వభావసహజ మగునది సిద్ధమగు లక్షణము. ఉత్సవాదినిమిత్తముగా నాయోజితమగునది సాధ్యసౌందర్యమని స్పష్టము. కాగా పృథక్సిద్ధ మగునది యలంకార మని యపృథక్సిద్ధ మగునది లక్షణమని యీపక్షమున సారాంశము.

౨. అన్యే మన్యంతే. కొందరీవిధముగా భావించుచున్నారు. ఇతివృత్తఖండలకములె సంధ్యంగములని లక్షణములని వ్యపదేశమున నున్నవి. రూపకములందలి కథావస్తువునందు సక్రమ విస్తరమునకై యుపక్షేప పరికరాది సంధ్యంగములను కూర్పవలసి యున్నది. ఆ సంధ్యంగకములు కథావస్తువునందు ఖండాత్మకములయిన భాగములు. అందువనె సంధ్యంగకములు ఇతివృత్త ఖండలము లనుట సంగతము. రూపకమునందు ముఖ్యప్రయోజనము మొదటగా బీజాంశముచే నుపక్షిప్తముకాగా, నిర్వహణపర్యంతమది విస్తరము పొందవలసి యున్నప్పుడు, పూర్వాపరసంబంధములను సరిచూచుకొనుచు కథాభాగములను పరస్పరము సంబంధింపజేయుట యావశ్యకమగును. ఇట్లు పరస్పరసంధాయకము లగునవి సంధ్యంగములని వ్యపదేశము పొందుచున్నవి. కథావస్తు సంధానమును నిమిత్తమున నివి సంధ్యంగములయినవి. అవియే రసవిశేషోపయోగులగుచో వృత్త్యంగములను వ్యవహారమును పొందును. అవియె కావ్యగతప్రఖ్యాతికి ప్రాశస్త్యమునకు నుపయోగించునవి యగునేని లక్షణములను శబ్దమున జెప్పదగియున్నవి. మహాపురుషగత పాశధ్వజ పాదరేఖ లాతని ఖ్యాతిప్రాశస్త్య ప్రతిపాదనమున నుపయోగించునట్లు కావ్యలక్షణములును కావ్యగతాతిశయము ప్రతిపాదింపగలవు. "లక్షణాన్యేవ బీజార్థక్రమనిర్వాహకాణి" అని యనిరి. ముఖసంధిలో నుండు బీజాంశమునకు నిర్వహణసంధిలో నుండు అర్థమునకుగల పరస్పరసంబంధమును లక్షణములు నిర్వహించునని తదర్థము. అట్లే "ప్రతిసంధి తదంగాని ఫలసిద్ధ్యుపపత్తితః" సంధులన్నిటియందును ఫలసిద్ధి కలుగునట్లుగా సంధ్యంగములను సంయోజన మొనరింపవలయునని యనిరి.

ఇప్పటికిట్లు నిరూపించిన రెండు పక్షములలో మొదటిపక్షము ననుసరించిన "కావ్యమునందు వర్ణింపదగిన ప్రధానాధికార పురుషునందలి గుణాదివిభాగమె లక్షణార్థము" అని తేలును. రెండవపక్షమున "కావ్యమున వర్ణింపదగిన సకలార్థము లక్షణార్థ"మని నిశ్చితమగును. ఒక పక్షమున ధీరోదాత్తాదిగుణాధానము వేరొక పక్షమున వస్తువర్ణనాభంగి సారముగా భాసించును.

3. ఏకేషాం తు దర్శనం, ఈ విషయమున మరికొందరి మతమిట్లున్నది. కావ్యరచనమున కవికి ప్రతిభాత్మకమయిన ప్రథమపరిస్పందమొకటి యుండును. తద్వ్యాపారబలమున గుణములు సంప్రాప్తములగును. ప్రతిభాయుతుడగు కవికి మాత్రమె రసాభివ్యంజనసామర్థ్యముండును. మాధుర్యాదిగుణముల సముపనిబంధనసామర్థ్యము నుండును. సామాన్యకవి కిట్టి సామర్థ్యము లుండవు. కవికి వర్ణనాపరపర్యాయమయిన ద్వితీయవ్యాపారమున్నది. ఆ వ్యాపారమున నాతడలంకారములను సంపాదింపగలడు. "ఈ శబ్దమున నిట్టి వస్తువును వర్ణింతు" నని యీవ్యాపారమున నాతడు సంకల్పించును. ఆ వ్యాపారముననె యలంకారములు సిద్ధము లగును. "ఈ శబ్దములచే నీ శబ్దముల గూర్చెదను. ఈ యర్థములతో నీ యర్థముల సంఘటింపజేయుదును" అను విధమున కావ్యరచనాసక్తుడగు కవికి తృతీయపరిస్పంద మొకటి యుండును. తదధీనముగా శబ్దాత్మకార్థాత్మకకావ్యశరీర మాత్మలాభము కలదగును. అట్టి కావ్యము నాశ్రయించి శబ్దార్థోపసంస్కారకల్పములయిన లక్షణములు వెలువడును. ఇట్టి కావ్యలక్షణములన్నియు క్రియారూపములు. శ్లేషాదిగుణదశకము నభివ్యంజనము చేయుటలో నీ లక్షణములు సవ్యాపారములై యుండును. కావ్యదేహభూతములయిన శబ్దార్థముల నాశ్రయించి కావ్యలక్షణము లుండుట నభిజ్ఞులు సూచించిరి. కావ్యమునందుండు శబ్దార్థములకు స్నిగ్ధమగు స్పర్శమొకటి యున్నది. అది శ్లేషాదిగుణవ్యక్తిదక్షము, ఈ పక్షమును పరిశీలింపగా కవివ్యాపారభేదమున గుణాలంకారలక్షణవిభాగ మభ్యూహింపవచ్చును.

౪. అపరే సంగిరంతే. మరికొంద రిట్లందురు. అభినేయములగు కావ్యబంధములలో నైపుణ్యము సంపాదింపదలచు కవి స్వసామర్థ్యలాభమునకై సముచితాభ్యాస మొనరించును. అట్లు నిర్మాణవిధేయమగు నభ్యాసమె లక్షణ మగుచున్నది. మొదట సంపూర్ణస్వరూపము పొందని కావ్యబంధము క్రమముగా లక్షణోన్నీతమై సంపూర్ణత పొందును. లక్షణసంబంధమున లోకోత్తరహృద్యవర్ణనము సిద్ధమగును గావున కావ్యబంధము రమ్యమగును. ఒక్కొక ప్రబంధజాతము గుణాలంకార నికర ప్రధానముగా నుండును. మేఘదూతప్రబంధ మట్టిది.

కావున లక్షణము లనునవి ప్రబంధ ధర్మరూపమున నుండునని గుర్తింపవచ్చును. నానావిధ స్వభావభూషితము లయిన పద్యబంధములు గుణాలంకారశోభాసుందరములై స్వసౌందర్యబలమున ప్రబంధబంధ సంగతము లగును. ఆ కవితాఖండములు గుణకృత శోభాసుందరము లగుట అలంకారకృత శోభాసుందరము లగుట (వి) భూషణమను కావ్యలక్షణమగును. మేఘదూతము నందలి పద్యము లన్నియు గుణసుందరము లలంకార సుందరములై యున్నవి. ఆ సౌందర్య సంబంధముచే నవి సుశ్లిష్టములై ప్రబంధ ధర్మము కూర్చినవి. అదియె విభూషణమను కావ్యలక్షణము. ఇట్లె యితర కావ్యములును కావున కావ్యలక్షణములు ప్రబంధ ధర్మము లనుట యుక్తము

౫. కేచిత్తు బ్రువతే. కొందరిట్లందురు. "కవేరభిప్రాయవిశేషో లక్షణం" కవి యభిప్రాయవిశేషమునకె లక్షణమని పేరు. అశబ్దగోచరమగు కవి యభిప్రాయమును కావ్యలక్షణములు గోచరింపజేయగలవు. కావ్యసామగ్రి సంక్లుప్తమయిన కవిభావ మొకప్పుడు సామగ్రిపిహితమగును. సామగ్రీ స్వరూపమె ప్రముఖాస్వాద్యమగును. కవిభావ సమాస్వాదపర్యంతము సచేతోహృదయమేని ప్రసరింపదు. అట్లుకాక కవి కూర్పదలచిన యభిప్రాయవిశేష మాస్వాద్య మగునట్లొనర్చుటకు కావ్యలక్షణములు సమర్థములు. కవిభావ మొక్కొక స్థలమున శుష్కముగ నిరావరణముగ నరూపరంజితముగ భాసించుటను కావ్యలక్షణము పరిష్కృత మొనరించును. గుణాలంకార శ్రీకృత పరికరము కల భావవిభవమె కావ్యలక్షణ మని భావము. కావ్యలక్షణానుసంధానమున నా భావవిభవము స్ఫురత్ప్రాదుర్భావమై రసభావప్రవణత నాపాదించును. కావ్యలక్షణమున కింతటి స్ఫురత్తి యున్నందుననె "కవేరభిప్రాయవిశేషో లక్షణ" మ్మని యనుట.

౬. కేచిదాహుః: కొందరిట్లందురు. "యథాస్థానవిశేషం యద్గుణాలంకారాయోజనం తల్లక్షణం" గుణాలంకారములను స్థానసముచితముగా నాయోజనము చేయుటయె కావ్యలక్షణము. గుణము కూర్పవలసిన స్థలమున నలంకారము ఘటించుటకాని యలంకారమాయోజనము చేయవలసిన స్థలమున గుణము గుంభించుటగాని యుక్తముకాదు. స్థానౌచిత్యమున్న వానిని గూర్పవలెను. గుణనిబంధ

నైకరసికత కాని యలంకారనిబంధనలాలసత కాని యుక్తము కాదు. ఏ గుణము నెచట గూర్పవలెనో ఏ యలంకారము నెచట నిబంధింప వలెనో ప్రసమీక్షణ మొనరించి నిబంధింప వలెను. గుణాలంకార వినివేశన సమీక్షా పురస్సరముగా గుణాలంకారములను కూర్చుటయె లక్షణము. రసభావౌచిత్యానుసారముగ గుణాలంకారము లున్నచో కావ్యలక్షణ మున్న దనవలెను. లోకమున గూడ తగిన విధమున నలంకారముల ధరించిన వనితను జూచి లక్షణముగా నున్నదనుట యున్నది. యుక్తసంధానములో లక్షణముగా నున్నదనుట సహృదయ సమ్మతము.

౭. పరే త్వభాషంత. మరికొందరిట్లనిరి. అమరుకశ్లోకములం దలంకారనిరపేక్షముగా నిసర్గసుందరమగు భావసంపద యున్నది. అది యభినేయము నగును. అట్లే కావ్యములందు నలంకారనిరపేక్షముగనె స్వభావసుందరమగు విశేషముండును. అది యభినేయమగును. ముక్తక రూపములయిన యమరుకపద్యములం దేపద్యమున కాపద్యము తద్భావము తదభినయము స్వయంపూర్ణముగ నుండును. సర్గబంధాత్మకము లయిన కావ్యములందు పరస్పరసంబంధ సముల్లసితమయిన స్వభావ సుందరమగు భావసంపద స్ఫురద్రూపముతో సాక్షాత్కరించును. తత్సౌందర్య హేతువగు ధర్మము సలక్షణము. ఆ యర్థమె కావ్య శరీరవిశేషరూప మగుటచే లక్షణ మగుచున్నది. సౌందర్య సముపేత మయిన కావ్యశరీరమె లక్షణము. ఈ భావము మొదట నిరూపించిన వాదభావములతో కొంతగా సంవదించుచున్నది.

౮. ఇతరేషాం తు మతం. మరికొందరి మత మీవిధముగ నున్నది. కావ్యలక్షణముల బలము వలననె యలంకారములకు వైచిత్ర్యము కలుగుచున్నది. భేదప్రభేదములు కలుగుచున్నవి. ఆనంత్యమును గలుగుచున్నది. "కావ్యబంధాస్తు కర్తవ్యాః షట్త్రింశల్లక్షణాన్వితాః" అను కారికాఖండములోని "తు" శబ్దము కేవల ముపమా దీపకరూపకార్థములందు చిత్రత యుండదని కావ్యలక్షణ సంబంధముననె వానియందు చిత్రత కల్గునని సూచింపగలదు. కావ్యలక్షణ ముల కలనము వలననె యుపమారూపకదీపకములకు భేదమును

గలుగుచున్నది. ఉపమాదుల స్వగతభేదమువకును కావ్యలక్షణ సంపదయె కారణము. కావున నుపమాద్యలంకారముల కావంత్యము కలుగుట కావ్యలక్షణ ప్రయోజనముగా పరిగణింపవలెను. గుణానువాదమను కావ్యలక్షణ సంబంధమున ప్రశంసోపమ కలుగును. అతిశయమను కావ్యలక్షణము కలియునేని యతిశయోక్తి యావిర్భవించును. మనోరథమను లక్షణయోగమున నప్రస్తుత ప్రశంస కలుగును. మిథ్యాధ్యవసాయమను లక్షణము కూడుకొనగా నపహ్నుత్యలంకారమావిర్భవించును. అసిద్ధి యను లక్షణసంబంధమున తుల్యయోగితాలంకారము కలుగును. ఇట్లే యితరముల నభ్యూహించునది.

౯. మఱియొక భావమిట్లున్నది. మీమాంసాశాస్త్రమునందు తంత్రమని ప్రసంగమని బాధయని యతిదేశమని పారిభాషికసంకేతములు కలవు. ఇవి యా శాస్త్రవైలక్షణ్యమును సూచింపగలవు. తద్గతవిశేషమును 'వ్యవచ్ఛిద్య' వాఖ్యానింపగలవు. అట్లె భూషణాది లక్షణజాతము కావ్యశాస్త్రవైలక్షణ్యము నిరూపింపగలదు. కావ్యగత విశేషమును వ్యాఖ్యానింపగలదు. ఈ పక్షము పూర్వము నిరూపించిన ద్వితీయపక్షముకన్న భిన్నముగ గోచరింపలేదు. ఇతివృత్తఖండలకములయిన సంధ్యంగకములు కావ్యవిశేషవ్యవచ్ఛేదకములుగనె యున్నవి. భూషణాదిలక్షణజాత మట్టిదె యయినది.

౧౦. వేరొకపక్ష మీ విధమున నున్నది. "శబ్దేనార్థేన చిత్రత్వం లక్షణం" శబ్దమునకు శబ్దాంతరసంధమున చిత్రత యున్నది. శబ్దమున క్షరవిశేషసంబంధమున చిత్రత కలుగును. అర్థమునకు శబ్దవిశేషముతోటి సంబంధమున వైచిత్ర్య ముదయించును. అర్థమున కర్థాంతర సంబంధమున వైచిత్ర్యము కల్గును. ఇట్టి విశేషమంతయు కావ్యలక్షణాధీనము. అలంకారముల యాయోజన మక్కఱలేకుండగనె శబ్దార్థ సంబంధచిత్రతాధీనముగా కావ్యలక్షణములకు స్వరూపయోగ్యత యున్నది.

ఇట్లీ కావ్యలక్షణవిషయమున నానాపక్షవాదము లీవిధమున నున్నవి. ఈ పక్షములం దన్యతమపక్షమును పరిగ్రహింతుమేని సర్వ విశేషణములు స్పష్టపథమున సంగతములు కావు. ఈ పదిపక్షములలో

పరస్పర మెంతటి సంవాదము విసంవాదము కలదో తత్పరిశీలనమున గోచరించును. ఈ దశపక్షీనిగూఢవస్తుపరీక్ష చేయుట యుక్తము. కావ్యలక్షణలక్షణము పరిష్కరించుట యుక్తము.

అభినవపక్షము

"కావ్యార్థా రసాః" రసములు కావ్యార్థములని యిదివరలో నిరూపిత మయినది. కావ్యపదమునకు మూడు వ్యుత్పత్తులు కలవు.

౧ వర్ణనీయం కావ్యం
౨ శబ్దనీయం కావ్యం
3 కవేః కర్మ కావ్యం

అను నీ వ్యుత్పత్తిత్రయము భావనీయము. ఇట్టీ వ్యుత్పత్తిత్రయమున కావ్యము అభిధేయమును అభిధానమును అభిధను స్వీకరించి వ్యవస్థితమగును. ఈ విషయముననె శబ్దవ్యాపారము అభిధాతృవ్యాపారము ప్రతిపాద్యవ్యాపారమను త్రిగతరీతిని ధారణ చేయవలయును. ఇకనిట్లు విషయము పరిశీలింపదగి యున్నది. ఇందు శబ్దమునకు రసాభివ్యక్తిక్షమార్థ ప్రతిపాదకత్వమె ముఖ్యధర్మము. అట్టిశబ్దము స్వగతసౌభాగ్యమున స్వయముగా శ్రోత్రసంక్రాంత మగును. అట్టి సంక్రాంతిమాత్రమె శబ్దమునకు గల స్వయంసౌభాగ్యము. అది నాంతరీయము. అపరిహార్యముగా నది యట్లు సంక్రమించితీరును. అట్టి యా శబ్దము రసదర్శనయోగ్యత కలుగజేయు సామర్థ్యము కలది యగుటచే "గుణము" అని వ్యవహరింపశక్య మగును. అలంకార మనునది యింతకన్న విలక్షణము. ఆవర్తమానమగు రెండవవర్ణము కాని పదముకాని ప్రాక్తనవర్ణముతో పదముతో సంబంధించినదై శోభాహేతు వగునేని యలంకారమగును. ఇట్లె యర్థవిషయమున గూడ గుర్తింపవలసి యున్నది. అర్థము రసాభివ్యక్తిహేతు వగునేని యర్థగుణమగును. చంద్రుడు వదనమునకు వలె వస్త్వంతరము రసాభివ్యక్తిహేతు వయినచో నది యర్థాలంకారమగును. త్రివిధమయిన యభిధావ్యాపారము కావ్యలక్షణములకు విషయము. దీనినే యిట్లు ప్రతిపాదింతుము. "శబ్దముచే నీ యితికర్తవ్యతతో నీ యాశయముతో నిట్టి బుద్ధిజననమునకై యీ కావ్యము నిరూపింతును." అని కవి

ప్రవర్తించును. ఆతడట్టి రసవత్కావ్యము నిర్మాణించును. అట్టి కావ్యమునందు చిత్తవృత్త్యాత్మకమయిన రసము నిరూపించునదై రసోచితవిభావమువలన వైచిత్ర్యసంపాదకమగు త్రివిధాభిధావ్యాపారము లక్షణ శబ్దవ్యపదేశము పొందును. ఇట్టిది గుణాలంకారలక్షణముల సామాన్యలక్షణము. పీవరత్వము స్తనములకు లక్షణము. కాని యది మధ్యమునకు కులక్షణము. సామాన్యముగా నొకవిధమున నిరూపిత మగునది రసోచితమగు విభావాదిరూపమున నున్నదై సముద్దిష్టమగు పదార్థక్రమమును నిరూపించునది యగునేని లక్షణ మగును. అన్యస్థల మున నదియే కులక్షణ మగును. కావున నలంకారములు గుణము లన్నియు తత్సముదాయముకన్న విలక్షణములె యగుచున్నవి. స్వార్థ పర్యవసానము పొందు వస్తు వొకప్పు డర్థమాత్రమె యయినను నొకచో నలంకారమగును. ఒకచో నొకటి యలంకార మయినను స్థానవిశేషమున నర్థమాత్రమె యగును. కేవల మొకటి వస్తుమాత్ర ముగా నుండియు నొకచో చిత్రవస్తు వగును. ఒక్కొకటి యలంకార ప్రక్రియావిహీనమై యున్నను ఒకచో చిత్రస్వభావక మగును. స్వయం సుందరస్వభావకమగు నర్థమయినను ఒకచో నది ఛందోమాత్రమె యగును. త్రివిధవ్యాపారగామి యయిన లక్షణమార్గము తద్ద్వారమున నభిధానాభిధేయ గుణాలంకారముల ననుగ్రహించును. వ్యాపార ప్రాధాన్యమున లక్షణజాతము స్వరూపోదయము కలదయినది.

౧ శబ్దములకు శబ్దసంఘటనము
౨ అర్థములకు అర్థసంఘటనము
౩ శబ్దములకు అర్థసంఘటనము
౪ అర్థములకు శబ్దసంఘటనము

అను విచిత్రసంఘటనము సంపాదించు వ్యాపారాత్మకమయిన యుక్తివిశేషము నిర్వాణప్రధానధురాధిరోహణ మొనర్చునదై కావ్య లక్షణసంకేతము కలదగుచున్నది. ఇట్టి కావ్యలక్షణములె కావ్యమున ప్రధానములు. “కావ్యబంధాస్తు కర్తవ్యాః షట్త్రింశల్లక్షణాన్వితాః” అను వచనమున లక్షణములె ప్రధానము లని భావము. గుణాలంకా

ఠములు తత్ప్రసంగసమాయాతములని తాత్పర్యము. ఇక నిట్టి విశేషములన్నియు విశేషలక్షణవ్యాఖ్యానమున విశదములు కాగలవు.

ఈ ప్రఘట్టమున భరతశ్లోకములందు షట్త్రింశల్లక్షణముల సముద్దేశనిర్దేశములందు లక్షణమునందును రెండువిధముల పాఠభేదము గోచరించుచున్నది. అభినవగుప్తు డొకపాఠమును గ్రహించి వ్యాఖ్యానించెను. కీర్తిధరాదు లీ పాఠమునె ప్రమాణముగ స్వీకరించిరి. దీనికి భిన్నమగు పాఠమును చిరంతనులు కొందరు గుర్తించిరి. దానినె విశ్వనాథసింగభూపాలాదులు స్వీకరించిరి. అభినవగుప్తుడు లక్షణముల వైషమ్యపరిహారమునకై భిన్నభిన్నము లయిన లక్షణ లక్షణములను తన పాఠలక్షణములందే యంతర్భవింప జేసెను. షట్త్రింశత్త్వము సమర్థించెను. భోజదేవుడీ పాఠములలో సమానములు భిన్నములగు వానిని గ్రహించి పదునాలు గన్యలక్షణములను గూడ సంకలనముచేసి మొత్తము చతుష్షష్టి కావ్యలక్షణములను పరిగణించెను. శారదాతనయాదులు వానినే స్వీకరించిరి. ఇందు పాఠద్వయానుసారమున లక్షణసమీక్షణము యుక్తముగా నుండును. అభినవగుప్త పాఠానుసారి కావ్యలక్షణముల నామసంకేత మీ విధముగ నున్నది.

| | | |
|---|---|---|
| ౧ విభూషణము | ౨ అక్షరసంహతి | ౩ శోభ |
| ౪ అభిమానము | ౫ గుణకీర్తనము | ౬ ప్రోత్సాహనము |
| ౭ ఉదాహరణము | ౮ నిరుక్తము | ౯ గుణానువాదము |
| ౧౦ అతిశయము | ౧౧ హేతువు | ౧౨ సారూప్యము |
| ౧౩ మిథ్యాధ్యవసాయము | ౧౪ సిద్ధి | ౧౫ పదోచ్చయము |
| ౧౬ ఆక్రందము | ౧౭ మనోరథము | ౧౮ ఆఖ్యానము |
| ౧౯ యాచ్ఞ | ౨౦ ప్రతిషేధము | ౨౧ పృచ్ఛ |
| ౨౨ దృష్టాంతము | ౨౩ నిర్భాసనము | ౨౪ సంశయము |
| ౨౫ ఆశీః | ౨౬ ప్రియోక్తి | ౨౭ కపటము |
| ౨౮ క్షమ | ౨౯ ప్రాప్తి | ౩౦ పశ్చాత్తపనము |
| ౩౧ అర్థానువృత్తి | ౩౨ ఉపపత్తి | ౩౩ యుక్తి |
| ౩౪ కార్యము | ౩౫ అనునీతి | ౩౬ పరిదేవనము |

ఈ ముప్పదియారును కావ్యలక్షణములు. రసానుకూలముగా వీనిని కావ్యములందు ప్రయోగింప వలెను.

౫౯౫. షట్త్రింశదేతాని తు లక్షణాని
ప్రోక్తాని వై భూషణసమ్మితాని
కావ్యేషు భావార్థగతాని తజ్జ్ఞైః
సమ్యక్ప్రయోజ్యాని యథారసం తు

భూషణసమ్మితము లయిన యీ ముప్పదియారు కావ్యలక్షణము లీవిధముగా సంకేతితము లయినవి. తదభిజ్ఞులగువారు కావ్యములందు యథారసముగా భావార్థగతము లగునట్లుగా వీనిని సంధానింపవలెను. సానుసంధానమున నివి సమ్యక్ప్రయోజ్యములు కావలెను. రసానుకూలముగా వీని నాయోజనము చేయవలెను. రసమునకు సంబంధించి భావము లుండును. విభావానుభావవ్యభిచారు లాభావములు భావార్థము=విభావాదుల యర్థము ప్రయోజనము. స్థాయిభావరసీకరణాత్మకమయిన ప్రయోజనము. "భావార్థం గతాని ప్రాప్తాని" కావ్యలక్షణము లా భావార్థమును పొందునవిగా నిరూపితములు కావలయును. అభిధావ్యాపారోపసంక్రాంతములగు నుద్యానాదిపదార్థము లన్నియు తత్తద్రసవిశేషనియతము లయిన విభావాదిభావమును పొందును. అట్లు తద్భావమును పొందునవియె కావ్యలక్షణములు. ఇది వీని సామాన్యలక్షణము. కావుననె కావ్యమునం దివి సమ్యక్ప్రయోజ్యములని వీని విషయము నిరూపితమయినది.

భట్టనాయక భావము

భట్టనాయకు డీవిషయమున నిట్లనెను. ఇట్లు నిరూపితాంశమునె నాయకుడు నిరూపించి "అభిధావ్యాపారప్రధానం కావ్యం" అనినాడు. అతని హృదయదర్పణములోని భావ మిట్లున్నది.

'శబ్దప్రాధాన్యమాశ్రిత్య తత్ర శాస్త్రం పృథగ్విదుః
అర్థే తత్త్వేన యుక్తే తు వదంత్యాఖ్యానం
ఏతయోర్ద్వయోర్గుణత్వే వ్యాపారప్రాధాన్యే కావ్యగీర్భవేత్

వేదాదిశాస్త్రము శబ్దప్రాధాన్య మాశ్రయించి యుండునది కావున ఇతరములకన్న నది విలక్షణము. అర్థమె ప్రాధాన్యముతో

కూడియుండు నేని పురాణేతిహాసాద్యాఖ్యానమగు ననుట యుక్తము. శబ్దార్థములు రెండును గుణీభావము పొంది యప్రధానము లగు నేని వ్యాపారప్రాధాన్య ముండు నేని కావ్యవాక్య మగును. నాయకుడు శబ్దార్థము లప్రధానము లగుటను వ్యాపారము ప్రధాన మగుటను భావించెను గావున కావ్యలక్షణముల సంభావించెనని భావింపవచ్చును.

భామహభావము

భామహు డిట్లనెను. "ఆ యీ వక్రోక్తి యంతట నున్నది. దీనినే కావ్యము నందలి సర్వార్థము విభావిత మగును." సైషా సర్వత్ర వక్రోక్తిరనయార్థో విభావ్యతే" అని భామహుడును వ్యాపార ప్రాధాన్య మంగీకరించి లక్షణము నిరూపించెను. ఆ యా విషయము ననుసరించి విశేషలక్షణము చెప్పెను. విభావాది సముచిత ముగా వర్ణిత మగు నేని సర్వము కావ్యలక్షణ మె యగునని సూచించెను. తద్విదులకు తదభ్యాసపరులకును తథాభూత కావ్యాత్మక విషయావ లోకనమున వ్యాపారము ఝడితి యవభాసించును. అభ్యూహించియు వ్యాపారము గుర్తింప వచ్చును. ప్రతిభాప్రసార ప్రభావమున తెలియ వచ్చును. స్వసంవేదనసామర్థ్యమునను స్ఫురించును. కుశలశిక్షితులగు కావ్యద్రష్టల దర్శనమున కుశలశిక్షితవ్యాపార మవశ్య మవభాసించును.

సంఖ్యాసంగతి

కావ్యలక్షణములు షట్త్రింశత్తని యనుట యితరము లేదను టయై వారణపరముగా నున్నను అత్యంత మితర నిషేధపరము కాదు. అన్యము లనేకములు కవిహృదయవర్తులై యుండును. అవి నిషేధ్య ములు కావు. కాని యపరిసంఖ్యేయములు. కుశాగ్రధీకు లాసాదితా లోకు లన్యాన్యముల నభ్యూహింపగలరు. అంతటి బాహుల్యమేల ? ఈ నిరూపితములె లక్ష్యవ్యాప్తములై యున్నవి. ఇంతలో కవి యవ ధానము వహించుటమేలు. అందుననె షట్త్రింశత్తను సంఖ్యా నిరూ పణము సంగతము. ఈ కావ్యలక్షణముల విషయమున భరతమునియె మతాంతర మభిమానించి యీ చెప్పిన విధముకన్న వేరు విధమున కావ్యలక్షణముల యుద్దేశ నిర్దేశము లొనరించెను. లక్షణమును నిరూపించెను. నామాంతరములచే వ్యవహార మొనరించెను. కావున నే

నాట్యవేదపుస్తకములందు భేదము గోచరించుచున్నది. దాని నవస రానుసారమున ప్రదర్శింతుము. విభూషణాదికముగా పరిదేవనాంతము నిరూపితమయిన యీ యుద్దేశక్రమ మభినవోపాధ్యాయ పరంపరా సమాగతము.

భావసారము

కావ్యలక్షణముల విషయమై శ్రీమదభినవగుప్తపాదాచార్యుడు నిరూపించిన గహనార్థము నిట్లు భావసారముగా గుర్తింప వచ్చును. సమస్తార్థాలంకారవర్గమునకు బీజభూతము లయిన చమత్కారములు కథాశరీరమున వైచిత్ర్యమాపాదింపగలవు. అవి వక్రోక్తిరూపములు. వానిని లక్షణశబ్దమున వ్యవహరించిరి. లక్షణములు గుణాలంకార మహిమ లేకున్నను స్వసౌభాగ్యముననె శోభింపగలవు. లక్షణ మను నది మహాపురుషునకు పద్మాదిరేఖలవలె కావ్యశరీరమునకు సౌందర్య దాయి యగును. అలంకార మిట్టిది కాదు. అది రత్నాభరణము వలె నుండును. అది లేకున్నను పురుషుడు స్వసౌందర్యమున నవభాసించును. గుణము ప్రవృత్తిద్యోతితమై ధైర్యాదికమువలె నుండును. కావ్య శబ్దార్థరచన నాశ్రయించి యుండును. లక్షణరహితుడగు పురుషుడు సుందరుడని చెప్పదగడు. అట్లె లక్షణరహితమయిన కథాశరీరము గుణాలంకారసముజ్జ్వల మయినను నీరసమై ప్రౌఢకావ్యమని యన దగదు. కథాశరీరసంపన్నము లయిన కావ్యములందే యీ లక్షణ ములు సంగతములగును. గాని ముక్తకాది ఖండకావ్యములలో నివి సంగతములు కావు. కావుననె "కావ్యాబంధాస్తు కర్తవ్యాః" అను వాక్యమును ముని ముక్తకాది వారణపరముగనె నిరూపించెను. లక్షణము లసంఖ్యేయములు. వానిలో చమత్కృతి విశేషగరిష్ఠము లగునవి ముప్పదియారు మాత్రమె. అందుననె ముని ముప్పదియారు లక్షణములనె సంగ్రహించెను. కోహలాదులు తచ్ఛిష్యులు నితరలక్షణ ములను కీర్తించిరి. అవి లక్షణము లనియు ప్రసిద్ధి పొందినవి. కాని కాలప్రవాహమున నవి యేమైనవో? భరతగ్రంథమునందె యవి ప్రక్షిప్తములై ప్రవేశించినవి. పాఠాంతరములని లోకమనినది. సౌందర్య మాపాదించుచున్నవని భోజాదు లుభయపాఠములను స్వీకరించి లక్షణ

ములను గుర్తించిరి. ఇతరములను గొన్నిటిని కలియగలిపి లక్షణము లరువదినాలు గనిరి. అతిగంభీరప్రౌఢవాచామందరుడయిన శ్రీమదభినవగుప్తుడు లక్షణము లసంఖ్యాకములని యనుట నాధారము చేసికొని భిన్నపాఠముకూడ నివేదింపదగినదె యని భావించెను. దానిని భరతవిద్యాసారపారగు లామోదించిరి. స్వసమయమున నవి స్పష్టము లగును. ఇక క్రమముగా కావ్యలక్షణముల లక్షణములు నివేదింతుము.

౧. విభూషణము

౬౯౮. అలంకారైర్గుణైశ్చైవ బహుభిర్యదలంకృతం
భూషణైరివ విన్యస్తైస్తద్భూషణమితి స్మృతమ్

సముచితముగా కూర్పబడిన కటకాద్యాభరణములచే వలె నానావిధగుణాలంకారములచే కావ్యమున గలుగు నలంకరణము విభూషణ మనదగి యున్నది. అని సామాన్యముగా నర్థము. స్థానదేశకాలదశాపురుషాదివిభాగమును బాగుగా విచారించి కటకాదిభూషణములను కూర్చినచో లోకమున మానవునకు శోభగలుగును. అట్లే కావ్యమున గూడ స్థానదేశకాలదశాదివిభాగమును పరిశీలించి నానావిధగుణాలంకారములను కూర్చినచో కావ్యమున నలంకరణము కలుగును. ఆ యలంకరణమె విభూషణమను కావ్యలక్షణము. ఈ భూషణము కవివ్యాపారము. కవివ్యాపారద్వారమున నిది శబ్దవ్యాపార మర్థవ్యాపారము నగును.

ఏతదుక్తం భవతి- ఈ యంశ మిచట వచనసారము. గుణము లలంకారములు విషయములని వినిబద్ధములు కాగా నవి కావ్యార్థములుగా నయిన యభిధేయములను వివరించుటకు సమర్థములగును. అట్లె యవి రసవిశేషవిషయ మయిన విభావాదిభావమును గూడ వివరించుటకు సమర్థము లగును. ఇట్లనుట యుక్తము. హాస్యరసప్రధానములయిన ప్రహసనాదులలో శుష్కశ్రోత్రియుడు వక్తగా నున్నపుడుగాని శుష్కశ్రోత్రియుడె ప్రయోక్తగా నున్నప్పుడుగాని, శుష్కశ్రోత్రియుడె శ్రోతగా నున్నపుడుగాని సముచితముగా నున్న గుణము అలంకారము తగిన శోభ నాపాదింపగా నది భూషణ మను లక్షణ మగుచున్నది. పాదతాడితకమను భాణ మొకటికలదు. అందు

శ్రోత్రియుడగు శ్రోత్రియునుద్దేశించి నిర్గుణపురుషుడగు విటు డిట్లనును. "మా ముసలేనాపాకార్షీః! మా కుసూలాగ్నినాధాక్షీః! రోకలితో నడ్డుపడకుము! కుసూలాగ్నితో దహింపకుము!" అని. ఈ రీతి శోభ కలిగించినది.

అనుచితముగా నిబంధనము శోభ నీయదు. కరుణవిప్రలంభాదులలో యమకాలంకారము కూర్చుట తగదు.

> వినా ప్రియతమేనాద్య విరహానలతాపితా
>
> దహేచ్చూతస్య విచ్ఛేదం కిం తు, హా, నలతాపితా

"ప్రియుడు లేనందున విరహాగ్నితప్త యగు నామె నలములచే గూడ తాపితయైనది. చూతాంకురము నేని దహించునో!" ఇందు ద్వితీయచతుర్థపాదము లందున్న "హానలతాపితా, హా నలతాపితా" యను యమక మనుచితము.

సముచితస్థానవినివేశన మిట్లుండును.

> "లీనేవ ప్రతిబింబితేవ లిఖితేవాన్తర్నిఖాతేవ చ
>
> ప్రోత్కీర్ణేవ చ వజ్రలేపఘటితేవ"........

అనునది మాలతీమాధవగత మయిన పద్యము. మాధవుని హృదయమునందు మాలతి లీన ప్రతిబింబిత లిఖిత అంతర్నిఖాత ప్రోత్కీర్ణరూప వజ్రలేపఘటిత యయినదో యని యుత్ప్రేక్షాపరంపర యున్నది. ఈ పరంపర సాతిశయకామావేశావస్థను సూచించును. ఈ యవస్థావిశేషమున ప్రియతమావిషయమగు విచిత్రసంకల్పగర్భ మయిన యౌత్సుక్యము వ్యక్త మగును. విప్రలంభము కామావస్థలు నిట్టి యౌత్సుక్యప్రాణము లయినందున మాధుర్యప్రసాద సముపేత మయిన కావ్యమునం దీ యుత్ప్రేక్షాపరంపర యవశ్యము శ్రోత్రపథమున నవతరించి యాస్వాదము కలుగ జేయును. సుకుమారచిత్తవృత్తిసుభగ ముత్తమ మయిన యీ రీతి శ్లాఘాస్పదము. ఇచటి కవివ్యాపారరూప మయిన లక్షణము సమస్తగుణాలంకారవర్గమున కనుగ్రాహకమై యున్నది. ఈ విఘూమణలక్షణము కవివ్యాపారద్వారమున శబ్దవ్యాపారార్థవ్యాపారములను గూడ స్పృశించుచుదై రమ్యముగ నున్నది.

ఈ యర్థమునె సమ్యగ్వివేచన మొనరించి యానందవర్ధనాచార్యుడు నిరూపించెను.

"ధ్వన్యాత్మభూతే శృంగారే సమీక్ష్య వినివేశితః
రూపకాదిరలంకారవర్గ ఏతి యథార్థతాం
వివక్షా తత్పరత్వేన నాంగిత్వేన కదాచన
కాలే చ గ్రహణత్యాగౌ నాతినిర్వహణైషితా

"ధ్వన్యాత్మ యయిన శృంగారమున సమీక్షాపురస్సరముగా రూపకాద్యలంకారములను కూర్చినచో నవి సార్థకము లగును." అని ధ్వనికారు డని క్రమముగా నిట్లు పలికెను. రూపకాద్యలంకారములను సమీక్షాపురస్సరముగా కూర్చుట యనునది యీ విధముగా నుండును. "అలంకారమును కూర్చునపు డా యలంకారము తత్పరముగా నుండునట్లు ప్రసమీక్ష చేయుట యొకరీతి. కూర్పబడునట్టి యలంకారమంగముగనె యుండవలెను కాని యది యొకప్పుడయిన నంగిగా నుండరా దనునది రెండవ రీతి. సముచితసమయమున నలంకారమును స్వీరించుట యనునది మూడవ రీతి. స్వీకరించిన యలంకారము నయినను సమయస్వభావము ననుసరించి పరిత్యజించుట యనునది నాల్గవ రీతి. అలంకారము నత్యంత మభినివేశమున నిర్వహింపకుండుట యనునది యయిదవ రీతి. ఈ విధముగా కొంత గ్రంథసందర్భమును సోదాహరణముగా విస్తరించి యీ కావ్యలక్షణాంశమునె నిరూపించెను. ఈ యంశము నభినవగుప్తపాదులు సహృదయాలోకలోచన మను తద్వివరణమున విస్తరముగా వ్యాఖ్యానించిరి. తత్కుతూహలము నదియె గ్రహించుగావుత. ఇచట తత్ప్రసంగ మొనర్చినచో గ్రంథభూయస్త్వమున లోక ముద్వేగము పొందునని దాని విస్తరించుట లేదు.

౨. అక్షరసంహతి

౮౯. యత్రాల్పైరక్షరైః శ్లిష్టైః విచిత్రార్థోపవర్ణనం
తదప్యక్షరసంఘాతం విద్యాల్లక్షణసంజ్ఞితం

అల్పములు శ్లిష్టములు నగు నక్షరములతోడనె విచిత్రార్థోపవర్ణన ముండునేని దాని నక్షరసంఘాతము – అక్షరసంహతి యను కావ్యలక్షణ మని గుర్తింపవలెను. ఇం దక్షరశబ్దమున యదృచ్ఛాత్మక

శబ్దప్రాధాన్యము సూచిత మగును. యదృచ్ఛాశబ్దములందు స్వరూపమునకే ప్రవృత్తినిమిత్తత్వము కలదు. కావున నల్పములే యగు నక్షరములతో విచిత్రార్థోపవర్ణన ముండుట. శ్లిష్టము లనుట శ్లేష యుక్తములని యర్థము కాదు. సుసంగతములై యుండుట యని భావము. ఇట్టి విశిష్టాక్షరోపలక్షిత మగుటచే విచిత్ర మయిన అర్థము= తద్రసోచితవిభావాది భావము ప్రతిపాదించు నర్థమును వర్ణింపవలయును. శ్రోతలగు సహృదయుల హృదయముల సంక్రమింపజేయుటకై సమర్థమగు కవివ్యాపార మక్షర సంహతి యగును. అక్షర సమూహమె సంక్రామ సమర్థకారణ మయినందున నిది యుక్తము.

"మానిని" యను పదములోని యక్షరము లీర్ష్యావిప్రలంభ శృంగారమున సముచితవిభావసౌందర్యము నాపాదింపగలవు. "తరుణీ" పదము నందలి యక్షరము లాభిలాషికశృంగారమున విభావపోషకములు కాగలవు. "వరతను" పదము నందలి యక్షరములు సంభోగశృంగారమున విభావధర్మప్రాపకములు కాగలవు. "మానమస్యా అస్తీతి మానినీ" యని మానినీపదవ్యుత్పత్తి. ధాతుబలమున ప్రత్యయబలమున గలుగు నర్థము పర్యంతమున సహకరించునది యయినను తత్పదగత తద్వర్ణగత స్వభావసౌందర్యమున నవశ్యము యదృచ్ఛాత్వ మందు సంగత మగును. కావున అక్షరముల సంఘాతమె యిందు ప్రధానము. యదృచ్ఛాశబ్దప్రాధాన్యమున కిది యుదాహరణము.

"విస్రంభాదుత్తమాంగం ప్లవగబలపతేః పాదమక్షస్య హంతుః
కృత్వోత్సంగే సలీలం త్వచి కనకమృగస్యాంగమాధాయ శేషం
బాణం రక్షఃకులఘ్నం ప్రగుణితమనుజేనాదరాత్తీక్ష్ణమక్ష్ణోః
కోణేనోద్వీక్షమాణ స్త్వదనుజవదనే దత్తకర్ణోఽయమాస్తే

రావణేశ్వరా! శ్రీరాముని ధీరప్రవృత్తి నాకర్ణింపుము. శ్రీరాముడు విశ్వాసాతిశయమున తన యుత్తమాంగమును వానరసేనానాథు డయిన్న సుగ్రీవుని యుత్సంగమున నుంచినాడు. అక్షకుమారుని నిహంత యయిన హనుమానుని యొడిలో పాద ముంచినాడు. కనకమృగము చర్మముపై సలీలముగా శేషాంగము నుంచినాడు. అనుజుడయిన లక్ష్మణు డాదరముగా పదును పెట్టిన రక్షఃకులఘ్న మగు

బాణము నక్షికోణమున తీక్ష్ణముగా జూచుచున్నాడు. నీ సోదరుడయిన విభీషణుని ముఖముగా దత్తకర్ణుడై యున్నాడు. ఈ పద్యము నిట్లు భావింపవలెను. విస్రంభాదిపదము లన్నియు విచిత్రార్థోపవర్ణనముతో నున్నవి. సుగ్రీవునందు విస్రంభము మైత్రీప్రధానము. వాలిహనన పూర్వకముగా సామ్రాజ్యప్రదాన మొనరించెను గావున తత్ఫలమున నట్టి విస్రంభ ముదయించినది. అక్షహంత యనుట, హనుమాను డేకాకి యయినను అశోకవనికావిప్లోషణ మొనరించి నాడని, రాక్షసబలక్షపణ మొనరించినాడని యీత డాయతిలో ప్రధానప్రకృతి యగుననియు సూచిత మగును. 'త్వచి' 'చర్మ' మనుట ప్రహతమారీచవృత్తాంతము స్పష్ట మగును. "బాణం రక్షఃకులఘ్నం" అనుట అందే బహుమానాతిశయము సూచిత మయినది. రాక్షసుల విషయమై దైవవైగుణ్యము విశదమయినది. ఎందెవని కేవ్యాపారము కలదో యందాతని ప్రాధాన్య మభివ్యక్త మగును. ప్రగుణిత మనుట బహుతరరణసమ్మర్ద ధురంధర మగుటచే కుటిలీకృత మయినను క్షేత్రబహుమానమున పునర్యోజనము వ్యక్త మగును. "త్వదనుజ వదనే" యనుట భేదోపాయకృత మయిన నీతిసంపద పరపక్షమున విపర్యయము భాసించును. "దత్తకర్ణ" యనుట యిది యాకర్ణన మాత్రమె కాని నిర్వ్యాజతేజోజాజ్వల్యమానౌజోధర్మము కల హృదయమున భేదము కలుగజేయు విషయమున నేమాత్ర మాదరము లేదనియు స్పష్ట మగును. "అయమాస్తే" ఈతడున్నా డనుట గంభిరధీరాకృతియై ప్రత్యాసన్నుడై యున్నాడని గోచరించును. "సలీలం" అనుట ప్రకృత మేమాత్ర మేమియు క్షోభము లేనందున నట్లున్నాడని స్ఫురించును. ఇట్లీ పద్యమున నలంకారఘటనాప్రయాసము లేకుండగనే యర్థసౌందర్యముండుట లక్షణకృతమె.

కావ్యాలంకారసూత్రవృత్తి రచించిన వామను డర్థము సాభిప్రాయముగా నుండుటను ఓజోగుణమని యనెను కదా! జడమయిన యర్థమున కభిప్రాయ ముండునని యనుట యేమి? "ఆ భాషావక్తకు శ్రోతకు నట్టి సాభిప్రాయత సంగతమగు నందురేని తద్గతమగు నా గుణమును అర్థమునకు చెప్పుట యెట్లు కుదురును?" "ఆ యర్థ

మర్థాంతరమును గోచరింపజేయుటయె యది దాని గుణము" అని యనుటయు సంగత మగుట లేదు. అట్లాక్షిప్యమగు నర్థాంతరమును వక్త్రభిప్రాయరూపమె. మొదటి యర్థమునకు గల యాక్షేపకత్వము కూడ కవిమనీషావ్యాపారబలము వలననె కలిగినది. ఆ బలము వలననె ఆ యర్థ మట్లున్నది. కవిమనీషావ్యాపారబలమం దుండదేని యా యర్థ మట్లుండదు. కావున ప్రౌఢి వస్తుతః వక్తృగతమె. అయినను దాని నర్థమున నాపాదింపవచ్చును. అది యుపచరితముగా భావింపవచ్చును. "అలం బహునా." ఈ లక్షణముల లక్ష్యము సంకీర్ణముగా కన్పడుచున్నది. అయినను సమన్వయబాహుల్యము ననుసరించి యుదాహరణముగా భావింపవలెను.

3. శోభ

౭౦౦. సిద్ధైరర్థైః సమం కృత్వా హ్యసిద్ధోర్థః ప్రసాధ్యతే
యత్ర శ్లక్ష్ణా విచిత్రార్థా సా శోభేత్యభిసంజ్ఞితా

సిద్ధములగు నర్థములతో సమానముగా నసిద్ధమగు నర్థము ప్రసాధిత మగునేని శోభ యను కావ్యలక్షణ మగును. ఈ శోభ శ్లక్ష్ణమై విచిత్రార్థముకలదై యుండును. అశోభనార్థము కూడ శోభిత మగును గావున నిది శోభ యయినది. సిద్ధార్థములతో గూర్చుట - ఉదా ;

మేదశ్ఛేదకృశోదరం లఘు భవత్యుత్థానయోగ్యం వపుః
సత్త్వానామపి లక్ష్యతే వికృతిమచ్చిత్తం భయక్రోధయోః
ఉత్కర్షః స చ ధన్వినాం యదిషవః సిధ్యంతి లక్ష్యే చలే
మిథ్యా హి వ్యసనం వదంతి మృగయామీదృగ్వినోదః కుతః

మృగయా వినోదము వ్యసన మనుట మిథ్య. ఇట్టి వినోద మింక దేని వలన గలుగును? మృగయా విహార మొనర్చినచో మేదశ్ఛేదమున నుదరము కృశ మగును. దేహము తేలికయై యుత్థానయోగ్య మగును. జంతువుల భయక్రోధము లందలి చిత్తవికారము తెలియును. చల లక్ష్యమునందు బాణములు ప్రసరించుట యనునది ధానుష్కులకు సముత్కర్ష. ఈ పద్యములో పాదత్రయమున ప్రసిద్ధార్థములు నిరూపితము లయినవి. అవి యభ్యసింపదగిన వని యట్లయినచో నవి శోభించునని నిరూపించి వానితో మృగయారూప మయిన యప్రసిద్ధ

మనుచిత మయిన యర్థము జతపఱచి నిరూపించెను. కాగా నది యుచితము విచిత్రమై భావనలో భాసించును. దీనిలో నే యలంకార మును లేదు. కవివ్యాపార ద్వారమున శబ్దార్థవ్యాపార మర్థఘటనాత్మక మయిన యెట్టి యలంకారమును నిరూపించుట లేదు. కవివ్యాపార కృతమగు హృద్యమయిన లక్షణార్థమె దీనిలో నున్నది. అశోభన మీ విధమున శోభన మైనందున నిది శోభ.

## ౪. అభిమానము.

౮౦౧. ధార్యమాణస్తు బహుభిర్వచనైః కార్యయుక్తిభిః
న యః పర్యవతిష్ఠేత సోఽభిమానస్తు సంజ్ఞితః

కార్యయుక్తి = ఫలయోజనము కల నానావచనములచే ధార్యమాణమయిన నేది పర్యవస్థితము కాదో యది యభిమానమను కావ్యలక్షణమని యనిరి. "ధార్యమాణ" స్థలమునందే "వార్యమాణ" పాఠము కలదు.

శీతాంశోరమృతచ్ఛటా యది కరాః కస్మాన్మనో మే భృశం
సంప్లుష్యన్త్యథ కాలకూటపటలీ సంవాస సంధుక్షితాః
కిం ప్రాణాన్ న హరంత్యుత ప్రియతమా సంజల్పమంత్రాక్షరైః
వార్యంతే కిము! యద్విమోహవివశాత్సంతాపతంత్రా స్థితిః

ఇవి చంద్రుని యమృతప్రసారము కల కిరణములే యగునేని నా మనము నేల దహించుచున్నవి? కాలకూటసంవాస సంధుక్షితములె యయినచో ప్రాణములను హరింపవేమి? నా ప్రియురాలి సంజల్ప మంత్రాక్షరములచే నివి నివారితము లగుచున్నవేమో? విమోహము వలన నా స్థితి సంతాపాధీనమయినది కదా! ఇది యభినవగుప్తుని పద్యము. దీనిలో నర్థముతో నర్థమునకు ఘటనము సుందరముగా నున్నది. ఫలయోజనములతో నిది హృదయమున స్థాప్యమాన మయినను నిలుచుటలేదు. మంత్రాక్షరములచే వార్యమాణ మయినను నివర్తించుట లేదు. ఇట్లిందలి యర్థ మలౌకికము. దీనికై యలం కార ముపాయముగా కవి స్వీకరింపలేదు. ఉపమానోపమేయభావ మే మాత్రము కవి నిరూపింపలేదు. కేవలము వక్త యొక్క యభి మతమునె కవి నిరూపించెను. "సంతాపతంత్రా స్థితిః" నే చేయున దేదియో యదియు లేదని యనుట యభిమానమను కావ్యలక్షణ

మయినది. ఈ యభిమానలక్షణమునె "సాదృశ్యము" అను పేరున కొందరు నిర్దేశించిరి.

"దృష్టశ్రుతానుభూతార్థ కథనాది సముద్భవం
సాదృశ్యం క్షోభజననం సారూప్యమితి సంజ్ఞితం."

వినిన చూచిన యనుభవించిన యర్థమును నిరూపింపగా గలుగు క్షోభజనన మయిన సారూప్యము సాదృశ్యలక్షణ మగును. చంద్రుడమృతకరుడని కాలకూటసహోదరుడని శ్రుతార్థము. మంత్రములు విషశమన మొనరించుట దృష్టార్థము. మోహాదికము స్వయముగా ననుభూతార్థము. ఇట్లీ పద్యమున దృష్టశ్రుతానుభూతార్థకథనము వలన సాదృశ్యము కలదు. అది లోకదృష్ట న్యాయమున నున్నది. ఇది హృదయమున ననవస్థానము కలుగ జేయుచున్నది. కావున క్షోభజనన మయినది. "చంద్రకిరణము లమృతసదృశము లయినచో దేహము నిట్లు దహించుటేల ? అనునది క్షోభజననము. ఇట్లే యితరము లందును గ్రహింపవలెను.

౫. గుణకీర్తనము.

లం౨. కీర్త్యమానైర్గుణైర్యత్ర వివిధార్థసముద్భవైః
దోషా న పరికథ్యంతే తజ్జ్ఞేయం గుణకీర్తనం

వివిధార్థసముద్భూతము లయిన కీర్త్యమానములగు గుణములచే దోషము లేమాత్రమును నిరూపితములు కాకపోయినచో నది గుణకీర్తనమను కావ్యలక్షణ మగును. ఉదా:—

పృథురసి గుణైః మూర్త్యా రామో నలో భరతో భవాన్
మహతి సమరే శత్రుఘ్నస్త్వం తథా జనకః స్థితౌ
ఇతి సుచరితై ర్మూర్తిం బిభ్రచ్చిరంతన భూభృతాం
కథమసి న మాంధాతా దేవస్త్రిలోకవిజయ్యపి.

రాజా ! నీవు గుణములచే పృథుచక్రవర్తి వయితివి. గొప్పవాడ వయితివి. ఆకారముచే రాముడు నలుడు భరతుడ వయితివి. మహాసమరమున శత్రుఘ్నుడ వయితివి. స్థితిలో జనకుడ వయితివి. ఇట్లు నీ సుచరితములచే చిరంతన భూపాలకుల మూర్తిని ధరించుచు త్రిలోకవిజయి దేవుడ వయినను మాంధాత వు కాలేదేమి ?

["మాం ధాతా = మాంధాతా" నన్ను పోషించువాడవు కాలేదేమి?]
దీనిలో పృధు రామ ప్రభృతులు వివిధు లున్నారు. వారి వారి కీర్త్యమానగుణములు స్పష్టనిర్దిష్టము లయినవి కావున వానిచే పృధు ప్రభృతుల దోషములు పరికల్పితము లగుట లేదు. ఆ యా పదముల వలన కొన్నికొన్ని దోషము లూహామార్గమున సంచరింపవచ్చును. పృధువనగనె బలాద్భూమిదోహనము, నలుడనగనె ద్యూతవ్యసనిత గోచరించును. ఇట్లె యితరములందును. కీర్త్యమానగుణములచే దోషములు పరికల్పితములు కావు కావున నీపద్యమున దోషము ప్రధానము కాదు. లక్షణవాక్యములో గుణములు = సుచరితములు. వీనిచే గలుగు చారుత్వము గుణకీర్తనమను కావ్యలక్షణము. శ్లేషానుగ్రహ ముండగా కావ్యలక్షణము లలంకారములను గూడ విచిత్రముగా జేయ గలవు. ఈ యంశము విశదము కాగలదు. ఈ గుణకీర్తనమున కన్యత్ర పాఠ మీ విధముగ నున్నది.

లోకే గుణాతిరిక్తానాం బహూనాం యత్ర నామభిః
ఏకో హి శబ్ద్యతే తత్తు విజ్ఞేయం గుణకీర్తనం

గుణాధికులయిన యనేకుల నామవ్యవహారములచే నొక వ్యక్తియే నిరూపితు డగు నేని గుణకీర్తనమను లక్షణమగునను భావము స్పష్టము.

### ౬. ప్రోత్సాహనము

లా౦౩. ఉత్సాహజననైః స్పష్టైః అర్థైరౌపమ్య సంశ్రయైః
ప్రసిద్ధైరుపగూఢం చ జ్ఞేయం ప్రోత్సాహనం బుధైః

ఉత్సాహ ముదయింపజేయు స్పష్టప్రసిద్ధార్థములతో గూడిన వచనము ప్రోత్సాహన మగును. ఇందలి యర్థము లౌపమ్య సంశ్రయములై యుండవలయును. "ఔపమ్యస్య సంశ్రయణమన్వేషణం యత్ర" ఔపమ్యాన్వేషణములతో నుండవలయు ననుట సంప్రదాయార్థము. ఔపమ్యాన్వేషణ మున్నను స్పష్టప్రసిద్ధార్థత యుండుట యభీష్టము. ఉదా :- భట్టేందురాజపద్యము.

హరవృషభతత్యైవ తస్య మాతా
జయతి జగత్యసమానసూతిరేకా

నివసతి పరమేశ్వరోపి యస్మిన్
సహతనయః సగణః సహావరోధః

నందీశ్వరుడు హరవృషభ ముగుట వలననే యాతని మాత యొకతెయే యసమానసూతియై జగతిలో జయతి. నందీశ్వరునందు పరమేశ్వరుడును తనయుసహితుడై ప్రమథగణసమేతుడై సపత్నీకుడై నివసించుచున్నాడు. శివకుటుంబ నివాసాశ్రయ మయిన నందిదేవుడె ధన్యుడు. అను నిందలి భావమువలన నప్రస్తుత ప్రశంసయు గోచరించును. తద్వైచిత్ర్యముకూడ ప్రోత్సాహనత్వలక్షణకృతమె యగును. హరవృషభోద్దేశమున నున్న యీ పద్యమున నందీశ్వరునకు తన్మాతకు నౌపమ్యాన్వేషణము శక్యమె. ఆమె లక్ష్మి. ఆతడు మురారి మొదలగు వానిలో గోచరించు వైచిత్ర్యము లక్షణకృతమె యగును. ఈ ప్రోత్సాహము నితరులు ప్రియవచనమని పఠించిరి.

యత్ప్రసన్నేన మనసా పూజ్యాన్పూజయితుం వచః
హర్షప్రకాశనార్థం తు సా ప్రియోక్తిరుదాహృతా

పూజ్యపూజనమునకై ప్రసన్నమనస్సుతో హర్షప్రకాశనమునకు పలుకుట ప్రియోక్తి ప్రియవచనమని పరిగణింతురు.

౭. ఉదాహరణము.

౬౦౪. యత్రైకస్యాపి శబ్దస్య దర్శనాత్సుబహూన్యపి
యాంతి సిద్ధిమనుక్తాని తదుదాహరణం స్మృతం

ఒకశబ్దమున కేని కల సిద్ధిదర్శనమువలన నిరూపితములు కాని సుబహుశబ్దములును సిద్ధిని పొందునేని యుదాహరణమను కావ్యలక్షణమగును. ఉదా:-

వల్మీకం కిము తోద్ధృతో గిరిరయం కస్య స్పృశేదాశయం
త్రైలోక్యం తపసా జితం యది మయా దోష్ణా కిమేతావతా
సర్వం సాధ్వథవా రుణత్సి విరహక్షామస్య రామస్య చేత్
త్వద్దంతాకిత వాలి కక్షరుధిరక్లిన్నాగ్రపుంఖం శరం

రావణుని స్వాత్మసంభావన మీవిధమున నున్నది. నేనే కైలాసగిరిని పెకలించిన వాడనె కావచ్చును. అది యొక వల్మీకము. అది యెవని యాశయము స్పృశింపగలదు ? మూడులోకములను తపముచే

జయించిన వాడనే కావచ్చును. ఇంతటి యిన్నిభుజముల ప్రయోజన మేమి? విరహార్తుడయిన రాముని బాణమును రావణుడు నిరోధించు నేని "సర్వం సాధు." రాముని శరము "త్వద్దంతాం కిత వాలి కక్షరుధిర క్లిన్నాగ్రపుంఖము." రావణుని (నీ) దంతముల గాటులు కల వాలి కక్షమునందలి రక్తముచే బాణాగ్ర పుంఖము తడిసినది. అట్టి రామ బాణమును నేనడ్డుపెట్టుదు నేని "సర్వం సాధు" దీనిలో రావణుని దంతపరిఘట్టిత వాలి కక్ష పాటన ముదాహృతము కాగా రావణుని యవమానరూప మయిన యర్థమవగత మగును. ఈ యేకదర్శనమున నితరము లనేకము లిచట సిద్ధప్రాయములై స్ఫురించును. వాలివలన నపజయము కలుగుట, వాలికక్షము బిగింపువలన క్షయ్య (నాశ మొదవించు) పరిగ్రహ మయినది. అట్లె చతురర్ణవభ్రమణము. వాలిదయతో త్యజించుట అయినను రావణుడు ప్రతీకార మొనర్ప లేకపోవుట మరల రావణున కభిమానము దర్పము ఇత్యాదిక మంతయు గమ్య మగుచున్నది. అక్షరసంహతియు నిట్టిదే కాని కొంత విశేష మున్నది. అక్షరసంహతిలో నవశ్యోపాదానవ్యశబ్దాంతరస్థానమున శబ్దాంతరోపాదాన ముండును. "హనూమతః" అని చెప్పవలసి యుండగా "అక్షస్య హంతుః" అనుట కలదు. ఇందు "త్వద్దంతాంకితవాలి" యను స్థలమున తదీయాధికారోదాహరణ మున్నది. ఇతరు లీ యుదాహరణ మిట్లు పఠించిరి.

యత్ర తులార్థయుక్తేన వాక్యేనాభి ప్రదర్శనాత్
సాధ్యంతే నిపుణైరర్థాస్తదుదాహరణం స్మృతం

తుల్యార్థవాక్యప్రదర్శనమున నిపుణు లర్థములను సాధింతు రేని యది యుదాహరణమగును. తత్సమయ భావులగు తుల్యార్థములచే నర్థాంతరము లభిగమ్యము లయినచో నా వాక్య ముదాహరణ మగునని ఫలీభూతార్థము.

౮. నిరుక్తము

౮౦౫. నిరుక్తం ద్వివిధం ప్రోక్తం తథ్యం చాతథ్యమేవ చ
సిద్ధిపూర్వం భవేత్తథ్యమతథ్యం చాప్రసాధితం

నిరుక్తమను కావ్యలక్షణము రెండువిధములు. తథ్యనిరుక్తము. అతథ్యనిరుక్తము నని. సిద్ధిపూర్వము తథ్యనిరుక్తమని యప్రసాధిత మతథ్యనిరుక్తమని యందురు. లక్షణమున స్వీకరించుట సిద్ధి. అట్టి సిద్ధిచే ప్రసాధితము తథ్యనిరుక్త మగును. తద్విపరీత మతథ్యము— ఉదా :– అభినవగుప్తపద్యము.

> వీరోత్సవే సంగరసీమ్ని మూఢం
> యః ప్రాపయత్సత్యపథం కథంచిత్
> సత్యార్జునః సోఽపి చ నామ కృష్ణః
> ప్రసిద్ధిరిత్థం వితథైవ వార్తా

యుద్ధభూమిలో వీరోత్సవమునందు తెలియక యెట్లో తన నామము నెవడు సత్యము చేసెనో ఆ సత్యార్జునుడును కృష్ణుడే యయ్యెనా? ఇట్లు ప్రసిద్ధి వార్త యనునది సర్వము వితథమె యయ్యెనె! కృష్ణార్జుననామములు పరవిషయమున తథ్యములగుట స్వవిషయమున నతథ్యములగుట యిందున్నది. అర్జున = ధవళవర్ణుడు. కృష్ణ = నీలవర్ణుడు. అర్జును డర్జునుడు కాలేదు కృష్ణుడయ్యెను. కృష్ణుడు కృష్ణుడె కాలేదు అర్జును డయ్యెను. ఇట్టి యర్థ మిచటనున్నను శ్లేష కాదు. అర్థద్వయమునకు తుల్యప్రతిపత్తి యున్నప్పుడె శ్లేష యగును. "గావో వః పావనానాం పరమపరిమితాం ప్రీతిముత్పాదయంతు" అను సూర్యశతకములోని పద్యభాగమున గో శబ్దము కిరణార్థమున గవార్థమున ననాదిగా ప్రసిద్ధము. ఇందట్టి ప్రసిద్ధి లేదు. ఒకయర్థమున నన్యార్థమునకు సమయ మేమికలదు? ఇట్లే తథ్యాతథ్యముల నుదాహరింపదగును. అన్యపాఠ మిట్లున్నది.

> నిరవద్యస్య వాక్యస్య పూర్వోక్తార్థప్రసిద్ధయే
> యదుచ్యతే తు వచనం నిరుక్తం తదుదాహృతం

పూర్వోక్తార్థప్రసిద్ధికై నిరవద్యమగు వాక్యము యొక్క వచనము నిరుక్తమగును. శబ్దమువలన మొదటగా భాసించు నర్థము యొక్క ప్రసిద్ధికై దాని యవద్యభావము (దోషము) స్పష్టపఱచి నిరూపించుట నిరుక్త మగును. "నిరుక్తమితి నిరర్థకమేవాత్ర వాచ్యం" నిరుక్త మనుటచే నిందు వాచ్యము నిరర్థకమని స్పష్ట మగును.

## ౯. గుణానువాదము. ౧౦. అతిశయము

౧౦౬. గుణానువాదో హీనానాముత్తమైరుపమాకృతః
ఉత్తమార్థాద్విశిష్టో యః న చాప్యతిశయః స్మృతః

హీనము లగువానికి ఉత్తమములతో నుపమాకృతమగు రీతి గుణానువాద మగును. గుణపరిమితమగు పదార్థమున కుత్కృష్ట గుణము లాపాదించి ఉపమానిరూపణ మొనరించుట గుణానువాదమను కావ్యలక్షణమగును. ఆ యుపమాకృతముగనె గుణముల కుత్సేకము కలుగును. ఉదా :- "పాలితా ద్యౌరివేంద్రేణ త్వయా రాజన్ వసుంధరా" రాజా! స్వర్గమును దేవేంద్రుడువలె వసుంధరను నీవు పాలించితివి. ఇందింద్రోపమాకృతమయిన విశేషము రాజునందు భాసించుటచే గుణానువాదమయినది ఏమి? యిది యుపమాలంకారమె యగును కదా? అవును. ఇది యుపమాలంకారమె యగును. అయిన నేమి? అలంకారముల వైచిత్ర్య మంతయు లక్షణకృతమె యగునని నిరూపిత మయినది. శిక్షితులయిన దండిప్రభృతులును లక్షణకృతశోభాస్పదము లయిన యుపమాభేదములను నిరూపించిరి. వానియందు కొన్ని భేద కాంశములు కలవు. అభిఖ్యావ (విషయము చెప్పవలయునన్న యభి లాష) అసంశయము, నిర్ణయము మొదలుగా గల యర్థము లన్నియు నిందు భేదకములు. అట్లు భేదకాంశ ముండగా పృథగలంకార రూప ముగా వారు పరిగణించిరి. ఆ విధముగా గణింపగా సంసృష్టి సంకర ములు సంభవించుచున్నవి. ఇంతగా వానిలో భేదభావ మున్నను సర్వ మర్థమాత్రమె యనినచో ననవచ్చును. ఆ యర్థమనునదియె లక్షణము. అందుననె యది గుణానువాద మయినది. రాజత్వమును విభజించి విచారింతుమేని యది యిట్లు స్పష్టమగును. మకుటాద్య లంకారము, శౌర్యాదిగుణము, పృథ్వ్యాధోరస్కత్వాది లక్షణసము దాయము నను మూడునుండగా రాజలంకార్యుడు గుణవంతుడు లక్షణీయుడు నగుచున్నాడు అట్లే కావ్యము నగును. కావున గుణా లంకార వ్యతిరిక్తము లన్నియు కావ్యలక్షణము లగునని భావింపవలసి యున్నది. "అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా" యను కుమారసంభవ శ్లోకమున నాఖ్యాన మను కావ్యలక్షణమును సమన్వయించునది.

ఇట్లయినచో నంతట లక్షణయోగము పట్టును గదా? "క ఆక్షేపార్థః ప్రియమేవాస్మాకముదః," అట్లే యగును. అంతట లక్షణయోగము కలదు. ఇందాక్షేపార్థ మేమి కలదు? మాకిది యభీష్టమె. అలంకార యుక్తమగు కావ్యమంతట లక్షణయోగమె కలదు. అట్లయినచో "గౌర్వాహీకః" "బాహీకు డెద్దు" అను రూపక యోగమున్న స్థలమున గూడ లక్షణమె కలదని యనుట లేదే! దోషపరివర్జనము గుణవత్త్వము రసవత్త్వము మొదలగు వాని వైకల్యమున్నందున లక్షణమె యున్నదని యన రేమి? "అస్మాస్వాపాదితో దోషస్త్వయై వోన్మీలితః." మా యందాపాదించిన దోషమును నీవే యున్మీలించితివి. లక్షణ మున్నదనునపుడు గుణవత్త్వ రసవత్త్వాది సాకల్యముండుట యావశ్యకము. అది లేనప్పుడు లక్షణమున్నదన్న వ్యవహారము రాదు. "ఇత్యాస్తాం తావత్." ఇతరస్థలమున దీని పాఠ మిట్లున్నది.

గుణాభిధానైర్వివిధైర్వివిధార్థ ప్రయోజితైః
గుణాతిపాతో మధురైర్నిష్ఠురైర్వా భవేదిహ

వివిధార్థప్రయోజితము లయిన వివిధగుణాభిధానములతో మధురనిష్ఠురార్థములతో గూడి యుండుట గుణాతిపాతమగును. గుణము లుపమానభూతము లయిన మధురవిధానముల చేగాని నిష్ఠురముల చే గాని యుత్తమముల చేగాని ప్రయోజితములగుట యిందలి భావము. అట్లు ప్రయోజితములయిన గుణాభిధానములతో నుపలక్షితమగువది గుణాతిపాతమని భావము. ఇతరులు నిరూపించిన గుణానువాదలక్షణ మీ విధముగనున్నది.

గుణానువాదః స జ్ఞేయో యత్రాభేదోపచారతః
గౌణీం వృత్తిముపాశ్రిత్య వస్తునో రూపముచ్యతే

అభేదోపచారమున గౌణీవృత్తి ననుసరించి వస్తురూపము నిరూపించినచో నది గుణానువాదమని తెలియవలయును. దీనికి లక్ష్యముగా శాకుంతలములోని "అనాఘ్రాతం పుష్పం కిసలయమలూనం కరరుహైః" అను కాళిదాసు పద్యము నిరూపిత మయినది.

అతిశయ లక్షణ లక్షణ మిట్లున్నది. ఉత్తమార్థముకన్న విశిష్ట మగు నర్థ మతిశయము. "ఉక్తాదప్యర్థాద్విశేషః" ఉక్తార్థముకన్నను

విశిష్టార్థమున్నచో నతిశయమగును. ఉదాహరణము భట్టేందురాజ పద్యము. అభినవగుప్తప్రామాణ్యమున నిది భట్టేందురాజపద్యమె. అమరుకశతకమునందు ప్రక్షిప్తముగా ప్రవేశించి యుండును.

యావంత్యేవ పదాన్యలీకవిముఖై రాలీజనైః శిక్షితా
తావంత్యేవ కృతాగసో ద్రుతతరం సంపాద్య పత్యుః పురః
ప్రారబ్ధా పరతో యథా మనసిజస్యేచ్ఛా తథా వర్తితుం
ప్రేమ్ణో మౌగ్ధ్యవిభూషితస్య సహజః కోప్యేష కాన్తః క్రమః

చెప్పుడు మాటలు చెప్పు చెలియలే యే మాటలు నేర్పినారో యన్నిమాటల నపరాధ మొనరించిన ప్రియుని సమీపమున వేగముగా బలికి ఆ పిమ్మట మన్మథుని యిచ్ఛానుసారముగనె ప్రవర్తించుట కామె ప్రారంభించినది. మౌగ్ధ్యవిభూషిత మయిన ప్రేమ యొక్క క్రమరీతి సహజసుందరము. చెప్పుట కలవి కానిది. ఇందుత్తమ ప్రేమ యందలి యీర్ష్యాత్మక మయిన యర్థము కన్నను విశేషమా నిరూపిత మయినది. ఈ పద్యములోని పదము లన్నిటియందును అభిప్రాయ విశేషము కలదు. అది వివేచనీయము. ఇట్లు సంభావ్యమానము కావచ్చును గావున నిది యతిశయోక్తి కాదు. అట్లయిన నదియు లక్షణముననె యలంకార మగుటను సమనంతరమె నిరూపింతుము. అన్యపాఠము.

బహూన్ గుణాన్ కీర్తయిత్వా సామాన్యజనసంభవాన్
విశేషః కీర్త్యతే యత్ర జ్ఞేయః సోఽతిశయో బుధైః

సామాన్యజనసంభవములగు నానాగుణములను నిరూపించి విశేషమును కీర్తించినచో నది యతిశయమును కావ్యలక్షణ మగునని బుధులు కీర్తించిరి. అతిశయకీర్తన ముండుటచే నతిశయము.

౧౧ హేతువు

౮౦౩. బహూనాం భాషమాణానాం త్వేకస్యార్థవినిశ్చయం
సిద్ధోపమానవచనం హేతు రిత్యభిసంజ్ఞితః

ఇతరు లాభాషించిన బహువాదములలో నొకవాదము యొక్క యర్థవినిర్ణయము సిద్ధోపమానవచనముతో నుండునేని హేతువని పెద్ద లనిరి. హేతువె సహేతువు. భాషమాణములగు బహురీతుల నాద

రింపక అసాధారణమయిన యొకయర్థమును నిర్ణయించి కర్తవ్యముగా నవలంబించి సిద్ధమగు నట్టిదానికి ప్రమాణముగా నుపమానవచనము = ఉపక్షేపవచనచము (డుమిఙ్ = ప్రక్షేపణే) నిరూపించుట సహేతు వగును. అది హేతుసహితముగా ప్రతిభాసించుటచే సహేతువు. భట్టేందురాజపద్యము- ఉదా.

ఏకే వారినిధిప్రవేశమపరే లోకాంతరాలోకనం
కేచిత్పావకయోగినం నిజగదుః క్షీణేఽహ్ని చండార్చిషః
మిథ్యా చైతదసాక్షికం ప్రియసఖి! ప్రత్యక్షతీవ్రాతపో
మన్యేఽహం పునరధ్వనీనరమణీచేతోఽధి శేతే రవిః

ప్రొద్దుకూకగా సూర్యునకు వారినిధిప్రవేశమును కొందరు చెప్పుదురు. కొందరు లోకాంతరాలోకమును పలుకుదురు. కొందరు పావకయోగమును చెప్పుదురు. కాని యిది యంతయు మిథ్య, సర్వ మసాక్షికము. ప్రియసఖి! ప్రత్యక్షతీవ్రాతపము కల యీ సూర్యుడు పాంథవనితామనస్సులలో శయనించినాడని నేను భావింతును. ఇందసాధారణార్థ వినిర్ణయము సిద్ధపక్షోపక్షేపము స్పష్టము. అన్యపాఠము.

యత్ర ప్రయోజనసామర్థ్యాద్వాక్యం శిష్టార్థసాధనం
సమాసోక్తం మనోగ్రాహి సహేతురితి సంజ్ఞితః

ప్రయోజనసామర్థ్యము వలన వాక్యము శిష్టార్థ సాధన మయి నచో నది సహేతు వను సంజ్ఞకలదగును. అది సమాసోక్తము. మనో గ్రాహియు నగును. "సమ్యగస్యతే హృది క్షిప్యతే యేన స సమాసః" బాగుగా హృదయమున నిక్షిప్తము చేయునది సమాసము. ఉపపత్తి= ఈ యుపపత్తి నిరూపితము సమాసోక్తము. రమ్యము మనోహరము విశిష్టమగు నర్థము చక్కగా హృదయమున కూర్పుపొందునేని యది సహేతువని భావము.

౧౨. సారూప్యము.

౮౦౮. అపదేశస్తు పరోక్షే [యస్మాదుత్పద్యతేఽనుకరణేన
లక్షణ సమానకరణాత్సారూప్యం తత్తు విజ్ఞేయం

అనుకరణముచే పరోక్షరూపమగు నపదేశము కలిగినచో లక్షణా సమానకరణమువలన నది సారూప్యమను కావ్యలక్షణ మగును.

ప్రత్యక్షము కాని వస్తువు అనుకరణ విధానమున గోచరించునట్లు చేయుట అపదేశము- ఉదా :- అభినవగుప్తపద్యము.

సైందూరీకృత సాంద్ర కుంకుమరస ప్రచ్ఛాయమాలోచ్యతే
యత్ప్రాచ్యాం దిశి వక్రిమాపదమిదం దృగ్ద్వంద్వలేహ్యం మహః
తత్తేజో జరఠాంశునా కలయతా భావిప్రవాసావధిం
సంధ్యా ముగ్ధవధూ కపోలఫలకే కీర్ణో నఖాగ్రాంకురః

సాంద్రకుంకుమరసకాంతి సిందూరముగా ప్రాచీదిశయందు వంకరగానున్న యీ మహస్సు ఎయ్యది రెండు నేత్రముల కాస్వాద్యమై యున్నదో యది భావిప్రవాసావధిని భావించు భాస్కరుడు సంధ్యాముగ్ధవధూకపోలమున నేర్పఱచిన నఖాగ్రాంకురముగా నున్నది. దీనిలో "యత్" "ఎయ్యది" యని నిర్దేశ్యమగునది తత్త్వము సరిగా తెలియనందున పరోక్షవస్తు వనవలెను. ప్రచ్ఛాయమాత్ర మనుకరణము. సైందూరీకృతేత్యాది లక్షణముచే నిది యపదేశ్యము = ఆలోచ్యమయినది. లక్షణసమానకరణము- ఈ లక్షణమున "సమానం సప్రమాణం కరణం దర్శనక్రియా" తగిన సదృశవిధమున దర్శించుట సారూప్యమయినది. పౌర్ణమాసీసమయమునందును చంద్రునిభాగము వక్రరేఖగా గోచరించును. సంధ్యాసమయమునం దుదయాచలాంతరిత చంద్రరేఖ యట్లుండును. ఉపమేయము లేనందున నిది యుపమాలంకారము కాదు. ఉపపమేయమె పూర్వార్థమున సూచితము. పుస్తకాంతరములందు పాఠ మిట్లున్నది.

యథాదేశం యథాకాలం యథారూపం చ వర్ణ్యతే
యత్ప్రత్యక్షం పరోక్షం వా దృష్టం తద్వర్ణతోపి చ

ప్రత్యక్షమగు వస్తువు పరోక్షమువలె యథాదేశము యథాకాలము యథారూపము వర్ణితమగునేని యది సారూప్య మగును.

౧౩. మిథ్యాధ్యవసాయము.

౮౦౯. అభూతపూర్వైర్యత్రార్థైస్తత్తుల్యార్థస్య నిష్ఠయః
స మిథ్యాధ్యవసాయస్తు ప్రోచ్యతే కావ్యలక్షణం

అభూతపూర్వములగు నర్థములతో తుల్యమగు నర్థమునకు నిర్ణయము కలిగినచో నది మిథ్యాధ్యవసాయమను కావ్యలక్షణమగును.

అపారమార్థికములగు నర్థములతో 'సమానమయిన అవస్తుభూతా ర్థాంతరనిశ్చయ ముండుట మిథ్యాధ్యవసాయమని భావము. అర్థాంత రమునందు వక్తృవ్యాపార ముండుటయు నిందు వివక్షితము.

ఉదా :- అభినవగుప్త పద్యము.

యో దుర్జనాద్వాంఛిత సిద్ధిమీహతే
స నూనముత్క్రామతి తం సుఖైధినం
జుహ్వాజ్జ్వలాగ్నే విగతార్థ మండలం
ప్రసహ్య షష్ఠం విషయం ప్రసాధయేత్

లోకములో నెవడు దుర్జనుని వలన వాంఛితసిద్ధిని గోరునో ఆ సుఖభోగి నవశ్యముగా నాతడతిక్రమించును. నష్టమయిన ద్రవ్యమును జలాగ్నిలో హోమము చేయుచు నారనవిషయము నాత డవశ్యము సాధించును. దుర్జనుని వలన వాంఛితసిద్ధి యుండదు. దుర్జను నతిక్ర మింప గలుగుట యుండదు. జలాగ్నిలో హోమము చేయుటయుండదు. ఆరవ విషయము నుండదు. అపారమార్థికము లవస్తుభూతము లగు నర్థము లిందున్నవి. ఇందు కావ్యలక్షణమ.. లక్షణవచనమునందే చెప్పుటచే కావ్యములం దలోకవిపర్యాసబాహుల్య మవశ్య ముండునని నిదర్శించి నట్లయినది. అన్యపాఠము.

విచారస్యాన్యథాభావ స్తథా దృష్టాపదృష్టయోః
సందేహాత్కల్ప్యతే యత్ర స విక్షేపో విపర్యయః

"విచార్యతే ఇతి విచారోఽర్థః అదృష్టమిత్యర్థః" దృష్టాదృష్టా పదిష్టముల కన్యథాభావము సందేహమున కల్పిత మగునేని విక్షేప సహిత మగునది విపర్యయ మన దగును. ఇందు సందేహ మనునది భ్రమము. అన్యథాభావము. విషయతత్త్వము నన్యథాకారముగా గోచరింపజేయు సంశయను కూడ విపర్యయమే యగును.

౧౪. సిద్ధి

౪౧౧. బహూనాం చప్రధానానాం మధ్యే యన్నామ కీర్త్యతే
ఏకార్థసాధనకృతం సా సిద్ధిరితి కీర్తితా

ప్రధానములు ప్రసిద్ధములునగు ననేకములలో నప్రసిద్ధమగు నొకటి యసాధారణముగా నున్నదని కించిత్ప్రయోజనసిద్ధికై కీర్తిత

మగునేని యది సిద్ధి యగును. ఏకార్థసాధనకృతం అసాధారణప్రయోజనసంపత్తికై కరణముగా నివేశితమగుట యని భావము. సిద్ధిహేతువగుటచే నిది సిద్ధి- ఉదా:-

భద్రేశ్వరః సురసరిత్స భవానహం చ
త్రైలోక్యసారమిహ సంప్రతి జీవలోకే
భద్రేశ్వరః సురవరేషు సరిత్సు గంగా
త్వం పార్థివేష్వహమతీవ సుదుఃఖితేషు

భద్రేశ్వరుడు దేవనది యూ నీవు నేనును ప్రస్తుత మీ జీవలోకమున త్రైలోక్యసారము. సురవరులలో భద్రేశ్వరుడు నదులలో గంగానది భూపతులలో నీవు "అతీవ" సుదుఃఖితులలో నేనును. ఇందు "నీవు నేను" అనుట యప్రసిద్ధము. ప్రసిద్ధమధ్యమునం దుపాత్తము. సాధారణ్యసిద్ధి పొంది యసాధారణప్రయోజన మాపాదించుచున్నది.

౧౫. పదోచ్చయము

౮౧౧. గుణైర్బహుభరేకార్థైః పదైర్యః ప్రశస్యతే
పదోచ్చయం తు తం విద్యాన్నానార్థగ్రథితార్థకం

నానావిధగుణములచే నేకార్థములగు పదములచే ప్రశంసితమగునది నానార్థగ్రథితార్థకము కాగా పదోచ్చయముగా గుర్తింపవలెననుట సామాన్యార్థము. ఏకార్థములు=ఏకతాత్పర్యార్థనిష్ఠములగు బహుపదములచే వాచ్యములుగా స్వీకృతములగు ధర్మములుండును. తదుపలక్షితముగా వస్తువును ప్రశంసన మొనర్చుటయుందున్నది. నానార్థములతో గ్రథితాత్మకముగా నిది యున్నది, తదుపలంభితస్వరూపముతో నున్నది. కాన నిది పదోచ్చయము. "పదానాముచ్చయః ఉత్కర్షేణ చయః బాహుల్యం యత్ర" పదముల యుత్కర్షముతో నున్న బాహుల్యముండుట పదోచ్చయము. ఉదా:- మాలతీమాధవమున భవభూతి పద్యము.

అసారం సంసారం పరిముషితరత్నం త్రిభువనం
నిరాలోకం లోకం జననయననిర్మాణమఫలం

అదర్పం కందర్పం మరణశరణం బాంధవజనం
జగజ్జీర్ణారణ్యం కథమసి విధాతుం వ్యవసితః

తన ప్రియురాలయిన మాలతిని శ్మశానమున నఘోరఘంటుడు సంహరింప యత్నింపగా మాధవుడనుట. సంసార మసార మొనరించుటకు త్రిభువనము హృతరత్న మొనరించుటకు. లోక మనాలోకము చేయుటకు జననయననిర్మాణ మఫల మొనరించుటకు కందర్పు నదర్పు చేయుటకు బాంధవజనము మరణశరణ మొనర్చుటకు జగము జీర్ణారణ్య మొనర్చుటకు ప్రయత్నపడితివేమి ? దీనిలో నవాంతరావగమ మాపాదించు నవాంతరవాక్యరూపములయిన పదముల తాత్పర్య మభిన్న మయినను స్వార్థమున భిన్నమె. పదోచ్చయమను పదమున పద పదమును పాదపదముగా కొందరు పలికి భాగమని యర్థము నిర్దేశించిరి.

### ౧౬. ఆక్రందనము.

౪౧౨. ఆత్మభావముపన్యస్య పరసాదృశ్యయుక్తిభిః
తీవ్రార్థభాషణం యత్స్యాదాక్రందః స తు కీర్తితః

ఆత్మభావము నుపన్యసించి పరసాదృశ్యయుక్తివిశేషములతో తీవ్రార్థభాషణము నిరూపిత మయినచో నాక్రందమగును. తీవ్రమనుట సాక్షా దవాచ్యమని భావము. పరు నుద్దేశించి సాదృశ్యయోజన ప్రకారములతో తన యభిప్రాయమును ప్రథమమున నిరూపించి దాని నంతట స్ఫుటముగా ప్రతిపాదించుట యిందలి తత్త్వము. ఇది నిజభావావిష్కరణప్రధాన మయినందున ఆక్రందమను కావ్యలక్షణ మయినది.

ఉదా :- అభినవగుప్త పద్యము.

కిం పాంథ ! త్వరసే విలోకయ నిశాం యాహ్యున్ముఖీ పాండురా
చంద్రం చుంబితుమీహతే ప్రకటయంత్యగ్రే సరాగాం స్థితిం
యద్వా నాగరభోగ దుర్లలితకైర్న్యస్తాపి న జ్ఞాయతే
గ్రామేఽగ్రామ్య జనోపభోగసుభగం నిర్వ్యాజరమ్యం సుఖం

ఓయి ! పాంథా ! త్వరపడియెదవేమి ? ఈ నిశను జూడుము !. ఎదుట సరాగస్థితిని ప్రకటించుచు ఉన్ముఖయై పాండురయై చంద్రుని చుంబింప గోరుచున్నదో ! యద్వా; నాగర భోగ దుర్లలితరీతులచే నెట్లో యై స్పష్టముగ దెలియుటలేదు. గ్రామమునం దగ్రామ్యజనోప

భోగసుభగ మవ్యాజరమ్య మయిన సుఖము కలదు గదా! ఇందుత్త రార్థమున, భోజనశయనాది సంభోగమున గ్రామీణజనుడె రమ్యతము డని గోచరించును. అది పలుకునట్టి స్త్రీయొక్క పలుకరాని మోహ ప్రాయమయిన యాత్మాభిప్రాయము. అది యరోచక మగుట మొదట నిరూపితము. నిశాకర దృష్టాంతసాదృశ్యమున తీవ్రమగు స్వాత్మాను రాగ మావిష్కృత మయినది. ఇతరు లిట్లు పఠించిరి.

రూపకై రుపమాభిర్వాతుల్యార్థాభిః ప్రయోజితైః
అప్రత్యక్షార్థసంస్పర్శః తుల్యతర్కః ప్రకీర్తితః

సుప్రయుక్తములై తుల్యార్థములతో నున్న రూపకోపమాలం కారములచే నప్రత్యక్షార్థసంస్పర్శము కలుగునేని తుల్యతర్క మగును. అప్రత్యక్షార్థసంస్పర్శ మనుట అప్రత్యక్షమగు నాత్మభావము గోచరింప జేయుట యని భావము. పరసాదృశ్యముకల రూపకోపమలు స్పష్టము. కాని స్వాత్మభావమున జ్ఞాపనముచేయుట యున్నచో తుల్యతర్క మగునని తాత్పర్యము.

౧౭. మనోరథము

౮౧౩. హృదయస్థస్య భావస్య సుశ్లిష్టార్థప్రదర్శనం
అన్యాపదేశకథనైర్మనోరథ ఇతి స్మృతః

అన్యాపదేశకథనములచే హృదయగతమయిన భావమునకు సుశ్లిష్టార్థము ప్రదర్శించుట మనోరథమని వ్యవహృతమయినది. ఉదా:

నిర్గంధదురారోహం పుత్రక! మా పాటలీం సమారోహ!
ఆరూఢనిపతితాః కే అనయా న కృతా ఇహ గ్రామే

ఆ గ్రామవిషయము సరిగా తెలియని నవీనకాముకు డొకడు దురాశయ పుంశ్చలీ సంగమోత్సుకుడు కాగా నొక వృద్ధవిదగ్ధవనిత తన యభిప్రాయద్యోతనమున నిట్లు ప్రబోధించు చున్నది. ఇదియె హృదయగతభావము. ఇతరభావాపదేశమున నీ ప్రస్తుతమె యిందు ప్రదర్శితము. వృక్షమారోహించువాని నిట్లు పలుకుట ప్రథమార్థము. అబ్బాయీ! నిర్గంధమయిన యీ దురారోహపాటలీవృక్ష మధిరో హింతు వేలనయ్యా? ఈగ్రామములో దీని నెక్కి జారిపడనివారు కలరా? ఎక్కిన వారి నందరి నిది జారవేసినది సుమా! ప్రస్తుతార్థము

గోచరింపజేయుట కన్యార్థ మపదేశముగ నున్నది. అందుననె యిది ప్రస్తుతప్రశంస యున్నది. అదియు మనోరథమునం దంతర్భూత మయినది. అలంకారమున నలంకారత్వ ముండదనుట యేమిమాట? లక్షణము లక్షణ మయినందుననె యుండును.

౧౮. ఆఖ్యానము

౮౧౪. పృష్టైరపృష్టైరథవా నిర్ణయః క్రియతే తు యః
ఆఖ్యానమితి తద్జ్ఞేయం లక్షణం నాటకాశ్రయం

అడిగినవానితోగాని యడగనివానితోగాని నిర్ణయ మొనరించినచో నది నాటకాశ్రయమయిన యాఖ్యానమను లక్షణమని తెలియునది. ప్రశ్నపూర్వకమయిన నిర్ణయ మప్రశ్నపూర్వకమయిన నిర్ణయమని యిది రెండువిధములు. ప్రశ్నపూర్వకములయిన నిర్ణయములనేకములు నిర్ణీతములగుట కుదాహరణము.

బాలే! నాథ! విముంచ! మానిని! రుషం, రోషాన్మయా కిం కృతం?
ఖేదోఽస్మాసు న మేఽపరాధ్యతి భవాన్ సర్వేఽపరాధా మయి
తత్కిం రోదిషి? గద్గదేన వచసా క స్యాగ్రతో రుద్యతే
నన్వేతన్మమ కా తవాస్మి? దయితా, నాస్మీత్యతో రుద్యతే

బాలా! ఏమినాథా! మానినీ! రోషము విడనాడుము! రోషమువలన నేనేమి చేసితిని? నాకు ఖేదము, నాకు నీవేమియు నపరాధమొనర్పలేదు. సర్వాపరాధములు నాలో గలవు. అయిన గద్గదవచనములతో నేడ్చెదవేమి? నే నెవరి యెదుట నేడ్చితిని? నా యెదుట, నీకు నేనెవరు? ప్రియురాలు, కాదనియే యేడ్చుచున్నాను. దీనిలో నుక్తి ప్రత్యుక్తు లనేకవిధముల నున్నవి.

శక్యాశక్య వస్తువులను జెప్పు ప్రశ్నసదృశవాక్యములచే నిర్ణయముండుటకు. ఉదా :—

రామోఽసౌ భువనేషు విక్రమగుణైర్యాతః ప్రసిద్ధిం పరాం
అస్మద్భాగ్యవిపర్యయాద్యది పరం దేవో న జానాతి తం
వందీ వైష యశాంసి గాయతి మరుద్యస్యైకబాణాహతి
శ్రేణీభూత విశాలసాల వివరోత్కీర్ణస్వరైః సప్తభిః

ఈతడు రాముడు. "తన విక్రమగుణములచే నధికప్రశస్తిని పొందినాడు." అని యనగనె "ప్రసిద్ధుడయినచో నేనేల తెలిసికొన

లేదు" అనిరావణుడనునని యాశంకించి "మా భాగ్యవిపర్యయము వలన మీరు గుర్తింపలేదు" అనెను. "ఆతని ప్రసిద్ధినిదాన మేమి?" యని యాశంకించి "రాముని ఒక్క బాణముచే వరుసగా కూలిన సాలవృక్షముల రంధ్రములనుండి వెలువడు ఏడుస్వరములతో నీ వాయువు వందివలె గానము చేయుచున్నాడ"ని నిరూపించెను. ప్రశ్నోత్తరయన మిందు గలదు. నాటకాశ్రయలక్షణమని యనుట భూయోలక్ష్యమాణము కావలయుట సూచితము. అన్యపాఠ మిట్లున్నది

వాక్యైః సాతిశయైర్యుక్తా వాక్యార్థస్య ప్రసాధకైః
లోకప్రసిద్ధైర్బహుభిః ప్రసిద్ధిరితి కీర్తితా

లోకప్రసిద్ధములు వాక్యార్థప్రసాధకములు సాతిశయములగు వాక్యము లనేకములతో గూడియుండునది ప్రసిద్ధియని కీర్తితము.

౧౯. యాచ్ఞ

౮౧౫. ఆదౌ యత్క్రోధజననమంతే హర్షప్రవర్తనం
యత్ర ప్రియం పునర్వాక్యం సా యాచ్ఞా పరికీర్తితా

మొదట క్రోధజననమై తుదకు హర్షప్రవర్తనమగు ప్రియవచనము యాచ్ఞ యగును. మొదటి భాగమున హితము వ్యాఖ్యాతము. మొదటి సమయమున పరుషముగా నుండియు నాయతిలో సత్ఫల వస్తువగుట నిరూపితము. అందుననె యిది ప్రియము. లక్షణములో ప్రియం పునః యని "పునః" పద మున్నందున హితము ప్రియము హితము ప్రియము వివక్షితము. ప్రబోధ బుద్ధి ననుసరించి ప్రబోధ్యమును మఱల మఱల యాచించుట యుండుటచే యాచ్ఞ యయినది.

ఉదా :- అభినవ పద్యము.

భూమిః కంటకినీ పురో విటపినః ప్రాయో బహూపద్రవాః
భూయశ్చైవ దివాకరో మృగయతే సంధ్యాంగనాసంగమం
తద్విశ్రమ్య జనోయమత్ర సదనే గ్రామ్యోచితం సేవతాం
ప్రాతః పాంథ, విచార్య చేతసి చిరం స్థాతాసి గంతాసి వా

భూమికంటకములతో నున్నది. ఎదుట విటపము లున్నవి. తఱచుగా నుపద్రవములు కలుగును. ఇంకనీ దివాకరుడు సంధ్యాంగనా సంగమ మన్వేషించుచున్నాడు. కావున పాంథా! ఈభవనమున విశ్రమించి యీ గ్రామోచితముగా నీ జను ననుగ్రహింపుము. ఉదయ

మునసె మనసులో నిశ్చయించుకొని చిరముండుటకాని వెడలుటగా చేయుదువులె. భూమిపై ముండ్లున్నవని ముందుతుప్పలున్నవని యు ద్రవము లున్నవని మృగయ కలదని యనుట తదాత్వపరుషవచనము అనంతరవచనము సఫలమగుున ప్రియవాక్యము, కాన యాచ్ఞ, ఇందు భావాంతర భానమును గలదు. ఆగ్రామమున కావల చిట్టడవి దాటి యీ రాత్రిపోనేల? ఈ రాత్రి యిచట నివసింపుము. తెల్లవారిన పిమ్మట నీచిత్తము. అను ప్రథమార్థ మతిథిసేవాసక్తాదరము సూచిం చును. భావాంతరము రసభావార్థముతో నున్నది. ఈ గ్రామములో భూమియను నామె దగ్గర బాధలెక్కువ. ఆ యెదుటనె విటులున్నారు. ఉపద్రవములు గల్గును. నీ కా జోలి యేల? ఇటు రమ్ము. ఇది నా యిల్లు. ఇందు వసింపుము. ఈ రాత్రి నన్ననుభవింపుదు. గ్రామ్యా సంభోగము సుందరము. నీవును పాంథుడవు. గ్రామ్యుడవె. నీయిష్టము వచ్చిన విధమున ననుభవింపుము. తెల్లవారువఱకల్లె. ఆ పిమ్మట నీవాలోచింపుము. పోజాలవు. ఇచటనె యనుభవములను స్మృతికి దెచ్చుకుని పర్యాలోచనము చేయుము. దీర్ఘమాలోచింపుము. నీవు చిర మిచటనే యుండుట నిశ్చయింప గలవు. నాకు నది సమ్మతము. పాంథా! నన్ను నన్ను వినవా!'' లను భావసర్వస్వ మంతయు హితము ప్రియము. ఇందు పాఠాంతర మిట్లున్నది.

హితైః ప్రసన్నవచనైర్యత్పరస్యానువర్తనం
క్రియతే వాక్యచేష్టాభిస్తద్దాక్షిణ్యముదాహృతం

హితప్రసన్నవచనములు పలుకుచు వాక్యచేష్టావిధానములలో పరానువర్తనము ప్రదర్శించిన దాక్షిణ్యమగును.

౨౦. ప్రతిషేధము.

౬౧౬. కార్యేషు విపరీతేషు యది కించిత్ప్రవర్తతే
నివార్యతే చ కార్యజ్ఞైః ప్రతిషేధః ప్రకీర్తితః

విపరీతములగు కార్యములందు కించిత్ప్రవర్తనము నివారణము నున్నచో కార్యజ్ఞులు దానిని ప్రతిషేధమని కీర్తించిరి.

ఉదా :- అమరుకపద్యము.

లగ్నా నాంశుకపల్లవే భుజలతా న ద్వారదేశేఽర్పితా
నో వా పాదయుగే తయా నిపతితం తిష్ఠేతి నోక్తం వచః
కాలే కేవలమంబుదాలిమలినే గంతుం ప్రవృత్తః శఠః
తన్వ్యా బాష్పజలౌఘకల్పితనదీపూరేణ రుద్ధః ప్రియః

వస్త్రాంచలమున కూడుకొనలేదు. ద్వారదేశమున భుజలత కూర్పలేదు. పాదయుగమున పడలేదు. ఉండుమని యనలేదు. మేఘమలిన సమయమున శఠుడు పోవుట కుద్యమించెను. గాని యామె బాష్పనదీప్రవాహమున రుద్ధుడై యాగిపోయినాడు. దీనిలో మూడవ పాదమున విపరీతకార్య ప్రవృత్తి నిరూపితి మయినది. ఆద్యార్థమున నాయిక కార్యజ్ఞత నిరూపిత మయినను నాల్గవపాదమున నె నివారణము స్పష్టమయినది. ఇతరుల పాఠము.

యద్వాక్యం వాక్యకుశలై రుపాయేనాభిధీయతే
సదృశార్థాభినిష్పత్త్యా స లేశ ఇతి కీర్తితః

సదృశార్థనిష్పత్తిలో వాక్యకౌశలము కలవారు నిరూపించువాక్యము లేశమగునని యనిరి. ఇందు వాక్యమనునది వాక్యార్థపరము. నిషేధమేని యగును. నదీపూరము వర్షాసమయమున రోధకముగా ప్రసిద్ధము. కాగా సదృశాభిధానరూపమయిన ఉపాయమున నిషేధము నిరూపిత మయినది.

## ౨౧. పృచ్ఛ

౮౧౪. యత్రాకారోద్భవైర్వాక్యైరాత్మానమథవా పరం
పృచ్ఛన్నివాభిధత్తేఽర్థం సా పృచ్ఛేత్యభిసంజ్ఞితా

ఆకారసముత్పన్నములయిన వాక్యములతో నితరు నడుగుచున్నట్లుగా గాని తననె తానడుగుచున్నట్లుగా గాని యొకయర్థమును నిరూపించినచో నది పృచ్ఛ యని సంకేతింతురు. ఉదా: వేణీసంహారము.

కింభీమాద్గురుదక్షిణాం గురుగదాం భీమప్రియః ప్రాప్తవాన్
అంతేవాసిదయాలురుజ్ఝితనయే నాసాదితో విష్ణునా
గోవిందేన సుదర్శనస్య నిశితం ధారాపథం ప్రాపితః
శంకే నాపదమన్యతః ఖలు గురోరేభ్యశ్చతుర్థాదహం

ఈ పద్యమునం దాకార మభిప్రాయ సూచకముగా నుండుట కాకుస్వర మట్టిది యగుట వలన వెలువడిన వాక్యములు శక్తిద్యోతన

మున శోభించుచున్నవి. భారతయుద్ధములో తండ్రి ద్రోణుడు హతు డయినాడని విని యశ్వత్థామ ఖిన్నుడై యిట్లనుగును. ధీమ ప్రియు డయిన నా తండ్రి పెద్దగదకల భీముని వలన గురుదక్షిణ పొందెనా? "శాంతం పాపం" శిష్యవాత్సల్యము కల మా తండ్రిని న్యాయము తప్పిన అర్జునుడు చంపెనా? "ఇట్లగునా?" శ్రీకృష్ణుడు సుదర్శన చక్రము పట్టించెనా?" నాస్తి. అయినచో సిక నాల్గవవానివలన నా తండ్రి కాపద భావింపను. ఇందభిప్రాయసూచకములయిన కాక్వాదులవలన విశేషమున్నది. లక్షణవాక్యములో "యత్రాకాకార్థోద్భవైర్వాక్యైః" అను స్థలమున "యత్ర భావరసోపేతం" అని కొందరు పాఠము పఠించిరి.

## ౭౨. దృష్టాంతము.

౮౧౮. విద్వాన్ పూర్వోపలబ్ధౌ యత్సమత్వముపపాదయేత్
నిదర్శనకృతస్తజ్జ్ఞైః స దృష్టాంత ఇతి స్మృతః

అభిజ్ఞుడు పూర్వప్రాప్తి యుండగా సమత్వ ముపపాదించుటను నిదర్శనకృతముగా నున్నదని దృష్టాంతమని వ్యవహరింతురు. పూర్వ సంప్రాప్తములను పరిశీలించి నిదర్శనముగా సామ్యము చెప్పుట దృష్టాంత మని భావము. ఉదా:- అభినవగుప్త పద్యము.

హా హాలాహలలేహనే హతిమతిః సోఽయం సముత్కంఠితో
గాంధాంగారగర్భిణి క్షిపతి జడధీర్దేహం నివిక్షేప్స్యతి
గ్రామ్యోఽప్యజగరీం గుహాం గలగుహాం మోహాదయం ధావతి
వ్యాధూతేతరసంగతాని యదయం సార్ధం ఖలైః ఖేలతి

ఈ హతమతి హాలాహలలేహనమున నాసక్తుడయినాడు. ఈ మంద బుద్ధి నిప్పులలో దేహము కూర్చదలచినాడు. ఈ గ్రామ్యజనుడు వ్యామోహమున నజగరకంఠగుహకు పరుగెత్తుచున్నాడు. ఇతర సంగ తములను విడనాడి "యదయం" యీతడు ఖలులతో ఖేలనము చేయు చున్నాడు. దీనిలో ఖలఖేలనము హాలహాలకాలకూట కబలనాది సామ్యమున నిరూపితమగుట దృష్టాంతము. ఇవి యుపమ కాదు. ఖల విధానము ప్రత్యక్షము చేయుటకై యిది నిదర్శిత మయినది. ఇంతటి కార్య మాచరించుట కుద్యమించెనని స్పష్టమగును. ఇది రూపకమును

గాదు. "ఇట్టీతఁడాచరించిన నిది యీతనికి గలుగగలదని భిన్నకాలము సూచితమయినది కదా! అందునను లక్షణములో పూర్వోపలబ్ధి యుండగా సమత్వోపపాదనము నిరూపిత మయినది.

౨౩. నిర్భాసనము.

౮౧౯. అనేకయుక్తి యద్వాక్యమనేకార్థప్రసాధకం
అనేకవాక్య సంయుక్తం తన్నిర్భాసనముచ్యతే

అనేకయుక్తులుకల యనేకవాక్య సంయుక్తమయిన అనేకార్థ ప్రసాధకమగు వాక్యము నిర్భాసనమనదగును. ఉదా:- వేణి ;

కర్తా ద్యూతచ్ఛలానాం జతుమయశరణోద్దీపనః సోఽభిమానీ
రాజా దుశ్శాసనాదేర్గురురనుజశతస్యాంగరాజస్య మిత్రం
కృష్ణాకేశోత్తరీయవ్యపనయనపటుః పాండవా యస్య దాసాః
క్వాఽస్తే దుర్యోధనోఽసౌ కథయత! న రుషా ద్రష్టుమభ్యాగతౌ స్వః

భీమార్జునులు సుయోధనాన్వేషణ మొనరించుచు నిట్లను చున్నారు. ద్యూతచ్ఛలములకు కర్త లక్క యిల్లు కాల్చిన వాడు, అభిమాని, దుశ్శాసనాదులకు ప్రభువు, అనుజశతమునకు గురువు. అంగరాజునకు మిత్రము, ద్రౌపదీకేశోత్తరీయముల తొలగించుటలో సమర్థుడు దుర్యోధను డెచట నున్నాడు. పాండవు లెవనికి దాసులో యాతడెచ్చట? కోపముచే గాదు చూచుటకు వచ్చితిమి. కోపముతో చూచుటకు రాలేదు. కోపముతో చూచుటకు రాలేదా? ప్రకృతమగు కోపాదికము భాసించుచున్నది కావున భాసనము నిర్భాసన మయినది. పాఠాంతరము.

ఈప్సితార్థప్రసిద్ధ్యర్థం కీర్త్యంతే యత్ర సూరిభిః
ప్రయోజనాన్యనేకాని సా మాలేత్యభిసంజ్ఞితా

ఈప్సితార్థ ప్రసిద్ధికై పండితులగువారు అనేక ప్రయోజనములను కీర్తింతురేని యది "మాల" యను సంజ్ఞ కలది యగును. సూరికీర్త నము సచేతస్సంభావనార్థమని గుర్తింపవలెను.

౨౪. సంశయము.

౮౨౦. అపరిజ్ఞాతతత్త్వార్థం యత్ర వాక్యం సమాప్యతే
సోఽనేకత్వాద్విచారాణాం సంశయః పరికీర్తితః

విచారములనేకవిధములుగా నుండును గావున వాక్యమపరిజ్ఞాతతత్త్వార్థముగనె సమాప్తమయినచో నది సంశయ మగును.

తిష్ఠేత్కోపవశాత్ప్రభావపిహితా దీర్ఘం న సా కుప్యతి
స్వర్గాయోత్పతితా భవేన్మయి పునర్భావార్ద్రమస్యా మనః
తాం హర్తుం విబుధద్విషోపి న చ మే శక్తాః పురోవర్తినీం
సా చాత్యంతమగోచరం నయనయోర్యాతేతి కోయం విధిః?

ఊర్వశి యంతర్హితకాగా విక్రము డిట్లు భావించును. కోపమువలన ప్రభావపిహితయై యుండునా? దీర్ఘకాల మామె కోపింపదే! స్వర్గమున కెగిరిపోయియుండునా? నాయందామె మనస్సు భావార్ద్రము కదా! నాయెదుటనున్న ఊర్వశిని రాక్షసులు కూడ హరింపశక్తులు కారు కదా! ఆమె నాకన్నులకేమియు గోచరముకాకుండ పోయినదేమో! ఇందు మొదటిభాగము సంశయోదాహరణము. అనంతరముపపత్త్యుదాహరణము.

౭౫. ఆశీస్సు.

౮౨౧. యథాశాస్త్రార్థ సంపన్నాం మనోరథసముద్భవాం
అప్రార్థనీయామన్యాం వా విదుస్తామాశిషం బుధాః

శాస్త్రార్థమున కనుకూలము మనోరథసముద్భవ మగునది ఆశీస్సు. అప్రార్థనీయమగు నితరమును గూడుకొనునది ఆశీస్సు అని బుధులనిరి.

పాదాగ్రస్థితయా ముహుస్స్తనభరేణానీతయా నమ్రతాం
శంభోః సస్పృహలోచనత్రయపథం యాంత్యా తదారాధనే
హ్రీమత్యా శిరసీహితః సపులకస్వేదోద్గమోత్కంపయా
విశ్లిష్యన్కుసుమాంజలిర్గిరిజయా క్షిప్తోఽన్తరే పాతు వః

శివారాధనము చేయుటకు వచ్చిన పార్వతి పాదాగ్రమునందున్నది. స్తనభరమున ముహుః నమ్ర యయినది శివుని మూడు కన్నులును సస్పృహగా నామెపై ప్రసరించినవి. పార్వతి సిగ్గువడి పులకస్వేదకంపములు కలదై శివశిరమున నుంచ దలచిన పుష్పాంజలిని అంతరముననె యెగురవేసినది. ఆ పుష్పాంజలి మిమ్ము రక్షించు గావుత. ఈ శ్లోకము రత్నావలిలోని మొదటినాంది. ఇందు స్తుతియె వర్ణనీయమయినది కావున వచనము సర్వమాశీరలంకారముకాదు. అన్యపాఠము.

యత్రార్థానాం ప్రసిద్ధానాం క్రియతే పరికీర్తనం
పరాపేక్షావ్యుదాసార్థం తన్నిదర్శన ముచ్యతే

పరాపేక్షావ్యుదాసమునకై ప్రసిద్ధార్థముల పరికీర్తనము నిరూపిత మయినచో నిదర్శన మగును. దీని యర్థనిర్ణయమున శ్రీగుప్తపాదులిట్లు-

"ప్రసిద్ధానాం = దేవతాదీనాం, పరాపేక్షా =
సాధ్యాకాంక్షా, తస్మాత్ వ్యుదాసః తత్సంపత్త్యా"

వ్రాసిరి. సాధ్యమునందలి యాకాంక్ష సాధ్యసిద్ధివలన పోవును. ఇట్టి పరాపేక్షావ్యుదాసమునకై ప్రసిద్ధదేవతాదిప్రయోజనము పరికీర్తనము చేయుట నిదర్శనమని భావము. అందుననె దృష్టాంతమునకన్న దీనికి భేదము సిద్ధమగుచున్నది.

౨౮. ప్రియము.

౧౨౨. ఆదౌ యత్క్రోధజనన మన్తే హర్షప్రవర్ధనం
తత్ప్రియం వచనం జ్ఞేయమాశీర్వాదసమన్వితం

ఆదిలో క్రోధజనన మయిన నంతమున హర్షప్రవర్ధనమగు వచనమాశీర్వాదసమన్వితమై ప్రియమను కావ్యలక్షణమగును. ఉదా॥

కిం వృత్తాంతైః పరగృహగతైః కింతు నాహం సమర్థః
తూష్ణీం స్థాతుం ప్రకృతిముఖరో దాక్షిణాత్యస్వభావః
గేహే గేహే విపణిషు తథా చత్వరే పానగోష్ఠ్యాం
ఉన్మత్తేవ భ్రమతి భవతో వల్లభా హంత కీర్తిః

పరుల యిండ్లలోని వృత్తాంతములతో నాకేమిపని! కాని నేనూరకనే యుండలేను. దాక్షిణాత్యస్వభావము ప్రకృతిముఖరము. ఇంటింటిలో దుకాణములలో నడివీధిలో పానగోష్ఠిలో పిచ్చియెత్తిన విధమున నీ వల్లభ కీర్తి భ్రమణము చేయుచున్నది. ఈ పద్యములో "భ్రమతి వల్లభా" వఱకు క్రోధజననము, "హంత కీర్తిః" అనుటతో హర్షవర్ధనము కలదు. అన్యపాఠము.

వాచ్యమర్థం పరిత్యజ్య దృష్ట్యాదిభిరనేకధా
అన్యస్మిన్నేవ పతనాదాశు భ్రంశః స ఉచ్యతే

వాచ్యమగు నర్థమును విడిచి యనేకధా కలిగిన పరిజ్ఞానములచే నన్యార్థమున వెంటనే ప్రసరము ప్రదర్శించినచో నది భ్రంశము అను

సంకేతము కలది యగును. దృష్టిదర్శనము, పరిజ్ఞానము. పూర్వ పద్యములోని ప్రకృతిముఖరాదివాక్యము తాదృశము. ఇందలిదిది వ్యాజస్తుతికాదు. నిందాభాగమున స్తుతి లేదు కదా! నిందకు పూర్ణతయులేదు, వేరొక ఉదా :-

రాజ్యం నిర్జితశత్రు యోగ్యసచివే న్యస్తః సమస్తో భరః
సమ్యక్పాలనలాలితాః ప్రశమితాశేషోపసర్గాః ప్రజాః
ప్రద్యోతస్య సుతా వసంతసమయ స్త్వం చేతి నామ్నా ధృతిం
కామః కామముపైత్వయం మమ పునర్మన్యే మహానుత్సవః

రాజ్యమున శత్రువుల జయించితిని. యోగ్యసచివునందు సర్వ భారముంచితిని. ప్రజలను చక్కగా పాలించి బాధలులేకుండ జేసితిని. ప్రద్యోతుని కూతురుకలదు. వసంతిసమయుడవు నీవు కలవు. కాముడు కేవలము నామమున నె ధృతిపడనీ! నాకు మాత్రమె మహోత్సవము. ఈ పద్యమున నుదయనమహారాజు వసంతక విదూషకుని వంచన చేయుటకే వసంతశబ్దమును పలికినాడు. మధుసమయమె ప్రసూనసమయ మను భావము ననాదరపవలచి "వసంతసమయ స్త్వం" అను వాక్యమును వినగనె విదూషకుడు హృష్టచిత్తుడు కాగలడు. వసంతపదము మధుసమయార్థమును విడిచి విదూషకసంకేతమున ప్రసరించుట వలన నిది భ్రంశలక్షణ మయినది.

౨౭. కపటము.

౮౩. ఛలయుక్త్యా త్వన్యేషామభిసంధానాభిభావకం కపటం
ద్విత్రిప్రయోగయుక్తి విజ్ఞేయః కపటసంపాతః

ఛలయుక్తి=వ్యాజప్రయోగముచే నితరులను వంచన మొనరించుట తిరస్కార మొనరించుట కపట మగును. అభిసంధానము వంచనము. అభిభావకము తిరస్కారము. ఛలోక్తిచే పలికిన వచనము యొక్క యర్థము నన్యథా గ్రహించుటకాని యపలపించుటగాని కపట మగును. కపటముయొక్క సంఘాతము=లక్షణము. రెండుమూడు ప్రయోగముల కూర్పునందిదివిశద మగును. కపట మనునది వస్తుక్రమమువలన గలుగును. దైవమువలన గలుగును. శత్రువువలనను గలుగును. వస్తుక్రమసముద్భూతమునకు మాలతీమాధవమున మక

రందుడు మాలతీరూపము ధరించుటలో సమన్వయము కలదు. దైవిక కపటము నాగానందములో జీమూతవాహనుడు శంఖచూడుని వంచించుటలో కలదు. శత్రుకృతిమునకు ఛలితారామ ముదాహరణము. లవణాసురుని యాజ్ఞానుసారమున నిద్దరు రాక్షసులు మంధరాకైకేయీ వేషధారణ మొనరించి వంచన మొనరింతురు. అంతర్వత్ని యయిన సీత నరణ్యమునకు పంపుటయు నిట్లు ఛలితప్రయుక్తమె. కృత్యా రావణనాటకమున ప్రథమాంకమునందు శూర్పణఖ సీతావేషము ధరించి లక్ష్మణుని వంచనము చేసినది. లక్ష్మణు డభిభూతుడయినాడు," అన్యపాఠము.

యత్ర సంకీర్తయన్దోషం గుణమర్థేన యోజయేత్
గుణాతిపాతాద్దోషం వా గర్హణం నామ తద్భవేత్

దోషమును స్పష్టముగా బలుకుచు నర్థముతో గుణమును వ్యక్తము చేయునది. గుణాతి పాతమున దోషమునేని స్పష్టము చేయునది. అది గర్హణమను లక్షణమగును. వాగుపచారమన్నిటిలో సమానముగా నుండుటచే నిట ఛల మనుట యుక్తము.

౨౮. క్షమ.

౮౨౪. దుష్టనోదాహృతై రూక్షైః సతాం మధ్యేఽభితాడితః
అక్రోధః క్రోధజననైర్వాక్యైర్యః సాక్షమా భవేత్

క్రోధము కలుగజేయునవి యయిన దుర్జనోదాహృతవచనములచే సభలో సతాంమధ్యమున నభితాడితుడయ్యు పురుషుడు క్రోధరహితుడుగనె వర్ణితుడగుట క్షమ యను లక్షణమగును. ఇట్ల క్రోధనుడుగా నుండువాడు క్షమకలవాడు. తిద్గుణ వర్ణనోచితమయిన కవి వ్యాపారము క్షమ యగునని భావము. ఇట్లనుటచే యథోచితాభిన్నవృత్తి సంచయ మంతయు విభావాద్యుచితముగా నిర్వర్తితమయినచో కావ్యలక్షణమగునని సూచిత మగును. ఉదా :- అభినవపద్యము.

...త్రాయ దుష్టవచనం ప్రతి కిం న కోపః
క్షోభం కరోతి హృదయే నను కోప ఏవ

మిత్రం మమైవ తు నిజాత్మని యోఽపకారం
కృత్వా మమాశుభ కలంక విఘాత హేతుః

హృదయమునందు కోపమే క్షోభము కలుగజేయు చున్నది. దుష్టవచనము వినినదని శ్రోత్రము నేమియు కోపింపను. ఈ కోపము నాకు మిత్రము, నాయందు నాకపకారము కలుగ జేసినను నా యశుభ కలంకమును నశింప జేయుట కిది సమర్థము. ఇతరుల పాఠ మిట్లున్నది.

సిద్ధాన్ బహూన్ ప్రధానార్థాం స్త్యక్త్వా యత్ర ప్రయుజ్యతే
విశేషయుక్తం వచనం విజ్ఞేయం తద్విశేషణం

సిద్ధములగు బహుప్రధానార్థములను విడనాడి విశేషయుక్తమగు వచనము నిరూపితమగునేని దాని విశేషణ మని యందురు. సిద్ధము లనుట లోకప్రసిద్ధములయిన ప్రధానము లశక్యాపజయము లగు పదార్థము లని భావము. అట్టి వాని ననాదరము చేసి క్రోధము వలన విశేషయుక్త మయిన వచనము పలుకుట విశేషణము. "నా కీ మిత్ర విశ్వాస మాత్మక్షోభముగా నున్నది. పుణ్యాదిక మంగీకరించిన గూడ నాకు పాపసంచయము దుఃఖోపభోగము నిచ్చుచున్నది." అని వ్యాకులముగా పలుకుట విశేషణమనిరి.

## ౫౯. ప్రాప్తి

౮౫౯. దృష్ట్వైవావయవం కించిద్భావో యత్రానుమీయతే
ప్రాప్తం తామభిజానీయాల్లక్షణం నాటకాశ్రయం

ఒకయవయవము చూచి భావ మభ్యూహించినచో నది నాటకాశ్రయ మయిన ప్రాప్తియని తెలియవలయును. ఉదా;

అభ్యున్నతా పురస్తాదవగాఢా జఘనగౌరవాత్పశ్చాత్
ద్వారేఽస్య పాండుసికతే పదపంక్తిర్దృశ్యతేఽభినవా

పాండుసికతము కల యీ ద్వారమున నభినవ పదపంక్తి యున్నది. ఈ పదపంక్తి ముందుభాగమున నెత్తుగా నున్నది. జఘన గౌరవమువలన వెనుక భాగమున లోతుగా నున్నది. ఇందు పద పంక్తిరూప మయిన యొకయంశమును జూచి "శకుంతల యిచట నుండవచ్చు"నని శకుంతలాసద్భావమున నభ్యూహించుట కలదు గావున ప్రాప్తి సంగతము.

### ౩౦. పశ్చాత్తాపము.

౮౨౮. అకార్యం సహసా కృత్వాఽకృత్వా కార్యమథాపి వా
సంతాపో మనసో యస్తు పశ్చాత్తాపః ప్రకీర్తితః

అవిచార్య యకార్య మాచరించి, యొనరింపదగిన కార్య మాచరింపకయు మనసునకు సంతాపము కలిగించుకొనుట పశ్చాత్తాపమగును. ఉదా :-

ముహురంగులి సంవృతాధరోష్ఠం
ప్రతిషేధాక్షర విక్లవాభిరామం
ముఖమంసవివర్తి పక్ష్మలాక్ష్యాః
కథమప్యున్నమితం న చుంబితం తు

శకుంతలా సన్నిధిలో దుష్యంతుడు తనరీతి నిట్లు పలుకుచున్నాడు. వ్రేళులతో నధరము దాచినది ప్రతిషేధము పలికినది. ముఖ మెదురుగా నుంచక భుజమున కడ్డముగా త్రిప్పినది. అట్టి ఆ పక్ష్మలాక్షి ముఖము నెట్టో పట్టి పైకెత్తితిని గాని చుంబన మొనరింపలేదు గదా! ఇందు కార్య మాచరింపసందువలన గలిగిన పశ్చాత్తాపము వర్ణిత మయినది. అన్యపఠనము.

"అనేకార్థ విచారస్తు విచారః పరికీర్తితః"

అనేకార్థముల విచారించుట విచారమగును. అనేక విధము లయిన కార్యరూపార్థముల విచారము. ఆ కార్యములు కృతము లకృతములు కావచ్చును. "నేనిట్లు చేసితి నేమి? అట్లు చేయనైతి నేమి?" అని విచారించుట యని భావము.

### ౩౧. అర్థానువృత్తి.

౮౨౯. ప్రశ్రయేణార్థసంయుక్తం యత్పరస్యానువర్తనం
స్నేహాద్దాక్షిణ్యయోగాద్వా సానువృత్తిస్తు సంజ్ఞితా

ప్రత్యయము-విశ్వాసము పరానువర్తన మర్థసంయుక్తముగా నుండునేని యర్థానువృత్తియగును. అట్లే స్నేహము వలన గాని దాక్షిణ్యసంబంధమున గాని పరానువర్తనమున్నచో నర్థానువృత్తి యగును. ఇందు లక్షణకథనములో ననువృత్తి యని యున్నది. ఉదా : భట్టేందురాజశ్లోకము.

రాజ్ఞా యదనురజ్యసే యది భవేద్వాచ్యం పురో మాదృశాం
తత్సాంక్రందనగోప! కించన మహాకృచ్ఛత్యధీశో జనః
అగ్రే రోహణచారిణాం సరభసం సంమార్యమాణశ్చిరం
కం ప్రత్యాయయితుం ప్రయాసరసికో యత్నేన రత్నాయసే

ఓసీ! ఇంద్రగోపమా! రాజనువర్తించినచో మావంటివారి యెదుట పలుకవచ్చును కాని నిన్ను గురించి సామాన్యజను డోక డేమేని యడుగును. సకలరత్నములకు జన్మస్థలమయిన రోహణపర్వత మున సంచరించు వారి యెదుటనె సరభసముగా నీవు సంమార్యమాణ స్వరూప మయ్యెదవు. నీవు ప్రయాసపడి యెవని నమ్మింపజేయుటకు యత్నమున రత్నమయ్యెదవు; దీనిలో నర్థానువృత్తి సమన్వయము గుర్తించునది.

ఇందే యప్రస్తుతప్రశంస కలదు. అయిన నప్రస్తుతమునకు శరీర వైచిత్ర్యము లక్షణకృతమె కావున లక్షణమె శరీరమని నిరూపిత మయినది. కుశలసువర్ణకారు లుత్ప్రేక్షించిన కటకాదులచే గలుగు వైచిత్ర్యము కూడ తల్లక్షణమహిమచే గలుగునదియె యని నిశ్చితము. ఉపమానశరీరమునకుగాని యుపమేయశరీరమునకుగాని గలుగు వైచిత్ర్య మంతయు కావ్యలక్షణముల వ్యాపారమె యగును. కాగా ఉపమా రూపకదీపకములను మూడు నలంకారములుగా నిర్ణీతము లగును గావున వానికి ప్రత్యేకముగా నీ షట్త్రింశల్లక్షణసంబంధము నిశ్చయించినచో ననేక భేదములు లభించును. ఈ కావ్యలక్షణములకును ఒకటి రెండు మూడవాంతరవిభాగభేదములు నిర్ణయించినచో గలుగు నానంత్యము గణించుట శక్యము కాదు. ఇక నిప్పుడు "శతసహస్రాణి వైచిత్ర్యాణి సహృదయైరుత్ప్రేక్ష్యంతాం" వందలు వేలు విచిత్రమార్గములు సహృ దయు లూహింపవచ్చును. పరలక్షణ మిట్లున్నది.

ఉభయోః ప్రీతిజననో విరుద్ధాభినివేశయోః
అర్థః ప్రసాదజననో జ్ఞేయ స్త్వనునయో బుధైః

విరుద్ధాభినివేశముకల యిద్దరకు ప్రీతిజననము ప్రసాదజనకమయిన యర్థము అనునయ మగునని బుధులు నిర్ణయించిరి. ఇచట లక్షణమున "ఉభయోః" అనుట వక్తృవాచ్యవ్యక్తులకని భావము. వారలకే

విరుద్ధాభినివేశముండును, ఒకనికి తత్త్వవిశ్రాంతి, వేరొకనికి మెఱుపుగా తళుక్కుమనుట. ఇట్టిద్దఱకు ప్రసాదజనకముగా నుండుట లక్షణము.

3౨. ఉపపత్తి.

౮౨౮. ప్రాప్తానాం యత్ర దోషాణాం క్రియతే శమనం పునః
సా జ్ఞేయా హ్యుపపత్తిస్తు లక్షణం నాటకాశ్రయం

సంప్రాప్తములగు దోషములకు శమనము నిరూపించినచో నది నాటకాశ్రయమగు నుపపత్తిలక్షణమగును "ప్రాప్తానాం" సంప్రాప్తము లయిన యని యనుట వీప్సాగర్భమయిన విశేషము. ముహుర్ముహుః ప్రాప్తము లయిన యని భావము. దోషములని యనుటయు నుపపత్తి రహితములుగా కన్పడు నవస్తుభూతములయిన యంశములని భావము. ఉదా! సంశయమున కుదాహరించిన "తిష్ఠేత్కోపవశా" దిత్యాది పద్యము. మరియొక ఉదా:

క్వాకార్యం శశలక్ష్మణః క్వ చ కులం, భూయోఽపి దృశ్యేత సా
దోషాణాం ప్రశమాయ నః శ్రుతమహో, కోపేఽపి కాంతం ముఖం
కిం వక్ష్యంత్యపకల్మషాః కృతధియః, స్వప్నేపి సా దుర్లభా
చేతః స్వాస్థ్యముపైహి, కః ఖలు యువా ధన్యోఽధరం ధాస్యతి

ఊర్వశీకాముకుడగు పురూరవుని భావపరంపర యిట్లున్నది. ఈ యకార్య మెక్కడ మా చంద్రవంశ మెక్కడ? ఆమె మఱల గన్పడునా? మేము చదివిన దంతయు దోషప్రశమమునకు గదా! కోపములో గూడ నామె ముఖము సుందరముగా నుండునే! పాప రహితులయిన పెద్ద లేమందురో? స్వప్నమునగూడ నామె దుర్లభ యగునా? మనమా? ధైర్యము వహింపుము. ఏ ధన్యుడామె యధర మాస్వాదించునో! అన్యపాఠము.

పరిగృహ్య తు శాస్త్రార్థం యద్వాక్యమభిధీయతే
విద్వన్మనోహరం స్వంతముపదిష్టం తదుచ్యతే

శాస్త్రార్థములను ప్రమాణములను పరిగ్రహించి విద్వన్మనో హరము స్వంతమగు వాక్యము నిరూపించినచో నది యుపదిష్టమగును. "స్వంతమితి శోభనోఽన్తో నిశ్చయో యత్ర" స్వంత మనగా మంచి నిశ్చయ ముండుట.

## 33. యుక్తి.

౮౨౯. సాధ్యతే యోఽర్థసంబంధో మహద్భిః సమవాయతః
పరస్పరానుకూల్యేన సా యుక్తిః పరికీర్తితా

ఉత్కృష్టములగు వానితో పరస్పరానుకూల్యమున గలుగు సమవాయమున నర్థసంబంధము సాధితమగునేని యుక్తియగును. ఉదా.

లావణ్యసింధురపరైవ హి కేయమత్ర
యత్రోత్పలాని శశినా సహ సంప్లవంతే
ఉన్మజ్జతి ద్విరదకుంభతటీ చ యత్ర
యత్రాపరే కదలికాండ మృణాలదండాః

ఇది యొక క్రొత్త లావణ్యసింధువు. దీనిలో నుత్పలములు చంద్రునితో నీదుచున్నవి. గజకుంభతటియు మునుగుచున్నది. అరటి కంబములు తామరతూండ్లు తేలియాడుచున్నవి. ఇందుత్పలము = నేత్రము, శశి-వదనము, కుంభతటి-స్తనతటము, అరటి-ఊరువులు, తామరతూండ్లు-బాహువులు. ఇందుత్కృష్టము లయిన నేత్రవదనాదులచే పరస్పరశోభాత్మకానుకూల్యమున సమవాయ మనదగు నేక విశ్రాంతి యున్నది. ఈ యర్థముతో నుపపద్యమానమగు నపూర్వ తరంగిణీ స్వరూపము సాధితమయినది. ఇట్లుగా భావము యోజనము చేసినచో యుక్తి యగును. ఈ పద్యమున రూపకాలంకారము ప్రతీయ మానమగుచున్న దందురేని, అనుడు. అయిననేమి? దాని శరీర మంతయు లక్షణమయమె యని యసకృదుక్తము కదా, అన్యపాత మిట్లున్నది.

అభూతపూర్వో హ్యర్థో యః సాదృశ్యాత్పరికల్పితః
లోకస్య హృదయగ్రాహీ సోఽభిప్రాయ ఇతీరితః

అభూతపూర్వార్థము సాదృశ్యకల్పితమై లోకమునకు హృదయ గ్రాహి యయినచో నది యభిప్రాయ లక్షణ మగును.

## 34. కార్యము.

౮౩౦. యత్రాపసారయన్దోషం గుణమర్థేన యోజయేత్
గుణాభివాదం దోషాన్వా కార్యం తల్లక్షణం విదుః

దోషమును విడనాడి తత్సమయార్థనీయాంశమున యోజన మొనరించినను, గుణాభివాదము విడనాడి యర్థనీయాంశమున యోజన మొనరించిన నదియు కార్యమను లక్షణ మగును. రెండిటిలోగూడ నర్థయోజనముండవలయునని యర్థము. మొదటి కార్యలక్షణమునకు వివృతిలో లక్ష్యము విశదముగ లేదు. రెండవ కార్యము – ఉదా :- అభినవపద్యము.

విశ్వప్రభో ! వితర ! తాం కమలాం కిమన్యత్
భూయాత్స కోఽపి ఘటితో భవతోపకార ;
దూరాధ్వగేషు పునరమ్బు తథా వికీర్ణ
మస్తే యథా త్రిభువనే ప్రసృతం యశస్తే

విశ్వప్రభూ; ఇతరమేల? కమలనిమ్ము. అది నీవు కూర్చిన యుపకారమగును. దూరాధ్వగుల కిచ్చిన యుదకముపకారము. నీ యశము మూడులోకములందు ప్రసరించును గదా? దీనిలో నీవుగొప్ప యుపకారమొనర్చితివి. అధ్వగులకు నీవు నీరమిచ్చితివి. విశ్వప్రభువవు కదా! యశః ప్రసారము కల్గును. కమలనిమ్మని పునఃపర్యాలోచన ముదయించును. ఈ కార్యమును కొందరు "గహన"మని వ్యపదేశించిరి. అన్యు లర్థాపత్తి యనిరి. లక్ష్యపద్యములో నర్థాంతరాపత్తి నభ్యూహించునది. అన్యపాఠము.

అర్థాంతరస్య కథనే యత్రాన్యోఽర్థః ప్రతీయతే
వాక్యమాధుర్యసంపన్నా సార్థాపత్తిరితి స్మృతా

అర్థాంతరము నిరూపింపగా నన్యార్థము వాక్యమాధుర్యసంపన్నమై ప్రతీతమగునేని యది యర్థాపత్తి యగును.

౩౫. అనునీతి.

౮౩౧. అపూర్వక్రోధజనితమపరాధం ప్రమృజ్య యత్
సేవార్థం మధురం వాక్యం సానునీతిః ప్రకీర్తితా

అపూర్వమగు క్రోధము కలుగజేయుటకుగా నొకపని చేయగా దానివలన గలిగిన యపరాధమును ప్రమార్జనము చేసి సేవార్థముగా మధురవాక్యము పలుకుట యనునీతిలక్షణమని కీర్తిత మయినది. ఉదా:

ప్రసీదేతి బ్రూయామిదమసతి కోపే న ఘటతే
కరిష్యామ్యేవం నో పునరితి భవేదభ్యుపగమః
న మే దోషోఽస్తీతి త్వమిదమపి హి జ్ఞాస్యసి మృషా
కిమేతస్మిన్కర్తుం క్షమమితి న వేద్మి ప్రియతమే

వత్సరాజు వాసవదత్త నిట్లు బ్రతిమలాడుకొనుచున్నాడు. ప్రసన్నవు కావలసినదని నేనందునేని నీకు కోపము లేకున్న నిది ఘటింపదు. మరల నేనిట్లు చేయనందునేని యంగీకరించినట్లగును. నా దోషము లేదందు నేని యిది యసత్యమని గుర్తింతువు. ప్రియతమా! ఇందు చేయదగినది యేమో నాకు తెలియుట లేదు. అన్యపాఠము.

వాక్యైస్సాతిశయైర్యుక్తో వాక్యార్థః సప్రసాధకైః
లోకప్రసిద్ధైర్బహుభిః ప్రసిద్ధిరితి కీర్తితా

లోకప్రసిద్ధములు ప్రసాధకములు సాతిశయములగు నానావాక్యములతో గూడిన వాక్యార్థము ప్రసిద్ధి యని కీర్తిత మయినది.

౩౬. పరిదేవనము.

౮౩౭. దోషైర్యదన్యనామోక్తైః ప్రసిద్ధార్థైః ప్రయోజితం
అన్యత్రార్థేన సంబద్ధం జ్ఞేయం తత్పరిదేవనం

అన్యనామనిరూపితములయిన ప్రసిద్ధార్థములగు దోషములతో ప్రయోజితమగునది అన్యార్థముతో సంబంధించి యుండునది యయిన వాక్యము పరిదేవన మను కావ్యలక్షణమగును. రాజశేఖరుని బాలరామాయణమునం దీ కావ్యలక్షణ సంగతిని పరిశీలించునది. దానిలో దశరథుని పేరిట రామనిర్వాసనాది దోషములు నిరుక్తనిరూపితములై యున్నవి. ప్రసిద్ధార్థములయిన వానితో ప్రయోజితములయిన విశేషములు కలవు. తత్పరమార్థ సంబంధమును పరిశీలించిన నవి దశరథ దోషములు కావని దశరథుని పట్టిన రక్షస్సు దోషములె యని స్పష్టమగును. కావున నవి పరిదేవనమగును. అర్థ ప్రయోజనముతో గూడినవి. అన్యనామోక్తము లయిన యర్థములు ప్రసిద్ధార్థములతో గూడినవై యన్యహృదయమున సంవాదము సంపాదించునవి కావలెను. ఇందర్థసంబంధమె పరమార్థతః ఉచితము. ఉదా :-

ఏషాం పశ్య! పురస్తటీమిహ కిల క్రీడాకిరాతో హరో
గాండీవేన కిరీటినా సరభసం చూడాంతరే తాడితః
ఇత్యాకర్ణ్య కథాద్భుతం హిమనిధావద్రౌ సుభద్రాపతేః
మందం మందమకారి యేన నిజయోర్దోర్దండయోర్మండనం

ఎదుటగా నీ తటీభాగమును చూడుము. ఇచట క్రీడాకిరాతుడయిన శివుని అర్జునుడు గాండీవముతో వేగముగా శిరోభాగమున మోదినాడు." అను హిమవత్పర్వతమునందలి యర్జునుని కథాద్భుతమును విని యొకరాజు తన దోర్దండములకు మందమందముగా మండన మాచరించుకొనినాడు. ఈ పద్యమునందు తటీవిలోకనప్రయోజనముగా ధనంజయవ్యాపారము నిరూపితముకాగా నొకరాజవ్యక్తిలో దోషసంబంధము హృదయమున కలిగినది. "అర్జునుడు మానవుడు. నేనును మానవుడను. మా మానుషత్వము సమానము. కాగా అర్జున పరాక్రమము కన్న నాపరాక్రమమున నేమి న్యూనత కలదు? ఈ మండనము మాత్రమదేల? అయిన నధికారమునుండు వారల కిది యుండవలయును" కాన నిందు పరమౌచిత్యఖ్యాపనము పరమప్రయోజనము. అన్యపాఠము.

పరదోషైర్విచిత్రార్థైః యత్రాత్మా పరికీర్త్యతే
అనుక్తోఽన్యోఽపి వా కశ్చిత్స తు క్షోభ ఇతీరితః

పరదోషములయిన విచిత్రార్థములు హేతువుగా ఆత్మపరికీర్తనమున్నచో, నితరు నెవనికాని పరికీర్తనమొనరించినచో క్షోభమను కావ్యలక్షణమగును. "పరస్య దోషో యేభ్యః" వేనివలన పరుని దోషము స్పష్టమగునో యది పరదోషము. "విచిత్రా అర్థాః; విచిత్రార్థాః పరగుణాః" విచిత్రార్థములు పరగుణములు. అవి పరదోషములనుట పరుల దోషములీ పరగుణములచే స్పష్టము లగు ననుట, హేతుభూతములగు వీనిచే నదృష్టార్థమైన స్వరూపముకూడ దృష్టార్థముగ కీర్తితమయినచో క్షోభ మగును. స్వాతిరిక్తవ్యక్తియేని కీర్తితుడయినచో క్షోభమగును. క్షోభమనుట హృదయ సంచలన ముండుటచే నని గ్రహింపదగును. ఇదియే యనుక్తసిద్ధి. దీని లక్షణమిట్లు గ్రాహ్యము.

ప్రస్తావేనైన శేషోర్థః కృత్స్నో యత్ర ప్రతీయతే
వచనేన వినా జాతు సిద్ధిః సా పరికీర్తితా

వచనము వినా ప్రస్తావనముననె శేషార్థము సర్వము ప్రతీతమగునేని యది సిద్ధియని పరికీర్తిత మయినది. పూర్వపద్యములో మన్దంమన్దం దోర్దండమండన మొనరించుట యను ప్రస్తావనముననె పౌరుషాతిశయము కల దర్పాదికము సర్వము గోచరమగుచున్నది. ఇట్టిభావము గుణోత్కృష్టులకు సంబంధించినదె యగును. అనుక్తసిద్ధిరూపమయిన సిద్ధిలక్షణమును షట్త్రింశత్కావ్యలక్షణముల తుది చెప్పుటయు "వచఃసిద్ధం".

లక్షణపాఠము.

శ్రీమదభినవోపాధ్యాయ సంప్రదాయ సమాగతముగ ప్రసిద్ధమయిన కావ్యలక్షణ నిర్ణయ మీ విధమున నున్నది. అభినవుడు విభూషణాది వివృతిలో నిరువదియారు కావ్యలక్షణములకు పాఠాంతర కారికలను నిర్దేశించినాడు. వానిలో నయిదు కావ్యలక్షణములు సమాన నామసంకేతముతో నున్నవి. గుణకీర్తనము, ఉదాహరణము, నిరుక్తము, అతిశయము, హేతువు అనువానికి పాఠాంతరమునగూడ పేర్లీవిధముననె యున్నవి. పదికావ్యలక్షణములకు పాఠాంతరము లేదు. విభూషణము అక్షరసంహతి, శోభ, సిద్ధి, పదోచ్చయము, మనోరథము, పృచ్ఛ, దృష్టాంతము, సంశయము, ప్రాప్తి అను నీ దశకమున కభినవగుప్తుడు పరపాఠ మేల ప్రదర్శింపలేదో యూహింపలేము. పాఠాంతరమునందు పేర్లు సమముగా నున్నను లక్షణస్వరూపము భిన్నముగా నున్నది. కోహలాదుల పాఠమునందలి క్రమ మభినవోపాధ్యాయ సంప్రదాయపాఠముకన్న వేరుగా నున్నది. వాని వాని వివేకమునకై అభినవపాఠనామము - పరపాఠనామము - కోహలాదిపాఠనామము నీ విధముగ గుర్తింపవచ్చును. అభినవు డన్యపాఠార్థము చూపలేదు. లక్ష్యము చూపలేదు. మానవల్లి దర్శనము ప్రదర్శింతును.

| | అభినవభారతీ పాఠము | పరపాఠము | కోహలాది పాఠము |
|---|---|---|---|
| ౧ | విభూషణము | — | భూషణము |
| | అక్షరసంహతి | — | అక్షర సంఘాతము |
| | | | |
| | అభిమానము | సాదృశ్యము | ఉదాహరణము |
| ౫ | గుణకీర్తనము | గుణకీర్తనము | హేతువు |
| | ప్రోత్సాహనము | ప్రియవచనము ప్రియోక్తి | సంశయము |
| | ఉదాహరణము | ఉదాహరణము | దృష్టాంతము |
| | నిరుక్తము | నిరుక్తము | ప్రాప్తి |
| | గుణానువాదము | గుణాతిపాతము | అభిప్రాయము |
| ౧౦ | అతిశయము | అతిశయము | నిదర్శనము |
| | హేతువు | హేతువు | నిరుక్తము |
| | సారూప్యము | దృష్టము | సిద్ధి |
| | మిథ్యాధ్యవసాయం | విపర్యయము | విశేషణము |
| | సిద్ధి | — | గుణాతిపాతము |
| ౧౫ | పదోచ్చయము | — | అతిశయము |
| | ఆక్రందము | తుల్యతర్కము | తుల్యతర్కము |
| | మనోరథము | — | పదోచ్చయము |
| | ఆఖ్యానము | ప్రసిద్ధి | దృష్టము |
| | యాచ్ఞ | దాక్షిణ్యము | ఉపదిష్టము |
| ౨౦ | ప్రతిషేధము | లేశము | విచారము |
| | పృచ్ఛ | — | విపర్యయము |
| | దృష్టాంతము | — | భ్రంశము |
| | నిర్భాసనము | మాల | అనునయము |
| | సంశయము | — | మాల |
| ౨౫ | ఆశీస్సు | నిదర్శనము | దాక్షిణ్యము |
| | ప్రియవచనము | భ్రంశము | గర్హణము |
| | కపటము | గర్హణము | అర్థాపత్తి |
| | క్షమ | విశేషణము | ప్రసిద్ధి |

| అభినవభారతీ పాఠము | పరపాఠము | కోహలాది పాఠము |
|---|---|---|
| ప్రాప్తి | | పృచ్ఛ |
| ౩౦ పశ్చాత్తాపము | విచారము | సారూప్యము |
| అనువృత్తి | అనునయము | మనోరథము |
| ఉపపత్తి | ఉపదిష్టము | లేశము |
| యుక్తి | అభిప్రాయము | క్షోభము |
| కార్యము | అర్థాపత్తి | గుణకీర్తనము |
| అనునయము | ప్రసిద్ధి | అనుక్తసిద్ధి |
| ౩౬ పరిదేవనము | క్షోభము—అనుక్తసిద్ధి | ప్రియోక్తి |

పరపాఠపరిగణనములోని వన్నియు కోహలాదిపాఠములో నున్న వనుట విశేషము కాదు. కోహలాదిపాఠములోనివి పరపాఠములో లేవు. లేశ మభినవపాఠమున లేదు. అభినవపాఠమున కోహలపాఠమున సమాన సంకేతములు కలవు కాని యర్థభావములు వేరు. కోహల పాఠానుసారమున నున్న కావ్యలక్షణములను తద్భావముల నభినవ పాఠమున గుర్తించినను ఆనుపూర్వీకృతముగా గలుగు సమాహార సౌందర్యమునకై మానవల్లి దర్శనములోని లక్ష్యవివేచనము కూర్చి నిరూపించుట యుక్తము.

౧. భూషణము : అలంకారై ర్గుణైశ్చైవ బహుభి స్సమలంకృతం
భూషణైరివ చిత్రార్థై స్తద్భూషణమితి స్మృతం.

కావ్యమునందలి కథాశరీరరచన ఉపమాద్యలంకారములచే గుణము లచే సముల్లసిత మగునేని భూషణమను కావ్యలక్షణ మగును. కథాశరీరము గుణాలంకారములచే నలంకృతమయినట్లు చిత్రార్థములచే గూడ శోభితము కావలయును. విభావాదిసామగ్రీప్రత్యాయకములై రసోద్ద్యోతకములగు నర్థవిశేషములు చిత్రార్థము లగును. వక్రోక్తి రూపములగు నర్థములును చిత్రార్థములె.

ఉదా :— కృత్యారావణమను నాటకమునందలి సన్నివేశము, లక్ష్మణవిభీషణులు కంచుకితో— ఆర్యా! చెప్పుము "రావణుని యాజ్ఞానుసారముగా భటులు రాముని మాయాశిరమును తీసికొని

రాగా సీత మూచి సఖులు నివారించుచున్నను "నన్ను కష్టపెట్టు కొనను" అని- "ఏమి చేసినది?" "నేను చెప్పజాలను"

శశిన ఇవ కలా దినావసానే
కమలవనోదరముత్సుకేవ హంసీ
పతిమరణరసేన రాజపుత్రీ
స్ఫురితకరాలశిఖం వివేశ వహ్నిం

సాయంసమయమున చంద్రకళవలె విరహముకల హంసి కమల వనోదరము చేరిన విధముగా, పతిమరణించెనని సీత శిఖాకరాలమయిన వహ్నిప్రవేశించినది. ఇందలి యుపమాలంకారము భూషణలక్షణ కావ్యలక్షణోచితము, భూషణలక్షణయోగమున కావ్యము సామాన్య వాక్యముకన్న భిన్నమై శోభించును.

"తాత్పర్యమేవ వచసి ధ్వనిరేవ కావ్యే"

మొదలగు వచనములచే సాహిత్యవిదులు నిరూపించిన గుణా లంకారవర్గమంతయు లక్షణశబ్దమున నె పరిగృహీతమగును. కథారూప మయిన వక్రోక్తి గుణాలంకారములచే నతిశయితమయినచో నది భూషణమగునని పరమతాత్పర్యము.

౨. అక్షరసంహతి. స్థిరైరర్థైస్సమం కృత్వా హ్యాసిద్ధార్థః ప్రయుజ్యతే
యత్ర శ్లిష్టా విచిత్రార్థా సా శోభేతి విధీయతే

వివిధశ్లేషోక్తిచేగాని అక్షరవిపర్యాసమునగాని యుక్తిప్రత్యుక్తి వైచిత్ర్యమున్నచో నక్షరసంహతి యగును. ఉభయాభిసారికమను రూపకములో విటుడు-"భగవతి! నేను వైశికాచలుడను." "వైశికా చలుని వలన నాకేమి ప్రయోజనము? నాకు వైశేషికాచలుడు కావలయును." "దీని కారణమేమో?" "షట్పదార్థబహిష్కృతులతో సంభాషణము మా గురువులు నిషేధించిరి." "అయినచో యుక్తముగా నున్నది."

ద్రవ్యం తే తనురాయతాక్షి దయితా రూపాదయస్తే గుణాః
సామాన్యం తవ యౌవనం బుధజనః సంస్తౌతి కర్మాణి తే
త్వయ్యార్యే సమవాయమిచ్ఛతి జనో యస్మాద్విశేషోస్తి తే
యోగస్తే తరుణైర్మనోభిలషితైర్మోక్షో౽ప్యనిష్టాజ్జనాత్

వైశికుడు వేశ్యలవాడలో దిరుగాడువాడు. వైశేషికుడు కణాద ప్రోక్త వైశేషికదర్శన మధ్యయనముచేసినవాడు. వైశేషికులు ద్రవ్య గుణ కర్మ సామాన్య విశేష సమవాయము లను షట్పదార్థముల నంగీకరింతురు. అభావ మంగీకరింపరు. ఈ భావసంబంధమున నిచట గలిగిన శ్లిష్టత ప్రకృతోపయోగి. పద్యభావ మిట్లున్నది. ఓ! విశాల నయనా! నీ శరీరము ద్రవ్యము. నీకు రూపాదిగుణము లిష్టములు నీ యౌవనము సామాన్యము. యువకులు నీ కర్మలు స్తుతింతురు. జనము నీయందు సమవాయము కోరును. నీకు విశేషము కలదు. అభీష్ట యువకులతో నీకు యోగము కలదు. ఇష్టముకాని వాని నుండి నీకు మోక్షమున్నది. ఈ యర్థములో పరివ్రాజిక బహుపురుషాసక్త బహు భుక్తభోగ యని స్పష్టము. ఆ యా శబ్దగత శ్లేషబలమున విచిత్రార్థము కలుగును కాన అక్షరసంఘాతము. ఇటుపై గూడ పరివ్రాజిక పలుకు లలో నక్షరసంఘాత మున్నది.

3 శోభ— సిద్ధైరర్థైః సమం కృత్వా హ్యసిద్ధోర్థః ప్రయుజ్యతే
యత్ర శ్లిష్టా విచిత్రార్థా సా శోభేతి విధీయతే

అసిద్ధార్థములకు సిద్ధప్రయోజనములతో శుభసంఘటన ముండు నేని, అథవా. సూచితమగు నేని యది శోభ యగును. అప్పు డందలి శ్లేష, వక్రోక్తి ధ్వనిమహిమాతిశయమున చమత్కృత మగును. స్వభావ ప్రకటనమె శోభయని కొందరనిరి. యువ ప్రకృతుల ప్రభావ ప్రకటనము శోభ యని యన్యులు తలచిరి. వస్తు వర్ణప్రధానముగా నున్నప్పు డీ శోభ శోభించును. ఉదా:— రత్నావలి ప్రథమాంకములో ఎచటనున్నను సంపాదింతు ననుటలో సందేహము లేమిని ప్రకటించి,

ప్రారంభేఽస్మిన్ స్వామినో వృద్ధిహేతౌ
దైవే చేత్థం దత్తహస్తావలంబే
సిద్ధేర్భ్రాంతి ర్నాస్తి సత్యం తథాపి
స్వేచ్ఛాచారీ భీత ఏవాస్మి భర్తుః

ప్రభువున కభివృద్ధికార్యము నిట్లారంభింపగా దైవమీ విధమున హస్తావలంబన మీయగా కార్యసిద్ధివిషయమున నేమియు భ్రాంతి లేదు. కాని స్వేచ్ఛగా నుండుట కేలనో బెదురుగా నున్నది. సిద్ధార్థముతో

నసిద్ధార్థము కూర్చుట కిది యుదాహరణము. కథా శరీర సంఘటన వైచిత్ర్యరూపశోభ కుదాహరణ మభిజ్ఞానశాకుంతలమున సన్నివేశ ఘటనములో కలదు.

౪. ఉదాహరణము : యత్ర తుల్యార్థయుక్తేన వాక్యేనాభిప్రదర్శనాత్
సాధ్యతే నిర్గుణైరర్థ స్తదుదాహరణం స్మృతం

ఇతరుల దుర్భేదపరమార్థముతో సమానార్థముగా ప్రయోగించిన వాక్యముతో నిపుణులు నిగూఢాశయమును నిరూపింతురేని యది యుదాహరణ మగును. దేవీచంద్రగుప్తమునందు ప్రావేశికీధ్రువ సంశయాకులమానసుడయిన కుమారచంద్రగుప్తుని ప్రవేశకావసరసూచక మయిన యర్థము నుద్ద్యోతింపజేయుచున్నది. ప్రద్యుమ్నాభ్యుదయము మూడవ యంకమునందలి యంతర్నాటికలో సూత్రధారవచనము విని సఖి ప్రభావతికి అభిసరణమే శరణమని యుపదేశించును. అభిసరణమె ప్రద్యుమ్నసంగమోపాయ మనియెడు నర్థమచట సాధ్యమయినది.

౫. హేతువు :- యత్ర్పయోజనసామర్థ్యా ద్వాక్యమిష్టార్థ సాధనం
సమాసోక్తం మనోగ్రాహి స హేతురితి సంజ్ఞితః

ఫలసాధనశక్తియుక్తము మితశబ్దార్థము విచిత్రభంగీనిరూపిత మయిన వచనము హేతువు. ఉదా :- తాపసవత్సరాజనాటకము. షష్ఠాంకమునందు మరణనిశ్చయమున నున్న వాసవదత్తను ప్రబోధించుచు యౌగంధరాయణు డిట్లనును.

అస్పృష్టాః ప్రతిపార్థివం యువతయో జాతా మనోవల్లభాః
మగ్నాస్తేవ్యసనార్ణవే చ బహవస్తాభిః సహైవేశ్వరాః
దేవ్యా యత్తు కృతం తదావికలతాముత్సృజ్య లోకోత్తరం
తస్యైషా కృపణోచితేన విధినా కిం గ్లానిరుత్పద్యతే

సృష్టి మొదలుకొని ప్రతిరాజునకు స్త్రీలు మనోవల్లభ లయినారు. చాలామంది వ్యసనార్ణవమగ్న లయినారు. వారితో ప్రభువులును వ్యసన మనుభవించినారు. వైకల్యము విడనాడి లోకోత్తరముగా దేవి యాచరించినది యుక్తము. కాని యీ కృపణోచితవిధి తగదు. దేవీ నీవాచరించినది యిష్టార్థసాధనము. దాని శుభఫల మచిరకాలమున నీ వనుభవింప గలవు.

౬. సంశయము :- అపరిజ్ఞాత తత్త్వార్థం వాక్యం యత్ర సమాప్యతే
అనేకత్వాద్విచారాణాం స సంశయ ఇతి స్మృతః

అసమాప్తవాక్య మయినందున సాధనీయవిషయ స్వరూపము నందు సందిగ్ధావస్థ సంశయ మగును. అర్థకామ ప్రధానములయిన రూపకములందిది నిపుణ ప్రయుక్తమగును. ఉదా:- కుందమాల షష్ఠాంకమున రామాయణ కథావాచకులగు కుశలవులు సీతావృత్తాంతము పఠించుచు సీతాపరిత్యాగము పలికి యూరకొనిరి. అప్పుడు రామలక్ష్మణు లేమేమో తలంతురు. అచట సంశయ కావ్యలక్షణము సంగతము. సంశయాలంకారము సంశయాఖ్య కావ్యలక్షణము కన్న భిన్నము. భిన్నచమత్కారకము నగును.

౭. దృష్టాంతము - సర్వలోకమనోగ్రాహీ యస్తు పక్షార్థసాధకః
హేతోర్నిదర్శనకృతః స దృష్టాంత ఇతి స్మృతః

ధర్మవిరుద్ధముగా సర్వలోకమనోగ్రాహివచనమును నిదర్శనోపష్టంభముగా బలుకుట దృష్టాంతమను కావ్యలక్షణమగును. ఉదా- ధూర్తవిటమునందు- "స్త్రీలతో సంబంధము తగదు" "నీవేమి గుర్తించితివి?" "ఓయీ! ఇది కేవలముపదేశమె. స్త్రీలతో సంబంధము పెట్టుకొననివానిని నేను చూడలేదు. మహేంద్రాదులుకూడ అహల్యాదుల విషయమై వికృతి పొందినారుకదా." అను సంభాషణములో నిది స్పష్టము. ఇట్లే పద్మప్రాభృతకములో;

దక్షాత్మజాః సుందరి యోగతారాః
కిం నైకజాతాః శశినం భజంతే
ఆరుహ్యతే వా సహకారవృక్షః
కిం నైకమాలేన లతాద్వయేన

దేవసేన యను స్త్రీ తన సోదరీప్రియుని ప్రేమించుటలో సంధిగ్ధమానస కాగా, "సుందరి! దక్షప్రజాపతిపుత్రికలు చంద్రుని సేవింపలేదా? ఒకమామిడిచెట్టును లతాద్వయ మారోహింపదేమి? అనుటలో దృష్టాంతము కలదు. ఇట్టివానిలో సాధకనిదర్శనములు సంగతములగును.

౮. ప్రాప్తి- దృష్ట్వైవావయవాన్ కాంశ్చిద్భావో యత్రానుమీయతే
ప్రాప్తిం తామభిజానీయాల్లక్షణం నాటకాశ్రయం

అవయవములను గొన్నిటిని జూచి ప్రధాన పదార్థ మనుమిత మయినచో ప్రాప్తి. ఉదా :- కుందమాల ;

సమానం సంస్థానం నిభృతలలితా సైవ రచనా
తదేవైతద్రేఖా కమలరచితం చారుతిలకం
యథా చేయం దృష్ట్వాహరతి హృదయం శోకవిధురం
తథా హ్యస్మిన్దేవ్యా సపది పదపంక్తిర్వినిహితా

సైకతమున పదచిహ్నములను చూచి యొక స్త్రీ పదములని లక్ష్మణు డనగా సీతాపదములె యని రాముడు నిశ్చయించుట. "పదసంస్థానము సమానముగా నున్నది. రచన లలితముగా నున్నది. పద తిలకము రేఖాకమల రచితముగా నున్నది. నా హృదయమును గూడ సిది హరించుచున్నది. కాన దేవియే పదపంక్తి కూర్చిన దని భావింతును.

౯. అభిప్రాయము. అభూతపూర్వో యో హ్యర్థం సాదృశ్యాత్పరికల్పితః
లోకస్య హృదయగ్రాహీ సోఽభిప్రాయ ఇతి స్మృతః

అభూతపూర్వార్థము సాదృశ్యపరికల్పితమై లోకమనోహారి యయిన నది యభిప్రాయమగును. అభూత పూర్వమనుట కేవలము కల్పితమని యసత్పదార్థమని భావము. ఉదా :- తాపసవత్సరాజము ;

దూరముద్గీర్ణే చ రిపావేవమకించిత్కరే చ విజిగీషౌ
భవతా తు నయగుణశతైః సోయమసూత్రః పటః క్రియతే

యౌగంధరాయణయత్నమును సాంకృత్యాయని యిట్లు పలుకుచున్నది. శత్రువంతదూరమున నున్నాడు. విజిగీషువేమియు చేయలేనివాడయినాడు. నీవు గూఢచారిగా నయగుణశతముతో నసూత్రపటము నిర్మించెదవు.

భూమిః కరాగ్రేణ వివర్తితాద్య
శ్వాసేన భగ్నో హిమవాన్ మహాద్రిః
ఆసారవృష్ట్యా శమితోఽగ్నిరార్వో
వినిర్మితః కీటశతై రనంతః

వత్సరాజచరితము ద్వితీయాంకమున దొంగవాక్యము. భూమిని గోటితో పెకలింతును. ఊర్పుతో హిమవంత మెగురవేయుదును. ధారావర్షముతో బడబాగ్ని శమింపజేసితిని. అనంతుని వందపురుగులు పట్టించి హతమార్చితిని. వీని యందభూతపూర్వముల వర్ణనము కలదు.

౧౦. నిదర్శనము— యత్రార్థానాం ప్రసిద్ధానాం క్రియతే పరికీర్తనం
పరాపేక్షావ్యుదాసార్థం తన్నిదర్శనముచ్యతే

ప్రసిద్ధార్థములను పరాపేక్షావ్యుదాసమునకు నిరూపించిన నిదర్శన మగుగు. ఉదా— ఉభయాభిసారిక.

శాంతిం యాతి శనైర్మహౌషధిబలాదాశీవిషాణాం విషం
శక్యో మోచయితుం మదోత్కటకటాదాత్మా గజేంద్రాద్వనే
గ్రాహస్యాపి ముఖాన్మహార్ణవజలే మోక్షః కదాచిద్భవేత్
వేశస్త్రీ బడబాముఖానలగతో నైవోత్థితో దృశ్యతే

మహౌషధిబలమువలన సర్పముల విషము శాంతింపవచ్చును. అరణ్యమున మదించిన గజమునుండి విమోచనము సంపాదింప వచ్చును. సముద్రములో మొసలి ముఖమునుండియు నొకప్పుడు మోక్షము కలుగవచ్చును. కాని వేశ్యాబడబాముఖమునుండి తప్పించు కొనినవాడు లేడు.

౧౧. నిరుక్తము:— నిరవద్యస్య వాక్యస్య పూర్వోక్తార్థప్రసిద్ధయే
యదుచ్యతే తు వచనం నిరుక్తం తదుదాహృతం

నిర్దోషవాక్యమునకు నిర్దోషత్వము నిరూపించు వచనము నిరుక్తము. ఉదా:— వత్సరాజ చరితము.

సీతా బలాత్ప్రకృతిభద్రతరా సుభద్రా
యద్వాసుభద్ర భగినీ కపికేతనేన
దేవస్య తేన సముదభూద్వచనీయతా కిం?
తేజః ప్రకాశయశసాం యదుదంతినాం వా?

ప్రకృతిభద్రముగా నుండు వాసుభద్రసోదరి సుభద్రను అర్జునుడు హరించెను. దానివలన ప్రభువున కేమి వచనీయత వచ్చినది. అచటి పరాక్రమశాలుర కేమి? అచటి యాదనదంతిగజముల కేమి? వచనీయత. ఇందు వత్సరాజు వాసనదత్తను హరించినంతమాత్రమున వచనీయత

లేదని భరతరోహకమంత్రికి వసువర్మ నివేదింపగా శాలంకాయనుడు విని- "సాధు. నిరుక్తమభిహితం" అనెను.

౧౨. సిద్ధి- బహూనాం తు ప్రధానానాం నామ యత్రాభికీర్త్యతే
అభిప్రేతార్థ సిద్ధ్యర్థం సా సిద్ధి రభిధీయతే

ప్రధానములు స్పృహణీయములగు ప్రయోజనాంతరము లతర్కితోప లబ్ధము లగుటను పరికీర్తనము చేయుట సిద్ధి. ఉదా- కౌముదీ మహోత్సవములో మంత్రిగుప్తవచనము;

సంగతి శ్చిర మచించిత పూర్వా
నిర్వృత ప్రణయినీ మిథునానాం
అధిరాజ్య మధిరోహతి తస్యాః
షోడశీమపి కలాం న మఘోనః

సుఖాసక్తికల దంపతుల యీ యచింతితమయిన సంబంధము రమ్యము. ఇంద్రుని రాజ్యభోగముకూడ దీని షోడశకలాసంపదకైన పోలదు. కౌముదీ మహోత్సవము నందలి దంపతుల స్పృహణీయత యిందు కీర్తిత మయినది.

౧౩. విశేషణము- సిద్ధాన్ బహూన్ ప్రధానార్థానుక్త్వాయత్ర ప్రయుజ్యతే
విశేషయుక్తం వచనం విజ్ఞేయం తద్విశేషణం

సిద్ధములగు ప్రధానార్థముల ననేకముల పలికి విశేషయుక్తమగు వచనము నిరూపించినచో విశేషణమగును. ఉదా:- తాపసవత్సరాజము.

వృత్తిర్మూలఫలాదిభిః క్షితితలే శయ్యా జటాధారణం
వాసో వల్కలమిత్యశం కృతమిదం సామాన్యమన్యైరపి
సంవేగాభిభవే విమూఢమనసా యన్నానుయాతా ప్రియా
తన్మిథ్యాపరిబోధితేన న కృతం స్నేహానురూపం మయా

మూలఫలాదులతో నాహారము, భూతలమందు శయ్య, జటాధారణము, నారచీర, ఇట్టి సామాన్యవిధి నితరులు ననుసరింతురు. భావవేగము త్రోయగా మూఢమనస్కుడనై ప్రియురాలి ననుసరింప లేదు. మిథ్యాపరిజ్ఞానమునలన నేను స్నేహానురూపముగా ప్రవర్తింప నైతిని. ఇందు వత్సరాజ ప్రవృత్తి విశేషయుక్తవచన మయినది.

౧౪. గుణాతిపాతము :- గుణాభిధానై ర్వివిధై ర్విపరీతార్థయోజితైః
గుణాతిపాతో మధురై ర్నిష్ఠురార్థై ర్భవేద్యథా

గుణములగు వానిని విపరీతార్థమునందు యోజనమొనర్చి పలుకుట గుణాతిపాతము. ఉదా : ధూర్తవిటరూపకమున విటుడు.

జాత్యంధాం సురతేషు దీనవదనామన్తర్ముఖాభాషిణీం
హృష్టస్యాపి జనస్య శోకజననీం లజ్జాపటేనావృతాం
నిర్వ్యాజం స్వయమప్యదృష్టజఘనాం స్త్రీరూపబద్ధాం పశుం
కర్తవ్యం ఖలు నైవ భోః కులవధూకారాం ప్రవేష్టుం మనః

సురతములందు గ్రుడ్డిది. దీనవదన. అంతర్ముఖముగా మాటలాడును. తాను స్పష్టముగా తన జఘనముచూచి యుండదు. ఆమె స్త్రీరూపముగా కులవధూరూపముగానున్న పశువు. అట్టిదానిపై నెన్నడు మనసుంచరాదు. దీనిలో కులస్త్రీసముచితము లయిన వినయలజ్జాది గుణములు విపరీతార్థమున సంయోజితము లయినవి.

౧౫. అతిశయము:-బహూన్గుణాన్కీర్తయిత్వాసామాన్యజనసంభవాన్
విశేషఃకీర్త్యతేయస్తుజ్ఞేయఃసోఽతిశయోబుధైః

సామాన్యజనసహజములయిన బహుగుణములను చెప్పివిశేషము నిరూపించినచో నతిశయమగును. ఉదా : విలక్షకురుపతి రూపకమునందు ధృతరాష్ట్రనుద్దేశించి భీష్ముడనుట.

ఏతత్తే హృదయం స్పృశామి యది వా సత్కీర్తయై వాత్మజః
సంప్రత్యేవ తు గోగ్రహే యదభవత్తత్త్వావదాకర్ణ్యతాం
ఏకః పూర్వముదాయుధైః స బహుభిర్దృష్టస్తతోఽనన్తరం
యావన్తో వయమాహవప్రణయినస్తావన్త ఏవార్జునాః

నీకు నీ కుమారుడె సాక్షి యయినచో నీ హృదయము తెలియవలెను. ఇప్పుడే గోగ్రహమునందేమి జరిగినదో దాని నీవు వినవలెను. ఆయుధములు పట్టిన యనేకులకు మొదట అర్జునుడొకడె కన్పడినాడు కాని మేమెందరము యుద్ధనిపుణులము కలమో యర్జును లంతమంది కలరు. అర్జునవిశేషమిందు కీర్తితమయినది.

౧౬. తుల్యతర్కము- రూపకై రుపమాభిర్వాతుల్యార్థాభిఃప్రయోజితః
అప్రత్యక్షార్థసంస్పర్శస్తుల్యతర్కః ప్రకీర్తితః

అప్రత్యక్షార్థసంస్పర్శము తుల్యతర్కము. ఉదా- వత్సరాజచరితము. అష్టమాంకమునందు రాజు;

నవార్కభా పల్లవితామలోదరే
సుగంధి రేణూత్కర కేసరోజ్జ్వలే
రసామృతజ్ఞో భ్రమరః సరోరుహే
కిమర్కపుష్పే ప్రణయం కరిష్యతి

బాలారుణకాంతివికసితము పరిమలయుక్తము కేసరోజ్జ్వల మయిన పద్మమున రసాస్వాదమొనరించిన భ్రమరము జిల్లేడుపువ్వుపై నాసక్తికలది యగునా?

౧౭. పదోచ్చయ:- బహూనాం తు ప్రయుక్తానాంపదానాంబహుభిఃపదైః
ఉచ్చయః సదృశార్థోయః స విజ్ఞేయః పదోచ్చయః

బహుపదములకు బహుపదములతో సదృశసముచ్చయముండుట పదోచ్చయము. ఉదా: వత్సరాజచరితమున సచివవర్ణనము.

ఖడ్గో రక్షాంధకారే రవిరరితిమిరే కార్యభారేషు ధుర్యః
దీపో మంత్రాంధకారే సురగురురనయే సంక్రమో వ్యాపదోఘే
ఉత్కంఠాయాం స భాగీ గతిరనవసరే చందనం శోకతాపే
సంక్షేపాన్మానుషాభో హితశివసుఖదో భవ్యచింతామణిర్మే

రక్షాంధకారమున ఖడ్గము. శత్రుతిమిరమునందు సూర్యుడు. కార్యభారములందు మహోక్షము. మంత్రాంధకారమున దీపము. దుష్ట నీతివిషయమున దేవగురువు. విపత్సమూహమునందు సహాయము. వేదనలో సహభాగి. క్లిష్టసమయమున గతి. శోకతాపమున చందనము. సంక్షేపముగా పలికినచో నాకు మంత్రి మానుషాకారముననున్న హిత శివసుఖప్రదమగు భవ్యచింతామణి.

౧౮. దృష్టము:- యథాదేశం యథాకాలం యథారూపం చ వర్ణ్యతే
యత్ప్రత్యక్షం పరోక్షం వా దృష్టం తద్వర్ణతోఽపివా

దేశకాలరూపానుసారమున ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని వర్ణితమగునది దృష్టమను కావ్యలక్షణ మగును. ఉదా:- ప్రత్యక్ష దృష్టము మాలవికాగ్నిమిత్రము.

వామం సంధిస్తిమితవలయం న్యస్య హస్తం నితంబే.
కృత్వా శ్యామావిటపసదృశం స్రస్తముక్తం ద్వితీయం
పాదాంగుష్ఠాలులితకుసుమే కుట్టిమే పాతితాక్షం
నృత్తాదస్యాః స్థితమతితరాం కాంతమృజ్వాయతాక్షం

ఛలితకనృత్త ప్రయోగానంతరము రంగముననున్న మాలవిక యిట్లున్నది. సంధిభాగమున కంకణములు నిలిచిన వామహస్తమును నితంబమున నిలిపినది. కొమ్మ రెమ్మవలె నున్న కుడిచేతిని జారుడుగా వ్రేలాడవేసినది. కాలివ్రేలితో కుట్టిమ కుసుమములను దుల్లవేసినది. అటే దృష్టిని సారించినది. మనోహర దీర్ఘాక్షముతో నున్న ఆమె రంగస్థితి నృత్తముకన్న రమ్యముగ నున్నది.

పరోక్ష దృష్టము – పాదతాడితకము.

ఉత్క్షిప్తాలకవీక్షణాంతగలితం కోపాంచితాంతర్భ్రువా
దష్టాగ్రోష్ఠమధీరదంతకిరణం ప్రోత్కంపయంత్యా ముఖం
శింజన్నూపురయా వికృష్య విగలద్రక్తాంశుకం పాణినా
మూర్ధ్ని న్యస్య సనూపురః సమదయా పాదోఽర్పితః కాంతయా

మదనసేన కాముకునియెడ ప్రవర్తించిన విధము దీనిలో వర్ణితము. కనుకొలకులు గ్రుచ్చుకొనునట్లు చూచి అలకలు పైకి త్రోసికొని, సగము పెదవి కొఱికికొని, కొన్నిపన్నులు కన్పడునట్లు, ఎఱ్ఱని పైటలాగి, బిగియపట్టి, కోపముతో బొమలు ముడిచి, ముఖ మూగించుచు నూపురములు ఘల్లుమనగా నిషాకై పెక్కిన కాంత వాని తలమీద సనూపురపాదమును మోపినది. ఇది యంతయు పరోక్ష ప్రక్రియ.

౧౯. ఉపదిష్టము:– పరిగృహ్య తు శాస్త్రార్థం యద్వాక్యమభిధీయతే
విద్వన్మనోహరం స్వాంతముపదిష్టం తదుచ్యతే

శాస్త్రార్థము ననుసరించి విద్వన్మనోహరముగా చెప్పినది యుపదిష్టము.
ఉదా:– అవిమారకము ప్రథమాంకమున;

ధర్మః ప్రాగేవ చింత్యః సచివమతిగతిః ప్రేక్షితవ్యా స్వబుద్ధ్యా
ప్రచ్ఛాద్యౌ రాగరోషౌ మృదుపరుషగుణౌ కాలయోగేన కార్యౌ
జ్ఞేయం లోకానువృత్తం పరచరనయనైర్మండలం ప్రేక్షితవ్యం
రక్ష్యో యత్నాదిహాత్మా రణశిరసి పునః సోపి నావేక్షితవ్యః

ధర్మమును మొదట నే యాలోచింపవలెను. మంత్రులరీతులను తనబుద్ధితో నాలోచన చేయవలెను. మృదుపరుషగుణములు కల రాగ రోషములను దాచియుంచి కాలయోగానుసారమున నుపయోగింపవలెను. లోకానువృత్తము గుర్తింపవలెను. శత్రువుల గూఢచారుల సంచారము భావింపవలెను. తన మండలము పరిశీలింపవలెను. ప్రయత్నపడి యాత్మరక్షణ మొనరించుకొనవలెను. యుద్ధభూమిలో స్వాత్మ దాచికొనక యుద్ధ మొనరింపవలెను. ఇందలి విషయమంతయు నీతి శాస్త్రసముపదిష్టము. ధూర్తవిట రూపకమున తంత్రాంతర విషయము.

> శూన్యే వాసం ప్రమర్ద్య ద్విరద ఇవ లతాం యో హరత్యాశు నారీం
> మత్తాం వా యో పిదిత్వా హ్యభిభవతి శనై రంజయన్వాక్యలేశైః
> అన్యం కృత్వోపధిం వా ఛలయతి కురుతే భావసంగూహనం వా
> తస్యైతచ్చేష్టితం భో న భవతి విఫలం వామశీలా హి నార్యః

శూన్యస్థలమునందు వాసము మర్దనముచేసి తీవ నేనుగువలె స్త్రీని వేగముగ హరించువాడు, మత్తురాలని తెలిసి మాటలతో రంజింపజేయుచు నెమ్మదిగా నధీనము చేసికొనువాడును, ఏదియో వంచనముచేసి మోసగించువాడును, భావసంగూహన మొనరించువాడు నగు కాముక మానవుని చేష్టితము విఫలము కాదు. స్త్రీలు వామస్వభావలు కదా!

౨౦. విచారము;- పూర్వాశయసమానార్థై రప్రత్యక్షార్థసాధనైః
అనేకోపాధిసంయుక్తో విచారః పరికీర్తితః

ప్రవృత్తార్థానుసారముగా పరోక్షార్థసాధకమగు బహూపాయోపాధి దర్శనమయిన వాక్యము విచారమగును. ఉదా : ముద్రారాక్షసమున రాక్షస వాక్యము.

> సాధ్యే నిశ్చితమన్వయేన ఘటితం బిభ్రత్సపక్షే స్థితిం
> వ్యావృత్తం చ విపక్షతో భవతి యత్తత్సాధనం సిద్ధయే
> యత్సాధ్యం స్వయమేవ తుల్యముభయోః పక్షే విరుద్ధం చ యత్
> తస్యాంగీకరణేన వాదిన ఇవ స్యాత్స్వామినో నిగ్రహః

సాధనము సాధ్యమున నిశ్చితము అన్వయమున ఘటితము సపక్షమున స్థితి కలది. విపక్షమునుండి వ్యావృత్తమయినది యగుచో కార్య

సిద్ధికి సమర్థమగును. అట్లుకాక సాధనము సాధ్యమె యగునేని రెండింటి యందు తుల్యమగునేని పక్షమున విరుద్ధమగునేని యట్టిసాధనము నంగీకరించినచో వాద మొనరించువానికివలె స్వామికి నిగ్రహము కలుగును. ఈ పద్యార్థమును చాణక్యసాధనపరముగ రాక్షససాధనపరముగ తార్కికసాధనపరముగ సమన్వయించి గుర్తించుట యావశ్యకము. చాణక్యసాధనము సాధ్యసిద్ధిసమర్థ మయినది. రాక్షససాధనము సాధ్యసిద్ధి కసమర్థ మయినది, వాదికి సద్ధేతువు సాధ్యసిద్ధికగును. అసద్ధేతువు సాధ్యసిద్ధి కసమర్థమై పరాజయము కూర్చును. ఇచట ప్రకృతానుసారముగా బహూపాధిప్రదర్శన మున్నది.

౨౧. విపర్యయము:- విచారస్యాన్యథాభావ స్తథా దృష్టోపదిష్టయోః
సందేహాజ్జాయతే యత్ర స విజ్ఞేయో విపర్యయః

సందేహము వలన విచార మన్యథా యగునేని విపర్యయ మగును. రావణు నుద్దేశించి సచివు డనుట

ఉదర్కసిద్ధిమిచ్ఛద్భిః సద్భిర్న ఖలు దృశ్యతే
చతుర్థీచంద్రలేఖేవ పరస్త్రీ ఫాల పట్టికా

ఫలసిద్ధి నభిలషించు సజ్జనులు చతుర్థీ చంద్రలేఖ చూడరు. పరస్త్రీ ఫాలపట్టిక దర్శింపరు. నీవు సీతను చూచుట యుక్తము కాదని సచివుడనగా రావణుడీ విధమున పలికినాడు.

పరస్త్రీ కుచకుంభేషు కుంభేషు వరదంతినాం
నిపతంతి న భీరూణాం దృష్టయః శరవృష్టయః

పరస్త్రీ కుచకుంభములందు భీరువుల దృష్టులు ప్రసరింపవు. గజముల కుంభములందు భీరువుల శరములు ప్రసరింపవు.

౨౨. భ్రంశము:- వాచ్యమర్థం పరిత్యజ్య దృష్టాదిభిరనేకధా
అన్యస్మిన్నేవ పతనాదాశు భ్రంశః స ఉచ్యతే

వాచ్యార్థమును విడనాడి యన్యార్థమును స్వీకరించినచో భ్రంశమగును. ఉదా:- వేణి.

సహభృత్యగణం సబాంధవం
సహమిత్రం ససుతం సహానుజం
స్వబలేన నిహంతి సంయుగే
న చిరాత్పాండుసుతః సుయోధనం

ద్వితీయాంకమునందు దుర్యోధనుడు కంచుకితో ననుట. అచిర కాలముననె పాండుకుమారుడు సుయోధనుని భృత్యగణముతో బాంధవులతో మిత్రులతో సుతులతో ననుజులతో యుద్ధమునందు తన బలముతో చంపును. ఇట్లనుటలో భ్రంశ మున్నది. "పాండుసుతం సుయోధనః" అని పలుకవలసి యుండగా వ్యత్యస్తముగా బలుకుట వలన కంచుకి చెవులుమూసికొని "శాంతం పాపం ప్రతిహతమమంగళం" అనెను. ఇందన్యార్థ ప్రసారము స్పష్టము.

౫౩. అనునయము:- ఉభయోః ప్రీతిజననో విరుద్ధాభినివేశయోః
అర్థస్య సాధకశ్చైవ విజ్ఞేయోఽనునయో బుధైః

విరుద్ధాభినివేశము కలవారిద్దరికి ప్రీతిజనన మర్థసాధక మగునది యనునయ మగును. రామాభ్యుదయము ద్వితీయాంకమునందు రామపరాక్రమస్తుతి వ్యగ్రుడయిన మారీచుని రావణుడనుట - ఓరీ! ప్రతిపక్షపక్షపాతీ! క్షుద్ర! రాక్షసాపశద!

తన్నైవ రుధిరాంబుభిః క్షతకఠోరకంఠస్రుతైః
రిపుస్తుతిభవో మమ ప్రశమమేతు కోపానలః
సురద్విపశిరఃస్థలీదలనదష్ట ముక్తాఫలః
స్వసుః పరిభవోచితం పునరసౌ విధాస్యత్యసిః

శత్రుస్తుతిజన్యమయిన నా కోపాగ్ని నీ తెగిన కంఠమునుండి కారిన రక్తధారలచే శాంతిని పొందుగావుత. ఇంద్రగజకుంభము బ్రద్దలుచేసి ముత్యాలు పట్టిన నా యీ ఖడ్గమె చెల్లెలి పరిభవసముచితమాచరించుగావుత. - అని ఖడ్గము దూయగా ప్రహస్తుడు మధ్యచేరి -

లోకత్రయ క్షయోద్వృత్త ప్రకోపాగ్రేసరస్య తే
ఈదృశశ్చంద్రహాసస్య భృత్యేష్వనుచితః క్రమః

ప్రభూ! మూడులోకముల వినాశమునకు తగిన ప్రకోపాగ్రేసరమయిన మీ చంద్రహాసమునకు భృత్యులయందీ క్రమము సముచితము కాదు. అని ప్రహస్తుడనుట మారీచునకు రావణునకు ప్రీతిజననమై ప్రకృతోపయోగి యయినది.

౫౪. మాల:- అభిప్రేతార్థసిద్ధ్యర్థం కీర్త్యంతే యత్ర సూరిభిః
ప్రయోజనాన్యేకాని సా మాలేత్యభిసంజ్ఞితా

ఇష్టార్థసిద్ధికై ప్రయోజనకీర్తనము మాల. ఉదా : తాపసవత్సరాజము; రాజనుట-

దృష్టా యూయం నిర్జితా విద్విషంతః
ప్రాప్తా దేవీ భూతధాత్రీ చ భూయః
సంబంధోఽభూద్దర్శకేనాపి సార్ధం
కిం దుష్ప్రాపం యన్నలబ్ధం భవద్భ్యః

మీరు కనపడినారు. శత్రువులు నిర్జితులయినారు. దేవి లభించినది. భూమియు దక్కినది. దర్శకప్రభువుతో సంబంధమును కలిగినది. మీనుండి పొందనిది నాకేది దుష్ప్రాపము? ఇందనేకప్రయోజన కీర్తనము స్పష్టము.

౨౫. దాక్షిణ్యము:- హృష్టైః ప్రసన్నవదనైః యత్పరస్యానువర్తనం
క్రియతే వాక్యచేష్టాభిస్తద్దాక్షిణ్యముదాహృతం

ప్రసన్నులు వాక్యచేష్టలచే పరానువర్తన మొనరించుట దాక్షిణ్యము. రత్నావలిలో ద్వితీయాంకమునందు వాసవదత్త శీర్షవేదనావ్యాజమున పోదలచగా వత్సరాజాపి బ్రతిమలాడెను. కాని యామె సిమ్కృమించినది. అపుడు విదూషకుడు "అలమరణ్యరుదితేన" అనినాడు. అప్పుడు వత్సరాజు— "మూఢ! దేవీకోపము నీవు గుర్తింపలేదు. దేవీప్రసాదనము వినా వేరొక యుపాయము లేదు. దేవిని ప్రసన్నగా చేసికొనవలయును. లోనికి పోవుదము రమ్ము." అని యనుట యనువర్తనము దాక్షిణ్యమయినది.

౨౬. గర్హణము—యత్ర సంకీర్తయన్దోషం గుణమర్థేన దర్శయేత్
గుణాతిపాతాద్దోషాన్వా గర్హణం నామ తద్భవేత్

దోషము నిరూపించియు గుణము ఫలమున గూర్చుట, గుణాతిపాతమున దోషకీర్తనము గర్హణమగును. దోషమునకు గుణీకరణము—ఉదా; ధూర్తవిట మను రూపకము.

ప్రణష్టా న వ్యక్తిర్భవతి వచసః సైవ మృదుతా
న రాగో నేత్రాబ్జే త్యజతి నచ లజ్జా వ్యపగతా
స్మృతిః ప్రత్యాయాతా పరిహృషిత్రమద్యాపి చ ముఖం
మదో దోషాంస్త్యక్త్వా త్వయి పరిణతస్తిష్ఠతి గుణైః

వాక్కు వ్యక్తత పోలేదు. ఆ మృదుత్వమున్నది. నేత్రము నందు రక్తిమ పోలేదు. లజ్జ దూరము కాలేదు. స్మృతి వచ్చినది. ముఖము సంతుష్టముగనె యున్నది. మద్యమదము దోషములను విడిచి నీలో గుణములతో నున్నది.

గుణాతిపాతమున దోషమునకుదా—వత్సరాజచరితము ద్వితీయాంకమునందు విష్ణుత్రాతుడనుట—

నృపాః ప్రభుత్వాత్ప్రతిషేధవామా
జిహ్మో విధి స్త్వద్వశవర్తి కార్యం
సాచివ్యతో నాపరమస్తి పుంసాం
విషాదదుఃఖాయశసాం నిదానం

ప్రభుత్వవిధానమువలన రాజులు ప్రతిషేధించిన ప్రతీపులగుదురు. దైవము వక్రము. కార్యము నీ యధీనముగ నున్నది. మానవులకు విషాదదుఃఖాయశోనిదానము సాచివ్యముకన్న వేరుగా లేదు. ఇందు సచివత్వమున విషాదాదిదోషములను భావించుట యున్నది. తాపసవత్సరాజములోని తృతీయాంకమున లామకాయనుని వాక్యమునిందుదాహార్యము.

పూర్వాహ్ణే కృతభోజనవ్యతికరాన్నిత్యైవ నీరోగతా
కండూతిర్వపనాదపైతి శిరసః స్నానం యదారోచతే
జాత్యాచారకదర్థనావిరహితం బ్రాహ్మణ్యమాత్మేచ్ఛయా
ధూర్తైః సత్త్వహితాయ కై రపికృతం సాధువ్రతం సౌగతం

పూర్వాహ్ణమున భోజనసంబంధమున్నచో నీరోగత నిత్యముగ నుండును. స్నాన మిష్టమయినపుడు గొఱిగించుకొనినచో బుఱ్ఱదురద తీరిపోవును. ధూర్తులు కొందరు ప్రాణిహితముకొఱకై సౌగత మనెడు సాధువ్రతము తమ యిచ్ఛానుసారమున నిర్ణయించిరి. అది జాత్యాచారకదర్థనము లేని బ్రాహ్మణ్యమె కదా!

౨౭. అర్థాపత్తిః— అర్థాంతరస్య కథనే యత్రాన్యోర్థః ప్రతీయతే
వాక్యమాధుర్యసంపన్నా సార్థాపత్తిరుదాహృతా

ఒక యర్థము చెప్పగా నర్థాంతరము గోచరించినచో నర్థాపత్తి యగును. ఉదా:— ధూర్తవిటము.

ఆదష్టస్ఫురితాధరే భవతి యో వక్త్రారవిందే రసః
ప్రీతిర్యా చ హృతాంశుకే చ జఘనే కాంచీప్రభోద్దీపితే
లక్ష్మీర్యా చ నఖక్షతాంకురధరే పీనే కపోలే స్త్రియో
రక్తం తేన విరజ్యతే న హృదయం జాత్యంతరేపి ధ్రువం

ఆదష్టస్ఫురితాధరమయిన వనితావక్త్రారవిందమునం దే రసము కలదో, వస్త్రము హరింపగా కాంచీప్రభాసముద్దీపితమయిన జఘనమునం దే ప్రీతి కలదో నఖక్షతాంకురములు ధరించిన పీనకపోలములం దే శోభ కలదో వానివలన ననురాగముపడిన హృదయము జన్మాంతర మందును విరక్తముకాదు. సత్యము. దీనిలో జన్మాంతరము నందును అనురక్తి యనువర్తించు ననుటచే, జన్మాంతరము లందును విరాగ ముదయింపదని, కావున భవబంధవిముక్తి కలుగదని యర్థాపత్తి లక్షణము సంగతమగును.

౨౮. ప్రసిద్ధి:- వాక్యైస్సాతిశయైరుక్తా వాక్యార్థస్య ప్రసాధకైః
లోకప్రసిద్ధైర్బహుభిః ప్రసిద్ధిరితి కీర్తితా

వాక్యార్థప్రసాధకములు ప్రసిద్ధములునగు సాతిశయవాక్యములచే నిరూపితమగునది ప్రసిద్ధి యగును. ఇందలి "ప్రసాధక" పదమును కొందరు "ప్రసాదక పదముగా గుర్తించిరి. ఆ పదమునకు ప్రకృష్టసాధకములని యర్థము. ఈ పదమునకు సాలంకారములని యర్థము. ఉదా: గదాయుద్ధ మను రూపకమునందు బలదేవుడు దుర్యోధనునితో మాటలాడునపుడు- "భీముడు యుద్ధవంచనముచేసి నిలబడినాడు," "ఏమి భీముడు నన్ను వంచించెనా?" "అయినచో నీవేల యిట్లుంటివి?" వినుడు:-

యేనేంద్రస్య చ పారిజాతకతరుర్మానేన తుల్యం హృతో
దివ్యం వర్షసహస్రమర్ణవజలే సుప్తశ్చ యో లీలయా
దీప్యా భీమగదాం ప్రవిశ్య సహసా నిర్వ్యాజయుద్ధప్రియః
తేనాహం జగతాం ప్రియేణ హరిణా మృత్యోః పరిగ్రాహితః

ఎవడు దేవేంద్రుని పారిజాతము నభిమానముతో గూడ హరించెనో, ఎవడు దివ్యవర్షసహస్ర మర్ణవజలమున లీలగా నిద్రించెనో నిర్వ్యాజయుద్ధప్రియుడయున జగముల కభీష్టుడయిన యా హరి తన

దీప్తితో భీమగదను ప్రవేశించి నన్ను మృత్యువునకందించినాడు. ఇందు శ్రీవిష్ణువు పారిజాతాహరణ లీలావటపత్రశయనాదులు వాక్యార్థ సాధకములు.

౨౯. పృచ్ఛ- యత్రాకారోద్భవై ర్వాక్యైరాత్మానమథవా పరం
పృచ్ఛన్నివాభిధత్తేఽర్థం సా పృచ్ఛేత్యభిసంజ్ఞితా

ఆకారసముత్పన్నము లయిన వాక్యములతో తననుగాని పరునిగాని పృచ్ఛ చేయుచున్నట్లుగా పలికినచో నది పృచ్ఛ యగును. శోకాది పరవశుడయినందున పరోక్షముగా తననుగాని పరునిగాని సంబోధించి యడుగుచున్నట్లుగా పలుకుట పృచ్ఛ. ఇందు సమాధాన మపేక్షించుట యుండదు. తత్సమాధానప్రత్యాయకములుగనె తద్వాక్యము లుండును. ఉదా- రామచరితమునందు హనుమానుడు సీతను జూచి యిట్లనును.

స్థానే విషీదసి రఘూద్వహ! కిం విధాతః
అస్యాస్త్వయేక్షిత మలక్షణమంగకేషు
అద్యాపి జీవసి దశానన! హే హనూమన్!
కేయం తవాభిముఖవర్తి రిపోః ప్రతీక్షా

రామా! నీవు విషాదము పొందుట యుక్తముగనె యున్నది. ఓ విధాతృడా! యీ సీతాదేవీశరీరావయవాలలో నెచట నీ వలక్షణ మీక్షించితివి? దశానన! నీవింకను జీవించియుంటివా? హనుమాన్! నీ యభిముఖముననున్న శత్రువు నింకను ప్రతీక్షించుట యేమి?

౩౦. సారూప్యము:- దృష్టశ్రుతానుభూతార్థకథనాది సముద్భవం
సాదృశ్యం క్షోభజననం సారూప్యమితి సంజ్ఞితం

దృష్టశ్రుతానుభూతార్థముల కథనమువలన క్షోభముత్పాదించు సాదృశ్యముండుట సారూప్యమగును. కథనాదిసముద్భవమని యనుట వలన దర్శనశ్రవణానుభవనము లుపలక్షితము లగును. రూపాది విభ్రాంతిచేనయిన క్షోభజననమె లక్షణగతమయిన చమత్కృతి. ఉదా: ఛలితరామమను రూపకమున లక్ష్మణుడు లవుని బంధించి తీసికొని రాగా రామయజ్ఞశాలలో హిరణ్మయసీతను చూచి లవు డిట్లనును. "మా అమ్మ యీ రాజద్వారమున కెట్లు వచ్చినది?" ఇట్లని లేచి నమస్కరించి "బంగారు బొమ్మ" అని నిశ్చయించును. ఇందు

రూపదర్శనభ్రాంతి క్షోభజననముగా నుండుట స్పష్టము. మరియొక ఉదా: వేణి.

ఆశైశవాదనుదినం జనితాపరాధో
మత్తో బలేన భుజయోర్హతరాజపుత్రః
ఆసాద్య మేఽన్తరమిదం భుజపంజరస్య
జీవన్ప్రియాసి న పదాత్పదమద్య పాప

దుర్యోధనుని చంపి వచ్చు భీమసేనుని చార్వాకవార్తానుసారమున భ్రాంతిపడి దుర్యోధనుడని తలచి గాఢముగా పట్టుకొని ధర్మరాజనుట. బాల్యము మొదలుగా ప్రతిదిన మపరాధ మొనర్చితివి. భుజబలమున నుదించితివి. రాజపుత్రులను చంపితివి. ఇపుడు నా భుజపంజరముమధ్యగతుడ వయితివి. ఒక్కపదమేని నీవు బ్రతికి పోజాలవు. ఇందు క్షోభజననము స్పష్టము.

3౧. మనోరథము:- హృదయస్థస్య వాక్యస్య గూఢార్థస్య విభావకం
అన్యాపదేశైః కథనం మనోరథ ఇతి స్మృతః

హృదయగత మయిన గూఢార్థమును అన్యాపదేశములతో నిరూపించుట మనోరథమను కావ్యలక్షణము. ఉదా:- వికటనితంబా ప్రహాసనమున వికటనితంబ యిట్లనును.

అన్యాసు తావదుపమర్ద సహాసు భృంగ
లోలం వినోదయ! మనస్సుమనోలతాసు
బాలా మజాతరజసం కలికామకాలే
వ్యర్థం కదర్థయసి కిం ? నవమల్లికాయాః?

తుమ్మెదా ! నీ యుపమర్దము సహింపగల సుమనోలత లనేకములు కలవు. వానియందు నీ లోలమనమును వినోదపెట్టుకొనుము. బాల అజాతరజస్క యయిన నవమల్లికాకలిక నేల యసమయమున వ్యర్థముగ వేగించెదవు. దీనిలో వికటనితంబయే తనస్వరూపమును సుమనోలతగా నిర్దేశించుకొనినది.

3౨. లేశము :- యద్వాక్యం వాక్యకుశలై రుపాయేనాభిధీయతే
సదృశార్థాభినిష్పత్త్యా స లేశ ఇతి కీర్తితః

స్సమానార్థము స్పష్ట మొనరించుట కుపాయమున వాక్యము నిరూపించుట లేశము. ఈ లేశమును కొందరు లేఖపదమున వ్యవహరించిరి. ఇంగిత జ్ఞానాభిధానమని లక్షణము నిరూపించిరి. ఉదా :- అవిమారకమున - "ఆర్యా! ఏమియో చింతనము చేయుచున్నారే" "శాస్త్రము చింతనము చేయుచున్నాను." "ఆ రమ్యమగున శాస్త్రమేమో?" "యోగశాస్త్రము". "మంచిది. యోగశాస్త్రమె కావలయును" "అభిలాషానుసారమున నేనది యిదిగా జేయుదును." ఇందు లేశమున్నది.

33. క్షోభము:- పరదోషైర్విచిత్రార్థైః యత్రాత్మా పరికీర్త్యతే
అదృష్టోఽన్యోపి వా కశ్చిత్స తు క్షోభ ఇతి స్మృతః

విచిత్రార్థము లయిన పరదోషములచే స్వాత్మపరికీర్తన మున్నను, గోచరింపని యన్యుని కీర్తన మున్నను క్షోభమను కావ్యలక్షణ మగును. కొందరు తనయందు లేని తద్భావభావనమును క్షోభ మనిరి. ఒకచోట హేతువుండగా వేరొకచోట కార్యకల్పన ముండుట క్షోభ మనిరి. ఉదా :- రత్నావళి తృతీయాంకమునందు సాగరిక యని తలచి వాసవదత్తను రాజు లాలనము చేయునపుడు వాసవదత్త తన యవగుంఠనము తొలగించి రాజునకు వైలక్ష్యము కలుగ జేసినది. వత్సరాజు నివ్వెరబోయి దోసిలిపట్టి "ప్రియా! వాసవదత్తా! ప్రసీద" అనెను. "మీ రిట్లనరాదు. ఈ యక్షరము లన్యగతములు" అని వాసవ పలుకగా వసంతకుడు "నీవు మహానుభావవు. నా వయస్యుని యీ యొక్క యపరాధము క్షమింపుము" అనినాడు. "ప్రథమ సంగమముననె విఘ్నము కలుగ జేసిన యపరాధము నాది రాజుది కాదు" అని వాసవ యనుట క్షోభమునకు లక్ష్యము.

౩౪. గుణకీర్తనము- లోకే గుణాతిరిక్తానాం గుణానాం యత్ర నామభిః
ఏకో హి శబ్ద్యతే తత్తు విజ్ఞేయం గుణకీర్తనం

గుణనామములతో గుణాతిరిక్తనామములలో నొకటియె నిరూపిత మగునేని గుణకీర్తనమగును. ఉదా:- వత్సరాజచరితమున చతుర్థాంకములో శాలంకాయనుడు— "నీలనాగవ్యాజమున సంతత శస్త్రప్రభాభాసురులగు మనయోధులు చుట్టుకొనగా నట్టి భయస్థానమునందును సంభ్రమ మేమియు లేక వత్సరాజు;

తేన ప్రోక్తం ధైర్య గాంభీర్య శౌర్య
ప్రజ్ఞా తేజో నీతి దాక్షిణ్య గర్భం
వాక్యం సామాద్యం సోర్జితం శ్రోత్రరమ్యం
శాస్త్రీకర్తవ్యం తద్బుధైః స్వార్థకామైః

ధైర్యము గాంభీర్యము శౌర్యము ప్రజ్ఞ తేజస్సు నీతి దాక్షిణ్యము గర్భితమయిన వాక్యము పలికెను. అది సామాదులతో నున్నది. ఊర్జితముగా నున్నది. శ్రోత్రరమ్యమునా నున్నది. దీనిని స్వార్థకాము లయిన పండితులు శాస్త్రముగా నిరూపింపదగును. "ఇది సంక్షిప్త విస్తర నున్నమాట." "అనంతరము?" దేవా! ఆ సమయమున మహా యుద్ధ మారంభము కాగా సాహసలాంఛను డయిన యాతని పరాక్రమము ప్రద్యుమ్న రామార్జునభీమకర్ణ సాంబాభిమన్యులలో గూడ నాలోచింపదగినది కాదు. ఈ యర్థమున నీ పద్యమున్నది.

యస్తస్య యుద్ధే మహతి ప్రవృత్తే
పరాక్రమః సాహసలాంఛనస్సః
ప్రద్యుమ్న రామార్జున భీమకర్ణ
సాంబాభిమన్యుష్వవిచింత్య ఏవ

ఇదివిని ప్రద్యోతనుడు భావించును. "స్వభావసిద్ధము లయిన గుణము లవ్యభిచారులు.

అవిదిత ఇతి నైకధా ప్రయత్నా
ద్బహుదివసం బహుధా పరీక్షమాణః
ద్విగుణమభివిరాజతే గుణైః స్వైః
మణిరివ జాతివిశేషవాన్మహార్ఘః

తెలియలేదని యనేకవిధముల ప్రయత్నపడి యనేకదినములు బహుధా పరీక్షచేయగా జాత్యమయిన మహార్ఘమణి వలె తన గుణము లచే ద్విగుణముగా విరాజిల్లుచున్నాడు. ఇందలి యుదయనగతము లయిన శౌర్యధైర్యాదులు గుణాతిరిక్తములుగా భావనీయములు. మహాసేనమహారాజుదయనుని నీలనాగవ్యపదేశమున పట్టుకొని రావలసినదని యాజ్ఞాపించినపు డుదయనుని పరాక్రమాదు లట్టివే. ఇట్టి పరాక్రమాదులు రాజు ష్గలుకు మణిసదృశవిధానములును

ఉదయను నొక్కనినే నిరూపించుచున్నందున గుణాతిపాతలక్షణ మభ్యూహ్యము-

౩౫. అనుక్తసిద్ధి:- ప్రస్తావేనైవ శేషోర్థః కృత్స్నో యత్ర ప్రతీయతే
వచనేన వినానుక్తసిద్ధిః సా పరికీర్తితా

వచనము వినా ప్రస్తావముననె సర్వార్థము ప్రతీతమగునేని యది యనుక్తసిద్ధి యగును. ఈ యనుక్తసిద్ధికే సిద్ధి యనియు పేరు. ఉదా: తాపసవత్సరాజమున యౌగంధరాయణుడు డోలాయితచిత్తయయిన వాసవదత్త నిట్లనును.

దేవీ! కౌశాంబీరాజధానిని తిరస్కరించి కృపణులయిన మన విద్వేషులు స్వీకరించిన తంత్రమెఱుంగుదువు. రాజనీతి నాదరింపని ప్రభువు ప్రమాదపరుడగుటయు నెఱుగుదువు. స్త్రీల చిత్తము నిత్యము ప్రియవిప్రయోగవిధుర మయినందున నా మ్మనమేమియు పలుకనుత్స హించుట లేదు. కావున నిటుపై దేవియే సర్వము తెలియవలసి యున్నది.

వేరొక ఉదా:- తాపసవత్సరాజమునందే ద్వితీయాంకమున వినీతభద్రుడు దేవీప్రస్థానము వర్ణించుచు నిట్లనును.

మాముద్దిశ్య తథా దేవ్యా బాష్పసంరుద్ధకంఠయా
"ఆర్యపుత్రం ప్రతీత్యుక్తం వక్తవ్యం న సమాహితం

దేవి బాష్పసంరుద్ధకంఠయై నన్నుద్దేశించి "ఆర్యపుత్రు" నని యనినదే కాని పలుకదలచినది పలుకుటకు సమర్థురాలు కాలేదు. వారు వారట్లనుటవలననె సర్వమనుట యయినది.

౩౬. ప్రియోక్తి:- యత్ప్రసన్నేన మనసా పూజ్యం పూజయితుం వచః
హర్షప్రకాశనార్థం తు సా ప్రియోక్తిరుదాహృతా

పూజ్యపూజనమునకై ప్రసన్నమనసుతో పలుకుట ప్రియోక్తి. ఉదా:- వత్సరాజ చరితమునందు సప్తమాంకమున భరతరోహకుడు వత్సరాజునకు వాసవదత్తను వీణాభ్యాసమున కర్పింపదలచి యిట్లనును.

యా శేతే కౌస్తుభస్య ద్యుతికపిలయితే శారదవ్యోమనీలే
విష్ణోర్వక్షస్యుదారే రజనికరకరాకార హారోపహారే
సాభ్యేత్వాలింగతు త్వాం ప్రశిథిలగలితేనోత్తరీయేణ లక్ష్మీః
హర్షాదాపీడయంతీ నవకమలరజోరోచనాభ్యాం స్తనాభ్యాం

కౌస్తుభకాంతికిసలయితము శారదవ్యోమనీలము చంద్రధవళము హారోపహార మయిన యుదారమగు విష్ణువక్షమున శయనించు లక్ష్మి నీ సమీపమునకువచ్చి యుత్తరీయము శిథిలగలితము కాగా కమల పరాగభాసురము లయిన స్తనములతో సంతోషమున నొరిపిడి కలుగ జేయుచు నిన్నాలింగన మొనరించుకొనుగాపుత. ఇందు పూజ్యపూజన మునకయిన హర్షప్రకాశకవచనము ప్రియోక్తి సంభావనీయము. ఇట్లు రూపకములందువలె శ్రవ్యప్రబంధములందును కథాశరీర సంవిధాన సంభాషణ వైదగ్ధ్యరూప మయిన కావ్యలక్షణ మను కవివ్యాపార మును దర్శింపవలెను.

## కావ్యాలంకారము

కవివ్యాపారబలమున గలుగు నర్థజాతమంతయు లోకస్వభావము కన్న విలక్షణ మయినందున కావ్యలక్షణ వ్యవహారము పొందినదనుట యిప్పటికి స్పష్టముగా నిరూపిత మయినది. అందిక శరీరకల్పమున కలం కారములను నిరూపింపవలసి యున్నది. కావ్యమునందు కావ్యలక్షణము శరీము. ఆ కావ్యశరీరార్థభాగమునం దుపమా దీపక రూపకములు మూడు నలంకారములు. వేరుగానున్న హారము వరమణివిభూషిత యయి నట్లు శశిపద్మాద్యుపమాన వర్ణనీయవనితావదనాదికము విభూషితమై సుందరీకృతమగును. శశిపద్మాదిసాదృశ్యమునను వదనాదికము సుందరీ కృతమగును. కవి యొకపు డుపమానముననె సౌందర్య మాధానింప సంకల్పించును. ఒకప్పుడు తత్సాదృశ్యముననె సౌందర్యాధాన మభిల షించును. కవిబుద్ధిగతస్పందవిశేషమున నివి యిట్లు విపరివర్తమానము లగుచుండును. ఇట్టి సుందరీకరణ మలంకారము. ఈ యలంకారస్థితి త్రివిధముగనుండును. ఒకచో సంపూర్ణముగా నుండుట వేరొకచో స్ఫుటముగా నుండుట, మరియొకచో నుపమానోపమేయభావమున నుండుట యీ స్థితిసూచకము. వాక్యమునందు వర్ణ్యమానములగు నుపమానోపమేయద్యోతకసాధారణధర్మముల సన్నిధి యున్నచో నుపమ యగును. అంతర్లీనమగు నుపమానోపమేయభావరీతి యున్నచో నేకీకరణము స్ఫుటమగుచో రూపకవ్యవహారము కలుగును. రూపకము నందు ప్రకృతపదార్థమున ప్రయుజ్యమానమగు శబ్దము ఇవార్థము

(సాదృశ్యార్థము) గర్భీకరించుకొనుచునుట న్యాయసమ్మతమయిన విష యము. వేరొకస్థలమున నేకప్రఘట్టకావస్థానబలమున నుపమ యవగత మయినచో దీపక మగును. ఇట్లుపమా రూపక దీపకముల యవస్థాన వైచిత్ర్యమున్నది. ఇట్టీ త్రివిధవైచిత్ర్యప్రదర్శన మన్యాన్యవైచిత్ర్యము లకు నుపలక్షణము. ఇట్లు నానాలంకారవైచిత్ర్యముల నభ్యూహింప దగును.

ఈ విషయమున ఉపాధ్యాయమత మీా విధమున నున్నది. అభినవగుప్తుని మాన్యోపాధ్యాయుడు శ్రీ భట్టతోతుడు. తదభిప్రాయ స్వరూపావిష్కార మిచట పరమావశ్యకము. కావ్యాలంకారములకు కావ్యలక్షణబలముననే వైచిత్ర్య ముదయించును. ఈ భావము నిట్లు భావింపుడు. గుణానువాదమను పేరుగల కావ్యలక్షణ యోగమున ప్రశంసోపమ కల్గును. అతిశయమను కావ్యలక్షణ సంబంధమున నతిశయోక్త్యలంకార ముదయించును. మనోరథమను లక్షణసంబంధ మున నప్రస్తుతి ప్రశంస వచ్చును. మిథ్యాధ్యవసాయ లక్షణమున అపహ్నుతి కలుగును. సిద్ధిలక్షణ యోగమున తుల్యయోగిత కలుగు చున్నది. ఇట్లే యన్యాలంకారములం దన్యలక్షణయోగము నభ్యూ హించునది. తత్తదలంకారములకు మూలముగా నిర్దేశించిన లక్షణములు కోహలాదిపాఠ ప్రసిద్ధములయిన లక్షణములుకావు. అభినవగుప్త నిర్దిష్టపాఠ సంప్రదాయమునందలి లక్షణములె. లక్షణముల పరస్పర వైచిత్ర్యమునగూడ విచ్ఛిత్తిభావ మనంతముగా సిద్ధమగును. ప్రతిషేధ మనోరథ లక్షణముల సమ్మేళనము వలన ఆక్షేపము కలుగును. అలంకారము లన్నియు నుపమా ప్రపంచమె యని విద్వద్వరేణ్యులకు ప్రతిపన్నార్థమె. ఉపమయె యన్నిట నంతర్లీనమై యున్నది.

ఉపమ దీపకము రూపకము అను నీనాలుగు కావ్యాలంకారము లుగా పరికీర్తితము లయినవి, ఇందుపమాదీపకరూపకము లర్థాలంకా రములు. యమకము శబ్దాలంకారము. ఇందుపమాలంకారము పంచ విధము.

౧. ప్రశంసోపమ ౨. నిందోపమ
౩. కల్పితోపమ ౪. సదృశోపమ
౫. కించిత్సదృశోపమ

దీపక మేకవిధము. రూపక మేకవిధము యమకము పది విధ ములు.

| | |
|---|---|
| ౧. పాదాంతయమకము | ౬. సందష్ట యమకము |
| ౨. కాంచీ ,, | ౭. పాదాది ,, |
| ౩. సముద్గ ,, | ౮. ఆమ్రేడిత ,, |
| ౪. విక్రాంత ,, | ౯. చతుర్వ్యవసిత ,, |
| ౫. చక్రవాల ,, | ౧౧. మాలాయమకము |

ఇది యుపమా సామాన్యలక్షణము.

౮౩౩. యత్కించిత్కావ్యబంధేషు సాదృశ్యేనోపమీయతే
ఉపమా నామ సా జ్ఞేయా గుణాకృతిసమాశ్రయా

కావ్యబంధము = కావ్యలక్షణము. బంధము గుంఫము, ఫణితి, భణితి, వక్రోక్తి, కవివ్యాపారము అనునవి యన్నియు పర్యాయపద ములు. కావ్యమున కావ్యలక్షణము ప్రధానము. అది యవశ్యముగా నుండవలెను. లక్షణ మలంకారశూన్య మయినను నిరర్థకము కాదు. కావున కావ్యములందు కావ్యలక్షణము లున్నను కావ్యాలంకారము లుండవచ్చునని భావము. కావ్యలక్షణ మున్నను కావ్యాలంకారము చమత్కారక మగును. "గౌరివ గవయః" గవయము గోవువలె నుండు ననుటలో కావ్యలక్షణము కవివ్యాపారరూపమై లేనందు వలన ఉపమాలంకారలక్షణము సంగతమై యున్నను అచట ఉపమ యలంకారము కాదని నిరూపించినట్లయినది. కావ్యమున కావ్యలక్ష ణము లుండగా నెయ్యది సాదృశ్యమున నుపమిత మగునో యది గుణా కృతిసమాశ్రయముగా నుండునేని యుపమ యగునని సామాన్యముగా నుపమాలక్షణము.

"గుణశూన్యం తు కావ్యం న కించిదపి" కావ్యమేదియు గుణ శూన్యముగా నుండదని సూక్తి యున్నది. ఈ వ్యవహారమున మహా పురుషుడు దృష్టాంతము. కావ్యము గుణశూన్యము కాదనుట యది హేయము కాదను భావమును సూచించును. ఇట్టి యహేయత్వప్రదర్శ నము తదవశ్యస్వీకార్యత నుద్బోధింప గలదు. కావున ప్రసాదాదులు గుణము లన్న వ్యవహారమును సంగత మగును. ప్రసాదాదులకు గుణ

వాచోయుక్తి వ్యవహారము గుణములు లేకపోయినచో కావ్యరూపమె యభినిష్పన్నము కాదను భావము సూచించును. సుందరతాస్పదమగు శరీరము లక్షణకృతశోభా పరిష్కృత మగును. ఉపమాద్యలంకారములు లేకున్నను అది కావ్యమె యగును. ఈ యంశము ప్రకటము చేయుటకె యుపమాదు లలంకారములని వ్యవహరించుట యయినది. లోకమున లౌకికాలంకారములకు స్ఫుటమగు పృథక్సిద్ధి యున్నది. కావ్యమున కావ్యాలంకారములకు స్ఫుటముగా పృథక్సిద్ధి లేదు. అలంకారశూన్యముగ కావ్యముండును. గుణశూన్యముగ కావ్యముండ దనుట గుణముల యహేయత్వమునె స్పష్ట మొనరించును. గుణశూన్యముగ కావ్యముండక పోదు. లక్షణశూన్యముగ కావ్యముండనే యుండదు. శరీరము లక్షణరహితము కాదు. కావ్య మలక్షణము కాదు. సలక్షణ కావ్యము నందు సుఘటితమయిన యలంకార మలంకార మగుననుట యిచటి ప్రఘట్టసారము. కావ్యశోభావహధర్మము లయిన యలంకారముల నన్నిటిని దండి నిరూపించినా డనుట "యత్కించిదేతత్" అది యొకమాట.

ఉపమాలక్షణమున "యత్కించిత్" అని కలదు. దాని భావమిట్లు పరిగ్రాహ్యము – ఏదియేని పదార్థ ముపమీయమాన మగుటలో క్రియార్థమందు సంబంధించును కాని కర్మ సంబంధముండదు. అట్లది యుపమితమగుటలో ప్రేక్షణాదినిమిత్తాంతరము లుపమీయమాన మగుటలో సంబంధింపవు. సాదృశ్యమునఁనె యది యుపమీయమాన మగుట వివక్షితము. "ఉపమీయతే" యనుటచే నుపమేయము చెప్పినట్లయినది. సాదృశ్య మనుటచే సాధారణధర్మ మవగతమయినది. ఇట్టి యుపమ గుణాకృతి సమాశ్రయముగా నుండునని యుపమాలక్షణ భావము. గుణాకృతి సమాశ్రయ పదమున కిట్లర్థము నిశ్చయింపవలయును. "గుణః సంబంధః ఆక్రియతే ద్యోత్యతే అనేనేతి గుణాకృతిః ఇవాదిః శబ్దః ఆశ్రీయమాణో యస్యామితి గుణాకృతి సమాశ్రయా." గుణమనుట సంబంధము. అది దేనిచో గోచరించునో యది గుణాకృతి, ఇవాది శబ్దములు గుణాకృతి రూపములు. ఆ శబ్దములు ఉపమానోపమేయముల సంబంధమును సూచింపగలవు. "పద్మమివ ముఖం" అను

స్థలమున ఇవ శబ్దార్థము సాదృశ్యము. అది ప్రతియోగితా సంబంధమున నుపమానముతోడను, అనుయోగితా సంబంధమున నుపమేయముతోడను సంబంధించునది యగును. చంద్రప్రతియోగిక ముఖానుయోగిక సాదృశ్యమని యచటి యర్థము. ఇట్టి ఇవాదిశబ్ద మే యుపమలో నాశ్రితమగునో యా యుపమ గుణాకృతి సమాశ్రయ మనదగును. ఇందలి ప్రయోగ వినియోగముల వలన గొన్ని భేదములు గలుగును. వాని నిట్లు గుర్తించునది.

౮౩౪. ఏకస్యైకేన సా కార్యా హ్యనేకేనాథవా పునః
అనేకస్య తథైకేన బహూనాం బహుభిస్తథా

ఈ కారికలో నాలుగుపమాప్రకారముల వైచిత్ర్య నిర్దేశము కలదు.

౧ ఒక యుపమేయమున కొక యుపమానముతో గుణాకృతి సమాశ్రయ ఉపమ
౨ ఒక యుపమేయమున కనేకోపమానములు
౩ అనేకోపమేయముల కొక యుపమానము
౪ అనేకోపమేయముల కనేకోపమానములు

క్రమముగా వీని యుదాహరణముల ప్రకాశ మీవిధముగ నుండును.

౧ నీ ముఖము చంద్రునకు సాటి.
౨ చుక్కలు చంద్రుని వలె ప్రకాశించుచున్నవి.
౩ నీరీతి శ్యేనబర్హిణభాసములకు సాటి.
౪ గజములు ఘనముల వలె నున్నవి.

ఇట్టి భేదము లుపమానోపమేయ సంఖ్యాభేదమున గలుగునవి. ప్రశంసోపమాదు లయిదు నుపమాగత శరీరభేదమున శరీరభేదములు కలవి. ఉపమాన ప్రాశస్త్యమువలన ప్రశంసోపమ, నింద్యత వలన నిందోపమ. ఇట్లె యితరములు గ్రాహ్యములు. కల్పితోపమలో నుపమానము కల్పితము. లోకప్రసిద్ధములకు సాదృశ్యము కుదురదు కావున నుపమానాభిమతము లిందు కల్పితములె యగును. సదృశముగా కల్పితమగు నుపమానమున్నచో కల్పితోపమ యగును. సదృశోపమలో ఉపమానము ఉపమానాభిమతముగా కల్పితముకాదు కాని సదృశాభిమతముగా

నిర్ణీత మగును. ఈ నసదృశోపమను కొందర సదృశోపమ యని పఠింతురు. ఇట్లు వ్యాఖ్యానింతురును. ఇందుపమేయమె సదృశము. సదృశముగా గన్పడునది. అట్లుగా సంభావితమగునది. ఉపమేయమె యుపమాన మగుటచే నసదృశోపమ. ఉపమేయ ముపమేయమై సదృశమన్యము లేమి యుపమానము నగుటవలన నసదృశోపమ యని యనిరి. కించిత్సదృశోపమ వేరు. ఇందుపమానము కించిత్సదృశమె కాని సర్వాత్మనా సదృశము కాదు. సాదృశ్యము గోచరింపజేయు స్ఫుటపద ప్రత్యయముండదు. రూపకములో వలె సాదృశ్యము వస్తుద్వయమున మిీలనము పొందదు. సమాసఘటనసామర్థ్యమున సాదృశ్య మొకింతగా నభివ్యంగ్యమగును. కాన నది కించిత్సదృశోపమ యయినది. మత్త మాతంగ గమన యనుటలో మాతంగ గమన సదృశ గమనము కలది యను నర్థము కలదు. ఇందు సమాసబలముననె యుపమానతా ప్రతిపత్తి కలుగుచున్నది. గమనమునందె యీ సాదృశ్యము కావున నిది కించిత్సదృశోపమ.

౮౩౫. ఉపమాయా బుధైరేతే జ్ఞేయా భేదాః సమాసతః
యే శేషా లక్షణైర్నోక్తాస్తే గ్రాహ్యా లోకకావ్యతః

ఇట్లీ యుపమాభేదములు సంక్షేపముగా నిరూపితములు. మిగిలిన వనేకములు. వాని నిచట లక్షణ నిరూపణమున నిరూపించుట లేదు. వానిని లోకమునుండి కావ్యములనుండి గ్రహింపవలెను. లోకమున కావ్యమున నట్టిభేదములు కలవు. అవియు నీ లక్షణద్వారముననె నిరూపితములని గుర్తింప వచ్చును. అట్టివి స్వయముగ స్వీకరింప శక్యములె యగును. మూలకారికలో "యే శేషా లక్షణేనోక్తాః" యే శేషా లక్షణైర్నోక్తాః" యను పాఠద్వయాభ్యాహానమువలన భావ ద్వయము కలుగును. ఈ యుపమాపంచక శేషభూతోపమ లన్నియు నీ పంచలక్షణకథనముననె కథితప్రాయములు. వానిని లోకకావ్య సంగ్రహమున గుర్తించునది. అని యొకవిధమగు భావము. వేనిని లక్షణకథనములచే నిరూపింపలేదో శేషములగు వానిని లోకకావ్య ములనుండి గ్రహింపవలెనని యన్యభావము. ఈ పాఠార్థమున శేష పదము పునరుక్తమగును. భరతభావ గౌరవమున ప్రథమార్థము సంగతమని సంభావించునది.

దీపకాలంకార లక్షణ మిట్లున్నది.

౮౩౬. నానాధికరణార్థానాం శబ్దానాం సంప్రదీపకం
ఏకవాక్యేన సంయుక్తం తద్దీపకమిహోచ్యతే

నానాధికరణార్థములయిన శబ్దములకు సంప్రదీపకమై యేకవాక్య సంయుక్త మగునది దీపకమగునని సామాన్యార్థము. శబ్దసమూహము పదము. పదసమూహము వాక్యము. దీనిబట్టి శబ్దములు పదాధికరణములుగా నుండుట వాక్యాధికరణములుగా నుండుట గుర్తింప వలెను. శబ్దములు పదాధికరణాశ్రయములుగా నర్థవిశేషము కలవగుటయు వాక్యాధికరణాశ్రయములుగా నర్థవిశేషము కలవగుటయు నున్నది. నానాధికరణార్థము లనుట భిన్నభిన్నార్థములని సాకాంక్షములుగా నుండునవి యని భావము. సాకాంక్షములగు వానికి క్రియాగుణ జాత్యాదు లాకాంక్షా పూరణమున దీపన మొనరింప గలవు. "సమ్యక్ ప్రకర్షేణ దీపకం సంప్రదీపకం" బాగుగా దీపింప జేయునది సంప్రదీపక మగును. అవాంతర వాక్యములో నుండక అఖండైక వాక్యములో నుండుట దీపకధర్మము. దీపప్రకృతి కలదగుటచే దీపక మయినది. దీప మటునిటు ప్రసరించి తన కాంతి యావరణములో నున్న వాని నన్నిటి నేకవలయమున గూర్చును. అట్లె సాకాంక్షములుగా వేరు వేరుగా నానాధికరణార్థములుగా నుండువానికి ఆకాంక్షాపూరకములయిన క్రియాగుణజాత్యాదు లేకవాక్యత సంపాదించునవి యవును గావున నిదియు దీపక మయినది. ఉదా :-

సరాంసి హంసైః కుసుమైశ్చ వృక్షాః
మత్తైర్ద్విరేఫైశ్చ సరోరుహాణి
గోష్ఠీభిరుద్యాన వనాని చైవ
తస్మిన్న శూన్యాని సదా క్రియంతే

హంసలచే సరస్సులు కుసుమములచే వృక్షములు తుమ్మెదలచే పద్మములు గోష్ఠులచే నుద్యానవనములు నిత్యము సంగతములై యున్నవి. ఇందు క్రియ పై వాక్యముల కన్నిటికి నాకాంక్షాపూరకమై యేక వాక్యత సంపాదించినది. ఇది దీపక మయినది.

## రూపకాలంకార లక్షణ మిట్లున్నది.

౬౩౪. స్వవికల్పేన రచితం తుల్యావయవలక్షణం
కించిత్సాదృశ్యసంపన్నం యద్రూపం రూపకం తు తత్

దేనిరూపము స్వవికల్పమున రచితమగునో యది రూపకమగును. ఈ రూపకము తుల్యావయవ లక్షణమని కించిత్సాదృశ్య సంపన్నమని రెండు విధములు. "రూపయతీతి రూపకం" రూపింప జేయునది కావున రూపకమని పేరు. వదనమునకు కల రూపమును స్వవికల్పరచితమయిన చంద్రాత్మకరూపము రూపింప జేయును. 'ముఖము చంద్రుడు' అనునది రూపకోదాహరణము. ముఖచంద్రులకిచట అభేదము గోచరించును. వాస్తవముగా ముఖము చంద్రుడు రెండును భిన్నములు. అయినను స్వవికల్పరచితమయిన చంద్రరూపముచే ముఖరూపమునకు రంజనము కలుగును గావున ముఖము చంద్రాభిన్నముగా భాసించును. ఈ రూపకమునకు రెండు భేదములు. తుల్యావయవలక్షణ మనునది యొకటి. ఉపమేయమునకు సంబంధించిన సర్వావయవములును ఉపమానావయవతుల్యము లయినందున సస్వరూపీకృతము లగును. ఇట్లు తుల్యావయవ యుక్త మగునది యొక రూపకము. ఇది సర్వావయవ సమారోపము కల రూపకము. మరి యొకటి కించిత్సాదృశ్య సంపన్నము. ఉపమేయమునకు సంబంధించిన యేకావయవమునందె రూపణ మున్నందున తన్మాత్రసాదృశ్యయుక్త మగునది తద్రూపమునె రూపిత మొనరించును. కించిదంశముననె రూపణముండుట కించిదంశమున రూపణము లేకుండుట యీ రూపక రూపము. అయినను ఇందును రూపసాదృశ్యము లేని యంశమును రూపాంతర రూపిత మగును. అందుననె యిది యేకదేశవివర్తి, ఒక యంశమునందె సవిశేషముగా వర్తించునది, యయినది. ఉదా:-

పద్మాననాస్తాః కుముదప్రభాసాః
వికోశనీలోత్పల చారు నేత్రాః
వాపీస్త్రియో హంసకులైః స్వనద్భిః
విరేజు రన్యోన్య మిహాలపంత్యః

ఈ పద్యమున పద్మానన కుముదప్రభాస నీలోత్పలచారునేత్ర వాపీస్త్రీ గతముగా సావయవము స్పష్టము. హంసకులములకు నర్మ

సచివత్వము రూపితము కాకున్నను గోచరించును గావున నీ యంశము ద్వితీయమున కుదాహరణము. ఇందు 'ఇవ' శబ్దమున్నచో నుపమ కాని యుత్ప్రేక్ష కాని యాశంకింప వచ్చును. ఉపమానాంశము స్ఫురింప కుండునట్టి యభిమానాఖ్య కావ్యలక్షణమును అలంకారకారు లలంకారముగా పరిగణించిరి. అట్టి స్థలములందు భావ్యభావకములు వేరుగా నుండు నేని యుపమోద్భేదమున నలంకారత యుక్తమగును. అలంకార్యము లేనప్పు డలంకారమున కలంకారత యుండదు. అలంకార్యాలంకారములకు పృథగవస్థితి యుండదేని కావ్యలక్షణమె యగును. కొందరీ రూపకలక్షణము నీ విధముగ పఠించిరి.

నానాద్రవ్యానురాగాద్యైః యదౌపమ్యగుణాశ్రయం
రూపనిర్వర్ణనాయుక్తం తద్రూపకమితి స్మృతం

ఈ యన్యపాఠము నన్యులిట్లు వ్యాఖ్యానించిరి. ఈ లక్షణము రూపకపదమున కన్వర్థాఖ్యాయకము. నానాద్రవ్యానురాగాదులచే నౌపమ్యగుణాశ్రయమయిన రూప నిర్వర్ణనము రూపకమని సామాన్యార్థము. ఉపమేయ రూపమున కుపమానరూపనిర్వర్ణనముండుట నానావిధముగా పృథగ్భూతముగా నున్న ద్రవ్యముచే నయిన యనురాగాదులచే నీ రూపసిద్ధి యుండును. స్ఫటిక సన్నిధిలో జపాపుష్ప ముంచినచో స్ఫటికము కన్న పృథగ్భూతమయిన యా పుష్పపు రక్తిమ స్ఫటికమున సంక్రమించి తన రాగరూపముచే రూపము కలుగ జేయును. అట్లె ప్రకృతమును. "ఔపమ్యగుణాశ్రయం" ఉపమానోపమేయములకు సంబంధించిన యౌపమ్యము గుణము అప్రధానము. ఈ రూపనిర్వర్ణనము నందా యౌపమ్యగుణము ప్రధానముగా నాశ్రితముగా నుండును. ఔపమ్యాశ్రయణమున ప్రకృతరూపము నన్యరూపముగా నిశ్చయించి నిర్వర్ణన మొనరించుట యుండుండును. ఈ నిశ్చయము కలుగుటలో నానాద్రవ్యానురాగాదులు హేతువుగానుండును. లాక్షారాగము స్ఫటికమునకు రూపసంపద నిచ్చుట గుర్తించునది. ఆదిపదమున భ్రాంతి గౌణము లాక్షణికము మొదలయిన భేదముల గుర్తించునది.

శబ్దాలంకారము – యమకము.

౮౩౮. శబ్దాభ్యాసస్తు యమకం పాదాదిషు వికల్పితం
ఏతద్దశవిధం జ్ఞేయం యమకం నాటకాశ్రయం

ఇంతవఱకీ విధముగా కావ్యలక్షణముల యర్థ ప్రసంగమున నర్థాలంకారముల ప్రదర్శించుట యయినది. ఆ ప్రసక్తి ననుసరించి శబ్దాలంకారముల స్వరూపము గుర్తింప వలసి యున్నది. యమకము శబ్దాలంకారము. కారికలోని "తు" శబ్ద మర్థాలంకారముల కన్న వ్యతిరేకము నిరూపించును. శబ్దాభ్యాసము యమకమని యమక లక్షణము. ఈ శబ్ద శబ్దమున వర్ణము పదము తదేకదేశము సర్వము సంగృహీత మగును. కావున అనుప్రాసము లాటానుప్రాసము ఛేకానుప్రాసము మొదలగునవియు గ్రాహ్యములు, యమకపదమున కిటుర్లము గుర్తింపదగును. సమజాతములగు రెండిటికి యమ మను సంకేతము కలదు. యమ ప్రకృతిక మయినందు వలన నిది యమకము. కావున నొక యక్షరమునకు గాని పదమునకు గాని ద్వితీయాక్షర మయినను ద్వితీయపద మయినను నిరంతరముగా నుండియేని సాంతర ముగా నుండియేని శోభాజనకమయినచో యమకాలంకార మగును. ముక్తాఫలమునకు సముచిత ముక్తాఫలయోజనము శోభావహము. పద్మరాగాది సంబంధవ్యవధాన మున్నను శోభాజనకము, సత్పురుషు నకు సముచిత సహాసీన సత్పురుషమధ్యలో నున్నచో శోభకలుగు విధమున ముక్తాఫలమునకు సముచితముక్తాఫలాంతర పద్మరాగోపా శ్రయ విశేషము విశేష శోభావహమె యగును. ఈ యమకము పాదముయొక్క యాదిభాగమునగాని మధ్యభాగమునగాని యంత భాగమున గాని వికల్పితమై యుండును. వికల్పిత మనుటచే స్థాపన నియమము లేదని భావము. నియతముగా నున్నచో ఆదియమకమని మధ్యయమకమని యంతయమకమని వ్యవహరింతురు. ఆదిమధ్యాంతము లందు నియతస్థితితో లేకపోయినను యమకవ్యవహార ముండును. ఉద్దేశలక్షణములకు సంబంధించిన విశేషము లనుప్రాసరూపమున లాటీయరూపమున నున్నవి, వానిని గూడ నిందు సంగ్రహించుట సముచితము. ఇట్లీయమకము నాటకాశ్రయమున శోభాజనకమై పది విధముల నున్నది. ఈ దశవిధయమకముల లక్షణము లిట్లున్నవి.

౮౩౯. చతుర్ణాం యత్ర పాదానామన్తేస్యాత్సమమక్షరం
తద్వై పాదాంతయమకం విజ్ఞేయం నామతో యథా
౮౪౦. పాదస్యాదౌ తథాంతే చ యత్ర స్యాతాం పదే సమే
తత్కాంచీయమకం నామ విజ్ఞేయం సూరిభిర్యథా
౮౪౧. అర్థేనైకేన యద్వృత్తం సర్వమేవ సమాప్యతే
సముద్గయమకం తత్తు విజ్ఞేయం నామతో యథా
౮౪౨. ఏకైకంపాదముత్క్రమ్య ద్వౌ పాదౌ సదృశౌ యథా
విక్రాంతయమకం నామ విజ్ఞేయం నామతో యథా
౮౪౩. పూర్వస్యాంతేన పాదస్య పరస్యాదిర్యదా సమః
చక్రవత్ చక్రవాలం తద్విజ్ఞేయం నామతో యథా
౮౪౪. ఆదౌ ద్వే యత్ర పాదే తు భవేతామక్షరే సమే
సందష్టయమకం నామ విజ్ఞేయం నామతో యథా
౮౪౫. పాదస్యాంత్యం పదం యత్ర ద్విర్ద్విరేకమిహోచ్యతే
జ్ఞేయమామ్రేడితం నామ యమకం తత్తు సూరిభిః
౮౪౬. సర్వే పాదాః సమా యత్ర భవంతి నియతాక్షరాః
చతుర్వ్యవసితం నామ తద్విజ్ఞేయం బుధైర్యథా
౮౪౭. నానారూపైః స్వరైర్యుక్తం యత్రైకం వ్యంజనం భవేత్
తన్మాలాయమకం నామ విజ్ఞేయం కావ్యకోవిదైః
ఏభిరర్థక్రియాపేక్షైః కావ్యం కుర్యాత్తు లక్షణైః

ఈ పదివిధములయిన యమకముల లక్షణస్వరూప మీావిధముగ నున్నది.

౧. పాదాంతయమకము. నాలుగుపాదముల యంతమున నున్న యక్షరము సమముగా నుండునేని పాదాంతయమక మగును. ఇచట అక్షరమనుట ఏకాక్షర మనేకాక్షరము సంగ్రాహ్య మగును.

దినక్షయాత్సంహృతరశ్మిమండలం
దివీవ లగ్నం తపనీయమండలం
విభాతి తామ్రం దివి సూర్యమండలం
యథా తరుణ్యాః స్తనభారమండలం

ఇందు పాదాంతములందున్న మండల పదము సమానముగా నుండుటచే లక్షణము సంగతము.

౨. కాంచీయమకము. పాదాదియందును పాదాంతమందును పదములు రెండు సమానములుగా నుండు నేని కాంచీయమక మగును.

యామం యామం చంద్రవతీనాం ద్రవతీనాం
వ్యక్తావ్యక్తా సారజనీనాం రజనీనాం
ఫుల్లే ఫుల్లే సభ్రమరే వా భ్రమరే వా
రామారామా విస్మయతే చ స్మయతే చ

ఇందు పాదాది పదద్వయము పాదాంతపదద్వయము సమాన విన్యాసమున నున్నది.

౩. సముద్గయమకము. పద్యమునందలి యేకార్ధముతో సమానముగా నన్యార్ధము (సర్వావృత్తమనుట) కూర్పుపొందు నేని సముద్గయమక మగును. ఇట్టివాని యం దర్ధభేదమును మునియాదరింప లేదని కొందరందురు కాని యది ప్రసిద్ధము కాదని యభినవభారతి యనును. "వృత్త్యావృత్త్యాదినా పరహృదయం వేదితమస్మాభిః" యని యనుట కభినవుడె యధికారి.

కేతకీ కుసుమ పాండురదంతః
శోభతే ప్రవరకానన హస్తీ
కేతకీ కుసుమ పాండుర దంతః
శోభతే ప్రవరకానన హస్తీ

ఇందు పూర్వార్ధపరార్ధము లేకరూపములై సముద్గయమకము నకు స్వరూప మిచ్చినవి.

౪. విక్రాంతయమకము. ఒక్కొకపాద మతిక్రమించి రెండు పాదములు సమానముగానున్న విక్రాంతయమక మగును. రెండవ నాల్గవ పాదములు సమానముగా నుండుట లక్షణమని గుర్తింపవచ్చును.

స పూర్వం వారణో భూత్వా ద్విశృంగ ఇవ పర్వతః
అభవద్దంత వైకల్యాద్విశృంగ ఇవ పర్వతః

ఇందు రెండు నాలుగు పాదములు సమాన రూపములు.

౫. చక్రవాలము. పూర్వపాదాంతిమభాగముతో పరపాదాదిమ భాగము సమానముగా నుండు నేని యది చక్రమువలె నుండును గావున చక్రవాలమను యమక మగును.

శైలా స్తథా శత్రుభిరాహతా హతా
హతాశ్చ భూయ స్త్వనుపుంఖగైః ఖగైః
ఖగైశ్చ సర్వైర్వ్యధి సంచితాశ్చితా
శ్చితాధి రూఢా నిహతా స్తలై స్తలైః

పాదాంతమున పరిత్యక్తమగు పదము తరువాతి పాదమున స్వీకృత మయినది.

౬. సందష్టయమకము. పాదపాదమునందు మొదటి రెండక్షర ములు సమానముగా నున్నచో సందష్టయమక మగును.

పశ్య! పశ్య! రణమస్య మే గుణాన్
యేన యేన వశగాం కరోతి మాం
యేన యేన హిమమైతి దర్శనం
తేన తేన వశగాం కరోతి మాం

దీనిలో పాదాద్యక్షరద్వయము సమానముగా నుండుట స్పష్టము. రెండు నాలుగు పాదములలో "వశగాం కరోతి మాం" అను నది యావృత్త మగుట సందష్టయమకరూపము కాదు. ఒక లక్ష్యమున నేకలక్షణముల సంక్రాంతి సంభవసుందర మె అయినను చమత్కార ముఖమయిన వ్యపదేశము ప్రకృతాపేక్షిత వ్యవహారము ప్రతిపద్యము నందును గుర్తింప వలెను.

౭. పాదాదియమకము. ప్రథమపాదముయొక్క ప్రారంభము నందున్న యక్షరవిన్యాసము సర్వపాదములందును సమానముగనుండు నేని పాదాదియమక మగును. పాదాదిసమావేశ సమాక్షరత దీని స్వరూపము.

విష్ణుః సృజతి భూతాని విష్ణుః సంహరతే ప్రజాః
విష్ణుః ప్రసూతే త్రైలోక్యం విష్ణుర్లోకాధిదైవతం

౮. ఆమ్రేడితము. పాదమునందున్న చివరిపదము రెండురెండు పర్యాయము లావృత్తమై యొకేవిధమున నుండు నేని యామ్రేడితమను యమక మగును.

విజృంభితం నిశ్వసితం ముహుర్ముహుః
కథం విధేయస్మరణం పదే పదే

యథా చ తే ధ్యానమిదం పునః పునః
ధ్రువం గతా తే రజనీ వినా వినా

సమన్వయము స్పష్టము.

౯. చతుర్వ్యవసితము. పద్యమునందలి సర్వపాదములు నియతాక్షరములై సమానముగా నున్నచో చతుర్వ్యవసిత యమక మగును. ప్రథమపాదమువలెనె సర్వపాదములుండుట యని భావము. నియతాక్షరసమావేశమునందును అర్థభేదముండుట యావశ్యకమె.

వారణానామయమేవ కాలో
వారణానామయమేవ కాలః
వారణానామయమేవ కాలో
వారణానామయమేవ కాలః

౧౦. మాలాయమకము. వ్యంజనవర్ణ మొకటియే నానారూప స్వరములతో కూడుకొనినచో మాలాయమకమని కావ్య కోవిదులు నిర్ణయించిరి.

హాలీ బలీ హలీ మాలీ ఖేలీ మాలీ సలీ జలీ
ఖలో బలో బలో మాలో ముసలీ త్వభిరక్షతు

అసౌ హి రామా రతి విగ్రహా ప్రియా
రహః ప్రగల్భా రమణం మనోగతం
రతేన రాత్రౌ రమయేత్పరేణ వా
న చేదు దేవ్యత్యరుణః పురో రిపుః

సత్పృక్వ రాక్షః క్షతజో క్షితాక్షః
క్షరత్ క్షతేభ్యః క్షతజం దురీక్షం
క్షతైర్గవాక్షైరివ సంవృతాంగః
సాక్షా త్సహస్రాక్ష ఇవావభాతి

మొదటి పద్యములో ల కారమునకు ఈ ఓ సంబంధమున్నది. రెండవ పద్యములో రేఫకు అ ఆ ఉ ఏ ఓ సమావేశ మున్నది. మూడవదానిలో క్ష కారమునకు అ ఆ ఇ ఐ సమావేశ మున్నది. ఇట్టివిశేషమె కాక పదాంత వర్ణమునకు స్వరసమావేశము పదాది

వర్ణమునకు స్వరసమావేశము ఉభయసమావేశము లక్ష్యములం దభ్యూహ్యము, ఇట్లు దశధాపరిగణనమె కాక ఔచిత్యానుసారమున నితరభేదములను గూడ నభ్యూహింపవచ్చును. కావ్యలక్షణాభిసంబంధమునసె యుపమా రూపక దీపకయమకములకు స్వరూప సంపద కలిగినది.

యుక్తయోగము

కావ్యములందు కావ్యలక్షణములకె ప్రాధాన్యము కలదు. ఈ యంశము నిరూపితపూర్వ మయిన నర్థక్రియాయుక్తము లయిన కావ్యలక్షణముల ఘటనమున కావ్యమున కసాధారణశోభ కలుగుననుట నిరూపణీయము. లక్షణము లర్థక్రియాయుక్తములు. "అర్థక్రియాయాం రసచర్వణాయాం యుక్తః యోగః యేషాం" అర్థము ప్రయోజనము. అర్థక్రియ రసచర్వణము. ఇట్టి రసచర్వణాలో లక్షణములకు యుక్తయోగమున్నది. వర్ణ్యమానములన్నియు విభావాదిరూపములై రసచర్వణాయోగము కలవగును. గుణాలంకారములన్నియు కావ్యలక్షణములకు స్వరూపాఖ్యానములు.

కావ్యదోషములు

అలంకారముల స్వరూపవివేచనానంతరము గుణముల నిరూపింపవలసినదే కాని దోషనిరూపణానంతరము గుణనిరూపణమాత్మగ్రాహి యగును గావున ప్రకృతము దోషనిరూపణ మావశ్యకము. గుణములు దోషవిపర్యయ రూపములు. గుణప్రతిపక్షములు దోషము లగునా? గుణములకు స్వతస్సత్త్వము కలదా? ఇట్టి సమీక్ష కిది యదనుకాదు. కావ్యదోషము లిట్లున్నవి. అవి పది.

| | |
|---|---|
| ౧ గూఢార్థము | ౩ అర్థహీనము |
| ౨ అర్థాంతరము | ౪ భిన్నార్థము |
| ౫ ఏకార్థము | ౭ విషమము |
| ౬ అభిప్లుతార్థము | ౯ విసంధి |
| ౮ న్యాయాపేతము | ౧౦ శబ్దచ్యుతము |

దశవిధ దోషనిరూపణగ్రంథ మనంతర గ్రంథముగా కొన్నిట కన్పడును. కాని యా కొన్నిపుస్తకముల మాట యటుంచి బాహుల్యమున నిది

మొదటనే యుండుటను గుర్తించినచో నిచటనే నిరూపణ మావశ్యకము. వీని లక్షణము లీ విధముగ నున్నవి.

౮౪౮. పర్యాయశబ్దాభిహితం గూఢార్థమితి సంజ్ఞితం
అపన్యస్యం వర్ణ్యతే యత్ర తదర్థాంతరమిష్యతే

౮౪౯. అర్థహీనం త్వసంబద్ధం సావశేషార్థమేవ చ
భిన్నార్థముభివిజ్ఞేయ మసభ్యం గ్రామ్యమేవ చ

౮౫౦. వివక్షితోఽన్య ఏవార్థో యత్రాన్యార్థే న విద్యతే
భిన్నార్థం తదపి ప్రాహుః కావ్యం కావ్యవిచక్షణాః

౮౫౧. అవిశేషాభిధానం యత్తదేకార్థమితి స్మృతం
అభిప్లుతార్థం విజ్ఞేయం యత్పదేన సమాప్యతే

౮౫౨. న్యాయాదపేతం విజ్ఞేయం ప్రమాణపరివర్జితం
వృత్తభేదో భవేద్యత్ర విషమం నామ తద్భవేత్

౮౫౩. అనుపశ్లిష్టశబ్దం తద్విసంధీతి కీర్తితం
శబ్దచ్యుతం చ విజ్ఞేయమపవర్ణస్వరయోజనాత్

ఈ పదియు కావ్యదోషములు. కావ్యలక్షణములు రసచర్వణాయుక్తి కలవి కాగా నీ దోషములు రసచర్వణాయోగ భంజకము లని భావము భాసించును. ఈ దోషములు పదగతము లగును. వాక్యగతము లగును. తదర్థగతములు నగును. గూఢార్థార్థాంతరాది దోష నామములు స్వసంకేతిత స్వరూపమును నిరూపించుటకు సమర్థములె. అవి సాభిప్రాయము లయిన సంకేతములె. అయినను పరిమితముగా తత్స్వరూపాభిధానము యుక్తము.

౧. గూఢార్థము. పర్యాయశబ్దాభిహితము గూఢార్థము. చెప్ప దలచిన యంశమును చెప్పవలసిన శబ్దముచే జెప్పక తత్పర్యాయ శబ్దముచే జెప్పుట గూఢార్థము. దశరథుడని చెప్పవలసి యుండగా బలాత్పరికల్పిత మయిన పర్యాయశబ్దమున జెప్పుట గూఢార్థము. అధికనవ విమానుడు అనుట గూఢార్థము. అధికనవ=నవాధికమయిన దశసంఖ్య విమానము=రథము- ఇట్లు గుర్తించినగాని దశరథార్థము తెలియదు. "న హి యదృచ్ఛాశబ్దాః పర్యాయభాజః" యదృచ్ఛాకల్పితము లయిన శబ్దము లన్నియు పర్యాయ పదములు కానేరవు. అట్టివాని వలన నర్థప్రత్యయము తగిన విధమున కలుగదు. కావున నిది గూఢార్థము.

౨. అర్థాంతరము. అవర్ణ్యమును వర్ణించినచో నది యర్థాంతర మగును. ఉదా:- "చింతామోహమనంగమంగ తనుతే విప్రేక్షితం సుభ్రువః" సుభ్రూదృష్టి చింతామోహాత్మకమయిన యనంగభావమును గలుగ జేయుచున్నది. ఇట్లనుటలో నీ దోషమున్నది. ఇందు కామ రాగము కలిగినదనుట స్వీకృతము. కాగా చింతాది శబ్దమున నవర్ణ నీయమును వర్ణితమయినది. ప్రసక్తాను ప్రసక్తిగా బహుతరాప్రకృత వర్ణనము కొన్ని కావ్యములందు కన్పడును. అది ప్రబంధ దోషరూప మగును. అట్టిది సంధి తదంగవిధానమున పరాకృత మయినది. అది యిచట నిరూపణార్హము కాదు.

3. అసంబద్ధ మయినను సావశేషార్థ మయినను అర్థహీనమను కావ్యదోష మగును.

అద్యాపి స్మరతి రసాలసం మనో మే
ముగ్ధాయాః స్మరచతురాణి (చేష్టితాని)

"రసాలసమగు నా మనమిప్పటికిని ఆ ముగ్ధయొక్క స్మరచతుర ములగు చేష్టితములను స్మరించుచున్నది." ఇట్లనుటలో పూర్వాపర వ్యాఘాతమున్నది. స్మరించునది రసాలసమనుట రసాలసము స్మరించు ననుట ముగ్ధవధువునకు స్మరచతురచేష్టితము లనుట సర్వము పూర్వాపర సంబంధ విరుద్ధము. కావున నిది యసంబద్ధ రూపమగు నర్థహీన దోషము. సావశేషార్థ రూపదోష మిట్లుండును.

" సమహాత్మా భాగ్యవశాన్మహాపదముపాగతః"

ఆ మహాత్ముడు భాగ్యవశమున మహాపదము పొందినాడను వాక్య మర్థహీనదోషదుష్టము. దీనిలో వస్తునిశ్చయము సావశేష ముగా నున్నది. ప్రకరణాపేక్షముగా నున్నది. ఇంతమాత్రమున సంపూర్ణార్థవ్యక్తి కలుగదు. "మహాత్మా భాగ్యవశాత్" అనుస్థల మున "అభాగ్యవశాత్" అనియు సంభావ్యము కావచ్చును. అందు ననె నిశ్చితార్థము లేదు, అర్థహీన మయినది,

౪. భిన్నార్థము. ఈదోషము మూడువిధములు.

౧. ప్రథమభిన్నార్థము. దూరసంబంధము వలని వ్యవధానము వలన నర్థము మృగ్యము = వెదుకదగినది యయినచో వెంటనే యర్థ

స్ఫురణము కలుగదు కావున భిన్నార్థము. కర్మకర్తృక్రియాసాపేక్ష మయిన యన్వయమార్గ మనుకూలముగా నుండక అటునిటు వ్యాకీర్ణ మయిన-చో ప్రథమభిన్నార్థమగును.

జ్వరం భుంజీత సంజాతమలపాకం చిరస్థితం
అజాదుగ్ధోదనం హన్యాత్ త్రిదోషోత్థోపసంభవం

దీనిలో కర్మకర్తృక్రియాసంబంధము సంబంధింపని సంబంధ మున వ్యవహిత మయినది. ఇందన్వయరీతి ఇట్లు పరిగ్రాహ్యము. "చిరస్థితం సంజాతమలపాకం అజాదుగ్ధోదనం భుంజీత. (తత్) త్రిదోషోత్థోపసంభవం జ్వరం హన్యాత్." చిరస్థితమయిన దోషము పోవునట్లుగా పాక మొనర్పబడిన మేకపాలతో వండిన యన్నమును భుజింపవలెను. ఆ యజాదుగ్ధోదనము త్రిదోషప్రకోపము వలన గలిగిన జ్వరమును పోగొట్టగలదు. ఇట్టి యర్థ మీ శ్లోకమువలన వెంటనే కలుగదు. మధ్య మధ్యలో పదాంతరములు ప్రవేశించినవి. మలపాకము భుజింపవలెనను విపరీతార్థమును గలుగును. అన్వయబాధ కలుగకుండునట్లు పదయోజన మావశ్యకము. ఇందట్టిది లేదు. కావున దోషము.

౨. రెండవభిన్నార్థము గ్రామ్యము. అసభ్యమగు నర్థ మున్నచో గ్రామ్య మయిన యర్థ మున్నచో నీ రెండవదోష మగును. "ఓసీ! పిల్లా! నన్ను పొందుము. నీకు దీని నిచ్చెదను" అని యనుట గ్రామ్యము. ప్రేమవ్యవహారము నందిట్టి వచనవ్యవహారము గ్రామ్యము.

3. మూడనభిన్నార్థము. వివక్షితార్థము వేరుగను నిరూపితార్థము వేరుగను ఉన్నచో నీ భిన్నార్థమగును. చెప్పదలచిన యర్థమన్యార్థముతో కూడియుండుట. ఇట్టి దోషము కల కావ్యము భిన్నార్థమని కావ్యవిచక్షణులు పలికిరి. ఉదా:- "స్యాచ్చేదేష న రావణః" "ఈతడు రావణుడు కాకున్నచో" అని రావణుడు పలికి "క్వను పునః సర్వత్ర సర్వే గుణాః" సర్వత్ర సర్వగుణము లుండునా? యనుట భిన్నార్థము. ఇందు మొదట రావణుని యనుపాదేయత్వ ముద్దిష్టమయినది. ఆ యంశము తరువాతి నిరూపణమున నన్యధీకృత మయినందున భేదిత మయినది.

౫. ఏకార్థము. అవిశేషాభిధాన మేకార్థము. ఎంతచెప్పిన నొక్కే యర్థముండుట. "కుందేందుహారహర హాససితం" కుందమువలె చంద్రునివలె హారమువలె హరహాసమువలె తెల్లనిది' అని యనుటలో విశేషార్థమేమియు లేదు. సర్వమేకప్రయోజనముగా నున్నది. "న హి కావ్యం శాస్త్రవదుపదేశ్యం కశ్చిత్కించిజ్జానీయాదితి ప్రవర్తతే" ఎవడేని యేమేని తెలిసికొనుగావుతమని కావ్యము ప్రవర్తించునే కాని యది శాస్త్రమువలె నుపదేశ్యముకాదు. శాస్త్రము నుపదేశించిన విధమున కావ్యము నుపదేశింప నక్కఱ లేదు. శాస్త్రము నుపదేశించిన విధమున కావ్యము నుపదేశింపరాదు. ఒకడొకదాని గుర్తించుననిమరి యొకడు మరియొకదాని గుర్తించునని కావ్యము ప్రవర్తింపదు. శాస్త్రమట్లభీష్టోపదేశమున మానవుని ప్రవర్తింప జేయునది కావచ్చును. కావ్య మట్లుగాదు.

౬. అభిప్లుతార్థము. ఒకపదముననె సమాప్తిపొందునట్టియర్థము, ఒక్కపదముననె యభిప్లుతమై తేలిపోవునట్టి యర్థము అది యేకవాక్యముగా నిమజ్జనము పొందక అభిప్లుతమగును.

స రాజా నీతి కుశలః సరః కుముదశోభితం
సర్వప్రియా వసంతశ్రీర్గ్రీష్మే మాలతికాగమః

ఆ రాజు నీతికుశలుడు. సరస్సు కుముదశోభితము. వసంతశోభ సర్వప్రియము. గ్రీష్మమునందు మాలతి వచ్చును. ఇందు ప్రతిపాదమర్థము పరిసమాప్త మయినది. ఏకవాక్యరూపముగా సర్వార్థములకు నిమజ్జనము లేదు. ఏయర్థమున కాయర్థము విడివిడిగా నుండుటచే నభిప్లుతార్థ మయినది.

౭. న్యాయాపేతము. ప్రమాణపరివర్జిత మగునది న్యాయాపేత మను దోషమగును. ఇది దేశవిరుద్ధము కాలవిరుద్ధము కలావిరుద్ధము శాస్త్రవిరుద్ధము ప్రభృతిగా ననేకవిధములు.

సువీరేష్వస్తి నగరీ మథురా నామ విశ్రుతా
అక్షోటనాలికేరాఢ్యా యస్యాః పర్యంతభూమయః

సువీరదేశములందు మథుర యను ప్రఖ్యాతనగరి కలదు. అచటి పర్యంతభూములం దక్షోటనాలికేరము లధికముగా నున్నవి." ఇట్లనుట

దేశవిరుద్ధము. మధుర సుషీరములలో లేదు. మధురాపరిసరభూము లం దక్షోటనారికేళము లధికముగను లేవు.

౮. విషమము. వృత్తభేద మున్నచో విషమమను దోషమగును.

అయి పశ్యసి సౌధమాశ్రితా
మవిరల సుమనోమాల భారిణీమ్

దీనిలో మొదటిపాదమున "స స జ గ" లు కలవు. రెండవపాద మున "న న త ర" లు కలవు. ఇట్టిది విషమము. విషమవృత్తము లుండవచ్చును గాని యవి యస్థానప్రవేశముకలవి కారాదు.

౯. విసంధి. అను పశ్లిష్టశబ్దము విసంధి యగును. అనుపశ్లిష్ట మె యనుపారూఢము. సంధియోగ్యములగు పదములు సంధి లేకపోయినచో పరస్పరము కూర్పులేక శోభ నీయవు. విసంధి దోషగ్రస్తము. ఈ విసంధి దోషమింక నితరములను సంగ్రహించును. పద పదములకు సంధానమనునది రెండువర్ణములకు నైరంతర్యము. ఇట్టి నైరంతర్యము వలన వర్ణముల కన్యోన్యవిలయము కలుగును. అట్టి వర్ణసమావేశ మొకప్పు డయుక్తముగ నుండును. పారుష్య ముత్పాదించి దుశ్శ్రవ ముగ నుండును.

౧౦. శబ్దచ్యుతము. వర్ణస్వరయోజనము తగినవిధమున నుండ దేని శబ్దచ్యుతమను దోషమగును. శబ్దచ్యుతము వ్యాకరణ దుష్టము. ఇది యసాధుశబ్దము. ఇది యపశబ్దము. అర్థవ్యుత్పాదకము కాదు. మునిత్రయ మపశబ్ద నిర్ణయమున నిట్టివిశేషము సూచించినది. ఇట్టివి దశవిధములయిన కావ్యదోషములు.

కావ్యదోషనిర్ణయమున కొందరిమత మీ విధముగ నున్నది. ఈ దోషములలో గొన్ని నిత్యదోషములు. అపశబ్దము నిత్యదోషము. కొన్ని యనిత్యదోషములు కలవు. అవి యొకప్పుడు దోషములుకావు. గ్రామ్యము హాస్యాదులలో దోషముకాదు. అచట గ్రామ్యప్రయోగ మిష్టతమము. ఈ నిరూపితము లయిన దోషము లన్నియు స్థూల స్వరూపములు. సూక్ష్మముగా నాలోచించిన యిందలి విశేషము లింకను విశదము కాగలవు. గూఢార్థమును గూఢలేఖ ప్రహేలికాది పతాకాస్థానకాదులందు ప్రయోగింపవచ్చును. అర్థాంతరము ననువాద

రూపార్థమున నిరూపింపవచ్చును. అర్థహీనాదికమును హాస్యమున వినియోగించునది. శ్రోత్రియాదులు వక్తలుగా నుందురేని భిన్నార్థ ప్రయోగ ముచిత మగును. పర ప్రత్యాయనము = వంచనమునం దేకార్థ ప్రయోగము యుక్తము. అభిప్లుతార్థము నున్మాదాదులలో వినియోగింప వచ్చును. భిన్నవృత్తము విసంధి యనువానిని వాని వాని విషయౌచిత్యమున వినియోగించునది. సామాన్యముగా నీ దోషము లన్నియు నాపాత విషయములు. ఎట్లేని వీనివలన నర్థప్రతీతి యున్నది. కావున వీని నంతగా దోషము లన నక్కఱలేదు. అపశబ్ద మెల్లప్పుడు దోషమె యగును. దానివలన నే యర్థప్రతీతియు గలుగ నేరదు. శబ్దనక్రియా సామర్థ్య మపశబ్దమున లేదు. అపశబ్ద మెట్టి భాషననుసరించియు నర్థక్రియాకారి కానేరదు. అపశబ్దమున కే యర్థమునందును సంకేత ముండదు. సంకేతము లేసందున నెట్టి యర్థ మును అపశబ్దము నిరూపింప నేరదు. ఇప్పటి కీ విధముగా కావ్యదోష ములు నిరూపితము లయినవి. ఈ దోషవిపర్యయ రూపమున గుణము లను గుర్తింప వలసి యున్నది.

## కావ్యగుణములు

కావ్యగుణములు పది కలవు. లక్షణాలంకారగుణముల స్వరూప వివేకము నిరూపితప్రాయము. దోషముల విపర్యయమున గుణము లుండునని యిచట నిర్దేశమున్నది. ఈ దోషవిఘాతమె గుణమగునని భావము. గుణములన్నియు నిట్టివే యగునా? కొన్నిగుణములం దేమేని విశేషము కలదా? అవిశేషముగా గుణములన్నియు దోషవిపర్యయ రూపములె యనుట సుసంగతముగ నున్నదా? ఇట్టి ప్రశ్నభాగపరీక్షా సమీక్షలకై యీ రూపవివేక మావశ్యకము.

౮౫౪. ఏతే దోషా హి కావ్యస్య మయా సమ్యక్ప్రకీర్తితాః
గుణా విపర్యయాదేషాం మాధుర్యౌదార్యలక్షణాః

దోషగుణస్వరూపవివేచనమున భరతుని సంవేదన మిందు సంక్లుప్తమై యున్నది. ఈ కావ్యదోషములు సమ్యక్ప్రకీర్తితము లయిన వని యనుటలో నొక యభిసంధి యుండును. గుణము లన్నియు దోషా భావస్వరూపములే యనికాదు. అవి మాధుర్యౌదార్యసంపత్సహిత

ములు నగును. ఈ సంపద యున్నందున గుణములు స్వరూపసంపద కలవగుచున్నది. మాధుర్యౌదార్యాంశము లయిన గుణములు కావ్య గుణములని సారార్థము. ఏతదుక్తం భవతి,” ఇట్టి దోషరహితమయిన కావ్యము శ్రుతిసుఖము దీప్తరసము నగునేని గుణాంతరములు లేకున్నను కావ్యాలంకారములు లేకున్నను లక్షణయోగావ్యభిచారియె కావున రమ్యముగ నుండును. కావ్యమునం దవశ్యముగా కావ్యలక్షణము లుండితీరవలయును. కావ్యలక్షణములె యున్నచో దోషములు లేక పోయినచో గుణాలంకారము లేవియు లేకున్నను శ్రుతిసుఖము దీప్త రసమయిన కావ్యము కావ్యమగునని భావము. మాధుర్యౌ మౌదా ర్యము స్వరూపముగా గలవియె గుణములు. ఈ మాధుర్యౌదార్య ములు వక్ష్యమాణగుణములలోని మాధుర్యౌదార్యములె యగునా? యంతకన్న విలక్షణములా? యనునది తత్సమయమున మీమాంస్యము. ధ్వనికారాదులు ఓజః ప్రసాదమాధుర్యము లను గుణముల నంగీకరించి యవి రసధర్మములని పరిగణించిరి. ధ్వనిభాష్యలోచననిర్మాత యయిన యభినవభారతీబ్రహ్మ మాధుర్యౌజః ప్రసాదములనె గుణదృష్టిపక్షమున నభిమానించెను. మాధుర్యౌజః ప్రసాదములు నాట్యవేదసమ్మతములు. భరతసమ్మతములు నని యభినవభారతి నిరూపించుట యుక్తము. కావుననె “మాధుర్యౌదార్యలక్షణాః” యనుకారి కాఖండమున గుణ త్రయాంగీకారసూచనావిష్కరణ మభినవసూచనము కావలెను. శ్రుతిసుఖమగు మాధుర్యము దీప్తరసమగు ఓజస్సు వివృతిలో నిరూపిత మగుట ప్రసాదగుణమునకు నుపలక్షణము. మాధుర్యౌజః ప్రసాద సంపత్తి కావ్యలక్షణసంపత్తి సుందరము.

ఈ గుణములె కాక గుణములు కలవని ప్రదర్శించుట కీ కారిక కావలయును.

౮౫౩. శ్లేషః ప్రసాదః సమతా సమాధి
ర్మాధుర్యమోజః . పదసౌకుమార్యం
అర్థస్య చ వ్యక్తిరుదారతా చ
కాంతిశ్చ కావ్యస్య గుణా దశైతే

ఈపదియు కావ్యగుణములు. ఇవి కావ్యమునకు సంబంధించిన గుణములు. “కావ్యమునకు సంబంధించిన యని యనుటచే పదమునకు

వాక్యమునకు తదుభయగతార్థమునకును సంబంధించిన గుణములని భావము.

౧. శ్లేష ౬. ఓజస్సు
౨. ప్రసాదము ౭. సౌకుమార్యము
౩. సమత ౮. అర్థవ్యక్తి
౪. సమాధి ౯. ఉదారత
౫. మాధుర్యము ౧౦. కాంతి

క్రమముగా వీని లక్షముల నిట్లు గుర్తింపవలెను.

౧. శ్లేష.

౮౫౬. ఈప్సితేనార్థజాతేన సంబద్ధానాం పరస్పరం
శ్లిష్టతా యా పదానాం స శ్లేష ఇత్యభిధీయతే

అభీష్టార్థములతో గూడుకొనిన పదముల పరస్పరము శ్లిష్టత శ్లేషయను గుణమగును. అర్థభాగములకు కవిసముత్ప్రేక్షితముగా పరస్పర సంబద్ధమయిన యోజనా విశేషముండును. అట్టియోజనముచే నర్థజాత మీాప్సిత మగును. తదుపలక్షితమయిన యుపపద్యమానార్థమున కా యర్థముతో నుపపద్యమానత యుండుట శ్లేషగుణ మగును. ఒక్కొకయర్థమున కొక్కొక యర్థముతో నుపపత్తి యుండును. ఉపపత్తి కల యర్థ ముపపత్తి కల యర్థముతో గూడి యుండుట యుపపన్నము. ఇదియె యర్థజాత సంబద్ధము లయిన పదముల శ్లిష్టత. వామనుడీవిధముగా శ్లేషగుణ ముదాహరించెను.

దృష్ట్వైకాసనసంస్థితే ప్రియతమే పశ్చాదుపేత్యాదరా
దేకస్యా నయనే నిమీల్య విహిత క్రీడానుబంధచ్ఛలః
ఈషద్వక్రిత కంధర స్సపులక ప్రేమోల్లసన్మానసా
మన్తర్హాస లసత్కపోల ఫలకాం ధూర్తోఽపరాం చుంబతి

ప్రియురాండ్రేకాసనమున నుండుట చూచి ప్రియుడు వెనుకగా వచ్చి యాదరముగా నొక ప్రియురాలి కన్నులను మూసెను. విలాస క్రీడావ్యాజముగా నొకింత మెడను త్రిప్పి ప్రేమసంఫుల్లచిత్త హాస లసత్కపోల యయిన వేరొకతె నా ధూర్తుడు చుంబించెను. ప్రియు డొంటటి ప్రియుడయిన నొకేసమయమున నిద్దరి ప్రియురాండ్రకు ప్రియు

డగుట యనునది మనోరథాతీత మయినను ప్రకృతపద్యమున నుపపా
దితమయినది. దీని భావించిన నిది యసంభావనీయముగ నుండదు.
కావుననే యీ క్రమము కుటిలమయిన నెవని హృదయమునందు
నుల్బణత్వము వహించుటలేదు. సర్వసహృదయ హృదయములందును
మగ్నమై యాస్వాద్య మగుచున్నది. ప్రియతమా దర్శనము పశ్చా
దుపాగమనము నయననిమీలనము కంధరావలనము చుంబనము నను
నాయక క్రియలు, ఆసనసంస్థితి ఉల్లసన్మానసత హాసలసత్కపోలత
యను నాయికా క్రియలు పరస్పరము సంశ్లిష్టములై యుండుటయు
నిందు సంభావనీయము.

పదముల శ్లిష్టత శబ్దగుణముగ గూడ కలదు. సంధిబంధనము
నిమిత్తముగా ననేకపదము లేకపదముగ నవభాసించుట శ్లేషగుణము.
ఇట్టి యవభాసములో పదముల పరస్పర సంబంధము యోని, అనేకపద
మేకపదముగ భాసించుటను మాసృణ్య మందురు. అదియే మసృణత.
ఒక పదమునకు పదాంతరాపేక్ష స్నిగ్ధమసృణముగా నుండుటచే నట్టి
సంబంధము కలుగును. "సూత్రం బ్రాహ్మ్యమురఃస్థలే" అను స్థలమున
పరసవర్ణమున్నను పరుషాక్షరమున్నందున శ్లేష కాదు. "బ్రాహ్మం
సూత్రమురఃస్థలే" యని పదాంతరపాఠ మవశ్యాపేక్షమగునేని మసృ
ణత యుండుటచే శ్లేష యగును. అట్లైనానాపదములు మాసృణ్యమున
నేకపదముగా భాసించుట శబ్దగత మయిన శ్లేషగుణమయినది. ఈ
యంశము ఛందస్సందర్భమున స్పష్టము. తథా సంధీయమానములకు
తథాసంధిలో నొక విశిష్టమగు సాజాత్య ముండును. విశిష్టమగు
సావర్ణ్య ముండును. ఇట్టి సాజాత్య సావర్ణ్య సంపత్తి సూత్రసంబంధ
మున వస్త్రఖండములకును గలుగును. ఈ యంశ మిట్లుదాహరణమున
గుర్తింప వచ్చును.

అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః

అను కుమారసంభవశ్లోకములో నీ విధముగా భావింపవలెను.
'అస్తి' శబ్దమునకు "ఉత్తర" శబ్దముతో యణాదేశసంధి కలుగగా
"అస్త్యుత్తర" యయినది. మొదటిపదములోని 'త' కారమునకు రెండవ
పదములోని 'త' కారమునకు కొంతవ్యవధానమున్నను సాజాత్య

మున్నది. "ఉత్తర" పదమున 'త' కారమునకు 'త' కారమున కవ్యవధానమున సాజాత్యమున్నది. తరువాత "స్యాన్దిశి" అను స్థలమున "స్యాం దిశి" అనువానికి సంధివలన "స్యాన్దిశి" రూప మేర్పడినది. ఇచట 'న' కారమునకు తద్వర్గగత మయిన 'ద' కారముతో సావర్ణ్యము కలదు. "దిశి దేవతా" యను స్థలమున 'శి' లోని 'ఇ' కారమునకు 'దే' లోని 'ఏ' కారమునకు తాలవ్యాంశము లగుట సాదృశ్య మున్నది. "దేవతాత్మా" యను స్థలమున 'త' కారమునకు 'ఆ' కారవ్యవధానమున 'త' కారముతో సంబంధమును సాజాత్యముతో నున్నది. ఇట్లుండుట కేకల మనుప్రాస మాత్రమని యనరాదు. ఒకపదమునందున్న యనుప్రాసలో కూడ ప్రామాణ్యము లభింపగలదు. "ఇన్దిన్దిరాణాం లలితో నినాదః" యను స్థలమున మధుపార్థమున నున్న ఇన్దిన్దిరపదమున "న్ది న్ది" వర్ణావృత్తిరూపమయిన యనుప్రాస మున్నది. ఇట్టి యనుప్రాసలమునందును సావర్ణ్య ముపయోగి యగును. ఈ శ్లేషగుణరూపనిరూపణమున కొందరిట్లు లక్షణము నిరూపించిరి.

విచారగహనం యత్స్యాత్స్ఫుటం చైవ స్వభావతః
స్వతః సుప్రతిబద్ధం చ శ్లిష్టం తత్పరికీర్తితం

స్వభావసహజముగా విచారగహనము స్ఫుటము నగునది శ్లేష గుణ మగును. ఇంతవరకిది యర్థశ్లేష లక్షణము. వక్రమయినను ఘటమానమగు రీతి యిందున్నది. స్వతఃసుప్రతిబద్ధముగా నుండుట శ్లేష యనుట పదశ్లేషగుణలక్షణము. ఈగుణముల విషయమున నొక వివేకమావశ్యకము. కొన్ని గుణములకు పాఠద్వైవిధ్యమున్నది. కొన్నిటికి త్రైవిధ్యమున్నది. అర్వాచీనాలంకారికులు స్వీకరించిన లక్షణ సంవాదము గ్రాహ్యము.

## ౨. ప్రసాదము.

౮౫౭. అప్యనుక్తో బుధైర్యత్ర శబ్దోఽర్థో వా ప్రతీయతే
సుఖశబ్దార్థ సంయోగాత్ప్రసాదః స తు కీర్త్యతే

బుధులు వ్యాఖ్యానించి నిరూపింపకున్నను శబ్దమర్థము స్పష్టముగా నవభాసించునేని ప్రసాదగుణ మగును. సుఖశబ్దార్థ సంయోగ

మున ప్రసాదము కలుగును. ఈ యర్థ మీవిధముగా నిట్లు గోచరించు నని బుధులు చెప్పవలసిన యవసరము లేకుండగనే ప్రయోజన రూపార్థము స్వయముగా భాసించుట ప్రసాదము. అర్థవైమల్యము ప్రసాదమని యని నట్లయినది. అర్థమునందు వైమల్య ముండుట యుప చారవశమున నని గుర్తింపవలెను. కావ్యమునం దనుపయోగి విషయ ముల వర్జనమున వైమల్యము కలుగును. జలము విమలముగా నున్న దని యందుము. జలమునం దా వైమల్యము పాంసుసంపర్కము లేనందున కలుగును. అట్లె యనుపయోగి పరిహారమున నర్థమునకు వైమల్యము కలుగును. ప్రయోజకమాత్ర పదపరిగ్రహము వలన నీ విమలత కలుగును. వివక్షితార్థము సమర్పింపగల పదములనె ప్రయో గించినచో వైమల్యము లభించును. "సవర్ణా కన్యకా రూప యౌవనా రంభ శాలినీ" యనునది లక్ష్యము. ఇచట నిట్టి ప్రసన్న పదాయోజనము వలన తత్కన్యాగత విశేషము లవభాసించుచున్నవి. వివాహ్యత భాసించు చున్నది. ప్రాపణీయత గోచరించు చున్నది. హృద్యత స్ఫురించుచున్నది. సంభోగయోగ్యత గృహస్థ సహధర్మచారిణీత్వ మవగతమగుచున్నది. సాభిప్రాయత్వ మర్థవైమల్యము రెండును ప్రసాదమున పర్యాలోచనీయములు. వైమల్యమున్నను సాభిప్రాయత లేకపోయినచో, సాభిప్రాయత యున్న నర్థవైమల్యము లేకున్నచో ప్రసాదమనుట సమ్మతము కాదు. ప్రసాద విపర్యయ మయిన యప్ర సాద మిట్లుండును. "ఉపాస్తాం హస్తో మే విమలమణికాంచీ పదమిదం" నా హస్తము విమలమణికాంచీ పదము నుపాసించు గావుత. ఇందు కాంచీపద పదప్రయోగమునకె నితంబము (జఘనము) లక్షిత మగును. విమలమణివిశేషణ మప్రయోజక మయినది. ఇట్లన్యథోపయోగము వలన నీటిలో బురదవలె నప్రసన్నత నాపాదించినది. సుఖశబ్దార్థ సంయోగము ప్రసాదమునకు ప్రాణము, శబ్దార్థసంయోగము సుఖముగా నుండవలెను. సుఖ మనుట ప్రయత్నము నది యేమాత్ర మపేక్షింపదు. శబ్దార్థముకాని శబ్దార్థసంయోగముకాని శబ్దవిషయ మేదియేనికాని ప్రయత్నాపేక్షము కాదు.

ప్రసాదగుణము శబ్దగతముగ గూడ కలదు. బంధశైథిల్యము ప్రసాదము. గాఢబంధము లేకపోవుటయె బంధశైథిల్యము, గాఢ

బంధముండుట యోజోగుణము కాగా బంధశైథిల్య మున్నచో ఓజోగుణము లేకపోవుట యగును గాని ప్రసాదగుణముండుట యగునా? ఓజోవిపర్యయాత్మకమగు నిది దోషమెకాని గుణమగునా? యని యాశంకింప వచ్చును. కాని సంప్లవముండును గావున ప్రసాదము గుణమగును. సంప్లవ మనునది మేలనము. ప్రసాదమోజోగుణముతో సంప్లవము కలది కావున గుణమె యగును. ఓజోమిశ్రణము లేని కేవల శైథిల్య మయినచో దోషమగును. గాఢత్వశైథిల్యరూపము లయిన ధర్మములు పరస్పరము విరుద్ధము లయినను కార్యవశమున గలిసి యుండవచ్చును. ఇట్టి సంప్లవము సచేతసుల కనుభవసిద్ధమె. కరుణాత్మకము లయిన ప్రేక్షణీయములందు సుఖదుఃఖములు పరస్పరము విరుద్ధము లయినను సంప్లవముతో నున్నట్లు గాఢత్వశిథిలత్వము లొకచో సంప్లవముతో నుండుట యనుభవసిద్ధమె. కారుణ్యావహము లగు వస్తువులను మనోజ్ఞములగు వస్తువులను యుగపదనుభవమున గుర్తించితి మేని సుఖదుఃఖములు సమసమయ సముత్పన్నము లగుట వలన వాని సంప్లవ మనుభవమున స్వసంవేదనసిద్ధమె యగుచున్నది. అట్లే యోజఃప్రసాదముల సంప్లవముకూడ స్వసంవిత్సంవేదనసిద్ధమె. బంధసంబంధ మిందు కలామాత్రముగ నుండును. పదముల స్ఫుటత లక్షణీయవిభాగత గాఢత్వము శిథిలత్వము సంప్లవము పొందినప్పుడు గాఢత్వ మధిక మగుట శిథిలత్వ మధిక మగుట రెండును సమ మగుటయు ననుభవమున నె తెలియదగి యున్నది.

> అథ స విషయవ్యావృత్తాత్మా యథావిధి సూనవే
> నృపతికకుదం దత్వా యూనే సితాతపవారణం

ఆతడు విషయములనుండి మనసును మరలించుకొని యువకుడయిన కుమారునకు రాజలాంఛనమగు ధవలాతపత్ర మిచ్చి" — అను దీనిలో గాఢత్వశిథిలత్వములకు సామ్యమున్నది. ఈపద్యభాగమున నిరంతరత యున్నది. అది వినా యన్యోన్యాలయము లేదు. అన్యోన్యాప్తిరూపమగు సంధియు లేదు. సముచితమయిన శిథిలత యాస్వాద్యమగును. గుణ మొకటియె యాస్వాద్య మగుననుట సహృదయస్వానుభవసిద్ధము. కావున "వ్యావృత్తాత్మా" వఱకు గాఢతయు

"యథావిధి సూనవే" శిథిలతయు నున్నది. కకుదం దత్వా వర్ణ్యసావర్ణ్య కృత శోభయు కలదు.

### 3. సమత

౮౫౮ నాతిచూర్ణపదైర్యుక్తా న చ వ్యర్థాభిధాయిభిః
దుర్బోధనైశ్చ న కృతా సమత్వాత్సమతా మతా

అతిచూర్ణపదము లుండరాదు. వ్యర్థపదము లుండరాదు. దుర్బోధపదములతో కూడుకొనరాదు. ఇట్టి నియమము కల శబ్దముల సమత్వ మున్నచో సమత యను గుణమగు నని సామాన్యార్థము. చూర్ణపదములు = అసమాసరచనలో నుండునవి. సమతాగుణము చూర్ణపదములతో సాతిశయముగ నుండరాదు. అతిశయమనునది ప్రతియోగిసాపేక్షము. ఏ వస్తువున కా వస్తు వెన్నడు సాతిశయము కాదు. వేరొక వస్తువుసమీపమున నున్నప్పుడే వస్తువు సాతిశయమో నిరతిశయమో నిరూపింపవచ్చును. దీర్ఘసమాసముండుట కాని యత్యంత మసమాసరీతి యుండుట కాని విషమత యగును. సమత విషమతావిపర్యయము. ప్రథమమున నుపక్రాంతమయిన మార్గమును విడనాడకుండుట యని యనినట్లగును. అవైషమ్యము సమతయని భావము. అవైషమ్యమనగా ప్రక్రమాభేదము. సుగమత్వమును ప్రక్రమాభేదమగును. అవైషమ్యముగా నుండుట మార్గాభేదమున నుండుట యగును. ఎట్టి మార్గమునను పక్రమముండునో యట్టిమార్గమున నె నిర్వహణ ముండవలయును. ప్రక్రాంతమార్గమును విడువరాదు. శ్లోకమున గాని ప్రబంధమునగాని మార్గాభేద ముచితము. ఉదా–

గాహంతాం మహిషా నిపానసలిలం శృంగైర్ముహుస్తాడితం
ఛాయాబద్ధకదంబకం మృగకులం రోమంథమభ్యస్యతు
విస్రబ్ధైః క్రియతాం వరాహతతిభిర్ముస్తాక్షతిః పల్వలే
విశ్రాంతిం లభతామిదం చ శిథిలజ్యాబంధమస్మద్ధనుః

దీనిభావ మీ విధముగ గ్రాహ్యము. అడవిదున్నలు తటాకోదకమును కొమ్ములతో పెడగొట్టి ప్రవేశించుగావుత. లేళ్ళు చెట్లనీడలలో గుంపులుగా నుండి నెమరు వేయుగావుత. పందులగుంపు స్వేచ్ఛగా నీటిగుంటలలో తుంగముస్తెలను కొఱుకుగావుత. జ్యాబంధము విడ

దీసిన నా యీ ధనువు విశ్రాంతిని పొందుగావుత. ఈ పద్యమున నవాంతర వాక్యమున రెండు రెండు పదములు మాత్రమె సమసించినవి. సమాసవృత్తి యతిదీర్ఘముగ లేదు. ఈపద్యమిట్లుండుట "నాతిచూర్ణ పదైర్యుక్తా" యను లక్షణమునకు తగినవిధము.

ప్రసీద చండి త్యజ మన్యుమంజసా
జన స్తవాయం పురతః కృతాంజలిః
కిమిత్థ ముత్కంపిత పీవర స్తన
ద్వయోన్నిష త్స్వ స్త విలాస మాస్యతే

ఓ! కోపనా! ప్రసన్నవు కమ్ము! కోపము వెంటనే విడనాడుము. ఈజనుడు నీయెదుట దోసిలిపట్టి యున్నాడు. విలాసమేమియు లేక కుచకంపముతో నేలయుండెదవు? ఈపద్యమున చూర్ణపదములతో నుపక్రమమున్నది. వాక్యాంతర మసమాప్తముగ నుండగనే సుదీర్ఘసమాసము యోజిత మయినది. "గాహంతాం" అను పూర్వ పద్యములో నవాంతరార్థము సమాప్తమయిన పిమ్మటనే యర్థాంతరోపక్రమమునందె "ఛాయాబద్ధకదంబకం" అని సమాసోపక్రమమున్నది. "చైత్యాత్కూపపతనమివ" చైత్యమునుండి బావిలోపడిన విధమున వెంటనే చూర్ణపదము ప్రయోగింపలేదు. "మృగకులం" అని సమస్తద్విపదరచన యున్నది, ఇట్లిందలి సమత శబ్దగుణముగా నున్నది. అర్థమునందును సమత్వ ముండుట యావశ్యకము. ఆ యంశమె "న చ వ్యర్థాభిధాయిభిః" అనుటచే సూచిత మయినది. శబ్దములు నిష్ప్రయోజనార్థము నిరూపించునవి యగునేని గుణగౌరవము కలుగదు. శబ్దార్థము సప్రయోజనముగ నుండదేని యర్థవైమల్యము కలుగదని ప్రసాదనిరూపణమున నిరూపితమె. అయిన నిందలి రీతి యిట్టిది కాదు. ఇందేదో యర్థముండును. సర్వథాయిది నిష్ప్రయోజనము కాదు. ప్రయోజనమున్న నది దుర్బోధమగును. సమత దుర్బోధనపదములతో నుండరాదని యిందలి నియమము. "అభిధేయ తేఽస్మై ఇత్యభిధానం ప్రయోజనం" దేనికై యది నిరూపితమగునో యది యభిధానము. అది ప్రయోజనము. ప్రక్రమాభేద మవైషమ్యము. ప్రక్రమాభేద మనుట ప్రక్రమమునకు భేదాభావము. ప్రక్రమభేదపరి

జ్ఞానమున్ననె ప్రక్రమాభేదపరిజ్ఞానము కలుగును. ప్రక్రమభేదప్రతిపత్తికై ప్రత్యుదాహరణమావశ్యకము.

చ్యుతసుమనసః కుందాః పుష్పోద్గమేష్వలసా ద్రుమాః
మలయమరుతస్సర్పంతీమే వియుక్త ధృతిచ్ఛిదః
అథ చ సవితుశ్శీతోల్లాసం లునంతి మరీచయో
న చ జరఠతామాలంబంతే క్లమోదయదాయినీమ్

ఈపద్యము శిశిరవసంతఋతుసంధిప్రతిపాదనపరము. కుందములు పూలను రాల్చినవి. వృక్షములు పుష్పావిర్భావమున మందశ్రద్ధతో నున్నవి. వియోగిజనధైర్యహారులై యీమలయవాయువులు ప్రసరించు చున్నవి. సూర్యుని శీతోల్లాసమును కిరణములు పోగొట్టుచున్నవి. కాని శ్రమసంపాదక మయిన జరఠత్వము నింత నవలంబించుట లేదు. ఇందు ప్రక్రమభేదమున్నది. ఋతుసంధి వర్ణనప్రక్రమ మారంభమున నుండగా మలయమారుతగతి ప్రక్రమభేదమున నున్నది. మలయమారుతము లసాధారణములు. వసంతైకధర్మములు. శిశిరవసంతసంధిసముచితములు కావు. అయినను మారుతోల్లాసనిబంధనము సర్వథా నిరర్థకము కాదు. విప్రలంభోద్దీపనపరమై యది రమ్యమగును. ప్రక్రమమును స్ఫుటముగా పోషించునది కానందున విషమత కల్గినది. ఈ యుదాహరణమె సమతకు తగినది కావలయు నన్న రెండవపాదమును మార్పవలయును.

"మనసి చ గిరం బధ్నంతీమే
కిరంతి న కోకిలాః

ఈ కోకిలలు మనసులందే కుహూకూతలు దాచినవి. పైకి చిమ్ముట లేదు." అని రెండవపాదమును మార్చినచో ప్రక్రమాభేద రూపమయిన సమత కుదురుకొనును. ప్రక్రమభేదము మార్గభేదము పూర్వపద్యములందును గలదు. "ప్రసీద! చండి!" పద్యములో "ప్రసీద! త్యజ!" యని కర్తృవాచిపదములతో ప్రక్రమముండగా చతుర్థ పాదములో "త్వయా ఆస్యతే" యనుచోట ఆ క్రమము లేదు. అది త్యక్తమయినది. "గాహంతాం మహిషా!" పద్యములో "మహిషా గాహంతాం, మృగకులమభ్యస్యతు, ధనుర్లభతాం" అని పూర్వో

త్తరములందుండగా మూడవ పాదమున "వరాహతతిభిః క్రియతాం" అని యుండుట ప్రక్రమభేదమె కర్తృవాచిపదమధ్యమున కర్మవాచిపద ప్రవేశము మార్గాభేదము సూచింపదు. అట్లాయూ విపర్యయము లున్నను చమత్కారమలు ప్తముగా నున్నందున నవి రమణీయములె.

అన్య లక్షణపాఠ మిట్లున్నది.

అన్యోన్యసదృశా యత్ర తథాహ్యాన్యోన్యభూషణాః
అలంకారా గుణాశ్చైవ సమాః స్యుస్సమతా మతాః

కావ్యమునందున్న గుణము లలంకారము లన్యోన్యసదృశము లన్యోన్యభూషణములునై సమముగానున్నచో సమతాగుణసమ్మతము లగును. అలంకారమున కలంకారము గుణమునకు గుణము గుణమున కలంకారము అలంకారమునకు గుణము సముచితసంబంధవిశేషము కలదై యుండుట యీ సమతయగును.

౮. సమాధి

౮౫౯. అభియుక్తైర్విశేషస్తు యోఽర్థస్యేహోపలక్ష్యతే
తేన చార్థేన నంపన్నః సమాధిః పరికీర్తితః

అభియుక్తు లర్థమునకు విశేష ముపలక్షింతురేని యది సమాధి గుణ మగును. సమాధిపదవ్యుత్పత్త్యర్థముతో గూడినదియు సమాధి యగును. ప్రతిభాతిశయము కల సహృదయు లభియుక్తియుక్తులై కావ్యమున నవభాసించునర్థమున కొక యపూర్వవిశేషమును సోల్లిఖితముగ సంభావింతురు. అది యుపపత్తి యుక్తముగ నుండును. సహృదయుల సమాహితమనస్సంపాద్యమగు నర్థవిశేష ముండుటచే నిది సమాధి యయినది. కవియు సమాహితమనస్కుడై యా యర్థోల్లేఖము కావించును. కవికి సంబంధించిన తత్పూర్వకోల్లేఖము సర్వమిచట గుర్తింపదగి యున్నది. సమాధిసంప్రధారణమున కిదియు సంభావనీయము. అర్థదృష్టి సమాధి. అర్థదర్శనమె యర్థదృష్టి. సమాధి యనునది యవధానము. దర్శనము జ్ఞానవిశేషము. అయినను సమాధి కారణ మగుటచే నర్థదర్శనము సమాధి యయినది. అవహితచిత్త మర్థదర్శన మొనరింపగలదు.

ఆశ్వాపేహి! మమ శీధు భాజనా
ద్యావ దగ్రదశనై ర్న దశ్యసే
చంద్ర! మద్దశన మండలాంకితః
ఖం న యాస్యసిహి రోహిణీభయాత్

చంద్రా! నా మునిపన్నులతో కొఱుకక పూర్వమె నా మద్య పాత్రనుండి శీఘ్రముగా తొలగిపొమ్ము! నా దశనాంకితుడ వయినచో రోహిణీభయమున నీ వాకాశమునకు పోజాలవు సుమా! కవి కవితలలో నుండునట్టి యర్థము రెండువిధములు. ఒకటి అయోని. మరియొకటి ఛాయాయోని. అయోని యనుట కారణమేమియు నాయర్థమున నుండదని భావము. కారణమేమియు లేకుండగనె కార్యముత్పన్న మగునా? కారణము లేదనుట యన్యకారణము లేదనుట. ఇది యవధాన మాత్ర కారణముగ నుండును. కవిత్వబీజమయిన ప్రతిభో న్మేషము నుద్ద్యోతింపజేయు నవధానమె యిందు కారణము. సారస్వత వ్రతుడగు వానికి తదేకజ్ఞానమె విషయముగా నుండును. ఇతర మనేక మేమియు నందు విషయము కాదు. అభియుక్తి యుక్తుడగు వానికి సర్వార్థ మనిమిత్తముగనె యవభాసించును. "ఆశ్వాపేహి" పద్యము లోని యర్థ మయోని. పూర్వభావి కవి నిరూపించిన యా యర్థ మట్టిది. ఆ యర్థవిశేష మభియుక్తులకు గ్రాహ్యము. రెండవ యర్థము ఛాయా యోని. ఈ ఛాయాయోని యగు నర్థము వ్యక్తమని సూక్ష్మమని ద్వివిధము. సూక్ష్మార్థమును భావ్యమని వాసనీయమని ద్వివిధము. ఇట్టీ భేదప్రపంచ మంతయు కవిహృదయగత ప్రతిభాతిశయ తారతమ్యము వలన గలుగును. ప్రతిభాగత విశేషమున నిందును విశేష ముదయించును. కావున నిది యనవస్థితమై యుండును. భావుకుల భావనాగమ్యము భావ్యము. భావుకుల యవధాన మాత్రముననె దాని విమర్శించి గుర్తింపవలెను. వాసనీయార్థము సహృదయుల సద్వ్యాపార సముల్లసిత సంస్కార సంపన్న మయిన యవధానాతిశయమున నభిగమ్యము. ఇట్లు వ్యక్తభావ్యవాస్యము లయిన యర్థముల విశేషాను సంధానము సమాధిగుణమునకు స్వరూప సంపాదన మొనరింప గలదు.

సమాధి శబ్దగుణము నగును. ఈ యర్థభావమును కారికలోని యుత్తరార్థము చెప్పును. సమాధిశబ్దార్థముతో సంపన్నమగునదిసమాధి యని పరికీర్తితము. సమాధిశబ్దార్థము పరిహారరూపము. పరిహారలక్షణా ర్థమున పరికీర్తితమగునది సమాధి. "పరితః సమంతాదాక్రాంత్యా ఉచ్చారణేసంపన్నః" అంతటవ్యాపించి యుచ్చారణమున సంపన్నమయి నచో సమాధి యగును. ఆక్రాంతితో నుచ్చారణముండగా నారోహావ రోహక్రమ ముండును. గతితుల్యమయిన విధానమేర్పడును. కాగా ఆరో హావరోహక్రమము సమాధియని యనినట్లయినది. ఆరోహావరోహముల క్రమమారోహావరోహక్రమము. ఇది సమాధి. ఇది పరిహారలక్షణము. ప్రాణవాయుగతి యుచ్చరూపముగా నూర్ధ్వగమనమున నుండు స్థితి యారోహ మనదగును. తద్విపర్యయమయిన యపక్రమణ మవ రోహము. ప్రాణవాయువున కూర్ధ్వగతి స్థానవశమున గలుగును. కరణవశమున గలుగును. బాహ్యప్రయత్నవశమున గలుగును. ఆభ్యం తరప్రయత్నవశమునను గల్గును. అవరోహము ప్రవర్తించునపుడు ప్రవృత్తారోహమునకు పరిత్యాగరూపమయిన పరిహారము కలుగును. ఆరోహము ప్రవర్తించునపుడు ప్రవృత్తావరోహమునకు పరిత్యాగరూప మయిన పరిహారము కలుగును. ఆరోహసమయము నందవరోహ ముండదు. అవరోహసమయము నందారోహముండదు. ఆరోహావ రోహములు విరుద్ధములు. వానికి యౌగపద్యము కుదురదు. దీర్ఘాది గుర్వక్షరప్రాచుర్యమున్నచో నారోహము. లఘ్వాదిశిథిలప్రాయాక్ష రము లున్నచో నవరోహము కలుగును. కావున సమాధిగుణము ఆరోహాపూర్వకావరోహమని, అవరోహాపూర్వకారోహమని రెండు విధముల నగును.

నిరానందః కాందే మధుని పరిభుక్తోజ్ఝితరసే
న సాలే సాలంబో లవమపి లవంగే న రమతే
ప్రియంగౌ నాసంగం రచయతి న చూతేఽపిచరతి
స్మరంల్లక్ష్మీ లీలాకమల మధుపానం మధుకరః

శ్రీలక్ష్మీదేవీ లీలాకమలమునందలి మధుపానము స్మరించుచు మధుకరము కుందమధు వనుభవించినదే కావున నిరానందముగ

నున్నది. సాలమున సాలంబముగ లేదు. లవంగమున అవమేని రమించుట లేదు. ప్రియంగుమధువుపై సంగము వహించుట లేదు. చూతమునను చరించుట లేదు. ఈ పద్యమునం దారోహపూర్వక మయిన యవరోహమున్నది. "నిరానందః కాందే గుర్వక్షర బాహుల్యము వలన నారోహము "మధుని పరి" లఘ్వక్షర ప్రాచుర్యము వలన నవరోహము కలదు. ఇంక నీ విశేషమవధారణీయము. "నిరానందః కాందే" స్థలమున మొదట దంత్యమగు నకారమునకు పరముగా మూర్ధన్యమగు రేఫ ముచ్చస్థానస్థితమై యున్నది. రేఫానంతరమున దంత్యమున్నను తత్పూర్వము నిరంతరప్రయత్నాధిక్యము కల ద్వివార ప్రయత్నముతో కూడుకొనిన వివృతితమ మయిన 'ఆ' కారముండుట, పదాంతమున దంత్య 'ద' కారము జిహ్వామూలీయఘటితమై యుచ్చత్వమున నుండుట, ఆరోహణమును స్ఫుట మొనరించుచున్నది. మధ్యలో 'న' శబ్ద మవరోహణమున నున్నట్లున్న నది యున్నట్లు కాదు. "సంపన్నమప్యసంపన్నకల్పం." ఆరోహణసౌకర్యమునకే యది యట్లున్నది. కాకున్న పదమధ్యమున దానికేమి విశ్రాంతి యున్నది? అది యట్లు లేకున్నచో సమున్నతసంకలనము కల సోపానముల యధిరోహము వలని ఖేదము కలుగును. "నిరాస్వాద్యః కాందే" యనునప్పటి యనాస్వాద్యత యిచట లేదు. "నిరానన్దః" స్థలమున మహాప్రాణము జిహ్వామూలీయము ద్వివార ప్రయుక్తమయిన శ్వాసానుప్రదానమును సముచితారోహము సంపాదించును. "కాందే" స్థలమున "ఔ" కారము "నిరానన్ద" లోని 'ఆ' కారముకన్నను రూపవివృతమై యారోహణ మిచ్చును. 'కాన్దే' 'ఔ' కారముకన్నను 'న' కారమారోహానుకూల మయినది. అనంతరము "మధుని" స్థలమున 'అ' కారము సంవృత మగుట యవరోహమున్నది. అచటనే 'ఇ' కారము 'ఉ' కారము కించిద్వివృతములె కావున యవరోహము స్పష్టము. మధ్యలో ఔకార మవరోహ సౌకర్యమున కుపయోగి. దూరారోహమునుండి దూరావరోహణము చూలిక కుండుట కూపపతన కల్పమె కావచ్చును. కేవలమిట్టి కూప పతనము శ్రుతిసుభగము కాదు. "కుర్వాణః పరమం మహచ్చ మనసః" యను రచనలో ణ కారా

కారోపధ్మానీయములకు పరముగా వెంటనే సంవృతమయిన 'అ' కారమున పాతమున్నది. ఇది సుఖదాయి కాదు. అవరోహపూర్వ కారోహ మీా విధముగ నుండును. "నరాః శీలభ్రష్టాః వ్యసన ఇవ మజ్జంతి తరవః" వ్యసనములందు మునిగిన శీలభ్రష్టు లయిన మానవుల వలె వృక్షములు ప్రవాహమున మునిగిపోవుచున్నవి. దీనిలో "నరాః" శైథిల్య మున్నందున నవరోహము, "శీలభ్రష్టాః" గుర్వక్షర ప్రచుర మయినందున నారోహము కలదు. ఆరోహావరోహ క్రమ పదమున కన్య్ లన్యవిధమున నర్థము చెప్పిరి. "ఆరోహస్య క్రమః, అవరోహస్య క్రమః ఆరోహావరోహ క్రమః" ఆరోహక్రమము అవరోహక్రమము క్రమముగా నుండుట సమాధి యని కొందరి భావము. "నివేశః స్వః సింధోస్తుహినగిరివీథీషు జయతి" స్వర్గంగా సన్నివేశము హిమవద్వీథు లలో రమ్యముగ నున్నది. ఇందు "నివేశః స్వఃసింధోః" అనుచోట నిశ్రేణికాక్రమమున నారోహమున్నది. "తుహినగిరి"లో నవరోహ మున్నది. ఇందు ఇ కారము వివృతములయిన ఉ కారాదులనుండి సంవృతాకారద్వయమున పాతము కలదగుటచే సముచిత విశ్రాంతి స్థానము లేనందున నారోహము లేదు. తగిన యవరోహ మున్నది. నిశ్రేణికారోహావరోహన్యాయమున క్రమముగా నారోహణము క్రమముగా నవరోహణ ముండుట సమ్మతము. కానినిది నిర్గలితార్థము. స్వభావ సహజమయిన ప్రతిభాదర్శనమున ననువిద్ధ మయిన సరస్వతి స్వరసప్రసరము కలదై స్వరసంభార ప్రభావమున నారోహావరోహ క్రమ మనుసరించును. అంధుడు ప్రతిభాదృష్టి శూన్యుడయినందున పదన్యాస మొనరింప జాలనట్లు ఆరోహాదికము గుర్తింప నేరడు.

ఇంతింతగా నిరూపింపగా పాఠసౌకర్యమె కలుగును గాని శ్రోత కేమి విశేషము కల్గునని యొకడు తలచ వచ్చును. ఆతడు "అనభిజ్ఞో దేవానాం ప్రియః." కర్కశ శర్కరానికరకంటకిత మయిన దుస్సంచర దేశమున సంచరించు జనుని చూచు సుకుమారహృదయ యయిన ప్రమద తదాత్మానుప్రవేశమున వలె నత్యంతము ఖేదమనుభవించును. అట్లె ప్రహారపాతాదులందును విషాద మనుభవించును. అట్లె సహృద యునకె యామార్గము రుచిర మగును. వైమల్యాపరపర్యాయ

మయిన సుకుమారత కల సహృదయుని హృదయమునకు కవిహృదయ తాదాత్మ్యప్రాప్తియోగ్యత కలుగుచో నుత్కర్ష సిద్ధమగును. అట్టి వానికే యీ మార్గ మిష్టమగును. కావుననే ధ్వన్యాలోకమున నిట్లు నిరూపితమయినది.

"శబ్దార్థశాసనజ్ఞానమాత్రేణైవ న వేద్యతే
వేద్యతే స హి కావ్యార్థతత్త్వజ్ఞైరేవ కేవలమ్"

పరమ రమణీయమయిన ధ్వన్యమానార్థము శబ్దార్థ శాసన జ్ఞానమాత్రమున గోచరముకాదు. కేవలమది కావ్యార్థ తత్త్వజ్ఞులకు మాత్రమె గోచరించును. విశిష్టసహృదయ వేద్యమగునది సర్వసాధారణ సుజ్ఞేయము కాదు. అభిధానకోశము పఠించిన వారలకు సుప్తిఙ్విభక్తులను గుర్తించిన విద్వాంసులకును కావ్య తత్త్వావబోధము కలుగదు. కావున వర్ణోచ్చారణ ప్రయత్నమున పరుష కఠిన పఠన స్పర్శజనిత మయిన ఖేద ముచ్చారణ మొనరించు వానికి గలుగునట్లు శ్రోతకు నది పారుష్య మాపాదించును, "సీరధ్వ్రిధ్వవధూనిబంధ్యనుగత ప్రాణైకబన్ధక్రమః" అనుటలో కవిశ్రోతలకు పారుష్యమె భాసించును. వర్ణగతము లయిన లాలిత్యపారుష్యాదులను గీతవాద్యరీత్యనుసారమున నియతముగ గుర్తింప వచ్చును. ధ్వనికారుడును– "తేన వర్ణా రస చ్యుతః–" అని నిరూపించెను. నియతకారణమున వర్ణములు రసప్రసర మొనరింప జాలవని, నియతకారణమున వర్ణములు రసచ్యుతి నాపాదించునవి యగునని తద్భావము. కొన్ని వర్ణములు కొన్ని రసములను ప్రకాశింప జేయగలవు. ఆ కొన్ని వర్ణములే తద్భిన్న రసములను పరిచ్యుతము లొనరింప గలవు. స్వాభావసహజముగ కొన్ని వర్ణములు సంతాపము కలుగ జేయునవిగ నుండును. కొన్ని వర్ణములు ఖేదించునవిగ నుండును. పరుషవృత్తి పూర్వకము లయిన రేఫ కకారాదు లట్టివి. కొన్ని వర్ణములు స్వాభావసముచితముగ నాప్యాయన మొనరించునవిగ నిర్వాపణ మొనరించునవిగ పరమాహ్లాద మాపాదించునవిగ నుండును. అట్టి వన్నియు నుపనాగరికోచితములు. "లోకగోచర ఏవాయమర్థః స్వసంవేద్యోఽపి" ఈ యర్థము లోక గోచరము స్వసంవేద్యమును. కావున నధికముగా విస్తరించుట లేదు. "ఆస్తాం తావత్."

పాఠాంతర లక్షణ మీా విధముగ నున్నది.

ఉపమాద్యుపదిష్టానామర్థానాం యత్నతస్తథా
ప్రాప్తానాం చాపి సంక్షేపాత్సమాధిర్నిర్ణయో యతః

ఉపమాద్యలంకారములలో సముపదిష్టములయిన యర్థములకు ప్రయత్నప్రాప్తములయిన యర్థములకును సంక్షేపముగా నిర్ణయనుుండుట సమాధి యను గుణ మగును.

౫. మాధుర్యము

౮౬౦. బహుశోయచ్ఛృతం వాక్య ముక్తంవాపి పునః పునః
నోద్వేజయతి యస్మాద్ధి తన్మాధుర్య మితిస్మృతం

బహుపర్యాయములు వినినను—"పునః పునః" పలికినను భావుకుల కుద్వేగము కలుగ జేయని వాక్యమున్నచో మాధుర్యమను గుణ మగును. ఒక్కొక వాక్య మొక్కసారి వినినను సంశయాస్పదమగును. విపర్యయాస్పదమేని యగును. అట్లు కాకున్నచో మాధుర్యమగును. దీర్ఘసమాసమున్న నట్టి సంశయ విపర్యయము లవశ్యము కలుగును. అవిలేకున్న నే మాధుర్యము శబ్దగుణమగును. పద్యాబంధము పృధక్పదములతో నుండుట మాధుర్యము. సమాసదైర్ఘ్యముండ రాదనుట దీని భావము. "గాహంతాం మహిషా నిపాన సలిలం" ఉదాహరణము కాగలదు. ఇందు దీర్ఘసమాసములు లేవు. అల్పసమాసము లుండుట నిషిద్ధము కాదు. సమస్త ద్విపద రచన సంశయ విపర్యయాస్పదము కాదు. మాధుర్యమర్థగుణము నగును. ఉక్తివైచిత్ర్యము మాధుర్యము. వర్ణ్యమానార్థమునకు ప్రకర్ష నిరూపింపవలసియున్నపుడు భంగ్యంతరోక్తి యుక్తి వైచిత్ర్యమగును. ఒకేయర్థము ననేకపర్యాయములు నిరూపించినను సముచితావగాహనమున వైరస్యము కలుగ జేయదు. అది వచన వైచిత్ర్యాత్మకమయిన మాధుర్యమను నర్థగుణము. అదే యర్థము వచనాంతరాభిధేయమగుచో విచిత్రముగ నుండును.

రసవదమృతం కః సందేహో మధూన్యపి నాన్యథా
మధురమధికిం? చూతస్యాపి ప్రసన్నరసం ఫలం
సకృదపి పునర్మధ్యస్థస్సన్ రసాంతరవిజ్జనో
వదతు యదిహాన్యత్స్వాదుస్యాత్ప్రియాదశనచ్ఛదాత్

అమృతము రససహితమె. సందేహ మేమి? తేనెలు నట్టివె. ప్రసన్నరసము కల మామిడి పండుకూడ మధురమె. కాని రసాంతర

ములను తెలిసిన జను డోకపర్యాయ మేని మధ్యస్థుడై పలుకవలెను. ప్రియాధరముకన్న స్వాదువగునది యేదియేని కలదా? రసజ్ఞుడు పక్ష పాతము లేనివాడె యగునేని స్వాదువగునది యితరము కలదని యన నే యనడు. అధరమాధుర్యము నానా విధోపమానాతిశాయి యని చెప్ప దలచి భంగ్యంతరముగా జెప్పుటవలన మాధుర్యము సంగత మగును. అమృతము రసవత్తనుట యనుటయె సందేహమేమి? అది రసవత్తే యగును." అని యనుట విచిత్రోక్తి. పరి నిశ్చయము కల స్థైర్యము నా విచిత్రోక్తి నిరూపించును. అట్లది నిశ్చయీ కృత మయినది. "నాన్యథా" వచనమున గూడ విషయనిరాకరణ సంభావనా నిరాస మొనరించి నిశ్చయ స్థైర్యమె విచిత్రీకృత మయినది కావున నీయర్థము మధురము.

### ౬. ఓ జ స్సు

> ౦౮౬౧ సమానవద్భిర్బహుభిర్విచిత్రైశ్చ పదైర్యుతం
> సానురాగైరుదారైశ్చ తదోజః పరికీర్త్యతే

సుదీర్ఘములగు సమాసములతో చిత్రవిచిత్రములగు పదములతో ఉదారసానురాగ విశేషములతో నుండుట నోజోగుణమందురు. ఏక సమాస సంజ్ఞాయుక్తములయిన పదములతో నుండుటయు విచిత్రము లగు యమకములు కల పదములతో నుండుటయు నోజోబంధమగును.

> మన్థాయస్తార్ణవాంభఃప్లుతికుహరవలన్మందర ధ్వానధీరః
> కోణాఘాతేషు గర్జత్ప్రలయ ఘనఘటాన్యోన్యసంఘట్టచండః
> కృష్ణాక్రోధాగ్రదూతః కురుకుల నిధనోత్పాతనిర్ఘాతవాతః
> కేనాస్మత్సింహనాద ప్రతిరసిత నభోదుందుభిస్తాడితో౽సౌ॥

మథనసమయమున సుళ్ళు తిరిగి పైకెగురు సాగరజలములు మందరపర్వత కుహరములలో జొరగా వెలువడు ధ్వనివలె ధీరము, వాద్యములు మ్రోగగా ప్రలయసమయమున గర్జించు మేఘసమూహ ముల సంఘట్టము వలె ప్రచండము, ద్రౌపదీక్రోధాగ్ర దూతరూపము, కురుకుల వినాశమున కుత్పాతవాతము నై నా సింహనాద ప్రతిధ్వనిగా నీనభోదుందుభి నెవరు మ్రోగించిరి?" దీనిలో దీర్ఘ సమాస సంబంధము స్పష్టము. ఉదారసానురాగ పదములతో నుండుట యిట్లు పరి గ్రాహ్యము. ఎచటనేని వర్ణము వర్ణాంతరము నపేక్షించునేని సాను

రాగత్వముండును. ఇట్లుండుటయె బంధగాఢత. పదరచన బంధము. పదరచనగాఢముగా నుండుట యనగా కనకశిలాకావయవఘటనము వలె నిబిడముగానుండుట యనిభావము. రచన నిబిడముగా నుండుట కీ చెప్పునవి హేతువులు. అక్షరములు సంయుక్తములై యుండుట, వర్గమునందలి ప్రథమ ద్వితీయములు తృతీయచతుర్థములును నిరంతరము రేఫశిరస్కములై ప్రథమవర్ణములతో తృతీయవర్ణములతో సంయోగము కలవగును. విసర్జనీయ జిహ్వామూలీయోపధ్మానీయములుండుట, గుర్వక్షరములు పాదాంతము లందుండుట, సమాసములుండుట, మొదలగు నవి యన్నియు తరతమ భావమున హేతువు లగును. "విలులిత మకరన్దా మంజరీర్నర్తయంతి" తేనెలు జాలువారు గుత్తులను నర్తింపజేయుచున్నారు. అను నీ వాక్యమున 'ర' శబ్దము గురువగుటకై 'న్ద' శబ్దము నపేక్షించును. 'న' శబ్దము 'య' శబ్దమును స్వగురుత్వమునకై ప్రక్కనున్న శబ్దము నపేక్షిందుచున్నవి. తుదినున్న 'తి' శబ్దము స్వవిశ్రాంతిజనిత కాలోపచయలభ్యమయిన గురుత్వము కలదియై పూర్వవర్ణముల వలె స్వగురుత్వమున కితరవర్ణము నాశ్రయించుట లేదు. కాని వెంటనే రెండవ పాదపాఠము నపేక్షించును. ఇట్లుండుటయె బంధగాఢత. ఇదియె నిబిడావయవత "విలులిత మధుధారా మంజరీర్లోలయంతః" అని పాఠము మార్చినచో ప్రత్యుదాహరణమగును, ఇందు 'ధా' శబ్దము 'లో' శబ్దము స్వగురుత్వమునకు పరవర్ణము నాశ్రయింప నక్కఱలేదు. కావున పదములు సానురాగములుకావు.

ఓజస్సర్థగుణముగ గూడ నున్నది. అభిధేయార్థమునకు ప్రౌఢత్వముండుట ఓజస్సు. ప్రౌఢత్వ మనేకవిధములనుండును. పదార్థమున వాక్యరచన మొకవిధము. ఒకపదముచే జెప్పదగిన యర్థమును నిరూపించుటకు వాక్యమును ప్రయోగించుట యొకవిధమగు ప్రౌఢి. ఒకటియే వస్తువుదారములగు బహుపదములచే నిరూపితమగుట విస్తారాత్మకమగు నోజస్సు.

అధనయన సముత్థం జ్యోతిరత్రేరివద్యౌః
సుర సరిదివ తేజో వహ్ని నిష్ఠ్యూత మైశమ్

నరపతి కులభూత్యై గర్భ మాధత్త రాజ్ఞీ
గురుభిరభినివిష్టం లోకపాలానుభావైః॥

ఆకాశమత్రినేత్ర సముత్పన్నమయిన జ్యోతివలె, గంగానది యగ్నివిడనాడిన యీశ్వర తేజమునువలె రాజకులవిభూతికై సుదక్షిణా దేవి మహనీయములగు లోకపాలానుభావములతో గూడిన గర్భమును ధరించెను. ఇందు చంద్రుడని చెప్పుటకు "నయనసముత్థంజ్యోతిరత్రేః" యనువాక్య ముపయుక్తమయినది. ఇట్లే వాక్యార్థమును జెప్పుటకు పదాభిధానమోజోగుణమగును. సంక్షేపయుక్తములయిన పదము లర్థవిశేషమర్పింపగలవి కాగానట్లు సంక్షేపముగా నిరూపించుట యోజస్సు.

తే హిమాలయ మామన్త్ర్య పునః ప్రేక్ష్య చ శూలినం
సిద్ధంచాస్మై నివేద్యార్థం తద్విసృష్టాః ఖముద్యయుః

ఆ సప్తఋషులు హిమవాను నెచ్చరించి మఱల శివుని జూచి సిద్ధార్థమాతనికి నివేదించి యాతని వీడ్కోలు పొంది యాకాశము చేరిరి. ఇందు బహునివేద్యము సంక్షిప్తముగా నిరూపిత మయినది. ఓజోగుణ పాఠాంతర మిట్లున్నది.

అవగీతోఽపి హీనోఽపి స్యాదుదాత్తావభాసకః
యత్రశబ్దార్థ సంపత్త్యా తదోజః పరికీర్తితమ్

నింద్యమయినను హీనమయినను శబ్దార్థ సంపత్తిచే నుదాత్తాభాసకమగునేని యోజస్సగును.

౭. సౌకుమార్యము.

౯౬౨. సుఖప్రయోజ్యైర్యచ్ఛబ్దైర్యుక్తం సుశ్లిష్ట సంధిభిః
సుకుమారార్థ సంయుక్తం సౌకుమార్యంతదుచ్యతే

సుఖ ప్రయోజ్యములు సుశ్లిష్టసంధులు నయిన శబ్దములచే నిరూపితమగునది సుకుమారార్థ సంయుక్తము కాగా సౌకుమార్య గుణమగును. బంధ మజరఠముగా నుండుట సౌకుమార్యము. అజరఠత్వము=అపారుష్యము కోమలత్వము శ్రుతిసుఖత్వమని భావము. ఒక్కొకచో పదమునకు స్వయంపారుష్య ముండును. ద్రాఘా, అజడ్ఢో, నిర్ద్వైతం సద్వృత్త్యా వ్యవసితిః" ఒకచో సంధికృతముగా పారుష్యము కలుగును. "దర్వ్యాఖ్యోర్వ్యీ" తదుభయ రహితత్వము సౌకుమార్యము

శబ్దగుణము. "గాహంతాం మహిషాః" ఇత్యాదిక ముదాహరణము. ఇందు వక్తవ్య మంతేయు సమాధిలక్షణమున నిర్ణీత మయినది. అపా రుష్యము సౌకుమార్య మనుట యర్థగుణము. పరుషార్థము వర్ణనీయ మయినను సుకుమారార్థమున గలుగు సంపత్తి యర్థగుణము. ఇల్లి యమంగలాతంకదాయ్యర్థము చెప్పవలసి యుండగా నపరుషముగా నిరూపించుటయు సౌకుమార్యము. ఏకాకి యగు వానిని దేవతా సహాయుడని, మృతుని యశః శేషుడని, జడుని దేవానాం ప్రియుడని యనుట సౌకుమార్య మగును.

ు. అర్థవ్యక్తి

ుౖ౩ సుప్రసిద్ధాభిధానాతు లోకకర్మాద్యవస్థితా
యాక్రియా క్రియతేకావ్యే సార్థవ్యక్తిః ప్రకీర్త్యతే

కావ్యక్రియలో సుప్రసిద్ధమగు అభిధావ్యాపారమున్నచో ఝటి త్యర్థ ప్రతిపత్తి కలుగును గావున నట్లుండుట యర్థవ్యక్తియగు శబ్ద గుణము. "గాహన్తాం మహిషా" యనునది యుదాహరణము. దూర దూరార్థప్రతిపత్తి కలుగ జేయునవి ప్రత్యుదాహరణములు. లోకకర్మ వ్యవస్థితముగా నుండునది యర్థగుణము. కిరాతాదుల స్వభావనిదర్శన ముగానుండు లోకప్రసిద్ధార్థనిబంధన మర్థవ్యక్తియగును, దీనినే వస్తు స్వభావస్ఫుటత్వ మనవచ్చును. ఆయా పదార్థముల స్వభావము ప్రస్ఫుటముగ నుండునట్లు నిరూపించుట. నానావిశేషములచే వర్ణిం పగా పురఃప్రతిభాసమాన మగునట్లర్థము స్ఫుటమగుట.

పృష్ఠేషు శంఖశకలచ్ఛవిషు చ్ఛదానాం
రాజీభి రంకితమలక్తక లోహినీభిః
గోరోచనా హరిత బభ్రు బహిఃపలాశ
మామోదతే కుముదమంభసి పల్వలస్య

శంఖశకలకాంతి కల కుముదపత్ర పృష్ఠములందు లత్తుకవలె నెఱ్ఱనయిన పంక్తులు కలవు. పలాశము గోరోచనాహారిత బభ్రువై యున్నది. ఇట్టి కుముదము పల్వల జలములో పరిమళము ప్రకటము చేయుచున్నది. దీనిలో భావస్వభావము స్ఫుటముగా నున్నది. పాఠా న్తరార్థగుణ మిట్లున్నది.

యస్యార్థానుప్రవేశేన మనసా పరికల్ప్యతే
అనన్తరర్థ ప్రత్యాగస్తు సార్థవ్యక్తి రుదాహృతా

ఏ యర్థాను ప్రవేశమున నర్థాంతర ప్రయోగము మనఃపరికల్పితమగునో యది యర్థవ్యక్తి యను గుణమగును.

౯. ఉదారత

౧౬౪ దివ్యభావపరీతం యచ్ఛృంగారాద్భుతయోజితం
అనేకభావసంయుక్త ముదారత్వం ప్రకీర్తితం॥

దివ్యభావపరీతము శృంగారాద్భుతయోజితము నానాభావసంయుక్త మగునది యుదారత యగునని సామాన్యార్థము. మానుషోచిత మయినను దివ్యభావోచితముగా నిరూపితమయినను, కరుణాదియుక్తమయినను శృంగారసముచితముగా నిరూపిత మయినను, విస్మయస్థాన మయిన నద్భుతయుక్తముగా వర్ణిత మయినచో తద్గతములయిన విభావానుభావాదులచే నా యర్థ ముద్ద్యోతిత మయినచో నౌదార్యమను నర్థగుణమగును. అగ్రామ్యత్వ ముదారత యని యన్యులనిరి. గ్రామ్యముగా పలుకవలసిన ప్రసంగమున నగ్రామ్యత్వ ముదారత యయినది. "ఓసీ! కన్యా! కామించు కాంతుడ నయిన నన్ను కామింపుము" అని గ్రామ్యార్థము వక్తవ్యముకాగా సముచితముగా ప్రతిపాదించుట యౌదార్యము. గ్రామ్యమగునది యథాస్థితముగ నుండును. రచనావిశేష మేమియు నందాయోజితము కాదు. అది ప్రసిద్ధిమాత్ర ప్రమాణముగనె యుండును, తదన్య మగ్రామ్యము.

త్వమేవంసౌందర్యా స చ రుచిరతాయాః పరిచితః
కలానాం సీమానం పరమిహ యువామేవ భజతః
అయి. 'ద్వంద్వం దిష్ట్యా తదితి సుభగే.' సంవదతి వా
మతః శేషం చేత్స్యాజ్జితమిహ తదానీం గుణితయా

నీవిట్లు వర్ణనాపథ సముత్తీర్ణ యగుటచే ననుభూయమాన సౌందర్యము కలదానవు. ఆ మాధవుడును సౌందర్యవిషయమున సుపరిచితుడు. నీవు నాత డిద్దరె కలల యవధిని పొంది యున్నారు. ఓసీ! సుభగా! మాలతీ! మీ యిద్దర కీ ద్వంద్వము భాగ్యవశమున సంగతమయినది. ఇక మిగిలిన పాణిగ్రహణరూపమయిన మంగలమహస్సు జరిగినచో గుణవత్త్వము జయించినట్లె యగును. మీ గుణసంపద విశ్వాతిశాయిని యగును. దీనిలో మొదటనీవు నాతడని వేరుగా చెప్పి మీరని మిశ్రీకరణమున చెప్పుట పిమ్మట ద్వంద్వ మనుట ఇక

శేషమని యనుట వివక్షితార్థమును వ్యంగ్య మొనరించుచున్నది. ఔచిత్యయుతమయిన క్రమమున ఫలపర్యవసాయిత్వము స్పష్టమయినది. విపర్యయ మిట్లుండును.

స్వపితి యావదయం నికటే జనః
స్వపిమి తావదహం కిమపైతి తే
ఇతి నిగద్య శనైరనుమేఖలం
మమ కరం స్వకరేణ రురోధ సా

ఈ దగ్గరలో జనము నిద్రపోవు వఱకు నేను నిద్రింతును. నీకేమి లోటు. అని పలికి మేఖల దగ్గరనున్న నా కరమును మెల్లగా తన చేతితో నడ్డుపఱచినది. నిద్రపోవు వఱకు నిద్రింతును. ఇంతమాత్రపు కాల విలంబమున నీ కేమిహాని? ఇట్లనుటలో గ్రామ్యత్వము స్పష్టము గనె యున్నది.

అద్భుతకృతార్థ మనేకభావ సంయుక్త మగుట శబ్దగుణ లక్షణము. ఏకభాషా గతముగ గూడ నిది యనేకవిధము లగును. ఒక పదము చిత్రముగా నుండుట అనేక పదములు చిత్రముగా నుండుట, అక్షర సంఖ్యా వైచిత్ర్యము, సంధానసాజాత్యము, పిండీబంధ నృత్త సాజాత్యముతో నుండుట భరత విధిలో నిర్ణయించిన విధముగా గుల్మ జాత శృంఖలికాది సంబంధములతో నుండుట యీ యుదారతకు స్వరూప విశేషము సంపాదించును. వికటత్వ ముదారత యని కొందరుపలక్షించిరి. పదములు నృత్య మొనరించు నట్లున్నవని జనులు వర్ణ భావన మొనరింతురు. ఇదియే పదముల నరీనృత్యమానత్వ మనదగును. లీలాయమానత యుండుటయు నిదియే యగును. క్రమశః వర్ధమానాక్షర పదత్వము, పదములోని ప్రథమాద్యక్షరములకు పదాంతరమందలి ప్రథమాద్యక్షరములతో సాదృశ్య ముండుట వికటత్వమునకు రూప సంపాదకములు.

స్వచరణ వినివిష్టైర్నూపురైర్నర్తకీనాం
ఝటితి రణితమాసీత్తత్ర చిత్రం కలం చ

నర్తకీమణుల పాదము లందున్న నూపురములచే చిత్రకలధ్వని వెంటనె వెలువడినది. ఇచట నున్న రెండుపాదములలో ప్రథమపాద మున వరుసగా ఏకాక్షరపదము త్ర్యక్షరపదము చతురక్షరపదము నని

పదములు విచిత్రముగ నున్నవి. రేఫాక్షరము రెండవపదము నాక్ర మించుటవలన వ్యాప్తి యున్నది. "ఆశీ త్తత్ర చిత్రం" తకారముల సంధానము వలన సంధిసాజాత్యమున్నది. తకారసకారములకు సంస్థాన నైకట్యమును కలదు. ఇట్లిందుదారతకలదు. దీని విపర్యయము.

"చరణకమల లగ్నై ర్నూపురై ర్న ర్తకీనాం
ఝుటితి రణితమాసీన్మఞ్జు చిత్రం చ తత్ర"

ఇందు వర్ధమానాక్షర పదత్వము లేదు. మొదటి రెండుపదములు మూడు మూడక్షరముల నున్నవి. అవి మాత్రమె యిందు భాషిత విచిత్రత్వమును సంపాదించినవి. ఇట్లే "అథ యది తవ వక్త్రం చండి భూయోఽపి నామ" అను రెండక్షరములు కల పదముల సన్నివేశము కూడ రమ్యము కాదు. "రణితమాసీన్మ ఞ్జుచిత్రం చ తత్ర" యను స్థలమున 'త' కార 'మ' కారముల కసాజాత్యము హృద్యముగ లేదు. సకార మకారములకు సంస్థాన ముండుటయు హృద్యము కాదు. పాఠాంతరమున నౌదార్య లక్షణ మిట్లున్నది.

అనేకార్థ విశేషైర్యత్సూక్తైః సౌష్ఠవ సంయుతైః
ఉపేత మతి చిత్రార్థై రౌదార్యం తచ్చ కీర్త్యతే

సౌష్ఠవము నానార్థవిశేషము కల సూక్తులతో నుండుట, అతి చిత్రార్థములతో నుండుట యౌదార్య గుణ మగును.

౧౦. కాంతి.

౧౦౬. యన్మనః శ్రోత్ర విషయ మాహ్లాదయతి హిందువత్
లీలాద్యర్థోపపన్నాం వా తాం కాంతిం కవయో విదుః

మనః శ్రోత్ర విషయముగానుండి చంద్రునివలె నాహ్లాదము కలుగజేయునది లీలాద్యర్థోపపన్న మగునది కాంతిగుణ మగునని కవులు నిరూపించిరి. మనోవిషయాహ్లాది యర్థగుణము, శ్రోత్ర విష యాహ్లాది శబ్దగుణము. శృంగార విభావ రూపముగా లీలాది చేష్టా లంకార సుందరముగా నుండు కావ్యార్థ రూపము మనోవిషయ మాహ్లాద పెట్టునది యగును. గావున నది కాంతిగుణ యుక్త మన దగును. అది యే దీప్తరసముగా నుండుట యని యన్యులనిరి. దీప్త రసత్వ మనుట విభావాదులు దీప్తముగా నుండుట యని భావము.

ప్రేయాన్ సాయముపాకృతః సశపథం పాదానతః కాంతయా
ద్విత్రాణ్యేవ పదాని వాసభవనాద్యావన్న యాత్యున్మనాః
తావత్ప్రచ్యుత పాణిసంపుట లసన్నీవీనిబంధం ధృతో
ధావిత్వైవ కృతప్రణామకమహో ప్రేమ్ణో విచిత్రా గతిః

సాయంసమయమున ప్రియుడింటికి వచ్చి పాదములపై పడినను ప్రియురాలొట్టుపెట్టి నిరాకరించినది. నివాసభవనమునుండి యాతడు రెండుమూడుపదములు వేసీవేయగనే యామె యూడిన నీవీబంధమును కరములతో పట్టి పరుగెత్తి నమస్కార మొనరించి ప్రియుని పట్టుకొనినది. ప్రేమగతి విచిత్రము కదా! దీనిలో నీర్ష్యానుభావము, రత్యనుభావము, ఔత్సుక్యానుభావమును సముచితవిభావానుభావసంపదలతో గూడుకొని దీప్తములుగా నున్నవి.

శ్రోత్రవిషయీభూతమై కావ్య మాహ్లాది యయినచో కాంతి శబ్దగుణము. ఇదియే బంధగతమయిన యౌజ్జ్వల్యము. ఈ యౌజ్జ్వల్యము లేకపోయినచో పురాణచ్ఛాయ యందురు. పత్ర మనుటకు కిసలయమని, జలధి యందనుట కధిజలధి యని యనుట కాంతి. సంస్కృతభాషానియమానుసారమున నిట్టివి శేషము లనేకములు గలవు. "కురంగ నేత్రాలీ స్తబకితవనాలీ పరిసరః," దీనిలో రచన సమాససంయుత మయినను శ్రోత్రేంద్రియైకతానమై హృదయతర్పకముగా నున్నది. ఇట్టిది లోకమున మధురకావ్యమని ప్రసిద్ధి. ఇది యిట్లుండుట కాంతి. పదములభ్యస్తములగుట మాధుర్యము. కొందరౌదార్య కాంతుల లక్షణద్వయమును విపర్యాసమున పఠింతురు.

పదన్యాసము గాఢముగా నుండుట యోజోగుణమని కవీశ్వరులందురు. ఓజోగుణాధిష్ఠితము లయిన శబ్దములు సామాన్యముగా శ్రోత్రరసాయనములుగా నుండును. ఓజోమిశ్రమయిన బంధశైథిల్యము ప్రసాదగుణము. ఇది లేకున్న కావ్యపద్ధతి యాస్వాద్యము కాదనుట సత్యము. పదము లనేకములు సంధి కలవయినను లేని విధమున నేకపదవద్భావముతో నుండుట శ్లేషగుణము. ప్రతిపాదము ప్రతిశ్లోక మేకమార్గపరిగ్రహముతో నుండుట సమతాగుణము. ఇది దుర్బంధమని దుర్విభావమని యందురు. క్రమముగా నారోహావరోహము లున్నచో సమాధిగుణమగును. దీనిచే సరస్వతి పూత యగును. బంధమున పృథక్పదత్వ ముండుట మాధుర్యమను గుణము. మాధుర్య మున్నచో

పదన్యాసములు ధారామధువు వర్షించును. అజరబంధ ముండుట సౌకుమార్యము. సౌకుమార్యరహితములు రూక్షములై శ్రుతిక్షమ ములు కావు. బంధము వికటముగానుండుట యుదారతాగుణము. ఔదార్యములేని పదక్రమము వైచిత్ర్యము కలది కాదు. స్ఫుటముగా వర్థప్రతిపత్తి యుండుట యర్థవ్యక్తియను గుణము. ఔజ్జ్వల్యముండుట కాంతియను గుణము. ఇది లేకున్నచో కవికావ్యము పురాణ చిత్ర పాసీయ మనును. సర్వగుణగుంభిత మయిన వాక్కు ప్రాజ్ఞులకు మనో హరమై విశిష్టముగ భాసించును.

రససంశ్రయ ప్రయోగము.

ఇప్పటికీ విధముగా దోషగుణాలంకారములు నిరూపితము లయి నవి. ఇక వీనికి రస సంశ్రయ ప్రయోగమును నిరూపింపవలసి యున్నది. ఛందోవృత్త జాతులకును ప్రయోగ వినియోగ మున్నది. రసాశ్రయ విధాన మున్నది. దోషములం దనిత్య దోషములును వినియుక్తములు కావచ్చుననుట నిరూపిత మె.

౧౬౬. లఘ్వక్షర ప్రాయకృత ముపమా రూపకాశ్రయం
కావ్యం కార్యం తు నాట్యజ్ఞైర్వీర రౌద్రాద్భుతాశ్రయం

౧౬౭. గుర్వక్షర ప్రాయకృతం బీభత్సే కరుణే తథా
కదాచిద్వీర రౌద్రాభ్యాం యదాధర్షణజం భవేత్

౧౬౮. రూపదీపక సంయుక్త మార్యావృత్త సమాశ్రయం
శృంగారే తు రసే కార్యం మృదువృత్తం తథైవ చ

౧౬౯. ఉత్తరోత్తర సంయుక్తం వీరే పాఠ్యం తు యద్భవేత్
జగత్యాతిజగత్యా తు సంకృత్యా చైవ యోజయేత్

వీర రౌద్రాద్భుతాశ్రయ మయిన కావ్యము బహులముగా లఘ్వక్షరములతో గూడియుండుట యుపమా రూపకాలంకారముల కాశ్రయముగా నుండుట యుక్తము. నాట్యవిదులట్లే యొనర్ప వలెను. వీరాది రసములలో చిత్తవృత్తి పరిస్పంద మతను వాహిగా నుండును గావున నచట లఘ్వక్షర ప్రధానమయిన వృత్తము నిబంధించుట యుక్తము. ఉపమా రూపకములు నచట కూర్చుటయు యుక్తము. కరుణాది రసములలో హృదయస్పందము మసృణవాహి యగును. గావున నచట గుర్వక్షర ప్రాయ వృత్తనిబంధన ముచితము. ఇట్టి రీతి యొకప్పుడు రౌద్రాదులలో గూడ నుండును. పరులొనరించిన ఖలీకార

మును స్మరించి స్మరించి విలంబముగా పలుకునప్పుడు మసృణవాహిత యే హృదయపరిస్పందమున ననుభవ సిద్ధము కావున నచట గుర్వక్షర ప్రాయవృత్త నిబంధన మె కవిసమాదృతముగా గోచరించు చున్నది. వేణీసంహార నాటకము నందలి,

"కర్తా ద్యూతచ్ఛలానాం జతుమయభవనోద్దీపనః సోఽభిమానీ"
"యో యః శస్త్రం బిభర్తి స్వభుజగురుమదః పాండవీనాం చమూనాం"

పద్యములలో నిది విశదము, కావుననే భయానకమునందు హాస్యమునందు శాంతమునందును యథాయోగముగా వృత్త విభాగ మును పరిశీలింప వలెను. ఇట్టి విభాగ మంతయు సంవేదనము ననుస రించియు హృదయ స్పందగతి ననుసరించియు చర్వ్యమాణత ననుస రించియు స్వాద్యత ననుసరించియు నుండును. ఇట్లు వృత్తౌచిత్యము పరిశీలన సుందరము. బీభత్స కరుణములలో వీరరౌద్ర రసముల వలన నాధర్షణజన్య మయిన విశేషముండు నేని యొకప్పుడు గుర్వక్షర ప్రాయ కృతమయిన వృత్తనిబంధన ముచితము. శృంగార రసమునందు మృదు వృత్తము యుక్తము. రూపక దీపకాలంకారయోగ ముచితము. ఆర్యావృత్త సమాశ్రయణ మావశ్యకము. వీరరసము ప్రతిపాద్య మగునపుడు పాత్ర ముత్తరోత్తర సంయుక్త మగు నేని జగతి అతిజగతి సంకృతిచ్ఛందములందలి వృత్తముల ప్రయోగించుట యావశ్యకము. యుద్ధసంఘేటముల ప్రసక్తి యుండు నేని యుత్కృతిచ్ఛందము యుక్తము. కరుణ రసమునందు శక్వరి యతిధృతి యుక్తముగా నుండును.

౮౩౦. యద్వీరే కీర్తితం ఛందస్తద్రౌద్రేపి ప్రయోజయేత్
శేషాణామర్థయోగేన ఛందః కార్యం ప్రయోక్తృభిః
౮౩౧. యచ్ఛందః పూర్వమేవోక్తం విషమార్ధసమే సమం
ఉదారమధురైః శబ్దైః తత్కార్యం తు రసానుగం

వీరరసమునం దుండదగిన దని నిరూపించిన ఛందమునే రౌద్రము నందును ప్రయోగించునది. ఇక మిగిలిన వానికన్నిటికి నర్థయోగాను సారమున ప్రయోక్తలు ఛందః ప్రయోగ మొనరింపవలెను. ఛందః ప్రకరణనిరూపితము లయిన సమవృత్తములనుగాని విషమవృత్తములను గాని యర్ధసమవృత్తములనుగాని యుదారమధురములగు శబ్దములతో రసానుగతముగా వినియోగించుట యుక్తము. ఔదార్యమను శబ్ద గుణము దీప్తరసములలో ప్రధానముగా నుండుట శోభ. మాధుర్య

గుణము తదనుయాయిగా నుండుటయు రమ్యము. మధుర గుణసంధానము మసృణరసము ననుసరించి యుండుట సముచితము. యథాయోగముగా నర్థగుణముల నంతట నుపయోగింప దగును.

౮౩౨. శబ్దా నుదారమధురాన్ ప్రమదాభిధేయాన్
నాట్యాశ్రయాసు కృతిషు ప్రయతేత కర్తుం
తైర్భూషితా భువి విభాంతి హి కావ్యబంధాః
పద్మాకరా వికసితా ఇవ రాజహంసైః

ప్రమదము = హర్షము. అభిధేయము = అర్థము. గుణసాకల్యముండుటచే హర్షజనకమయిన యర్థము నిరూపించు శబ్దములను ఉదారమధురముగా నుండువానిని నాట్యాశ్రయములయిన కృతులలో నిరూపించుటకు యత్నింపవలెను. అట్లు భూషితములయిన కావ్యబంధములు వికసితములయిన పద్మాకరములు రాజహంసలచే వలె విశేషముగా విభాసింపగలవు. అర్థవశానుగము లయిన మధురశబ్దముల ప్రయోగము నాట్యసమాశ్రయకృతులలో నావశ్యక మయినందున తన్నియతవర్ణవివేకము నావశ్యకమగును.

౮౩౩. త్రివిధం హ్యక్షరం కార్యం కవిభిర్నాటకాశ్రయం
హ్రస్వం దీర్ఘం ప్లుతం చైవ పదబంధసమాశ్రయం
౮౩౪. స్మృతే చాసూయితే చైవ తథా చ పరిదేవితే
పఠతాం బ్రాహ్మణానాం చ ప్లుతమక్షర మిష్యతే
౮౩౫. ఆ కారస్తు స్మృతే కార్యం ఊ కారశ్చాభ్యసూయితే
పరిదేవితే చ హా కార ఓం కారోఽధ్యయనే తథా
౮౩౬. హ్రస్వదీర్ఘ ప్లుతానీహ యథాభావం యథారసం
కావ్యబంధేష్వ శేషేషు హ్యక్షరాణి ప్రయోజయేత్

కవులు నాటకాశ్రయముగా నక్షర ప్రయోగమును త్రివిధముగా భావింపవలసి యున్నది. పదబంధ సమాశ్రయమయిన వర్ణము హ్రస్వము దీర్ఘము ప్లుతము నని మూడువిధములు. హ్రస్వ మేకమాత్రము. దీర్ఘము ద్విమాత్రము. ప్లుతము త్రిమాత్రము. వర్ణసంశ్రయ మయిన యీ వివేకము ప్రసిద్ధము. హృదయగత మయిన యభిప్రాయమును క్రియావిశేషమును సూచించునప్పుడు విధివివేకములు కలవు. స్మరణసమానీతమయిన యర్థమును నిరూపించునపుడు, అసూయితభావము నివేదించునపుడు పరిదేవితమునందును ప్లుతమగు నక్షరమును ప్రయోగింపవలెను. వేదాధ్యయన మొనరించు బ్రాహ్మణుల వర్ణప్రయోగమునందు ప్లుతవినియోగమావశ్యకము. స్మరణమున 'ఆ' కార ప్రయోగము, అభ్యసూయితము

నందు 'ఊ' కార ప్రయోగము, పరిదేవితమునందు 'హా' కారము అధ్యయనమునందు 'ఓం' కారము వినియోగించుచు నందు ప్లుతధర్మ మును కూర్చవలెను. భావానుకూలముగా రసానుకూలముగా న శేష కావ్యబంధములందు హ్రస్వదీర్ఘ ప్లుతరూపములయిన అక్షరములను ప్రయోగింపవలసి యున్నది.

౮౩౩. చేక్రీడితప్రభృతిభిః వికృతైశ్చ శబ్దైః
యుక్తాన భాంతి లలితా భరతప్రయోగాః
యజ్ఞక్రియేవ రురుచర్మధరైర్ఘృతాక్తైః
వేశ్యా ద్విజైరివ కమండలుదండహస్తైః

౮౩౮. మృదు లలిత పదార్థం గూఢశబ్దార్థ హీనం
జనపదసుఖభోగ్యం యుక్తిమన్నృత్తయోజ్యం
బహుకృతరసమార్గం సంధిసంధానయుక్తం
భవతి జగతి యోగ్యం నాటకం ప్రేక్షకాణాం

లలితము లయిన భరత ప్రయోగము లందు వ్యాకరణ శాస్త్ర నియతము లయిన యజంత ణ్యంత సన్నంత ప్రయోగములు చేక్రీడిత ప్రభృతులు యుక్తముగా నుండవు. వికృతములగు శబ్దములును యుక్తములు కావు. రురుచర్మము, కమండలువు దండము ధరించిన ఘృతాక్త బ్రాహ్మణులు సంచరించు చుండగా యజ్ఞక్రియలు శోభిం చును గాని వేశ్యలు శోభింపరు. ఆ యా నటులు చేక్రీడితాది ప్రయోగ సమర్థులె కావచ్చును. లలిత ప్రయోగము నందవి యుక్తములు కావు. శ్రోత్రియు లయిన బ్రాహ్మణులు వేశ్యా పరిగ్రహ మొనరింతురేని మృగాజిన దండ కమండలు ఘృతాభ్యంగాదులు తగిన విధమున నున్నను యజ్ఞక్రియ శోభింపదు." అని పై వాక్యమునకు భావార్థమును భావించినచో నొకింత వైరుధ్యము కలుగును. రౌద్రాది విషయ మయిన ప్రయోగమున కతిపయవ్యక్తులకు వికృతశబ్దాభ్యనుజ్ఞాన మున్నది. ఆ భావము పయుక్తము కాకూడదు. కావున నిట్లు భావా ర్థము నిరూపించుట యుక్తము కావచ్చును. లలిత సుకుమార ప్రయోగములు పరుషపదము లున్నచో భాసింపవు. "విశేష నిషేధః శేషాభ్యనుజ్ఞాపకః" ఒక విశేషమును నిషేధించుట మిగిలిన యంశ మున కభ్యనుజ్ఞాన మిచ్చునని న్యాయనియమము కలదు. ఆ న్యాయ మున నన్యసలములం దట్టివాని ప్రయోగము యుక్తమని సూచిత

మగును. కావున "వయోద్వితీయాః సరితః సగేశ్చన" "ఆఖ్యాతా మర్షతర్ష్య" అను నిట్టి ప్రయోగములను గూడ విధిగా ప్రయోగింప వచ్చును. ఈ యంశమె సాధర్మ్య వైధర్మ్య ద్వారమున నిట్లుపపాదింప దగును. వేశ్య మృగచర్మ ఘృతాభ్యంగ దండాదులు కల శ్రోత్రియు లచే శోభింపదు. ఇందు వైధర్మ్యమున దృష్టాంత మిట్లున్నది. అట్టి శ్రోత్రియులచే యజ్ఞక్రియ శోభించును. వేశ్య శోభింపదు. యజ్ఞక్రియా పదము బహువ్రీహి యని భావించిన యజ్ఞమునకు సంబంధించిన క్రియలు కల యజమానపత్ని యజ్ఞక్రియ యగును. కృష్ణాజిన దండ కమండలు ఘృతాభ్యంగాదులు కల శ్రోత్రియుడు పత్ని కభీష్టుడగును. వేశ్య కిష్టుడు గాడు. పత్ని శోభించును. వేశ్య శోభింపదు. అట్లే చేక్రీడి తాదులు పీఠాదులలో శోభించును. లలిత ప్రయోగములందు శోభిం పవు. కాగా రసోచిత భావోచిత పదప్రయోగ ముచితము.

ఈ జగతిలో ప్రేక్షకసహృదయులకు యోగ్యమగు నాటక మిట్లుండును గావున నది యట్లుండవలయునని హితోపదేశ జనన మయిన వచనముగా దీనిని భావింపవలెను. ఇందారు స్వరూప సంవేదన మిచ్చు విశేషములు కలవు. మృదులలిత పదార్థ సంబంధము మొదటిది. పదార్థగత మయిన మార్దవము లాలిత్యము మొదట సంగ్రాహ్యము గూఢ శబ్దార్థహీనమగుట రెండవది. అర్థగత మయిన గూఢత సంశయ విపర్యయముల కవకాశమిచ్చును. ఇది యట్లు కాకుండుట యిచట వివక్షితము. జనపద సుఖభోగ్య మగుట మూడవది. నాట్యము సర్వోప దేశజననము కావలయును కావున జనపదములును గుర్తింప దగు ననుభవింపదగు వస్తుచమత్కారాదులతో గూడి యుంటుట యావ శ్యకము. యుక్తిమన్నృత్త యోజ్య మగుట నాల్గవది. సముచిత సంబంధము కల నృత్త మాయోజిత మయినచో హృదయ సంవాద మార్గ మనుకూల మగును. బహుకృతిరసమార్గ మగుట యయిదవది. నానావిధములుగా విభావానుభావాది నిరూపణమున రసమార్గము మసృణ మొనర్చుట యావశ్యకము. సంధి సంధాన యుక్త మగుట యారవది. ఇతివృత్త ఖండలకములతో నాటక మాయోజితము కావలెను. ఆ ఖండలకము లన్నియు ముఖ్య ప్రయోజనముతో సంబం ధించునవి కావలెను. ఇట్టిది ప్రేక్షక యోగ్యము.

## కాకుస్వరవికల్పనము

వాచికాభినయోపక్రమములో పాఠ్యము సంస్కృతప్రాకృతాత్మకముగా రెండువిధముల నుండునని నిరూపితమయినది. అందు సంస్కృతపాఠ్యప్రసంగమున ఛందోవృత్తలక్షణాదికము ప్రతిపాదితము. ప్రకృతము ప్రాకృతపాఠ్యస్వరూపనిరూపణ మావశ్యకము. సంస్కృతపాఠ్యము శాస్త్రప్రసిద్ధము. ప్రాకృతప్రసంగము తద్విపరీతము. ప్రాకృతపాఠ్యమునందలి నామభాగాదు లన్నియు శాస్త్రవిహితములకన్న విపరీత రూపములె. అట్టివాని రూపరూపణ మావశ్యక మయినది. భావపారిషద మారిషాదినామసమూహము నాట్యసమయానుసారమున ప్రసరము కలదై ప్రసిద్ధముగానున్నది. పఠనధర్మములును సంస్కృతపాఠ్యమున నియతవిహితములై యున్నవి. ఇట్టివన్నియు ప్రాకృతపాఠ్యమునందు వేరుగా నుండునా? యట్లేయుండునా? యను విచారణము ప్రసక్తము కాగా ప్రసంగవశమున కార్యస్వరూపము నిరూపిత మయినది. అలంకారవిరామాదులు సంస్కృతపాఠ్యము నందున్నవిధమున స్త్రీపాఠ్యమగు సంస్కృతమునందు నుండదగునని నిరూపితము కానున్నది. ప్రాకృతపాఠ్యప్రసంగ మీ ప్రఘట్టమున నిరూపణార్హము. "ప్రాకృతస్య తు పాఠ్యస్య సంప్రవక్ష్యామి లక్షణమ్" ప్రాకృతపాఠ్యమునకు లక్షణము నిరూపింతుననుట ప్రకృతోపక్రమవచనము. పాఠ్యపదార్థము నీవిధముగా గుర్తింప వచ్చును.

"పాఠవిశేషమర్హతి యత్నేన వా పఠనీయం విశిష్టేన రూపేణ వా పఠనార్హం ఆన్తరచిత్తవృత్తివశాదేవ వా తథాపఠితుం శక్యం ఆచార్యయత్నేన వా పఠనీయం పాఠ్యమ్"

అయిదువిధముల పాఠ్యపదార్థము నిశ్చయింపదగియున్నది.

౧ ఉన్నవర్ణము నున్నవిధమున బల్కుట కాక కాకుస్వరయోజనవిశేషమున సవిశేషముగాబల్కుట యావశ్యకము. అట్లు పాఠవిశేషార్హమగునది పాఠ్యము.

౨ సామాన్యముగా బలుకుట కాక యత్నవిశేషమున బలుకుట యిందుండును. ఉచ్చావచవివేకపురస్సరముగా స్వరసంధానము

గుర్తించుకొనుచు యత్నసహాకృతముగా పలుకుటలో పఠనయోగ్య మగునది పాఠ్యము.

3 వర్ణపదవాక్యోచ్చారణమాత్రమున గుదురునవి కాక, సామాన్యజనులు పలుకువిధమున గాక విశిష్టరూపమున పలుకుట యిందుండును. అట్లు విశిష్టరూపము పఠనార్హము కావున పాఠ్యము.

౪ కేవలము వర్ణోత్పాదకావయవములుగా ప్రసిద్ధములయినకంఠ తాల్వాదుల యభిఘాతమాత్రమున పలుకుట పలుకుటయే కాదు. ఆంతరచిత్తవృత్తివశమున నె యట్లుపలుకుట శక్యమగును. కాని యన్య విధమున నది యట్లు కానేరదు. చిత్తవృత్తిధర్మానుసారమున బలుక శక్యమయినందున నది పాఠ్యము.

౫ నాట్యాచార్యుడు వాగభినయకోవిదుడు సన్నిధిలోనుండి శిక్షాపురస్సరముగ పలుకుట నేర్పగా నారీతి ననుసరించి నటుడు పఠింప దగిన దయినందున పాఠ్యమయినది.

ఇట్లు పాఠ్యపదార్థమును పండితులు పరిష్కరించిరి. సంస్కృత పాఠ్యగతములయిన విశేషములను ప్రాకృతపాఠ్యమున నెట్లు విని యోగింపదగునో గుర్తించుట యావశ్యకము.

౮౫. ఏతదేవ విపర్యస్తం సంస్కారగుణవర్జితం
విజ్ఞేయం ప్రాకృతం పాఠ్యం నానావస్థాన్తరాత్మకం

ప్రాకృతపాఠ్యమునకిది సామాన్య లక్షణము. సంస్కృతమె సంస్కార గుణరహితమైనచో ప్రాకృతమగును. పరిరక్షారూపమయిన యత్నము సంస్కృతమున సంస్కార గుణము. తద్వర్జితము ప్రాకృతము. "ప్రకృతే రసంస్కారరూపాయా ఆగతమ్" సంస్కారరహిత స్వరూపమయిన ప్రకృతినుండి సిద్ధమయినది కావున ప్రాకృతము. ఈ ప్రాకృతపాఠ్యము నానావస్థాంతరాత్మకముగా నుండును. అపభ్రంశరూపములగువానికిని ఏదేని నియమమావశ్యకము. ఈ నానావస్థాంతరాత్మకతయే తన్నియ మము నానావస్థాంతరము లనదగిన దేశవిశేషములందు నియతస్వభావ మనదగిన వీని యాత్మ యుండును. ఆ యా దేశవిశేషములందు ప్రసిద్ధిననుసరించి యారూపమ్ము నియమిత మగును. ప్రాకృతపదములకు

సంస్కృతపదములె వాచకములు. అనుమానమున నవియె వాచకములని నిశ్చిత మగును. అయిన నవి యన్యములని ప్రసిద్ధము లయినవి. దేశవిశేషవ్యవస్థితమయిన అన్యత్వప్రసిద్ధికలవై ప్రాకృతపదము లను వ్యవహారముకలవయినవి. "అవతిష్ఠంతే౽స్మిన్నిత్యవస్థాః దేశవిశేషాః" వీని యందివి యవస్థితములై యున్నందున 'అవస్థ'లనదగినవయినవి. అవస్థలన దేశవిశేషములు. సంస్కృతమునందు ప్రాతిపదికసమానమయినను విభక్తి యుండుటయు నావశ్యకము. సముచితస్వరసంపదయు సంస్కృత పదమునం దుండును. కేవలము స్వరప్రయోగావసరముననే దేశీపదప్రయోగము గోచరించుచున్నది. స్వరవిశేష సంయోజనమునకే సంస్కృతపదము ప్రయుక్తమయినచో నదియు ప్రాకృతమేయగును. అవ్యుత్పాదిత ప్రకృతి ననుసరించి ప్రాకృతజనులు ప్రయోగించుటచే ప్రాకృతమయినదని కొందరందురు.

౮౮. త్రివిధం తచ్చ విజ్ఞేయం నాట్యయోగే సమాసతః
సమానశబ్దం విభ్రష్టం దేశీగతమథాపి చ

నాట్యయోగము నందీప్రాకృతము సంక్షేపముగా మూడు విధములనుండును. సమానశబ్దరూపముగా నుండుట యొకటి. కమలామలలోలసలిలాదిపదములు సమానశబ్దములు. ఇందును విభక్తిలింగభేదమావశ్యకము. పాకృతమునం దీయంశమున నొకస్వాతంత్ర్యమున్నది. కమలాదిపదములకే లింగవిభక్తియోజన మొనరించినచో నన్యాకారము కలుగును. అపుడాపదములకును భేద మవశ్యంభావి. వాక్యమునందు శబ్దము సమాససంపన్నమయినచో నొకవిధముననె యుండును గావున సమానశబ్దమనుట సంగత మయినది. ఇట్టి సంస్కృతసమానశబ్దము ప్రాకృతబంధములలో ప్రయోగార్హమగును. భాషాశ్లేషయవసరమయినపుడు పతాకాస్థానకాదులందిట్టివాని ప్రయోగ మావశ్యకము. ఈ పరిజ్ఞానమున కిదియె ప్రయోజనము. ఒకొకప్పుడు ప్రాకృతప్రయోగమున సమాసమునందును సంస్కృతపదసమత్వముండదు. "కమల అమల ఇందు" రూపమున వ్యస్తముగనె యుండును గాని సంధిసంబంధము పొంది యుండవు. "ప్రాకృతబంధేష్వేవం సంస్కృతమపి యోగముపయాతి" ప్రాకృతబంధములందు సంస్కృతమును

యోగము పొందుననుటలో 'అపి' శబ్దము ప్రయుక్తపదముల కసంధి యుండును గావున సంస్కృతసమతయుండదని సూచించును.

౮౮౧. యే వర్ణాః సంయోగస్వరవర్ణాన్యత్వమూనతాం చాపి
యాన్త్యపదాదౌ ప్రాయో విభ్రష్టాంస్తాన్విర్బుధాః

ఇది విభ్రష్టప్రాకృతమునకు లక్షణము. సంస్కృతగతము లయిన వర్ణములు సంయోగమున నన్యత్వము పొందినను స్వరపరిణామమున నన్యత్వమును పొందినను వర్ణవ్యత్యాసమున నన్యత్వము పొందినను వర్ణలోపమున నన్యత్వము పొందినను విభ్రష్టపదములగును. సామాన్యముగా నపదాదిలో నవి యట్లగుట కలదు. నియతములగు కొన్ని వర్ణములు వర్ణగతము లయిన స్వరములు సంయుక్తవర్ణములందున్న స్వరములు ప్రాకృతయుక్తి ననుసరించి తెలియదగి యున్నవి. భరతుడు నాట్యవేదమున ప్రాకృతము నుద్దేశించి దిక్ప్రదర్శనమే చేసెను. విస్తారవిజిజ్ఞాసువులు ప్రాకృతదీపికాదికమును పరిశీలించుట సముచితమని, ఉత్పలవిరచితమయిన సూత్రవృత్తిలో పద్ధతిలో స్ఫుటముగా పూర్ణముగా కలదని యందాదరము వహింపవలసినదని యభినవుడు విశదము చేసెను. అయినను కొంతగా నావిషయము సూచించుట యుక్తమె యగును. సంస్కృతమున నున్న వర్ణములు ప్రాకృతమున లేవు. ప్రాకృతమున- ఋ ౠ ౡ ౡ ఐ ఔ అః ఙ ఞ న శ ష అను ద్వాదశవర్ణములు లేవు. క గ త ద య వ లు లోపించినను వాని స్వరము లుండును. ఖ ఘ థ ధ భ లు హాత్వము పొందును. శ ష లకు సత్వము వచ్చును. అంతట న ణ యగును. "సర్వత్ర చ ప్రయోగే భవతి నకారోపి చ ణకారః" ప్రాకృతసమాశ్రయము లయిన యపరస్వరనిష్పన్నములగు వర్ణము లీవిధముగ నున్నవి. అన్యోన్య మాశ్లేషము పొందక అసంయోగరూపమున నున్న వర్ణముల వ్యవహారము నందింకను సామాన్యవిధులు విశేషవిధులు గలవు. సంయుక్తవర్ణములకు సంబంధించిన పరివృత్తి సంయోగమును గూడ సవిశేషముగ దెలియుట యుక్తము.

## దేశభాషావికల్పనము

సంస్కృత ప్రాకృతరూపమయిన భాషయే వక్తృభేదమున నాలుగు విధములగును.

౮౮౨. భాషా చతుర్విధా జ్ఞేయా దశరూపే ప్రయోగతః
సంస్కృతం ప్రాకృతం చైవ యత్ర పాఠ్యం ప్రయుజ్యతే।
౮౮౩. అతిభాషార్యభాషా చ జాతిభాషాతథైవ చ
తథా యోన్యంతరీ చైవ భాషా నాట్యే ప్రకీర్తితా।

దశరూప ప్రయోగానుసారమున భాష నాలుగు విధములగును. సంస్కృతపాఠ్యము ప్రాకృతపాఠ్యము దశరూపప్రయోగమున నుండును గావున భాష అతిభాషయని ఆర్యభాషయని నాల్గువిధము లయినది. సంస్కృతభాషయే స్వరభేదాది పూర్ణసంస్కారములతో గూడినదై 'అతిభాష' యను వ్యవహారము పొందును. వైదికశబ్దబాహుల్య ముండును గావున ఆర్యభాష కన్న నిది విలక్షణభాష యగునని కొంద రనిరి. ఇందలి భాష యార్యభాష రెండును సంస్కృతపాఠ్యమున సంగతము లగును. జాతిభాష యోన్యంతరభాష యను రెండును ప్రాకృతపాఠ్యమున సంగతము లగును. ఇట్టి నాలుగు భాషలు నాట్యమున నుండదగినవని పరిగ్రాహ్యము.

౮౮౪. అతిభాషా తు దేవానామార్యభాషా తు భూభుజాం
సంస్కారపాఠ్యసంయుక్తా సమ్యఙ్న్యాయ్యప్రతిష్ఠితా॥
౮౮౫. ద్వివిధా జాతిభాషా చ ప్రయోగే సముదాహృతా
మ్లేచ్ఛశబ్దోపచారా చ భారతం వర్షమాశ్రితా॥
౮౮౬. అథ యోన్యంతరీ భాషా గ్రామ్యారణ్యపశూద్భవా
నానావిహంగజా చైవ నాట్యధర్మీ ప్రతిష్ఠితా॥

దేవతల కతిభాష, రాజుల కార్యభాష వ్యావహార యోగ్యము. నాట్యప్రయోగమునందుండు జాతిభాష రెండువిధములు. సంస్కారపాఠ్య సంయుక్తము చక్కగా న్యాయప్రతిష్ఠితమగుభాష యొకటి, భారత వర్షము నాశ్రయించి యున్న మ్లేచ్ఛశబ్దోపచారమున నుండు భాష మరియొకటి. యోన్యంతరభాష గ్రామ్యభాష ఆటవికభాష పశుసముద్భవమగుభాష నానావిధవిహంగమసముత్పన్నమగు భాష యని సంకేతమున నున్నది. పశుపక్షిప్రభృతులకు సంబంధించిన ధ్వనిని నాట్యప్రయోగమునం దెప్పుడేని యెచ్చటనేని ప్రయోగింపవలసి యుండును గావున వాని రుతము కూడ భాషగా వ్యవహృతమయినది.

అట్టిది నాట్యధర్మిగా వ్యవహారసంకేతమున్నది. నాట్యధర్మిసంకేతము పూర్వము నిరూపితమయినది.

జాతిభాషాశ్రయమయిన పాఠ్యము ప్రాకృతమని సంస్కృతమని రెండువిధములు. ఈ ద్వివిధపాఠ్యము చాతుర్వర్ణ్యసమాశ్రయముగా నుండును. భారతదేశగతులయిన బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు సంస్కృతవ్యవహారమునను తజ్జన్యప్రాకృతవ్యవహారమునను సముచ్చారణాదిలోపము లేకుండునట్లు వ్యవహరింప గలరు. ధీరోద్ధత ధీరలలిత ధీరోదాత్త ధీరప్రశాంతులను నాయకుల వ్యవహారమున సంస్కృత పాఠ్యము వినియోగింప వలెను. ఈ ధీరపూర్వనాయకులకును కారణ వ్యపదేశము ననుసరించి ప్రయోగరీత్యనుసారమున ప్రాకృతపాఠ్యము వినియోగింపవచ్చును. కారణవ్యపదేశమనుట యవస్థాదివిశేషమున నని భావము. అర్జునుడు బృహన్నలారూపమున ప్రచ్ఛన్నుడై యున్నపుడు తన్నిమిత్తముగా ప్రాకృతభాషాపాఠ్యవ్యవహారమె సముచితమగును. దారిద్ర్యమున నుండువారలకు సంస్కృతప్రయోగము తగదు. ఆ సమయమున వారలకు భాషావ్యవహారాసక్తి యుండదు. చదువులేని వారలకు యాదృచ్ఛికముగా నుండు వారలకును సంస్కృత ముచితము కాదు. కొందరైశ్వర్యప్రమత్తులుందురు. శ్రుతాధ్యయన మయినను వారలకుండదు. విద్యావిషయము వారు విననోచుకొనరు. వారలకు సంస్కృతమక్కఱలేదు. దారిద్ర్యపుతాత్మకులకు సంస్కృత ప్రయోగము వలదు. కొందరుత్తమవంశసంజాతు లయినను విద్యాగంధరహితులుగా నుందురు. వారేమియు చదివి యుండరు. అంగ రంగభోగములందే వారిజీవితము లగ్నమగును. అట్టివారలకు సంస్కృతపాఠ్యముండదు. పాఠ్యానర్హుల పరిగణన మిట్లున్నది. ఇది కేవలము సూచనము. దీని యనుసారమున సంస్కృతపాఠ్యానర్హుల నభ్యూహింపవచ్చును. ఈ ప్రసక్తియందే పాఠార్హుల పరిగణనమును సముచితమగును.

౮౮౪. వ్యాజలింగప్రవిష్టానాం శ్రమణానాం తపస్వినాం
భిక్షుచక్రచరణాం చ ప్రాకృతం సంప్రయోజయేత్

౮౮౫. భాగవత తాపసోన్మత్త బాల నీచగ్రహోపసృష్టేషు
స్త్రీనీచజాతిషు తథా నపుంసకే ప్రాకృతం యోజ్యం

జీవికానిర్వాహణమునకై యతిధర్మ మవలంబించిన కపట యతులకు ప్రాకృత పాఠ్యమె వినియోగింప వలెను. శ్రమణులనదగిన బౌద్ధ సన్యాసులకును ప్రాకృతమె. హీనజీవన మవలంబించు దయనీయులకు భిక్షుకప్రాణులకు చక్రచరులకు ప్రాకృతమె ప్రయోజ్యము. "యే చక్రీణ జీవంతి తే చక్రచరాః" సమూహాము ననుసరించి జీవించువారు చక్రచరులు. అట్లే దేవలకులు పూజారులనదగు భాగవతులకు తాపసులకు ఉన్మత్తులకు నీచగ్రహము పట్టిన వారలకు ప్రాకృతమునే ప్రయోగింపవలెను. మానవులు దేవగంధర్వాద్యుత్తమ గ్రహావిష్టులయినచో సంస్కృత భాషాప్రయోగమె యుక్తము. నీచగ్రహావిష్టులకు ప్రాకృతమె. పిశాచాదులకు నీచగ్రహములని పేరు. పిశాచావేశమున్నచో ప్రాకృతము యుక్తము. స్త్రీలకు ప్రాకృతమె. నీచజాతులనదగు చండాలాదులకు ప్రాకృతమె. నపుంసకులకును ప్రాకృతమె. ఆయావ్యక్తుల స్వభావాది భేదము ననుసరించి ప్రాకృతభాషలలో సముచితమయిన భాషనె యుపయోగించుట యుచితము. సంస్కృత ప్రయోగవిధి యిట్లున్నది.

౮౮౯. పరివ్రాణ్మునిశాక్యేషు చోక్షేషు శ్రోత్రియేషు చ
శిష్టా యచ్చైవ లింగస్థాః నంస్కృతం తేషు యోజయేత్
౮౯౦. రాజ్ఞ్యాశ్చ గణికాయాశ్చ శిల్పకార్యాస్తథైవ చ
కలావస్థాంతరకృతం యోజ్యం పాఠ్యం తు నంస్కృతం

పరివ్రాజకులు మునులు బౌద్ధసన్యాసులు శ్రోత్రియులు నగువారలకు సంస్కృతపాఠ్యప్రయోగము సంగతము. చోక్షులనదగు భాగవత విశేషులకు సంస్కృతమె. వీరు ఏకాయనులని ప్రసిద్ధులు. ఏకాయనులా యా సంప్రదాయములందు దీక్షాస్వీకారముచేసి యుందురు. శిష్టులకు యతులకు సంస్కృతమె. మహారాజ్ఞి గణిక శిల్పకారి యగు స్త్రీలకు సంస్కృతము సందర్భసముచితముగ నుపయోగింపవచ్చును. శిల్పకారికలు కలావైదగ్ధ్యముకల వనితలు. మహారాజ్ఞి మహారాజపత్ని. మహాదేవి యని యందురు. రాజునకు రాణి ప్రతిశరీరకల్ప యయినందున సంధివిగ్రహసంబంధము కల షాడ్గుణ్యాదులను తెలియవలయును. గ్రహనక్షత్రచరితములను గుర్తింపవలెను. శుభాశుభరూపమయిన పక్షుల రుతములను దెలియవలయును. శుభాశుభరూపము

లయిన సర్వవిశేషములను రాణి తెలియవలసియున్నది కావున తత్త్వమయమునం దామె సంస్కృతప్రయోగ మొనరించుట విహితము. కావ్య బంధములందిట్టివిధి రమణీయము. వేశ్యకు సంస్కృతపాఠ్యము నిర్దేశించుటలో నొక విశేషముకలదు. వేశ్యలు సర్వలోకక్రీడార్థమై యుండువారలు గావున సుఖాశ్రయమయిన సంస్కృతవ్యవహారము యుక్తము. అట్లె కలాభ్యాసాశ్రయమయిన సంస్కృతపాఠ్యముచితము. ఇక శిల్పకారికా విషయము. కలాపరిజ్ఞానమున కుపచారపరిజ్ఞానమునకు నానాక్రీడారచనకును రాజుల సమక్షమున నుండు శిల్పకారికలకు నాటకమునందు సంస్కృతపాఠ్యమె యుక్తము.

శ్లో ౧ ఆమ్నాయసిద్ధం సర్వాసాం శుభమప్సరసాం వచ
సంసర్గాద్దేవతానాం చ తద్ధి లోకోనువర్తతే
శ్లో ౨. ఛందతః ప్రాకృతం పాఠ్యం స్మృతమప్సరసాం భువి
మానుషాణాం చ కర్తవ్యం కారణార్థవ్యపేక్షయా

అప్సరసల వచనము శుభము. అది పురాణాదిసిద్ధము. అప్సరసల యందరివచన మామ్నాయసిద్ధమె. దేవతాసంసర్గము వలన వారల కట్టి యోగ్యత కలిగినది. లోకమీయంశ మనుమోదించును. భూమి కవతరించిన యప్సరసలకు వారి యభిలాషానుసారముగా వారలకు ప్రాకృతప్రయోగ ముచితమె. ప్రయోజనావసరము ననుసరించి మానవులకును ప్రాకృతపాఠ్య ముపయోగించునది. బర్బరకిరాతాంధ్రద్రవిడాది జాతులలో కారణార్థవ్యపేక్ష ననుసరించియు ప్రాకృతపాఠ్య ముపయోగింపరాదు. నాట్యప్రయోగావసరమున వారలకు భాషాసమాశ్రయమయిన పాఠ్యవ్యవహారమె సముచితము. అనులోమవిధానమున సంస్కారముకల శుద్ధజాతులగువారల కందరకును శౌరసేని భాష ననుసరించిన పాఠ్యమునే కావ్యములందాయోజన మొనర్చునది. ఇందు పక్షాంతరము కలదు.

శ్లో ౩. అథవా ఛందతః కార్యా దేశభాషా ప్రయోక్తృభిః
నానాదేశసముత్థం హి కావ్యం భవతి నాటకే

ఆంధ్రద్రవిడాది దేశములందు భాషాసంస్కారముసముచితముగా నుండునేని తత్తదిచ్ఛానుసారముగ ప్రయోక్తలాయా దేశభాష నుపయోగింపవచ్చును. • నాటకప్రక్రియననుసరించి భావించినచో కావ్యము

నానా దేశసముత్థమై యుండుట ప్రసిద్ధము. ఆయా ప్రసిద్ధ్యనురోధమున నాయా కావ్యవ్యవహారముండుట యుచితము. సంస్కృతాపభ్రంశ మునకు భాషయని వ్యవహారము. భాషాపభ్రంశమునకు విభాష యని సంకేతము. ఆయా దేశములందు కొండగుహాలలో నివసించువారును ప్రాకృతపరిసరములలో సంచరించువారును భాషాపభ్రంశము వ్యవహ రింతురు. ఇట్టివానిని మాత్రమె నాట్యమున ప్రయోగింపవలెనను కొందరిట్లందరు. "ఈ భాషాభేదసంకేతములన్నియు నిదర్శనార్థము నిరూపితములు కావున పైశాచ్యాదిభాషలనుకూడ వ్యవహరింప వచ్చును." అని. దేశభేదమున భాషాభేదము కలుగుటచే నిట్టిభాష లేడు భాషలు ప్రసిద్ధము లయినవి.

౧ మాగధి		౨ ఆవంతి
౩ ప్రాచ్య		౪ శౌరసేని
౫ అర్ధమాగధి		౬ బాహ్లీక
౭ దాక్షిణాత్యభాష

శకారాభీరచండాలశబరద్రవిడాంధ్రజములయిన భాషలు వనేచరుల హీనభాషలు విభాషాసంకేతమున వ్యవహార్యములు. రాజుల యంతః పురములందు నివసించువారలకు మాగధీభాష నుపయోగింపవలెను. చేటులకు రాజపుత్రులకు శ్రేష్ఠిజనులకు నర్ధమాగధీ వ్యవహారముచి తము. విదూషకాదులకు ప్రాచ్యభాష ధూర్తుల కావంతిభాష నాయికలకు సఖీజనమునకు నవిరోధియగు శౌరసేనిభాష యుచితము. యోధనాగరకులకు జూదములాడు కితవులకు దాక్షిణాత్యభాష తగి యుండును. ఉదీచ్యులకు బాహ్లీకభాష ఖస వాసులకు తమ దేశజ భాష, పుల్కసాదులకు చాండాలభాష ప్రయోజ్యము. శకారు లన దగినవారు కొందరు కలరు. వారు నీచాభిజనులు. ఎట్లో ద్రవ్యము సంపాదించిన వారు, దర్పముతో వ్యవహరింతురు. వారికి శకారభాష నుపయోగింపవలెను. శకారబహుళ మయిన భాషకు శకారభాష యని పేరు. ఘోషకులు గొల్లపల్లెలలో నుండు గోజీవనులు. వారలకు తత్స్వాభావముననుండు మేక గొఱ్ఱె మందల పెంచు వారలకును శకార భాషయె యుక్తము. పుల్కసులు డోమ్మ మృతప పదముల వ్యవహా

రింపదగినవారు. ఈవిధముగనె యంగారకారకులకు బొగ్గుపని చేయు వారలకు వ్యాధులకు కొయ్యపనులలో కొయ్యయంత్రములలో జీవించు వారలకును శకారభాషయు, తదుచితముగా వనేకసభాషయు ప్రయోగింపవలెను. గజ-అశ్వ-అజావిక-ఉష్ట్రాది జీవనులకు ఘోషస్థానవివాసులకు ఆభిరభాషాపాఠ్యము శాబరభాషాపాఠ్యము ప్రయోగింపవలెను. వనచారులకు ద్రవిడభాష యుక్తము. సురంగఖనకులు సొరంగములు త్రవ్వువారు దొంగతనమునకై కన్నములు వేయువారును అశ్వపాలకులును మాగధి వ్యవహరింతురు. "వ్యసనే నాయకానాం చాప్యాత్తరక్షాసు మాగధీ" నాటకమున నాయకుడగు వాని కొకవు డాపద కలుగవచ్చును. అపుడాతడు దేశాంతరగతుడగును. ఆ సమయమున తన నెవరేని గుర్తింతురను భావమున నాత్మరక్షణమున కన్యభాషా వ్యవహారమున నుండును. అపుడాతడు మాగధీభాష ప్రయోగించుట యుక్తము. పర్యంతనివాస మొనరించు ద్రవిడాదులకు బర్బరాంధ్ర భాంగేలదేశాదిగతులకును వారి వారి విశిష్టత ననుసరించిన భాషా వ్యవహార ముచితము.

శ్లో౪. గంగాసాగరమధ్యే తు యే దేశాః సంప్రకీర్తితాః
ఏకారబహులాం భాషాం తేషు తజ్జ్ఞః ప్రయోజయేత్।

శ్లో౫. వింధ్యసాగరమధ్యే తు యే దేశాః శ్రుతిమాగతాః
నకారబహులాం భాషా తేషు తజ్జ్ఞః ప్రయోజయేత్।

శ్లో౬. సురాష్ట్రావంతిదేశేషు వేత్రవత్యుత్తరేషు చ
యే దేశాస్తేషు కుర్వీత చకారప్రాయసంశ్రయాం

శ్లో౭. హిమవత్సింధుసౌవీరాన్యే జనాః సముపాశ్రితాః
ఉకారబహులాం తజ్జ్ఞః తేషు భాషాం ప్రయోజయేత్

శ్లో౮. చర్మణ్వతీనదీతీరే యే చార్బుదసమాశ్రయాః
ఓకారబహులాం నిత్యం తేషు భాషాం ప్రయోజయేత్

గంగాసాగరమధ్యభాగమునందున్న ప్రసిద్ధదేశభాగము లందంతటను 'ఏ'కారబహులయిన భాషను, విన్ధ్యసాగరమధ్యభాగములందు శ్రవణ గోచరములయిన దేశములలో 'న'కారబహులమయిన భాషను, సురాష్ట్రావంతి దేశములందువేత్రవతీనద్యుత్తరభాగములందున్న దేశము లందును 'చ'కారప్రాయమయిన భాషనుహిమవత్సింధుసౌవీరప్రదేశ

ముల నాశ్రయించియున్న జనులకు 'ఉ'కారబహుల మయిన భాషను, చర్మణ్వతీనదీతీరమునందు అర్బుదసమాశ్రయము లయిన భాగము లందును 'ఓ'కారబహులమయిన భాషను ప్రయోగింపవలెను. ఇట్లు ప్రయోగించు ప్రయోక్తలు ఆ యా భాషావిభాషాస్వరూపములను గుర్తించి ప్రయోగ మొనర్పవలెను. చర్మణ్వతీతీరవాసులకు నిత్యము 'ఓ'కారబహులభాషయే యుండవలయునన్న నియమమున నితరుల కాయా భాషాపాత్ర్యప్రయోగ మంతగా నియమితము కాదని యభ్యూహింపవచ్చును. ఇందు భాషాగతముగా నుచ్చారణవిభాగవిశేషములను పురస్కరించుకొని యయిదు భేదములు నిరూపితములయినవి.

౧ ఏకారబహులభాష
౨ నకార ,, ,,
౩ చకార ,, ,,
౪ ఉకార ,, ,,
౫ ఓకార ,, ,,

జాతిభాషా విభాషా ధర్మనియమము ననుసరించి యీ ఏ న చాది భాషలవ్యవహార మనేకవిధముల మార్పుపొందును. ఇట్టి మార్పును కూడ నాట్యవిదుడు గుర్తింపవలసి యున్నది. ఇట్లు నాటకాశ్రయముగా భాషావిధానము కూర్పవలసియున్నది. ఇంకనిందు నిరూపింపవలసిన విషయము లనేకములుండును. అన్నిటి నిరూపణము శక్యక్రియకాదు. భాషాబుధులు లోకానుసారమున వానిని గుర్తించునది. లోకభాషా వ్యవహారనిర్దేశము నియతరూపమున నుండదు. ఎప్పటి కప్పుడట్టివానిని లోకమున నె గుర్తింపవలెను. కావుననే "అత్ర నోక్తం మయా యత్తు లోకాద్గ్రాహ్యం బుధైస్తు తత్" అని యనుట సంగతముగా నున్నది. ఇట్లు భాషావిధానము నిరూపితమయినది.

## వాక్యవిధానము

ఇక లౌకికమగు వాక్యవిధానమును నిరూపించుట యవసరాపేక్షితము. ఇచట వాక్యవిధాన మనుట పదవిధానమె యగును. పద మొకటియయినను సకలవాక్యవిధానము స్ఫుటము కావచ్చును.

౪౯౯ ఉత్తమైర్మధ్యమైర్నీచైర్యే సంభాష్యా యథా నరాః
సమానోత్కృష్టహీనాశ్చ నాటకే తాన్నిబోధత

ఉత్తమమధ్యమాధము లుత్తమమధ్యమాధముల నెట్లాభాషింపదగునో నాటకనియమానుసారమున గుర్తింపవలెను. ఉత్తమమధ్యమాధములు సమానోత్కృష్టహీనులను వ్యవహరించు విధానము గుర్తింపవలెనను టచే సంకలనలభ్యము లయిన నానావిశేషములను గుర్తింపగలము. నాటకభాషాపదములుగా కొన్ని పారిభాషికపదము లున్నవి. వారి వారి నుద్దేశించి వాని వాని నట్లు పలుకుట యుచితము. ప్రతిపాద్యౌచిత్యమున వ్యవహారయోగ్యము లయిన వీనిని యథాతథముగనే ప్రయోగించుట యుక్తము. వాని యర్థము వానిలో వివక్షిత మయినను అర్థానుసారమున వాని పర్యాయపదములను ప్రయోగించుట యుచితముకాదు. నాట్యపారిభాషికములగు నివి నానావిధములనుండును. కతిపయసంకేత మన్యములకు నుపలక్షణ మనుట మఱల ప్రతిపాద్యము కాదు. ఆ పదముల స్వరూపసంకేతము లిట్లున్నవి. రూపైక్యమున్నను వివిధార్థములం దివి ప్రయుక్తములగుట నిరూపితము కాగలదు.

| | | | |
|---|---|---|---|
| భగవన్ | ఆర్య | మహారాజ | ఉపాధ్యాయ |
| తాత | అమాత్య | సచివ | మార్ష |
| భావ | మార్షక | వయస్య | హండ ౧౨ |
| ఆయుష్మన్ | తపస్విన్ | సాధు | స్వామిన్ |
| కుమార | భర్తృదారక | సౌమ్య | భద్రముఖ ౨౦ |
| వత్స | పుత్రక | భదంత | దేవ |
| భట్ట | రాజన్ | ఆర్యపుత్ర | మహారాజ |
| కామ్య | రాజపుత్ర | భగవతి | భవతి |
| భద్ర | అమ్బ | భట్టిని | స్వామిని |
| దేవి | భర్తృదారిక | స్వస | వత్స ౪౦ |
| ఆర్యే | బ్రాహ్మణి | హలా | హఞ్జే |
| అజ్జుక | అత్త | ప్రియ | భావ్యామస్ |

భాసర్వజ్ఞ ౪౯

౯౦౦ దేవానామపి యే దేవా మహాత్మానో మహర్షయః
భగవన్! ఇతి తే వాచ్యా యాస్తేషాం యోషితస్తథా
౯౦౧ దేవాశ్చ లింగినశ్చైవ నానాశ్రుతధరాశ్చ యే
భగవన్నితి తే వాచ్యాః పురుషైః స్త్రీభిరేవ చ

మహాత్ములగు మహర్షులు దేవులకును దేవులు. దేవతలకును దేవతలు. మహర్షులు దేవతలకును స్తుత్యులు. వారలను నాటకములందు భగవన్! అని సంబోధింప వలెను. వారి స్త్రీలనుగూడ భగవతి! అని సంబోధింపవలెను. పురుషులయినను స్త్రీలయినను దేవులను యతులను బహుశ్రుతులగు పండితులను భగవన్! అనవలయును. భగవత్పదమున నె వారలను వ్యవహరించుట యుక్తము. బ్రాహ్మణుని ఆర్య! యనవలెను. పార్థివుని మహారాజ! యనవలెను. ఆచార్యుని ఉపాధ్యాయ! యనవలెను. వృద్ధుని తాత! యనదగును. నాటక వ్యవహారములందు వారి నిట్లు సంబోధించుటలో సమధికగౌరవ మవ భాసించును.

౯౦౨. నామ్నా రాజేతితే వాచ్యా బ్రాహ్మణైస్తు నరాధిపాః
తత్క్షామ్యం హి హిమపాలైర్యస్మాత్పూజ్యా ద్విజాః స్మృతాః

బ్రాహ్మణులు నరాధిపులను నామసంకేతమున పిలువ వచ్చును. రాజ పదమున నయినను పిలువ వచ్చును. ఇట్టి వ్యవహారమును నరాధిపు లంగీకరింపవలెను. "క్షామ్యమిత్యంగీకర్తవ్యం" మహీపాలకు లయినను పూజ్యులగు బ్రాహ్మణులొనరించు వ్యవహారము నంగీకరించి సహింప వలసినదె. "యస్మాత్ పూజ్యా ద్విజాః స్మృతాః" బ్రాహ్మణులు పూజ్యులని స్మృతి. ముద్రారాక్షసమున చాణక్యుడు చంద్రగుప్తుని వృషల! యనియే యంతట వ్యవహరించెను. దానిని రాజు సంపూర్ణముగ నంగీకరించెను. ఎన్నడును వ్యాకోపము పొందలేదు. చాణక్యు డట్లు పూజ్యపీఠ మధిరోహించెను. బ్రాహ్మణులు మంత్రిని సచివ పదమున అమాత్య పదమున వ్యవహరింపదగును. ఇతరజనులు కాని హీన వర్గజనులు కాని రాజమంత్రిని ఆర్య! అనియే యనవలయును. నిత్యము వారినట్లె వ్యవహరింపదగును.

౯౦౩. నమైః సంభాషణం కార్యం యేన నామ్నా స సంజ్ఞితః
హీనైః ససరివారం తు నామ్నా సంభాష్య ఉత్తమః,

రాజమంత్రి సమానులగు వ్యక్తులు సమానులను వ్యవహరించునపుడు వారెట్టి నామసంకేతమున నుందురో యా నామసంకేతముననె సంభాషణ మొనరింపవచ్చును. స్వభావహీనులగు వ్యక్తులు తమకన్న నుత్తములను వ్యవహరించునప్పుడు సపరివారముగా నుత్తముని నామసంకేతమున భాషింప దగును. హీనజను లుత్తము డయిన రాజును సంకేతించునపుడు "వత్సరాజ! సోమవంశమౌక్తికమణీ" యనవచ్చును. కారికలో "సపరివార" మను స్థలమున "సపరిహాస" మని పాఠమున్నది. పరిహాసమనునది యెగతాళికాదు. అది పరితోషోపలక్షణము. చాటుకారాదిపరితోషావసరమున హీనులయినను రాజును పేరుతో వ్యవహరింపచ్చును. "ఉదయనే మహీం శాసతి కో విపదామవకాశః" ఉదయనుడు భూమిని పాలించుచుండగా విపత్తుల కవకాశమేమి కలదు? ఇట్లనుటలో నుదయననామకీర్తనము పరితోషజన్యము. ఇదియె యిచటి పరిహాసము.

అధికారపదవిలో నియుక్తులయిన వ్యక్తులను వారి స్త్రీలను అట్టిస్త్రీలను స్థాపనిర్మాణ మొనరించు కారుకకర్మకరులను శిల్పులను చిత్రకారాదులను వారినామముననె వ్యవహరింపవచ్చును. పార్శ్వచరుడగు వానిని మార్ష మారిష భావ యనవచ్చును. మార్షకు డంతకన్న కొంత న్యూనస్వభావుడు. సమానుని వయస్య యనవలెను. భాష వయస్య పదములు సంబోధనాత్మకములుగనె యుండవలెనన్న నియమము లేదు. అవసరానుకూలవిభక్త్యంతములుగ గూడ నుండ దగును. అధముని హండ! హం హో! హండ! యనుట యున్నది.

కా౦౪. ఆయుష్మన్నితి వాచ్యస్తు రథీ సూతేన సర్వదా
తపస్వీతి ప్రశాంతస్తు సాధో! ఇతి చ శబ్ద్యతే

రథికుని సూతుడు నిత్యము ఆయుష్మన్! యనవలెను. ప్రశాంతుడగు మునిని తపస్వి యని 'సాధు' యని పలుకుట యున్నది. ఆయుష్మన్! సాధో! యని యామంత్రణరూపమున నున్నను సంభాషణక్రమానుసారమున సర్వవిభక్తులతో వ్యవహరించుట యుక్తసంగతముగనె యున్నది. యువరాజును స్వామి యనుట రాజకుమారుని భర్తృదారకు డనుట, హే సోమ్య! హే భద్రముఖ! యని తక్కువవాని

నను‌ట యుక్తము. అధమునకు సమాను డధముడె. అధము డధముని హండ యన వచ్చును. హే హండ! యనియు ననవచ్చును.

> ౯౦౫. యద్యస్య కర్మ శిల్పం వా విద్యా వా జాతిరేవ వా
> న తేన నామ్నా భాష్యో హి నాటకాదౌ ప్రయోక్తృభిః

ఎవనికే కర్మ యే శిల్పము ఏవిద్య యే గోత్ర మే దేశము (జాతి) కలదో యాతడానామసంకేతమున వ్యవహరింప దగును. ప్రయోక్తలు నాటకాదులలో నావిధముగ వ్యవహరింపవలెను. ఇందు కర్మ యనునది పాకాదికము. విద్య త్రయి మొదలగునది. జాతి = గోత్రము దేశము. తండ్రికాని గురువుకాని శిష్యుని కుమారుని చెప్పవలసి యున్నపుడు 'వత్స, పుత్రక, తాత' యని నామ సంకేతముతో గాని గోత్రసంకేతముతోగాని చెప్పవలయును. ప్రయోక్తలు శాక్యనిర్గ్రంథులను 'భదన్త' యని యనవలెను. శాక్యులు సౌగతులు. సుగత మతానుయాయులు. నిర్గ్రంథులు క్షపణకులు. ఇంకను మిగిలిన పాషండపాశుపతాదులను స్వసమయాశ్రితము లయిన యామంత్రణలతో బిలువదగును. స్వసమయ మీ విధము. పాశుపతులు భాపూ షన్! భాసర్వజ్ఞ! యని సంభావణీయులు.

రాజవిషయమున నామంత్రణవిధానము వేరుగానున్నది. ప్రకృతిజనులు కాని భృత్యజనులు గాని రాజును 'దేవ' యనవలెను. సార్వభౌముని పరిజనము నిత్యము "భట్ట" యనవలెను. ఋషులు 'రాజన్!' అనవలెను. అపత్యప్రత్యయాంతమున "కౌరవ! మహారాజ!" యనియు ననవచ్చును. విదూషకుడు రాజును వయస్య! యని రాజన్! అని పలుకదగును. రాణిని 'భవతి!' యని చేటికను గూడ 'భవతి!' యని పలుకదగును. రాజు విదూషకుని వ్యవహరించు నపుడు పేరుతో ననవచ్చును. వయస్య! యన వచ్చును. స్త్రీలందరును రాజును ఆర్యపుత్ర! యనవలెను. రాజు శృంగారోచితమయిన యౌవనమున నున్నపుడె యిట్లన దగును. ఈ యౌవనము గడచినను శ్వశురుడు ఆర్యపుత్ర యనదగును. యౌవనము గడచినచో 'ఆర్య మహారాజ' యనుట యుక్తము. అన్నగారిని 'ఆర్య' యని, తమ్ముని కుమారు నని నవిధమున 'వత్స పుత్రక తాత' వ్యవహారమున పిలువ దగును. స్త్రీలు 'కామ్య' యనుట యోధనులు 'రాజపుత్ర' యనుట యుక్తము.

నాట్యమునందు ప్రయోక్త లనుసరింపదగు పురుషాభాషణ మీ విధ మున నున్నది. స్త్రీభాషావిధి నిరూపింపవలెను. ఒకటి రెండు స్థలము లందు స్త్రీసంభాషణము కూడ నిరూపిత మయినది కాని యది కేవ లము తపస్వినీస్త్రీవిషయమని యిది యతపస్వినీవిషయమును గావచ్చు నని విభాగము గుర్తించునది. కావుననె పునరుక్తి రాదు.

౯౦౭. తపస్విన్యో దేవతాశ్చ వాచ్యా భగవతీతి ; చ
గురుభార్యా తు వక్తవ్యా స్థానీయా భవతీతి చ

తాపసస్త్రీలను దేవతలను భగవతి యనవలెను. గురుభార్యను గాని మాన్యయగు నన్యను గాని స్థానీయవనితను గాని పూజ్యను గాని ఈష ద్వృద్ధయగు వనితనుగాని 'భవతి' యనుట యుక్తము. నాటకమున గమ్యను భద్ర యనుట వృద్ధ నంబ యనుట యుక్తము.

౯౦౮. రాజపత్న్యస్తు సంభాష్యాః సర్వాః పరిజనేన వై
భట్టినీ స్వామినీ దేవీ త్యేవం వై నాటకే బుధైః
౯౦౯ దేవీతి మహిషీ వాచ్యా రాజ్ఞా పరిజనేన వా
భోగిన్యః పరిశిష్టాస్తు స్వామిన్య ఇతి వా పునః

పరిజనులందరు రాజభార్యలను భట్టిని స్వామిని దేవి యని నాటకమున వ్యవహరింప వలెను. పట్టమహిషి యయిన రాజభార్యను 'దేవి' యని పరిజనులందరు పలుకవలెను. పట్టమహిషీపట్టము లేని భార్యలను భోగినీనామమున స్వామినీనామమున పిలువదగును. రాజకుమారికలను దాసీజనము 'భర్తృదారిక యందురు. అక్కను 'భగిని' యనుట చెల్లెలిని 'వత్స' యనుట యుక్తము. ఇది రాజకులమర్యాద. ఇంక నితరవ్యవహారము మరి కొంత యున్నది.

౯౧౦. బ్రాహ్మణ్యార్యేతి వక్తవ్యా లింగస్థా వ్రతినీ చ యా
పత్నీ చార్యేతి సంభాష్యాపితృనామ్నాసుతస్య వా

బ్రాహ్మణవనితను సన్యాసదీక్షితను వ్రతాసక్తను 'ఆర్య' యనవలెను. సహధర్మచారిణి యగు భార్యను 'ఆర్య' యనవలెను. కావుననె నటిని నాట్యవేదమహాసత్రదీక్షితు డయిన సూత్రధారుడు 'ఆర్య' యని యామంత్రణము చేయును. సహధర్మచారిణిని ఆమె తండ్రిపేరుతో "లక్ష్మీకాంతపుత్రి! మాతరపుత్రి! యనిగాని కుమారుని పేరుతో

'సోమశర్మ జననీ! భవభూతి జననీ! యనిగాని పిలువవలెను. ఇట్లను టచే భార్యను "కామాక్షి! కామేశ్వరి! హైమవతి!" యని పేరుతో పిలుచుటకాని "నా భార్యా! మాధవపత్నీ!" యనుట కాని రమ్యము కాదు. రమ్యము కాదనుటచే నది పరిహాసమునకు కావచ్చును. సఖులు పరస్పరము పలుకరించుచు కొనునప్పుడు వారందరు సమానలె కావున 'హాలా' యనుట బాగుండును. ఉత్తమస్త్రీ తన దాసిని 'హంజ' యన వచ్చును. వేశ్యను పరిజనులు 'అజ్జుక' యందురు. గణికా మాతను 'అత్త' యనవచ్చును. రాజులు కాని యితరులు కాని శృంగారమున భార్యను ప్రియ యందురు. పురోధసుని భార్యను సార్థ వాహునిభార్యను 'ఆర్య!' యందురు. పురోహితాదులు యౌవనమున భార్యను 'ఆర్య' యని యనవలెను.

౯౧౦. తల్లింగార్థాని నామాని కార్యాణి కవిభిః సదా
ఔత్పత్తికాని యానిస్యురప్రఖ్యాతాని నాటకే
౯౧౧. బ్రహ్మక్షత్రస్య నామాని గోత్రకర్మానురూపతః
కావ్యే కార్యాణి కవిభిః శర్మవర్మకృతాని హి
౯౧౨. దత్తప్రాయాణి నామాని వణిజాం సంప్రయోజయేత్
శౌర్యోదాత్తాని నామాని తథా శూరేషు యోజయేత్

తద్ధర్మతద్విశేషములను సూచించుపేరులను కవులు కూర్చుటకు నిత్యము యత్నింపవలెను. నాటకమునందు కొన్ని యప్రఖ్యాతము లయిన నామములు నుండును. అవి యౌత్పత్తికములు. కవి స్వీయ ముగా సందర్భసముచితముగా కల్పించు పదము లట్టివి. ఇవి యప్రఖ్యా తములయిన నాఖ్యాతము లగును. తల్లింగార్థములు నగును. ప్రకృ తార్థసూచకములగు నర్థవిశేషములం దనుగతములై యుండును. అట్టి యభిధేయయుక్తము:లయిన కార్యములతో నామకల్పన మొనరింప వచ్చును. ఇట్టి నిదర్శనమున వీని నిట్లు తెలియదగును. బ్రహ్మక్షత్ర జాతులకు సంబంధించిన గోత్రకర్మానురూపముగా బ్రహ్మక్షత్రవర్గముల వారలకు శర్మ వర్మ యుక్తములయిన నామములను కావ్యములందు కవులు కూర్పదగును. వణిజాలకు దత్తప్రాయము లయిన నామములను ప్రయోగింపవలెను. శూరపురుషులందు శౌర్యోదాత్తములయిన నామములను కూర్పవలెను. భీమపరాక్రము డనుట శౌర్యోదాత్త

నామము. ఇట్లె యితరములను నిర్దేశించునది. శ్మశానసంచారులగు కాపాలికులకు ఘణ్టాన్తనామముచితము. అఘోరఘణ్ట కాపాలికుడు మాలతీమాధవమున గలడు. రాజస్త్రీలకు నిత్యము విజయార్థనామ నిరూపణము యుక్తము. శుభలక్షణ విజయవతి మొదలగు నామము లట్టివి. వేశ్యలకు దత్త మిత్ర సేన పదములను యోజనముచేయవల యును. దేవదత్త వసన్తసేన విదగ్ధమిత్ర మొదలగు నామములు వేశ్య లకు బాగుగానుండును. నాటకములందు దూతికలకు నానాకుసుమ నామము లుంచుట రమ్యము. మాలతీమల్లికాది నామములిట్టివి. నానాకుసుమగ్రహణము నానామంజర్యాదులకు నుపలక్షణము. రాగ మఞ్జరి కామమఞ్జరి యిట్టివి. చూతలతికాదినామములును కన్పడు చున్నవి. మంగలార్థనామములను చేటులకును కూర్పదగును. సిద్ధార్థక భద్రముఖ ప్రభృతి నామములు మంగలార్థములు.

౬౧౩. గంభీరార్థాని నామాని హ్యుత్తమానాం ప్రయోజయేత్
యస్మాన్నామానుసదృశం కర్మ తేషాం భవిష్యతి
౬౧౪. జాతిచేష్టానురూపాణి శేషాణామపి యోజయేత్
నామానిపురుషాణాం తు స్త్రీణాం చోక్తాని తత్త్వతః
౬౧౫. ఏవం నానావిధానాం తు కర్తవ్యం కవిభిస్సదా
ఏవం భాషావిధానం తు జ్ఞాత్వా కర్మాణ్యశేషతః
తతః పాఠ్యం ప్రయుంజీత షడలంకారసంయుతం

గంభీరార్థములయిన నామముల నుత్తములకు కూర్చుట యుచితము. అక్షోభ్యనామము గంభీరనామము. "నాస్తిసంకేతకో భారః" పేరు భారము కాదు. నామానురూపమగు కర్మ యుండుట ముఖ్యము. మానవునకు నామసంకేత మీశ్వరేచ్ఛావశమున స్వరూపక్రోడీకారము ననె కలుగును. నామాక్షరము గ్రహాభిచారయన్త్రకర్మాదిపీడిత మయి నచో శాంతికపౌష్టికాద్యుపచారములను జరుపుట యావశ్యకము. అప్పుడే మానవునకు ఫలముకల్గును. ఇది యంతయు నుత్తముల వ్యవ హారము. ఇతరులయిన పురుషులకు స్త్రీలకు జాతిచేష్టానురూపము లయిన నామములు నిర్దేశింపదగును. కవులంతట నిట్లే నామవిధానము గుర్తింపవలెను. తదనుసారము కూర్పవలెను. కవిత్వయుక్తుడయిన నటుడు భాషావిధానమును బాగుగా తెలిసి తత్పరిజ్ఞానపూర్వకముగా

కావ్యమును రచించి ప్రయోగమునందు పాఠ్యమును వినియోగింప వలెను. కవియె నటుడయినచో నీవిధి యనుసరణీయము. నటేతరుడు కవి యయినచో పాఠ్యమునకు సంజ్ఞ మూలభూత మయినందున చక్కని సముచితప్రయోక్తృత్వమును భావించుకొని పరిశీలింపవలెను. స్వభావ సంభవమయిన యీ ప్రకృతభాషావిధాన వివేకమావశ్యకము.

దీని యనుసరణమున షడలంకారసంయుతమయిన పాఠ్యమును ప్రయోగింపవలసియున్నది. స్వరస్థానవర్ణకాక్వలంకారాంగము లారును ఇచట అలంకారశబ్దమున వివక్షితములయినవి. ఈ యలంకారభూషిత మయిన కావ్యము పాఠ్యమన దగును.

## పాఠ్య గుణములు

పాఠ్యగుణానిదానీం వక్ష్యామః తద్యథా
సప్తస్వరాః త్రీణిస్థానాని. చత్వారో వర్ణాః
ద్వివిధా కాకుః, షడలంకారాః, షడంగానీతి।

ఉద్దిష్టాంశమును నిరూపించుట యావశ్యకము కాగా పఠనార్హ మయిన పాఠ్యము సకలవివక్షావిషయమయిన యర్థము ప్రతిపాదించు నది యని నిశ్చిత మయినది. ఆ పాఠ్యము సర్వము స్వరాద్యాయత్త మనియు సూచితప్రాయ మయినది. కావున పాఠ్యగుణములను ప్రకృత ముపపాదింపవలసి యున్నది. పాఠ్యగుణములు పాఠ్యమున కుపకారక ములు. ఉపకారకగుణోపకృత మయిన కావ్యము పాఠ్యమగునని భావము. పాఠ్యగుణము లారు కలవు. స్వర స్థాన వర్ణ కాక్వలంకా రాంగములు పాఠ్యగుణములు, సప్తస్వరములు మూడుస్థానములు నాలుగు వర్ణములు ద్వివిధకాకువు షడలంకారములు షడంగములు అనునవి పాఠ్యోపకారకగుణములు.

ఏషామిదానీం లక్షణమభివ్యాఖ్యాస్యామః

ఉద్దేశక్రమానుసారముగా వీని లక్షణము నిరూపించుట యావశ్యకము. అందు సప్తస్వరము లనగా షడ్జర్షభగాన్ధారమధ్యమధైవతనిషాదములు.

త ఏతే రసేషూపపాద్యాః

ఈ సప్తస్వరములు రసములం దుపపాదింపదగి యున్నవి. స్వరగత మయిన విషయము విస్తరముగా గేయాధికారమున నిరూపణార్హము.

ఈ ప్రఘట్టకమహార్థము నీ విధముగావిభావనము చేయవలసి యున్నది. కాకువులందు ముఖ్యముగా స్వరములె యుపకారకములు. స్థానవర్ణాదులు తత్పరికరభూతములు. ప్రకృతిరూపముగా నున్న స్వరములందు కాకురూపత కల్గును. ఇందు స్థానమను పదమున నీ స్వరముల స్వరూపనిష్పత్తికి తగిన యాశ్రయము నిరూపిత మయినది. వర్ణము లుదాత్తానుదాత్తస్వరితకమ్పితరూపములుగా నుండును. కావున స్వరములు శక్తిప్రధానము లనుట విశదము. అనురణనస్వభావము లనుటయు స్పష్టము. ఈ విషయ మట్లుండగా నుచ్చనీచమధ్యమస్థానస్పర్శిత్వము మాత్రమె పాఠ్యోపయోగి యగుననుట నిదర్శితమయినది. స్వరగతమయిన శక్తిని పాఠ్యమునందు ప్రధానముగా నవలంబించినచో నప్పుడది గానక్రియయే యగును గాని పాఠము కానేరదు. సంపూర్ణస్వరత్వముండనందువలన తత్తదంగములకు భేదముండు ననుటయు యుక్తము కాదు. స్వరసంపద పూర్ణముగా లేకున్నను గానమగుట యంగీకృతమె. త్రిచతురస్వరసంధాన మున్నను షాడబౌడవధర్మయుతము లగువానికి గానమను ప్రతీతి యుండనే యున్నది. స్వరత్రయసంపదకల కృత్రిమవంశికలో గానప్రతీతి యున్నది. భిన్నషడ్జభాష కల కాలిందియందు నాలుగుస్వరముల సంపద యున్నను గానప్రతీతి యున్నది. కావున పాఠ్యమునకు గానమునకన్న వైలక్షణ్యము సంపాదించుటకై శక్తిలక్షణాధర్మము తగదు. ఆ ధర్మము నటుంచి యుచ్చనీచాది స్థానస్పర్శసంబంధమె యిందు ప్రధానమని నిరూపించుట యుక్తము. ఈ యంశము స్పష్టపఱచుటకె యిచట వర్ణములను నిరూపింపవలసి వచ్చినది. కాకపోయినచో స్వరసప్తకాతిరిక్తముగా నుదాత్తానుదాత్తాదులకు స్వరూపసద్భావము లేనందున వేరుగా వర్ణముల యుపాదాన మనర్థకమగును.

కొందరీవిధముగా నుదాత్తాదిధర్మములకు ప్రయోజనము నిరూపించిరి. ఆ యా స్వరముల సముచ్చారణసమయమున నుదాత్తాదులున్నచో గాత్రనిగ్రహము కల్గును. కంఠవివరమునకు శిక్షాపఠితములయిన సంవృతాదిధర్మవిశేషములు సంప్రాప్తము లగును. ఉచ్చదీప్తమంద్రాదివక్ష్యమాణాలంకారములందును ఉదాత్తాదిధర్మప్రసక్తి యుండును. ఇట్లుండుట తత్ప్రయోజనము. ఈ విధముగా ప్రయోజనమున్న

దనువారును మేమంగీకరించి నిరూపించిన ప్రయోజనము నంగీకరింప నిచో తద్ధర్మప్రాప్తిచే గలుగు కృత్యమేమియుండునో మేము తెలియ జాలము.

వర్ణగ్రహణము వలని ప్రయోజనమిట్లున్నచో స్వరముల నిరూపణము వలన గలుగు ప్రయోజన మేమి కలదని శంక కలుగ వచ్చును. ఇందిది సమాధానము. ప్రయోగమునకు ధ్రువాగానము ప్రాణభూతము ధ్రువాగానమున్నగాని ప్రయోగము రమ్యముగ నుండదు. అందు జాత్యంశకమునకు వినియోగముండును. ఆ ధ్రువాగానము నీ పాఠావసరమున సర్వథా విడనాడ వలెనా? యని కలుగు శంకాశమనమునకై స్వరములనిరూపణ మావశ్యకము. ప్రధానముగ స్థాయిస్వరముల నాశ్రయించియె పాఠము ప్రయోగింప వలెను. అందుననె స్వరాభిధానమునకు ప్రయోజనము కలదు.

## కాకుప్రధానత

ఇట్లుపగానవైలక్షణ్యము సంపన్నమయినచో బాహ్యార్థమంతయు సమర్పితమగును. సచేతసులకు చిత్తవృత్తిసమర్పణము కలుగును. ఈ విధానమున కాకు వుదయించును. అభినయానుభావ మవభాసింపగా కాకు వర్ణరసభేదమున నిరూపిత మగుట యుక్తము. బాహ్యార్థసమర్పణమున వర్ణరూపకాకువునందు చిత్తవృత్తిసమర్పణమున రసరూపకాకువును కలుగుననుట విశదము కాగలదు. ఇట్లు ముఖ్యమయిన కాకురూపమె యంతట ననుయాయిగా నతిశాయిగా నుండును. తదుపయోగమె ప్రధానమగును. ఇట్లు కాకువె సర్వముఖ్యమగుటచే మున్ముందుచ్ఛదీప్తాద్యలంకారములందును కాకుశబ్దముననె ముని వ్యవహారము నిర్దేశించుటయు సముచితమగును. "కాకోరేవోపకారసంపాదకాః పరిపూర్ణతానుయాయినోఽలంకారాః" ఆరలంకారములును కాకువునకె యుపకారసంపాదకములు పరిపూర్ణతానుయాయులు నగును. అలంకారములనుట పర్యాప్తిసూచకములని యర్థము. ఇచట భూషణమని యర్థము కాదు. "అలమితి పర్యాప్త్యర్థః, ఇహా న భూషణార్థః" విచ్ఛేదార్పణాద్యంగములును రసమును అర్థమును శోభాధికముగను తర్మను పోషించుటకై కాకువునకె యుపకారకములు లగును.

కావున పరమార్థముగా నీ కాకువే యయిదు రూపాంతరములతో పూర్ణమగుచున్నది. కాకుభిన్నములుగా గన్పడునవి కాకువునకే రూపాంతరములై కాకువును పూర్ణీకరించునవి యగును. అభినయ పదార్థమునకును కాకువె సార్థక్యము కలిగించును. "అభితో నీయతే ఇత్యభినయః" అంతట నయనము ప్రాపణము కలుగజేయునది యభినయము. కాకుస్వరసంధానమున పఠ్యమానమగు నది స్వోచితములగు చిజ్జడరూపార్థముల యాభిముఖ్య మున ననునయనమున నంతట స్వాద సంచారము కలుగజేయును. కావున కాకువె యిచట ప్రధానము. భరతమునియు చెప్పవలసినది చెప్పి చెప్పి "ఉక్తం కాకువిధానం" కాకువిధానము చెప్పితినని యుపసంహరించుటయు కాకుప్రాధాన్యము నె సూచించును. కాకపోయినచో సంగపట్క మధ్యపతితమయిన కాకువున కుపసంహారకథనము సంగతము కాదు. షట్కోత్తరముగా నన్యాంగ ముపసంహరించి నాడన్న యర్థమేని కలుగగా సర్వ మసమంజస మగును. కావున కాకువె యిందు ప్రధానమని సంకేతితార్థము నన్యథా కారమున నుపాధ్యాయులు సమర్థించిరి. ప్రత్యక్షశ్రుతార్థమును అనాదరమున విడనాడి కాకువన్యార్థము నెట్లు నిరూపింపగలదని శంకించి సమాధానముగ కొందరిట్లనిరి. "వస్తుస్వభావోఽత్ర ద్రష్టవ్యః న హి దృష్టేఽనుపపన్నం నామ" ఇచటి వస్తుస్వభావరమణీయతయె యట్టిది. శ్రుతార్థమును విడనాడగా నశ్రుతార్థము నవభాసింపజేయు సామర్థ్య మా కాకుస్వభావమునందె యున్నది. స్పష్టదృష్టానుభూతార్థమునం దనుపపన్న మేమియు నుండదు. అని.

వయం తు బ్రూమః– ప్రథమసంవిత్స్పందము ననుసరించి ప్రాణోల్లాసనముచే వర్ణాదిరూపవిశేషరహితమయిన వాక్కు జనించును. అది నాదరూపముగా నుండి హర్షశోకాదిచిత్తవృత్తిని గోచరింప జేయును. విధినిషేధాద్యభిప్రాయమును బోధించును. ఇట్టి నిరూపణమున తత్తార్త్య లింగరూపముగా గాని తాదాత్మ్యముగా గాని వాక్కుండుననుట ప్రసిద్ధముగా నున్నది. ప్రాణ్యంతరము లయిన మృగసారమేయాదుల నాదముల వినియు మానవుడు భయరోషశోకాదుల పొందుట కలదు. కావున నాదమువలన చిత్తవృత్త్యాదు లవగతము లగుననుట యును.

మానమున నిశ్చయింప వచ్చును. ఇచటి వర్ణవిశేషము లనునవి యా నాదరూపసామాన్యాత్మకపదములకు తంతుగ్రంధిరూపములుగా నుండి ప్రథమప్రయత్నాతిరిక్తముగా నిమిత్తాంతరము నపేక్షించునవిగా నుండును. కావుననె యనభిప్రేతమయిన యితరస్థలమునను ప్రయోగింప శక్యము లగుచున్నవి. నియతవిధమున గాక అన్యవిధమున గూడ ప్రయోగింపదగి యున్నవి. ఇట్టివి నియతములు కానందున వ్యభిచరితములగుట స్పష్టముగనె యున్నది. నాద మిట్లుకాదు. నాద ముదయ సమనంతరముననె సముద్భిన్న మయిన ముఖరాగపులకస్థానీయమై యుండును. అది యన్యథాసిద్ధము కాదు. అన్యథాసిద్ధమగునది శబ్దార్థమును బాధించును. "భీరు న మే భయం" ఓసీ! భయస్వభావా! నాకేమియు భయములేదు." అని యనుచునే యా వాక్యోచ్చారణమునందలి నాదముననె మానవుడు భయమును నశింపజేయుచున్నాడు. వాక్యార్థమున కన్యవిధానమును విశేషార్పణమున నిరూపించుచున్నాడు. ఈ యంశమునింకను విస్తరించెదము "ఆస్తాం తావత్"

పాఠ్యోపకారకములలో కాకువే ప్రధానము. కాకువులలో స్వరము లుపకారకములు. స్థానములు స్వరములకు పరికరములు. ఉదాత్తానుదాత్తాదివర్ణములు స్థానస్పర్శధర్మములు. సర్వత్ర కాకువె యనుయాయి. అలంకారములు కాకువునకు పూర్ణతాపాదకములు. అంగములగు విచ్ఛేదాదులును రసార్థపోషణమున కాకూపకారకములు. కాకు వయిదు రూపాంరములచే పూర్ణీకృత మగును.

సంవిత్స్పందమున వెలువడు వాక్కు నాదరూపము. నాదము వలన చిత్తవృత్తి యవగత మగును. సర్వథా పాఠ్యమునందు కాకువు ప్రధానము. అని యిచటి ప్రఘట్టసారార్థము.

కాకు ప్రయోగము

౯౧౬. హాస్యశృంగారయోః కార్యౌ స్వరౌ మధ్యమపంచమౌ
షడ్జర్షభౌ తథా చైవ వీర రౌద్రాద్భుతేష్వథ

౯౧౭. గాంధారశ్చ నిషాదశ్చ కర్తవ్యౌ కరుణే రసే
ధైవతశ్చైవ కర్తవ్యో బీభత్సే సభయానకే

స్థాయిస్వరూపానుసారమున కాకుప్రయోగముండుట నిరూపితము-కాగలదు. ఏ యే స్వర మే విధమున రసవిషయముగా నియమితమగునో యదియు జాత్యంశకవినియోగముగా నిరూపితమగును. ఆయా విషయసూచనముగా రసములందు స్వరములకు గల వినియోగసూచన మావశ్యకము. హాస్యశృంగారరసములందు మధ్యమపంచమస్వరములను కూర్పవలెను. షడ్జఋషభస్వరములను వీరరౌద్రాద్భుతములందు కూర్పవలెను. గాంధారము నిషాదము కరుణరసమున నుచితము. బీభత్సము భయానకములందు ధైవతము నిరూపింపవలెను. ఇందు శాంతమున నుండదగిన స్వరము నిర్దిష్టము కాలేదు. స్వరసందోహమునకు సర్వమూలమయిన సంవిత్స్పందరూపనాదము శాంతప్రకృతి యని గ్రాహ్యము. సర్వస్వరసమాహారరూప మగునదియు శాంతప్రకృతి యని నిగ్రాహ్యము. ఒక్కొక్క స్వరము యొక్క స్వరూపానుసంధానమున పర్యంతమున గలుగు స్వరానుభూతి శాంతమున కనుగ్రాహకమగును.

కాకుప్రవృత్తి - భేదము - వినియోగము.

త్రీణి స్థానాని - ఉరః కరః శిరః ఇతి

౯౧౮. శారీర్యామథ వీణాయాం త్రిభ్యః స్థానేభ్య ఏవ చ
ఉరసః శిరసః కంఠాత్స్వరః కాకుః ప్రవర్తతే

౯౧౯. అభాషణం చ దూరస్థే శిరసా సంప్రయోజయేత్
నాతిదూరే చ కంఠేన హ్యురసా చైవ పార్శ్వతః

౯౨౦. ఉరసోదాహృతం వాక్యం శిరసా దీపయేద్బుధః
కంఠేన శమనం కుర్యాత్ప్రత్యయోగేమ సర్వదా

ఈ నిరూపించిన సప్తస్వరముల కాశ్రయములు కలవు. అవి మూడు స్థానములు. ఉరము కంఠము శిరము మూడును స్వరాశ్రయములు. వర్ణముల పాఠావసరమున కొన్ని వర్ణములు మూర్ధన్యము లని వ్యవహారమున్నది. "ఋ టు ర షా ణాం మూర్ధా." అచట ఉరఃస్థాన స్వరనిష్పత్తి యున్నదనుట సంగతమగునా? ఇట్లి యితరస్థలములందును జిజ్ఞాసింపవలెను. మంద్రనాదాత్మకమయిన వాక్కునకు స్వరసప్తకము రూపముగా నున్నది. ఆ వాక్కురఃస్థానమున నుదయించినదై మూర

స్థలాభిఘాతమున మూర్ధన్యవర్ణముగా నభివ్యక్తమగును. మంద్రస్వరానువిద్ధమై తద్రూపమును దర్శింపజేయును. అప్పుడు మూర్ధస్థానత్వమున్నను ఆ వాక్కు ఉచ్చతాకృత మయిన తారత్వమును పొందదు. వర్ణనిష్పత్తిస్థానము వేరు. మూర్ధాన్తర్వర్తిస్థానాంతరము వేరు. ఆ స్థానాంతర మనువివరమాత్రమె. మూర్ధకాయము వితతవితతము కాగా స్వరనిష్పత్తి కలుగును. అట్లు నిష్పన్నమగునది తారత్వము సంపాదించును. స్థానభేదమున సంపాద్యమానశరీరము కల సర్వసవర్ణస్వరములకును ఈ తారమంద్రమధ్యత కలుగును. ఆయా స్వరముల గ్రహణము వలననె స్థానభేద మాక్షిప్తము కాగలదు. సర్వస్వరము లేకస్థాననిష్పన్నములు కానందున వాని వాని స్థానము గోచరించును. అయినను మఱల స్థానోపాదాన మొనర్చుటలో నొక భావమున్నది. అది యిట్లు గ్రాహ్యము. ఉరఃస్థానమునందు ద్వావింశతిస్థానములు ౨౨ కలవు. అచటనే శ్రుతులు స్వరములు జనించును. ఇట్లె కంఠమునందిరువదిరెండుస్థానము లున్నవి. మూర్ధప్రదేశమునందును ద్వావింశతిస్థానము లున్నవి. ఇవి యన్నియు షట్షష్టి ౬౬ స్థానములు. ఇట్టి షట్షష్టి స్థానభేదనివృత్తికొఱకే మఱలస్థానోపాదాన మావశ్యకమయినది. స్వరములకు సర్వస్థానస్పర్శయున్నచో స్ఫుటమగు 'గానమేయగును గాని యది పాఠ్యము కానేరదని యిదివరలో నిరూపితమెయయినది. కావున పాఠ్యగుణ మను పదమున గుణశబ్దము ధర్మవచనము కాదు. అది యుపకరణ వచనము. ఎయ్యది యుపకరణమగునో యదియె పాఠ్యగుణమగును. శారీరవీణయం దురఃశిరఃకంఠము లనెడు మూడు స్థానములనుండియె స్వరకాకువు ప్రవర్తించునని భరతకారికార్థము. కాగా కొందరిట్లు వ్యాఖ్యానించిరి.

కాకువు రెండువిధములు. అర్థకాకువు, స్వరకాకువు నని. ఈ కారికలో నొక స్వరకాకువునకే సంకేతమున్నది. అర్థకాకువు విధినిషేధాద్యర్థముల నవగమింపజేయగలదు. స్వరకాకువు చిత్తవృత్తిసూచకము. ఈ కారికలలో నిర్దేశించు స్వరకాకువునందీ వ్యాపారద్వయము లేదు. ఇందు విధిరూపార్థావగమన ముండదు. నిషేధరూపార్థావగమన ముండదు. చిత్తవృత్తిసూచనాత్మకమయిన వ్యాపారము

నుండదు. నేపథ్యపాఠము వైతాలీయపాఠ మీ స్వరకాకువిషయము. దూరస్థాభాషణము దీని విషయము. శోభాసంపాదనము దూరశ్రవణాదికము ప్రయోజనము. ఇట్టి స్వరకాకువే యిచట నిర్దిష్టము అని. ఇట్లనువారి నిట్లడుగ వలయును. ఇచటి స్వరకాకువునకు నిర్దేశించిన విషయము కించిదభిధేయమగు నర్థరూపమె యగునేని యీ స్వరకాకువు అర్థకాకువు కన్న పృథగ్రూపము కలది యని యవశ్య మన వలసియుండును. చూడుడు! నేపథ్యపాఠమునందును కంచుకి యిట్లనును. "వీరో౽యమంగదః పఠతి యౌగంధరాయణః పఠతి" ఈ వీరు డంగదు డనుచున్నాడు' యౌగంధరాయణుడు పలుకుచున్నాడు అని. ఇచటి పాఠ మిట్టి ప్రవృత్తి కల చిత్తవృత్తిని ప్రతిపాదించు నదిగనె యుండవలయును. సముచితావసరావేదనప్రధానమయిన వైతాలీయపాఠమునందును అవశ్యముగా నర్థము స్వీకార్యమె కావలెను. ఇది యుక్తము నిరుక్తమును. అర్థానపేక్షముగా నన్య చింతతో నభినయన ముండునా? పుస్తకవాచకపాఠముకూడ అనుక్రియమాణమగునేని యభినయస్వభావ మవలంబించునదియె యగును. ఇట్లు కాక అభినయరూపత లేకున్నచో తదుపకరణధర్మ్యాదివ్యతిరిక్తమయినచో తత్ఫలరసాదివ్యతిరిక్త మయినచో స్వరాతోద్యగానాదివైలక్షణ్య మున్నచో తద్విచారణమున గలుగు ప్రయోజనమేమి గలదు? కాగా నిది కాకుసామాన్యలక్షణమె కాకపోవును. కాన దీనిచే నేమి ఘటితమగును? ఇట్లు నగుననుట సమర్థనము కాదు. పూర్వప్రక్రాంత వస్తుసమర్థమున ప్రయుక్తమగు ననుటయె ముని శైలి. కావున పూర్వము నిరూపించిన స్థానత్రయమును సమర్థించుటకె యీ శ్లోకము నిరూపిత మయిన దని గ్రహింపవలెను. శరీరవీణలో నురశ్శిరఃకంఠములను మూడుస్థానములనుండియె కాకుభూతమయిన సూచకరూపమయిన స్వరము సముదయము పొందును. ఇంతియేకాని యరువది యారు స్వరములచే నభివ్యక్తమయిన రంజనాత్మకగానమునకు కాకువుపయోగించు వ్యాపారమనుట యుక్తము కాదు.

శారీరవీణయందే యీ కాకు వుదయించును. బాహ్యవీణలో నిది యుదయింపదు. బాహ్యవీణ శారీరవీణకు ప్రతిబింబకల్పము. అట్టి

ప్రతిబింబిత బాహ్యవీణయందు రంజనాత్మకస్వరముల స్వరూపసంపద యుండునే గాని తదరిక్తముగా కాకుసంపత్తి యుండదు. శారీరవీణ యనుట శరీరగతవివృతమధ్యాకాశదేశము పరిగ్రహించుటకే. అచటి యాకాశదేశమె వీణాపదవాచ్యము. కేవలశరీరమాత్రమున స్వర నిష్పత్తి యుండదు. శరీరమధ్యాకాశదేశమందే స్వరనిష్పత్తి యుండును. శారీరమధ్యాకాశదేశమునందె బాహ్యవీణాదండస్థానీయ మగు స్థాన మున్నది. అది యుత్తరోత్తరస్థానపరంపరావిష్టముగా నుండును. ఆ స్థానసోపానపంక్తియె స్వరనిష్పత్తిస్థానము. ఉరః కంఠశిరఃప్రదేశములనుండి స్వరము వెలువడుననుట వివక్షిత మయినను కాకుస్వరమును లక్షిత మయినది.

"కక లౌల్యే, లౌల్యం చ సాకాంక్షతే యథా
స్వరవైచిత్ర్యం లక్ష్యతే ఈషత్ యతో
వాచ్యభూమిః సంపద్యతే సా కాకుః,
ఈషదర్థే కుశబ్దస్య కాదేశః, కాకుర్వా
జిహ్వా తద్వ్యాపార సంపాద్యత్వాత్కాకుః"

కాకుపదార్థమిట్లు లక్షిత మయినది. కకధాతువు లౌల్యార్థమున నున్నది. స్వరగతమయిన సాకాంక్షప్రతిపత్తియే యిచటి లౌల్యము. ఇది స్వరవైచిత్ర్యమునకు సూచకము. ఈ స్వరవైచిత్ర్య మీషద్రూప మున వాచ్యమగును. కావున కాకువయినది. ఈషదర్థమున కు శబ్దము నకు కాదేశము రాగా కాకు వయినది. కాకు వనుట జిహ్వా యని యర్థము. జిహ్వావ్యాపార సంపాద్యమయినందున కాకువ్యవహారము వచ్చినది.

ఇట్లుగా మొదటి శ్లోకమున స్థానస్వరూపవిభజనము విశద మయినది. ఇక విషయభేదనిదర్శనమునకు రెండవ శ్లోకమావశ్యకము. శిరోనిష్పన్నమయిన తారనాదమున దూరమునందున్న వాని నా భాషించుట సంగతము, దూరస్థాభాషణమును శిరఃస్థానసంపన్న తార నాదమున ప్రయోగింపవలెనని భావము. నాతిదూరభాషణమును కంఠ స్థాననిష్పన్నమధ్యస్వరమునను, పార్శ్వప్రదేశస్థితాభాషణమును అనగా సమీపాభాషణము నురఃస్థాననిష్పన్న మంద్రస్వరమును ప్రయోగింప వలెను. ఇదియంతయు స్థానత్రయమునకు పృథగుపయోగ ప్రతిపాద

నము. ఇట్లు పృథగుపయోగమే కాక యుగపదుపయోగమును కల దని సూచించుటకు "ఉరసోదాహృతం" ఆవశ్యకము. పాఠ్యయోగము లందు నిత్యము ఉరఉదాహృతమును శిరమున దీపింప చేయుటయు కంఠమున శమింపజేయుటయు యుక్తమని సామాన్యార్థము. మంద్ర స్వరమున పాఠమారంభించి క్రమముగా తారస్థాయి కలుగజేసి మధ్యమ స్వరమున పరిసమాప్తి మొనరింపవలెనని శ్లోకార్థము. పాఠకుడు దీప్త మగు క్రోధాదికమున నావిష్టహృదయుడుకాడేని, మంద్రరూపమున శోకాదులచేగూడ నావిష్టహృదయుడు కాడేని యీ సమయమున వక్తవ్యవస్తువిషయముగా నుత్సాహవిస్ఫారణము కలుగును. ఆతని స్వర మపుడు తారాన్తము ప్రసరించును. ఉపసంహారమునందు మధ్య స్థాయిలో విశ్రమించును. అనునిది సామాన్యముగా సంపూర్ణమయిన పాఠధర్మము. కావుననే శాంతమునందు వ్యభిచారిభావబలావేశశూన్యా వస్థలో నిదియే పాఠధర్మము. వైతాళీయపాఠమునందును ఇదియె సామాన్యధర్మము కావలెను. కాని యీ విషయమున స్వరకాకు వుండు ననరాదు.

అయినచో స్వరకాకువునకు విషయమేమి? యని ప్రశ్న యుద యింపవచ్చును. ఉచ్యతే, ధర్మపుష్టివాచ్యమగు నర్థమునకు ధర్మాంత రాధానము కాకువనదగి యుండునని యొకప్పుడును, స్వరజనకచిత్త వృత్త్యర్పణ మొనరించునది కాకువగునని వేరొకప్పుడును కాక్వర్థము నిశ్చయింపవచ్చును. నాదాత్మకమయిన స్వాత్మసూత్రమునందు సుగు మ్ఫితమయిన స్రగ్గ్రంథిరూపమగు వర్ణరాశికి దూరశ్రవణముకాని కించిచ్ఛ్రవణము కాని యశ్రవణముకాని యుండును గావున రస కాకువ్యవహార మొకప్పు డా యర్థమున ప్రసరించునది యగును. నాదాత్మకమయిన తత్త్వము సకలవర్ణరాశ్యావిర్భావమునకు మూలము. ఆ నాదమునందు సూత్రమునందువలె వర్ణము లన్నియు కూర్పుపొంది యుండును. సూత్రమును మెలిపట్టి త్రిప్ప గ్రంధివలె నాదమువలన వర్తనమున వర్ణరాశి భాసించును. ఇట్లవభాసించు వర్ణ రాశి రసకాకువ్యవహారబలమున నొకప్పుడు దూరశ్రవణముగా మఱి యొకప్పుడు కించిచ్ఛ్రవణముగా వేరొకపుడు శ్రవణగోచరము కాని యట్లుగను నుండును. కావున శ్రవణాశ్రవణదూరశ్రవణార్థములలో రస

కాకువు ప్రసరించుననుట యుక్తము. ఇట్టి స్థలమునందును స్వరకాకు వ్యవహారము కలదు. "ఆభాషణం దూరస్థే" శ్లోకమున సూచించిన విధముగా కాకువు మూడు విధములు.

౧. శిరోనిష్పన్న తారనాదమున వ్యవహరింప దగినది యొకటి, వేరుగానున్న విషయమున తత్ప్రసారమునకై వ్యాపారముకల కాకువుగా దీనిని భావించునది.

౨. కంఠస్థాననిష్పన్న మధ్యమస్వరమున వ్యవహరింపదగినది రెండవది. వేరుగానున్న విషయమున జడచిద్భేదము ననుసరించి వేరు వేరుగా ప్రసరణవ్యాపారము కలది రెండవకాకువని గ్రహించునది.

3. ఉరస్సముత్పన్న మంద్రనాదమున వ్యవహరింపదగినది మూడవది. ఇందు తదర్థరసభేదమున కాకువు ప్రసరించును.

వైతాలీయాదిపాఠమునందు సామాన్యపాఠధర్మమున నె సర్వసిద్ధి యగును గావున నచట స్వరకాకు నపేక్షితము కాదు. నిరూపించిన విధముననె కాకు వినియోగమున్నది.

వర్ణస్వరూపము

ఇట్లు స్థానభేదకథన మయినది. క్రమప్రాప్తమయిన వర్ణస్వరూపము నిరూపింపవలెను.

౯౨౦. ఉదాత్తశ్చానుదాత్తశ్చ స్వరితః కమ్పితస్తథా
వర్ణాశ్చత్వార ఏవ స్యుః పాఠ్యయోగే తపోధనాః

పాఠ్యయోగమునందు వర్ణములు ఉదాత్తమనుదాత్తము స్వరితము కంపితమని నాలుగువిధములు. తపోధనాః! ఈ విషయమును మీరు పర్యాలోచన మొనరింప వలెనని కారికాసామాన్యార్థము. ఉచ్చత నీచత మధ్యమత ఉచ్చనీచోభయడోలావలంబనమని స్వరధర్మములు నాలుగు. ఇవియె వర్ణములు. వర్ణములనుట గుణములని భావము. పాఠక్రియావిస్తారకములయిన ధర్మములె వర్ణములనియు భావము. "వివృణ్వతే ప్రకటయంతి స్వార్థవిశేషం ఇతి వర్ణాః" తమ యర్థవిశేష మును ప్రకటము చేయునవి కావున వర్ణములనదగి యున్నవి.

కావ్యము పాఠ్యయోగము కలది కాగా స్వరమునకు సంబంధించిన రక్తిభాగమును విడనాడి వర్ణములచే వర్ణింపవలయును. రక్తి భాగాభినివేశమున్నచో గానయోగమెకాని పాఠ్యయోగము కలుగ

దని నిరూపితమె యయినది. స్వరమునకు సంబంధించిన రక్తిభాగము నందు నుదాత్తాదివర్ణ భాగము కాదివర్ణ భాగమును స్ఫుటాస్ఫుటరూప ముతోనుండును. స్వరరక్తిలో నుదాత్తాదివర్ణ భాగములు స్ఫుటమయి నంతగా కాదులయిన వర్ణభాగములు స్ఫుటములు కావు. అనురణన ప్రధానమయిన తంత్రీవిధిలో నొకధర్మము పృథక్కుగా గోచరమగును గాయకు డరక్తకంఠు డయినచో నేదోవిధమున ననునపుడు హుడుక్క మురజాదివాద్యప్రవృత్తియందు నాధర్మము వేరుగా లక్షితమగును. ఇట్లే ధర్మాంతరములు నచట ప్రధానముగా మగ్నములై యుండు టయు పరిశీలనయోగ్యము. కావుననె తపోధనులు సూక్ష్మవేదులు ఇట్టివిషయమున నధికృతులు కావున దీని నవశ్యముగా విచారదృష్టితో సమీక్షింప వలెను. తపోబలము కలవారు మాత్రమె యిట్టి తపస్సంవేద్యవిషయముల దెలియగలరని యాశయము.

ఉదాత్తాదివర్ణములకు నియమితమయిన విషయ మీ విధమున నున్నది. హాస్యశృంగారములలో స్వరితోదాత్తవర్ణములచే పాఠ్యము నుపపాదింపవలెను. వీరరౌద్రాద్భుతములం దుదాత్తకంపితవర్ణములచే పాఠ్యము యుక్తము. కరుణబీభత్సభయానకములందు అనుదాత్త స్వరితకంపితవర్ణములచే పాఠ్యప్రయోగ ముచితము. మధ్యమపంచమ స్వరములు హాస్యశృంగారములందు నిరూపింపదగినవను పూర్వప్రకరణ మున యథాసంఖ్యము వివక్షితము కాదు. కావున హాస్యమునందు మధ్యమజాతికి స్థాయిస్వరత్వము గుర్తించి యయినను పంచమజాతికి స్థాయిస్వరత్వము గుర్తించి యయినను ఆగ్రహించిన స్థాయిస్వరము నందె యుచ్చమధ్యమస్థానస్పర్శమున పాఠ్యమును పఠింపవలెను. ఇట్లె వీరరౌద్రాద్భుతరసములందు మూడిటియందును షాడ్జజాతి ననుసరించి గాని ఆర్షభజాతిననుసరించిగాని స్వాంశమును స్వీకరించి యచటనే యుదాత్తకంపితములతో పాఠ మొనరించుట యుక్తము. కరుణరసము నందు నిషాదవతీజాతిస్థాయిస్వరము ననుసరించిగాని గాంధారీజాతి స్థాయిస్వరము నవలంబించిగాని యనుదాత్తవర్ణమున పాఠ మొనరింప వలెను. బీభత్సరసమునందు ధైవతాంశస్వరాశ్రయమున స్వరితకృత మగు పాఠము యుక్తము. భయానకమునందును ధైవతాంశస్వరావ

లంబనమున నే కంపితప్రధానమయిన పాఠ మొనరింపవలయును. ఇట్టి విషయమంతయు జాతివినియోగానుసారిస్వరానువాదమున భావనా యోగ్యము. ఇదియంతయు నుదాత్తాదివర్ణములందలి తాత్పర్యమె కాని స్వరములందలి తాత్పర్యము కాదని గుర్తింపదగును. స్వరవర్ణములను వేరు వేరుగా నిర్దేశించుటలోని ప్రయోజన మంతరాలాప పరిగ్రహాత్మకమని నిరూపితప్రాయ మయినను సమయానుసారమున మఱల నిరూపింపగలము. ఇట్లు కాకువు స్వరూపోత్పత్తి భేదవినియోగ రీతి ప్రతిపాదిత మయినది.

## కాకువిశేషములు

అర్థవిషయమున కాకువునకు గల వ్యాపారమును ప్రదర్శింపవలయును. ఉద్దేశక్రమము ననుసరింపవలయును.

> ద్వివిధా కాకుః సాకాంక్షా నిరాకాంక్షా చేతి
> వాక్యస్య సాకాంక్షనిరాకాంక్షత్వాత్
> అనియుక్తార్థకం వాక్యం సాకాంక్షమితి సంజ్ఞితం
> నియుక్తార్థం తు యద్వాక్యం నిరాకాంక్షం తదుచ్యతే

కాకువు రెండు విధములు. సాకాంక్షకాకువు నిరాకాంక్షకాకువు అని. వాక్యము సాకాంక్షముగా నిరాకాంక్షముగా నుండును గావున కాకువు నట్లయినది. అనియుక్తార్థకవాక్యము సాకాంక్షమని, నియుక్తార్థమగు వాక్యము నిరాకాంక్షమని వ్యవహరింప దగియున్నది. వాక్యమెచట సాకాంక్షముగా నుండునో యచట సాకాంక్షకాకువని సంజ్ఞ. వాక్య మాకాంక్షాసహితముగ నుండుటయు కాక వక్తృగత మయిన యాకాంక్షయు వాక్యమున నుపచరిత మగును. అట్టి యా యాకాంక్ష ప్రకరణాదుల బలమున నిశ్చయింపదగి యున్నది. ఆకాంక్ష విశిష్ట విషయముగా నుండుటయు ప్రకరణాదిబలముననే గోచరించును. ఇట్టి యంశమె "అనియుక్తార్థకం" కారికలో విశదము. వాక్యమువలన సంకేతబలానుసారముగా నెట్టి యర్థము గోచరించునో, అట్టి యర్థమె న్యూనాధికముగా ప్రమాణబలమున నిర్ణయింప శక్య మయినచో నా వాక్యము నిరాకాంక్షమగును. తద్విపరీతమగునది సాకాంక్షవాక్యము.

ఇట్టిది వాక్యస్వరూపము. కాకువు వాక్యనిష్ఠముగా నుండుట ప్రతిపాదింపవలసి యున్నది.

తత్ర సాకాంక్షం నామ తారాది మంద్రాన్తమనియుక్తార్థ మనిర్యాతితవర్ణాలంకారం కంఠోరఃస్థానగతం. నిరాకాంక్షం నామ నియుక్తార్థం నిర్యాతితవర్ణాలంకారం శిరఃస్థాన గతం మంద్రాది తారాంతమితి.

ఇందు మొదట సాకాంక్షలక్షణ మున్నది. అని యుక్తార్థమగు సాకాంక్షము మంద్రముగా నుపక్రాంతమగుట తారస్వరముగా సమాప్తి యగుట కాక తారాదికముగా మంద్రాన్తముగా నుండును. ఇందు పఠనీయమగు పాఠ్యమిట్లే యుండును. ఈ లక్షణవచనములోని పదము లన్నియు క్రియావిశేషణములు. తారాదిమంద్రాంతముగా ననియుక్తార్థముగా ననిర్యాతిత వర్ణాలంకారముగా కంఠోరఃస్థానగతముగా సాకాంక్షవాక్యముండును. అని యన్వయము. ఉదాత్తాదివర్ణములు కాని ఉచ్చనీచదీప్తాద్యలంకారములు కాని యపరిసమాప్తములై యుండును. అర్థస్పష్టముగ నేయుండి యవి త్యక్తములగును. ఇట్టి పాఠ్యవాక్యము సందర్భము నియుక్తము కాదు. ఇట్లు వాక్యము పఠించునపు డుండు ధ్వనిధర్మవిశేషమె కాకువు. పైనున్న విశేషణములను క్రియావిశేషణములుగ భావించినచో పాఠ్యపఠనమందలి విశేషము భాసించును. వీనిని సామానాధికరణ్యమున నన్వయించి వ్యాఖ్యానించుటయు యుక్తమె. "ధర్మో హి న స్వతంత్రో భాత్యపి తు ధర్మినిష్ఠ ఏవ" ధర్మము ధర్మినిష్ఠముగనే భాసించునుగాని స్వతంత్రముగ ధర్మము భాసింపదు. కావున ధర్మవిశేషమగు కాకువు ధర్మిసమాశ్రయముగనె భాసించును. శోభించును. ఆకాంక్షాసహితము సాకాంక్షము. కావున నీ యాకాంక్ష యర్థాంతమునగాని, తదర్థగతముగగాని, తదర్థవిశేషమునగాని, తదర్థాభావాత్మకమునందుగాని గోచరించుచుండును. ఈ కాకువిశేషముల నిట్లుదాహరణములందు గుర్తించునది.

"యద్రామేణకృతం తదేవ కురుతో ద్రోణాత్మజః క్రోధనః"

క్రోధనుడయిన పరశురాము డేమియొనరించినాడో క్రోధనుడయిన ద్రోణకుమారుడు నదియె యొనరించును. ఇట్టిభావము కల పై శ్లోకభాగమున 'కృతం - కురుతే' పదములందు కాకువు కలదు. 'కృతం'

పదమున ఉదాత్తకంపితవర్ణమునకు ఉచ్చదీప్తాలంకారమునకు సరియగు సమాప్తి లేనందున నీ కాకువు సాకాంక్షము. అంతకన్న నధికముగా 'కురుతే' పదమునందలి కాకుప్రభావమున నర్థాంతరమందు గతి గోచరించును.

న ఏష దశకంధరం కృతవతోపి కక్షాంతరే
గతః స్ఫుటమవంధ్యతామధిపయోధి సాంధ్యో విధిః
తదాత్మజ ఇహాంగదః ప్రహిత ఏష సౌమిత్రిణా
క్వ న క్వ న దశాననో నను నివేద్యతాం రాక్షసాః

దశకంధరుని కక్షాంతరమున చేర్చినను సముద్రసమీపమున సాంధ్యవిధి సఫలమయినది. ఆ వాలి కుమారుడయిన యీయంగదుని లక్ష్మణుడు పంపినాడు. ఆ దశాననను డెక్కడ నున్నాడు.? ఎచ్చట నున్నాడు? రాక్షసులారా! నాకు తెలియజేయుడు. ఈ శ్లోకమునందు "తదాత్మజ ఇహాంగద" యను స్థలమున గల సాకాంక్షకాకువు అంగదహృదయగతము లయిన వాలిపుత్రోచిత విశేషముల నర్పించుచున్నది. కావున నర్థాభిప్రాయసమర్పకమగు నభినయరూపార్థకాకువు సాకాంక్షమై యుండుట స్పష్టము. నిరాకాంక్షకాకు వేతద్విపరీతము. నియుక్తార్థముగ నిర్యాతితవర్ణాలంకారముగ శిరఃస్థానగతముగ మంద్రాది తారాంతముగ నిరాకాంక్షవాక్య ముండును. ఇందు పాఠ్యాలంకారములు నిర్యాతితము లగుటయు, నిది శిరఃస్థానమునందు మంద్రముగా నుండి తారభావముపొందుటయు కలదు. ఉత్తరోత్తరతారత్వ మధరాధరమంద్రత్వమును మున్ముందు నిరూపింతుము.

## షడలంకారములు

ఇక క్రమప్రాప్తములగు షడలంకారముల నిరూపింపవలెను. అలంకారపదవ్యుత్పత్తి నిచట నిట్లు గుర్తింపవలెను. "అలం పర్యాప్తం కాక్వోః స్వరూపం యేన సంపద్యతే సోఽలంకారః" కాకుస్వరూపము దేనిచే పర్యాప్తముగా సంపన్నమగునో యది యలంకారము. ఈ యలంకారము షడ్విధము.

౯౨౪. ఉచ్చో దీప్తశ్చ మంద్రశ్చ నీచో ద్రుతవిలంబితౌ
పాఠ్యస్యైతే హ్యలంకారా లక్షణం చ నిబోధత

పాఠ్యమునకు సంబంధించిన యలంకారము లీవిధముగ నున్నవి.

| | | | |
|---|---|---|---|
| ౧ | ఉచ్చము | ౪ | నీచము |
| ౨ | దీప్తము | ౫ | ద్రుతము |
| ౩ | మంద్రము | ౬ | విలంబితము |

వీని లక్షణమును వినియోగమును వివేకపురస్సరముగా గుర్తింపవలెను.

౧ ఉచ్చో నామ శిరస్థానగతస్తారస్వరః
౨ దీప్తో నామ శిరస్థానగతస్తారతరః
౩ మంద్రో నామ ఉరస్థానగతః
౪ నీచో నామ ఉరఃస్థానస్థో మంద్రతరః
౫ ద్రుతో నామ కంఠగతః న చ త్వరితః
౬ విలంబితో నామ కంఠస్థానగతస్తనుమంద్రః

శిరఉరఃకంఠము లనెడు స్థానత్రయము ననుసరించి యీ యలంకారము లుండును. ఉచ్చదీప్తములు శిరఃస్థానమున మంద్రనీచము లురఃస్థానమున ద్రుతవిలంబితములు కంఠస్థానమున నుండును. శిరమూర్ధ్వస్థానమని యుర మధఃస్థానమని కంఠము మధ్యస్థానమని శిర ఆదిస్థానత్రయమున కుదాత్తానుదాత్తస్వరితకంపితనిర్వాహము కలదు. అనావేశ రూపముగా మధ్యభాగ ముండును. ఊర్ధ్వస్థానముకాని యధరస్థానము కాని యావేశరూపమున నుండును. ఊర్ధ్వాధరస్థానముల కావేశస్థితి ననుసరించి రెండు రెండలంకారములును మధ్యభాగమున కనావేశస్థితి ననుసరించి రెండలంకారములును పరిగ్రాహ్యములు. కాగా నిట్లు షడలంకారములు సిద్ధము లయినవి. శిరఃస్థానగతమయిన తారస్వరము ఉచ్చమనునలంకారము. శిరమునం దధోభాగమున తారమను వ్యవహార మున్నది. దూరస్థాభాషణమునందు విస్మయమునందు ఉత్తరోత్తరసంజల్పమునందు దూరాహ్వానమునందు త్రాసనమునందు బాధాదులందును దీని వినియోగముచితముగా నుండును. దూరస్థాభాషణాదికము స్వరకాకువునకు విషయమని భావము. విస్మయభావగతిలో స్వరకాకు వుండితీరవలయును. ఇతరుని త్రాసపెట్టుటకై విభావకాకు వావశ్యకము. పరత్రాసనాభిప్రాయముండునేని విభావకాకువె యుపయోగి. స్వరకాకువె శ్రుతికాకువు. ఆక్షేపాదుల ప్రసక్తిలో నీకాకువు తారతరము తారతమము నగును. ఇచట తార

పదము ప్రకర్షోపలక్షణము. స్వరకాకువు ప్రకర్షకలది కాగా తార తారతర తారతమ వ్యవహారము కలుగును. శిరఃస్థానగతమయిన స్వర కాకువు తారంతరము కాగా దీప్తమను నలంకారమగును. ఈ తారతర మగు దీప్తకాకువును ఆక్షేప-కలహ-వివాద-అమర్షకృష్ట-ఆధర్షణ-క్రోధ-శౌర్య-దర్ప-తీక్ష్ణ-రూక్షాభిధాన-నిర్భర్త్సన-ఆక్రందితాదులలో వినియోగింపవలెను. తత్తదవస్థానుసారముగా శ్రుతికాకువు విభావ కాకువు రసకాకు వను భేదత్రయము విభజనీయము.

ఉరఃస్థానగతమయిన మంద్రస్వరము మంద్రమను నలంకార మగును. అది నిర్వేద గ్లాని చింతౌత్సుక్య దైన్య వ్యాధి క్రీడా గాఢ శస్త్రక్షత మూర్ఛా మద గుహ్యార్థవచనాదులలో వ్యవహరింపదగి యున్నది. ఉరమునం దూర్ధ్వభాగమున కలుగునది మంద్రస్వరము. దీనికే మంద్రాలంకారమని సంజ్ఞ. ఉరమునందే క్రిందిభాగమున గలుగు స్వరము మంద్రతమము. దీనికే నీచాలంకార మని పేరు. ఈనీచమును స్వభావాభాషణ వ్యాధిశమ శ్రమార్త త్రస్త పతిత మూర్ఛితాదు లందు ప్రయోగమున వినియోగింపవలెను. దైన్యమునందుండు కాకువు రెండురూపములు పొందును. స్వచిత్తవృత్త్యర్పణమున్నచో రసకాకు వని పరచిత్తమునకు రూపముత్పాదించినచో విభావకాకువని సంకే తము కలదు. దైన్యవ్యవహారములో నీ యుభయకాకువునకును ప్రధాన మాగా నాదరముకలదు. ఇతరస్థలములం దీ రసవిభావకాకుసమాదర మావశ్యకము కాదు. కావున స్వరకాకువను ప్రధానాంశముననె వ్యప దేశ ముచితము.

ద్రుతమనునది కంఠగతమయిన త్వరితస్వరము. ద్రుతము లల్లన మన్మన భయ శీతజ్వర త్రాసాయస్తాత్యయిక కార్యావేదనాదులందు వినియుక్త మగును. విలంబిత మనునది కంఠస్థానగతమయిన తను మంద్రస్వరము. అది శృంగార కరుణ వితర్కిత విచారామర్షాసూయితా వ్యక్తార్థ ప్రవాద లజ్జా చింతా తర్జన విస్మయ దోషానుకీర్తన దీర్ఘ రోగనిపీడనాదులలో ప్రయుక్తమగును. స్వభావాభాషణమున్నప్పు డొక్కొకవక్త యాప్నుత్తకంఠస్వరమున నుండును. త్రాసనమునందు కంఠస్వరము పాతప్రసారము కలదగును. త్రస్తపతితమునగును.

త్రాసావసరమునందు కాకువు దీప్తమె యగును. లక్షణసూత్రములో కంఠగతమనుట కంఠస్థానమునం దూర్ధ్వభాగమున నిష్పన్నమని భావము. కావున స్థానభేదమే తత్తదలంకారప్రయోజకముగా నున్నది. లల్లనము లడనము సవిలాసముగా నుండుట "లల్లం సవిలాసం, లడం విలాసం లాతీతి." మన్మన మవ్యక్తము. "అహమేవ మనోమన్తా యత్ర" నేనే నా మాటలను మననము చేయువాడనను భావమున మన్మన మవ్యక్తము. మన్మన మశ్రూయమాణమై యనునాసికోపలక్షితముగ నుండునని కొందరందురు. "లల్లమన్మనౌ నాయికాగతౌ బాలవినోదనసాన్త్వనాదౌ, ముంచేత్యేవం ప్రాయ పరాభియోగానంగీకరణాదౌ చ "లల్లమన్మనవిధానములు నాయికాగతములయిన విశేషములు. బాలవినోదనమున సాంత్వనమున నుండును. "ముంచ" నన్నువిడువుము – అను నిట్టి పరాభియోగమునందును, అంగీకరణాదులందును ప్రసరించును. అని అభినవగుప్తుని యుపాధ్యాయులు నిరూపించిరి. ఇందు మంద్రకాకువును ప్రవర్తించును. ఆత్యయికకార్య మనుట శీఘ్రసంపాద్యమగు కార్యమని భావము. ఆయస్తమనుట యావేగమని యర్థము. కంఠస్థానమునందే నీచభాగమున నిష్పన్న మగునది విలంబితము. ఈ షడలంకారవినియోగవిధానమున నానువంశ్యముగా విశేషములుండనె యున్నవి.

నానారససమాశ్రయ మయిన యుచ్చదీప్తద్రుతకాకువు నుత్తరోత్తరసంజల్పాదులందు ప్రయోక్తలు వినియోగింపవలెను. నాట్యప్రయోక్తలు మంద్రనీచకాకుస్వరూపముగుర్తించి వ్యాధితజ్వరార్తాదులందును చింతాతపోవిధానములందును వినియోగింపవలెను. లల్లమన్మాదులందు మంద్రద్రుతములకు వినియోగమును నాట్యవిదులు గుర్తింతురు. విలంబితదీప్తమంద్రకాకువును దృష్టనష్టానుసరణ–ఇష్టానిష్టశ్రుత – ఇష్టార్థఖ్యాపన – చింతాధ్యాన – ఉన్మాదాయితోపాలంభ అవ్యక్తార్థప్రవాద – కథాయోగ – ప్రభృతులందు ప్రయోగింపవలెను. ఇందవ్యక్తార్థప్రవాద మనుట అంతరంగస్వభావాత్మకము. "ఇతగులు తెలిసికొననీ తెలిసికొనకపోనీ" అనియె వక్త్రభిప్రాయముండును. ఇది స్వగతముకాదు. పరగతమును గాదు. ఈ యలంకారములలో ఉచ్చదీప్తద్రుతరీతి యథాయోగముగా స్థానత్రయానుబంధి యని స్పష్టము.

కా. ౨౧. లఘ్వక్షరప్రాయకృతే గుర్వక్షరకృతే తథా
ఉచ్చా దీప్తా చ కర్తవ్యా కాకుస్తత్ర ప్రయోక్తృభిః
కా. ౨౨. యాని సౌమ్యార్థయుక్తాని సుఖాభావకృతాని చ
మంద్రా విలంబితా చైవ తత్ర కాకుర్విధీయతే
కా. ౨౩. యాని స్యుస్తీక్ష్ణరూక్షాణి దీప్తా చోచ్చా చ తేష్వపి
ఏవం నానాశ్రయోపేతం పాఠ్యం యోజ్యం ప్రయోక్తృభిః

ఇదివరలో నిరూపించిన వినియోగవిధానములు కాక ప్రయోక్తలు ప్రయోగవిజ్ఞానము ననుసరించి సమయసముచితము లయిన విశేషము లను గుర్తింపగలరు. అవియు శిష్టసమ్మతములై ప్రయోగరమ్యత నాపాదింపగలవు. లఘ్వక్షరప్రాయముగా నుండు పాఠ్యప్రసక్తిలో నుచ్చాలంకారధర్మము కల కాకువును ప్రయోగింపవలెను. గుర్వక్షరకృత మయిన పాఠ్యప్రసంగమున దీప్తకాకువు ప్రయోగించుట యుక్తము. ఇది రసభావనియతమయిన ప్రయోగవైచిత్ర్యము కాదు. అక్షరరమ్యతానుసారివైచిత్ర్యము. ఇట్టి సర్వసంగ్రహార్థములయిన ప్రయోగ విశేషములు కలవు. సౌమ్యార్థయుక్తములు సుఖభావకృతములు నయిన పాఠ్యముల విషయమున మంద్రకాకువు విలంబితకాకువు ప్రయోగించుట రమ్యము. "సోమ ఇవ హ్లాదకః సౌమ్యః" సోముడు చంద్రుడు. సోమునివలె హ్లాదపెట్టునది సౌమ్యము. సుఖభావకృతము లనుట సుఖహేతువులు భావకృతములు నని భావము. సుఖహేతువు లగుటయు కాక సుఖకార్యములు నని సమాసభేదసంగృహీతార్థమును భావింపవలెను. తీక్ష్ణరూక్షము లయిన పాఠ్యములందును దీప్తకాకువు నుచ్చకాకువును ప్రయోగించునది. నానాశ్రయోపేత మయిన పాఠ్యమును నానాస్థాననివిష్ట మొనరించి ప్రయోక్తలు ప్రయోగింపవలసి యున్నది. స్థానభేదమె కాకువునకు పర్యాప్తతాసంపాదకమని నిరూపిత మయినది. ఇట్లు కాకువె ప్రధానమగుటచే తత్ప్రయోగవిస్తరమును సావధానముగ గుర్తింప వలెను. హాస్యశృంగారకరుణములందు విలంబితకాకుప్రయోగ మిష్టము. వీరరౌద్రాద్భుతములందుచ్చకాకువు దీప్తకాకువు ప్రఖ్యాతము ప్రశస్తము. భయానకమునందు బీభత్సము నందు ద్రుతకాకువు నీచకాకు వుండుటను నాట్యవిదులు కీర్తించిరి. ఇట్లు "భావరసోపేతా కాకుః కార్యా ప్రయోక్తృభిః" భావరసోపేత

మయిన కాకుప్రయోగమును ప్రయోగమున ప్రయోక్తలు పరిశీలింప వలెను. అక్షరరమ్యతాకృతమయిన స్థలములందును భావరసనిరాసము లేదు. కాని యచట గురులఘువర్ణకృత చమత్కారానుసారి కాకు విష్టము.

## షడంగములు

అథాంగాని షట్ - విచ్ఛేదోఽర్పణం విసర్గోఽ
నుబంధో దీపనం ప్రశమనమితి

౧. విచ్ఛేదో నామ విరామకృతః
౨. అర్పణం నామ లీలాయమానమధురవల్గునా
స్వరేణ పూరయతేవ రంగం యత్పఠ్యతే
3. విసర్గో నామ వాక్యన్యాసః
౪. పదాంతరేష్వపి విచ్ఛేదః అనుచ్ఛ్వసనం వాఽనుబంధః
౫. త్రిస్థానశోభి వర్ధమానస్వరం దీపనం
౬. తారగతానాం స్వరాణాం ప్రశామ్యతాం
అవైస్వర్యేణావతారణం ప్రశమనం

కాకూపసంహారమున కంగాభిధాన మావశ్యకము. ఉద్దేశక్రమాను సారమున నంగము లారు కలవు. విచ్ఛేదము అర్పణము విసర్గము అనుబంధము దీపనము ప్రశమనము నని వాని నామములు. వర్ణో చ్చారణసమయమునందు వర్ణధ్వనిశూన్యమగు నే కాలము కలదో యా కాలము నాశ్రయించి యంగవ్యవహార ముండునని వృద్ధులనిరి. వారి భావమత మీా విధముగ నుండును.

## వృద్ధమతము

అంగాశ్రయమగు కాల మారువిధములు. వాని స్వరూపరీతి యీా విధముగ నున్నది.

౧. తతశ్చ "భూయాన్ పునరాదిమధ్యో"
భూయాన్ పునరిత్యయం హి విచ్ఛేదః.
౨. అదౌ మధ్యః స్వల్పో మధ్యాన్తే చార్పణం.
3. వాక్యే పూర్వం భూయాన్మధ్యే ద్రుతశ్చ
విపరీతకో యః స విసర్గః.

౪. బహుషు ద్రుతోఽథ మధ్యే
మనాక్ ద్రుతాఽన్తేఽనుబంధః స్యాత్.
౫. త్రిస్థానే ద్రుతమధ్యవిలంబితయుక్ దీపనం.
౬. సమారోహ విపరీతం ప్రశమనం.

అభినవాసమ్మత మయిన యీ వృద్ధభావసంగ్రహము నిట్లు గుర్తింప వచ్చును. పదాదియందు గాని పదమధ్యభాగమున గాని యధికమగు కాలవిలంబ ముండుట విచ్ఛేదము. పదమున కాదిమధ్యమభాగము లందు మధ్యమాంతిమభాగములందును ఒకింత స్వరకాలవిలంబ ముండుట యర్పణము. వాక్యమునందు మొదట కొంతకాలవిలంబము మధ్యలో ద్రుతకాలరీతి పిమ్మట తద్విపరీతమగు విలంబితవిధాన ముండుట విసర్గము. ఆరంభమున ద్రుతబంధము మధ్యలో మనాగ్ద్రుత సంబంధము చివర మరల ద్రుతరీతి యుండుట యనుబంధము. ఉచ్చా రణమునందు స్థానత్రయానుగుణ ద్రుతమధ్యవిలంబితరీతి యుండుట దీపనము. అంతట నారోహావరోహ ముండుట ప్రశమన మగును. ఏకరూపనిర్వాహమున లయత్రయసంబంధము సంగతము కాదగునని సంగ్రహకారుల యాశయము. ఇట్టిది వృద్ధమతము. ఈ మతానుసార మున నే లక్షణములను కొందరు వ్యాకరించిరి.

ఇది యుక్తము కాదు. ద్రుతమధ్యాదిలయసంబంధము చెప్పుట వలన తత్తత్త్వానుసారమున జూచినచో నర్థమునకు కాలమునకు నియమకారణము లేదు. లయవ్యవహారసామ్యమున్నను కాలనియ మము గోచరముకాదు. వాక్యచైతన్యానుసారముగా పరిశీలించినచో భాగత్రయకల్పనాకృతములుగా నున్న లయవైషమ్యభేదములు భాసింపవు. కొన్ని స్థలములందు అనంతభాగసంభావన మవశ్యంభావి యగుటచే భాగత్రయకల్పనమె యుక్త మనిపింపదు. అంగీకరించిన భాగత్రయమునందును ద్విభేదత్వత్రిభేదత్వసంకలనమున నానంత్యము కలుగ వచ్చును గావున నీ షట్సంఖ్యానియమమునకు విప్లవమె సిద్ధ మగును.

క్వాకార్యం? శశలక్ష్మణః క్వ చ కులం? భూయోఽపి దృశ్యేత సా? అను కాళిదాసీయశ్లోకమున మొదటిభాగములందు మధ్యమలయ మున్నది. "భూయోఽపి దృశ్యేత సా" యను పాశ్చాత్యఖండము

లలో విలంబితలయ మున్నది. ఈ పశ్చిమభాగములు తత్స్మరణజనిత సుఖవిశ్రాంతి నిచ్చునవి యనుట స్పష్టము. కాగా నీ శ్లోకమున పూర్వాపశ్చిమఖండములందు మధ్యమవిలంబితలయరీతు లుండుటచే ద్విలయ భేదము కల ప్రయోగమున్నదనవలెను. భాగత్రయకలన మున్నను సామ్యమున వైషమ్యమున ననంతప్రకారత కలుగుననుట యెట్లు సంగతమగును ? ఈ సర్వము లయాభిదానముననె సంగృహీత మయిన దనుటయు నెట్లు యుక్తియుక్తము కాగలదు ?

సూత్రమునందు రత్నములవలె వాక్యమునందు పదములు గ్రథితములయి యున్నవి కావున పాఠకాలమునందుండు ధర్మషట్కమె యంగషట్కముగా నిరుక్త మయినది. మధ్యలో త్రుటితత్వ మత్రుటితత్వము గాని యుండవచ్చును గావున – విచ్ఛేదానుబంధములు కలుగును. పీవరత్వ మపీవరత్వ ముండునేని యర్పణవిసర్గములు కలుగును. ఆరోహణావరోహణము లుండునేని యదియే దీపనప్రశమనము లగును. కాగా నాదము భావాభావముల వలన ఉపచయాపచయముల వలన ఆరోహణావరోహణముల వలన నారు భేదములు కలదగును.

విరామకృతముగా గలుగు విచ్ఛేదము మొదటియంగము. లీలాయమానముగానుండి మధురముగా మనోజ్ఞముగా రంగము పూరించునటు లుండు స్వరమున పఠించుట యర్పణము. వాక్యన్యాసమునకు విసర్గ మగును. అనుబంధ మనునది పదాంతరము లందును అవిచ్ఛేద ముండుట. పదపదములకు సంబంధమున్నటుల భాసించుట పదాన్తరములం దనుచ్ఛ్వాసనరీతి యుండుటయు ననుబంధమె. దీపన మనునది యురఃశిరఃకంఠములనెడు త్రిస్థానములందు శోభించు రీతి. వర్ధమానస్వరసంపదతో నుండుట. ప్రశమనమనునది యిట్లుండును. తారస్థాయిలో నున్న స్వరములు ప్రశామ్యదవస్థలో నుండునపుడు వైస్వర్యము లేక సముచితమయిన యవతరణము కలవి కావలెను. స్వరస్వరూపములతో నున్న సువిహితములగు నంతరాలశ్రుతివిశేషములందు ధ్వనివిసంవాదమునలన వైస్వర్యము కలుగుచుండును. పూర్వాపరధ్వనులకు సరియగు సంవాదమున్నచో స్వరసంపద యుండును. అట్టి స్వరసంపద లోపించి ధ్వని విసంవాదము కల దయినపుడు వైస్వర్యము.

జనించుట యంతట ప్రసిద్ధమె. ఇట్టి వైస్వర్యము లేకుండునట్లు స్వరావతరణ ముండుటయె ప్రశమనము.

## రసగతప్రయోగము

ఈ విచ్ఛేదాదులకు రసగతమయినప్రయోగ మీ విధముగ నుండును. హాస్యశృంగారరసములందు కాకుస్వరాకాంక్ష యున్నప్పుడు పాఠ్య మర్పణవిచ్ఛేదదీపనప్రశమనయుక్తముగానుండునట్లు ప్రయోగింప వలెను. హాస్యశృంగారాదిబోధకములయిన శబ్దములు తత్తద్వ్యభిచారి భావములను గూడ స్వీకరించునవి యగును. అట్టి వ్యభిచారి భావములు నన్యరసముల పరిగ్రహించును. ఆయా వ్యభిచారిభావాశ్రయమయిన రసాంతరమందును కాకువట్లుపకారి యగుట పరిగ్రాహ్యము. కరుణరసమునందు దీపనప్రశమనయుక్తముగా పాఠ్యముండుట యావశ్యకము. వీరరౌద్రాద్భుతరసములలో విచ్ఛేదప్రశమనదీపనానుబన్ధబహులముగా పాఠ్యమును ప్రయోగింప వలెను. బీభత్సభయానకములందు విసర్గవిచ్ఛేదయుక్తముగా పాఠ్య ముండవలెను. ఇట్లీ విచ్ఛేదాది సర్వాంగములకు మంద్రమధ్యతారకృతమయిన ప్రయోగము త్రిస్థానగతముగా నుండును. ఇట్లు మూలభూతమయిన స్థానభేదమును గుర్తించియే పాఠ్యప్రయోగ మొనరింపవలెను.

## ఏకవాక్యత

తంత్ర　దూరస్థాభాషణే　తారం　శిరసా
నాతిదూరే　మధ్యం　కంఠేన,　పార్శ్వతో
మంద్రమురసా　ప్రయోజయేత్పాఠ్యమితి
మంద్రాత్తారం న గచ్ఛేత్, తారాద్వా మన్ద్రమితి

పైన నిరూపితములయిన వినియోగవాక్యముల కేకపాఠ్యతాప్రదర్శన మావశ్యకము. అది యిందున్నది. ఇదివరలో శృంగారమునందుదాత్తస్వరితధర్మము నిరూపిత మయినది. అర్పణవిచ్ఛేదాదులయిన యంగములు నిరూపితములయినవి. విలంబిత మలంకారమును రూపితము. కావున దూరస్థాభాషణ మొనరింపవలసి యున్నప్పుడు శిరఃస్థానమునందు షడ్జపంచమస్వరములం దన్యతరస్థాయిస్వరాశ్రయణమున నంశస్వరవిభాగమునందు చతుశ్చతుష్క-సమ్మిశ్రరీతి నాయోజన మొనరించి

తారముగా పాఠ్య మొనరింపవలెను. అను నీవిధమగు తాత్పర్యమున నీపంక్తుల భావము గుర్తింపవలసి యున్నది. ఇంతకన్న నన్యథా భాషణ ముచితము కాదు. ఇట్లె నాతిదూరమున నున్నవానితో నాభాషణ మొనరింపవలసి యుండగా కంఠస్థానమున సముచితస్థాయిస్వరాశ్రయణ మున మధ్యముగా పాఠ్య ముచ్చరింపవలెను. పార్శ్వగతుని పలుక వలసి యుండగా ఉరస్సముచితస్థాయిస్వరసమాశ్రయమున మంద్రముగా పాఠ్యప్రయోగ మొనరింపవలెను. దీపనప్రశమనాంశములందును నక్తవ్య శేషము కొంత యున్నది. మంద్రస్వరమునుండి తారస్వరమును వెంటనె యనుసరింపరాదు. తారస్వరమునుండి మంద్రస్వరమును వెంటనె యనుసరింపరాదు. ఇట్లె మంద్రతరమునుండి తారమునుగాని తారతరమునుండి మంద్రమునుగాని యవ్యవధానమున నందుకొనరా దనియు భావము.

## లయవిరామరీతులు

పాఠ్యప్రయోగమునందు కొన్ని లయరీతులు కొన్నివిరామరీతు లావశ్యకములు. ద్రుతమధ్యవిలంబితములను మూడు లయవిధానము లను రసముల విషయమున నుపపాదింపవలెను. హాస్యశృంగారము లందు మధ్యలయప్రయోగము, కరుణమునందు విలంబితలయప్రయో గము, వీరరౌద్రాద్భుతబీభత్సభయానకములందు ద్రుతలయరీతి నుప పాదింపవలెను. భరతుని యుద్దేశగ్రంథముననె యీ లయ రీతులను కూర్చుట యుచితము. కొందరిట్లు భావింతురు. ఏ కాలమయిన నెవ్వనికయిన చక్కగా పరిభావ్యమానము కాజాలదు. ఉద్దేశగ్రంథము ననె యిట్టివి యుండుట వలని ప్రయోజనమును మతిమంతు లభ్యూ హింపరు. విచ్ఛేదమను విరామము నిరూపించుట వలననె లయరీతి సంగృహీతము కాగలదు. విరామమనునది విచ్ఛేదాత్మకము. అది కొంతకాలవ్యాపియై యుండును. అదియె లయవిధానమును సూచింప గలదు. విరామ మనగనె లయప్రక్రియయు సంగృహీతమె యగును. అయినను లయరీతి నిట్లు చెప్పుట విచ్ఛేద పరీక్షయె యగును. విచ్ఛేద విభాగపరిశీలనమున హాస్యశృంగారాదులందు మధ్యలయాదుల నుప యోగించుట యనునంశమును గుర్తింపవచ్చును. విరామ మనునది

విచ్ఛేద మంటిమి. అర్థసమాప్తినిమిత్తముగా విరామముండును. విరామముండుట యావశ్యకము. అర్థసమాప్తిలో కార్యవశమున విరామమూపాదింపవలెనె గాని ఛందోవశమున దాని ననుసరింపరాదు. ఇందర్థసమాప్తియనుటలోని యర్థ మవాంతరవాక్యార్థము. అవాంతర వాక్యార్థపరిసమాప్తిలో విరామ మావశ్యకమని భావము. ప్రయోగపరతంత్రుడై కవి రచన యొనర్పవలెను. తత్తదవసరసముచితములయిన విరామములు కల వృత్తముల గ్రహణమున నాతని ప్రయత్నమావశ్యకము. కావుననె ఛందోవశమున విరామస్వీకార ముచితము కాదనుట యుచితము. ప్రయోగప్రయోక్తయు కవిపరతంత్రుడు కావలసిన యవసరములేదు. కవి యనవధానమున గలిగిన వ్యత్యాసమును గూడ నిపుణప్రయోక్త సవరింప గలడు. కావున నవాంతర వాక్యార్థకార్యవశమున విరామప్రయోగమును ప్రయోక్త సావధానముగా గుర్తింపవలెను. ఏకద్విత్రిచతురక్షరస్థాననియతముగా విరామములు ప్రయోగములందు గోచరించుచునె యున్నవి.

"కిం గచ్ఛ మా విశ సుదుర్జన వారితోఽసి
కార్యం త్వయా న మమ సర్వజనోపభుక్తమ్".

ఈ యుదాహరణమున తగిన విరామములు సముచితావాంతరవాక్యార్థములలో విచ్ఛేదరూపమున నున్నవి. ఈ విధముగా నవాంతర వాక్యార్థములకు విచ్ఛేదాత్మకవిరామమున్నచో నేకవాక్యత్వముండదు కదా! ఏకవాక్యత లేకుండుట దూషణమగును గదా! అని యాశంక కలుగును. కాని యిది దూషణముకాదు భూషణమె యగును. దీని యుపపాదనమున కిది యపేక్షితము:

కా౨౩. సూచాసు చాంకురగతే చ తథోపచారే
స్వల్పాక్షరాణి హి పదాని భవంతి కావ్యే.

సూచాభినయ మంకురాభినయ ముపచారాభినయము ప్రసక్త మయినచో కావ్యమునందల్పాక్షరము లయిన పదము లుండుట శోభావహము. బహుప్రకారములగు సూచాభినయములతో గూడిన కావ్యము బహుప్రకారములగు నంకురప్రకారములతో గూడిన కావ్యము స్వల్పాక్షరములయిన పదములతో నసమస్తాక్షరపదములతో

గూడి యుండుననని కారికాన్వయము. బహ్వాక్షరపదములతో రచన యుండునేని మధ్యలో సూచాంకురాభినయముల కుపపత్తి యుండదు. కామోపచార వేశోపచార విధాభినయములందు నిట్టి నీతిని సంగత మొనర్ప వలెను.

తస్యా స్తన్ముఖమస్తి సౌమ్యసుభగం కిం పార్వణే నేందునా
సౌందర్యస్య పదం దృశౌ చ యది తే కిం నామ నీలోత్పలైః
కిం వా కోమలకాంతిభిః కిసలయైః సత్యేవ తత్రాధరే
హీ! ధాతుః పునరుక్త వస్తురచనారంభేష్వపూర్వో గ్రహః.

సౌమ్యసుభగమయిన యామె ముఖమున్నది. ఇక పూర్ణిమాచంద్రుడేల? సౌందర్యస్థాన మయిన దృక్కులుండగా నీలోత్పలములేల? యధరముండగా కోమలకాంతికల కిసలయములేల? ఇహీ! బ్రహ్మకీ పునరుక్తవస్తురచనారంభములలో నపూర్వాభినివేశ మున్నది కదా! ఈ పద్యమున మొదట "తస్యాః"యని పిమ్మట 'త్రత్' యని యుండుట సూచాభినయానుకూలము. అసాధారణవిశేషస్మృతి దీన గలుగును. అనుభూతిసారపరము లయిన నానావిశేషములు స్మాత్మస్ఫురితములై చమత్కారసౌందర్యము కూర్చును. తథావలోకనమున తథాకర్ణనమున ప్రచ్ఛన్నముగా నున్న నాయికయొక్క నివృత్త్యంకురమై చిత్ర్యమవభాసించును. ఇంకను పరిచుంబనాభిలాషకు తగిన సూచాయోగపూర్వకముగా ముఖపార ముండుటయు నాయికయొక్క రణరణకాదరము నిరూపించును. అప్పటి నివృత్త్యంకురాభినయమును వైచిత్ర్యమున లగ్నమై భాసించును. లక్షణకారికలో నున్న 'అంకుర' పద మనిర్వచనీయమె కావున నిచట నివృత్త్యంకురాభినయమనియె భావించుట యుక్తము. అంకురాభినయము కల స్థలమున నె తద్విషయముగా నిది యన్వయింపదగు ననుట సమంజసము కాదు. అట్లె యయినచో పుష్పాపచయనాటనమునందు తదుచితపరిక్రమణాదులలో పూర్వభావిస్వల్పాక్షరపదయోగమున వైచిత్ర్యముండదు. కాగా కావ్యమునందు స్వల్పాక్షరపదరచనలో నిట్టి రమ్యార్థసంభావన మావశ్యకమని విరామకృతముగా నీ వైచిత్ర్యము సుఘటమగునని

భావించునది. పాఠ్యప్రయోగమునం దీవిధముగా ప్రయత్నమును శ్రద్ధగా స్వీకరింపవలెను.

ఈ విచ్ఛేదాత్మకవిరామాంగమునకు తగిన ప్రాధాన్యమును కలదు. "కస్మాత్ ? విరామో హ్యర్థానుదర్శకః" ఈ విరామమున కిందటి ప్రాధాన్యమేల? అ యీ విరామ మర్థానుదర్శకము. ఈ విరామమనునది యున్నచో నభినయస్థిత మయిన విశేషమంతయు తత్తద్విషయానుసారముగా ప్రయోగించి ప్రదర్శించుట శక్యమగును. ఆ యభినయభావ మంతయు విరామము వలననె గమ్య మగును. విరామమున్ననె యర్థదర్శనము కలుగును. తత్తదభినయార్థము గోచరమగును. అన్యథా, అభినయార్థము గోచరము కానందున సర్వమసమంజసముగా నుండును. "అభినయో విరామే స్థితః" అభినయము విరామమునందె యున్నది. అభినయము విరామాశ్రయముగ నుండును. అభినయకార్యమును విరామమె వహింపగలదని తాత్పర్యము. ఈ యంశమున నీ శ్లోకములు గలవు.

౯౨౮. విరామేషు ప్రయత్నో హి నిత్యం కార్యః ప్రయోక్తృభిః
కస్మాత్? అభినయో హ్యస్మిన్నర్థాపేక్షీ యతః స్మృతః
౯౨౯. యత్ర వ్యగ్రావుభౌ హస్తౌ తత్ర దృష్టిసమన్వితః
వాచికాభినయః కార్యో విరామైరర్థదర్శకైః

ప్రయోక్తలు నిత్యము విరామములందు ప్రయత్న మొనరింపవలెను. ఏలననగా ? అభినయమర్థాపేక్షముగా నుండునని యభిజ్ఞులు నిశ్చయించిరి కదా! హస్తములు రెండును వ్యగ్రములుగా నుండగా నర్థదర్శకములయిన విరామములతో దృష్టిసమన్వితమయిన వాచికాభినయ మొనర్పవలెను. పూర్వనిర్దిష్ట మయిన యభినయము దృష్టిప్రాధాన్యమున నిర్దిష్ట మయినది. ఇచటి యభినయము విరామప్రాధాన్యమున నిర్దిష్టమని గుర్తించునది. విరామానుకూలముగా నుండు హస్తవిన్యాసము వ్యాపకముగ నున్నది. వీరరౌద్రరసములందు సామాన్యముగ హస్తములు ప్రహరణాకులములై యుండును. బీభత్సమునందు సంకుచితములై యుండును. బీభత్సము కుత్సితమగుటచే కరములు కుంచితములగును. హాస్యమునందుద్దేశానుసారమున హస్తచాలనముండును. కరుణమునందు బాహువులు ప్రలంబితములై

యుండును. అద్భుతమునందు విస్మయమువలన స్తబ్ధము లగును. భయానకమునందు భయమువలనను స్తబ్ధము లగును. శ్లథము లగును. జారిపోయిన విధమున నుండును. ఇట్లె యన్యవిధానములందును హస్తముల సంచరణవిధానమును వివేచించుట యుక్తము. హస్తసంచారము విరామానుకూలముగ నుండుటయు విరామము ననుసరించి హస్తసంచారముండుటయు సావధానముగ సమీక్షణీయము.

౬౩౧. అలంకారవిరామాభ్యాం సాధ్యతే హ్యర్థనిశ్చయః
యే విరామాః స్మృతా వృత్తే తేష్వలంకార ఇష్యతే
౬౩౨. సమాప్తేఽర్ధే పదే వాపి తథా ప్రాణవశేన వా
పదవస్తసమాసే చ ద్రుతే బహ్వర్థసంకటే
౬౩౩. కార్యో విరామః పాదాంతే తథా ప్రాణవశేన వా
శేషమర్ధవశేనైవ విరామం సంప్రయోజయేత్

పాఠ్యప్రయోగమునం దుచ్ఛదీప్త్యాద్యలంకారములు విరామములు నర్థనిశ్చయమును సముచితము సాధింపగలవు. వృత్తమునందు విరామములుగా నుండునవి యలంకారములకు స్థానములుగ నుండును. విరామములున్న స్థలములం దలంకారములు నుండును. "యో యః శస్త్రం బిభర్తి స్వభుజగురుమదః" యను వేణీ పద్యమునందు వృత్తగతమయిన విరామము సముచితముగ నున్నది. ఆ విరామస్థలములందె ఉచ్ఛదీప్తకాకు వనుగతముగ నున్నది. వీరరౌద్రములను ప్రతిపాదించునప్పుడు స్రగ్ధరాదివృత్తప్రయోగమున పాదముల సగము సగము భాగములందు విరామ మొనరింపరాదు. పాదాంతమునందు విరామానుసరణము యుక్తము. పాఠ్యము పఠించువాని గ్రుక్కబలము ననుసరించి ప్రాణశక్తి ననుసరించి పాదాంతమున విరామభావాభావములను సాధకుడనుసరింపవలసి యుండునని వృద్ధులందురు. ఇది యుక్తముగ లేదు. "శిక్షావశేన ఆహరణీయో హి తత్రావిచ్ఛేదః" అట్టి స్థలములందుశిక్షావశమున నవిచ్ఛేదము ననుగత మొనరింపవలెను. సాధకునకు గ్రుక్క చాలుట చాలకపోవుట యనునది పర్యాలోచనీయము కాదు. శిక్షాభ్యాసవశమున సర్వము సంగతము కాగలదు. వృత్తపాఠ్యమునం దుండదగిన విరామముల నిట్లు గుర్తించునది. అవాంతరార్థవాక్యార్థము పరిసమాప్త మయినచో విరామ మనుసరింప

దగును. పదాంతమందును విచ్ఛేద మొనరింపదగును. ప్రాణవశమునను విచ్ఛేద మొనరింపవచ్చును. "ప్రాణా రసభావాద్యాః తదౌచిత్యేన ఛేదః" ప్రాణవశమున నను స్థలమున ప్రాణము లనగా రసభావాదులని యర్థము. రసభావాద్యౌచిత్యానుసారముగా విచ్ఛేదమనుసరింపదగియున్నది. పాదారంభమునందును రసభావాశ్రయానుబంధమున విచ్ఛేదమనుసరించుట సముచితముగా నుపయోగికాగలదు. రసభావాద్యౌచిత్యము ననుసరించి పదవర్ణసమాసములందును పాదాంతమందును విరామ మొనరింపదగును. ద్రుతవిధానమున్నను బహ్వర్థసంకటమున్నను ప్రాణవశమున పాదాంతవిరామ ముచితమై యగును. మిగిలిన స్థలము లందర్థవశమున విరామమును పాఠ్యమున ప్రయోగింపవలెను. చిత్తవృత్త్యంశమునకు ప్రాధాన్యము లేనప్పుడు రసభావసంపద స్పష్టసంగతమై యుండదు. అట్టి స్థలములందు విభావాదులకే ప్రాధాన్య ముండును. అచట నర్థవశమున విరామ మనుసరణీయమగును. ఎచట విరామము సుఖకరమో యర్థ మనుకూలమో తత్పరిశీలనమున విరామ మంగీకరింపదగును.

## కృప్యాక్షరములు

ఇక భావగతములు రసగతము లయిన కృప్యాక్షరములను దెలియవలసియున్నది. ఇట్లు వీనిని దెలియుట కవిభావకప్రయోక్తల కందర కావశ్యకము. అభిజ్ఞు లగువారు రచనములో భావనములో ప్రయోగములో సావధాను లగుదురు. వారి వ్యాపారము భావ్యమానమనోహర మగును. "కృపతీతి కృపః= విలమ్బితో లయః తత్ర సాధూని కృప్యాణి= సంధ్యక్షరాణి'. విలంబితమగు లయరీతికి కృపమని పేరు. అట్టి లయరీతిలో యుక్తము లగునవి కృప్యములు. సంధ్యక్షరములను కృప్యము లందురు ఆ ఈ ఊ అను దీర్ఘములు కృప్యములు. కృప్యాక్షరముల వివేకవినియోగముల నీవిధముగ గుర్తింప వలెను.

౬౩౪. ఆకారై కారవంయుక్తమైకారౌకారసంయుతం
వ్యంజనం యద్భవేద్దిష్టం కృప్యం తత్తువిధీయతే
౬౩౫. విషాదే చ వితర్కే చ ప్రశ్నేఽథామర్షే ఏవ చ
కలాకాలప్రమాణేన పాఠ్యం కార్యం ప్రయోక్తృభిః

౬౩౬. శేషాణామర్థయోగేన విరామే విరమేదిహ
ఏకద్విత్రిచతుఃపంచషట్కలం చ విలంబితం
౬౩౭. విలమ్బితే విరామే హి సదా గుర్వక్షరం భవేత్
షణ్ణాం కలానాం పరతో విలంబో న విధీయతే.

ఆ ఐ ఓ ఔ స్వరముల కూడుకొనిన వ్యంజనము దీర్ఘస్వరసహితము. కృష్యమను నక్షర మగును. విషాద వితర్క ప్రశ్నామర్షములం దీ. కృష్యవినియోగము యుక్తము. ప్రయోక్తలు కలాకాలప్రమాణాను సారమున పాఠ్యమును నిరూపింపవలెను. కలాలక్షణమగు కాలము ప్రసిద్ధము. తత్ప్రమాణము విలంబితముగ నుండును. ఆ విలంబితరీతి ననుసరించి పాఠ్యము నిర్ణయింపవలె ననుట విచ్ఛేదమె ప్రమాణ మని నట్లయినది. దీర్ఘాక్షరముల వినియోగ మిట్లున్నది. ఇక మిగిలిన హ్రస్వాక్షరముల విరామమునం దర్థయోగానుసారమున విరామ ముండుట యుక్తము. అర్థయోగానుసారమున నని యనుటచే ప్రతీతి స్ఫుట మగునట్లు విచ్ఛేద మొనర్పవలె నని భావము. కాని యతి విలంబితముగ పఠింపరాదు, హ్రస్వవర్ణపాతమునందు స్ఫుటప్రతిపత్తి యావశ్యకము. ఇట్టి స్ఫుటత విలంబితవిధానమున కలుగును. ఏక - ద్వి - త్రి - చతుః - పంచ - షట్ - కలాకాల ప్రమాణమున విలం బితరీతిని గుర్తించునది. తత్తదర్థసముచితముగ నొకకల కాని కలా ద్వికము కాని త్రికము కాని విలంబితరీతి కనుసరింపవచ్చును. ఇట్లారు కలాకాలముల వరకు విలంబితవిధానము యుక్తము. విలంబితవిరామ మునం దెప్పుడేని నిత్యము గుర్వక్షర ముండవలెను. షట్కలాతిరిక్త ముగా విలంబితవిధానము యుక్తము కాదు. తదధికవిలంబము రక్తి భంజకము. పదాంతమున కృష్యాక్షరము ననుసరించి స్వరసంచార మున విలంబితవిరామ మనుసరించుటలో షట్కలాపరిమితియె యుక్త మనుట గ్రాహ్యము.

౬౩౮. అథవా కారణోపేతం ప్రయోగం కార్యమేవ చ
సమీక్ష్య వృత్తే కర్తవ్యో విరామో రసభావతః
౬౩౯. యే విరామాః స్మృతాః పాఠ్యే వృత్తపాదసముద్భవాః
న్యాప క్రమం తజ్జ్ఞైః కార్యాస్తేఽర్థవశానుగాః

ఈ నిరూపించిన యంశమునకు పక్షాంతరమును గలదు. నిరూపితాంశ మున కధికముగా నిదియు సంగీకార్యము. భిన్నప్రయోగమును గూడ కారణోపేతముగా స్వీకరింపవచ్చును. షట్కలాతిరిక్తముగా స్వీక రింపవచ్చును. షట్కలాతిరిక్తముగా విలంబితవిరామ మనుసరించు టలో గొన్ని కారణము లుండవచ్చును. దీర్ఘకాలస్మరణము దీర్ఘకాల చింతనము మొదలగునవి యిందు కారణములు. ఇట్టి కారణము లుండగా తదనుసారమున పాఠ్యప్రయోగ మొనరింపవచ్చును. వ్యాధ్యప స్మారములును కారణము లగును. స్పష్టముగా నుండుట యస్పష్ట ముగా నుండుటయు కారణమగునని కొందరనిరి. ఎన్నివిధముల కార ణములున్నను రసభావనిర్ణయానుసారముగా సమీక్ష యొనర్చి వృత్త మునందు విరామము సంపాదింపవలెను. "వృత్తవిరామాదర్థవిరామః ప్రథమం" వృత్తవిరామము కన్న నర్థవిరామమె ప్రథమమని సూక్తి యున్నది. కావున పాఠ్యమునందు కల వృత్తపాదసముద్భవములయిన విరామములను రసభావవశానుగములు కానపుడు తద్విధు లా విరామ క్రమముల నతిక్రమించి వేరుగా నర్థవశానుగము లయిన క్రమవిరామ ములను స్వీకరింపవచ్చును. అతిక్రమించి యనుట విశేషోపక్రమ మయి నను సామాన్యోపసంహారము కలది యగుట యిట్టిస్థలములందు సమ్మ తమె యగును.

౮౪౦. నాపశబ్దం పఠేత్తజ్ఞో భిన్నవృత్తం తథైవ హి
విశ్రమేన్నావిరామేషు దైన్యే కాకుం నదీపయేత్

అర్థవశానుగములు కాని విరామములను పఠింపరాదు. అర్థవశములు కాని వానిని విరామమున పఠింప రాదని భావము. అపశబ్దము పఠింప రాదు. తద్విధుడు భిన్నవృత్తముగ పఠింపరాదు. అతద్విధు డట్లు పఠించుటను సహింపరాదు. విరామము లేని విభాగమున పాఠమునకు విశ్రాంతి కూర్పరాదు. దైన్యము గోచరింప వలసి యుండగా కాకు స్వరమును దీపింపచేయరాదు. వివక్షితమగు శబ్దము స్పష్టముగ గోచ రించునట్లు పలుక నలెను. "వరదం ధ్యాయతి" యను స్థలమున "వర" వఱకు విచ్ఛేద ముండునేని శ్రోత 'దంధ్యా' విని 'మధ్య' యని భావింపవచ్చును. అపు డర్థప్రతీతి యుండదు. 'వరదం' పలికి విచ్ఛే

దము స్ఫురింపజేసి సవిరామముగ పాఠముచ్చరించినచో మధ్యలో శబ్దాన్తరప్రతిభానుసంధానమున 'ధ్యాయతి' శబ్దము తెలిసికొనును. పాఠ్యముగ నున్న వృత్తమును భిన్నవృత్తముగ నొనర్చి పలుకరాదు పాఠ్యప్రయోక్త సరియగు విచ్ఛేదము ప్రదర్శింపడేని శ్రోతకన్యవృత్త భ్రాంతి కలుగును. చూడుడు !

"భవ శంకరభాజనం యే జగతీహ భవన్తి కేచన"

అను పద్యభాగమున "భవ శంకర భాజనం యే" వఱకు పఠించినచో అనగా, 'యే' శబ్దమును పూర్వపాదముతో కూర్చి పలికినచో వేరొక వృత్తమగును గాని తరువాతి పాదమున వృత్తభంగము కలుగును. భిన్నవృత్తము పఠింపరాదనుట భిన్నవృత్తము పఠింపరాదని భావము కాదు. పాదమున కొక వృత్తముగా పఠింపరాదని భావము. విచ్ఛేద ప్రాధాన్యజ్ఞాపకమునకె యిది యంతయు చెప్పుట యయినది. శబ్దచ్యుత దోషము స్పష్టము చేయుటకే యయినచో నపశబ్దము పఠింపవచ్చును. భిన్నవృత్తదోషాభిధానమున కయినచో భిన్నవృత్తముగను పఠింప వచ్చును. వస్తుతః శబ్దచ్యుత భిన్నవృత్త దోషాభిధానము ప్రకృతము వివక్షితము కాకపోయినను విచ్ఛేదవశమున నట్టిభావ ముదయింప వచ్చును. ఈ యంశ మిట్లు తాత్పర్యసంగతముగా నున్నది. "విశ్ర మేన్నావిరామేషు" ఇట్లు విచ్ఛేదము భూయోవిషయవ్యాపకమై యున్నది. దీప్తకాకువున కంతటి భూయోవిషయవ్యాప్తి లేదు. శోకా దికములందు మగ్నచిత్తవృత్తులగు వారలకు కాకుదీపన మావశ్యకము కాదు. దైన్యమునందు దీప్తకాకువు శోభావహము కాదు. ఇతర విషయములందు కాకువునకు దీపనము సర్వత్ర శోభావహమగును.

ఇట్లీవిధముగా నిచట స్వరములు క్రమము మర్యాద స్థానత్ర యము ఆశ్రయము ఉదాత్తాదులు స్వరూపము స్వరూపపరిపూరకము లయిన యలంకారములు ఇంకనింక నితికర్తవ్యతారూపములయిన యంగములు నిరూపితము లయినవి. స్వరభేదమువలన గలుగు కాకు స్వరవిశేషము ప్రతిపాదిత మయినది. విశిష్టమగు కాకువు వివక్షిత మయినచో నందలి స్వరభేదము రసభావాదిద్యోతన మొనరించుటయు ప్రతిపాదిత మయినది. స్వరముల స్థానభేదమువలన ధర్మాంతరోదయ

మున్నను తదంగకృతమయిన శోభావిశేషము కలుగదనుటయు నిరూపితనుయినది. కావున ప్రయోక్తలు పాఠ్యపాఠమున శ్రద్ధాళువులై యుండుట యావశ్యకమని ముహుస్సూచన మొనరించుటయు యుక్తము.

౬౪౧. వర్జితం కావ్యదోషైస్తు లక్షణాఢ్యం గుణాన్వితం
స్వరాలంకారసంయుక్తం పఠేత్పాఠ్యం యథావిధి

౬౪౨. అలంకారా విరామాశ్చ యే పాఠ్యే సంస్కృతే స్మృతాః
త ఏవ సర్వే కర్తవ్యాః స్త్రీణాం పాఠ్యే త్వసంస్కృతే

౬౪౩. ఏవమేతత్స్వరకృతం కలాకాలలయాన్వితం
దశరూపవిధానే తు పాఠ్యం యోజ్యం ప్రయోక్తృభిః
ఉక్తం కాకువిధానం తు యథావదనుపూర్వశః

ప్రయోగమునందుండు పాఠ్యస్వరూపలక్షణ మిందున్నది. కావ్యదోషరహితము కావ్యలక్షణపరిపూర్ణము గుణసహితము స్వరాలంకారసంయుక్తము పాఠ్యము. ఇట్టి పాఠ్యస్వరూపకథనము ప్రాక్తనవిశేషములతో సంగతి కలది. కావ్యదోషము లేవియు నుండరాదని "వర్జితం కావ్యదోషైః" వ్యస్తకథనమున సూచితము. కావ్యలక్షణము లన్నియు నుండవలెనని 'ఆఢ్యం' పదమున సూచితము. లక్షణము లుండగా గుణములు కూడి యుండుట శోభాహేతువు. శబ్దార్థగుణసంధానము స్వరాలంకారసంయోజనమున కవకాశమిచ్చును. ఇట్టి పాఠ్యమును యథావిధిగా నిరూపింపవలెను. సంస్కృతపాఠ్యమునందున్న యలంకారములు విరామము లన్నియు స్త్రీల పాఠ్యమగు నసంస్కృతమున యోజనము చేయవలెను. సంస్కృతమునందు నిరూపిత మయిన యీ కాకువిధానము ప్రాకృతాధ్యాయప్రమేయభూత మయిన ప్రాకృతమునందు నతిదిష్ట మగుటయె యుక్తము. కలాకాల లయాన్వితమయిన యీ స్వరకృతమగు పాఠ్యమును ప్రయోక్తలు దశరూపవిధానమున ప్రయోగింపవలెను. దశరూపవిధానమునం దీ లక్షణశోభాస్పదమయిన పాఠ్యమును కూర్పవలెను. ఇట్లీ కాకువిధాన మానుపూర్వీసుందరముగా నిరూపిత మయినది. ఈ ప్రఘట్టసమారంభమునందు సర్వము కాకుప్రాధాన్యసూచక మని ప్రతిపాదిత మయినది. ఈ యుపసంహారమున కాకువిశిష్టత సూచిత మయినది.

## ప్రకృతివిచారము

ఇక ప్రకృతిలక్షణపరిశీలన మావశ్యకము. సంక్షేపముగా ప్రకృతి మూడు విధముల నున్నది. పురుషుల ప్రకృతి మూడువిధములు. స్త్రీల ప్రకృతియు మూడువిధములు. ఉత్తమాధమమధ్యమప్రకృతి వారికి వీరికి నున్నది.

### ఉత్తమప్రకృతి

౬౪౪. జితేంద్రియా జ్ఞానవతీ నానాశిల్పవిచక్షణా
దక్షిణాథ భగాలక్ష్యా దీనానాం పరిసాంత్వనీ
౬౪౫. నానాశాస్త్రార్థసంపన్నా గాంభీర్యౌదార్యశాలినీ
ధైర్యత్యాగగుణోపేతా జ్ఞేయా ప్రకృతిరుత్తమా.

ఉత్తమప్రకృతిస్వరూప మిూ విధమున నుండును. జితేంద్రియత్వము జ్ఞానవత్త్వ ముత్తమప్రకృతి ప్రథమస్వరూపము. ఇదియున్న నితరములు శోభింపగలవు. దీనివలన నితరములకు స్వరూపసమున్మేషము కలుగును. నానావిధములయిన శిల్పవిశేషములందు విచక్షణాత్మకమయిన బుద్ధివృత్తి యీ ప్రకృతియందుండును. దీననె యుక్తాయుక్తసమీక్షణము సంగతమగును. ఈ ప్రకృతికల వ్యక్తి దక్షిణుడగును. ఉచ్చావచము లం దుచ్చత్వనీచత్వముల ననుసంధింపక దక్షిణుడు సమీకృత సమంజస భావమున సమరసుడై ప్రవర్తించును. దాక్షిణ్యభావ ముత్తమత్వమునకు యోగ్యమగు నిదర్శనము. మహనీయమహాభావులం దవభాసించు భగశబ్దవాచ్యములయిన యైశ్వర్య వీర్య యశశ్శ్రీజ్ఞాన వైరాగ్యముల సంపద యుత్తమప్రకృతి నభివ్యక్తము చేయునదై గోచరించును. దీనవ్యక్తుల పరిసాంత్వన మిూ ప్రకృతియందనుగతముగ నుండును. నానాశాస్త్రముల పరమార్థసంపత్తి కలదై గాంభీర్య మౌదార్యము ధైర్యము త్యాగము మొదలగు గుణముల సంబంధమున శోభాసహితమై యుత్తమప్రకృతి యుండుటను గుర్తింపవలెను. స్వభావసహజమయిన ప్రకృతియే ప్రకృతిపదవాచ్యము. ప్రకృతి యనదగిన ప్రకృతి యిట్లే యుండును. ఈ ప్రకృతిస్వరూపలక్షణ న్యూనత యుండునేని వైపరీత్య ముండునేని యట్టి ప్రకృతులకన్న

ఘీనికి వైలక్షణ్య ముద్బోధించుట కివి యుత్తమప్రకృతి యని వ్యవహరించుట సంగత మగుచున్నది.

## మధ్యమప్రకృతి

౯౪౬. లోకోపచారచతురా శిల్పశాస్త్రవిశారదా
విజ్ఞానమాధుర్యయుతా మధ్యమా ప్రకృతిః స్మృతా.

ఈ ప్రకృతియందు లోకోపచారచాతుర్య మున్నది. శిల్పశాస్త్రవైశారద్య మున్నది. ఆనుభవికమయిన విజ్ఞానమాధుర్య మున్నది. ఇట్టి యీ స్వరూపసంపద యిందను క్తము లయిన యితరములకు నుపలక్షణము. ఏవంప్రాయము లయిన గుణముల సంబంధమె యిందు ముఖ్యవివక్షితము కాదు, అధమప్రకృతియందుండు విపరీతధర్మప్రవృత్తి యిందుండమియు వివక్షితము. గుణబాహుల్య ముండుటకన్న దోషరాహిత్యముండుట యభినంద్యము.

౯౪౭. రూక్షా వచసి దుశ్శీలాః కుసత్త్వాః స్వల్పబుద్ధికాః
క్రోధనా ఘాతకాశ్చైవ మిత్రఘ్నాశ్ఛిత్రఘాతకాః

౯౪౮. పిశునా ఉద్ధతా వాక్యైరకృతజ్ఞా స్తథాలసాః
మాన్యామాన్యావిశేషజ్ఞాః స్త్రీలోలాః కలహప్రియాః

౯౪౯. సూచకాః పాపకర్మాణః పరద్రవ్యాపహారిణః
ఏభిర్దోషైస్తు సంబంద్ధా భవంతి హ్యధమా నరాః.

మొదట ప్రకృతిసహజస్వరూపము నిరూపిత మయినది. పిమ్మట వైపరీత్యానుదయాత్మకమయిన స్వరూపము కీర్తితమయినది. ఇందు విపరీతప్రవృత్తి కలవారి స్వరూపము ప్రతిపాదిత మయినది. అచట ప్రకృతివిశేషముల జెప్పుట ఇచట ప్రకృతి కలవారి చెప్పుట సాభిప్రాయము. ఆయా వ్యక్త్యాశ్రయమున ప్రకృతి యట్టిదై గోచరించుటను భావింపవలెను. అధమప్రకృతి కలవారిట్లుందురు. ఇట్లుండువారి ప్రకృతి యధమప్రకృతి యని స్పష్టార్థము. అధమనరు లిట్టి దోషములు కలిగి యుందురు. వారు కేవల మట్టివి కలవారగుటయె కాదు. అట్టి దోషములతో వారు సంబద్ధులై యుందురు. అట్లు దోషసంబద్ధులై వారు నిత్యదుష్టు లగుదురు కావున స్వభావదోషమును విడనాడ

జాలరు. కావుననె ప్రకృతియన్న ప్రకృతి వారిలో నుండదు. వారధములు. అధములందుండు ప్రకృతి యధమప్రకృతి. అధము లెట్లుందురు? ఇట్లుందురు.

అధములు వచోవ్యాపారమున రూక్షముగా నుందురు. కటువుగా పరుషముగా భాషింతురు. మాట కటువుగా నుండుటయె కాదు. వారి శీలము దుష్టము. వారి సత్త్వము కుత్సితము. వారి బుద్ధి స్వల్పము. వారు క్రోధనులై ఘాతకులై మిత్రఘ్నులై చిత్రఘాతకులై యుందురు. వారు పిశునస్వభావులు. లోభదూషితులు వారి వాక్యప్రయోగ ముద్ధతము. కృతము గుర్తింపరు. అలసులు. మాన్యామాన్య విశేష మేమియు వారు గుర్తింపజాలరు. మాన్యు నమాన్యు చేయుదురు. విమాన్యుని మాన్యు నొనర్తురు. స్త్రీలోలురై స్త్రీనిమిత్తముగా కలహముపడువారై వారిపై వీరిపై కొండెములు చెప్పుచు ప్రవర్తింతురు. పాపకర్ములై పరద్రవ్య మపహరించు వారగుదురు. అధము లీ దోషములతో నుందురు. ఈ దోషములు మాత్రమె వారి యందుండుననుట కాదు. ఇట్టి దోషములతో నుందురు. ఈ చెప్పిన దోషములు సర్వవిధదోషవిశేషములకు సూచకములు. ప్రకృతిపద వాచ్యమయిన ప్రకృతి సహజములగు విశేషములు అధములందుండ వని భావము. అవి యుండనందున వీరధములయినారనియు గుర్తించుట యుక్తము. ఈదృశస్వభావులయిన యధముల కవీదృశ మయిన నాట్యముతో నేమి సంబంధము? ఇట్టి వారయినను వీరికి నాట్యముతో సంబంధమున్నది. "త్రైలోక్యభావానుకీర్తనం నాట్యం" కదా! నాట్యముత్తములకు మాత్రమే యాదర్శము కాదు. నాట్యాదర్శమున నందరి రూపములు గోచరించును.

## స్త్రీ ప్రకృతి

శీలధర్మానుసారమున మానవుల ప్రకృతి యిట్లు త్రివిధముగా నున్నది. ఇట్టి విశేషముననె స్త్రీలప్రకృతియు ముత్త్రివిధము. ఇచటనె వరుసవరుసగా స్త్రీల ప్రకృతియు నిరూపితమగుట యుక్తము. ఇదిగో! యిందుత్తమ ప్రకృతి ప్రమద యున్నది.

## ఉత్తమప్రకృతి

౯౩౦. మృదుభావా త్వచపలా స్మితభాషిణ్యనిష్ఠురా
గుణానాం వచనే దక్షా సలజ్జా వినయాన్వితా
౯౩౧. రూపాభిజనమాధుర్యై గుణైః స్వాభావికి స్మృతా
గాంభీర్యధైర్యసంపన్నా సా జ్ఞేయా ప్రమదోత్తమా

ఉత్తమప్రకృతి కల ప్రమద మృదుభావ చాపల్యరహిత స్మితభాషిణి యనిష్ఠురయగును. ఈమె గుణనిరూపణమున నిత్యమాసక్తయగును. సమర్థయు నగును. ఈ యుత్తమ సముచితసలజ్జాస్వభావసుందర. ఈమె లజ్జ ఈమెకు భూష. ఈ యమ్మ వినయాన్విత. రూపమధుర. అభిజనమధుర. వంశగౌరవమర్యాదామధుర. ఈమె గుణములీమెకు స్వభావసహజములుగా గోచరించును. ఆహార్యములు కృత్రిమములుగా నుండవు. కపటనాటితకములుగా నుండవు. గాంభీర్యధైర్యసంపన్నయై యుత్తమ ప్రమద దేవీభావమున నుండును.

## మధ్యమప్రకృతి

౯౩౨. నాత్యుత్కృష్టైరశిథిలైరేభిరేవ వృతా గుణైః
అల్పదోషానువిద్ధా చ మధ్యమా ప్రకృతిః స్మృతా

స్త్రీల మధ్యమప్రకృతి యిట్లుండును. సామాన్యముగా నుత్తమప్రకృతిగతము లయిన గుణములీ ప్రకృతి యందునుండును. కాని యవి యత్యుత్కృష్టము లుదాత్తములుగా నుండవు. శిథిలప్రాయములుగను నుండవు. నాత్యుచ్చములు నాతినీచములుగా నుండును. నాతిరమ్యములు నాతిహీనములుగా నుండును. అల్పదోషానువిద్ధములై యుండును. దోషసంబంధమున్నను ఆ దోషము లల్పము లయినందున గుణములు తదధికములుగా నుండును గావున దోషములంతగా ప్రతిభాసింపవు. కావుననె గుణము లశిథిలములుగా నుండుననుట యుక్తము. ఈ మధ్యమప్రకృతి యల్పదోషానువిద్ధ మనుటచే నుత్తమప్రకృతి యందు దోషసంబంధముండ దనుట సూచితము. ఏప్రకృతియేని యత్యంతము దోషరహితముగా నుండునా? ఆత్యంతికదోషాభావమసులభమె. అయినను ప్రతిభాసించుదోషము లుండవనుట గ్రాహ్యము. "కిమప్రతీయమానమేవ దోషమారోపయామః" గోచ

రింపకున్నను దోషమున్నదని యనవలెనా? ఇందొక యుక్తియున్నది. దోషసాహిత్యము దోషరాహిత్యము నిరూపించుట యిచటి తాత్పర్యము కాదు. నాట్యశిక్షితధీవృత్తులయిన నాట్యవిన్నటులు నాట్యమున నట్టివారి నభినయింపవలసి యున్నది. ఉన్నతాదర్శసముపేతోత్తమప్రకృతిప్రదర్శనమున దోషగంధము కూర్పరాదు. దోషమేదేని సంభావించి తత్కృతమయిన విశేషమును నిబంధింపరాదు. ఇట్టి యీ విచారధారానుసారమున సర్వము సంభావింపదగును.

## నపుంసకప్రకృతి

పురుషులకు నిరూపితమయిన యధమప్రకృతి యధమస్త్రీలకు నట్లె యుండునని గుర్తింపవలెను. అధమస్వభావమునందు స్త్రీకృతమని యస్త్రీకృతమని విశేషముండదు. స్త్రీపుంసప్రకృతి నిరూపణ ప్రసంగమున నపుంసకప్రకృతియు నిరూపణీయమగును. నపుంసకుడు సంకీర్ణాధమరూపమున రెండువిధముల నుండును. సంకీర్ణునందు స్త్రీభావము పురుషభావము వ్యామిశ్రమై యుండును. నపుంసకాధము డింకనధముడై యుండును. వాని చేష్టావిశేషములు కామసూత్రాదులందు నిరూపితములయినవి. చేటి మొదలగువారి ప్రకృతియు సంకీర్ణముగ గూడ నుండును. ఇట్టి విశేషములను లోకస్వభావానుసారమున గుర్తింపవచ్చును. వానిని విస్తరించుట యావశ్యకము కాదు.

## నర్మసచివులు

విదూషకుడు శకారుడు మొదలగు వారు నాటకములందు గలరు. వారివంటి వారు నింకననేకులున్నారు. వారందరు నాటకమున సంకీర్ణస్వభావమున నుందురు. ఒకప్పు డుత్తమభావమున నుందురు. మఱియొకప్పు డన్యథా యుందురు. ఆభాషింపదగిన వ్యక్తుల ననుసరించి యుందురు. అందుననె వారు సంకీర్ణముగ నుందురని నాట్యబుధు లభ్యూహించుట యుక్తము. ఈ నిరూపితములు పురుషస్త్రీనపుంసకప్రకృతులు, ఈ ప్రకృతులకన్నిటికి శీలసంశ్రయమగు విధానము కలదు. దాని నిటుపై నిరూపించుట యుక్తము. మధ్యమోత్తమప్రకృతి ననుసరించిన నాయకులు నాలుగువిధముల నున్నారు. వీరందరు నానా

లక్షణలక్షితులు. ధీరోద్ధతులు, ధీరలలితులు, ధీరోదాత్తులు ధీర ప్రశాంతులు నని నాయకులు నాలుగువిధముల నున్నారు. దేవప్రకృతులు ధీరోద్ధతులు. రాజులు ధీరలలితులు, మంత్రిసేనాపతులు ధీరోదాత్తులు బ్రాహ్మణులు వణిజులు ధీరప్రశాంతులని లోకవ్యవహారము కలదు. ఈ నిరూపించిన దేవాదులకు ధీరోద్ధతాదులకు నాల్గువిధములుగా నలుగురు విదూషకు లుందురు. వీరు నర్మసచివులు. దేవవ్యక్తులకు రాజవ్యక్తులకు విదూషకులనదగినవారు నర్మసచివులుగా నుండుట నాటకములందు గోచరించుచునె యున్నది. యౌగంధరాయణునివంటి మహామాత్యులకు తత్స్వభావయోగ్యులగువారె సచివులుగ నుందురు. ప్రతిజ్ఞానాటకమునం దిది విశదము. బ్రాహ్మణుడగు ధీరప్రశాంతునకు శిష్టబ్రాహ్మణుడె విదూషకకార్యధూర్వహుడగును. చారుదత్తములో మృచ్ఛకటికములో నిది స్పష్టము. రాజుల విప్రలంభసమయమున నొక విశేషమున్నది. విప్రలంభమునందు సుహృద్ధర్మమును దాసి నిర్వహించును. దాసీ సఖీ చేటీ దూతీ ప్రభృతులు నాయికాసంధానచాతుర్యము కలవారుగనె మాలవికాదిరూపకములందు గోచరించుచున్నారు. ఇట్లు దౌత్యము నిర్వహించువారు సంకథాలాపపేశలముగా నుందురు. వ్యసనసమయములందు ప్రాప్తదుఃఖలు నుందురు. అంతఃపురికపారివారికజనులలో నిట్టి వారి పరిగణనమున్నది.

## నాయకుడు

౯౩౨. తథా పురుషబాహుల్యప్రధానో నాయకః స్మృతః
తత్రానేకస్య భవతో వ్యసనాభ్యుదయౌ పునః

౯౩౩. ప్రకృష్టౌ యత్ర తౌ స్యాతాం న భవేత్తత్ర నాయకః
ఏతే తు నాయకా జ్ఞేయా నానాప్రకృతిలక్షణాః

రూపకములందుండదగిన నాయకుని స్వరూపప్రవృత్తిలక్షణము లీవిధముగ నున్నవి. నాటకనాయకునకు పురుషబాహుల్యముండును. అభ్యంతరోపచారదక్షులు బాహ్యోపచారదక్షులయిన పురుషు లనేకులు రాజనాయకు ననుసరించి యుందురు. అట్లు పురుషబాహుల్యముండుట నాయకునకు ప్రధానస్వరూపము. అట్లు పరీవారపరీవృతుడై యుండు నాయకునకు వ్యసనాభ్యుదయములు పౌనఃపున్యమున గలుగు

చుండుటయు నుండును. పాలనాసక్తుడయిన ప్రభువునకు రాజ్యోప ద్రవములు సంభవించును. సంధివిగ్రహాదులు సంఘటిల్లును. షాడ్గుణ్య ప్రయోగ మవశ్యంభావి యగును. కలిగిన వ్యసనము దూరీకరించుట కునై యభియోగ ప్రత్యభియోగములు నావశ్యకము లగును. అపు డభ్యుదయము కలుగుట యున్నది. ప్రతీపశక్తుల ప్రాబల్యమున మఱల వ్యసనమును గలుగును. పునరభ్యుదయము సంప్రాప్తమగును. ఇట్లు ప్రకృష్టము లయిన వ్యసనాభ్యుదయములు పునఃపునస్సంభూతము లగు టను నాయకున కభివర్ణింపవలెను. ఏకాంతసుఖము కాని యేకాంత దుఃఖము కాని రూపకమున నుండదు. సుఖదుఃఖమిశ్రమయిన రూపక ధర్మనియతముగ వ్యసనాభ్యుదయము లుండుట యావశ్యకము. నాయకు నిట్లు నిబంధించుట యావశ్యకము. నానాప్రకృతిలక్షణోపేతులై ఇట్లు నాయకు లుందురు. వారి నట్లు నిబంధింపవలెను. నానాప్రకృతిలక్షణ లక్షిత లయిన స్త్రీలును ధీర-లలిత-ఉదాత్త-నిభృతస్వరూపమున నుందురు. నాయికలిట్లు గుణసముపేతలై దివ్యజాతివనిత లనదగి యుందురు. కులాంగన నిత్యముదాత్తనిభృతయే యగును. ఆమెయందు ధీరోదాత్తభావము ధీరశాంతస్వభావము సంగతమై యుండును. సంప దాపదలలో నామె కులీనస్వభావమును విడనాడదు. నారీగౌరవమునకు భంగము రానీయదు. గణికావనిత లలిత యగును. ఉదాత్తయు నగును. లలితప్రకృతి శృంగారప్రకృతి ఔదాత్త్యము కలదయినను గణిక లాలిత్యము వీడదు. శిల్పకారికయు గణికవలెనె లలితోదాత్త ప్రకృతి యగును.

## రాజోపచారము

ప్రకృతుల కన్నిటికి నుపచారము రెండువిధముల నుండును. బాహ్యోపచార మాభ్యంతరోపచార మని యా యుపచారముల నామసంకేతము.

> ౯౩౪. తత్ర రాజోపచారస్తు యో భవత్యాంతరస్తు సః
> తతో బాహ్యోపచారస్తు యః స బాహ్యక ఉచ్యతే.

సామాన్యాభినయప్రసంగమునందు నిరూపితమయిన రాజోప చార మాంతరోపచారముగా పరిగణనీయము. అందలి బాహ్యోప

చారమునకు బాహ్యామని సంకేతము. బాహ్యామె బాహ్యాకము ఆభ్యంతరమయిన రాజోపచారమంతయు నంతఃపురసమాశ్రయముగ నుండును. అంతఃపురాశ్రయమయిన రాజోపచారవిశేషము సామాన్యాభినయప్రఘట్టమున ప్రతిపాదితమయినది. అంతఃపుర సమాశ్రయమయిన స్త్రీవిభాగ మిందు నిరూపితమగును.

మహాదేవి - దేవి - స్వామిని - స్థాపిత - భోగిని -
శిల్పకారిణి - నాటకీయ - నర్తికి - అనుచారిక
పరిచారిక - సంచారిక - ప్రేషణచారిక - మహత్తరిక
- ప్రతీహారి - కుమారి - స్థవిర ఆయుక్తిక-నపుంసక

అను వీరంతఃపురపరివారజనము. వీరి రూపస్వభావము లీరీతి నున్నవి. అందు మహాదేవీరీతి.

౯౩౩. తత్ర మూర్ధాభిషిక్తా యా కులశీలసమన్వితా
గుణైర్యుక్తా వయస్థా చ మధ్యస్థాఽక్రోధనా తథా
౯౩౪. ముక్తేర్ష్యా నృపశీలజ్ఞా సుఖదుఃఖసహా సమం
శాంతిస్వస్త్యయనే భర్తుః సతతం మంగలైషిణీ.
౯౩౫. శాంతా పతియుతా ధీరా అంతఃపురహితే రతా
ఏభిర్గుణైస్తు సంపృక్తా మహాదేవ్య ఉదాహృతాః.

మహాదేవీనామసంకేతమున నున్న యంతఃపురవనిత మూర్ధాభిషిక్త పట్టాభిషిక్త మహారాజ్ఞి యయి యుండును. ఆమె సర్వాంతఃపురప్రధాన కులశీలసమన్విత, సముచితములయిన యుత్తమగుణములతో కూడియుండును. వయసులో నుండును. నడివయసులో నుండును. మహాదేవి క్రోధన కాదు. ఈర్ష్యాగ్రస్త కాదు. ముక్తేర్ష్య, నృపశీలాభిజ్ఞయై ప్రవర్తించును. సమముగా సుఖదుఃఖములను సహించునది యగును. తన భర్తయగు ప్రభువునకు శాంతిస్వస్త్యయనముల నాపాదించు శుభకర్మములం దాసక్తురాలై యుండును. "సతతం మంగలైషిణీ" నిరంతరము తన ప్రభువునకు మంగల మాశించునదిగ నుండును. శాంతయై నిత్యము పతిసంగతయై ధీరచిత్తయై యంతఃపుర హితేరతయై యుండును. ఇట్టి గుణసంపృక్తలగు స్త్రీలు మహాదేవీ పదమున నాభాషింపదగియున్నారు. ఈ చెప్పిన విశేషములు సామా

న్యముగా నిర్దిష్టములు. భాసదాసహర్షాదుల రూపకములందు మహా దేవీవిశేషములు స్పష్టనిర్దిష్టము లయినవి. తదనుసారమున నింక నభ్యూహింప వచ్చును. ఇక దేవీరీతి;

౯౩౭. ఏభిరేవ గుణైర్యుక్తాః సత్సంస్కారైస్తు వర్జితాః
గర్వితాస్త్వపి సౌభాగ్యాత్ప్రీతిసంభోగతత్పరాః
౯౩౮. శుచినిత్యోజ్జ్వలాకారాః ప్రతిపక్షాభ్యసూయికాః
వయోరూపగుణాఢ్యాస్తు యాస్తా దేవ్యః ప్రకీర్తితాః.

దేవీపదప్రతిపాద్యలయిన రాజవనితలును మహాదేవీగుణగణ యుక్తలె యగుదురు. అయిన నంతటి యౌదాత్త్యము వీరిలో నుండదు. వారలకు గల సత్సంస్కారములు వీరలకుండవు. అట్టి సంస్కారవర్జితలు కావుననే వీరు గర్వితలగుదురు. సౌభాగ్యగర్వమున నుందురు. ఆత్మసౌభాగ్యాభిమానమున నితరవనితల లక్ష్యపెట్టరు. నిత్యము ప్రీతి సంభోగతత్పరలై యుందురు వీరి యాకారము శుచిరుచి గలదిగా నిత్యముజ్జ్వలముగా నుండును. సపత్నీజనమును ప్రతిపక్షముగ భావింతురు గావున వారలకు సంబంధించిన వారలను (ప్రతిపక్ష్యలను) నిత్యమభ్యసూయింతురు. ఈర్ష్యపడుదురు. వయోరూపగుణాఢ్యలై యుందురు. ఇట్టి లక్షణములు కలవారు దేవీపదమున ప్రకీర్తితలై గ్రంథములందు గోచరించుచున్నారు., అట్లే వీరి నిబంధనముచితము. ఇక స్వామిని ;

౯౬౦. సేనాపతేరమాత్యానాం భృత్యానామథవా పునః
భవేయుస్తనయాస్తాస్తు ప్రతిసమ్మానవర్ధితాః
౯౬౧. శీలరూపగుణైర్యాస్తు సంపన్నా నృపవల్లభాః
స్వగుణైర్లబ్ధమాహాత్మ్యాః స్వామిన్య ఇతి తాః స్మృతాః

రాజవనితలలో కొందరు స్వామినీపదమున జెప్పదగిన వారుందురు. స్వామిని సేనాపతి కుమారిక, అమాత్యుని కూతురు, ఇంక నితరోద్యోగుల పిల్లలయినను స్వామినీపదమున జెప్పదగినవారె యగుదురు. సేనాపతిమంత్రిభృత్యకుమారికలయిన కన్యలు రాజకాంక్షానుసారమున రాజవల్లభ లగుదురు. సేనాపతిసచివాదుల సంకల్పమున గాని రాజవల్లభలగుదురు. జనకుల యార్థికప్రయోజనముల కేని యా తనయలు రాజవల్లభ లగుదురు. అపరిహార్యస్వసంకల్పబలప్రేరణమున

నేని వారు రాజవల్లభ లగుదురు. వీరందరు ప్రీతిసమ్మానవర్ధితలు. జననీజనకుల యాదరాభిమానములతో పెదిగినపిల్లలు. వీరిట్టివారు కావలెననియు తజ్జనకు లాదరాభిమానములతో పెంచియుందురు. అంతటి ప్రీతిసమ్మానవర్ధితలయిన వీరు స్వభావసముచితముగా శీలరూప గుణసంపన్న లగుదురు. స్వగుణవిశేషములచే నట్టి మహత్వము కలవా రగుదురు. శీలగుణసౌందర్యమున రాజవల్లభలై వీరు స్వామినీపద గౌరవము పొందుదురు. ఇటుపై స్థాపిత-భోగిని ;

౬౭౨. రూపయౌవనశాలిన్యః కర్కశా విభ్రమాన్వితాః
అతిసంభోగకుశలాః ప్రతిపక్ష్యాభ్యసూయికాః

ఇందు స్థాపిత భోగిని యను రాజవనితల స్వరూపమున్నదని భావించుట సమంజసము. వీరిద్దరి స్వరూపలక్షణ మేకవిధముగనున్నను రాజస్వీకారమునందలి విశేషమున వీరియందును విశేషముదయించినది. రాజాదరమున స్వీకరించి యుంచిన వనిత స్థాపిత యగును. భోగార్థము సమీపమున చతురలయిన వనితలు భోగినులయినారని భావింప వచ్చును. పూర్వవనితలు ధర్మార్థశృంగారసంగృహీతలు. వీరు కామ శృంగారసంగృహీతలనియు భావింపవచ్చును. ఇట్టి వీరు రూపయౌవన సంపదలచే ప్రగల్భలగుదురు. శాలీనమతి కల వనిత లగుదురు. కర్కశ స్వభావ లగుదురు. విభ్రమవిశేషములు కల వారగుదురు. అత్యంతము సంభోగకుశలతను ప్రదర్శింతురు. బాహ్యసంభోగ ప్రక్రియాప్రవీణలు. ఆభ్యంతరసంభోగ సంప్రక్రియాచతురలు. బంధసంభోగసంబంధమున సమర్థలు. ఎదురెత్తు లిచ్చువారలగు వీరు వలచి వలపింపగలరు. ఇట్టిట్టి వారగుటచే ప్రతిపక్షమువారి నసూయించువారగుదురు. తమ ప్రియప్రియులు సంభోగసరసలు కారని సంయోగసుఖ మిాజాలరని చెప్పి చెప్పి కొండెములు పలుకుదురు. సవతుల నట్లీర్ష్యపడి తమ సంగతిసబంధము చక్కజూచుకొందురు. శిల్పకారిక ;

౬౭౩. దక్షా భర్తుశ్చ చిత్తజ్ఞా లేఖ్యాలేఖ్యవిచక్షణాః
శయనాసనభోగజ్ఞా మధురాశ్చతురా స్తథా
దక్షాః సౌమ్యాః స్ఫుటాః శ్లక్ష్ణా నిభృతాః శిల్పకారికాః

ఇందు శిల్పకారికలన్న స్త్రీల స్వభావమున్నది. వీరు దాక్ష్యము కలవారు. పరుల వంచనములకు లొంగరు. భర్తృచిత్తజ్ఞలై ప్రవర్తిం

తురు. లేఖ్యములం దాలేఖ్యములందును విచక్షణలై యుందురు. శయనవిధుల నాసనవిధులను భోగవిధులను చక్కఁగా గుర్తించి ప్రవర్తింతురు. మధురభాషిణులు, చతురస్వభావలు, భోగసంభోగ దక్షులు, సౌమ్యప్రకృతికలవారై యుందురు. స్ఫుటాకృతి కలిగి యుందురు. శ్లక్ష్ణస్వభావలై యుందురు. ఇట్టి యీ శిల్పకారికలు నిభృతస్వభావలు. శాంతభావలు. ఈర్ష్యాసూయలను పెంచుకొనరు. సుందరశిల్పము నిర్మాణింపగలరు. శిల్పసౌందర్యమున నుండగలరు.

౯౬౪. స్వరతాలయతిజ్ఞాశ్చ తథా చార్యోపసేవికాః
చతురా నాట్యకుశలాశ్చోహాపోహ విచక్షణాః
రూపయౌవనసంపన్నా నాటకీయాశ్చ నర్తకాః.

నాటకీయవనితలు కలరు. వారలకు స్వరతాలలయజ్ఞానముండును. యతిపరిజ్ఞానముండును. నాట్యాచార్యుని వారు సేవింతురు శిక్షణము గైకొందురు. నాట్యగాంధర్వచతుర లగుదురు. నాట్యకౌశలము కలవార లగుదురు. ఊహాపోహావైచక్షణ్యము కలిగి యుందురు. రూపయౌవనసంపన్నలై యుందురు. ఇట్టి వీరు నాటకీయ వనితలు. రాజాంతఃపురములందుండు రంగశాలలందు నాటకీయవనితల నాట్యప్రయోగము లుండును. అందు వీరు నియుక్తలై స్వకార్యకౌశలము ప్రకటింతురు. తత్తన్నియతకార్యశిక్షణనియతి కలవారా యా కార్యకరణమున సమర్థ లగుదురనుట ప్రసిద్ధము. నాటకీయవనితలు నర్తికలు నగుదురు. నర్తికాప్రసంగమున నర్తకీ స్వభావనిరూపణమావశ్యక మగును. అయినను;

౯౬౫. హేలాభావవిశేషజ్ఞాః సత్త్వేనాభినయేన చ
మాధుర్యేణ చ సంపన్నా హ్యాతోద్యకుశలాస్తథా
౯౬౬. అంగప్రత్యంగ సంపన్నాశ్చతుష్షష్టి కలాన్వితాః
చతురాః ప్రశ్రయోపేతాస్త్రీదోషైశ్చ వివర్జితాః.
౯౬౭. సమాః ప్రాగల్భ్యయుక్తాశ్చ త్యక్తాలస్యా జితశ్రమాః
నానాశిల్పప్రయోగజ్ఞా నృత్తగీతవిచక్షణాః.

నాటకీయవనితల సర్వసంగతస్వరూపవిశేషము లింక నిట్లున్నవి. నాటకీయవనితలందరు నర్తకీపదవాచ్యలు కారు. నాటకీయ వనితలందు నర్తకి ప్రత్యేకముగా విలక్షణస్వరూప నర్తకి నాటకీయవనితయు

నగును. నాటకీయవనితల స్వరూపలక్షణములు నర్తకీగణమునందు నుండును. అట్లుండవలయు లక్షణములు కొన్ని యిందున్నవి. హేలా భావవిశేషాభిజ్ఞత నాటకీయవనితలందుండును. హేల భావము నని రెండుశృంగారభావములను పేర్కొనుట తత్ప్రియములయిన యితర శృంగారభావములకు నుపలక్షణము. భావహావహేలాదుల స్వరూప మిదివరలో నిరూపితము. ఈ వనితలు సత్త్వసంపన్నలై యుందురు. "సత్త్వే నాట్యం ప్రతిష్ఠితం." కావున సత్త్వసంపత్తి యీ వనితల స్వభావసంపత్తి వాగంగసత్త్వములందలి సత్త్వమిందు సత్త్వము. దేవనాగసత్త్వాదులు నిందు సత్త్వపదమున పరిగ్రాహ్యము లగును. నాటకీయవనితలు సర్వప్రకృత్యభినయ మొనరింపవలసి యుండును గావున సర్వసత్త్వస్వభావముల గుర్తించుట యావశ్యకము. ఇట్లె యభినయసంబంధమును వీరలకు గలదు. మాధుర్యసంపత్తియుండును భూషణములేకున్నను రమ్యత యుండును. ఆతోద్యకుశలత్వము వీరల కున్నది. ఆతోద్యముల ననుసరింపగలరు. వాని ననువర్తింపగలరు. స్వయముగా నాతోద్యముల ప్రవర్తింపజేయగలరు. అంగప్రత్యంగ ముల సౌష్ఠవము వీరి సొమ్ము. నాటకీయవనితలు చతుష్షష్టికలాన్వితలై యుందురనుట యిచట ప్రత్యేకముగా పరిగణనార్హము. ఈప్రసక్తిలో చతుష్షష్టికలల నామసముల్లేఖము యుక్తము. కలల సంకేతమునం దభిప్రాయద్వైవిధ్యము కలదు. ఇట్లు కొందఱు సంకేతించిరి.

గీత - వాద్య - నృత్య - ఆలేఖ్య - విశేషచ్ఛేద్య - తండుల కుసుమబలివికార - పుష్పాస్తరణ - మణిభూమికాకర్మ - శయన రచన - దశనవసనాంగరాగ - ఉదకవాద్య - ఉదకాఘాత - చిత్ర రచన - మాల్యగ్రథన - శేఖరాపీడయోజన - కర్ణపత్రరచన - గంధయుక్తి - భూషణయోజన - ఇంద్రజాల - నేపథ్యప్రయోజన - హస్తలాఘవ - విచిత్రశాకయూషభక్ష్య వికారక్రియ - పానకర సరాగాసవయోజన - సూచీవానక్రియ - సూత్రక్రీడ - వీణాడమరు కవాద్య - ప్రహేళిక - ప్రతిమాల - దుర్వాచకయోగ - పుస్తక వాచన - నాటకాఖ్యాయికాదర్శన - కావ్యసమస్యాపూరణ - పట్టి కావేత్రవానవికల్ప - తర్కుకర్మ - తక్షణ - వాస్తువిద్య - రూప్య

రత్నపరీక్ష - ధాతువాద - మణిరాగాకరజ్ఞాన - వృక్షాయుర్వేద యోగ - మేషకుక్కుటలావకయుద్ధవిధి - శుకశారికాప్రలాపన - ఉత్పాదనసంవాహన కేశమర్దనకౌశల - అక్షరముష్టికాకథన - మ్లేచ్ఛితవికల్ప - దేశభాషావిజ్ఞాన - పుష్పశకటిక - నిమిత్తజ్ఞాన - యంత్రమాతృక - ధారణమాతృక - సంపాద్య - మానసకావ్యక్రియ - అభిధానకోశ - ఛందోజ్ఞాన - క్రియాకల్ప - ఛలితకయోగ - వస్త్రగోపన - ద్యూతవిశేష - ఆకర్షక్రీడ - బాలక్రీడనక - వైనయికవిద్య - వైజయికవిద్య - వ్యాయామములు-

లలితవిస్తరము, కామసూత్రము, శుక్రనీతిసారము, ప్రబంధకోశము లను గ్రంథములు కలావివేక మాపాదించుచున్నవి. కామశాస్త్రనిరూపితములయిన కళలలో నొకవర్గవిభాగము గోచరించును.

| | | | |
|---|---|---|---|
| ౧. | గీతాదులు కర్మాశ్రయములు | | ౨౪ |
| ౨. | ద్యూతాశ్రయములు | | ౨౦ |
| | నిర్జీవాశ్రయములు | ౧౫ | |
| | సజీవాశ్రయములు | ౫ | |
| 3. | శయనోపచారికకళలు | | ౧౬ |
| ౪. | ఉత్తరకళలు | | ౪ = ౬౪ |

నాటకీయవనితలు వాత్స్యాయనీయతంత్రగుప్త కలావిజ్ఞానము కలవారనుట యుక్తము. కావుననే వీరుచతురలు, వినయసముపేతలు, దోషత్రయవర్జితలు. దాక్షిణ్యసముపేతలై సముచిత్తస్వభావమున నుందురు గాని ప్రాగల్భ్యము కలవారై యప్రధృష్యలుగ నుందురు. అభిగమ్యత యప్రధృష్యత స్త్రీపుంసప్రకృతుల యభిరమ్యతానిదానము. కార్యకరణమున వీరాలసింపరు. అలసలు కారు. జితశ్రమలు. నృత్తగీతవిచక్షణలై నానాశిల్పప్రయోగవిజ్ఞానసముపేతలుగా నుందురు. వీరి చతుష్షష్టికలావివేకమె నృత్తగీతశిల్పవిచక్షణత సూచింపగలదు. అయినను మఱల నా యంశ ముల్లేఖించుట తత్పాండిత్యప్రాచుర్యనిర్దేశమున కగును. నాటకీయవనితల విశేషము లన్నియు నర్తకిలో నుండును. ఆ వనితలలో నా నర్తకి యొకవిధముగ విశిష్ట. ఆమె సంపన్న. రూపగుణౌదార్యశోభిత. ధైర్యవీర్యసౌభాగ్యసంశోభిత.

పేశలభావ మధురస్నిగ్ధహృదయ చిత్రకర్మకుశలయు నగును. ఎట్టి సమయమునగాని వికల గాదు. ఇంక నర్తకి ;

౯౬౮. సమాగతాసు నారీషు రూపయౌవనకాంతిభిః
న దృశ్యతే గుణైస్తుల్యా యస్యాస్సా నర్తకి స్మృతా

రూపయౌవనకాంతిసముపేతలయిన నారీమణు లొకచో సమాగతలై యుండగా నే యొకవనితయు నర్తకీరూపయౌవనకాంతిగుణసమానగా నుండదు. వారి రూపము వేరు. నర్తకీరూపము వేరు. ఈమె యౌవనము వేరు. కాంతియు వేరు. రూపాదు లవియె యట్టివె యయినను నర్తకీగతములై యవి విశిష్టతావిరాజమానములగును.

పరిచారికలు

ప్రభువులకు పరిచారిక లనేకవిధముల నుందురు. వారిలో కొందరే సమయమున గాని ప్రభువునకు దూరముగా నుండరు. నిత్యసన్నిహితలై ప్రభురక్షణపరాయణలై యుందురు. వారు రక్షోదక్షిణలు. శిక్షాదక్షలు. శయ్యాపాలీరచనమున రసవ్యంజనధారణమున గంధాభరణమాలాయోజనమున నాపరిచారికలు నిత్యము సావధానలై యుందురు.

శయ్యాపాలి - ధారిణి - సంవాహిని - గంధయోక్త్రి - ఆభరణయోక్త్రి - మాలాసంయోజిక తాంబూలకరండవాహిని మొదలగు పరిచారికలు వారి వారి కర్మపరాయణలై యుందురు. ఆయా సుకుమారకర్మాచరణము కలాచతుర లయిన చతురవనితల యధీనమున నున్న నె శోభావిశేషము కలుగును. ఆ యా సమయమున నా యా సేవాసౌభాగ్యము పొందు వారలును నిర్వారచమత్కారము కలవారు కాగలరు. ఆనందసమాధి మగ్నస్వభావులు కాగల రనుట పూర్వనివేదిత మయినను పునర్నిరూపితము. వీరందరు భోగవారితలు.

ప్రభువుల యంతఃపురములందు సంచరించు వనిత లింకనుగలరు. వారును పరిచారికలె సంచారిక - ప్రేక్షణీయ - మహత్తరి - యుక్తిక యనువారలీవర్గమున జేరుదురు. వీరలకు నియతము లయిన రూపలక్షణములు కలవు. నాట్యవిదులగు ప్రయోక్తలు స్వరూపసముచితాకార

వైభవముకల వీరలను యథాసంభవముగ నిరూపింపవలెను. మాన్యుల ప్రసిద్ధరూపకములందును కాదంబరీదశరూపకాది గద్యనిబంధనము లందును వీరి వైశిష్ట్యము గోచరించుచునే యున్నది. వీరి నామసంకేతములె సంకేతితార్థమును విశద మొనరింపగలవు. స్వరూపసంభావన మున సహృదయు లధికారులయినను భరతసంకేతితార్థము నీ విధ ముగ గుర్తింప వలెను.

### సంచారిక

ఈ సంచారికాదు లంతఃపురచారచారిణులు. నానాకక్ష్యావిచారిణులు. స్త్రీసంచారయోగ్యకక్ష్యలందే కాక పురుషయోగ్యకక్ష్యా భాగములందును సంచరింతురు. కోశవ్యవహారకక్ష్యలలో కారాశస్త్ర శాలా భాగములో కవిపండితసహృదయగోష్ఠీసన్నివేశములలో విలాస వినోదశాలాభ్యంతరములలో నితరములలో సంచరించుచుందురు. అట్లె యుపవనసంచారములందును చతురలు. ఇట్లనుట వనీవిహార పుష్పాప చయ జలద్రోణీపరిసర ధారాగృహ సముద్రగృహ వృక్షదోహద జల క్రీడాదులలో సంచారసమర్థ లగుదురని భావము. దేవాయతన క్రీడ వీరలకు పరిచితములు. కామదేవాయతనములందు పూజలుచేయుదురు. చేయింతురు. ఇట్లుండు వీరు ప్రాసాదపరిచారికలు. జామున కొక సకియగా వీరు సంచారకార్యమున నుందురు. అందుననె "యామకిన్యః" ఇట్టి లక్షణలక్షితలగు స్త్రీలు సంచారిక లనదగుదురు. ఇంతగా వీరటు నిటు సంచరించు వారయినను "భోగవారితాః" శయ్యాభోగములకు దూరముగ నుందురు. రాజభోగములందు వీరలకు భాగములేదు. వయస్సహజమయిన భోగాసక్తి యుండును. కాని వీరు వారిత లగుదురు. అట్లుండుటయె వీరి యోగ్యత. భోగసామగ్రీసంభారములను కూర్తురు. చేర్తురు. కాని భోగవారితాః ఇట్లె నాట్యజ్ఞుల విజ్ఞాన మున్నది.

### ప్రేక్షణీయ

కొందరు పరిచారికలు ప్రేక్షణీయులుగా నుందురు. కామ సంయుక్తప్రేక్షణములతో నుందురు. రహస్సంభూతవిశేషములతో నుందురు. రాజులపై వలపు తలపు కలిగి రాజులు తమ్ము చూచునట్లు

చూచెదరు. రాజులకును వీరు దర్శనీయలగుదురు. ఇట్టి వీరు ప్రేక్షణీయపరిచారికలు. మాలవికాగ్నిమిత్రమునందు మాలవిక పరిచారికా మధ్యగత కామసంయుక్తప్రేక్షణయుక్త. ఆమె రహఃప్రణయమందు విశదము. ఆమెయు రాజకుమారిక. కార్యాంతరమున నట్లయినది. కార్యవశమున రాజవల్లభ యయినది. రత్నావళిలోని సాగరికయు నిట్టిది. వీరు ప్రేక్షణీయలు.

### మహత్తరి

మహతి మహత్తరి మహత్తరిక నామమున పరిచారికలు కొందరుందురు. వీరు సర్వాంతఃపురరక్షాధికృతలై యుందురు. స్తుతిస్వస్త్యయనములలో నాసక్తలై యుందురు. నిత్యమంతఃపురాభివృద్ధి నభినందించువారుగా నుందురు. ఇట్టివీరు మహత్తరికలు. "సర్వాంతఃపుర రక్షాధికృతా కులవర్ధనా నామ మహత్తరికా" కాదంబరీగ్రంథమున గోచరించును. వీరివలె గౌరవనీయలగు వృద్ధలు కొందరంతఃపురపరిచారికావర్గమున నుందురు. వీరు రాజమర్యాదల నన్నిటిని తెలిసి యుందురు. పూర్వాపూర్వ మంతఃపురరంగములందలి నయనీతిరీతులను వృద్ధలు బాగుగా దెలిసి యుందురు. వీరందరు పూర్వరాజాభిపూజితలు. సర్వానుసరణీయములయిన చరితవిశేషములను వృద్ధలు తెలిసికొని ప్రవర్తింతురు. నయాభిజ్ఞత రాజపూజనము సర్వానుచరితజ్ఞతయీ వృద్ధల గౌరవనిదానము. మాలతీమాధవమునందు వృద్ధరక్షిత యున్నది. అంతఃపురగౌరవము వృద్ధాధీనముగ నుండును.

### యుక్తిక

అంతఃపురములందు నియుక్తలయిన వనితలు యుక్తికలు. నీతినియమప్రవృత్తులను పరిశీలించి యోగ్యతకలదని వీరి నంతఃపురపరిచారికావర్గమున నియమింతురు. వీరు భాండాగారములం దధికృతలగుదురు. భాండాగారము కోశాగారము. గ్రంథభాండాగారమును భాండాగారమగును. అందువీరు సాయుధలై యధికృతలై రక్షణకార్యపరతంత్రలై యుందురు. వికృతలై యుందురు. ఆకారసౌష్ఠవమున నుండరు. ఫలమూలౌషధపరీక్షలు చేయుదురు. అట్లు నిశితముగ పరీక్షించిన గాని యంతఃపురమున ప్రవేశింపనీయరు. అట్లై యన్నవీక్ష

ణాలు నగుదురు. నిర్దోషముగ నున్నట్లు నిశ్చయము కలిగినగాని వారు సంతుష్టులు కారు. గంధాభరణమాల్యాదులను వస్త్రములను పరిశీలించి యాలోచన మొనరించి పరిష్క్రియ కందించుట కామోదింతురు. బహుజనులు వీరినాశ్రయింతురు. కాని వీరు యుక్తప్రవృత్తితో నుందురు. ఇట్టి వీరు యుక్తిక లనదగుదురు. ఇట్లు వీరందరంతఃపుర సంచారిణీవనితలు, కతిపయస్త్రీలకె యిచట సంకేతము లక్షణము స్వరూపము నిరూపిత మయినది. ఇదియంతయు సమానసంఖ్యానము. అంతఃపురనియోగ మనునది సావధానసమీక్షాకార్యము. అందంద రకు ప్రవేశము సుకరము కాదు. కొంతగా విశిష్టాధికారము కల వార లకు మాత్రమె యంతఃపురములందు స్థానములభించును. వారివారి యోగ్యతను బాగుగ భావించి నియమింపవలెను.

౬౮౯. యా నియుక్తా నియోగేషు ప్రయోగేషు న చోద్భటాః
న చోద్భ్రాంతా న లుబ్ధాశ్చ నాతినిష్ఠురమానసాః

౬౯౦. శాంతాః క్షాంతాః ప్రసన్నాశ్చ జితక్రోధా జితేంద్రియాః
అకామాశ్చాపి పూజ్యాశ్చ స్త్రీదోషైశ్చ వివర్జితాః.

౬౯౧. అనురక్తాశ్చ భక్తాశ్చ నానాపార్శ్వసముత్థితాః
తా నియోగేషు యోక్తవ్యాః సర్వదోషవివర్జితాః.

రాజాంతపురములం దాయా కార్యములలో నియుక్తలయిన స్త్రీలకు కొన్ని లక్షణములు కలవు. అట్టిలక్షణములు కలవారలను మాత్రమే యాయా కార్యములందు నియోగింపవలెను. నియోగ నియుక్త లగువారు స్వనియతములయిన కార్యముల యాచరణము నందు సావధానలై యుండవలెను. నియుక్తకార్యప్రయోగములందు సత్త్వసముపేతలై యుండవలెనె గాని యుద్భటలు కారాదు. ధూర్త ముగ ప్రవర్తింపరాదు. వారుద్భ్రాంతచిత్తలును కారాదు. లోభ దూషితలు కారాదు. నిష్ఠురమానసలు కారాదు. క్రూరచిత్తలు కారాదు. శాంతలై క్షాంతలై ప్రసన్నలై యుండవలెను. శమక్షమాది గుణసంపన్నలు కావలెను. జితక్రోధలుజితేంద్రియలు కావలెను. కామ గంధము లేని వారు కావలెను. వయోధర్మమున నకామలగుట కాక నిగ్రహధర్మమున నీతిధర్మమున నట్టివారు కావలెను. అట్టివారలె

పూజ్యులగుదురు. పూజ్యులె నియోగార్హులు. వారు స్త్రీసహజదోష ములు లేనివారై యుందురు. వారనురక్తులు కాగలరు. భక్తులు కాగలరు. సర్వదోషవివర్జితలగు వారలె యిట్లు నియోగనియోక్త వ్యులు కాగలరు. ఇట్టివారొకప్రదేశమున లభింపరు. కావున "నానా పార్శ్వ సముత్థితాః" దేశపరిసరముల పరిశీలించి యట్టివారిని రప్పించి వారిని నియతకార్యములందు నియమింపవలెను. సామాన్యముగా నివి యన్నియు సర్వపరిచారికలకు స్వభావసహజముగ నుండవలసిన విశేషములు పరిచారికావర్గమున విశేషముగా నుండవలసిన వానిని గుర్తించి నియమించుట యుక్తము.

## తృతీయ ప్రకృతి

౯౩౨. యా సా నపుంసకా నామ తృతీయా ప్రకృతిస్స్మృతా.
సాప్యంతఃపురసంచారే యోజ్యా పార్థివవేశ్మని.

పురుషప్రకృతి స్త్రీ ప్రకృతి యను రెండుప్రకృతులె కాక మూడవ ప్రకృతియు నొకటి కలదు. ఆ ప్రకృతి నపుంసకప్రకృతి. నపుంసకానామమున తృతీయప్రకృతి యున్నదని ప్రకృతి విదులనిరి. రాజభవనములందా తృతీయప్రకృతియు నంతఃపురసంచారమున నాయోజనీయయె యగును. అంతఃపురవధూపరిసరసంచారమున నపుంసకప్రజ్ఞలుండుట సముచితము. స్త్రీదోషవర్జితలు రాగదోషదూషితలు భోగవారితలయిన వనిత లుండవచ్చును. వారుండువిధమున వీరు నుండవచ్చును. పురుషప్రకృతు లట నుండరాదు. వారెంతటి శిక్షిత ప్రకృతు లయినను వయఃప్రకృత్యవస్థాప్రకోపమున నంతఃపురగౌరవాను కూలముగ నుండకపోవచ్చును. ఎల్లెని వారట్లున్నను వారిని నిరంతరము చూచు నంతఃపురమువారె స్త్రీచాపలము కలవారు కావచ్చును. కావున తృతీయప్రకృతికల వారుండుట యుక్తము. ఇట్టివారు నుండవచ్చునన్న అభ్యనుజ్ఞ యిందు గ్రాహ్యాము, తగిన ద్వితీయ ప్రకృతి లభింపనపుడు తృతీయప్రకృతి యుండవచ్చును.

అంతఃపురవనితలకు సంబంధించిన వార్తాప్రేషణాదికర్మకరణ మున కింకనుండదగినవారు కలరు. కారకులు, కంచుకీయులు, వర్షవరులు, ఔపస్థాయికనిర్ముండులు నుండదగుదురు. కుమారీరక్షణమున బాలికా

సంరక్షణమున వీరి నియమింపవలెను. రాజభార్యానువర్తనమున వీరుందురు. ఈ యనువర్తనమె వీరి యంతఃపురాధికారము. ఇందు కారకులు కర్మకరులు శిల్పచిత్రాదికర్మకరులు. కంచుకిజను లంతట ప్రసిద్ధులు. కంచుకులంతఃపురదాసదాసీగణమున నధికారులై యుందురు. అంతఃపురప్రవేశనిర్గమనములలో దాసీదాసులందరు కంచుకి యభ్యనుజ్ఞ పొందియె ప్రవర్తింపవలసియుండును. వర్షవరులు షండప్రకృతులు. ఔపస్థాయికులు నిత్యముపస్థికిలో నుందురు. నిర్ముండులు విరాగ ధర్ములు. క్లీబ షండ వర్షవర నపుంసకులు సామాన్యముగా నొకవిధ మున నుందురు. స్వభావసహజముగా నొకింత భేదముండును. క్లీబులు వనితాసత్త్వమున నుందురు. స్వల్పసత్త్వముతో నుందురు. స్త్రీ స్వభావమున ప్రవర్తింతురు. వర్షవరులు పుం.లక్షణములతో నుందురు కాని మాటలాడరు. పురుషులజూచి సిగ్గుపడుదురు. వీరును స్త్రీస్వభా వులు. ఇట్టి వారందఱంతఃపురసంచారయోగ్యులు.

సర్వవృత్తాంతయోగజ్ఞం నాట్యాగారే నివేశయేత్

అంతఃపురమునందలి కక్ష్యావిభాగములలో నాట్యాగారము నుండును. ఆనాట్యాగారమునందు సర్వవృత్తాంతముల దెలిసిన యభిజ్ఞుని నాట్య యోగవిదుని ప్రయోగాభిజ్ఞుని అధికృతు నొనరింపవలెను.

౬౪౩. బ్రాహ్మణాః కుశలా వృద్ధాః కలాదోషవివర్జితాః
ప్రయోజనేషు దేవీనాం నియోక్తవ్యా నృపైస్సదా

అంతఃపురములందలి దేవీప్రయోజనములకై పాలకప్రభువులు విశిష్టగుణసంపన్నులయిన బ్రాహ్మణులను నియమింపవలెను. రాజ సదనములందు దేవీపదవాచ్యులగు వారలనేకలుందురు. మహాదేవీ దేవీ స్వామినీ భట్టినీ భోగినీ పదవాచ్యులగువారు నిచట దేవీపద గృహీతలు. వారి విద్యా - ధర్మ - కర్మ - పూజా - నీతి-పురాణ- నాట్య-గాన-కలాత్మకము లయిన నానాప్రయోజనములందు కుశల వృద్ధబ్రాహ్మణులను నియమింపవలెను. ఈ నియోజ్యబ్రాహ్మణులు కలాదోషరహితులుగా నుండవలయును. ఇట్టి విశిష్టబ్రాహ్మణుల వల ననె యంతఃపురపథూప్రయోజనసిద్ధి కలుగును. ఈ నిరూపించిన విధమున నంతఃపుర మష్టాదశవిధమున నున్నది. కేవల మష్టాదశవిధ

మునని యుండవలయునన్న యనురోధము లేదు. అవసరాపేక్షితాన్య పరివారసహితముగ గూడ నంతఃపురముండుటను యథావసరముగ పరిశీలింపవలెను.

బాహ్యపూరుష సంచారము

ఈ నిరూపించినదంతయు రాజుల యాభ్యంతరోపచారవిధి ఇట్లు బాహ్యోపచారవిధానమును కలదు బాహ్యరంగమున సంచరింపయోగ్యులయిన పురుషులసంకేత మిట్లున్నది. రాజు సేనాపతి పురోహితుడు మంత్రులు సచివులు ప్రాడ్వివాకులు కుమారాధికృతులు మొదలగు మాన్యులనేకులు రాజులకుందురు. వీరందరు సముచితగౌరవార్హులు. వీరి విశేషము లక్షణము సావధానముగా గుర్తింపదగియున్నది.

౯౭౪. బలవాన్ బుద్ధిసంపన్నః సత్యవాదీ జితేంద్రియః
దక్షః ప్రగల్భో మతిమాన్ విక్రాంతో ద్యుతిమాన్ శుచిః

౯౭౫ దీర్ఘదర్శీ మహోత్సాహః కృతజ్ఞః ప్రియవాక్పటుః
లోకపాలవ్రతధరః కర్మమార్గ విశారదః

౯౭౬. ఉత్థితశ్చాప్రమత్తశ్చ వృద్ధః స్మృత్యర్థశాస్త్రవిత్
పరదోషేంగితాభిజ్ఞః శూరః రక్షాసమన్వితః.

౯౭౭. ఊహాపోహవిచారీ చ నానాశిల్పప్రవర్తకః
నీతిశాస్త్రే చ కుశలో గుణైరేభిర్భవేన్నృపః.

బాహ్యోపచారవిధి పర్యవేక్షణమునకగు రాజు నానాలక్షణలక్షితుడు కావలెను. ఇందు నిరూపితములయిన సప్తవింశతి విశేషములు కలవాడు రాజుగానుండుట కర్హుడని యిందు సూచితము. ఇవి యేవంప్రాయములయిన యితరములకు నుపలక్షణరూపములు. వాల్మీకి రామాయణమునందు ప్రారంభమున నుత్తమప్రభులక్షణములను నిర్దేశించినాడు. కాళిదాసు రఘువంశమునందు రాజధర్మములను ప్రథమమున సంకేతించినాడు. వీనికి వాని సంవాదసంపాదనము యుక్తమగును. బలయుక్తుడగుట ప్రథమలక్షణము. రాజులబలము లనేకవిధములు. సర్వవిధబలము రాజునకుండుట యావశ్యకము. బలియగు వానికి బుద్ధిసంపద యావశ్యకము. సత్యవాదిత జితేంద్రియత స్వభావగౌరవము సరిపాదించు నుత్తమగుణములు. దక్షుడు సమర్థుడు కార్య

కుశలుడు. ఇట్టివానికి ప్రగల్భత యపేక్షితము. అది యప్రధృష్యతా రూపము. తాత్కాలికవివేకసాహిత్యము సూచించు మతియు ముఖ్యము. అట్టివానికి విక్రాంతిద్యుతి యుత్తమగతి శుచి సర్వము సంగతమగును. అప్పుడాతడు దీర్ఘదర్శి మహోత్సాహి కాగలడు. ఈ దృశుడు కృతమును మరువడు. ప్రియవచనుడగును. సమర్థుడు నగును. లోకపాలవ్రతధరుడు కర్మమార్గవిశారదుడు నగుట నరపాలకుని విశిష్ట విశేషము. లోకపాలురగు నింద్రాదుల నారాధించు వాడగునేని సర్వ నిక్కమగు విజయము లభించును. లోకపాలుర వ్రతము లోకపాల నము. రాజు లోకపాలుర వ్రతము ధరింపవలెను. నిష్ఠాపరుడయి లౌకికవైదికకర్మాసక్తుడై యుండుట యుక్తము. ధర్మకర్మరక్తుడై యుండు రాజు ప్రజారంజనపరాయణుడు కాగలడు. ఉదీయమాను డగును. ఉత్థితుడగును. వర్ధమానుడై యభ్యుదయగామి యగును. అట్టివా డప్రమత్తుడు. సావధానుడగు వానికి ప్రమాద మేదియు రాదు ఇంతటి విజ్ఞానసంపద్వివేకములు కలవాడు వృద్ధుడై యుండును. అను భవమున పండి వృద్ధుడగు నాతడె పాలనధర్మ ప్రవీణుడగును. వృద్ధత్వ మనేకవిధముల నుండును. అందు జ్ఞానవృద్ధత్వము వివక్షితము. స్మృతిశాస్త్రములు ధర్మశాస్త్రములు బాగుగ తెలిసిన వాడ గుట చాణక్యాదులు నిరూపించిన యర్థశాస్త్రార్థముల గ్రహించిన వాడగుటయు ముఖ్యము. ఇట్టి యాతడు పరుల దోషముల నింగి తాదులచే గ్రహింపసమర్థుడగును. శూరుడగును. రక్షాసమన్వితు డగును. ఊహముల నపోహముల గుర్తించువాడగుటయు ముఖ్యము. రాజు నానాశిల్పప్రవర్తకుడు కావలెను. నీతిశాస్త్రములందు కుశల బుద్ధియు కావలెను. నాటకములు నిబంధించువారు నరపాలకు డిట్టి లక్షణములు కలవాడుగ నుండునట్లు సమీక్షింపవలెను. నరపాలక భూమికాపరిగ్రహమున నభినయించు నటులు నిట్టి లక్షణ మాత్మగత ముగ సంభావించి నటించుట యుక్తము. అప్పుడే సహృదయ ప్రేక్షకలోకమున ప్రాశస్త్యప్రఖ్యాతులు ప్రసరించును. కవి నిరూపింప నటు డభినయింప సహృదయు డభినందింప సమున్నతభావసందోహము సరసలోకమున ప్రసరింపగలదు.

## అమాత్యులు

ఇట్టి ప్రభువు తన బాహ్యాపరివారమును తగిన విధమున నియమింపగలడు. భూమిపాలకు లమాత్యుల నిట్టివారిని నియమింపవలెను.

౯౭౮. బుద్ధిమాన్నీతిసంపన్నో విక్రాంతః స్యాత్ప్రియంవదః
అర్థశాస్త్రే చ కుశలో హ్యనురక్తః ప్రజాసు చ

అమాత్యుడుగా నుండువాడు నిశ్చయాత్మకమగు బుద్ధిప్రవృత్తి కలవాడు కావలెను. శాస్త్రీయమగు రాజనీతిసంపన్నుడై విక్రమోపేతుడు ప్రియంవదుడు కావలెను. అర్థశాస్త్రకుశలుడు ప్రజలందనురక్తుడు ధార్మికుడు కావలెను. ప్రభువమాత్యు నిట్టివానిగ జూచి నియమింపవలెను. ప్రజ్ఞావిక్రమభక్తిశాలిగా మంత్రియుండుట రాజ్యమున కావశ్యకము విశాఖదత్తుని ముద్రారాక్షసమున రాక్షసమహామంత్రి యిట్టి గుణగణములు కలిగి గోచరించును. శక్తి యుక్తి భక్తి కల మంత్రియె మంత్రి. శక్తి కలిగిసమర్థుడగును. యుక్తికలిగిపరులకులొంగడు. భక్తి కలిగిరాజ్యము రక్షించును.

## ప్రాడ్వివాకులు

౯౭౯. వ్యవహారార్థతత్త్వజ్ఞా బుద్ధిమంతో బహుశ్రుతాః
మధ్యస్థా ధార్మికధియః కార్యాకార్యవిచక్షణాః.
౯౮౦. క్షాన్తా దాన్తా జితక్రోధాః సర్వత్ర సమదర్శినః
ఈదృశాః ప్రాడ్వివాకాశ్చ స్థాప్యా ధర్మపరైర్నృపైః

నరపాలకులు ధర్మపాలకులై వ్యవహారనిర్వహణ మొనరింపవలెను. ధర్మపరాయణులై యా యా ధర్మకార్యధర్మనియామకులను నియమింపవలెను. ప్రాడ్వివాకులు న్యాయాధీశులు. వారి నియమనమున రాజు సావధానుడు కావలెను. ధర్మపరుడై ధర్మనిర్ణాయకుల నిర్ణయింపవలెను. ప్రాడ్వివాకు డెట్లుండవలెను? ఇట్లుండవలెను. వ్యవహారార్థతత్త్వజ్ఞత. ఎవరేని యభియోగ మావేదించినప్పు డందలి మూలకారణమును తత్ప్రయోజనమును తదీయతత్త్వమును స్పష్టముగ న్యాయాధీశుడు గుర్తింపవలెను. నిశ్చయాత్మకబుద్ధిప్రభావము కలవాడును కావలెను. బహుశ్రుతుడై యుండవలెను. అంగోపాంగసహితముగా ననేకవిషయముల నధ్యయన మొనరించిన మేధావి

కావలెను. క్షాంతి దాంతి కలవాడగుట ఆత్మగుణసంపద కలవాగుట యని భావము. క్రోధజేతయై సర్వత్ర సమదర్శియై ప్రాడ్వివాకుడుట సర్వముఖ్యము. ఇట్టి లక్షణములు కలవారలె ప్రాడ్వివాకులుగా నుండుట కర్తవ్యాలు. ధర్మాయణులయిన రాజులిట్టివారినే యా స్థాన మున నియమింపదగును. ఈ నిరూపించిన విషయము లమాత్యులకును సమానములు. ప్రాడ్వివాకు లింక నిట్లుండదగుదురు. వారు నిత్య సముత్థితులై యభ్యుదయకాంక్షులై యుండుట యప్రమత్తులై జిత శ్రములై స్నిగ్ధులై క్షాంతులై వినీతులై మధ్యస్థులై నిపుణులై నయ వినయవిదులై యూహాపోహవిశారదులై యలసతలేనివారై యుండుట పరమావశ్యకము. ఇట్లె సర్వశాస్త్రార్థసంపన్నత కామాద్యవికృత స్వభావత ముఖ్యము. బృహస్పతిమతానుసారమున వీరి గుణవిశేష ములను గుర్తింపవలెను. ఇట్లిది యంతయు ప్రకృతివిచారము. ఇందలి యంశము కొంతకొంత నిరుక్తార్థమయినను ముఖ్యమగుటవలన పున రభిధేయ మయినది.

## భూమికాపాత్రవికల్పము

భూమికాభూభాగ మిటుపై నిరూపణార్హము. అందరన్ని భూమి కల ధరింప నర్హులు కాజాలరు. కొందరే కొన్నిటి కర్హులు. ఏ పురుషు లే భూమికానిర్వాహణమునకు యోగ్యత కలవారగుదురో పరిశీలిం చుట యావశ్యకము. ఈ పరిశీలనము సర్వము గతివాగంగచేష్టాను సారమున సత్త్వశీలసంపదనుసారమున నుండును. అట్టి భూమికావికల్ప మిక నిరూపింపవలెను.

౯౮౧. మంథరం వామనం కుబ్జం వికృతం వికృతాననం
విస్పష్టనేత్రకార్యాణాం స్థూలం విహనునాసికం
౯౮౨. దుర్వేషి దుస్స్వభావం చ వికృతాకారమేవ చ
వానభూమౌ ప్రయుంజీత బుధో దాసాంగసంయుతం.

నాట్యబుధుడగు నాతఁడు దాసభూమియం దిట్టి వానిని నియమింప వలెను. దాసుడుగా నుండవలయువాడు దాసోచితాంగసంగమున నుండువాడు కావలయును. మానవాంగములలో రాజాంగములని సచివాంగములని దాసాంగములని వేరు వేరుగా ప్రతినియతములయిన

రూపవిశేషము లుండకపోవచ్చును. కాని కొన్ని కొన్ని యవయవ సంస్థానవిశేషములు కొన్ని కొన్ని శోభావిశేషములను వ్యాఖ్యానింప గలవు. పాశధ్వజాదిరేఖాసమంచిత శరీరిస్వభావలక్షణము లన్యాదృశ ములుగనె యుండును. సమవిభక్తావయవుడయిన వాని విశేషము వేరు. అట్లుండని వాని విశేషములు వేరు. ఇట్టి విశేషము లన్నియు "గతివా గంగచేష్టాభిః స త్త్వశీలసమాసతః" నిరూపింపదగి యున్నవి. దాసాంగ సంయుతుడు దాసభూమిలో నుండవలెను. వాని లక్షణము లిట్లుండును మంథరగమనముకలవాడు. గమనమందలి మాంథర్యము కేవలము వేగాభావకృతముకాదు. పంగుగమనము వ్యత్యస్తపదసంచారకృతము నగును. గతిమాంథర్యము మంథరగమనకు సుందరము. అట్టిదిట్టి స్థలము లందు వివక్షితము కాదు. మందగుది నడక, ఎగుడు దిగుడు నడక కొంకికాళుల నడక యిందు గ్రాహ్యము. దాసుడు వామనుడు కుబ్జ రూపుడు వికృతాకారుడుగా నుండవలెను. ఆననము వికృతముగా నుండవలెను. స్వభావసహజముగనే కొందరియాననము వికృతముగ నుండును. వారి కన్నుముక్కుమూతుల కదలికలలో గ్రీవారేచన ములలో వికృతి యకృతకముగనె గోచరించును. కొందరు కృతకవికృతి ప్రకటింతురు. వికృతమన్న పర్యాప్తమయినను వికృతానన మనుటలో నిట్టి యర్థమునె గ్రహింపవలెను. సమయోచిత భావోచిత దేశోచిత ప్రకృత్యుచిత నేత్రకార్యము లేవీయు వారలకుండవు. వారి కన్నులు గవ్వకన్నులు, కర్బురనేత్రములు. గచ్చకాయ కన్నులు. అట్టి కన్ను లలో నెట్టి విచిత్రవిలాసము నుదయింపదు. దాసుడు స్థూలకాయుడు కావున మంథరగమనుడగును. వాని దవడలు సరిగానుండవు. లొట్ట. సొట్ట. పీకికొనిపోయి యుండును. ముక్కును వికృతము. బుజ్జిముక్కు చట్టిముక్కు వంకరముక్కు చప్పిడిముక్కు నగును. వాడు దుర్వ్యాపి. దుఃస్వభావుడు నగును. ఇట్లనుట సముదాత్తాచారము లుండవనుట యగును. వాని యాకారము వికృతాకారము. భూషావేషము లెట్లు ధరించినను వాడట్టివాడె యగును. ఇట్టివానినె దాసభూమియందు నియమింపవలెను. దాసభూమిలో నుండదగినవారును; భిన్నభిన్న స్వభావులుగ నుందురు. శ్రాంతులుందురు. అశ్రాంతులుందురు. తగి

నంతగా పనిలేని వారుందురు. శ్రాంతులను నియమింపవలసి యుండు నేని ప్రకృతిసహజముగ శ్యామవక్త్రులను కృశదేహులను నియమింప దగును. నీరోగప్రయోగమె యగునేని స్థూలకాయుడగు పురుషుని నియమింపదగును. దాసభూనియుక్తులగుట కిట్టివారు లభింపరేని ఆచార్యబుద్ధిననుసరించి భావచేష్టా స్వభావానుసారమున నెవరినేని నియమింపదగును. వీడు దాసోచితముగ ప్రయోగము నిర్వహింపగల డన్న భావ మాచార్యున కుదయించు నేని వాని నందు నియమింప వచ్చును.

కా౬౩. యా చాస్య సదృశీ చేష్టా స్వభావః కర్మ వా తథా
యా చాస్య సదృశీ చేష్టా ఉత్తమాధమమధ్యమా.

కా౬౪. సా తథా చాన్యయోగేన నియమ్యా భావభావినీ,
ఏవమన్యేష్వపి తథా నాట్యధర్మీ ప్రశస్యతే.

కా౬౫. దేశవేషానురూపేణ పాత్రం యోజ్యం హి భూమిషు
ఆచార్యబుద్ధ్యా యోక్తవ్యా భావచేష్టాస్వభావతః.

నాట్యప్రయోగమునందు నాట్యాచార్యప్రయోక్తకు సర్వాధికారము కలదు. గురువగు నాట్యాచార్యుడు సర్వనటుల కారాధ్యుడు. ఆతని యానతి యందరకు శిరోధార్యము. అట్టి యాచార్యదేవుడును తన ప్రాతిస్వికబుద్ధిభావములకు ప్రాధాన్యమీయడు. వారి వారి భావము లను చేష్టలను స్వభావములను పరిశీలించి భూమికాధారణము సూచిం చును. లోకవ్యక్తి ప్రయోగవ్యక్తి భూమికాధారణమునకు తగి యుండునా ? యను పరిశీలనమాచార్యునకు ముఖ్యము. పాత్రసదృశ మయిన చేష్ట స్వభావము కర్మ యెట్లుండునో చక్కగా నాలోచించి నియమించును. ఆ నియమనమునందు నుత్తమాధమమధ్యమప్రకృత్యను గుణమగు చేష్టాదిపర్యాలోచన మావశ్యకము. లోకవ్యక్తియందు భూమికాసాదృశ్యమును పరిశీలించి భూమికానుయోగము భావించి సర్వము భావభావనముతోనుండునట్లు సంభావింపవలెను. ఇట్లు భావ భావినీప్రవృత్తి యుక్తము. ఇట్లాచార్యబుద్ధ్యా నియమనము నాట్య ధర్మి. నాట్యధర్మీసంయోజన మంతట రమ్యత నాధానించును. లోకానుసారి ప్రవృత్తియున్నను నాట్యానుసారి ధర్మిసంయోజన మావశ్యకము. సర్వభూమికలందును దేశవేషానురూపముగా పాత్ర

యోజన మావశ్యకము. అదియు నాట్యధర్మిస్వభావమున నుండుట యుక్తము. బహుబాహువులు కలవారి నభినయింపవలసియున్నపుడు బహుముఖములు కలవారి నభినయించునపుడు వికృతాననుల యభినయమున నాట్యధర్మ్యనుసరణ మావశ్యకము. పశుశ్వాపదసింహాఖరోష్ట్రగజాదుల యభినయము ప్రసక్తమయినపుడును నాట్యధర్మి ననుసరించుట యున్నది. "ఏవమన్యే చ బహవో నానారూపాః" ఇట్టివెన్నియో నానారూపములు కలవు. వానియందన్నిట నాట్యధర్మి ననుసరించుటను నాట్యాచార్యు డభ్యూహించును. ఇవియన్నియు నాట్యధర్మ్యనుగతము లగుటకు నాట్యాచార్యుడు మృత్కాష్ఠాజినచర్మవిశేషముల ననుసరించుట యున్నది. కావున నాట్యాచార్యుని బుద్ధ్యనుసారమున భావస్వభావచేష్టాకర్మానుసారమున భూమికానిర్దేశము సముచితమగును.

౯౭౬. స్వాభావికేన భావేన ప్రవిశేద్రంగమండలం
అత్మరూపమవచ్ఛాద్య వర్ణకైర్వ్యాషణైరపి.

౯౭౭. యాదృశ్యం యస్య యద్రూపం ప్రకృత్యా తస్య తాదృశం
వయోవేషానురూపేణ ప్రయుక్తం నాట్యకర్మణి.

స్వాకారసముచితభూమికాధారణ మొనరించిన నటుడు స్వాభావిక భావము ననుసరించి రంగమండలము ప్రవేశించుటలో నొక కొంత యనుసరణీయ విధివిశేషమున్నది. నానావిధములగు వర్ణికావర్తనముల ననుసరింపవలెను. భూషణధారణ మొనర్పవలెను. వర్ణకములచే స్వాత్మస్వరూప మవచ్ఛాదించుకొనవలెను. ఆత్మరూపావచ్ఛాదన మిందు ముఖ్యము. రంగప్రవిష్టనటు డెపుడేని లోకమానవుడన్న భావము కలుగరాదు. లోకజనుడను భావము కలుగునేని రసభావ ప్రత్యయము కలుగదు. వీతవిఘ్నమయిన రసప్రతీతి యుండదు. దేశకాలవ్యక్తి ప్రతిభానమున రసప్రతిభానభంగము కలుగును. కావున భూషణవర్ణకాదులచే నాత్మరూపావచ్ఛాదన మావశ్యకము. స్వాత్మరూపావచ్ఛాదనముతో రంగమండలము ప్రవేశించిన నటుడే సముచితవాగంగసత్త్వముల ప్రదర్శింపగలడు. భూమికాపరిగ్రహణమున పాత్రయొక్క రూపాదివిశేషము లెట్లుండునో నటుడు ప్రకృత్యుచితముగా

నాట్యకర్మలో వయోవేషానురూపముగ నుండవలెను. ఆహార్యవిశే షాదులచే ననుకార్యరూపానుకారమున నటుడు సమర్థుడు కావలెను. ఆ రూపమున కీ రూప మనురూప మగునట్లుగా నాతడు ప్రవర్తింప వలెను. ఒకప్పుడొక దేహముతో నున్న ప్రాణి జన్మాంతరమున దేహాం తరము పొంది యప్పటి దేహానుకూలముగనె సంచరించును గాని పూర్వదేహానుకూలరీతి ప్రదర్శింపదు. అన్యదేహగతమయిన స్వభావ మును విడనాడి ప్రాప్తదేహానుసారముగనె ప్రవర్తించును. పరభావ మునె ప్రకటించును. అట్లె నటుడును పరభావమును పొంది "సోఽస్మి" ఆతడు నేనే యనుభావమున - నేను శివుడను. నేను రాముడను నేను దుష్యంతుడనను భావమున నటింపవలెను. వాగంగగతిలీలాచేష్టాదుల నట్లె ప్రదర్శింపవలెను. అప్పుడు సముచిత మయిన నటసిద్ధి సిద్ధమగును సహృదయాస్వాదము కలుగును.

## మానవ ప్రకృతి

నాట్యకర్మానుగుణ మయిన మానవప్రకృతి అనురూపమని విరూపమని రూపానుసారి యని త్రిప్రకారము. వీనిలో నన్నిటను భూమికాదికృతము లయిన నానావస్థావయోవిశేషము లుండును. నాట్యోచితము లయిన స్వభావకరణములు నుండును. వీని యనుసార మున ప్రకృతిపరిశీలన మావశ్యకము. స్త్రీలు స్త్రీగతభావమును పురు షులు పురుషగతభావమును వయోరూపానుసారమున ననుకరింతురేని యది యనురూపమగును. బాలుడు ముసలివాని భూమిక పరిగ్రహించు నేని వృద్ధుడు బాలభూమికాస్వీకార మొనరించునేని యది విరూపాను కృతి యగును. పురుషుడు స్త్రీగతభావమును తద్భావమున ననుకరిం చినచో నది రూపానుసారి ప్రకృతి యగునని నాట్యవిదులందురు. వనిత తాను భావానుసారమున ప్రయోగమునందు పురుషభూమికాధారణ మొనరింపవచ్చును. అదియు రూపానుసారిప్రకృతి యగును. ఇట్లు తత్తత్పరిశీలనమున భూమికావ్యాస మొనర్చుట యుక్తము. విరూ పానుకరణమునగాని రూపానుసారి యనుకరణమునగాని పరస్పరచేష్టా సాంకర్యము కూర్చుట యుక్తము కాదు.

## సుకుమారప్రయోగము

౯౮౮. భూమికం సుకుమారం చ నిత్యం స్త్రీభిరనుష్ఠితం
అత్యర్థం మానుషీణాం తు దివ్యమానుషయోస్తథా.

౯౮౯. రంభోర్వశీప్రభృతిషు స్వర్గే నాట్యం ప్రతిష్ఠితం
తథైవ మానుషే లోకే రాజ్ఞామంతఃపురేష్వపి.

౯౯౦. ఉపదేష్టవ్యమార్యైస్తు శాస్త్రబుద్ధ్యాంగనాను చ
సుకుమారప్రయోగోయం రాజ్ఞామామోదకారకః.

స్త్రీలనుసరించు భూమికానిర్వహణ మత్యంతము సుకుమారమై యుండును. మానుషస్త్రీల ప్రయోగమల్లి సమధికమనోజ్ఞమగును. దివ్యమానుషప్రయోగమునందు నిది సుకుమారముగ స్పృహణీయముగ నుండును. స్వర్గలోకమున రంభోర్వశీప్రభృత్యప్సరోవనితాలోకమున నీ నాట్యము ప్రతిష్ఠితమై ప్రఖ్యాతి కలదయినది. అప్సరఃప్రయోగ మాకర్షకమై నిర్వారచమత్కార మాపాదించినది. నాకమున నాకౌకసుల కది యట్లు కాగా నీ లోకమున రాజుల యంతఃపురములందును వనితాప్రతిష్ఠితమై వనితానుష్ఠితమయిన ప్రయోగము సుకుమారమై సహృదయసంతర్పక మయినది. కావున భావుకభవ్యమయిన యీ నాట్యము నార్యమనీషు లంగనాలోకమున శాస్త్రబుద్ధ్యనుగృహీతులై యుపదేశించుట సముచితము. ఆర్యచరితు లుపదేశకులగుట అంతఃపురయోగ్యాంగనాజన ముపదేష్టవ్యజన మగుట, స్థలము రాజాంతఃపుర మగుట సర్వము సంగతముగ నున్నది. ఈ సుకుమారప్రయోగము రాజుల కామోదకారకము. ప్రయోగరహస్యవిదులయిన ప్రయోక్తృపోషకులగు రాజులు సర్వప్రయోగసమీక్షా సంప్రాప్త సామర్థ్యయోగమున నిట్టి సుకుమారప్రయోగస్వారస్యమును గ్రహించి యభినందింపగలరు. అట్టివారి యామోదమామోదము. స్వభావసముపనతమయిన ప్రయోగవిలాసము స్త్రీలయందు సమధికముగ నుండును. వారియందది నిత్యమవభాసించుచుండును. కావున శృంగారరసావలంబనమున సుకుమారప్రయోగమును స్త్రీలలో నిరూపించుట యుక్తము. స్వభావమధురమయిన యంగసంపద సులభసౌష్ఠవముకల రమ్యత స్త్రీల యందున్నది. తదనుసారమున ప్రయోగ

మును రమ్యమగును. స్త్రీలయందున్న పౌరుషాశ్రయప్రక్రియయు లలిత-
ముగ నుండును. అది యంతయు నలంకారమై మనోహరమగును.

౬౯౧. స్వయం తు భూమికాన్యాసం బుధః స్త్రీణాం ప్రయోజయేత్
తుల్యోపి స్థాపకోపేతో భూమికాన్యాస ఇష్యతే.

౬౯౨. స్త్రీషు యోజ్యః ప్రయత్నేన ప్రయోగః పురుషాశ్రయః
సంగీతకపరిక్లేశో నిత్యం ప్రమదాజనస్య గుణ ఏవ.

౬౯౩. ప్రమదా నాట్యవిలాసైర్లతేవ కుసుమైర్విచిత్రలావణ్యాః
కామోపచారకుశలా భవంతి కామ్యే విశేషజ్ఞాః.

౬౯౪. యోగ్యాసు చ ప్రయత్నః కర్తవ్యః సతతమప్రమాదేన
న హి యోగ్యాం వినా భవతి భావరససౌష్ఠవం కించిత్.

భూమికాన్యాసమనునది బుధులొనరింపదగిన నాట్యప్రక్రియ. నాట్య
బుధులు స్త్రీలకు స్వయముగ భూమికాన్యాస మొనరించి నాట్య
ప్రయోగ మొనరింపవలెను. అపుడె యది సహృదయావర్జకమగును.
ఎవరేని చేయిచేయి కలిపి భూమికాన్యాస మొనరింపదగునని తలంప
రాదు. భూమికాన్యాసములు సమానములుగ నున్నట్లు గోచరించినను
స్థాపకబుధసన్నిధాపితమయిన భూమికాన్యాసమె సవిశేషముగ
నుండును. కావున సర్వమాలోచించి సప్రయత్నముగ పురుషాశ్రయ
ప్రయోగమును స్త్రీలయందాయోజన మొనర్చి ప్రదర్శించుట
యుక్తము. స్త్రీలకు సంగీతక మపరిక్లేశమున సంప్రాప్తమగును. నిత్య
మట్లు సంగీతాభ్యాసము ప్రమదాజనమునకు గుణము. నాట్యప్రయోగ
మున మధురకర్కశత వారియం దవభాసించును. నాట్యవిలాససంప
దలచే ప్రమదలకు విచిత్రలావణ్యసంపత్తి కలుగును. కుసుమసంపదలచే
లతలకు విచిత్రలావణ్యసంపత్తి కలుగును. నాట్యవిలాసలలితలయిన
లలితలలనలు కామోపచారకుశలలగుదురు. చక్కగ కామ్యవిశేషాభి
జ్ఞానము కలవారగుదురు. శ్రద్ధాసావధానులై యప్రమాదమున
యోగ్యస్త్రీలయం దిట్లు నాట్యభూమికావిన్యాస మాపాదింపవలెను.
ఇట్టి ప్రయత్న మధికముగ నొనరింపవలెను. యోగ్యవనిత లేకపోయి
నచో భావరససౌష్ఠవ మేమియు నుండదు. భావరససిద్ధి నాట్యహృద
యము. తదుపాయము యోగ్యవనిత.

## ప్రయోగభేదములు

నాట్యసమన్వితమయిన ప్రయోగము రెండువిధములు. మొదటిది సుకుమారము. రెండవది యావిద్ధము. ఈ రెండును నానాభావ రసాశ్రయములు. సుకుమారమె సమధికమని యావిద్ధమె యట్టిదని యాభిమానికభావావేశము యుక్తము కాదు. ఏదియయినను భావరససంశ్రయ మయినచో సముచితము సమధికము సమంచితము నగును. రసభావములందు న్యూనాధికభావ మేమి యున్నది? రసముల భావముల పర్యంతాస్వాదమున నేకఘనమగు స్వసంవిద్రాజ్యమె కలదు. రసభావాశ్రయమయిన ప్రయోగము సర్వము సుందరము. మానుషాశ్రితములయిన నాటకము ప్రకరణము భాణము వీథి అంకము అను నయిదు సుకుమారప్రయోగములని గుర్తింపవలెను. యుద్ధోద్ధతములు వేగకృతములు సంరంభబహుళములయిన ప్రయోగము లావిద్ధములు. అట్టివానిని స్త్రీలు ప్రయోగింపరాదు. వారు ప్రయోగించుటకు శక్తలు కారు. శక్తలుగా గోచరించినను రమ్యముగ నుండదు. కాని పరాక్రమోపేతలయిన స్త్రీలె యుద్ధమొనరింపవలసిన స్థితులలో స్త్రీప్రయోగము యుక్తమగును. శ్రీదేవీప్రభావసూచకమయిన లలితోపాఖ్యానము మహిషాసురమర్దనమువంటి వానిలో స్త్రీప్రయోగమె యావశ్యకము కావున నట్టివాని నిది యనదు. ఆవిద్ధములయిన యుద్ధతప్రయోగములను పురుషులె ప్రయోగింపవలెను. ఆవిద్ధప్రయోగ మీవిధముగ నుండును.

డిమము సమవకారము వ్యాయోగము ఈహామృగము అను రూపకము లావిద్ధసంజ్ఞతో నున్నవి. ప్రమోక్తలు వానినట్లె గుర్తించిరి. దేవదానవరాక్షసులు వీనిని ప్రయోగింపవలెను. శౌర్యవీర్యసమన్వితులయిన యుద్ధతపురుషులు వీని ప్రయోగింపదగుదురు. పురుషులె బహుళముగా నిందు సంచరింతురు. స్త్రీలల్పముగ నుందురు. ఈ యావిద్ధసంజ్ఞితమగు నాట్యప్రయోగము ఛేద్యభేద్యాహవాత్మకమై యుండును. మాయేంద్రజాలబహుళముగా నుండును. పుస్తనైపథ్యవిధానములచే దీపనము పొందియుండును. సాత్త్వత్యారభటీయుక్తమగు నిది యావిద్ధసంజ్ఞితమై యుండునని నాట్యవిదులు గుర్తించిరి. ఉద్ధతసుకుమార

నాట్యవిశేషరూప మిదివరలో సూచితమయినను స్పష్టప్రతిపత్తికై మఱల నిరూపితమయినవి. భూమికావికల్పప్రసక్తిలో నీ రీతికథన మావశ్యకమని యిచట గుర్తింపవచ్చును. భూమికాధారణమునందలి వికల్పనవిశేషముల గుర్తించుచు నీ నాట్యప్రయోగ మొనరింపవలె ననుట యిచటి భావసారము. నాట్యానుసారమున నాహార్యగుణ ముండును. సుకుమారనాట్యమగునేని యాహార్యసౌకుమార్యగుణ సంపద యావశ్యకము. నాట్య మావిద్ధమగునేని తదుచితసముద్ధతాహార్యసంభవ మావశ్యకము. "యథానాట్యమాహార్యగుణసంభవః". నాట్యానుసారమున నాహార్యగుణ ముండును. నాట్యధర్మిప్రవృత్తిపరమభావమె యిట్టిది. కావుననె సంపద్విశేషములు కల రాజుల గుణములు నల్పపరిచ్ఛదములు కల నటు లెట్లభినయింతురను ప్రశ్నయు నిచట జనింపదు. "యథా లోకే నాట్యధర్మిప్రవృత్తితా" లోకము నందు నాట్యధర్మిప్రవృత్తి యున్నది. స్వతస్సంభవి యగునదియు కల్పనాసంగతమై సహృదయసంభావనాభాజనమగుట కవిభావుకలోక ప్రసిద్ధము. ఇట్టీవిధముగా నాట్యమంతయు సర్వసంపన్నమగును. నాట్యము సర్వసంపన్నమగునట్లు నిరూపిత మయినది.

౯౯౫. వర్ణకైశ్చాదితశ్చాత్ర భూషణైశ్చాలంకృతః
గాంభీర్యాహార్యసంపన్నో రాజచిహ్నై ర్భవేన్నరః
౯౯౬. సప్తద్వీపాశ్రయశ్చైవ మథవైకో భవేన్నరః
వర్ణకైర్యాతి తేనేహ కార్యం త్వంగవిచేష్టితం
౯౯౭. అచార్యబుద్ధ్యా కర్తవ్యం సౌష్ఠవాంగపురస్కృతం
రాజవద్భరతస్తస్మాద్రాజాపి నటవద్భవేత్
౯౯౮. యథా నటస్తథా రాజా యథా రాజా తథా నటః
నాటకే సంప్రయోక్తవ్యో దేశభాషావయోఽన్వితః

రాజభూమికాస్వీకారమునకై యాచార్యబుద్ధిసంగృహీతుడయిన నటుడు నాట్యధర్మిప్రవృత్తు డగునేని రాజగుణానుకార మొనర్పగలడు. నాట్యధర్మితాస్ఫురణమునకై నటుడు వర్ణకములచే ఛాదితుడు కావలెను. భూషణములచే నలంకృతుడు కావలెను. ఇట్లు సముచితాహార్యశోభితుడు కాగా తద్దర్శనమున భావుకులు దేశకాలాతీతమయిన యలౌకికస్ఫురణము కలవారగుదురు. సాధారణ్యసంవిన్మార్గపథికులు

నగుదురు. నటున కిట్లాహార్యము నిర్దేశించుట యితరాభినయసామర్థ్యయోగమును సూచించును. గాంభీర్యము సూచించు నాహార్యము కల నటుడు రాజచిహ్నము కలవాడునగును. సమర్థసంపత్తియుండు నేని నటుడొక్కఁడు సత్త్వద్వీపాశ్రయుడగును. వర్ణకసంయోజనమున నటుడెట్టివాడయిన కాగలడు. తదనుకూలముగా సముచితాంగవిచేష్టితము నాతడు ప్రదర్శింపవలెను. కావుననె నాట్యాచార్యబుద్ధ్యనుసారమున నటుడు సౌష్ఠవాంగసంభృతుడై ప్రవర్తింపవలసి యున్నది. ఇట్లు సర్వసౌష్ఠవము కలవాడు కాగా భరతవిద్యాప్రయోక్త యగు నటుడు రాజువలె నగును. రాజును నటునివలె నగును. రాజు నటునివంటి వాడగును. నటుడు రాజువంటి వాడగును. నటుడు రాజు. రాజు నటుడు. ఆహార్యాద్యనుకారమున నటుడు రాజాభిన్నభావముకలవాడగును. తద్భావభావితచేతస్కుఁడగును. నటుడే రాజు ననుకరించునో యా రాజు దేశవిధానమును ఆతని దేశభాషను ఆతని వయస్సు ననుకరించి తద్భావసంగతుడు కావలెను. రాజునకు సంబంధించిన యభ్యంతరపరివారము బాహ్యపరివారము దేశభాషావయోఽన్వితముగా నాటకమునందు సముచితముగా సంధానింపవలెను. ఇట్లు రాజోపచారవిధిలో పురుషసంశ్రయమును శ్రద్ధగా నాయోజన మొనరింపవలెను. ఇదియంతయు నిట్లుపపాదితము కాగా నిటుపై ప్రయోక్తృగుణములను నిరూపించుట యవసరాపేక్షితమగు చున్నది.

## సూత్రధారుడు

ఇక సూత్రధారుని గుణములను నిరూపింపవలసి యున్నది. ఆతని పుణ్యాభిధానమె తల్లక్షణము. అభిమతవాక్యంస్కారము తాలవిధానజ్ఞత స్వరవాదిత్రతత్త్వవేదనము సూత్రధారుని స్వరూపలక్షణము ఇంకనాతని లక్షణవివేచన మిట్లున్నది,

౯౯౯. చతురాతోద్యకుశలః శాస్త్రకర్మసు శిక్షితః
నానాపాషండకార్యజ్ఞో నీతిశాస్త్రార్థతత్త్వవిత్
౧౦౦౦. వేశోపచారనిపుణః కామశాస్త్ర విచక్షణః
నానాగీత ప్రచారజ్ఞో రసభావవిశారదః.
౧౦౦౧. నాట్యప్రయోగకుశలో నానాశిల్ప సమన్వితః
పాదచ్ఛందోవిధానజ్ఞః సర్వశాస్త్ర విచక్షణః.

౧౦౦౨. గ్రహనక్షత్రతత్త్వజ్ఞో దేహవ్యాపార పండితః
పృథివీద్వీపవర్షాణాం పర్వతానాం జనస్య చ.
౧౦౦౩. ప్రమాణచరితజ్ఞశ్చ రాజవంశ ప్రసూతిమాన్
శ్రోతా శాస్త్రార్థకారాణాం శ్రుత్వా చైవావధారకః.
౧౦౦౪. అవధార్య ప్రవక్తా చ శక్త్యైవోపదర్శనే
ఏవంగుణస్తథాచార్యః సూత్రధారో విధీయతే.

సూత్రధారునకుండవలసిన వింశతి గుణవిశేషములిందు నిర్దిష్టము లయినవి. వీనిలో గొన్ని ప్రాగ్జన్మసంగతములు. కొన్ని వంశప్రాప్తములు. కొన్ని జనుస్సహజములు. కొన్ని విద్యాసంగతములు. మరికొన్ని యానుభవికములు. ఇవి పరిసంఖ్యాతస్వరూపమాత్రములె కావు. వీని స్వరూపవివేకమున నింక నేతాదృశములను గుర్తింపవచ్చును. ఇందు నిరూపితవిశేషము లన్నియు ప్రసిద్ధములు. నానావిధముల ప్రసిద్ధము లయిన యాతోద్యముల ప్రయోగమునందు ప్రయుక్తదోషగుణవివేచనమునందును సూత్రధారుడు సమర్థుడు కావలెను. కాకున్నచో నాతోద్యచోదకుల చోదనమున సమర్థుడు కాడు. విస్వరవిశ్రుతివిధానముల వలన గలుగు రాగరక్తిభంగ మాపాదించుటలో నచింతితముగ నాతడు హేతువగును. ఇంకను సూత్రధారుడు శాస్త్రకర్మలలో సుశిక్షితుడగుట ముఖ్యము. నటు లనుభవము కలదని తమ పరిమితానుభవమును సన్నిహితపరిచితు లభినందించినారని తతోధికసముపార్జనమున మందశ్రద్ధులై ప్రదర్శించినదే ప్రదర్శింతురు. అపుడు ప్రయోగప్రతిష్టంభము కలుగును. సూత్రధారుడు శాస్త్రకర్మలలో సుశిక్షితుడయినచో ననుభవము కలదని యనుకొను నటుల యనుభవమును శాస్త్రీయముగ పరిష్కరింపగలడు. నాట్యప్రయోగమునందు కొందరు నాట్యపాఖండు లుందురు. రస్యమగు నాట్యవేదరహస్యమును వారభిమానింపరు. విశ్వసింపరు. ప్రధానవిరుద్ధముగ సంచరింతురు. వారి దుర్విధానములను సూత్రధారుడు గుర్తింపకలవాడు కావలెను. నటీనటుల సమావేశమున్న నాట్యప్రయోగమున నటీనటు లొకప్పుడు రాగదోషవర్జితులు కాకపోవచ్చును. సూత్రధారుడు నీతిశాస్త్రార్థవిదుడయినచో నిట్టి ప్రమాదము రాదు.

వేశ్యోపచారనిపుణః వేశోపచారము వైశికోపచారము నిరూపితము. వేశ్యలనుపచరించుటలో నిపుణుడన్న భావ మిందసంగతము. పూర్వవిరుద్ధమును. వేశ్యల యుపచారములను పూర్వోక్త వైశికోపచారములను గుర్తించిన వాడగుటయె యిందు వివక్షితము. కామశాస్త్రవిచక్షణత యిందనుబంధి విశేషము. గీతప్రచారవిదుడు రసభావవిశారదుడు నాట్యప్రయోగకుశలుడు నానాశిల్పసమన్వితుడు ఛందోవిదుడు శాస్త్రవిచక్షణుడు కావలయుననుట సహృదయార్పణము. నాట్యప్రయోగమున వలయు సర్వార్థములు కలవాడు కావలెనని సర్వభావము. గ్రహనక్షత్రతత్త్వజ్ఞతయు సూత్రధారున కపేక్షితము. ముద్రారాక్షసమున సూత్రధారునకీ యభిజ్ఞత నిరూపిత మయినది. ఇట్టివావశ్యకములని నిర్దేశించుట కవి కివి వలయునని నిరూపించుటయు నగును. దేహవ్యాపారపండితః. అంగోపాంగసహితాంగికాభినయప్రయోగమున నానాగతివిధానములందును, శిరోరేచక గ్రీవారేచక కటిరేచకాదులందును, శిరోభ్రూనేత్రచిబుకాదికర్మలందును ప్రయోగనైపుణ్యము కలిగి యుండుట పరమావశ్యకము. ఇది సర్వనటుల కాచార్యకమై శోభింపగలదు. అందరు గౌరవింపగలరు. వినేయులు కాగలరు.

[illegible]పవర్ష పర్వతాదుల ప్రమాణములను చరితములను సూత్రధారుడు గుర్తించినవాడయిననె ప్రయోగము రాణించును. ఇట్టి సూత్రధారుడు రాజవంశప్రసూతి యగుట యుక్తము. రాజపరిపాలనమునందు రాజవంశజుని వచనమును లోకులాదరింతురు. రాజవంశసహజము లయిన లక్షణములు కలిగి యాతడు శోభించును. శాస్త్రార్థకాగుల వచనముల నాతడు సావధానముగ వినవలెను. అట్లు విని శ్రద్ధగా నవధారింప నలెను. అవధారించి ప్రవచన మొనరింపవలెను. అట్లు నాట్యప్రదర్శన మొనర్చుటలో శక్తుడును కావలెను. తానొకడె సర్వజ్ఞుడు కాడు. తనవంటి వారి శాస్త్రానుభవవిజ్ఞానముల నాతడు గుర్తించి ప్రయోగింప సమర్థుడయిననె ప్రయోగము సుప్రయోగమగును.

సూత్రధారు డిట్టి గుణములు కలవాడగుట నాట్యవిదులకు సమ్మతము. సూత్రధారుడు నాట్యాచార్యుడు. ఆతడిట్టి వాడుగా నుండుట నాట్యవిద్విధి, సూత్రధారునకింకను స్వాభావికములగు గుణములు కలవు. అవియు గుర్తింపదగు గుణములు. స్మృతి మతి కలయాతడు ధీరుడు ఉదారుడు స్థితవాక్కు కవి నీరోగుడు మధురుడు క్షాంతి దాంతి కలవాడు ప్రియంవదుడు మన్యుదోషరహితుడు సత్యవాక్కు దక్షిణుడు శుచి యగును. లోభము లేని యోగ్యప్రతిపత్తితో నాతడు ప్రవర్తించును. ఇట్టి వన్నియు నాతని స్వాభావిక గుణములు, ఇట్టి గుణములు కలవారె యాతని యనుయాయులుగ నుందురు. పారిపార్శ్వకుడు సూత్రధారానుయాయి. ఈతడు మధ్యమ ప్రకృతి. సూత్రధారుని గుణములు కొన్ని యీతనిలో నుండును. అన్నియు నుండవు.

౧౦౦౫. ఉజ్జ్వలో రూపవాంశ్చైవ దృష్ట్వోపకరణక్రియః
మేధావీ చ విధానజ్ఞః స్వకర్మకుశలో నరః

పారిపార్శ్వకుడుజ్జ్వలాకారిమున నుండును. సుందరరూపమున నుండును. చూచినమాత్రమున నుపకరణక్రియాచతురు డగును. మేధావి విధానజ్ఞుడు స్వకర్మకుశలుడు నగును. కతిపయసూత్రధారగుణములు కలవాడయిన నీ నిరూపితగుణములు కలవాడగుట ముఖ్యము. సూత్రధారునం దీ గుణములుండుట నిరూపితము కాకపోయినను వీని సాహిత్యమభ్యూహ్యము. "సూత్రధారగుణైర్యుక్తాః సర్వ ఏవ ప్రయోగిణః" ప్రయోగమున పాల్గొనువారందరును సూత్రధారగుణములు కలిగి యుందురు. అందరిగుణములు సూత్రధారునందుండును. కొన్ని కార్యముల యాచరణమునకు కొందరి నాతడు నియమించును. ఎవరేని రాకున్న నందరి పనుల నాతడే నిర్వహింపగలడు.

౧౦౦౬. వేశ్యోపచారకుశలో మధురో దక్షిణః కవిః
ఊహాపోహక్షమో వాగ్మీ చతురశ్చ విటో భవేత్
౧౦౦౭. ఉజ్జ్వలవస్త్రాభరణః క్రుద్ధ్యత్యనిమిత్తతః ప్రసీదతి చ
అధమో మాగధభాషీ భవతి శకారో బహువికారః
౧౦౦౮. వామనో దంతురః కుబ్జో ద్విజిహ్వో వికృతాననః
ఖలతిః పింగలాక్షశ్చ స విధేయో విదూషకః

౧౦౦౯. కలహప్రియో బహుకథో విరూపో గంధసేవకః
మాన్యామాన్యవిశేషజ్ఞశ్చేటోఽప్యేవంవిధః స్మృతః

సూత్రధారానుయాయులగు విటచేటవిదూషకులిందున్నారు. శకారుడు బహువికారుడు నున్నాడు. వీరి స్వరూపవిశేషము లిదివరలో నిరూపితము లయినను సూత్రధారప్రసంగమున మరల నిరూపించుట యుచితమె యగును. విటుడు వేశ్యోపచారములందును వైశికోపచారములందును కుశలుడు మధురభాషి దక్షిణుడు కవి వాగ్మి ఊహాపోహ సమర్థుడు చతురుడు నగును. మృచ్ఛకటికమునం దేవంలక్షణుడయిన విటుడున్నాడు. ధూర్తవిటప్రహసనములో చతుర్భాణిలో విటవిశేషములు గోచరించును. భాణములందు విటవిలాసము సుందరముగ నున్నది, శకారుడు బహువికారుడు. ఉజ్జ్వలవస్త్రాభరణములు ధరించి యాడంబరముగ సంచరించును. అకారణముగ కోపము తెచ్చికొనును. అనిమిత్తముగ నవ్వును. స్వభావమున నధమప్రకృతి. మాన్యామాన్య మాన్యతామాన్యతలు పరిశీలింపడు. మాగధభాషాభాషి యగును. విదూషకుడు వామనుడు దంతురుడు వికృతాననుడుగ నుండును. విదూషకుడు రెండునాలుకలవాడు. వారితో నొకటి వీరితో నొకటి పలుకును. బట్టతలవాడు పింగళాక్షుడు. హాస్యకారితాభోజనప్రియతాది విశేషముల నీతనియందు పూర్వోక్తానుసారమున గుర్తించి నిరూపింపవలెను. విదూషకుని నిట్టివానిగ నిరూపించుట యావశ్యకము. మహాకవులు నాటకములందు విదూషకనిబంధమున శ్రద్ధాళువులై విశేషములను ఘటించినారు. చేటుడు కలహప్రియుడు వీని గురించి యనేక వార్తలుండును. వీడ నేకములు చెప్పును. చేటుడు విరూపుడై యుండును. గంధసేవకుడగును. మాన్యామాన్యవిశేషముల గుర్తించియె ప్రవర్తించును. చేటు నిట్లు నిబంధించుట యావశ్యకము. మృచ్ఛకటికమున చేటుడు కలడు.

నాట్యయోగవిచక్షణుడు పూర్వోక్తోదాత్త గుణసహితుడు కావలెను. కళాప్రయోగమునందు నాట్యనిత్యాహ్లాదయులకు సమ్మోదము సంధానించువాడు కావలయును. భావుకాచార్యసంతోషమావశ్యకము. సంతుష్టులయిన భావుకులు నాట్యవిదు నభినందింతురు. అట్టి యభినందనభాజను డయిననె యాతని సిద్ధి విశదమగును.

## గ ణి క

నాట్యప్రయోగమున గణికాసాహాయ్య మావశ్యకము. గణికలు కలావిశారదలు. హావభావలీలాసంయుతలు, సత్త్వవినయసముపేతలు, మాధుర్యసంయుక్తలు, చతుష్షష్టికలాన్వితలు, రాజోపచారకుశలలు, అయినను స్త్రీదోషవివర్జితలు. గణిక ప్రియవాదిని ప్రియకథ ప్రియదక్ష జితశ్రమ యగును. గణిక యిట్టి గుణములతో నుండుట శోభ.

## నాట్యనాయిక

నాట్యమున నాటక ప్రయోగమున నాయికగా నుండదగిన వనితాస్వరూపవిశేషము లీ విధముగ నుండవలెను.

౧౦౧౦. రూప గుణ శీల యౌవన మాధుర్య శక్తి సంపన్నా
విశదా స్నిగ్ధా మధురా పేశలవచనాభిరక్తకంఠీ చ

౧౦౧౧. యోగ్యా యామక్షుభితా లయతాలజ్ఞా రసైస్తు సంయుక్తా
ఏవంవిధగుణైర్యుక్తా కర్తవ్యా నాయికా తజ్జ్ఞైః

నాట్యనాయికకు వలయు గుణవిశేషము లీ కారికలలో కలవు. నాట్యవిదులు నాట్యనాయిక యిట్లుండునట్లు ప్రసమీక్షింపవలెను. రూపము గుణము శీలము యౌవనము మాధుర్యము శక్తి నాయిక కావశ్యకము ఆమె విశదభావ స్నిగ్ధస్వభావ, మధురహావ, పేశలవచన, రక్తకంఠి, యోగ్యప్రకృతి యామక్షుభిత? లయతాలవిశేషజ్ఞ, రససంయుక్త యునై యుండవలెను. అభిజ్ఞులు నాయికనిట్లు కూర్పవలెను.

రసభేదము ననుసరించి భావభేదము ననుసరించియు నాయికా స్వభావములందు భేదమపరిహార్యమగును. రోషణ భీషణ యయిన నాయిక నిబంధనీయ యగునేని యామె స్వభావమిట్లుండవలెను. అస్థానమున రూక్షభావము కలదియగుట యావిద్ధగతి యుద్ధతచేష్టితము కలదగుట దీర్ఘరోషము కలది యయ్యు దీనముగా నుండునది యగుట యుద్భటస్వభావయగుట తద్భావానుసారమున నపేక్షితము. ఆమె సర్వాభరణసంయుక్తయు గంధమాల్యోపశోభితయు నగును. ఇట్లు నాట్యప్రయోక్తలు ప్రకృతినిబంధన మొనర్పవలెను. నాట్యవిదు లిట్లు నిబంధించుటయె కాదు. ఆ యా భూమికా ధారణ మొనర్చువారు

తత్తద్భూమికాస్వభావమును బాగుగా గుర్తించి తదనుకూలముగ రంగమున వ్యవహరించుట యుక్తము. ఇట్టిదియంతయు నటశిక్షార్థమైన యుపదేశము.

## భరతవికల్పనము

ఇటుపై భరతవికల్పన మావశ్యకము. భరతవిద్యానుకూల ప్రవృత్తి కలవారందరు భరతులు. నాట్యవిద్యాప్రదర్శనమునకగు నాట్యశాలలో సర్వవిధకార్యకర్తలు భరతులు. భరతు లనేకవిధముల నున్నారు. అనేకలక్షణములతో నున్నారు. ఇటుపై వారిస్వరూప వివేక మావశ్యకము. విదూషక-తౌరిక-నట-సూత్రధార-నాట్యకార-ముకుటకార-ఆభరణకార-మాలాకార-చిత్రకార-రజక-కారుక - కుశీలవులు భరతులు. వారి స్వరూపమిట్లున్నది. భరతులనేకభూమికా ధారణసమర్థు లగుదురు. నాట్యగృహోపకరణముల భాండముల యుపయోగము తెలిసి యుందురు. తానొకడేని కార్యభారము వహింపగలవాడుగ నుండును.

విదూషకుడు విభూషితవచనుడు. ఎప్పటికప్పుడు సముత్పన్న ప్రతిభుడై ప్రకాశించును. ఇట్టివారిని ప్రత్యుత్పన్నమతికలవారని యందురు. లోకమునందు సర్వప్రకృతిప్రచారముపొందిన యంశము పలుకును. హృదాశ్రయము నిరూపింపడు. నానాశ్రయము నార్థాశ్రయము నిరూపించును. నిత్యము నర్మకారి యగును. నర్మగర్భాంశములను పల్కును. ఇట్టి విదూషకవిషయములను పూర్వనిరూపితముల మేళనముతో భావింపవలెను. ఒక్కొక్కవిషయమున నొక్కొక యంశమునకు ప్రాధాన్యముండును.

౧౧౧౨. తూరపతిస్తూర్యపతిః సర్వాతోద్యప్రవాదనే కుశలః
తూర్యపరిగ్రహయుక్తో విజ్ఞేయస్తౌరికో నామ

౧౧౧౩ నాటయతి ధాత్వర్థో౽యం భూయో నాటయతి చ లోకవృత్తాంతం
రసభావసత్త్వయుక్తం యస్మాత్తస్మాన్నటో భవతి

౧౧౧౪. గానస్య చ వాద్యస్య పాఠ్యస్యాప్యేకభావభావవిహితస్య
శాస్త్రోపదేశయోగాత్ సూత్రజ్ఞః సూత్రధారస్తు

౧౦౧౫. యస్మాద్యథోపదిష్టాన్ తాంశ్చ భావాంశ్చ సత్త్వసంయుక్తాన్
భూమివికల్పే నయతి చ నాట్యకారసంజ్ఞిత స్తస్మాత్
౧౦౧౬. చతురాతోద్యవిధాన ప్రయోగశాస్త్రార్థ హేతువిహితస్య
నాట్యస్య యః ప్రయోక్తా స నటో నామ విజ్ఞేయః

ఈ కారికలలో తౌరిక నట సూత్రధార నాట్యకార స్వరూపగతము లయిన విశేషములు కలవు. నాట్యమునందలి వాచికాభినయ విధానాంగములయిన వాద్యగతులను శాస్త్రీయముగ రక్తిసుందరముగ ప్రసరింపజేయుట యావశ్యకము. తూర్యపతియగు తౌరికుడు శూరపతి. సర్వవిధాతోద్యవాదనములం దీతడు కుశలుడు. తంత్రీవాద్యవాదన నిపుణు లన్యవాదననిపుణులు కారు. ఈతడట్లుకాక సర్వవాద్యనిపుణు డగును. కాన నీతడు సర్వపతియు నగును. తూర్యపరిగ్రహమున నియుక్తుడగు నీతడు తౌరికపదవ్యపదేశ్యుడు. నటపదమునకు రెండు విధముల వ్యుత్పత్తులు కలవు. "నాటయతీతి నటః" "నటయతీతి నటః" నటింపజేయువాడు నటించువాడును నటుడగును. నటధాత్వర్థమీ యర్థ మర్పించినది. లోకవృత్తాంతమును రసభావసత్త్వయుక్తముగ నటించునాతడు నటుడు. నటింపజేయువాడు నటుడు. లోకవృత్తాంతము నటింపజేయుట రసభావసత్త్వయుక్తముగ నటించుట యను విభాగపరమయిన యర్థకథనము నాట్యసంప్రదాయవిరుద్ధము. లోకానుగత మలోకగతమై యాలోకపరీగత మగుటయె సమ్మతము. అందునను లోకవృత్తాంతము రసభావసత్త్వసంయుక్త మొనరించు నాతడు నటుడనుట యుక్తము. ఈ లక్షణకారికలలోని చతురాతోద్యకారికయు నటవైశిష్ట్యము నిరూపించును. నాల్గువిధములయిన యాతోద్యముల విధానమునందును ప్రయోగమునందును ప్రయోజనమునందును సముచితపరిజ్ఞానము కలవాడై నటుడుండుట యావశ్యకము. నాట్యమంతయు నట్టి యాతోద్యశాస్త్రార్థహేతువిహితము కావున నట్టి నాట్యమును చక్కగ ప్రయోగింప గలవాడయినను నటుడగును. నటుడు నాట్యారంభమున రంగప్రవేశ మొనర్చి యాశీర్వాదన ప్రయుక్తము లయిన మధురవాక్యములతో తగిన మంగళాచారములతో లోకము నభినందించును. స్తుతించును. అట్లాతడు సర్వలోకము స్తుతించును గావున ఆ స్తుతి నాందియగును. నాట్యప్రయోగమునం-

దితడు డిట్లు పలుకజాలడు. సూత్రధారునకు సూత్రజ్ఞు డనియు నామము. ఏకభావవిహితము లయిన గాన వాద్య పాఠ్యముల తత్త్వము గుర్తించి శాస్త్రోపదేశయోగ సంబంధమున ప్రవర్తించును. నాట్యకారసంజ్ఞతో నుండు భరతుడు కలడు. సత్త్వసంయుక్తము లయిన యథోపదిష్టభావార్థములను భూమికావికల్పనము నిర్దేశించును. నాట్యోపదేశానుకూలమయిన సత్త్వసంపద నాదేశించి యథోచిత ముగా పాత్రసంయోజనము చేయును. ఇట్టి యాతడు నాట్యకార సంజ్ఞితు డగును.

నాట్యమువ భరతవిద్యాప్రవృత్తి సహకారమునకై యింకను కొందరు నాటకీయవనితలునుందురు. నాటకీయవనితాలక్షణము నిరూపితమె. ఇంక నీ యంశ మాయోజనీయము. నాటకీయవనిత భాండ వాద్యజ్ఞ లయతాలవిధానవిజ్ఞానయై రసానువిద్ధయు నగును. సర్వాంగసుందరిగా నుండు నాటకీయవనిత పూర్వోక్తలక్షణవతి యగు నట్లు నిబంధింపవలెను.

పరిష్క్రియాకారులు

౧౧౧౭. నానాప్రకృతిసముత్థం కరోతి శీర్షకం ముకుటయోగైః
వివిధైర్వేషవిశేషైః స ముకుటకారస్తు విజ్ఞేయః.
౧౧౧౮. వస్త్రాభరణం కుర్యాద్బహువిధసహితం న చాభరణకృత్స్యాత్
యశ్చోపకరణయోగ్యః స తేన నామ్నా సమభిభాష్యః.
౧౧౧౯. యో వై మాల్యం కురుతే పంచవిధం స మాల్యకృద్విజ్ఞేయః
యశ్చాపి వేషయోగం స చ వేషకరస్తు విజ్ఞేయః.
౧౧౨౦. చిత్రజ్ఞశ్చిత్రకరో వస్త్రస్య చ రంజనాద్భవేద్రజకః
జత్వశ్మలోహ కాష్ఠైర్ద్రవ్యకరః కారుకశ్చైవ
౧౧౨౧. నానాతోద్యవిధానే ప్రయోగయుక్తః ప్రవాదనే కుశలః
కుశలవదాదాతవ్యో యస్మాత్తస్మాత్కుశీలవః స్యాత్.
౧౧౨౨. యద్యత్సమాశ్రయతే శిల్పం వా కర్మ వా ప్రయోగం వా
తత్తేనాత్మగతగుణో విజ్ఞేయో నామతః పురుషః.

ఈ శ్లోకములలో ముకుటకార - ఆభరణకృత్ - మాల్యకృత్ - వేషకర - చిత్రకర - రజక - ద్రవ్యకర - కారుక - కుశీలవ లక్షణములు కలవు. శీర్షకమనునది శిరోభూషణము. దీనినే ముకుటమని

మకుటమని వ్యవహరించుట కలదు. తగినస్థానవిభాగకల్పనములు కూడి యుండునట్లుగా శీర్షకము నిర్మాణింతురు. ఈ నిర్మాణవిధానము మకుటయోగము. నానాప్రకృతియోగ్యమయిన శీర్షకమును మకుట యోగవిధానములతో నిర్మించునాతడు మకుటకారుడగును. నానా ప్రకృతులకు సంబంధించిన నానావిధవేషవిశేషములతో సంబంధము కలిగిన శీర్షకనిర్మాణము మకుటకర్మ పురుషకర్మ. బహువిధావిశిష్ట మయిన వస్త్రాభరణసంపదను నిర్మించు వాడాభరణకారి. ఎవడే యుపకరణయోగ్యుడగునో పరిశీలించి వాని నావిధముగ వ్యపదేశిం చుట యుక్తము. మాల్యము లొనరించువాడు మాల్యకరుడు. మాల్యము లయిదువిధములు. అవి పూర్వము నిరూపితములు. ప్రకృత్యనుసారమున మాల్యవిశేషము లుండుటయు సంప్రదాయ ప్రసిద్ధము. సౌందర్యశాస్త్రములందును విహితము, వేషయోగము నిర్మాణించువాడు వేషకరుడు, చిత్రజ్ఞుడగువాడు చిత్రకరుడు. వస్త్ర ములకు రంజన మాపాదించునాతడు రజకుడు, లక్క - రాయి - లోహము - కొయ్య మొదలగువానితో పరికరద్రవ్యముల నిర్మించు వాడు కారుకపదమున వ్యవహరింపదగును. నానావిధములయిన యాతోద్యముల విధానమునందును ప్రయోగమునందును సమర్థుడగు కుశీలవుడు వానిప్రవాదనమునందును సమర్థుడగును. కుశీలవుడు కుశ లుడు. నిపుణుడు, "కుశాన్ లాతీతి కుశలః" కుశములను శ్రద్ధగా స్వీకరించువాడు కుశలుడు, అట్లె శ్రద్ధాసాహిత్యమున వాద్యవాదన మొనరించువాడును కుశలుడు. కార్యకర్మకరణమునకు కుశలు డావశ్య కము. కుశీలవు డట్లె స్వీకార్యుడు. ఏయే పురుషు డేయే శిల్ప కర్మప్రయోగములను సమాదరమున సమాశ్రయించునో వాని నావిధ ముగ నాత్మగతగుణమున వ్యపదేశించుట సముచితము. ఇట్లె తెలి యుటయు యుక్తము.

నాటకవిధానమునందు నటజాతి యీ విధముగ నున్నది. ఇట్లుగా నుండవలయుటను నాట్యబుధులు గుర్తించుట యావశ్యకము. ప్రథమ మున నీ విధానము నిట్లు గుర్తించినచో వలయు వివేకవర్తనులై యపేక్షితాన్యాంశముల నూహింపగలరు. నాటకవికల్పప్రయోగము

నందు నానోపకరణసంయుక్తముగా నీ వర్గముండును. ఒక నాటకోప కరణములు మరియొకనాటకమున నుపయోగింపవు. అందలివి వేరొక నాటకమున తగవు. ప్రతినాటకమున భిన్నభిన్నోపకరణసంపాదన మావశ్యకము. ఇందీవిధముగా భూమికాన్యాసము తదుద్యోగమున ప్రయోక్తల విశేషము సర్వము నిర్దిష్టమయినది. ఇంక నీ విషయ మున జెప్పదగినది యేమి కలదు ? ఏమి యేని యున్నచో నది నాట్యా వతారమునకు సంబంధించినది కావలయును. ఇటుపై నాట్యావతా రము నిరూపింతుము.

## నాట్యావతారము

భరతుడు సర్వజ్ఞుడు. నాట్యమునకు సంబంధించిన సర్వవిషయ ములను సావధానముగ నిరూపించినాడు. నాట్యసర్వస్వమె నివేదించి నాడు. ప్రతిపాదనమునందలి విశిష్టత యనేకవిధముల నుండును. ప్రతి పాద్యగౌరవమున ప్రతిపాదనము శోభించును. ప్రతిపాదకవిశిష్టతయు ప్రతిపాదనవైశిష్ట్యమునకు హేతువు. ఇంకను బోద్ధవ్యవిశేషమున గూడ ప్రతిపాదనము శోభించును.

౧. ప్రతిపాదకుడు సర్వజ్ఞభరతుడు
౨. ప్రతిపాద్యము నాట్యసర్వస్వము
3. బోద్ధవ్యులభిజ్ఞులయిన మునులు

ఇట్లీ త్రితయసంగతి యంతయు ప్రతిపాదనమహత్త్వాఖ్యాపకము. అభిజ్ఞు లయిన మునులు బోద్ధవ్యులు కాగా ప్రతిపాద్య ముదాత్తభావసంభరిత మని స్పష్టమగును. అట్టి ప్రతిపాద్య మట్టి బోద్ధవ్యులుండురేని ప్రతి పాదకుడు శ్రద్ధావధానవిశిష్టత కలవాడగును. భరతునందట్టి విశిష్టత యున్నదని విశిష్టులయిన మునులు గుర్తించిరి. ప్రతిపాద్యప్రతిపాదన మున ప్రతిపాదకుని పాండిత్యము ప్రతిభ మునికల్పుల కవగతమయినది.

౧౦౨౩. ఏవం తే మునయః ప్రీతాః సర్వజ్ఞం భరతం తథా
పునరూచురిదం వాక్యం కుతూహలపురోగమం

మునులందరు సంప్రీతులై సర్వజ్ఞుడయిన శ్రీభరతుని పరివేష్టించి యుండి కుతూహలపురోగమమయిన నీ వాక్యము పలికిరి. భరతసర్వజ్ఞునే ప్రతి

పాదనమంతయు మునులకు కుతూహలమాపాదించినది. ఇంకనాతడే మేని ప్రతిపాదింపవలెనని యది వినవలెనని మునుల కభిలాషము కలిగినది. సంప్రీతులయిన మునులందరు స్వవిషయధన్యులయిన మహాభావులు, వారి నామసంకీర్తనమును ప్రతిపాద్యనాట్యాతిశయద్యోతకము.

ఆత్రేయ - వశిష్ఠ - పులస్త్య - పులహ - క్రతు - అంగిరా - గౌతమ - అగస్త్య - మను - ఆయు - అరువాన్ - విశ్వామిత్ర - స్థూలశిరాః - సంవర్త - ప్రతిమర్దన - ఉశనాః - బృహస్పతి - వత్స-చ్యవన-కాశ్యప - ధ్రువ - దుర్వాసాః - జమదగ్ని - మార్కండేయ - గాలవ-భరద్వాజ - రైభ్య - వాల్మీకి - స్థూలాక్ష - శంకులాక్ష - కణ్వ - మేధాతిథి - కుశ - నారద - పర్వత - సుశర్మ - ఏకధన్వి - నిష్ఠ్యాతి-భవన - ధౌమ్య-శతానంద - అకృతవ్రణ - జామదగ్న్యరామ - వామనాదులు ఋషులు భరతవచోభావితులు సంప్రీతహృదయులై యీ విధముగా భరతు నడిగిరి.

౧౧౭౪. యస్త్వయా కథితో హ్యేష నాట్యవేదః పురాతనః
ఏకచిత్తైః సహాస్మాభి స్సమ్యక్సముపధారితః
౧౧౭౫. భగవన్! సంశయో యత్తన్నో వ్యాఖ్యాతుమర్హతి
కో హ్యస్యో నాట్యవేదస్య నిశ్చయం వక్తుమర్హతి
౧౧౭౬. న వయం పరిభావేన న విరోధేన నేర్ష్యయా
పృచ్ఛామో భగవన్! నాట్యోపదేశాభిపూర్వకం
౧౧౭౭. అస్మాభిశ్చ తదా నోక్తం తదాచ్ఛేదో భవేదితి
తత్సర్వం నిఖిలేనేదం నాట్యం గుహ్యం విదర్శయ
౧౧౭౮. లోకస్య చరితం నాట్యమిత్యవోచస్త్వమీదృశం
తేషాం నో లోకగుహ్యానాం నిశ్చయం వక్తుమర్హసి

సావధానముగా మునులు గుర్తించుట భరతవిద్యాప్రయోగప్రశస్తి. సర్వజ్ఞ భరతా! పురాతననాట్యవేదము నీవింతగా ప్రతిపాదించితివి. సమగ్రముగా నిరూపించితివి. మేమందర మేకచిత్తులమై నీవుపదేశించిన దంతయు గ్రహించి ధారణమొనరించితిమి. అందర మేకవిధమున గుర్తించితిమి. మాగుర్తించుటలో నేకచిత్తత యున్నది. సావధానత యున్నది. భావభేదరహితముగ సర్వము గుర్తించితిమి. మాకు సంశయమొకటి కలిగినది. నిస్సంశయముగ గుర్తించుట శ్రేయము.

ఈ సంశయమును నీవే తీర్పవలయును. సంశయవ్యాకులహృదయు లందు నిరూపితవిషయము స్థిరముగా నుండదు. సంశయపరాహతమై నష్టమగును. కావున సంశయితవిషయమును వ్యాఖ్యానించి నిరూపించుటకు నీవే యర్హుడవు. నాట్యవేదనిశ్చయమును చెప్పుటకు నీవే సమర్థుడవు. నీకన్న నన్యుడీవేదనిశ్చయము నిర్వచింప సమర్థుడు కాడు. గురూపదేశపురస్సరముగా గుర్తింపవలసిన నాట్యమును దాని తత్త్వమును నిస్సంశయముగా దెలియదలచితిమి. మేమిది తిరస్కారమున నడుగుటలేదు. విరోధభావమున నడుగుటకాదు. ఈర్ష్యచే నడుగుటయు కాదు. భగవన్! తత్త్వవేదనమునకై యడుగుచున్నాము. సంశయగ్రస్తులగు కతిపయవ్యక్తులు పరిభావమున నడుగుదురు. వారుపదేశించిన విషయాంశమును కాదనుట కేమేని యడుగుదురు. మరి కొందరు తమ నిశ్చితమార్గమున కిది విరుద్ధమని, దీనిని వాదమున ఖండింప వలెనని తలచి విరోధభావమున సంశయించి ప్రశ్నింతురు. వారి వాదమువలన తమభావమునకు న్యూనత కలుగునని విరుద్ధసంభావన మొనరింతురు. కొందరీర్ష్యపడి యన్యథా ప్రశ్నింతురు. పరిభావ విరోధేర్ష్యాభావములతో ప్రశ్నించుట యుక్తముకాదని మునుల వచన భావము. భగవన్! మీరారాయావిషయముల నుపపాదించుసమయము నను కొన్ని యాశంకలుదయించినవి కాని ధారావాహికమయిన ప్రతిపాదనమునకు విచ్ఛేదము కలుగజేయరాదని యా సమయములందు మాసంశయములను నిరూపింపలేదు. శ్రోతలు ప్రవాహావిచ్ఛేదము కలుగకుండుటకై యత్నింపవలెను. అప్పుడు మేమడుగలేదు. ఇప్పు డడుగుచుంటిమి. మా సంశయము తీరునట్లు సంపూర్ణముగా నాట్య రహస్యము నిదర్శింపుడు. నాట్యము లోకచరితమని మీరె ప్రథమమున నిర్దేశించితిరి. "త్రైలోక్యభావానుకీర్తనం నాట్యం" అని యంటిరి. లోకగుహ్యములయిన నాట్యగుహ్యములను నిర్దేశింపుడు. లోకగుహ్యములగు వాని స్వరూపరహస్యములను వ్యాఖ్యానించినిరూపింపుడు. వాని నిశ్చయము నివేదింపుడు.

పూర్వరంగమునం దే దేవుని చరితము ముఖ్యనిరూప్యము? ఆ దేవున కెట్లుల పూజింపవలెను? ఆ దేవచరితమట్లు ప్రయుక్తముకాగా

నా దేవుడానాట్యమునకేమి విశేషమాపాదించును? ఆ దేవుడా పూజావిశేషమున నాచరితానుకరణమున ప్రీతుడగునా? ప్రీతుడు సుప్రీతుడై యా దేవుడెట్టిప్రీతి నాపాదించును. పూజారంభకార్యారంభుడయిన సూత్రధారుడు శౌచక్రియారంభుడగుటలో నభిప్రాయమేమి? ఇట్టి సంశయము లీవిధముగ గలుగుచున్నవి.

౧౦౨౯. కథముర్వీతలే నాట్యం స్వర్గాన్నిపతితం విభో!
కథం తవాయంవంశశ్చ నటనంజ్ఞః ప్రకీర్తితః?

ఈనాట్యము స్వర్గమున సంక్రమించినది కద! స్వర్గమునుండి యుర్వీతలమునకిది యెట్లు ప్రసరించినది. మీావంశము నటవంశమని ప్రఖ్యాతమయినదికదా! ఆ నటసంజ్ఞ యెట్లు కలిగినది? ఈ సంశయములనన్నిటిని నివారింపవలసినదని యాత్రేయాదిమునుల ప్రశ్నల భావము. ఇటుపై సర్వవిద్భరతుని సమాధానభావ మాలోచనీయము,

౧౦౩౦. బ్రవీమి వో హ్యయం విప్రాః! యన్మాం పృచ్ఛత సువ్రతాః
పూర్వరంగవిధౌ తస్య తచ్చ సమ్యఙ్నిబోధత

విప్రులు సువ్రతులు నయిన మునులగు మీరు ప్రశ్నించుట యుక్తము. ఆట్లడిగినది యంతయు నిరూపింతును. పూర్వరంగవిధానమున సంక్లుప్తమంతయు నివేదింతును. మీరు సావధానముగ నిభాలనము చేయుడని భరతుడు తానుపపాదించుట కుపక్రమించెను. పూర్వము రంగవిఘ్ననిబర్హణోపాయము నిరూపిత మయినది. తదనుబంధముగనె పూర్వరంగము ప్రకీర్తితమయినది. శాస్త్రముల పరిష్క్రియాసంపాదనమునకు శరీరాచరణమావశ్యకము. పూర్వరంగాచరణ మట్లె యావశ్యకము. సర్వగతపాపము స్మరణమువలననె నశింపగలదు. ఇట్లె జప్యములు హోమములు దేవతాభ్యర్చనము పాపము నశింపజేయగలవు. స్తుత్యాశీర్వచన సంయుక్తమయిన పూర్వరంగము కర్మభావానుకీర్తనమున సుసంగతమై సర్వాతోద్యనినాదసంకలితమై పాపనిబర్హణమొనరించును. స్వరశ్రుతిరాగదోషరహితములయిన, రక్తిరంజితముగా స్వరమధురముగా ప్రగీతములయిన గీతస్వనములకు నట్టి శక్తియున్నది. పూర్వరంగమున నిట్టివన్నియు పాపహరణసమర్థములు. విఘ్ననిబర్హణనియుక్తము లయినవి.

౧౦3౧. స్తుతిగీతాదిసంహృష్టా యేనాథ హ్రియతే పుమాన్
తస్మాదథప్రయోగస్తు నాన్దీ నామ భవిష్యతి.
౧౦3౨. గీతవాద్యానునాదీ చ యత్ర కాకుస్వరః శుభః
తస్మిన్దేశే తు పాపఘ్నో మాంగల్యశ్చ భవిష్యతి.
౧౦33. యావన్తం పూరయేద్దేశం ధ్వనిరాతోద్యసంశ్రయః
తావంతమశుభం కించిన్న చ విఘ్నవినాయకాః,
౧౦3౪. అవాహే చ వివాహే చ యజ్ఞే నృపతిమంగళే
నాందీశబ్దముపశ్రుత్య హిం స్రా నశ్యంతి సర్వథా.
౧౦3౫. వాద్యం శ్రుత్వా తథా చైవ గానంవాదిక్రమేణ చ
వేదమంత్రార్థవచనైస్సమం హ్యేతత్తదైవ చ.

పూర్వరంగమునందలి నాందీప్రయోగమునందు విశిష్టమయిన నాట్య విద్యావైభవమున్నది. శ్రోతృప్రయోక్తృమానవులందరు రంగమున పూర్వరంగప్రయుక్తములయిన స్తుతిగీతాదులను స్వసంవాదసౌభాగ్యమున నాస్వాదించి తుష్టులు హృష్టులు నగుదురు. స్తుతిగీతాదిహ్రియమాణమానసులగుదురు. పాఠ్యప్రయోగమున ధ్రువాప్రసారమున రంగమండలమంతట రసమాపూరితమగును. శ్రుతివ్యూహము స్వరసందోహము నిర్నిరోధప్రసారమున వ్యాపించును. స్వరశ్రుతులవలనములు వర్తనములు బాహ్యాపరిధులను పూరించి సచేతోహృదయరంగముల రంజింపజేయును. ఈయంశమున సభియుక్తులిట్లు నిర్దేశించిరి.

పాఠ్యాదథధ్రువ గానాత్తతః సంపూరితే రసే
తదాస్వాదభరైకాగ్రో హృష్యత్యంతర్ముఖః క్షణాత్
తతో నిర్విషయస్యాస్య స్వరూపావస్థితౌ నిజః
వ్యజ్యతే హ్లాదనిష్యందో యేన తుష్యంతి యోగినః

పాఠ్యమువలన ధ్రువాగానమువలన నంతట రసము సంపూరితము కాగా సామాజికుడు తదాస్వాదభరైకాగ్రుడగును. అంతర్ముఖుడగును. హృష్టచిత్తుడగును. అపుడాతడు స్వరూపావస్థానముననె యుండును. కావున స్వసంవాదసుందరమయిన హ్లాదనిష్యందముననె నిర్వికల్ప సమాధిమగ్నులగు యోగు లాత్మతుష్టివహింతురు. ఇట్లు స్తుతి గీతాదిప్రభావ మసాధారణమై రంగమున ప్రసరించును. నిరతిశయ సుఖాస్వాదస్వరూపసంపత్తి నాందీప్రయోగమున నున్నది. స్వరరక్తి

ముఖ్యవాద్యగానాదిసంపద యట్టి విశేష మాపాదించుట ప్రసిద్ధము. నాట్యరంగమున పూర్వరంగప్రయోగసంగతి సముచితముగ నుండు నేని నాందీప్రయోగము రమ్యమగును. అందునను గీతవాద్యాను నాదియై కాకుస్వరమును వైశిష్ట్య మాధానించునదికాగలదనుట స్పష్టము. కావున నీ ప్రయోగము నాంది యయినది. "నందయతీతి నాందీ" స్వస్పందసుందరులయిన స్వాత్మసంవాదసంవాదిహృదయుల నందరి నది యానందపెట్టును. అందువలన నది నాంది యయినది. గీత వాద్యానునాదియగు శుభంకరకాకుస్వర మే దేశమున ప్రసరించునో యా దేశమున నా కాకువు పాపఘ్నము కాగలదు. మాంగల్యకరమును కాగలదు. ఆతోద్యసంశ్రయమయిన ధ్వని యెంతటి ప్రదేశ మాపూరణ మొనరించునో యా ప్రదేశమున నశుభ మేమియు నుండదు. విఘ్న వినాయకు లా పరిసరమున సంచరింపరు. నాట్యప్రయోగము విఘ్న దూషితముకాదు. ఆవాహ వివాహ సమయములం దీ ప్రయో గము సముచితము. యజ్ఞమునం దుచితము. నృపతిమంగళసమయము నందు నుచితము. ఆ సమయములం దా నాందీశబ్దమును విని హింస్ర ములు హింస్రాధర్మమును విడనాడునవి కాగలవు. హింస్రములు నష్టములగును. వాద్యమును విని గానమును విని సంవాదిక్రమమున నుండువానిని విని హింస్రములు దరిచేరవు. వేదమంత్రార్థవచనములు ప్రసరించుప్రదేశమున హింస్రములకు ప్రసరముండదు. నాట్యప్రయో గాంగములయిన నాందీశబ్ద గానశబ్ద వాద్యశబ్దములు వేదమంత్రార్థ వచనసదృశములె కావున నెట్టి హింస్రప్రవృత్తియు నుండదు. దేవ దేవుడు మహాదేవుడు నాట్యమును ప్రవర్తింపజేసెను. మహాదేవు సన్నిధినుండి యిది వచ్చెను.

౧౦౩౬. స్నానజప్యసహస్రేభ్యః శ్రేష్ఠం మే గీతవాదితం
యస్మిన్నాతోద్యనాట్యస్థో గీతవాద్యశ్చనిశ్చయః
౧౦౩౭. భవిష్యత్యశుభం తస్మిన్దేశే నైతి కదాచన
ఏవం పూజాధికారార్థం పూర్వరంగః కృతో మయా

గీతము వాదితము సముచితముగ నాట్యమున నుండు నేని యది శ్రేష్ఠము. ఫలప్రదము. పవిత్రతీర్థస్నానసహస్రఫల మిందున్నది. జప్యమంత్ర జపఫల మిందున్నది. వానికన్న నిది శ్రేష్ఠమనుట యిందలి ప్రశస్తికి

నిదర్శనము. గీతవాద్యనిశ్చయ మీ యాతోద్యనాట్యగతమై రాణించును. ఏయే ప్రదేశమున గీతవాద్యాతోద్య నాట్యవిశేషములు ప్రసరించునో యాదేశమున నెప్పుడు నశుభమేమియు కలుగదు. ఇట్లు ఫలప్రదమయిన పూజాధికారప్రయోజనమునకై పూర్వరంగము ప్రవర్తితమయినది. పూర్వరంగమునందు స్తుతులతో మంత్రములతో దేవతాభ్యర్చన మొనరింపవలెను. రంగమండలమునం దభివాదన విధాన మత్యంతము శ్లిష్టము. విధిసమాపన్నము నేమాత్రము వినిగూహన మొనరింపరాదు. "విధిసమాపన్నం న శక్యం వినిగూహితుం" భరతుడీవిధముగా నాట్యావతారవృత్తాంతము నిరూపించినాడు.

భరతపుత్రులందరొకప్పుడు నాట్యవేదమదాన్వితు లయినారు. హాస్యసంశ్రయములయిన సర్వలోకప్రహసనములతో నందరిని బాధించుట కుపక్రమించినారు. ఇట్లు కొంతకాలము గడచినది. అపూర్వముగా ప్రసరించిన నాట్యవేదప్రభావమున లోక మొకింతకాలము పరిహాసప్రహాసములను సహించినది. పరిహాసప్రియుల యొత్తిడివలన గూడ సహింపవలసి వచ్చినది. ప్రతిక్రియాచరణ మశక్యమయినది. పరిహాస మధిక్షేప మధికము కాగా సహనము తగ్గినది. కాలమట్లు గడచినది. ఒకప్పుడు భరతపుత్రు లహంభావోపేతులై మునులకు ప్రకోపమాపాదించు దురాచార మొనరించిరి. నాట్యోపకరణాంగములయిన భాండాదుల శిల్పకర్మకరు లీ యంశము విశదమొనర్చిరి. భరత పుత్రు లనాదరణమున నిట్లొనరించిరి.

౧౦౩౮. అగ్రాహ్యం సుదురాచారం గ్రామ్యధర్మప్రవర్తనం
నిష్ఠురం చాప్రశస్తం చ కావ్యం సంసది యోజితం

సత్త్వసంపదకల ఋషుల సంసత్సమావేశమునందు హాస్యాశ్రయనాట్యకావ్య మాయోజనముచేసిరి. ఆ కావ్య మయిదు దోషములతో దూషిత మయినది. అది యగ్రాహ్యము. గ్రాహ్యపురుషార్థమేమియు నందు లేదు. ఏదియేనియున్న నది యగ్రాహ్యమయినది. కావున నందే వ్యుత్పత్తిజనకతయు లేదు. ప్రీతివ్యుత్పత్తిజనకముగా నుండవలసిన నాట్యకావ్య మట్లు కాలేదు. వ్యుత్పత్తివిదూర మయినందున నది దురాచారబహులమయినది. అది "సుదురాచారం". అందు

ప్రదర్శితాచారము లుపదేశపరములు కావు. అది గ్రామ్యధర్మము నె ప్రవర్తింపజేయునది యయినది. గ్రామ్యధర్మమనునది తాత్కాలికాచార ధర్మము. అది యాపత్కాలికధర్మము. సంప్రదాయాగత సదాచార సముదాచారముల నది యనుసరింపనీయదు. వానియం దనాదర మాపాదించునది యగును. గ్రామ్యధర్మము సంప్రదాయవిద్వేష మిచ్చును. వారట్లు సంప్రదాయదూషకము ప్రయోగించినారు. ఆ నాట్యకావ్యము నిష్ఠురము నయినది. పరుషభాషాబహులమై మాన్య దూషణ పరమయినది. దూష్యదూషకమగుట యుక్తమె. అదూష్య దూషకమగుట యప్రశస్తము. అట్లప్రశస్తమయిన నాట్యకావ్యమును వారు ప్రయోగించిరి. అది విని మునులు భీమరోషు లయినారు. ప్రకుపితమతులయినారు. వ్యక్తిప్రకోపము వ్యాకోప మీయదు. ధర్మ ప్రకోపము వ్యాకోపహేతు వగును. మునులకు కోపము కలిగినది. వారు నిగ్రహా మొనరించునగ్నులవలె నయినారు. వారు భరతుల నందరి నిట్లనిరి.

౧౦౩౯. మా తావద్భో ద్విజా యుక్తమస్మద్విడంబనం
కో నామాయం పరిభవః? కిం వా నామ్నాభినమ్మతం
౧౦౪౦. తస్మాత్ జ్ఞానమదోన్మత్తా భవతావినయాశ్రయాః
తస్మాదేతద్ధి భవతాం కుజ్ఞానం నాశమేష్యతి
౧౦౪౧. ఋషీణాం బ్రాహ్మణానాం చ నమవాయేథ నంగమే
నిర్బ్రహ్మచరణా భూత్వా శూద్రాచారా భవిష్యథ
౧౦౪౨. శూద్రాస్తే కేవలం భూత్వా తత్కర్మ నమవాప్స్యథ
యశ్చ వో భవతాం వంశః న చ శూద్రో భవిష్యతి
౧౦౪౩. యేఽత్రాపి వంశజాతాస్తేఽపి భవిష్యంత్యథ నర్తకాః
తథోపస్థానవంతశ్చ నస్త్రీబాలకుమారకాః

భరతపుత్రులారా! మీరు ద్విజులు. ద్విజులగు మీకీ విడంబనము తగదు. అస్మద్వంచనము పరిహాసము యుక్తము కాదు. మాకపూర్వ ముగా నీ పరిభవమేమి? ఇది యేమిరీతి? దీని నేమనవలెను? కావున జ్ఞానమదోన్మత్తులయిన మీ రవినయాశ్రితులు కండు. మీయీ కుజ్ఞానము నశించుగావుత. ఋషులందరు చేరిన స్థలమున బ్రాహ్మణులు కూడినస్థలమున మీరు నిర్బ్రహ్మచరణులై శూద్రాచారము కలవా

రయ్యెదరు గావుత. వేదాధ్యయనము లేనివారగుట యాగాచరణము లేనివారగుట బ్రాహ్మణాచారము లేనివారగుట నిర్బ్రిహ్మాచరణము. అట్టిరీతి దుఃఖప్రదము, మీరందరు శూద్రులై కేవలము శూద్రకర్మ నాచరించు వారయ్యెదరు గావుత. మీవంశమును శూద్రవంశమయ్యెడు గావుత. మీమీ వంశసంజాతులందరును నర్తకులగుదురు. వారు నిట్టివారగుదురు. మీమీ సన్నిధిలో నుపస్థితులగు స్త్రీబాలకుమార సహితులందరిట్టివారలై యగుదురు గావుత. మునులిట్లు భరతపుత్రు లను శపించిరి. భరతపుత్రుల కిట్లు శాపము కలిగినదని దేవతలు తెలిసి కొనిరి. అందరు విమనస్కులయిరి. దుఃఖపడిరి. అనంతరము దేవతలు ఋషుల సన్నిధి కేతెంచిరి. ఇంద్రుడు మొదలయిన వారందరట జేరి సర్వము భావించి దుఃఖవిముక్తిని గోరిరి. శాపవిమోచన మభిలషించిరి. భరతపుత్రులకు శాపప్రాప్తి నాట్యవిద్యాక్షేమము కాదు. నాట్యవిజ్ఞా నము శాపహేతులలో నశింపవచ్చును. అపూర్వముగా నావిష్కారము పొందిన నాట్యవిజ్ఞానము నశింపరాదని భావించి దేవతలు దుఃఖ ముక్తిని గోరిరి. అది యాలించి ఋషులిట్లనిరి. "న చైతద్ధి వినశ్యతి" ఈ విజ్ఞానము నశింపదు. కాని మేమనినది మాత్ర మవశ్యంభావి. "సర్వమేతద్భవిష్యతి" అనినది యంతయు జరిగితీరును. ఉగ్రతేజసు లయిన మునుల యీ వచనమును విని దేవతలందరు విషణ్ణులయిరి. ఆత్మరక్షణమె వారల కప్పు డుపాయమయినది. మునులు క్రుద్ధులై యేమో యనిరి. బహుధానాట్యమును నాశ మొనరించిరి కదా! భరత పుత్రులీనాట్యదోషమున శూద్రాచారప్రియు లయిరి. భరతుడును కుమారులను సాంత్వన మొనరించి "మా శోకం వ్రజత" దుఃఖపడ వలదని యెచ్చరించెను. ఇదియంతయు దైవవిహితమని ప్రబోధించెను. "కృతాంతవిహితో విధిః"

౧౦౪౪. మునీనాం న మృషా వాక్యం భవిష్యతి కదాచన
నిధనే తు మనో మా భూద్యుష్మాకమితి సాంత్వితాః.

మునుల వాక్య మెన్నడు మృష కాదు. సత్యమె యగును. శాపగ్రస్తు లయిన మీరు మరణింపవలెనని మనసులో భావింపవలదు. మీ రెన్నడు నిధనమున మనమును కూర్పకుడని భరతపుత్రులందరు సాంత్వితులయినారు. భరతుడిట్లనెను.

౧౦౪౫. జానీధ్వం తు తథా నాట్యం బ్రహ్మణా సంప్రకీర్తితం
శిష్యేభ్యశ్చ తదన్యేభ్యః ప్రయచ్ఛధ్వం ప్రయోగతః.
౧౦౪౬. మావై ప్రణశ్యతామేతన్నాట్యం దుఃఖాత్ప్రవర్తితం
మహాశ్రయం మహాపుణ్యం వేదాంగోపాంగసంభవం.
౧౦౪౭. అప్సరోఽభ్యుదయశ్చైవ యథోక్తం స మయా శ్రుతః
నాట్యం దత్త్వా తతః సర్వే ప్రాయశ్చిత్తం చరిష్యథ.

ఈ నాట్య మసాధారణము. దీనిని బ్రహ్మ ప్రవర్తింపజేసినాడు. ఇట్టి వైభవ మంతట నుండదు. బ్రహ్మ సంప్రవర్తితమని మీరవశ్యముగా గుర్తింపవలెను. అట్లయినందున నిది యవశ్యరక్షణీయము. బ్రహ్మనాట్య మగు దీనిని శిష్యులకు సప్రయోగముగా సమర్పింపుడు. శిష్యులు కాని వారలకును యథోచితముగా నర్పింపుడు. దీని సర్వ ప్రయోగవిధాన మవగత మొనరింపుడు. ఈ నాట్యము మహాశ్రయము స్వసంవేదనాత్మక మయిన రసము నిది యాశ్రయించి యున్నది. రసమాత్మ అది పరశివభావాపత్తి. ఇంతటి మహాశ్రయ మభిప్రణాశము పొందరాదు. ఇది మహాపుణ్యము. ఇందు యోగ మున్నది. విద్యలు కలవు. ఇందు సర్వ మున్నది. వేదవేదాంగసంభూత మయిన ఈ నాట్యము పుణ్యము. పుణ్యప్రదము. నటులకు నిర్వారచమత్కార సంపాదిక లయిన యప్సరసల యభ్యుదయ మితఃపూర్వ మాసూత్రితమె కాని యది విశదము కాలేదు. అట్లు విశ్రుతము కాలేదు. ఇక విశ్రుత మవుగావుత. మీరీనాట్య మర్పించి ప్రాయశ్చిత్త మాచరింపుడు. అది శాపపాపప్రణాశకము.

కొంతకాలము గడచినది. మఱి కొంతకాలమునకు నయబుద్ధి పరాక్రమసహితుడయిన నహుషు డను మహారాజు నయబుద్ధిపరాక్రమములు హేతువుగా దేవరాజ్యము పొందినాడు. దైవీసంపద కలవాడై దేవరాజ్యమును రమ్యముగ పరిపాలించినాడు. దేవగాంధర్వము విననాడు. దేవనాట్యమును చూచినాడు. దేవతల కవి యున్నవి. మానవులకవి లేవు. మానవుడయిన నహుషుడు 'దేవవైభవము భావించి చింత వంత పొందినాడు. అట్లాతడు మనసా చింతించి యీ నాట్యప్రయోగ మిటుపై తనకెట్లు కలుగునో యని యున్మనసు డయినాడు. నాట్యప్రయోగము తనకును లభింపవలెనని సంభ్రమము కల-

వాడయ్యెను. అంజలిపట్టి నాట్యప్రయోగమునకై యమరుల నందరిని నహుషు డభ్యర్థించెను.

"ఇదమప్సరసామిత్థం నాట్యం భవతు నో గృహే" ఈ యప్సరో నాట్యము నా భవనమున జరుగు గావుత. బృహస్పతి మొదలగువారిది యాలోచించి నాట్యప్రయోగ మనుసరింప జేసిరి. మానుషవ్యక్తులతో నిల్లు సంగమము కలుగునని సురాంగనలకెవరును సూచింపలేదు. "హితం పథ్యం చ కర్తవ్యం" హితమాచరింపవలెను. ఆ హితము పథ్యముగ నుండవలెను. హితపథ్యాచారమును వారనుసరించిరి. నాట్యాచార్యులు నహుషభవనమున కేగి నాట్యప్రయోగ మొన రింపుడు." అని నిదేశించిరి. అనంతర మా నహుషనృపతి కృతాంజలియై భరతు నిట్లభ్యర్థనము చేసెను.

ఇదమిచ్ఛామి భగవన్! నాట్యముర్వ్యాం ప్రతిష్ఠితం

భగవన్! భరతా! ఈ నాట్యము భువియందు ప్రతిష్ఠితము కావలెనని యభిలషించుచున్నాను. పూర్వమిది వ్యాకులిత మయినదని తెలిసినది. మీ సన్నిధినుండి వ్యక్తభావాశ్రయ మయిన నాట్యవివేకమును సంపాదించి బ్రహ్మభవనము నందంతఃపురజనమున నిది సంప్రయుక్త మయినది. ఆనాడప్సరసలలో నూర్వశి పితామహక్రియాప్రయుక్తముగ నీ నాట్యమును గ్రహించినది. సంప్రదాయసంకీర్తిత మయిన నాట్యము నూర్వశి ప్రదర్శించినది. ఊర్వశికి ఉన్మాదవిప్లవములు కలుగగా శోకప్రణాశము వలన నంతఃపురసఖీజనము విషణ్ణమయినది. విపన్న మయినది. నాట్యప్రయోగము నాశము పొందినది. నాట్య విజ్ఞాన మున్నది కాని నాట్యప్రయోగము నష్టకల్ప మయినది. ఇది భూతలమందు ప్రకాశము పొందవలెను. భువిలో నిది సంప్రధారితము కావలెను. సంప్రకీర్తితము కావలెను. తిథియజ్ఞక్రియలలో నాట్య ప్రయోగము మంగళకరము శుభంకరమగునటు లొనర్పవలెను. కావున నా భవనమునం దీ నానాప్రకృతిసంభవ మయిన నాట్యప్రయోగము ప్రసారితమగుగావుత. స్త్రీల లలితవిన్యాసములచే నిది ప్రకాశితమై మీ యశఃపతాక మగుగావుత. ఇట్లు నహుషుడు ప్రార్థించెను.

భరతుడు "తథాస్తు" అనెను. పుత్రుల నందరిని పిలిచి సామపూర్వక ముగా నిట్లనెను.

౧౦౪౮. అయం తు నహుషో రాజా యాచతే నః కృతాంజలిః
గమ్యతాం సహితైర్భూమిం ప్రయోక్తుం నాట్యమేవ చ

౧౦౪౯. కరిష్యామి చ శాపాంతం అస్మిన్ సమ్యక్ప్రయోజితే
బ్రాహ్మణానాం నృపాణాం చ న భవిష్యంతి కుత్సితాః

౧౦౫౦. తత్ర గత్వా ప్రయుంజధ్వం ప్రయోగం వసుధాతలే
న శక్యం చాన్యథా కర్తుం వచనం పార్థివస్య హి

౧౦౫౧. యుష్మాకం చైవ సంక్షేపాత్ నహుషస్య మహాత్మనః
అప్తోపదేశసిద్ధిశ్చ నాట్యే ప్రోక్తా స్వయంభువా

ఈ నహుషప్రభువు కృతాంజలియై మనల నభ్యర్థించు చున్నాడు. రాజప్రార్థన మవశ్యమంగీకార్యము. సాభిలాషు లయిన పాలకుల కాంక్ష ప్రజల విజ్ఞానాభ్యుదయములకు మార్గము కాగలదు. మీరందరు కూడుకొని భువి కేగుడు. నాట్యము ప్రయోగించి ప్రద ర్శించుట కేగుడు. మీ రా భూరంగములో నాట్యమును చక్కగా సంప్రయోగ మొనరించినచో శాపాంత మొనరింతును. దుష్టప్రయో గము వలన నపార్థము కలిగినవి. శిష్టప్రయోగము వలన అర్థసిద్ధి యగును. బ్రాహ్మణులలో రాజులలో కుత్సితులు పాపకర్ము లుండరు. అట్లుండ రాదు. భూతలమందు కుత్సితులు లేని జనుల సమూహమున "ప్రయోగం ప్రయుంజధ్వం" నాట్యప్రయోగమును చక్కగా ప్రయో గింపుడు. అధిక్షేపము పరిహాసము తిరస్కారము లేకుండునట్లు సము చితముగా నాట్యాగారముతో ప్రయోగింపుడు. రాజవచన మన్యథీ కరించుట యుక్తము కాదు. స్వయంభూదేవు డాప్తోపదేశసిద్ధి నాట్య మున నుండునని నిరూపించినాడు. మీకు మహాత్ముడయిన నహుష ప్రభువునకు సముచితమయిన యాప్తోపదేశసిద్ధి కలుగును. స్వయంభూ ప్రోక్తమయిన సిద్ధి కలుగుగావుత. నాట్యప్రయోగసిద్ధి రససిద్ధి. సంవిన్మయమయిన రససిద్ధియె ఆత్మసిద్ధి.

నాట్యవిషయమున నిరూపితాధిక మింకను నుండును. అట్టి శేషాంశము నుత్తరతంత్రసహితముగా కోహలుడు నిరూపింపగలడు.

ప్రయోగకారికానిరుక్తముల నాతడె నిరూపించును. ఒకయర్థము నొకడె ప్రతిపాదింపజాలడు. మరియొకడును పూరణ మొనర్పజాలడు. అనేకులా యనంతార్థము నుపపాదింప వలసి యుండును. క్రీడనీయక హేతుక మయిన యీ శాస్త్రము నీ నాట్యతంత్రము నప్సరస లాశ్రయించి ప్రయోగరమ్య మొనరించిరి. అప్సరఃప్రయోగమున ప్రీతి యానందము కలిగినది. తద్విషయవిజ్ఞానమున వ్యుత్పత్తియు నుదయించినది, ప్రీతివ్యుత్పత్తి పరమముగానున్న యీ క్రీడనీయకము గ్రామ్యధర్మమును పరావర్తింప జేసి స్వరూపసంవేదన మూపాదింపగలదు. దీని భరతు డనుసరించి సమాశ్రయించి యీ నాట్యవేదతంత్రమును ప్రవర్తింపజేసినాడు. స్వాస్తినారదులును ఇందలి యంశాంశములను విశద మొనరించినారు.

భరతశిష్యులందరు సముచితపరివారసమేతులై వసుధాతలమున కేగినారు. నాట్యవిద్యను సప్రయోగముగ ప్రసరింప జేసినారు. నహుషనరపాలుని భవనమున నాట్యవిద్య నారాధింప జేసినారు.

"స్త్రీణాం ప్రయోగం బహుధా సృష్టవంతో యథాక్రమం"

క్రమక్రమముగా స్త్రీప్రయోగమును వారు బహుధా సృష్టించిరి, రూపానురూపవిరూపప్రక్రియాభేదములతో స్త్రీలు నాట్యవేదసమ్మతముగ ప్రయోగింపగలుగునట్లు నాట్యవిద్యావిభవము విస్తరింప జేసిరి. సర్వరససర్వభావ స్వరూపావిష్కారసమర్థముగ సంప్రయోగసామర్థ్యము కలుగునట్లు చేసిరి. భరతపుత్రులు వసుధాతలమున మానవ స్త్రీలయందు తనయుల నుత్పాదించిరి.

౧౦౫౨. తత్ర చోత్పాద్య తే పుత్రాన్మానుషీభ్యో మహాత్మజాః
బద్ధవంతోఽధికం వర్గం తేషాం చ వివిధాశ్రయం.
౧౦౫౩. పుత్రానుత్పాద్య బధ్వా చ ప్రయోగం తే యథాక్రమం
బ్రహ్మణా సమనుజ్ఞాతాః ప్రాప్తాః స్వర్గం పునస్తదా.
౧౦౫౪. ఏవమూర్వీతలే నాట్యం శాపాత్సమవధారితం
భరతానాం చ వంశోఽయం భవిష్యచ్చ ప్రకీర్తితం.

ఆత్మనిగ్రహము కళాకౌశలము కల భరతపుత్రులను మానుషీకన్యలనుసరించి యారాధించి తదనుగ్రహమున పుత్రులను బడసిరి. సమర్థులయిన నటుల జన్మప్రకార మీవిధముగ నున్నది. పితృవంశమున

మాతృవంశమున నిట్టి సామర్థ్యయోగ మావశ్యకము. భరతపుత్రులు జనుస్సహజముగ ఋషిప్రజ్ఞావిలాసులు. ఆత్మనిగ్రహధర్ములు. సమయ ప్రకోపమున సహంమతులై శాపగ్రస్తు లయినారు కాని నిగ్రహ ధర్మమున నీతివర్తనులై నాట్యము నారాధించిరి. వారు వసుధాతల మునకు విచ్చేసి మానుషీపరిచయమున నాట్యవిద్యాప్రయోగప్రసార మొనరించిరి. మానవస్త్రీలు భరతపుత్రానుగ్రహమున సంతానము బడయగోరి వారిని వరించిరి. వరులనుగా స్వీకరించిరి. అభీష్టగుణవిశిష్టత కల పుత్రులను పొందిరి. భరతపుత్రులు తమ పుత్రులయిన ఆ పుత్రు లకు నాట్యవిద్య నుపదేశించిరి. భరతపుత్రపుత్రులట్లు నాట్యవిద్యా నిపుణులయిన నటు లయినారు. నటునకును మాతృమత్త్వము పితృ మత్త్వము ఆచార్యనత్త్వ మావశ్యకమని యీ సన్నివేశము సూచింప గలదు. నటుడై జన్మించుటయు నటవిద్య నుపదేశపరంపరాసంప్రాప్త ముగా స్వీకరించి యారాధించుటయు పరమావశ్యకమనుట యిచటి పరమార్థము. వారట్లు సంతానము కనిరి. వారలకు నాట్యముపదేశిం చిరి. వారందరు నటులయిరి. అది నటవంశ మయినది. ఆ నటసర్గము నందు వివిధాశ్రయమయిన నాట్యము ప్రసరించినది. సమధిక మయిన నాట్యసర్గ మావిర్భవించినది. భరతపుత్రులు పుత్రులను కని యథా క్రమముగ నాట్యవిద్యను వారలలో సంక్రమింపజేసిరి. పిమ్మట బ్రహ్మానుజ్ఞాతులై స్వర్గము చేరిరి. ఉర్వీతలమున నాట్యవిద్య ప్రతిష్ఠిత మయినది. శాపసందష్టమయిన నాట్య మిట్లు వసుధాతలమున సంప్ర ధారిత మయినది. భరతవంశ మీ విధముగా నాట్యావతారహేతు వయినది. భరతవిద్యాభ్యుదయ మిట్లు నిరూపితమయినది. కోహ లాదులు వాత్స్య శాండిల్య ధూర్తిలులు మొదలగు మునులు మర్త్య ధర్మమున నుండి కొంతకాల మా సన్నివేశము నవధానమున గుర్తించి నిరూపింపదగు నాట్యశేషము నిరూపించుట తమ విశేషమని భావిం చిరి. ఇది యంతయు నాట్యవిద్యాతంత్రము.

౧౦౫౭. ఏతచ్ఛాస్త్రం ప్రయుక్తం తు నరాణాం బుద్ధివర్ధనం
త్రైలోక్య క్రియయోపేతం సర్వశాస్త్ర నిదర్శనం

౧౦౫౮. మాంగల్యం లలితం చైవ బ్రహ్మణో వదనోద్భవం
సుపుణ్యం చ పవిత్రం చ శుభం పాపవినాశనం

౧౦౫౩. య ఇదం శృణుయాత్ ప్రోక్తం నాట్యమేతత్ స్వయంభువా
ప్రయోగం యశ్చ కుర్వీత ప్రేక్షతే చావధానవాన్
౧౦౫౮. యా గతిర్వేదవిదుషాం యా గతిర్యజ్ఞయాజినః
యా గతిర్దానశీలానాం తాం గతిం ప్రాప్నుయాన్నరః

ఇది నాట్యవేదము. ఇది నాట్యశాస్త్రము. ఇది నాట్యవేదనము సంపాదించునదై నాట్యవేదమయినది. "నాట్యం వేదయతి". ఇట్టి నాట్యమును శాసించి నిరూపించును గావున నాట్యశాస్త్రమయినది. ఈ వేదమీ శాస్త్రము యథావిధిగా ప్రయుక్తమై నరులకు బుద్ధివర్ధన మగును. నిశ్చయాత్మకము వ్యవసాయాత్మకమగు బుద్ధిప్రవృత్తి నిది వర్ధమాన మొనరించును. ఇందు త్రైలోక్యక్రియావిశేషములు సంగతములై యుండును. సర్వక్రియాప్రక్రియలలో సర్వసాధారణమయిన సమానీకృతధర్మము నిది యందించి స్వాత్మసంవేదనసముల్లాసమునకు హేతువగును. సర్వశాస్త్రనిదర్శన మిందున్నది. నానావిధములయిన దర్శనశాస్త్రముల యధ్యాత్మవిద్యావిశేషము లిందున్నవి. అందలి సాధనతత్త్వము లిందు సంక్లుప్తములై యున్నవి. ఇది మాంగల్యము. మంగళప్రదము. లలితము. బ్రహ్మవదనసముద్భూతమగు నీ నాట్యవేదము సుపుణ్యము పవిత్రము శుభము పాపవినాశనము. స్వయంభూప్రోక్తమయిన యీ నాట్య మే పుణ్యశాలి వినునో, విని ధారణ మొనరించునో, ఎవడు ప్రయోగ మొనరించునో, ఎవడు సావధానముగ నా నాట్యప్రయోగము దర్శించునో నాట్యభావభావితహృదయుడై స్వస్పందసౌందర్యము సంపాదించునో ఆతడు విశిష్టగతి కలవా డగును. వేదవిదుల గతి నాతడు పొందును. యాగయాజిగతి నాతడు పొందును. దానశీలుర గతి నాతడు పొందును. వేదవిదుని గతి సోమయాజి గతి దానశీలగతి నాట్యవిదుని గతి సర్వగతి యొకే గతి యని నిర్దేశించుట యిందలి తాత్పర్యము కాదు. ఆ మువ్వురు మూడు వేరు వేరు గతులు కలవారు కాగా నాట్యవిదు డామూడు కలవాడగుననుటయు నిందలి భావార్థము కాదు. స్వసంవిదుల్లాసము సర్వదర్శనగతి. నాట్యగతి సంవిదుల్లాసస్వరూప మగుట పూర్వము నిరూపితము. అది యిందవశ్యసిద్ధ మగునని సూచించుటకై వేదవిదాదుల విశేషమిచట ప్రశంసాత్మకార్థవాదరూపముగా నిర్దిష్టమయినది. తగిన యర్హతాసంపద కల

వ్యక్తి సాధ్యనిశ్చయమున సాధన మొనరించుట పరమావశ్యకము. రాజాచరింపదగిన ధర్మవిధు లనేకములు కలవు. దానము లనేకములు కలవు. రాజధర్మములలో ప్రేక్షణీయప్రదానము మహాఫలము. సర్వ దానములలో నిది ప్రశంసాపాత్రము. పూజార్హము. నాట్యప్రయో గము పుణ్యప్రద మిష్టప్రదము.

౧౦౫౯. న తథా గంధమాల్యేన దేవాస్తుష్యంతి పూజితాః
యథా నాట్యప్రయోగజ్ఞై స్తుష్యంతి స్తుతిమంగళైః
౧౦౬౦. గాంధర్వం చైవ నాట్యం చ యస్సమ్యగనుపశ్యతి
లభతే సద్గతిం పుణ్యాం సమం బ్రహ్మర్షిభిర్నరః.

గంధమాల్యాదులచే నెంతగా పూజించినను దేవతల కంతగా సంతోషము కలుగదు. నాట్యప్రయోగవిదులగువారు స్తుతిమంగళ విధానములతో దేవతలను పూజించి సంతోషము కలుగచేయగలరు. అంతటి సంతోషమును గంధమాల్యాది పూజావిధానములచే సంపా దింప చేయుట శక్యము కాదు. నాట్యప్రయోగానుకూలము లయిన స్తుతిమంగళవిధానములు వాగంగచేష్టా స్వరూపములై సత్వసంప త్తితో నుండును. కావున స్వసంవేదనపర్యంతము నాట్యమునందివి సహకార మొనరించుచు దేవతాప్రీతి నాపాదింపగలవు. వాగంగచేష్టా సముల్లాసము కలవారిలో స్తుతిమంగళవిధానములు విశిష్టస్వభావ ముతో నుండును. వాని వైశిష్ట్యానుసంధానమున తత్తదధిష్ఠాన దేవత లకు సంతుష్టికల్గును. స్తుతివీర్యము, మంగళవీర్యము, ఆ యా యధి ష్ఠాన దేవతలకు స్వకీయవీరోల్లాసము సంపాదించి అనుగ్రహాధీన చేత సులను కావించును. లాస్యయోగమున దేవీప్రీతియు తాండవయోగ మున దేవప్రీతియు నాట్యసిద్ధమై నిశ్చప్రచముగా నున్నది. సముచిత ముగా సర్వదేవతాసంతర్పక మయిన నాట్యప్రయోగము సర్వ సంభావనార్హముగా నున్నది. గాంధర్వమును నాట్యమును సమ్యగను సంధాన మొనరించు సచేతనుడు బ్రహ్మర్షులతో పుణ్యప్రదమగు సద్గతిని పొందును. ఇట్లీవిధముగా నాట్యఫలశ్రుతి కీర్తనము నాట్యప్రాశస్త్య మును నిరూపించును.

౩౬. ౬౧. ఏవం నాట్యప్రయోగే బహు బహు విహితం కర్మ శాస్త్రప్రణీతం
న ప్రోక్తం యచ్చ లోకా దనుకృతికరణం తచ్చ కార్యం విధిజ్ఞైః
కించాన్యత్సత్వపూర్వం భవతు వసుమతీ శాశ్వతీ నష్టరోగా
శాంతిర్గోబ్రాహ్మణానాం నరపతిరవనిం పాతు క్షేమాం సమగ్రాం

శాస్త్రప్రణీతమగు బహువిహితములయిన బహుకర్మవిశేషములు ఈ నాట్యప్రయోగమునందు సంగతములుగా నున్నవి. లోకానుకార స్వరూపములగునవియు కొన్ని కొన్ని నిరూపితము లయినవి. సర్వ లోకానుకరణము శక్యనిరూపణము కాదు కావున సర్వమిందు నిరూపితము కాలేదు. విధివిధానవిదులగు వివేకులట్టివానిని లోకానుకరణమున నొనరింపవచ్చును. శాస్త్రప్రణీతము లన్నియు ప్రతిపాదితము లగుట కవకాశము పర్యాప్తము కాదు. అట్టివాని గుర్తించుటకును లోకానుకరణము శరణ్యము. విధిజ్ఞకార్యము లోకానుకృతికరణముతో నున్నను శాస్త్రపరిష్కారముతో నుండుట సంగతము. ఇంక నధికముగా నాశాస్యమేమికలదు ? వసుమతీమండలమంతయు రోగాది బాధలేనిదై శాశ్వతముగా వర్ధిల్లుగావుత. గోబ్రాహ్మణులకు శాంతి కలుగుగావుత. నరపాలకు డీసమగ్రభూమిని పాలించుగావుత.

* * *

ఉపాదేయస్య సమ్పాత స్తదన్యస్య ప్రతీకనం
స్ఫుటవ్యాఖ్యా విరోధానాం పరిహారః సుపూర్ణతా
లక్ష్యానుసరణం శ్లిష్ట వక్తవ్యాంశ వివేచనం
సంగతిః పౌనరుక్త్యానాం సమాధానసమాకులం
సంగ్రహశ్చేత్యయం వ్యాఖ్యాప్రకారోఽత్ర సమాశ్రితః

నాట్యవేదవివృతి యయిన అభినవభారతి యిట్లు దశదశా సందంశముతో నున్నట్లు శ్రీమదభినవగుప్తుడె యనినాడు.

యుక్తపాతస్వీకారము - అయుక్తపరిత్యాగము స్ఫుటవ్యాఖ్యానము - విరోధపరిహారముసుసంపూర్ణత - లక్ష్యానుసరణము వక్తవ్యవివేచనము - సంగతిదర్శనమ్ము అపునరుక్తప్రక్రియ - సంగ్రహరీతి.

ఇది యభినవవ్యాఖ్యాప్రకారము, యథామతి అభినవపాదపద్మారాధన మొనర్చితిని, ఇది నాట్యవేదము. ఇది అభినవభాష్యమ్ము.

  

విచిత్రం రూపకభువో లక్షణం భూషణం భువః
భాస్యతే యేన తం వందే ప్రాచ్యధీసాధితం శివం

రూపం యదేతద్బహుధా చకాస్తి
తద్యేన భావీ భవితా న జాతు
తచ్చక్షురర్కాత్మకమీశ్వరస్య
వందే వపుస్తైజససారధామ్నః

సమస్తవృత్తాని వినా న యేన
పటూద్భవ శ్రోత్రరసాయనాని
ఛందాసి యస్మాత్ ప్రభవంతి వందే
తం వాఙ్మయం రూపమిహాష్టమూర్తేః

శ్రుత్యంత విశ్రాంతవిధిర్యాగతిః పరమాత్మనః
తంమహానందసందోహాతత్త్వమూర్తింస్తుమఃసదా

స్థాయీ ప్రబుద్ధహృదయే వ్యభిచారిభూతః
కామాకులాసు జనతాసు మహానుభావః
అంతర్విభావవిషయో రసమాత్రమూర్తిః
శ్రీమాన్ ప్రసన్నహృదయోఽస్తు మమ త్రిణేత్రః

పుంసామశక్తాపి తదేక భావ
మాదర్శయంతీ బహుభావపూర్ణా
వేశ్యామతిర్నిర్వృతిధామ యత్స్థా
తస్మై నమః స్తాత్పరమేశ్వరాయ

వాగంగసత్త్వచేష్టాచిత్రాభినయప్రయోగరచనచణః
షడ్గస్థాద్యనాట్య నాయకపురుషాకారః శివో జయతి

 

## నాట్యవేద ద్వితీయ భాగ సూచిక

# నాట్యవేద - పరిశిష్ట సూచిక